క. ప్రతిమార్చనకంటెన్ సం, స్తుత మగు భావార్చనంబు శుద్ధం బగుటన్
మతి మెచ్చి ప్రేముడించెన్, శితికంఠుడు వారి కట్లు సిద్ధవిచారా. 318

వ. అని చెప్పిన నప్పరమశైవుండు పులకితాంగుండై గంగాధరు నంతరంగంబునం దలంచి నమస్కరించి వాసుదేవుం బహూకరించి పారాశర్యున కభివందనం బాచరింప నతం డంతర్ధానంబు సేయుటయు నితండు తదనుమతంబు వడసిన వాఁడు గావున మరలి రణరంగంబునకు వచ్చి యహస్కరుం డస్తగిరిపరిసరగతుం డగు టెఱింగి దుర్యోధను ననుమతంబున సేనల దివియ నియమించినం బాండవులును దమసేనల దివియ నియమించి రంత. 319

తే. ఏను నాళ్లట్లు రిపుసేన నేర్చి గురుఁడు, దెగనకతమున నానాఁడు దీన మగుచు
నిజసంబును సంతోషనిర్భరత మగుచు, నాజన్యంబును విడిదల కరిగె నధిప. 320

—అర్జునుండు వ్యాసునిం గని తనసంశయంబు దీర్చుకొనుట—

వ. అట్లుభయబలంబులవారును శిబిరంబుల కరిగినంతం గౌంతేయావరజునకు వేదవ్యాసుండు దర్శనం బిచ్చిన నతం డతనిం బూజించి యి ట్లనియె. 321

చ. మునివర సందియంబు పొడమున్ మనమం దని కేను బోయి యుం
డినతఱి నొక్కపూరుషుఁడు డగ్గఱ వచ్చి త్రిశూలపాణియై
పొనరుటఁ జూచెదం దునుము మన్నతఁ డామహాదాయుధంబుతోఁ
దునిమిన వెన్క నేఁ దునుముదున్ రిపుకోటి నతం డెవం డొకో. 322

క. అడుగిడఁడు పుడమి నాతఁడు, కడువడి వెలుఁగొందు నగ్నికరణిఁ ద్రిశూలం
బడరింప నందుఁ బెక్కులు, పొడమె త్రిశూలములు రిపులపొంత నడంగించున్. 323

వ. అమ్మహాత్ముం డెవ్వఁడో నా కెఱుంగింపు మనిన నమ్మహామునీంద్రుం డింద్రనందనున కి ట్లనియె. 324

చ. అతఁడు ప్రజాపతిప్రథముఁ డాఢ్యుఁడు నాఢ్యులకెల్ల వేద్యుఁ డం
చితుఁ డణిమాదిసిద్ధిపరిసేవితుఁ డీశుఁడు భూతకోటికిన్
శితగళుఁ డష్టమూర్తి శశిశేఖరుఁ డద్రిసుతాకళత్రుఁ డు
న్నతధవళోక్షవాహనుఁ డనంతవిలాసుఁడు నప్రమేయుఁడున్. 325

మత్త. జ్ఞానగమ్యుఁ డగమ్యమానుఁడు సర్వలోకశరణ్యుఁ డీ
శానుఁ డున్నతవైభవుండు నిశాకరార్ధకలాపుఁ డం
హోనిబర్హణదక్షుఁ డక్షయుఁ డూర్జితప్రభవుండు పం
చాననుండు త్రిలోచనుండు మహామహుండు మహేశుఁడున్. 326

తరళము. అతఁడు నీపయిఁ బ్రేముడించుచు నాగతుం డయి శాత్రవ

వ. [illegible] యంతయు నానుపూర్విగం జెప్పె నని చెప్పిన ధృతరాష్ట్రుండు సంజయుదిక్కు
మొగం బై. 162

శా. దివ్యాస్త్రంబులు తద్రహస్యగతులున్ దేదీప్యమానప్రభా
భవ్యుం డాఘటజుండు రామునిసమీపంబందుఁ దా నేర్చియున్
దివ్యాస్త్రప్రజ్ఞుఁడు నాత్మసంభవునకున్ దీపింపఁగాఁ జేసె నా
దివ్యస్తుత్యుఁడు మించె నెల్లర సముద్దీపించుశస్త్రంబునన్. 163

రామప్రశిష్యుఁ డింద్రసముం డతడు కార్తవీర్యున కీడగు వీర్యమందు
బుద్ధి బృహస్పతిం బురుడించు ధృతిభూమి,భృద్వరేణ్యమునకుఁ బెద్ద యగును
దేజమున స్వహ్నితోఁ జత వచ్చెదుఁ,గ్రోధమునం బృదాకువును బోలు
గాంభీర్యముననను సాగరమునకుం దీటు,వచ్చు వేగమ్మున వాయుసముఁడు

తే. క్రుద్ధుఁడై యుద్ధభూమి సన్నద్ధుఁడైన,వాని నింద్రాదులైన నోర్వంగఁ జాల
రట్టివీరాగ్రగణ్యుఁ డాజెట్టిబిరుదు,తండ్రి చచ్చిన విని యేమి తలఁచెఁ జెపుమ.
తనకన్నతండ్రి నధర్మమ్మునం జంపె, నన విని గురుపుత్రుఁ డనిన దేమి
యైంద్రనారాయణాద్యస్త్రరహస్యముల్, జనకుచే నేర్చినఘనుఁ డతండు
ద్రోణుని వెనుక నాద్రౌణియే విలుకాఁడు,పరశురామున కెత్తువచ్చువాఁడు
వేదంబులున్ ధనుర్వేదంబు సాంగంబు,గా నెఱింగినమేటి మానధనుఁడు
తనదుజనకునిఁ జంపఁగ ధరణి నైన,పార్థునిఁ జంపఁ బుట్టినవాఁ డతండు
వానియపచారమును విని తాను మిన్న,కుండెనో యేమియేఁ జేసెనో తెలుపవె. 165

అనిన సంజయుం డతని కిట్లనియె నట్లు శారద్వతుండు చెప్పిన విని గురునందనుండు తోఁకఁ ద్రొక్కినత్రాఁచువలె నేచి నేయి వేల్వ దరికొనునగ్నివలెం బ్రజ్వరిల్లుచుఁ జే యప్పళించి యాడు గఱచి పండ్లు పటపటంగొఱుకుచు నిట్టూర్పు నిగిడించుచు నేత్రంబుల నంగారకణంబులం బోనియశ్రుబిందువులు జాలువాఱం దుడుచుకొనుచు నమర్షోత్కర్షంబున నంతకాకారుండై దుర్యోధనుం జూచి యిట్లనియె. 166

—. అశ్వత్థామ తండ్రిం జంపి రను కోపంబున విజృంభించుట .—

ఉ. అక్కట యస్త్రశస్త్రఁ డగునట్టిధనుర్గురు నొక్కక్షుద్రకుం
డక్కరణిన్ వధించె నలుసంతయుఁ జింత యొనర్ప కాగమున్
మిక్కిలి సత్యవంతుఁ డని మేలిమి కైనయజాతశత్రుపై
రక్కజమైనపాపమున కై యిటు సెల్లఁగ నయ్యెఁ దెల్లఁగన్. 167

ఉ. అనిమొనఁ జచ్చుటల్ గలుగునట్టిది యెందును గందు మందున్
జనునకు నూర్ధ్వలోకము లెసంగెడు నాజనకుండు భాతికం

బును విడి దివ్యదేహముఁ బుణ్యపదంబును బొందె దాని కే
వనరను గాని నీచుఁ డొకవాఁ డటు చేయుట కార్తి నొందెదన్. 168

క. సైనికులు చూచుచుండఁగ, నేనుం జీవించి యుండ నిట్లొకక్షుద్రుం
డానెఱులు వట్టి గిట్టుట, మానస మెఱియించు నాకు మానవనాథా. 169

క. జీవన్ముక్తో నే నుండఁగ, నావిధమునఁ దండ్రి జుట్టు నరి వట్టె నసం
గా విని కొడుకులఁ గోరిన, యేవాఁ డా కొడుకులందు నిచ్చం దగులున్. 170

తే. కామమున నొండె క్రోధంబుకలిమి నొండె, బాల్యమున నొండెఁ గుజనులు పాపకృత్య
ములు పరులపట్లఁ జేయుట కలిగియుండుఁ, గాని యిటు లుండునే యెందు నేనిగ[illegible] 171

ఉ. లోకమునం దధర్మములలో ద్రుపదాత్మజుఁ డిప్డు చేసిన
ట్లే కడఁ జేయఁ డెవ్వఁడు నొకించుక కొంచక తండ్రి కేశముల్
చేకొనుచుం బరాభవము చేసె సహింపఁగ నోప దీని నే
నాకలుషాత్ముఁ డీఫలము నందెడుఁ గాక సబాంధవంబుగన్. 172

పంచ. అనార్యకార్య మట్లు చేసినట్టి మానవాధముం
డనంగ నై యసత్యవాది యైనపాండవాగ్రజ
న్మనెత్తురు గ్గనంగఁ ద్రావు భూమిదేవి యిట్లు నేఁ
బొనర్పకున్నఁ బాపి నౌదుఁ బూని బాస చేసితిన్. 173

మ. గురుపాపం బటు మేర మీఱి సమరక్షోణిం బ్రవర్తిల్లఁ జే
సి రహిం గాంచినభీమసేనవిజయశ్రీకృష్ణసంయుక్తమై
దొర లేకున్న ద్విపాత్పశుప్రజపుమేదోమాంసరక్తంబులన్
విరియం జేయుదుఁ దృప్తిగా బలివిధిన్ దిగ్దేవతాకోటికిన్. 174

మహాస్రగ్ధర. తనతండ్రిన్ శీర్షమందుం దవిలి రని పగన్ ద్రవ్వి మున్ రాముఁ డీర్ష్యన్
గనదగ్నిజ్వాల నానొఘనపరశువునం గర్మ మె ట్లాచరించెన్
వినవో నే నట్లు రోషావిలహృదయుఁడ నై వీరవృత్తిన్ సపత్నాం
గనిరాఘాటస్రవద్రక్తమునను వసుధం గంధిఁ గావింతు నాజిన్. 175

సీ. పాంచాలు రందఱం బట్టి గిట్టింపక, కాని నాప్రాణముల్ మేనఁ దాల్ప
నందుకే ముందుగఁ బార్షతాధము వధియించి, శాంతిఁ బొందెద నింత స్వాంతమందు
నిహపరంబులమేలు నెంచి కదా గేస్తు, లాత్మజులం బొంద నభిలషింత్రు
తనయుండ నే నుండఁ దండ్రి కీదురవస్థ, వచ్చె నేమన వచ్చు వసుమతీశ

తే. నాదుశస్త్రాస్త్రములు విక్రమాదికమ్ము, గాల్పనే యింకఁ బరలోకగతుఁడు తాత
కే ఋణము దీర్పఁ నార్యుల కెపుడుఁ గాని, చెల్ల దాత్మస్తవం బైనఁ జెప్పఁ జుంటి. 176

శత్రువధకారణమ్మనను బిమ్మట నిట్లు మదీయపౌరుష
స్తుతి యొనరించుకొందు విను చూడ జనార్దనముఖ్యు లే యమ
ప్రతిముఁడనై భుజాబలపరాక్రమముల్ నెరపన్ సురాసుర
ప్రతతియు నాజి నన్ను గెలువంగ సమర్థము గాదు చెప్పితిన్. 177

జ్వలనజ్వాలలఁ బోనిసాయకములం బ్రత్యర్థిసైన్యంబునం
బెలుచం జిమ్ముచు భైరవస్వనమునం బెల్లేయుచుం బాండవే
యులఁ బాంచాలుర మాత్స్యులం బొదివి వాయుమార్గప్రచారంబు మాఁ
కుడ్రఁ బో లేక భువిఁ బండఁ బెట్టెదను నాకు మ్మెచ్చఁ జెం పెచ్చఁగన్. 178

వఱలెడునారాయణ మను,బిఱుసుం గలయస్త్ర మొండు పిత్రర్పితమై
యెఱుఁగఁడు దాని జనార్దనుఁ,డెఱుఁగఁడు బీభత్సుఁ డెఱుఁగ రెల్ల సపత్నుల్. 179

తొల్లి మాతండ్రి నారాయణు నారాధించిన నతండు ప్రసన్నుండై నారాయణాస్త్రము ప్రసాదించి యిది యెల్లప్పుడుం బ్రయోగింప రాదు దీని కవధ్యు లెవ్వరును లేరు సర్వవిరోధివిధ్వంసనంబు సేయు వాహనంబులు దిగి కైదువులు విడిచి శరణు సొచ్చినవారి నిది యేమియుం జేయఁ జాల దని ప్రతివిధానంబు నెఱింగించి తిరోహితుం డయ్యె ననంతరకాలంబున నది మాజనకుండు నా కనుగ్రహించె దానం జేసి పాండవపాంచాలమత్స్యకేకయాదుల నొక్కవ్రేల్మిడిం బిలుకుమార్చెద మఱియు నానావిధాస్త్రశస్త్రంబుల శత్రుక్షయంబు గావించి నిన్ను మెప్పించెద నని పలికి జలోపస్పర్శనంబు గావించి నారాయణాస్త్రమ్ము ప్రాదుర్భూతంబుగా సముద్దీపితంబు గావింపం దొడంగె నప్పుడు మనవారు శంఖంబులు పూరించి డిండిమంబులును దుందుభులును మ్రోయించి సింహనాదంబులు గావించి రథనేమిధ్వానంబున ధాత్రీతలంబు గ్రక్కదలఁ గదియ వచ్చుటయు దిగంతంబులం బూరటిల్లం జేయునయ్యారవంబు విని పాండవులు వారిప్రకారంబునకుఁ బరిపరివిధంబులం బరిశంకించుచుండి రంత నారాయణాస్త్రప్రభావంబున. 180

—. అశ్వత్థామ పాండవసైన్యములపై నారాయణాస్త్రము ప్రయోగించుట .—

. ఘరగింపించెఁ బయోనిధుల్ గలఁగెఁ బాతాళంబు భేదిల్లె ది
క్కరులున్ మ్రొగ్గె ననంతుఁడుం బడియె ఱెక్కల్ రాలె భూధ్రంబులున్
బ్రదిలెన్ విష్ణుపదంబు పేలి పగిలెన్ వేవెల్గు రేవెల్గునున్
హరు వేడం గతి దప్పె ల్లోకడలన్ వ్యాపించెఁ బెంజీఁకటుల్. 181

ఏడు రేగె నదులు విక్కృతిం,బొదలఁగఁ బెను గాలి విసరె భూతము లెల్లన్
బెదరి తపించెన్ మృగములు, బెగడుచు సహసవ్యగతులఁ జేరెను నాకౌకన్. 182

వ. అప్పు డప్పాండవాగ్రజుండు పాకశాసనిదిక్కు మొగంబై. 183

మ. హతుఁడై కూల గురుండు కౌరవులు ప్రాణాపాయశంకాతురం
గితవ్యాత్తాసగరులై కలంగి మనలన్ గెల్వంగ లే కార్తులై
గతనేత్వంబున నొండొకం డరయ కీకయ్యంబునం గాక వే
గతులం బాఱియు నిప్పు డి ట్లఱుము రాఁ గాన్పించెడిం గంటివే. 184

క. మరలెన్ సైన్యము కరులయు, హరులయునాలుఁపులు వెచ్చ నతిరభసమునన్
మొరయున్ దుందుభులు భయం,కరముగ మనవారి కెల్లఁ గంపము వొడమన్. 185

ఆ. గురుఁడు దెగినపిదపఁ గురుసైన్యములఁ గావఁ,బోవ నెవ్వఁ డేనిపోటుబంటు
తోడుపడుచు ననికిఁ దోకొని వచ్చునో,వానవుండ నేను వాఁడు దలఁప. 186

వ. అనిన ధనంజయుం డన్నకి ట్లనియె. 187

క. సన్యస్తశస్త్రుఁడై,చను,ధన్యాత్మునిఁ జనకు నట్లు తఱిగినదానన్
మన్యువశంబునఁ బేర్చిన, మాన్యుఁడు గురుసుతుఁడు దక్క మఱియొకఁ డగునే. 188

ఉ. సందియ మేటికిన్ ఘనభుజాబలదర్పితుఁ గోపదీపితా
స్యుం ధులితేశ్వరేశ్వరు సమున్నతతేజుని ధైర్యధుర్యునిన్
స్కందసమప్రభావు గురునందనుపొందికఁ గాంచి కౌరవుల్
చిందము లొత్తుచుండు రదె చివ్వకుఁ ద్రివ్వక కాలు ద్రవ్వుచున్. 189

సీ. ఎవనిపుట్టినయప్పు డిచ్చె ద్రోణుఁడు గోస,హస్ర ముత్తము లైనయవనిసురుల
కెవ్వఁ డుచ్చైశ్రవోహేషితం బానరించి, నాఁడ ముజ్జగము లల్లాడఁ జేసె
నేవాని కందున నిడియె నశ్వత్థామ,యనునామధేయ మయ్యభవాణి
యెవనిబాహాబలం బేడుదీవులఁ గ్రాలు,శూరవర్యులకు హృచ్ఛూల మయ్యె

తే. నతఁడు దనతండ్రినొకమానవాధముండు, కేశపాశంబునం గడ కేలఁ బట్టి
కుత్తుకం గోసె నని విని కోలుపులికి,నీ డయి పరాక్రమము సూప కేల యుడుగు. 190

క. కురువీరుల కభయం, బిడి, పరిభవమును సైఁప లేనిభావముతోడం
బరివర్ధితకోపుం డై, పరతెంచెడు జమునిరీతిఁ బగఱ నడంపన్. 191

వ. ఇక్కోలాహలం బంతయు నతనిసంరంభం బని మఱియును. 192

—: అర్జునుండు గురుద్రోహంబు చేసితి రని ధర్మరాజ ధృష్టద్యుమ్నులఁ జెంపనాడుట :—

మ. అనృతం బాడి నృశంసకార్యమున నీ వైచంపి తాచార్యునిన్
మును వాలిన్ వధియింప రాఘువునకుం బోలెం ద్రిలోకంబులన్
ఘనమై నిల్చునకీర్తి వచ్చె నుకృతాకారుండు సత్యవ్రతుం
డని నిన్ నమ్మిన నిట్లు చేసితివి సత్యాసక్తి పోకాడఁగన్. 193

పావక చచ్చెఁ సుతుఁ డని, యీ వనినపు డమ్మహాత్ముఁ డేడ్చుచు శస్త్రం
బావల నిడినపు డాభూ,దేవునిఁ గనుఁగొనమె యెట్లు దేవరుపడెనో. 194

తే. విడిచి శస్త్రము ప్రాయోపవిష్టుఁ డైన,గురు నధర్మమునఁ నీవు కుతికఁ గోయఁ
బచ్చితివి తండ్రివలె మన కిచ్చ నేయు,నతని నీరీతి గౌరవించితి కదయ్య. 195

మ. హతబంధుం డగుద్రౌణి యిప్పుడు కదుఁ హాంకారహుంకారముల్
ప్రతిపాదించుచు నప్పరాభవము సైరింపఁ రానిదై యుంటఁ గో
పితుఁడై పార్థతుఁ గూల్చ వచ్చెడిని'నీవే కాక మీమంత్రులుఁ
బ్రతిబంధింపుఁడు వానిఁ, గావు డితనిఁ సామర్థ్యమే కల్గినఁ. 196

తే. దాని బాఱిఁ బడినవాని నింద్రాదులుఁ, గావఁ జాల రనినఁ శేవ లేని
మానము గాతు మనుట మతి లేనిమాట య,తండు మన్నలఁ గూల్చ కుండఁ డకట.197

చ. వల దని నేను వేఁ దగిలి వాయి సెలంగఁగఁ జెప్పుచుండినఁ
బలువతనంబున న్వినక పార్షతుఁ డాగురు ముట్టి కోసె నా
దల విలుఁ బూని యున్నతటి దైవతనాథుఁడు నేని విక్రమో
జ్జ్వలుఁ డగునమ్మహాత్ముఁ గనఁ జాలఁడు వీఁ డొకపాటి వాఁడొకో. 198

తే. వయసు గడచె నున్నవయ సల్ప మగు మన, కల్పరాజ్యసుఖము నాసఁ జేసి
పరమధార్మికు లనుప్రఖ్యాతిఁ బోకార్చి, యఘములందుఁ బడితి మక్కటకట. 199

క. చులుకన ద్రోహము చేసితి,మలఘునకున్ విద్య గఱపినట్టిఁడు తండ్రిం
దలపించు నంచు నెంచక, పలుగాకుల మింతకన్నఁ బాపము కలదే. 200

మ. ధృతరాష్ట్రాదులు త న్ననారతము బ్రీతిం బ్రోచుచున్నం గృపా
న్వితుఁ డాతండు గునూరుకన్నను ననున్ బ్రేమించి కామించు నే
నతిసీచుండ నుపేక్ష చేసితిని మీ రట్లా గురుం జంప దు
ర్గతులై నాకు నవాక్ఛిరంబుగఁ బఃకం బ్రాపించునో యాతనఁ. 201

తే. విప్రుఁ నాచార్యుఁనిఁ శతవృద్ధు న్యస్త,శస్త్రుఁ బ్రాయోపవిష్టుని సన్మునీంద్రు
నర్థకామంబునం జంపినట్టిబ్రదుకు,కంటె మరణంబు శ్రేయమౌఁ గాదె తలఁప. 202

వ. అని యర్జునుం డన్నం జెందఁ నాడిన నం దున్నమహారథు లందఱుం ద ప్పని
యొ ప్పని చెప్ప కూరకుండి రప్పు డప్పవమానసూనుండు మానసంబున గర్హిం
చుచుం గ్రుద్ధుం డై యి ట్లనియె. 203

సీ. దండము నుజ్జగించి నియతవ్రతుఁ డై ముని కాననంబులఁ
దుండియు ధర్మసంహితల నొప్పఁగఁ జెప్పియు నొప్ప నట్లు,భూ
మండలమందు క్షత్రియుఁడు మార్గుఱ మార్గమునుచున్ క్షతంబునఁ

దండిగ సాధురక్షణమునన్ క్షితిఁ గైకొని కీర్తి నొప్పెదున్.

—భీముం డర్జునుం గర్హించి పలుకుట—

మ. అమలక్షత్త్రకులోద్భవుండ వయి నీ వత్యంతమేధావివై
సుమనస్సంస్తుతకీర్తి వయ్యు ననభిజ్ఞుం డట్లు భాషింతు వీ
సమయం బిం దిటు పోల దింద్రునిగతిన్ శౌర్యంబునం బొల్చు ధ
ర్మము నొక్కింతయు మేఱ మీఱవు సముద్రం బల్ల వేలం బలెన్.
సీ. వెనుకఁబెట్టి క్రోధంబు మునుఁ బదుమూఁడేండ్లు, తలపోయవే నీవు ధర్మ మెడఁదఁ
బుణ్యంబున న్నీదుబుద్ధి స్వధర్మము,నం దగు నానృశంస్యంబు నీద
మన రాజ్యము నధర్మమునఁ గొని సతి సభ, కీడ్చి వనుల కంచి యోర్చు నపుడు
నలుగ కోర్చితి విప్ర యయ్యధర్మము వాప, నరులను వెగటార్చ నయితి మిపుడు
తే. బాస యిచ్చితి సాఁ జేన పగఱ నోర్తు,ననుచు మఱకుము దాని ని ట్లనుచితముగ
నేల మముఁ దూల నాడెద వీ వసత్య,కర్ముఁడవు గాఁగఁ దగు నోయి ధర్మనిరత.
క.ఉఱిసిన పుండులపై నుప్పరమర లేకిడినయట్టు లడలు గుడుచుమ
మ్మరయాక మాటలపోటులఁ, బొరిపొరి మర్మములు నాటఁ బొడుచుట తగునే. 207
తే. ధార్మికుఁడవై యధర్మముఁ దలపవైతి,మఱచి పోతి ప్రశస్యుల మమ్ము నిన్నుఁ
గడను వాసుదేవుఁడునుండఁగాదటంచుఁ,దత్కళకుఁ గాని గురుపుత్త్రుఁ దలఁతుతగునె.
క. నీదోసము నీ వెంచుచుఁ, గా దన కేమిటికి సిగ్గు గైకొన వకటా
పేదవు నను మఱచితి వో, నాదగుగద యైన నీమనంబున రాదో. 209
చ. గదఁ గొని నేలఁ గ్రక్కదలఁ గా నొనరించెదఁ బర్వతావళిం
జిదురుపలై నలిం బడఁగఁ జేసెదఁ జెట్టుల మట్టుపెట్టెదన్
బ్రదరములన్ సురాసురులఁ బాఱఁగఁ జేసెద నిట్టియన్న నీ
కొద్దువ నెఱుంగ నేర వెద నోడ్ల నుతించెద నెంత వెఱ్ఱివో. 210
ఆ. ఓప నేని యూరకుండు మీ వేనొక్క,రుఁడ హిరణ్యకశిపుఁ దొడరి నార
సింహుఁ డట్టు లఖిలసేనతో గురుపుత్త్రుఁ ,బట్టి కిట్టివైతు దిట్ట నగుచు. 211
వ. అనిపలుకుచున్నంత ధృష్టద్యుమ్నుండు దట్టోష్ఠుండై ధనంజయున కి ట్లనియె. 212

—ధృష్టద్యుమ్నుఁ డర్జునుం గర్హించుట—

తే. యజన మధ్యయనంబును యాజనంబు, దానము ప్రతిగ్రహంబు నధ్యాపనంబు
నాఱును స్వకర్మములు విప్రుఁ డైనవాఁడు,వాని విడిచిన విప్రుఁడే వాఁడు చెపుమ.213
మ. కులధర్మంబు పరిత్యజించి ఖరుఁడై కొండొక్క ధర్మంబునన్
మెలఁగ న్నేర్చెఁ బె కాక ద్రోణుఁ డిపు డీమే క్షుద్రకర్మంబునుం

గలఁడై ప్రాకృతులున్ మహాస్త్రములఁ జక్కాడెం గదే మాయమై
ఖలునిఁ వానిని బ్రాహ్మణబ్రువుని నే ఖండించుటల్ దోషమే. 214

తే. చంద్రిఁ జంపినపగఁ బూని తత్సుతుండు, నోరు బ్రద్దలుగా నార్పు లీరహిఁ బాన
చదినంతన మన కేమి కొంచె ముగును,రాయు నని నన్ను బెదరింప రాదు మయ్య.

క. అడబీరంబున నాతఁడు, దడములఁ గొని వచ్చె నేని తద్రక్షణమం
బడియాన పడుచు వానిని, మడియించుకొనుం దలంప మన కది మేలే. 216

సీ. నీవు ధార్మికునట్లు నోవ నాడితి నన్ను, గురుఘాతి యనుచు లో గొణిగి కొనుచు
నీఁ దదర్థమ మహాగ్నిం బుట్టితిని నాకుఁ,దొడు సగుదోసంబు తొడర దండు
యుక్త మయుక్తంబు నూహింప కని సేయు,ఖలుఁని బ్రాహ్మణుఁ డని క్షత్రియుఁ డని
యన రాదు వాని నెట్లయినఁ జంపన తగు, నూరక నను నీవు దూరుచుంటి

తే. మెచ్చ వచ్చినదీనికి మెచ్చ వీవు, మఱియు నాచుట్టముల నేరి మట్టుపెట్టె
వానితలఁ దున్మి యుం దృప్తిఁ బూన దాని,వెన నిషాద దేశంబున వేయ కునికి. 217

సుగంధి. చంపు టొండె చచ్చు టొండె క్షత్రజాతిధర్మమే
చంపితి ట్లధర్మ మంటి క్షత్రియుండ నాకు నే
మింపు మిట్లు ధర్మ మంచు మేరఁ జేసి పోరులన్
నొంపఁ దండ్రు లొజ్జ లంచునుం దలంతురే నృపుల్. 218

మ. అగు నట్లంటివ యేని నీపితృసఖుం డై కొల్వఁగా నొప్పు నా
భగదత్తుఁ మఱియుం బితామహుఁడు నాభాగీరథీనందనుం
డగు దేవవ్రతు నీ వడంచితివి నే నట్లే యనిం గూల్చితిం
దగు నే నన్ను నధర్మవర్తి యనుచుఁ దర్కించి నిందించుటల్. 219

తే. మోకరిల్లుచుఁ దనగాత్రమునన యెక్కు,వానికిఁ మెట్లు సూపినవారణంబు
గతిని సంబంధమున నవనతుఁడ నయిన,నన్ను నీ విట్లు తెగనాడ నాయమగునె.220

తే. ద్రోవదినిఁ జూచి యామెపుత్రులను జూచి,సైఁచితిని నీదుక్రూరవచనము లెల్ల
మఱియొకటఁ గాదు గురునకు మాకునుబగ,యన్వవాయక్రమాగత మని యెఱుఁగవె.

క. అనృతము లాడఁడు ధర్మజుఁ, డని సోమకసుతుఁ డధర్మ మంటఁ డనియు నీ,
వనుకొని శిష్యద్రోహము,నన చచ్చెఁ ద్రోణుఁ డన్యఁచు నడు మని కింకఁ. 222

వ. అనిన విని ధృతరాష్ట్రుం డక్కటం పడి వేదవేదాంగంబులును ధనుర్వేదంబు నెఱింగి
లోకోత్తరగుణోత్తరుం డని ప్రఖ్యాతిం బడసినచాపాచార్యు నట్లు నీచకర్మంబునం
జేసి కూల నేసియు నట్లు ప్రీలం జేసిన జాల్మునిం గని గురుకటాక్షంబున నక్షీణ ప్రా
భవంబు నొంది పొందుపడి యున్నవా రందఱు నొండన కూరకుండిరే యను డు

ధనంజయుం డిట్లు పలుకుచున్న వినియు విననియ ట్లెల్లరాజులుం డిల్లపడి యుండి రర్జు
నుండు కటాక్షవీక్షణంబులం గాల్చువాఁడు నా వాని నీక్షించి కంటనీరు నించుచుఁ
ఛీఛీ యని నిందించుచు నూర్చుచునుండె యుధిష్ఠిరభీమసేన నకుల సహదేవ వాసు
దేవులు సిగ్గుపడి చూచుచుండి రప్పు డప్పురుషోత్తమానుజుండు క్రోధతామ్రాక్షుండై
ధృష్టద్యుమ్నుం గాంచి యి ట్లనియె. 223

—. సాత్యకి ధృష్టద్యుమ్ను నాక్షేపించి నిందించుట .—

సీ. అధమాధమా నీదునధమకృత్యమునకుఁ, గుత్సింప కుండనికుజనుఁ డెవఁడు
శ్వపచుని సన్నుతవ్రతులువోలె న్నిన్ను, రోయుచుండిరి పాండవేయు లెల్ల
నింతపాపము చేసి యేల లజ్జింపవో, పలుక వచ్చితి వీవు పలువ వరయ
వ్రయ్యవు నీదుజిహ్వయు మూర్ధమును నేయు, పలికలుగ గుసుం జెరువుదానఁ
తే. బలుక నేటికి నరకకూపమునఁ బడుదు, పొగడుకొనుచుంటి పేచేత పోలు ననుచు
వధ్యుఁడవు నీవు నీ వున్నఫలము కంటేఁ, జచ్చినం గొంత మే లన వచ్చుఁ జుమ్ము. 224
తే. లాఁతి యెవ్వఁడు నీవలె నీతి మాలి, గురుని సిగ వట్టి యీడ్చునే క్రూరుఁ డై వె
సంగుకతన సప్తావరుల్ సప్తపూర్వు, లనమగతిఁ గంత్రు నీకు నమ్మాను వాస. 225
క. ఆద్రేవతుఁ జంపితి, గాదే యని నాదుగురునిఁ గసరితి వదియుక్
నీదుసహోదరునని మై, పాదుకొనెం బలుక నేల పాపపుఁబలుకుల్. 226
మ. ధరఁ బాంచాలురకన్నఁ బాతకులు మిత్రఘ్నుల్ గురుఘ్నుల్ ఖలుల్
పరనిందాపరు లుండ ర ట్లగుట నీపాపంబు గావించి తో
దురితాత్మా! యిఁక నిట్లు ప్రేలితివ యోఁ దోషజ్ఞ భవచ్ఛిరమ్ముక్
స్వరుకల్పం బగుమద్గదాయుధమునన్ వ్రయ్యం బొనర్తుం జుమీ. 227
తే. బ్రహ్మహత్యాదిపాతకవర్తి వయిన,నిన్నుఁ గనిసఁ బాపము వెన్నుఁదన్ని వచ్చు
నట్టిజనులు ప్రాయచిత్త మాచరించు,కొనవలయుఁ గాన సూర్యునిఁ గనఁగ వలయు.
తే. ఓరి పాంచాలకులనీచ యోరి క్షుద్ర, మద్గురుని చెంతఁ దద్గురు మడియఁ జేసి
యిట్లు ప్రేలెదు నాల్క గోయింతు నుడుగు,మనిన నల్గుచుఁ బార్షతుం డనియె నిట్లు.
చ. విని విని సైఁచి యుండు గుణవిశ్రుతుఁ డై తగి సాధు వంచు దు
ర్జనుఁడు నినుం బలెం దెగడ సాఁగును సైరణ లేదు పాపి కెం
దును క్షమిఁ గాంచి గెల్చినటు దుష్టుఁడు కష్టగతిన్ మెలంగు దో
షిని నిను నేమి చేసినను జేయఁగ వచ్చును రోరి దుర్మతీ. 230
ఉ. ఈ పోకపోటుమానిసివె యేటికి మాటల వామి వెట్టె దో
కావర కృత్తహస్తుఁ డయి కాఱియ నొందుచుఁ బ్రాయ మున్నచో

నావరకౌరవాన్వయుని నందఱుఁ గాదన గొంతు గోయవే
నీవ వచింప వచ్చితివి నీతులరీతులు చాలు బాపురే. 231

వ్యూహము వన్ని మహాస్త్ర, వ్యూహంబుల నరుల నేర్చు చొకయింతన నం
దేహించి శరమువిడిచిన, ద్రోహిని నే నేయు గొక్క దోషం బగునో. 232

అగు నగు నీపరాక్రమ మి దంతయు వింతగఁ దోప వచ్చె నీ
మగఁటిమి యెందుఁ బోయె నిను మార్కొని పేర్కొని సోమదత్తుఁ డె
త్తుగఁ గొని నేల వైచి వడిఁ ద్రొక్కుడున ప్డరసావు నచ్చి తో
తగవరి! చెప్ప వచ్చితివి ధర్మపథంబులు నే నటం చిటన్. 233

తే. కర్మచండాలుఁ డవు నీవు ధర్మనిర్ణయంబు సేయ ననర్హుండ వట్లు నిన్న
చేసి నేఁ డిట్లు నను దెప్ప నోసి తింక,నుడుగు కాకున్నఁ జముపీటి కడుగు లిడుదు.

. మఱియును విను మొకధర్మము తెలఁగున నే పోదు మన్నఁ దీరునె కార్యం
బఱగొఱ యగు నట వారికి, మొఱకడ మగ్గలము నీవు మున్నెఱుఁగ వాకో. 235

. వారధర్మంబున వంచించి ధర్మజు, సర్వస్వము హరించి దుర్వినీతిఁ
జదురునం ద్రోవదిఁ జలపట్టి యీడ్చిరి, వనుల కంపిరి మొల్లవారి నపుడు
విషము పెట్టించిరి మిసు వన్ని లక్కయింటం బెట్టి కాల్చిరి రవళి మెఱయఁ
గపటమునన్ శల్యుఁ గని కల్పు కొనిరి సౌభద్రునిం జంపిరి వలువు రెలసి

తే. యిచట భీష్మునిఁ గూల్చుట యీవు సోమదత్తతనయునిఁ గోయుట ధర్మ మనను
వారు వీరు జయార్థులై వఱలి రిట్టు, లాలముల ధర్మము నధర్మ మరయ టరిది. 236

వ. కావున నీవింక ధర్మవిచారంబు సేయక నిర్మలచిత్తుండవై పితృగృహంబు దిక్కు మొగంబు వెట్టక నెట్టుకొని కౌరవులతోడం బోరుకొను మనిన నవ్వీరాగ్రేసరుండు మండిపడి గదాదండంబుఁ గొని రథంబు డిగ్గున డిగ్గ నుఱికి నిన్ను మాటలం గాదు వ్రేటులం దీటడంగింతుఁ జూడు మని సింహకిశోరంబు మాతంగంబుపైఁ గవియుచందంబున ధృష్టద్యుమ్నునిపైఁ గవిసినం గని వాసుదేవుండు భీమసేనుం బనిచిన నతండు తనరథంబు డిగి రయంబున నెయిది సత్యకసూనుం బట్టి భుజంబులం బెట్టుకొని యా యడుగు లిగ్గ దిగిచి నిలువరించునంత సహదేవుండునుం జని సాత్యకీ! యదువృష్టిభోజాంధకమత్స్యపాంచాలురకు మించినమిత్రులు మాకును మాకంటెం గూర్చుసుహృదులు వారికినిఁ బాండవయాదవులకన్న సఖులు పాంచాలురకును నీమండలంబునం గలుగ రని చెప్పవలయునే మనలో మన మి ట్లెరవుపడుట ధర్మంబు గాదు. ధర్మజ్ఞుండ వైననీవు మిత్రధర్మముం దలపోసి కోపంబు దిగఁద్రావి శాంతింపుము పార్షతుని క్షమింపు మతండు నిన్ను క్షమించు నని కోపాటోపశమనంబు

## పంచమాశ్వాసము.



## ద్రోణపర్వము-ప్రథమాశ్వాసము.

## ద్వితీయాశ్వాసము.

## తృతీయాశ్వాసము.



## చతుర్థాశ్వాసము.

[illegible]

[illegible] భార[illegible]

క. జనమేజయుఁ డనఘుండు సుధానిధానమ్మగు వైశంపాయ[illegible]
యనమునిఁ గని కురుపాండవు, లని చేసినవిధము దెలుపు మని యడుగుటయును. 5

వ. వైశంపాయనుం డిట్లనియె. 6

—:జంబూఖండనిర్మాణపర్వము:—

క. జననాథ! పాండునందను, లును ధృతరాష్ట్రాత్మజన్ములుఁ గురుక్షేత్రం
బున మన్యువశంబునఁ జేసిన ప్రవిదారణ ము దెల్లఁ జెప్పెద వినుమా. 7

వ. *అట్లుభయబలంబులును దమతమకోలంబు లెఱింగికొనినంత మఱునాఁ డరుణోదయంబున ధార్తరాష్ట్రప్రచోదితు లగునానాదేశంబుల రాజు లెల్లరును దమతమ బలగమ్ములతోఁ గాల్యకరణీయంబులు దీర్చి ధౌతమాల్యాంబరాభరణధారులును గృహీతశస్త్రాస్త్రులు నై స్వస్తివాచనపూర్వకంబుగా నశ్వత్థామ భీష్మ జయద్రథ శకుని కృతవర్మ శల శల్య బృహద్బల భూరిశ్రవఃప్రముఖులం గూడి భారద్వాజుం బురస్కరించుకొని భ్రాతృశతపరివారితుం డగుకురురాజు ననుసరించి సమరోత్సాహం బినుమడింప నానావిధవాద్యంబులు బోటికలుగం గదలి చని కురుక్షేత్రంబునఁ జతుర్యోజనమండలం బెడ గలుగ దుర్యోధనకల్పితంబులును దుర్గమదుర్గాభిరక్షితంబులు నగుశిబిరంబుల హాస్తినపురంబునం బోలె వసియించి భక్ష్యభోజ్యపానీయాదుల రాజగారవంబు నొందుచు చూడి రంతఁ గౌంతేయాగ్రజుండును జేది కాశి కరూశ ప్రభృతు లైనపృథివీపతులం గూడి విరాట ద్రుపద ధృష్టద్యుమ్న ధృష్టకేతు యుధామన్యూత్తమౌజో యుయుధాన జయత్సేన ప్రభృతులును భీమార్జున నకుల సహదేవ ద్రౌపదేయ సౌభద్రేయులును వివిధవిధసైన్యంబులుం దన్నుఁ బరివేష్టింప శ్రీకృష్ణుం బురస్కరించుకొని వివిధమంగళవాద్యంబులతోఁ బయనం బై చని రంగస్థలం బాక్రమించె. 8

—: సేనాద్వయసన్నివేశము :—

సీ. యుద్ధాభినందులు నిద్ధతేజస్కులు, పాండుపుత్రుల్ సోమకపరివృతు లయి
వివిధసేనలు గొల్వ విజయ మాకాంక్షించి, కౌరవవాహినిం జేర నరిగి
పశ్చిమభాగంబు వట్టి ప్రాఙ్ముఖు లయి, పోర నెదిర్చి రవ్వీరసమితి
వేనవేల్ శిబిరముల్ వేయింపఁ బడె శమం, తకపంచకమునకుఁ దవ్వుల నవల,

తే. బాలవృద్ధులు తక్క నీభరతవర్ష, మందుఁ బూరుషు లగువార లంద ఱార
ణమునకై వచ్చి బహుయోజనములమేర, నావరించిరి వను లద్రు లాపగలును.

---

* ఇది కొన్నిప్రతులయం దుద్యోగపర్వాంతముననే కానఁ బడుచున్నది.

సమయంబు చేసి వాగాయుధుని వాగాయుధుండును రథికుని రథికుండును హాస్తిపకుని హాస్తిపకుండును హయారూఢుని హయారూఢుండును బదాతిం బదాతియుం గామబలోత్సాహంబులకుం దగునట్లుగఁ బోరితంబు సేయునట్లును నమ్మి శరణన్నవానిని విన్నఁబోయినవానిని విముఖుఁడైనవానిని రణంబు వీఁగి సన్నవానిని లాఁతితోడం బోరువానిని గత్తియుఁ గవచంబును వీడినవానిని శంఖభేరీప్రముఖవాదిత్రవాదకులనుం జంపకుండునది యని పలికికొని సైనికు లొండొరుం బరికించుచుఁ గయ్యంబునకుం గాలు ద్రవ్వి చూడి రాసమయంబున. 16

—:వ్యాసుఁడు వచ్చి ధృతరాష్ట్రునకు దుర్నిమిత్తంబు లెఱిఁగించుట:—

తే. భూతభవ్యభవిష్యద్విద్బుద్ధి గలుగు, ఘనుఁ డఖిలవేద వేత్త్రిగ్గగణ్యుఁ డైన
వ్యాసభగవానుఁ డరుదెంచి వారిసైన్య, సముదయంబులఁ గన్గొని స్వాంతమందు.

శా. ఈకయ్యంబున భీష్మముఖ్యు లగువా రెల్లన్ గతప్రాణులై
పోకుండం గలవారు కా రని తగం బోలించి పుత్రార్థనై
శోకవ్యాకులితాత్ముఁడైనధృతరాష్ట్రుం జేరఁ గా నేగి కా
ర్యాకార్యంబు లెఱుంగ ని ట్లనియెఁ బ్రత్యక్షప్రమాణంబుగన్. 18

చ. నృపవర! కాలచోదితులు నీసుతులున్ మఱి యిమ్మహీక్షితుల్
వ్యపగతజీవులై రణమునందుఁ బడం గల రీవు కాలచ
క్రపుగతి యిట్టి దం చెఱిఁగి కాకుము శోకపరీవృతుండవై
యిపు డనిఁ జూచునిచ్చ గలదేని నచింపుము కన్ను లిచ్చెదన్. 19

వ. అనిన ధృతరాష్ట్రుండు తండ్రి కిట్లనియె. 20

ఉ. అన్నలుఁ దమ్ము లొండొరువు లాజిముఖంబునఁ ద్రెళ్ళ నేసికోఁ
గన్నులఁ జూడఁ గాఁ దలఁపఁ గాని మునీశ్వర! వారిసంగరం
బున్నది యున్నయట్లు విన నుల్లము చేసితి నెల్లఁ జెప్పవే
యన్న నతండు సంజయున కట్టివరం బిడి తేని కి ట్లనున్. 21

సీ. ఈసంజయుండు నీ కెఱిఁగించు సమరప్ర, కార మంతయును బ్రకాశమైన
నప్రకాశం బైన నాత్మగతం బైనఁ, బగ లైన రే యైనఁ దగ నెఱింగి
శస్త్రాస్త్రములు వీని సరస రా నోపవు, నావరంబున వీఁడు చావ కుండుఁ
గురుపాండవులకీర్తి ధరణిఁ దిరం బుండ, వెలయింతు నే శ్లోకవృత్తములన,
తే. దిష్టమును దాఁట నేరికిం గష్టతరము, గాన నీ వుమ్మలింపకు మానసమున
ధర్మమెందుండు జయ మందుఁ దవిలియుండు, బహుజనక్షయమగు వీరిప్రధనమునను.

క. భీతిదము లై నిమిత్తము, లీతఱి సూచించుచుండ నెటు కాదాలం
బీతర్క మేల దీనన్, భూతలజన మెల్లఁ బోలియఁ బోవు న్వినమా. 23

సీ. కాకగృధ్రశ్యేన కంకబకాదులు, వ్రాలుచున్నవి ధ్వజాగ్రములయందుఁ
గటకటారవములఁ గ్రాలుఁ గ్రవ్యాదగణము లిభాశ్వాదిమాంసములు దినఁగ
సైన్యమధ్యంబునఁ జన దక్షిణాభిముఖంబు లై గ్రద్ద లాకసము నిండి
యుభయసంధ్యల భాను నొదవు నీలారుణ, శ్వేతకబంధముల్ వీడకుండ,

తే. రేయిఁ బవ లేఱుపడకుండ నేయెడలను, వెలుఁగు నర్కేందుబుక్షమండలము లెల్లఁ
గార్తికికపూర్ణిమారాత్రిఁ గాంతిఁ దొఱఁగి, వహ్నివలె నొప్పె నెల పద్మవర్ణముగను.

చ. ఎడనెడ దేవతాప్రతిమ లెల్ల వడంకెడు నవ్వెడుం గడుం
గడువడి నెత్తురుఁ గ్రక్కెడును కండలు కండలు గాఁ జెమర్చెడుం
బడియెడు నేడ్చెడున్ రవము పర్వఁగ మ్రోఁగెడు రిత్త దుందుభుల్
విడి దివమందుఁ బందులును బిల్లులుఁ బోరెడుచొప్పు దోఁచెడున్. 25

సీ. నిదురించుచుండిరి నిహతు లైన ట్లెల్ల, రాజులు గతమనోరథము లెసఁగ
శతపత్ర సారస చాష భాస శుకాదు, లఱచుచున్నవి దారుణారవముల
ఘోటకంబుల నెక్కి ఖేటకంబులవార, లార్చుచుండిరి శస్త్రులారఁ దాల్చి
కోటానఁగోటు లై మేటు లై చూపట్టు, నరువాత శలభముల్ వ్రజము లగుచు,

తే. సంజలందు దిగ్దాహము సంభవించెఁ, బాంసువర్షము పడు మాంసభరిత మగుచు
వెనుకఁ బడ నరుంధతి త్రోయుఁ దనదుమగని, శని ప్రపీడించు రోహిణీ శకట మిపుడు.

ఆ. చంద్రలాంఛనంబు సాధ్వసదం బయి, మాఱఁ జొచ్చె మింట మబ్బు లేక
మెఱుము నఱుము దోఁచె మేదినిపై నట్టు, గిట్ట వాహనాళి కంటనీరు. 27

మ. కనియెం గోవులు గర్దభంబుల సుతుల్ గామిత్రి మాత్రాదులన్
గనుఁగో సద్యో ముతుప్రభిన్నముగ వృక్షవ్రాతముదున్ ఫలం
బును బుష్పంబును గర్భిణుల్ భయద మాపుత్రావళిం గాంచు రెం
డును గ్రవ్యాదులు పక్షులుం గలసి తోర్తోఁ దిను నాహారమున్ 28

తే. రెండుతల లైదుగాళ్ళును రెండుమేహ
నమ్ములున్ రెండుతోఁకలు నాల్గుకనులు
మూఁడుకొమ్ములుఁ గోఱలు మొనయఁ బసులు
పొడమి యఱచును వివృతాస్యము లయి పెలుచ. 29

వ. *మఱియు నీపురంబున మూఁడుకాళ్ళు గలిగిన నెమిళ్ళును నాల్గుదంష్ట్రలు విషాణం

బులుం గాలిగాడిదపక్షులును బుట్టుచున్నవి. బ్రహ్మవాదులవనితలకును విరూపాప
త్యంబు వొడముచున్నది గ్రద్దలు నెమ్మిలం గనుచున్నవి. గుఱ్ఱములకు గోవ
త్సంబులును గుక్కలకు నక్కలును నొంటెలకుఁ గుక్కురంబులును జనించుచు
న్నవి. శుకంబు లశుభంబుగ నఱచుచున్నవి. మనుష్యకాంత లొక్కొక్కతతి
నలువు రేవురం గన్నెలఁ గనుచున్నవారు. వారు పుట్టినంతనె మహాద్భుతరవంబున
నవ్వుచు నృత్యగానంబులును శస్త్రప్రతిమాలేఖనంబును జేయుచున్నవారు.
దండపాణులై శిశువు లొండొరుల మార్కొనుచున్నవారు. వృక్షంబులు బద్మో
త్పలంబులుఁ గుముదంబులు సుపుష్పంబు లగుచున్నవి. గాడ్పులు రేఁగి వీఁగక
దుమ్ము గ్రమ్ముచున్నయవి. భీమంబుగ భూమికంపించుచున్నయది. రాహువు సారె
కర్కుం గబళించుచున్నవాఁడు. శ్వేతగ్రహంబు చిత్ర నతిక్రమించి కురుకుల
నాశనంబు సూచించుచున్నది. ధూమకేతువు మహాఘోరంబై పుష్యమి నాక్ర
మించుకొని బలద్వయామంగళం బొదవించుచున్నయది. మఖయందంగార
కుండును శ్రవణంబున బృహస్పతియును వక్రించి యున్నవారు. సూర్యపుత్రుండు
భగనక్షత్రం బాక్రమించి పీడించుచున్నవాఁడు. శుక్రుండు ప్రోష్ఠపదం బధిష్ఠించి
యుత్తరాభాద్ర గంటుచున్నవాఁడు. మఱొక శ్వేతగ్రహంబు సధూమపావకం
బువోలె వెలుఁగుచు నైంద్రంబగు జ్యేష్ఠ నాక్రమించుచున్నది. ధ్రువగ్రహంబు
ఘోరంబై యపసవ్యప్రవర్తనంబు సేయుచున్నది. సూర్యచంద్రు లిద్దఱును రోహి
ణింబీడించుచున్నవారు. పావకాభంబగు పరుషగ్రహంబు చిత్రాస్వాతులందధివసించి
శ్రవణంబును వక్రానువక్రంబు సేయుచున్నది. లోహితాంగుండు బ్రహ్మరాశి
నాశ్రయించి వెలుఁగుచున్నవాఁడు. సర్వసస్యశాలి యగునేల సస్యపరిచ్ఛిన్నం
బగుచున్నయది. యవ లయిదుతలలతోడను శాలిధాన్యంబులు నూఱుతలలతో
డనం జూపట్టుచున్నవి. గోవులీని శోణితంబు పిదుకుచున్నవి. చాపంబులును
ఖడ్గంబులును గవచంబులును ధ్వజంబులును శస్త్రంబులును మహాగ్నులవలె
మండుచు మిడుఁగుఱులం గ్రక్కుచున్నవి. సీ క్ష్మైకడల విప్పులవలెం జూడ
నొప్పుచున్నవి. పృథివి యంతయు ధ్వజాంకుశసమాకులయు శోణితావర్తయునై
కురుకులక్షయంబు సూచించుచున్నది. ప్రతిదిక్కునందును మృగంబులును బక్షు
లును బ్రజ్వలితాస్యంబులై భయంబుం దెలియం జేయుచు నఱచుచున్నయవి.
ఏకపక్షాక్షిచరణ మగునొక్కపక్షి యంతరిక్షంబునం దిరుగుచుఁ బ్రతిదినంబును

---

* భగనక్షత్రము=పూర్వఫల్గుని; ప్రోష్ఠపదము=పూర్వాభాద్ర;

TEL. 1849



రాత్రి నైఋతి గ్రక్కుచు రౌద్రంబుగ నఱచు చున్నది. సప్తర్షుల ప్రభ యెల్లఁ గప్పువడి యున్నది. బృహస్పతిశనైశ్చరులు విశాఖం దఱిసి వత్సరస్థాయులై ప్రజ్వరిల్లు చున్నవారు. పాంసువర్షంబున దిక్కు లన్నియుం బిక్కటిల్లి యున్న యవి. రౌద్రంబు లగునుత్పాతమేఘంబులు రేలు రక్తంబు వర్షించు చున్నవి. కృత్తికానక్షత్రంబుఁ బీడించుచుఁ దీక్ష్ణవాయువులు ధూమకేతుసమాశ్రితంబులై యెల్లకడల నాక్రందనంబు పుట్టు నట్లు బెట్టుగ వీఁచుచున్నయవి. పూర్వాఖ్య నక్షత్రత్రయంబున గ్రద్దలు ధ్వజాదిశీర్షంబుల భయంకరంబుగ నఱచుచు వ్రాలుచున్నయవి. చంద్రసూర్యు లేకమాసంబునఁ బ్రతిప త్త్రియోదశీ చతుర్దశీ భూతపూర్వ పూర్ణిమామావాస్యలందు నపపర్వంబుల రాహు కేతు గ్రస్తు లగుచున్న వారు. రక్షోగణంబు రక్తపరిపూర్ణవక్త్రములతోఁ దృప్తి లేక విహరించుచున్నయది. మహానదు లెల్ల శోణితోదకపరిపూర్ణంబులయి యెదురువాఱు చున్నవి. కూపంబులు ఫేనాయమానంబు లయి వృషభంబులవలె అంకెలు వేయు చున్నయవి. పిడుగులతోడం గొఱవు లెల్లకడలఁ బడి తిమిరంబు నెఱయించు చున్నయవి. సీనిమిత్తంబున ధరిత్రి యంతయు రాజులరక్తంబు దృప్తిదీఱం ద్రావు నని మహర్షులెల్లం జెప్పు చున్నవారు. హిమవత్కైలాసమందరాదిపర్వతంబుల మహాశబ్దం బగు చున్నయది. సముద్రంబు లెల్ల వేలల నతిక్రమించి క్షితితలంబు క్షోభింపఁ జేయు చున్నవి. శర్కరాకర్షకంబు లగువాయువులు గ్రామనగరాదులం గలవృక్షంబులఁ గూల్చు చున్నవి. హవ్యవాహనుండు వేల్వం బడి నీలలోహితపీతవర్ణుం డై దారుణస్వనంబున మెఱయుచు నపసవ్యప్రచారంబున దుర్గంధం బీను చున్నవాఁడు. స్పర్శగంధరసంబులు విపరీతంబు లగుచున్నవి. ధ్వజవ్రజంబు మాటిమాటికిం గంపించుచు ధూమంబు గ్రక్కు చున్నది. గిరిదుర్గశిఖరంబులం దున్న భేరీపటహంబు లంగారవర్షంబు గురియు చున్నవి. వాయసంబులు వామమండలప్రచారంబుగ ధ్వజాగ్రంబు లెక్కి యుగ్రరవంబు గావించుచున్నవి. వ్యాళంబు లెల్లకడల వడంకుచుం బొఱలు చున్నయవి. పావురంబులు దీనముఖంబున దేవురించు చున్నయవి. వారణంబులు సలిలాశ్రయంబు లై తీరంబుఁ జేరు చున్నయవి. మఱియు ననేకదుర్నిమిత్తంబులు చూపట్టి బహుప్రజాక్షయంబును గురుకులవినాశనంబును సూచించు చున్న వని వెండియును. 30

ఈ విధి యంతయు నెమ్మది, భావించుచుఁ దగినరీతి వర్తించుటకుఁ

---

పూర్వాఖ్యనక్షత్రత్రయము=పూర్వఫల్గుని పూర్వాషాఢ పూర్వాభాద్ర;

దా వెలసెఁ బ్రాప్తకాలము, నావుడు ధృతరాష్ట్రుఁ డిట్లు సంయమున కనియెన్. 31

ఆ. దైవవశము దీని దప్పింపఁ గా రాదు, క్షేమ మఁ బ్రజాక్షయంబు కాక పోదు
పోరి నిల్చి రాజపుంగవు లుభయంబులో, కములఁ గీర్తిఁ గం్దు గాదె తండ్రి. 32

వ. అనిన నమ్మునిసత్తముండు ముహూర్తమాత్రంబు చిత్తంబునం జింతించి వైచి
త్ర్యవీర్యుం గాంచి వెండియు. 33

ఉ. కాలవశంబునం బడి జగంబు నశించెను వెండిఁ బుట్టుఁ గా
బోలుఁ, నింతియున్ నిజము పొమ్ము దిరంబుగ నూడ దైన భూ
పాల! సుహృజ్జనంబులును బంధులు జ్ఞాతులు పోరి చచ్చుటల్
పోలదు నేను మే లనఁగఁ బోన సమర్థుడ వీవు కావునన్. 34

ఉ. జ్ఞాతివధంబు నింద్య మనఁ జాలిన ధార్మికమూర్తి వేని నీ
వీతెఱి ధర్మముం దెలియ నెంచుచు మించఁగ నీకి కాలమే
నూతివిధంబునం బొడమి నూరెలవారల నెల్లఁ ద్రుంచుచోఁ
బాతిరిలాడు మిండకి శుభంబగుమార్గముఁ జూడ నొప్పదే. 35

తే. హింస వేదగర్హితము నహితము ననఁగఁ, గులవినాశనకార్యము కూడ దనుచు
వేఱ చెప్పఁగ వలయునే వేదవేత్త, వీ వెఱుంగవె నీశక్య మేది కాదు. 36

శా. నీ కీకార్య మనర్థదాయక మయె నిల్చెం దనర్థంబు నీ
వీకాలంబున ధర్మముం దెగడి రాజేంద్రావళిం గూర్చి పై
పై కేగం దలపోయు చుంటి వకటా పాటింపఁ బోకట్లు ధ
ర్మాకాంక్షం జను మాదునం గలుగు సౌఖ్యంబున్ యశంబున్ ధరన్. 37

ఆ. దానఁ బాండవులును ధార్తరాష్ట్రులుఁ బ్రజల్, సర్వలోకములును సౌఖ్యమందఁ
గలరు నీ కకీర్తి దొలఁగు స్వర్గం బగు, ననిన మెచ్చి కనియె నతని కతఁడు. 38

ఉ. ఈ వెతఁగించునర్థముల నేను నెఱుంగక యుండఁ బోను లో
భావ మభావముం దెలియువాఁడన యైనను స్వార్థమందు మో
హావిలుఁ డౌట లోకమునయం దగు నైజము నేను దానికిన్
దావుల నున్నవాఁడ నొకొ నామతి నీకు నెఱుంగఁ బోలదో. 39

ఆ. నీవె నాకు గతివి నిను వేఁడువాఁడ ధ, ర్మముల కర్థములకు మార్గదర్శి
కుఁడవు నడవఁ బోఁడు కొడుకు నామాటమై, నేమి సేయువాఁడ నీవ చెపుమ. 40

క. నామెడఁ గీడు దలంపకు, మోయయ్యా! వీరు వారు నొకరూపమ నీ
కీమెల్ల మది నెఱంగిన, నిమెడ నేఁ జెప్పువాఁడ నే తగవరి నై. 41

వ. అనిన నప్పరాశరాత్మజుం డది యట్లుండనిమ్మిప్పు డే నేమేని నీకుం జెప్ప నున్నది యే యనిన నతండు సంగ్రామవిజయ[1]లింగంబు లెట్టివి చెప్పు మనిన నతం డిట్లనియె.

—:సంగ్రామవిజయలక్షణంబులు:—

సీ. పొగ రాఁజ కగ్ని వెలుఁగ దక్షిణావర్తశిఖలతోడ సుగంధముఖుఁ డయి తగు
శంఖమృదంగముల్ సంతతగంభీరఘోషము లెసఁగ సంతోష మొసఁగు
సుప్రసన్నద్యుతి సూర్యుండు చంద్రుండు, పవలును రేయును బరఁగు చంద్ర
[2]సంప్రస్థితులకుఁ బృష్ఠమునందు ముందు వాయసము లింపగురీతిఁ బొసఁగఁ దీర్చు
తే. రాజహంసలు శుకములుఁ గ్రౌంచములును, శుభవచనములు వల్కుచుఁ జుట్టి వచ్చు
నట్టివారికి జయ మగు ననుచుఁ బండితులు వచింతురు సంగ్రామ మలరు నపుడు.

వ. మఱియు నెవ్వారిసైన్యంబున నలంకారంబులును గవచంబులును గేతువులును సుఖప్రణాదిమేకురంబు లగుటయు హయంబులహేషితంబులు గజంబులబృంహితంబులు మృదుమధురగంభీరంబు లై శ్రోత్రపర్వంబు లగుటయు నమ్లానపుష్పమాలాలంకృతు లై జోదులు ప్రమోదంబునం జేసి తమతమసత్వంబు లుగ్గడించుకొనుటయుఁ దమ్ముఁ జేర వచ్చినవారిం దోలుతఁ బ్రతిషేధించియు నవల నైపుణ్యంబును జేర్చుకొని సంతసించుటయు శబ్దస్పర్శరూపరసగంధంబు లవికృతంబు లై మంగళప్రదంబు లగుటయు నంబుదాంబువాయ్వింద్రచాపంబు లనుకూలప్రచారంబు లగుటయు లో నగునవి యగు నవి విజయలక్షణంబులు విపరీతంబులు పరాజయలక్షణంబులు. 44.

చ. అలఁతిబలంగ మైన బలమం దగుయోధులు సంతసంబునం
జెలఁగుచు నుండి రేని పరసేనల నెల్ల జయించుఁ బుత్త్ర య
బ్బలముల నాయకుం డొకఁడు భావమునం దిసుమంత జంకు మై
నిలిచిన నెల్లసేనలును నిల్వక త్రస్తము లై వెసం జనన్. 45.

క. విఱిగిన నాయామూఁకల, మఱియుం గూర్పంగ నరిది మతిపాటవముం
నెఱి మీఱ నబ్బు గలుగక, మఱి మఱి బోధించి బలము మనుపఁగ వలయున్. 46.

సీ. సామదానాదులఁ సాధింప వలయును, నేర్పరి కార్యంబు నెఱి నెఱింగి
సామాదులం గాక సంగ్రామమే సిద్ధ, మైన జయోపాయ మరయ వలయు
హర్షవర్ధితు లగు నైదుగు రార్గు రే, కలిగి మహాసేన గెలువఁ గలరు
నైన నేయుఁ డొకండ తా నెన్నియో పరుల్, పెక్కుసైన్యంబుల నుక్కడంచె,

1 లింగంబులు=చిహ్నములు; 2. సంప్రస్థితులు=పయనమైనవారు;

ఆ. బహుళసేనఁ గలిగి బలసి యుండినమాత్ర, గెలుపు గలుగు ననుచుఁ దలఁప రాదు
దైన మున్నవంకఁ దనరారు జయ మది, సిద్ధ మనుచుఁ జెప్పఁ జెల్లు నధిప. 47.
వ. అని చెప్పి సాత్యవతేయుం డాంబికేయు నామంత్రణంబు చేసి చనియె నంత ధృత
రాష్ట్రుండు నొక్కముహూర్తమాత్రంబు ధ్యాననిశ్చలమానస్కుం డై యుండి
కొండొకవడికి నిట్టూర్పు నిగిడించుచు సంజయుం బిలిచి యి ట్లనియె. 48.

- -:ధృతరాష్ట్రుండు భూమిమహత్త్వం బడుగుట:—

శా. [1]ఓగావల్గణి! విస్మయం బొదవు నాయుల్లంబునన్ భూపతుల్
రాగద్వేషము లంకురింపఁగ ధరారాజ్యం బపేక్షించి లో
నోగుం బాగుఁ దలంపఁ బోక బహుసైన్యోద్బోధముం గాంచి బా
హాగర్వంబునఁ బోరి చత్తు రిల నన్యోన్యంబు వైరంబునన్. 49.
ఆ. ఉర్వి యెంత తీ పొకో దానిమాహాత్మ్య, మెఱుఁగఁ జెప్పు నాకు నెల్లదేశ
నగరవృత్తములను దగ నెఱిఁగినయట్టి, వాఁడ వైతి వీవు వ్యాసకరుణ. 50.
వ. అనిన సంజయుం డి ట్లనియె. 51.
సీ. వినుము భూతంబులు ద్వివిధంబు లగుఁ జరాచరభేదమునఁ జేసి ధరణియందుఁ
జరములందు [2]జరాయుజము లండజములును, స్వేదజంబులు నాఁ ద్రివిధము లయ్యె
నం దుత్తమంబు లై యలరు జరాయుజ, ములు వానిలోఁ బ్రవరులు మనుష్యు
లాజరాయుజములు తేజరిల్లుం బదు, నాల్గుభేదంబుల నలువు మీఱి,
తే. యడవులం దేడు గ్రామములందు నేడు
వ్యాఘ్ర సింహ వరాహర్క్ష వాన రేభ
మహిషములు వన్యములు మేష మనుజ గో ఖ
రాశ్వతర హ యాజములు గ్రామ్యములు తెలియ. 52.
వ. ఇందు గ్రామ్యంబుల మనుష్యులు నారణ్యంబుల సింహంబులును శ్రేష్ఠంబులు
స్థావరంబు లుద్భిజ్జములు నాఁబడు భూజంబులు తరుగుల్మలతావల్లీత్వక్సారంబు
లనఁ బంచవిధంబులు నీపందొమ్మిదియు మహాభూతంబు లేనునుం గలిసి చతుర్విం
శతి యై గాయత్రీసమ్మితం బయ్యె సర్వసుగుణాన్వితం బగునీగాయత్రీతత్త్వం
బెఱిఁగినవాఁడు లోకజ్ఞుం డై వినాశనంబు నొందం బోఁడీయన్నియు భూమియంద
జననమరణంబులం బొందుటం జేసి సర్వంబునకు భూమియె సనాతనంబు నాస్ప
దంబు నయ్యె నని వెండియును. 53.

1 గావల్గణి=గవల్గణపుత్రుఁడు, సంజయుఁడు; 2 జరాయుజములు=మావియందుఁ బుట్టినవి;

ఇట్టిమహీతలంబున కధీశ్వరుఁ డై తగునట్టివాఁడు చూ
పట్టెడు నీజగంబునకు భారవహుం డగునీశ్వరుండు కాఁ
బట్టి భుజాబలంబునను బార్థివు లొండొరుఁ బోరి భూమికై
పట్టి పెనంగు చుండెదరు ప్రాణము లైనను డాఁప కెంతయున్. 54.

తే. అనిన ధృతరాష్ట్రుఁ డిట్లను నవనియందుఁ, గలుగునదులును బర్వతంబులును దేశ
ములును లోనగునన్నియుఁ దెలుపుమయ్య, సప్రమాణము గా నాకు సదమలాత్మ.

క. అనిన సంజయుఁడు వెండియు. 56.

—: సంజయుఁడు ధృతరాష్ట్రునకు భూపరికారంబు సెప్పుట :—

సీ. నీళ్ళు నిప్పును గాలి నేలయు నింగియుఁ, బంచభూతములు శబ్దమును స్పర్శ
మును రూపమును రసమును గంధమును వాని, గుణము లై యొప్పు నీగుణము లైదు
గలవు ధరిత్రికి గంధంబు గాక నా, ల్గుగుణంబు లగు నీళ్ళకు రసగంధ
ములు గాక తక్కినమూఁ డగ్నిగుణములు, స్పర్శశబ్దములు శ్వసనగుణములు,

తే. ఆకసంబునకుఁ శబ్ద మేకగుణము, తనరు నీరీతిఁ బంచభూతములు గలిగి
భూతముల కెల్ల నాధారభూతము లయి, నిండి యుండును జగ మెల్ల నృపవరేణ్య. 57

క. ఈశ్వరరూపంబు లైనవానిపరిమాణం బగోచరంబు వానికన్న విలక్షణం బైన
యొకమహాజ్యోతి సర్వప్రపంచంబు నిండి యుండు నదియే పరమాత్మస్వరూపం
బనియుఁ బరం బనియుఁ బెద్ద లెల్ల వితర్కింతు రాతత్త్వం బవాఙ్మానసగోచరం
బింక సర్వభూతోత్తమం బైనభూమితత్త్వం బెఱింగించెద సావధానచిత్తుండ వగు
మని మఱియును. 58

వెలయు[1]సుదర్శనద్వీపంబు చంద్రమండలమున దీపించి లలితదీప్తి
బహునదీనదవృక్షపర్వతనగరాదులను గల్గి లవణాబ్ధి తనకుఁ జుట్టి
సర్వౌషధీజలసమవాయసంభృతం, బై పిప్పలము శశ మందుఁ బోదలఁ
బూర్వాపరసముద్రముల నంటి కులపర్వతము లాఱు పొదలు సుదర్శనమున

తే. మేటు లై హిమవద్ధేమకూటనిషధ, నీలములు శ్వేతశృంగముల్ నా లలిఁ జను
నవి తదంతర[2]విష్కంభ మది సహస్ర, యోజనంబులు గలది యై యొప్పు చుండు.

క. సిద్ధచారణసేవితంబు లగునందుఁ బుణ్యవంతంబు లగుజనపదంబులును నానాజాతి
సత్త్వంబులును గలుగు హిమవత్పరం బగు నది యే భారతవర్షంబు హేమకూట
పరం బగునది హరివర్షంబు నీలపర్వతంబునకు దక్షిణంబుగను నిషధ కుత్తరంబు

[1] సుదర్శనద్వీపము=ఇదియే జంబూద్వీపము; [2] విష్కంభము=వ్యాసము, నడిమికొలత;

గను బ్రాగాయతం బై మాల్యవంతం బను మహాపర్వతంబు గలదు. దాని కవ్వల గంధమాదనం బప్పర్వతమండలమధ్యంబున మేరుపర్వతంబు కనకమయం బై విధూమపావకంబు గా వెలుంగు చుండు. 60

సీ. ఆపర్వతముపాఁతు చూపట్టుఁ బదియాఱు,వేలయోజనము లై వెలయు నెత్తు
పోలింప నెనుబదినాలుగువేలయో,జనము లాయాప్రదేశముల నిండి
భూకర్ణికాకృతిం బొలుపొందు నప్పైడి,కొండపార్శ్వంబుల నుండుద్వీప
ములు నాల్గు భద్రాశ్వమును గేతుమాలము, జంబు వుత్తరకురుస్థానము నన

తే. వాయసంబులు నచట సువర్ణపక్షములఁ దలిర్చును మును దానిఁ దెలిసి సుముఖుఁ
డనుసుపర్ణసుతుం డుత్తముని నధమునిఁ, దెలుప దిట నుండ రా దని తొలఁగిచనియె.

క. అవ్వైనతేయపుత్త్రుఁ, డవ్విధమున రోసి యరిగె నయ్యెక్కుడు గాం
గెవ్వారు మాన్యులో వా, రవ్వరశైలమున నుండి రతికుతుకమునన్. 62

సీ. గ్రహతారకేందుభాస్కరగంధవహు లెప్డు,వలగొనుచుండు నప్పర్వతంబు
బంగారుభవనముల్ రంగారు నక్కొండ,యంతటన్ బుష్పఫలాన్వితములు
గరుడగంధర్వరాక్షససురాసురు లట, నప్సరోగణముతో నాడుచుంద్రు
బ్రహ్మరుద్రాదు లాబంగరుకొండపై, వివిధయాగంబుల విస్తరింత్రు

తే. నారదాదులగానంబు దీరు నందుఁ, గశ్యపాదులు సప్తర్షిగణము పర్వ
పర్వముల వచ్చి కొల్తు రప్పర్వతంబు, గాపురం బుండెఁ గావ్యుఁ డాఘనగిరిపయి.

చ. రతనములున్ సువర్ణములు రాసులు రాసులు గాఁగ నమ్మహా
క్షితిధరమందుఁ బొందుపడుఁ జేకొని యందుఁ జతుర్థభాగ మా
శితిగళమిత్త్రుఁ డుర్విపయిఁ జెన్నలరారుమనుష్యకోటికిన్
సతతము సన్నుతింపఁగ నొసంగుచు నుండుఁ గళాంశ మాఢ్యుఁ డై. 64

ఉ. ఉత్తరపార్శ్వమం దచోట నుగ్రుఁడు వ్యగ్రుఁడు గాక కర్ణికా
రోత్తమకాననంబున సమున్నతి సన్నుతి సేయ భూతకో
ట్లెత్తఁ గర్ణికారములయెత్తులు దాల్చి సతీసమేతుఁ డై
చిత్తము పల్లవింప నివసించు లలాటపుటాగ్ని వెల్గఁగన్. 65

ఆ. ఉగ్రతపము చేసి యుత్తమవ్రతు లగు,సిద్ధమునులు గాక శివుని వాని
దుష్టవృత్తి నున్నకష్టులు గనఁ జాల, రెట్లు పాట్లు పడిన యేని గాని. 66

తే. నూఱువేలవత్సరము లేనొవ్వ లేక, శివునిశిరమున నెలకొన్నసిద్ధగంగ
క్షీరధార యై పడి మేరుశీర్షమందుఁ, జేసెఁ జంద్రహ్రదంబు ప్రసిద్ధి కెక్క. 67

నగుసంధియందు హిరణ్మయం బనువర్షం బగు నందు హైరణ్వతీనది ప్రవహించుచుండు నది సుపర్ణనినివాసస్థలం బచటివారు నిరామయు లై పదునొకండువేలయేనూఱువర్షంబు లాయుఃప్రమాణంబు గలిగి యుందురు శృంగవత్పర్వతంబు మణిమయస్వర్ణమయరత్నమయంబు లనమూఁడువిచిత్రశృంగంబులు గలిగి నానావిధదివ్యభవనంబులం బ్రకాశించుచుండు నట శాండిలి యనుస్వయంప్రభాదేవి నిత్యనివాసం బుండు శృంగవత్పర్వతంబున కుత్తరభాగంబున సముద్రాంతంబుగా నైరావతవర్షం బందు దివాకరనిశాకరాదుల ప్రభ యడంగి యుండు నందుండువారు పద్మవర్ణులు పద్మగంధులు పద్మనిభేక్షణులు నిరాహారులు జితేంద్రియులు నై జీర్ణింపక త్రయోదశసహస్రవర్షంబులు జీవింతురు క్షీరసముద్రోత్తరదిగ్భాగంబున నష్టచక్రంబును మనోజవంబును జాంబూనదవిభూషితంబును నగ్నివర్ణంబును భూతయుక్తంబు నగుశకటయానంబున భూతేశుండును సర్వభూతనియంత నైన వైకుంఠుండును నిచ్ఛావిహారంబులం దేలుచుండు రని చెప్పిన విని ధృతరాష్ట్రుండు సంజయుదిక్కు మొగం బై. 85

—: సంజయుఁడు భారతవర్షప్రభావము చెప్పుట :—

ఉ. కాలవశంబునం దెగు జగం బిది యంతయు నింతలోన నా
పై లలిమీఱ నెండియును భాసిలుఁ గాని యి టుండ దెప్పుడున్
1 జీలక యుండి విష్ణుఁడును జిష్ణుఁడు నిర్వురు నెల్లకాలముం
బోలుప నొక్కరూపమునఁ బొల్తురు నాశము లేనివార లై. 86

ఉ. భారతవర్ష 2గృధ్నులయి బాలిశు లై పృథ గన్నవారు నా
వారును బోర నుండి రిటువంటివివేకవిహీను లెందు నే
నారయ నుందురే తెలుప వయ్య! తదీయమహత్వతత్త్వ మో
సారమతిప్రభావ! యని సారెకుఁ బల్కిన సంజయుం డనున్. 87

మత్త. ఈవు చెప్పినరీతిఁ బాండవు లింత కృద్ధులు గారు నీ
భావ మి ట్లగు నీకుమారుఁడు బాలిశుండును లుబ్ధుఁడున్
కావలుం డగుసౌబలుం గొని కానికార్యము సేసి తా
నీవసుంధర యెల్ల నేలఁగ నెంచెఁ గించు తెఱంగునన్. 88

క. ఇంతకు వీరి సనం బని, గొం తైనం గలిగి యున్న క్షోణికిఁ గలతీ
పిం తింత యనఁగ శక్యమె, వింతయె వీ రిట్లు పడుట వినుము నరేంద్రా. 89

---

1 చీలక = విడిపోక; 2 గృధ్నులు = ఇచ్ఛగలవారు, ఇందునదులు మొదలగు పేళ్ళువివిధము లైయున్నవి.

—♦ సంజయుఁడు నదీనద్యాద్రిదేశాదు లెఱింగించుట ♦—

వ. తొల్లి దేవేంద్రుండును వైవస్వతుండును బృథుండును వైన్యుండును నిక్ష్వాకుండును
యయాతియు నంబరీషుండును నౌశీనరుండును ఋషభుండును నైలుండును నృగుం
డును గుశికుండును గాధియు సోమకుండును దిలీపుండును లోనగుమహారాజు లెల్ల
రును నానావిధ సౌభాగ్య భాగ్య సన్నిధానం బైనయీభారతవర్షంబున కాసఁ జేసి
వాసిం గాంచిరి దానిప్రభావంబు సవిస్తరంబుగ నభివర్ణించెద నాకర్ణింపు. మందు
మహేంద్రము మలయము సహ్యము శుక్తిమంతము గంధమాదనము వింధ్యము
పారియాత్రము ననునివి సప్తకులపర్వతంబులు వీని ననుసరించి సారవంతంబు లగు
పర్వతంబులు వేనవేలు వానియందు నార్యులు ననార్యులు మిశ్రులు ననుమూఁడు
తెఱంగులవారు విహరించు చుందురు [1]గంగ తుంగభద్ర విపుల సింధువు గోదా
వరి సరస్వతి నర్మద బాహుద శతద్రువు చంద్రభాగ యమున దృషద్వతి విపాశ
విపాప స్థూలవాలుక వేత్రవతి కృష్ణవేణి యిరావతి వితస్థ తాపి పయోష్ణి దేవిక
వేదస్మృతి వేదవతి త్రిదివ కరీషిణి చిత్రవహ చిత్రసేన గోమతి గండకి కౌశికి
నిశ్చిత నిచిత రహస్య శతకుంభ సరయువు చర్మణ్వతి హస్తిసోమ శరావతి భీమ
రథి కావేరి వీణ శతబల నీవార సుప్రయోగ కుండల రాజని పురమాలిని భీమ
యోఘవతి పలాశిని మహేంద్ర పాటలావతి యసిక్ని కుశచీర మకరి మేనహేమ
పురావతి యనుష్ణ శైబ్య తాప సదానీర కుశధార సదాకాంత శివ వీరవతి గౌరి
కంపన హిరణ్వతి వీరకర రథచిత్ర జ్యోతిరథ విశ్వామిత్ర కపింజల యుపేంద్ర
బహుల కుచీర మధువాహిని పింజల వేణి తుంగవేణి విదిశ తామ్ర కపిల సువామ.
వేదాశ్వ హరిస్రవ శీఘ్ర పిచ్ఛల భారద్వాజి శోణ బాహుద దుర్గ బృహద్వతి
యవక్షు రోహి జాంబువు సునస తమస దాసి వస వరణ యసి మాల ధృతిమతి
పూర్ణాశ తామసి వృషభ బ్రహ్మమేధ్య బృహద్రుతి సదానీర బ్రహ్మణి చిత్రరథ
మంజుల మందాకిని వైతరణి శుక్తిమతి పుష్పవేణి కరతోయ కుమారి ఋషికుల్య
మారిష సర్వసంగ మున్నగునదు లీభారతవర్షంబున భుక్తిముక్తి ప్రదంబు లంగ
వంగ కళింగ కాశ్మీర సౌవీర కురు పాంచాల సాల్వ మద్ర శూరసేన బోధ మాల
మత్స్య సుకుట్య సౌబల్య కుంతల కాశి కోసల చేది కరూష భోజ సింధు పుళింద
దశార్ణ మేఖ లోత్కల కౌశిజ భుజంగ జఠర కుర్కుర కుంత్యాపరకుంత్యవంతి
కామందక షండ విదర్భ రూపవాహి కాశ్వక పాంసురాష్ట్ర గోపరాష్ట్ర కరీతి మృగ

[1] ఇందునదులపేళ్లును, దేశములపేళ్లును, నానావిధంబులై కానవచ్చుచున్నవి యథార్థము దురవగాహము;

కేరళ సమవేగవశ చక్రావక్ర సృంజయ విదేహ మాగధ సుంహ మలయ విజయ
శల్లసుదేష్ణ మాహిషక శాశిక బాహ్లీక వాటధానాభీర కారజో షాపరాంత పరాంత
పహ్న వాటపీశిఖర మేరుభూ తోపావృత్తానుపావృత్త స్వరాష్ట్ర కేకయ మాహే
య కచ్ఛ సాముద్ర నిష్కుటాంధ్రాంతర్గిరి బహిర్గిర్యంగకులజ మానవర్జక
ముహ్యోత్తర ప్రావృషేయ భార్గవ పుండ్ర భార్గ కిరాత సుధేష్ణ యామున శక నిషా
దానత్తి నైరృత దుర్గల ప్రతిమాస్య కుశల తీవ్రగ్రహ శూరసేనేజక కన్యక తిల
భార సమీర మధుమత్త సుకుందక కాశ్మీర సింధుసౌవీర గాంధార దర్శకాభిసా
రోతూల శైవాల బాహుభార కౌరవ్య సుదామ సుమల్లిక బధ్న కరీషక వాతా
యన దశార్ణ రోమ కుశబిందు కచ్ఛ గోపాలకచ్ఛ జాంగల కురువర్ణక బర్బర
సిద్ధ వైదేహ తామ్రలిప్త కౌండ్ర మందగ సైసికత పార్వతీయ ద్రావిడ ప్రాచ్య
మూషిక వనవాసక కర్ణాట మాహిషిక వికల్ప ఝిల్లిక కుశల సౌహృద నల
కానన కౌకుద్రక చోళ కొంకణ మాళ వానక సమంగ కరకాంగార మారిష త్రిగర్త
సాళ్వసేన బక కోకరక ప్రోష్ఠ వింధ్యచులక పుళింద కల్కల మాలవ మల్ల కాప
రవల్లభ కుళింద కాలక కుంతక స్తనపాల దశీవిదర్భ కాంతిక తంగణ పరతంగణ
యవన చీన కాంభోజ సకృద్గ్రాహ కులస్థ రమణ దశమాలిక క్షత్రియ యోని
వేశ శూద్రాభీర ఘుళి రాంతచార లోమర హంసమార్గ కరభంజక ప్రముఖంబు
లనేక దేశంబు లీవర్షంబున సకలసౌభాగ్యసమన్వితంబులై కరంబు డంబు మీఱు.

చ. చక్కఁగ నేలుచుండినను క్ష్మాతల మియ్యది కామధేను వ
ట్లక్కఱ దీఱఁ గామముల నన్నియు నిచ్చుచు నుండుఁ గావునన్
మిక్కుటవంజేసి భూపతులు మున్నిఁ మెచ్చఁగ దీని కొండొరుల్
కుక్కలు వోలెఁ బోరుదురు కోరిక దీఱుట లేదు వారికిన్. 91

మ. అది గాన న్గురుపాండవుల్ మనమునం దాశించి భూమండలం
బెదఁ గార్పణ్యముఁ జేసి ఘోరరణముం దీనాఁడు చేవాఁడి మైఁ
బదునుంగిత్తుల మొత్తి మెత్తఁదనముం బాటింప కాత్మీయులం
దుద ముట్టింపఁగ నెంచు చుండి రని నీతోఁ జెప్పఁ గా నేటికిన్. 92

క. అని చెప్పిన ధృతరాష్ట్రుఁడు, మనమున గర్హించి దాని మానుము నాకున్
వినిపింపు భరతవర్షంబున మనుజాయుఃప్రమాణములు వినవలతున్. 93

వ. అనిన సంజయుండు నొడియు నిట్లనియె. 94

సీ. యుగభేదమున జనాయుఃప్రమాణము పెక్కు,దారులై యుండు నీభారతమున

నలుగాళ్ళ ధర్మంబు నడచుఁ గృతంబున, నాయువు నాల్గువేల్ హాయనములు
త్రేత ముక్కాలితోఁ దిరు ధర్మము మూఁడు, వేలేఁడు లాయు వై వెలయుచుండు.
ద్వాపరంబున రెండు ధర్మదేవత కాళ్ళు, రెండువే లేండ్లతో నిండు నాయు,

తే. వికలియుగంబునఁ ధర్మ మొక్క కాల, నిలుచు నాయుఃప్రమాణము దెలుపఁ జాల
మొకఁడు పుట్టక చచ్చు వేఱొకఁడు పుట్టి, యల్పకాలమునం జచ్చు నధిప! వింటె.

వ. కృతయుగంబునం దపోధనులు ధార్మికులు సత్యవాదులు మహోత్సాహులు మహాత్ములు పుట్టుదురు త్రేతాయుగంబున క్షత్రియులు చక్రవర్తు లాయుష్మంతు లగుదురు ద్వాపరయుగంబున మహోత్సాహులు పరస్పరజయైషులు నల్పతేజస్కులుం గలుగుదురు కలియుగంబున నీర్ష్య రాగము క్రోధము నామయము లోభము గలజను లుద్భయింతు రనిన ధృతరాష్ట్రుం డను. 96.

—: భూమిప్రశ్నము :—

తే. చెప్పితివి వర్షములు వానిచిహ్నములును, ద్వీపములు వానివిష్కంభవిస్తరములు
తెలియఁ జెప్పుము నాకు నఁ దెలిపె నిట్లు, శ్రద్ధధానుఁడ వగు మని సంజయుండు.

—: సంజయుఁడు ద్వీపముల తెఱంగు సెప్పుట :—

వ. ఈభూమండలంబున జంబూ ప్లక్ష కుశ క్రౌంచ శాక శాల్మలి పుష్కరంబు లన నేడుద్వీపంబులును లవ ణేక్షు సురా సర్పి దధి క్షీర జలంబు లను నేఁడుసముద్రంబులును గల వాడంబుద్వీపంబుకంటెం దక్కనుం గలద్వీపంబులును లవణసముద్రంబు కంటె నవ్వలిసముద్రంబులు న త్తరో త్తరద్విగుణ ప్రమాణంబు గలవై యున్న యవి వర్షంబు లెల్ల సముద్రపరివేష్టితంబు లందు నానాజనపదాకీర్ణంబును మణివిద్రుమచిత్రితంబును వివిధధాతురంజితానేకపర్వతోపశోభితంబును సిద్ధచారణసంకీర్ణంబును లవణసముద్రపరివేష్టితంబు నగు నీజంబూద్వీపంబు జంబూవృక్షంబున లక్షితం బగు దానివిష్కంభపరిమాణం బెనిమిది వేలు నాలునూర్లు యోజనంబులు దాని కినుమడి యై లవణసముద్రంబు భద్రం బగు. 98.

సీ. ప్లక్షవృక్షంబునఁ బ్లక్షంబు నా నొప్పు, ద్వీపంబు శాల్మలివృక్షమునను
శాల్మలిద్వీపంబు చనుఁ గుశస్తంబంబు, కలిమిఁ గుశద్వీప మలరు నందు
నమరు నాలు సునామ హేమ కుముద పుష్ప, వ త్కు శేశయ హరిపర్వతంబు
లట నేఁడువర్షంబు లౌద్భిద వేణుమండల సురథాకారములును గంబ,

తే. ళంబు ధృతిమంతము ప్రభాకరంబు కాపిలంబు నా నొప్పె గౌరవర్ణంబు గలిగి
చావు లే కుంద్రు జను లందు సంతతంబుఁ, జోరులును మ్లేచ్ఛు లచ్చటఁ జేరఁ బోరు.

సీ. క్రౌంచపర్వతమునఁ గ్రౌంచంబు నా ద్వీప,మగుఁ గ్రౌంచ వామన కాంధకార
కములు మైనాకముఁ గడల గోమందము, నిబిడంబు నా ధరణీధరములు
దేశంబు లేఁ డందు దీపించుఁ గుశలమ్ము,ను మనోనుగమ్ము నుష్ణమును బ్రావ
రకము సుగంధకారకమును మునిదేశ,మును దుందుభిస్వనంబును ననంగ,
తే. సిద్ధచారణసేవ్యము లిద్ధగుణము, లైనయాదేశములయందు నఖిలజనులు
గౌరవర్ణంబునం బొల్తు రారయంగఁ, బొందుపడి యుండుఁ గ్రౌంచ గోమందమందు.

వ. క్షీరపారావారపరివృతంబు శాకద్వీపంబు మహోన్నతశాకవృక్షంబునం జేర్పొం
దె నందు మేరు మలయ రైవతక శ్యామ జలధార కేసరి కౌమారంబు లనునేఁడు
కులపర్వతంబులలోఁ బ్రాగాయతం బగుమలయంబున జలధరంబులు పుట్టి ప్రవ
ర్తిల్లు చుండు జలధారంబునందుఁ బర్జన్యుండు జలంబుల సేకరించి కాలంబుల న్వ
ర్షంబులు వర్షించుచుండు రైవతకంబునందుఁ బితామహుండు రేవతీనక్షత్రముఁ
బ్రతిష్ఠించె నవమేఘప్రభాభాసమానం బగుశ్యామపర్వతంబునం గలవారు శ్యామ
లవర్ణంబునఁ గోమలగాత్రులై యుండుదు రాద్వీపంబున ననేకజనపదంబులు గల
వవి జరామరణవర్జితంబులు శివపూజాపరాయణు లగుజనులచే సేవింపంబడు వాని
బరిగణింపఁ దరంబు గాదు వానిలో మృగ మశక మానస మందగము లనునాలుగు
దేశంబులును గ్రమంబున నాలుగుజాతులవారికి నివాసస్థానంబులై యుండు నన
తంబు లగుమహానదులలో సిత కుమారి సుకుమారి కావేరక మణిజల చక్షుర్వర్ధని
యనునవి యాద్వీపంబునకు నత్యంతసౌభాగ్యసంధాయకంబులు. 10

ఉ. రాజును రాజదండమును రాజితమై తగునాస్థలంబునన్
దేజ మెసంగువారలకుఁ దెల్పఁగఁ గారణ ముండ దందఱున్
రాజకళావతంసుని నిరంతరముం భజియించువారలై
యోజ మెఱుఁగ స్వధర్మమున నొప్పుచు నుండెడువారు గావునన్. 11

సీ. పుష్కరపర్వతంబునఁ జేసి పుష్కర,ద్వీపంబు వెలసె నాద్వీపమందుఁ
బరమేష్ఠి యెప్పుడుఁ బరఁగు చుండును దేవ,దేవర్షిసేవ్యుఁ డై తేజ మెలసి
తత్పాలనంబునఁ దద్ద్వీపవాసుల, కేకొఱంతయుఁ గల్గ దెపుడుఁ గాని
సమచతురస్రమై చనదానిచెంగట, మండల మొక్కఁడు మహిత మగుచు,
తే. నందు నైరావతము వామనాంజనములు,పుష్పదంతము కుముదము మున్నుగా
దిగ్గజంబులు వసియించుఁ దెలుపఁ గొలఁది,గాదు తత్పరిమాణము కౌరవేంద్ర.
క. ఈభూపదముల నెల్లన్, శోభిల్లఁగఁ జేసి వెలుఁగు సూర్యుఁడు చంద్రుం

డాభగ్గణంబులు గ్రహములు, స్వాభావికశక్తి వానిచక్కియు వినుమా. 104

వ. ద్వాదశాత్మునివిష్కంభము [1] దశసహస్రయోజనంబులు మండలము ముప్పదియోజనంబులు విపులత్వం బేబదియెనిమిదియోజనంబులు చంద్రునివిష్కంభము పదునొకండువేలయోజనంబులు మండలము ముప్పదిమూఁడుయోజనంబులు విపులత్వం బేఁబదితొమ్మిదియోజనంబులు రాహుమండలవిష్కంభము పండ్రెండువేలయోజనంబులు పరిణాహము ముప్పదియాఱుయోజనంబులు విపులత్వము పదియోజనంబులు గావున రాహువు చంద్రసూర్యుల నాచ్ఛాదింపం గలుగుచున్నవాఁడని గ్రహసంప్రదాయ మెల్ల సంక్షేపంబుగ నెఱింగించి యిట్లనియె. 105

క. ఈభూపర్వం బెల్లను, బ్రాభవ మెసఁగంగఁ దెలుపఁ బడియెను దీనిన్
లో భక్తిఁ జేసి వినినను, వైభవములఁ బొందఁ గలుగు వసుధాప్రజలున్. 106

వ. అని చెప్పిన విని ధృతరాష్ట్రుండు సంజయుదిక్కుమొగం బై యిట్లనియె. 107

క. తడసితి సంజయ! నీ విఁక, వెడలుము మనవారియుద్ధవిధ మెల్ల నెఱిం
గేఁడుదాని కచ్చోట మసలక, వడి రమ్మని పనిచె నంత వరవచనములన్. 108

—* సంజయుఁడు ధృతరాష్ట్రునకు భీష్మపతనం బెఱిఁగించుట *—

వ. సంజయుండును సమ్యగ్విధంబున వాని వీడ్కొని సంగరాంగణంబునకుం జని సర్వంబు నెఱింగి యెఱింగినట్లు ధృతరాష్ట్రునికడకు వచ్చి వెచ్చ నూర్చుచు నిట్లనియె. 109

మ. అకటా! రాజబిడౌజ! సంజయుఁడ నభ్యామర్దముం జూచి నీ
దుకడం జెప్పఁగ వచ్చినాఁడ ఖలుఁ డామర్త్యోధనుం డేని కి
ల్మికి గర్వించుచు జూద మాడి రిణమున్ మేకోలు గావించె నో
సకలారాధ్యధనుర్ధరుం డతఁడు పెల్చుం ద్రెళ్ళె నె మందుఁ బో. 110

తే. బాహుబలనిర్జితారాతి భరితమహి, పవనుఁ డైనని నొండ్రె పదిదినంబు
లాహవము చేసి పాంచాలు నగ్రసుతుని, కైవడిం ద్రెళ్ళి శరతల్పగతుఁడయయ్యె.

వ. అని దుఃఖించుచు వెండియు. 112

సీ. ఇంద్రునంతటివాని కేని తొడ్పడి భయం, బుడిపె దేవాసురయుద్ధమందుఁ
గన్నతండ్రికిఁ గాఁగఁ గడుఘోర మగువ్రతం, బూనె నాదాశరా జో నపంగ
సేకమెరుం డయి లోక మెన్నఁగఁ గాశి,రాజకన్యకలకై ప్రాల్చె రిపులఁ
జాపగురుం డని చూప కక్కటికి మక్కటిపోరి రామునిఁ గండడంచె,

తే. నతఁడు సింహపరాక్రముఁ డహరహంబుఁ,బదియుఁగోటులుగా నేసి పాండుసుతుల

[1] ఈలెక్క సూర్యసిద్ధాంతాదులయందు భేదముగాఁ గనవచ్చుచున్నది.

బలఁగ మంతయుఁ జీకాకుపడ నొనర్చి,సోలి నేఁ డంపశయ్యపై వ్రాలె నకట.113

తే. ధనువు వక్త్రము శరములు దంష్ట్రలు వర,ఘనతరాస్త్రము నాలుక గాఁగ నొప్పు
నఖిలభీకరభీష్మసింహంబు నేఁడు, కూలె నేలకుఁ బాంచాలకులున కోడి. 114

వ. దీని కంతకును నీముదుర్మంత్రంబె మూలం బని చెప్పిన నప్పు డాధృతరాష్ట్రుండు
దుఃఖించుచు సంజయునిదిక్కు మొగం బై. 115

—♦ధృతరాష్ట్రుఁడు భీష్మపతనంబు విని దుఃఖించుట♦—

చ. కురునృపభూసు భీష్ముఁ డెటు కూలెనొ నేలకు నాశిఖండిచే
శరములచే హతుం డయి విసంజ్ఞత నెట్లు సహించెనో సుతుల్
దొర నటు కోలుపోయి యెటు తొట్రిలు చుండిరొ నీనుసుల్ వినం
గరము మదీయమానసము గంపము నొందెను నార్తిఁ గుందెదన్. 116

ఉ. ఎవ్వ రతండు పాండవుల కేస్త్రిఅఁ జూపుచుఁ దద్బలంబులం
ద్రవ్వఁగ నేయ నేగుతఱి ధీరతతో మును పోవఁ జాలిరో
యెవ్వరు వెంబడిం జనిరొ యెవ్వరు వానికిఁ దోడు సూపిరో
యెవ్వరు వానిఁ గ్రవ్వకొని యెప్పుడు నుండిరొ చెప్పు సంజయా. 117

ఉ. వేఁడివెలుంగు చీఁకటుల వేయికరంబుల నూడ్చిపుచ్చు న
ట్లోడ కతండు శాత్రవులయుబ్బర మెల్ల నడంచి వైచుచో
నేఁడు సమర్థుఁ డై యెదుర నేయఁగ నుండెనొ పాండవేయు లే
పోఁడిమిఁ దాకి కట్టెపుసు వుట్టఁగఁ జేసిరొ ముట్టఁ జెప్పవే. 118

మ. పదినాళుల్ పడవాలు గా నిలిచి చాపం బూని కోపంబునం
బదులున్ నూఱులు వేలు కోల లొకటం బాఱం బ్రయోగించుచుం
గదనంబుం బొనరించి శత్రుసమితిం గారించి కారించి యా
నదిసూనుండు ప్రశాంతుఁ డయ్యె నకటా నాభాగ్యదోషంబునన్. 119

క. కాలాగ్నిపోలెఁ బగఱ, గూలించుచుఁ గాల్చిపుచ్చి దుర మొనరించెన్
గాలికి విఱిగినమ్రా న్వలెఁ,గూలె నఁటే నేల కతఁడు కుంఠితబలుఁ డై. 120

తే. నాదుదుర్మంత్రమునఁ జేసి నదిసుతుండు, దుష్కరం బగుకర్మంబు తొడరి చేసి
బహులశరవర్షమున ముంచి పగఱ నింప్పు,పగిది నిట్లయ్యె నేమందుఁ బాపవిధికి. 121

ఉ. దేవదురాసదుం డయినదివ్యపరాక్రముఁ డమ్మహారథుం
డావసుధారథుం డెదిరినట్టిఁడ యైనఁ దలంకఁ డాతనిం
గావరు లైనపాండవులు కన్గొనఁ జాలుదురే దురంబునన్

ద్రోణివదియున్న కిట్టి దగుదోర్బల మెక్కడ వచ్చె సంజయా. 122

మ. జమదగ్నిప్రభవున్ రణాంగణమునన్ జాలిం బడం జేసె ము
న్నమరస్తుత్యుఁడు స్వర్ణదీసుతుఁడు ద్రోణాదుల్ గనుంగొనఁ బ్రాం
తమునం దుండ శిఖండిచేఁ బడుట విన్న న్నాదుచిత్తంబు దుః
ఖమయం బై కసఁ దత్తఱించెడిని నాకాలంబు దుష్టం బయో. 123

సీ. పేడి మాతండ్రిని గాడ నేయుచు నుండ, మనబలఁగం బెల్ల మ్రానుపడెనె
ద్రోణుండుఁ గృపుఁడును ద్రోణసంభవుఁడును, బ్రాణంబు లాసించి పాఱె రొక్క
దుర్యోధనుఁడు వానిదోర్బలం బునుగుటఁ, గని జోదులం దోడు పనుపఁ డేమొ
మొనకాఁ డొకం డైన మొనసి రక్షింపంగఁ, జన సాహసించినజాడ లేదొ
తే. కటకటా నామహ్హృదయంబు ఘనతరాశ్మసారమయ మయ్యెఁ గాకున్నఁ గౌరవులకుఁ
బ్రాణరక్షకుఁ డగునాతఁ డాజిఁ ద్రెళ్ళె,ననఁగ వినినంత నీఱు గా నగును గాదె. 124

తే. నారిమ్రోఁత లుఱుములు గా నారసములు,చినుకులు గ వానిచప్పుళ్ళు చిచ్చఱపిడు
గులు గఁ గామ్మొగు లట్లరిబలము నొంచి,మించువాని శిఖండి యోడించు టెట్లొ.125

తే. విశిఖఖడ్గాదులు మొసళ్ళు విండ్లు తరగ, లర్వములు సుళ్ళు దంతులు పర్వతములు
పత్తులు ఝషంబులుగఁ బొంగి పగఱ ముంచు,భీష్మసాగరమున కేఁడు వేల యయ్యె.

చ. కలఁడు నదీసుతుం డరులగం డడఁగింపఁగ నంచు నమ్మి పు
త్త్రులు భయ మేది పాండవులతోఁ బగఁ గైకొని పోరఁ జొచ్చి ది
ట్టలఁతివలెఁ రణాంగణమునందుఁ బడెం బడవాలు వారి క
క్కలన జయంబు గాంచుటకుఁ గల్గిన దిక్కెది యింక సూతజా. 127

ఉ. ఎక్కటికయ్య మైనతఱి నింద్రముఖామరు లెల్ల వేఁడ దా
నొక్కఁడ పోయి దానవుల నుక్కడఁగించి జయంబు వారికిన్
నెక్కొనఁ జేసినట్టిభుజనిర్జితలోకుఁడు భీష్ముఁ డీల్గె నా
నక్కట! శేషసైన్య మది యంతయు నీల్గె నటంచు నెంచెదన్. 128

క. తమగురునిఁ గూల్చి పాండవు, లమితద్యుతి రాజ్య మంద నై రనఁ గా ధ
ర్మముకన్న నధర్మం బే, తమ బలవత్తర మటంచుఁ జనుఁ జెప్పంగన్. 129

చ. జగమునఁ గల్గురాజులను సారెకు గెల్చినజామదగ్న్యునిన్
మగఁటిమి గెల్చినట్టినృపమాన్యుని ధన్యుని ధర్మశీలునిన్
బగఁ గొని గెల్చె సోమకునిపట్టి పరాక్రమవంతుఁ డంచుఁ బ
ల్కఁగ నగునో మహాఘ మిది గా దొకొ చీకుసఁ జేవ గల్గునో. 130

క. నాసేన నేఁడు మగనిం, బాసినసతిపోలె దిక్కు మాలిన దగుచుం
గాసిం బడి కొందలంబునఁ, గోసిల్లదె గొల్ల లేనిగోగణముగతిన్. 131

క. ఆతండు వెగినపడపడి, నాతనయు లగాధవార్ధి నావ మునింగిన
ట్లై తమరు జీవితాశం, జేతములం గలుగ నెంత చేడ్పడిరొ కదే. 132

తే. తపమునం శౌర్యమున బుద్ధిఁ ద్యాగమునను, ధృతిని శస్త్రంబునం గాని మృత్యుదేవ
తను గెలువ రాదు కాల మెంతలను నైనఁ, దనకుఁ గైవసముగఁ జేసి కొనును గాదె.

ఆ. ప్రొద్దు గ్రుంకినట్లు పో శాంతనవుపాటు, చిమ్మచీఁకటులను జేవ దక్కి
కుతిలఁగుడిచి యిప్పుడు కొడుకు లెట్లుండిరో, వారిగతి యిఁ కెట్టివాసి నగునొ. 134

ఆ. వారు వీరు నిట్టివారల ననిలోనఁ, గోలుపోయి నేత్రకూఁటి కాసఁ
జేసి చేసి తాముఁ జేడ్పడి పోదురు, క్షత్రధర్మ మెంత కష్ట మొక్కొ. 135

మ. బలవద్వైరముఁ గొన్ననాతనయు లేపాటొందఁ గానుందురో
తెలియం జాలక కుందునామనమునం దీపించుశోకాగ్ని భీ
ష్ములపాతం బనునేతిపాటు గయికొంచు న్మండి దీండ్రించు నే
నిలువం జాలను దానితాపమునకుం దీనుండ నైతిం గటా. 136

ఆ. ఇంత విన్నవాఁడ నెంత విందునొ మీఁదఁ, గొయ్యతనముఁ బూని కొడుకు బుద్ధి
నాదుమాటబడిని సడక కష్టంబులఁ, దలను నైచుకొనియెఁ దనకుఁ దాన. 137

—: సంజయుఁడు యుద్ధప్రకార మభివర్ణించుట :—

వ. అని దీనవదనుం డై దేవురించుచు దీని కిపు డెవ రేమి సేయుంగలరు కానిమ్ము కా
నున్న దెట్లునుం గాక మాన దామానధనుండు సేనానాయకుం డై భండనం బప్ప
దిదినంబు లెప్పగిదిం జేసె నామీఁద దుర్యోధనదుశ్శాసనకర్ణశకును లెట్లు ప్రవ
ర్తించిరి కురుపాండవసైన్యంబులకు సంగ్రామం బెట్లయ్యె నది యంతయు ననుక్ర
మంబుగ నెఱింగింపు మని విషాదవేదనాదోదూయమానమానసుం డయి ధృత
రాష్ట్రుం డడిగిన సంజయుం డి ట్లనియె. 138

ఉ. నీ వనినట్లు దోషమును నీపయిఁ బెట్టుకొనంగఁ బోక దో
షావిలుఁ డైననాకొడుకు కొకప్పుడు నానుడి నుండఁ డంచు వాఁ
డేవగఁ బోవు నావగను నీవును బోవుచు నింత తెచ్చి యి
ట్లీవగ పెల్ల వానితలనే పడ వేయఁగఁ జూతు వక్కటా. 139

ఆ. కొడుకు నిగ్రహింప నెడ నొల్ల కింతలు, చేసి యిట్టు లనుట చెల్లు నీకుఁ
దాను జేసినట్టితప్పు తానే గాక, తనదుప్రజలుఁ గూడ ననుభవింత్రు. 140

సీ. జాంబూనదపరిష్కృతంబు లై గజములు, మెఱుములతో నున్న మేఘము లన
వివిధశస్త్రాస్త్రసంభృతము లై రథములు, సలువొందు చుండెడునగరము లన
ధారాతిచతురంబు లై రమణించుచు,తురంగంబులు మహాతరంగము లనఁ
దీవ్రప్రతాపసందీపితకాయు లై, కెరలుపత్తులు కాలకింకరు లన,
తే. నొప్పి నానావిధంబు లై గొప్ప లైన, ధ్వజపతాకలు ముసలముల్ ధనువు లసులు
నలరఁ గా మొత్త మగుసైన్య మది మృగాళిఁ, బట్ట నొడ్డినవల నాఁగ మట్టు మీఱె. 149
వ. అట్టియవసరంబున.

—:కౌరవయోధులు యుద్ధమునకు వెడలుట:—

శా. శ్వేతోష్ణీషము శ్వేతకంకటకముల్ శ్వేతాంబరద్వంద్వముల్
శ్వేతచ్ఛత్త్రముఁ బూని తాడిసిడముల్ బెట్టించి తేరెక్కి ముం
దై తళ్కొత్తె నదీసుతుండు విమలం బై యొప్పునభ్రంబుపైఁ
బ్రీతిం బొల్చుహిమాంశుఁడో యనుచుఁ గీర్తింపంగ నై పెంపునన్. 150
తే. అట్లు సన్నద్ధుఁ డై వచ్చునాపగేయు, మునుమునఁ గని ధృష్టద్యుమ్నముఖ్యు లెల్ల
జృంభమాణ మయినమహాసింహముఁ గని, బెదరులేళ్ళ తెఱంగున బెదరి రపుడు.
సీ. తప్తచామీకరస్థగితవేదీ వైజ,యంతీసమంచితుం డై గురుండు
విమలసౌవర్ణగోవృషకేతనావృత,రథుఁ డై తనర్చె శారద్వతుండు
సింహసంహననప్రసిద్ధధ్వజప్రభా,రూపితాంగుం డయి ద్రోణసుతుఁడు
రజితవరాహవిరాజితోన్నతపతా,కాభిశోభితుఁ డై జయద్రథుండు
తే. బలసి తమతమచతురంగబలము లంటి, కొలువ రారాజునకుఁ బ్రీతి సలుప నెంచి
సమరసన్నాహ మెంతయు జతనుపడఁగఁ, జనిరి సన్నద్ధు లై యుద్ధజగతి కపుడు.
క. అతులితచతురంగబలాన్వితుఁ డుజ్జ్వలతేజుఁ డధికవిఖ్యాతయశః
ప్రతిపన్నజగత్త్రితయుఁడు, కృతవర్మ నుతింపఁ గదలెఁ గృతలక్షణుఁ డై. 153
క. పదివేలరథంబులు నిర్వదివేలగజంబు లన్నివార్వంబులుఁ దొం
బదివేలకాల్వు రొప్పఁగఁ, గదలెఁ గళింగేశ్వరుండు గదనంబునకున్. 154
ఉ. మాయల కిక్క యై కితవమాన్యతఁ గాంచి కుమారవల్లభుం
డై యలరారి పాండవుల కంతలు వంతలు ముట్టఁ జేసి పా
పాయితమూర్తి యై పగయ పండువ గా నెద నెంచు సౌబలుం
డాయతసేనతో నడచె నాహవభూమికి భూమి దద్దఱన్. 155
మ. బలసంతాన మనంత మై బలసి రా బాహాబలప్రౌఢిమం
దలితోక్షధ్వజుఁ డైనబాహ్లికుఁడు పౌత్త్రుం డైనభూరిశ్రవుం

డలరుం బుత్త్రుఁడు సోమదత్తుఁడును వెన్నంటంగ మింటన్ ధ్వజో
జ్జ్వలతేజంబు వెలుంగ సంగరమహోత్సాహంబునన్ వెల్వడెన్. 156

వ. మఱియుఁ గాంభోజరాజగుసుదక్షిణుండు నక్షీణబలుం డగుబృహద్బలుండును ఫలి
తబలోద్వృత్తుం డగుభగదత్తుండు నుత్తమతేజోవంతుం డగుకేతుమంతుండును
గేతుమన్మహారథప్రచలనానందు లగువిందానువిందులును సుందరరథరథ్యదంతావ
ళథనైభ్యుం డగుశైబ్యుండును నభిభ్యచ్చిత్రజైత్రసేనుం డగుచిత్రసేనుండును నానా
రిజనహృదయశల్యుం డగుశల్యుండును గల్యధనుర్గుణకిణాంకితతలుం డగుశలుండు
ను జలదుగ్రధన్వుం డగుక్షేమధన్వుండును మాహిష్మతీపురీపాలుం డగు
నీలుండును లీలాజితారిలోకు లగుకైకేయులును భీకరకరవాలభిండివాలాదిపరికరపరి
క్షిప్తారిలోకవర్మ్ముం డగుసుశర్మ్మయు నిర్మ్మలోజ్జ్వలనానావిధాయుధు లగునలంబుసహ
లాయుధులును సాయుధు లగు సాళ్వసౌవీరశూరసేనాభీరయవనపుళిందప్రభృతిప్రా
చ్యప్రతీచ్యోదీచ్యదాక్షిణాత్యు లగునానాదేశాధీశులును నాత్మీయచతురంగబల
విరాజమానులును రాజమాన్యానేకాలంకారాలంకృతాంగు లై సంగరాంగణం
బునకుఁ దుంగాభంగతరంగపరంపరలం బరిహసించుచుం బఱతెంచి రట్లయినపదియ
క్షౌహిణులబలంబును దుర్యోధనవశానుగంబును దదర్థబ్రహ్మలోకదీక్షితంబును
శాంతనవరక్షితంబు నై యుండె నప్పుడు పదునొకండవయక్షౌహిణితోఁ గురుక్షో
ణీశ్వరుండు మణిమయభూషణభూషితాంగుం డై ఛత్త్రచామరాదిరాజోపచారాప
చితులం గ్రాలుచు ఘనరత్నప్రభావిభాసితం బగుభుజంగమకేతనంబు భూతలం బెల్ల
మిఱుమిట్లు గొలుపుచుండ నిండువైభవంబున దివ్యాలంకారాలంకృతం బై దేదీప్య
మానం బగుదేవేంద్రునిగజేంద్రంబునుం బోనిగంధసింధురంబు నెక్కి ప్రక్కల
దుశ్శాసనదుస్సహప్రముఖు లగుకురుకుమారు లెల్ల వాహనారూఢు లై నిరూఢ
భక్తిం గొని పరివేష్టింప వందిమాగధస్తుతులం జిత్తగించుచుఁ జిత్తం బిగురొత్త
నత్తఱిఁ గ్రొత్తపెండ్లికిం బోవువానివైభవంబున భండనంబున కఖండకోదండ
పాండిత్యంబు దీపింప నేపు మిగిలి కయ్యంబునకుఁ గాలు ద్రవ్వుచుం జనియె నయ్యో
వసరంబున. 157

మ. అవనీశా! విను మట్టు లై నపదునొం డక్షౌహిణుల్ నీబలం
బవలన్ నీయనుజాతసూతిబల మేఁ డక్షౌహిణుల్ చూడఁ జె
ప్ప వినం గాని తెఱంగునం బ్రబలి కల్పంబం దనల్పక్రియన్
దవులం బొంగినసాగరద్వయము నాఁ దళ్కొత్తె మొత్తంబుగన్. 158

సీ. ఉభయసైన్యము లిట్లు యుద్ధమునకు సిద్ధ, మై మొనకట్టినయట్టినాఁడు
శశధరుండు[1] మఘావిషయగతుం డయ్యె గ్రహంబు లేఁడు పరస్పరంబు మింట
సంపాతమున వెల్గె సంజనితుం డగు,భానుఁ డుజ్జ్వలశిఖాభాసితుఁ డయి
రెండువిధంబు లై యుండిన ట్లగపడె, నక్కలు కాకు లాదిక్కునందు,
తే. మనుజమాంసాశ సూచించి మఱియుమఱియు, నఱచె నస్త్రశ్రీయిత్యాదు లైనదుర్ని
మిత్తములు భూతలంబున మొత్తము లయి, తోఁచెఁ గౌరవుల కనర్థసూచకముగ.
చ. అహరహముం బ్రభాతసమయంబున నిద్దుర లేచుచుం బితా
మహుఁడును ద్రోణుఁడుం జయము మాయమనందనుఁ డందుఁ గాత మం
చు హరిఁ దలంచి పల్కుచుఁ బ్రచోదితు లై మిముఁ గూడి యుండుటన్
దహతహత్రోడనే దుర మొనర్తురు మెత్తురు వారి నెత్తిటన్. 160
వ. ఆకర్ణింపు మవ్విధంబునం గూడియున్నప్పుడు భీష్ముం డెల్లరాజులం బిలిచి యి
ట్లనియె. 161

—:భీష్ముఁడు నిజయోధుల కుత్సాహంబు గలిగించుట:—

మ. వినుఁడో క్షత్రియులార ! క్షత్రియులకున్ విఖ్యాతధర్మంబ యై
చను సంగ్రామ మి దెన్నఁ గా విస్తృత మాస్వర్గంబుద్వారంబు నీ
నిని నాభాగయయాతిముఖ్యనృపతుల్ నిర్మించి యుద్ధాన నే
చని యింద్రాజముఖామరోత్తమమహాస్థానంబులం దుండఁగన్. 162
ఉ. ఎప్పటి కైనఁ జావు నిజ మెంతటివారికి నైన నింటిలో
ముప్పిటి యైనరోగమున మూల్గుచుఁ జచ్చుటకంటెఁ బాపముల్
చెప్పఁగ నుండునే మఱియుఁ జెప్పఁగ నేటికి మీరు ధీరు లై
మె ప్పొడఁగూడ నావిధము మేకొని స్వర్గసుఖంబు నొందుఁడీ. 163
తే. అనుచు నుద్దీపనము సేయునాపగేయు, నభినుతించుచు నౌఁ గాత మనుచు మెచ్చి
యిచ్చకొలఁది వచించుచు నేగి రెల్ల, నిజబలంబులలోనికిఁ నేర్పుఁ గూర్చ. 164
ఉ. అప్పుడు భీష్ముఁ డి ట్లనుచు నాజ్ఞ యిడెన్ రణ మే నొనర్చు చు
న్నప్పుడు శస్త్రముల్ విడి దురాత్ముఁడు కర్ణుఁడు బంధుయుక్తుఁ డై

[1] శశధరుఁడు మఘావిషయగతుం డయ్యె ననఁగా మఘాశబ్దముచేతఁ దత్సహచరు లగుపితృదేవతలని యర్థము గ్రహించునది. వారివిషయము పితృలోకము. చంద్రుఁ డట సన్నిహితుఁ డయ్యె ననియు. స్వర్గమున కేగువారికి దివ్యదేహలాభము చంద్రాధీన మనియు శాస్త్రము. చంద్రుఁడు మఘానక్షత్రమును బొందె నని చెప్ప నొప్పదు. మఘానక్షత్రమున భారతయుద్ధము కాలేదు. పూర్ణిమాంతమాసపక్షమున మార్గశీర్ష శుక్లచతుర్దశి నాఁడు మృగశీర్షానక్షత్రమున యుద్ధప్రారంభ మని సిద్ధాంతీకరింపఁబడి యున్నది.

చెప్పినయట్లు వాసి చనఁ జెల్లును నావుడు నీకొమారుఁ డా
చొప్పున వానినీక విడిచి సొం పలరారఁ గ నేగె నాజికిన్. 165

సీ. తానుఁ దమ్ములు నట్లు తరలునప్పుడు సింహ,నాదముల్ భేరీనినాదములును
శంఖరావంబులు సంకుల మై తోఁచె, రథనేమిఘోషముల్ ప్రబలఁ జొచ్చె
ఛత్త్రచామరములు చారుకేయూరాది,భూషలు రుచు లీనెఁ బుడమి నిండ
మణికాంచనప్రభామహితంబు లగుచున్న,తపతాక లాకస మపుడు గప్పె,

తే. నెల్లజోదులు నుత్సాహ మెసక మెసఁగఁ, దమతమసిడంబు లెల్లెడఁ దళుకు లొత్త
నుత్తమాశ్వములు రథంబు లొప్పుచుండ, శాంతనవుఁ జుట్టి నడచిరి సమరమునకు.

తే. అట్లు సన్నద్ధ మై వచ్చునట్టిసేన, సంతతియును జూచి సేనాని సంతసమున
నఖిలయుద్ధవిశారదుం డైనకతన, మానుషవ్యూహ మొక్కఁ డమర్చె నపుడు.

వ. అమానుషం బైనయమ్మానుషవ్యూహంబునకుఁ బశ్చిమాభిముఖుం డై తా నగ్రభాగమున నిలిచి వలపల శకయవనసకిరాతసేనలతోఁ గృపాశ్వత్థాములును దాపల శల్యకృతవర్మలును బృష్ఠభాగంబున బాహ్లీక సోమదత్త భూరిశ్రవశ్శలాదులును మధ్యంబున సాళ్వకేకయసైంధవగాంధారరాజులును బరివేష్టింపఁ గురుకుమారశతంబుతో దుర్యోధనుండును వానిముందఱ నర్జునుం జంపుదు మొండె చత్తు మొండె యని యున్నసుశర్మప్రముఖు లైనపదివేవురు సంశప్తకులును వెనుక నెల్లమూఁకలకుం గావలి గా నాచార్యుండును మఱియు నెడనెడం దక్కినవారును నిలువ నియమించి యెల్లవారికి మున్ను లక్షగజంబులును గజంబునకు నూఱు తేరులును దేరునకు నూఱుగుఱ్ఱంబులును గుఱ్ఱంబునకుఁ బదుగురు ధనుర్ధరులును ధనుర్ధరునకు బదుగురు ఖేటకధరులు నడ్డం బై నిలుచునది యని యట్లు చేయించిన నది సర్వతోముఖం బై యెల్లవారి కానందం బొసాదించె నని చెప్పిన విని ధృతరాష్ట్రుండు.

తే. ఇట్టివ్యూహము లెన్ని యే నెఱిఁగినట్టి, కురుపితామహువిపుల మై పరఁగుసేన
నల్పసేనాసమేతుఁ డాయమతనూజుఁ, డెఱిఁగి యేరీతి వర్తించె నెఱుఁగఁ జెపుమ.

వ. అనిన సంజయుం డతని కి ట్లనియె నట్లు పితామహరక్షితం బయినసైన్యంబు దైన్యంబు దక్క యుక్కు మిగిలి క్షయ్యంబునకుఁ గాలు ద్రవ్వుచుండె నని విని పాండవసైన్యంబునుం బోలికలనికిం బయనం బయ్యె నయ్యెడ. 170

సీ. భూరిభేరీపటహారవములు హెచ్చి, భూనభోంతర మెల్ల బూరటిల్ల
హేళిఖురోద్ధూతధూళిపాళి నభంబు, ముట్టి చండాంశుని ముసుఁగు వెట్ట
మత్తదంతావళమదధార లేక మై, వసుధాతలము నిండ వఱ్ఱు వాఱ
వీరజనవ్రాతఘోరహేతిచ్ఛటల్, వివిధభాగంబుల వెల్లి విరియ,

తే. బహుళసేనాసమేతుఁడై ప్రభుజనోచి,తోపచారంబు లన్నియు నొప్పచుండ
ననుజతనుజాదిపరిజనం బంటి నడువ, వెడలె ధర్మసుతుండు దోర్వీర్య మెసఁగ. 171

—♦ పాండవయోధులు యుద్ధమునకు వెడలుట ♦—

చ. ఘనభుజయుగ్మమందు గద గ్రాలఁగఁ గార్ముకబాణతూణముల్
తనరథమం దెసంగఁగ నుదగ్రగతిం గనుఁదోయి కెంపు సొం
పెనయఁ బదాహతిం ధరణి యెల్ల వడంకఁగ లోహితాస్యుఁడై
కనుఁగొనుచున్ సభంబు దెస గంధవహాత్మజుఁ డాజికిం జనెన్. 172

సీ. తనజైత్రరథరథ్యధాళధళ్యద్యుతుల్, గగనభూభాగముల్ గప్పికొనఁగఁ
దనచిత్రరత్నకాంచనపతాకాగ్రంబు, మర్కటధ్వనులచే మట్టుమీఱఁ
దనక్షాత్రసముచితోదగ్రగాండీవగుణం బద్రు లవియ సతంబు మ్రోయఁ
దనపాత్రిదేవదత్తసముద్భవధ్వనుల్, ప్రళయాబ్దగర్జలఁ బ్రతిఘటింపఁ,
తే. దూణముల నక్షయంబులై బాణసంక్తు
లెగయ నొగలఁ బగ్గము లూని కృష్ణుఁ డెసక
మెసఁగఁ దోడి బొండళము భూష లెన్ని యేని
దాల్చి విజయుండు గదలెఁ బ్రధనముఁ గోరి. 173

ఉ. కయ్యము వియ్యమం చెపుడుఁ గ్రందొవవిందుగఁ గందు మంచులో
నెయ్యముఁ దియ్యముం గలిగి నేర్పును గూర్పును సంఘటిల్ల న
క్షయ్యభుజాబలం బెసఁగ సైనికకోటికి నుబ్బు వెల్పుచుం
జయ్యన వచ్చి రక్కవలు సంగరరంగమునుం గనుంగొనన్. 174

శా. శోభాప్రాభవవైభవాంచితరథస్తోమంబు తెమ్మంటి రా
సౌభాగ్యంబు జగజ్జనం బెఱుఁగ దోస్సారంబు తోరంబు గా
భూభాగంబు చలింప భూరిరథముల్ భూషించుచున్ వచ్చి రా
సౌభద్రుండును ద్రౌపదేయులు నుగంచచ్చౌర్యగర్వోన్నతిన్. 175

ఉ. యాదవవాహినీపరసహస్రమజస్రముఁ దన్నుఁ జుట్టి రా
భూదయితుల్ నుతింపఁగ సభూతపరాక్రమనిక్రమంబునన్
మోదముతోడఁ జెండిలికిఁ బోయెడునట్లు భవచ్చమూసమూ
హోద్ధృతమూర్తియై వెడలె నాజికి నాశనివీరుఁ డుద్ధతిన్. 176

క. తన్నటు లవమానించిన,మన్నీఁ డగువానిఁ జక్కడఁగించి పగన్
విన్ననఁ వొప్పం దీర్పఁగ, నన్నది తఱి యని శిఖండి యుబ్బుచు నడచెన్. 177

మ. యమరాట్కింకరతుల్యులై విమతశల్యప్రాయులై సాయుధో
త్తమహస్తాక్షరులైనరాక్షసు లభేద్యవ్యూహముం బన్ని త
న్నమితోజోధృతిఁ జుట్టువాఱుకొన నస్యచ్చాపశస్త్రాస్త్రుఁడై
సమరోత్సాహమునన్ ఘటోత్కచుఁడు పెల్చన్ వచ్చె నద్భుటికిన్. 178

సీ. అరిభయంకరమహాహీనా త్తరపరివారంబు, తోరమై తోరాఁగ ద్రుపదవిభుఁడు
పుత్త్రమిత్త్రాన్వితభూరిసేనావార, మేటుఁ జూపుచు రా విరాటనృపతి
మాద్యద్గజసమూహమండితభూభాగుఁ, డై గంధగజ మట్లు మాగధుండుఁ
సహామహామికతోడ నాల మాసించెను, సేనాశతముతోడఁ జేకితానుఁ,

తే. డుద్యదాయుధమ్ములతోడ నుక్కుమిగిలి, వీరభటు లెంద తేఁ దనవెంట నంటఁ
బాండ్యపతియును గేకయపంచకంబు, ధృష్టకేతుఁడు శైబ్యుఁడుఁ దీరి చనిరి. 179

వ. మఱియుం గాశకరూశాదినానాదేశాధీశులుం దమతమసేనాసమూహంబుతో
సన్నద్ధులై యుద్ధంబునకుఁ గదలి రిట్లు మొత్తం బయినసప్తాక్షౌహిణీసైన్యంబు
నకు నగ్రభాగంబున. 180

శా. విద్యుద్భానుసహస్రముం దెగడ నై వెల్గొందు వేణుధ్వజ
ప్రోద్యద్దీప్తులు నల్గడన్ విరిసి పెంపుం గూర్పఁ జిత్రాశ్వసం
పద్యుక్తిన్ రథరాజ మెల్లెడ వడిం బాఱన్ విరాజిల్లి ధృ
ష్టద్యుమ్నుం డరుదెంచె మించి సమరోత్సాహంబు రెట్టింపఁ గన్. 181

వ. అట్టియెడం బాండవాగ్రజుండు గండుమిగిలి భండనోత్సాహసంవర్ధితచతుర్విధ
సేనాసమూహం బుడివోనిసాహసంబు నెఱయఁ గేతువాసితంబు మెఱయఁ దన్నుఁ
బరివేష్టింప శంఖదుందుభిప్రముఖవివిధవాదిత్రనిస్వనంబులును వీరయోధసింహ
సినాదంబులును గజబృంహితంబులును దురంగహేషితంబులును రథనేమినినదంబు
లును వెల్లివిరియ శ్వేతచ్ఛత్రచామరాదిరాజోపచారంబులు సెలంగ నత్యుదార
విభూతిం గదలి పోవుచు నందు నందు శుభనిమిత్తంబులు చిత్తగించుచు సంగ్రా
మరంగంబునకు నేగుదెంచి గాంగేయనిర్మితం బయినభవదీయసేనావ్యూహంబుం
జూచి సవ్యసాచిం బిలిచి యి ట్లనియె. 182

ఉ. తొల్లి వచించె గీష్పతి ప్రతుష్టమతిన్ మొనకట్టియున్నచో
నల్లన గెల్చు నల్పబలమైనను మేటి నటంచుఁ గాన మీ
రెల్లరుఁ బిండు కట్టి యెడ మీఱక పెనంగుఁ డలంతి యైన ను
త్ఫుల్లగతిం జయించు మనమూఁకయె కైకొని వారిమూఁకలన్. 183

వ. అని మఱియును. 184

క. ఆవ్యూహంబు నెదుర్పం, గా వ్యూహము నొక్కదానిఁ గల్పింపు మిటన్
సవ్యాపసవ్యమార్గము, లవ్యాహతగతి నెసంగ నగు నెయ్యెడలన్. 185

వ. అనిన నర్జునుం డన్న కిట్లనియె. 186

— ♦ అర్జునుండు ధర్మరాజున కుత్సాహంబు గలిగించుట ♦ —

తే. దేవ! యీమొగ్గరం బెంత దీని మించు, మొగ్గరము వజ్రనామముఁ బొంది యచల
రూప మై యుండి దుర్జయ మై పురందరుండు వన్నించె దీనిని భండనమున. 187

క. మనబలఁగ మలఁతి యనుచున్, మనమునఁ దలఁపంగ నేల మనభీముఁ డొకం
డనిమొన నిలిచిన శాత్రవజనమంతయు బెండువడదె జగతీనాథా. 188

సీ. మనకుఁ బెట్టనికోట యనవచ్చు భీముని, ప్రాపున మనసేన ప్రబలిన దగుఁ
బ్రళయానిలమురీతిఁ జెలరేఁగెనే వాని, యెదుట నిల్వఁగలార లెవ్వ రందు
మూఁకలమొనఁ జేరి మొనయు నాతనిఁ గాంచి, నంతనే పెరమూఁక లంతరించుఁ
గురుకుమారులు వానిఁ బరికించి రే మృగపతిఁ గన్నలేళ్ళు నాఁ బఱవకుండ్రె,

తే. యమరులకు నింద్రుఁడుం బలె సతతము మనకుఁ
బెద్దప్రాపు గలండ యబ్బిరుదుమగఁడు
కేల గదఁ బూనె నేఁ జెప్ప నేల నింక
మనబల మొకింత యని చింత మనకుఁ దగునె. 189

వ. మఱియు ధృష్టద్యుమ్నప్రముఖు లగు పాంచాలకుమారులును శైనేయుండును విరాటద్రుపదులును సౌభద్రహైడింబప్రభృతికుమారవర్గంబును పాండ్యకేకయచేకితానాదిదేశాధీశులును నీకృష్ణసాహాయ్యంబు సంజేసి చేయరానికార్యం బైనఁ జేయఁ జాలుదు రని చెప్పి చెప్పినచొప్పునఁ దమసైన్యంబున నచలవ్యూహంబు వన్నించె దానిముందఱ మాద్రేయద్రౌపదేయసౌభద్రులు దనకుఁ జక్రరక్షకులు గా భీమసేనుండు బాసట గా ధృష్టద్యుమ్నుండును సాత్యకిచేకితానులు దక్షిణోత్తరంబులందును ననుజతనుజసమేతు లగువిరాటద్రుపదులు పశ్చాద్భాగంబునందును జైద్యకేకయాదు లందు సందును నిలువ ధర్మనందనుండు సకలపరివారపరివృతుం డై మధ్యభాగంబునందు నిలిచె సవ్యసాచి యుధామన్యూత్తమౌజసులం దనకుఁ జక్రరక్షకులు గాఁ గొని శిఖండిఁ దనవెనుక నిడుకొని దేవవ్రతున కెదురుగాఁ బశ్చాద్భాగంబునందుఁ బొందుపడి యుండె నిట్లు సైనికులు సంగరోత్సాహభరితాంతరంగు లై యుండి యాసమయంబున నర్జునుండు గదావిహారంబు సేయుచున్న వృకోదరుం జూపి యుధిష్ఠిరున కిట్లనియె. 190

మ. ధృతరాష్ట్రాత్మజు లెట్లు భీముఁ గని భీతిం బొందుచున్నారొ చూ
చితె యీతం డొకమర్త్యమాత్రుఁ డని నీచిత్తంబునం దోచె దో
క్షితినాథోత్తమ! యుత్తరస్వి భుజశక్తిం జేసి చేఁ బూని య
ద్భుతరీతిన్ గద నిక్కఁ బెట్టెడి మహాంభోరాశినే వీతిలోన్. 191

వ. అని ప్రశంసించునంత. 192

తే. రెంటు ముగ్గురములఁ గ్రాలుచుండునట్టి, టెక్కియంబు ల వన్నియు డీలుపడియె
విజయుకపికేతనంబున వెలుఁగు మండు,మారుతికిఁ గౌరవక్ష్మాతలేంద్ర. 193

మ. విచలచ్చండభుజద్వయమ్మున గదం బేరెమ్ములు న్పాఱఁ ద్రి
ప్పుచు నిప్పుల్ గురియించుచున్ దపనుచొప్పం జొప్పడం గొన్న క్రూ
రచరిత్రుం బవమానపుత్త్రుఁ గని ధైర్యస్థైర్యముల్ వీడ నీ
దుచమూనాయకు లెల్ల సంభ్రమమునం దూఁగాడి రట్టిట్టులై. 194

వ. ఇట్లు ప్రభాతసమయంబున నుభయసైన్యంబులును యుద్ధంబునకు సన్నద్ధంబులై
మొనసి యున్నంత. 195

మ. జలదంబుల్ నభమందు లేక కఠినఝంఝావాతముల్ వీచె మి
క్కిలి ధ్వాంతమై రేఁగి పరాగ మెల్లకడలన్ గింపాకమై క్రమ్మె ది
క్కులఁ బెంజీఁకటు లయ్యెఁ బ్రాఙ్ముఖము గాఁ గూలెన్ మహోల్కాతతుల్
చలియించెన్ ధర తేజముం దొలఁగ భాస్వంతుం డొగెన్ వింతగన్. 196

వ. అప్పుడు ముప్పిరిఁగొనియున్న నీసేనం జూచి ధర్మనందనుండు డెందంబునఁ గొం
దలం బందుచు సంక్రందననందనుం దిలకించి యిట్లనియె. 197

ఉ. సంగరతత్త్వవేత్త యగు శాంతనవుండు విశాలశాస్త్రదృ
ష్టిం గని మొగ్గరం బొరులు చేరఁగ రాని తెఱంగునం బొన
ర్చెం గద దీని నెట్లు మనసేనలు గెల్వఁగఁ జాలు నంచు లో
నం గడు సంశయించెద నన న్విని వాసవి వాని కిట్లనున్. 198

శా. భీష్మాదుల్ జగజెట్టు లీబలమునన్ బెంపొందుచుండంగ నీ
వీమాడ్కిన్ మది సందియంపడఁగ నేలే తొల్లి దేవతల్ సం
గ్రామంబందు బలాఢ్యులైన దనుజవ్రాతంబుతోఁ బోర తే
మేమో యంచు భయంబున న్నిలువ లోకేశుండు ప్రత్యక్షుఁడై. 199

తే. బలము వీర్యము గలిగినఁ బగఱ గెలువ, నరిది సత్యము ధర్మము నానృశంస్య
మున్న గెలుచుట సుకరమై యుండు మీరు, ధర్మపరులరు గెలుతు రధర్మపరుల.

వ. అని వారి నూఱడించి రణంబునకుం బురికొలిపి గెలిపించె నని నాకు నారదుండును
భీష్మద్రోణులునుం జెప్పిరి కావున ధర్మతత్పరుల మైనమన కీయుద్ధంబున విజయంబు
సిద్ధాంతం బని మఱియును. 201

తే. మున్ను సురల కసురులతోఁ బోరు పడిన, నందలఁ గు లైన హరిప్రాపు నొందుకతన
సురలు గెలిచిరి మేటు లౌ నరుల నోర్చె,ననుచు నెఱిఁగించె నారదమునివరుండు.

క. హరి గలఁడు మనకుఁ బ్రాప్తై,పరమేశ్వరుఁ డతనికి రుణ బడసినమనకుఁ
దురమున జయ మగు ఁటంటి, భరమో పరికంపు మీాద పార్థివముఖ్యా. 203

వ. అనిన నూఱడిల్లి ధర్మతనయుం డుత్సాహసముల్లసితుం డై సేనల కెల్లం బ్రోత్సా
హంబు గలిగించుచుం దనకుఁ బ్రదక్షిణాగతు లైనహుతపురోహితప్రముఖభూదే
వతలయు దేవమునలయు బ్రశి నాపురస్సరాశీర్వాదంబు లందుకొనుచు గోసూ
హిరణ్యాదిదానంబు లెన్నియేనియుం జేయుచు సర్వసన్నాసమంచితుం డై సంగ
రాంగణం బలంకరించె నాసమయంబున. 204

చ. ధ్వజమున సంజనాసుతువిధాళిధళిద్యుతి వేవెలుంగు నా
గజిబిజి సేయుచుం వెలుఁగఁ గాంచనరత్నరథ బు డై మహా
భుజుఁడు యదూద్వహుండు తనముందుఁ దలిర్పఁగ నొప్పి వచ్చున
వ్విజయునిఁ గాంచి నీదయిన విస్ఫురితసైన్యము దైన్యముం గొనెన్. 205

ఉ. ఆయతబాహుఁ డై మదగజాదుల నాహవమునఁ బట్ట చా
నేయఁగ నోప కోపరస మొంతయు వింతగఁ గ్రుక్క చున్న నా
గాయుతసత్త్వునిం బవనునాత్మభవుం గని నీతనూభవుల్
పాయలు విచ్చి బమ్మెరలి పాఱి రటన్ భయభగ్నసత్త్వు లై. 206

వ. అట్టియవసరంబున హృషీకేశుండు గుడాకేశుం గాంచి యి ట్లనియె. 207

—:అర్జునుండు కృష్ణునిపంపున దుర్గాస్తవంబు చేయుట:—

తే. పృథివిఁ గలరాజకోటి మున్యేఁడుమార్లు, వెదకి గెలిచినరాముని కెదుర నిలిచి
పోడిచి గెలిచినవాఁడు భీష్ముఁడు దలంప, వానితోఁ బోరు ఘోర మెవ్వానికైన.

వ. కావున నీవిపుడు శుచి వై సంగ్రామాభిముఖంబుగం గూర్చుండి శత్రుపరాజ
యార్థంబు దుర్గాస్తోత్రంబు గావింపు మనిన నతం డట్ల కాక యని రథావతరణంబు
గావించి మోడ్పుఁగేలు ఫాలంబునం గీలించి ముకుళితనయనయుగళుం డై భక్తియు
క్తాంతరంగంబున దుర్గానుసంధానంబు గలిగించుకొని యి ట్లని ప్రార్థించె. 209

తే. సిద్ధసేనాని! మందారసిద్ధవనని,వాసినీ! కృష్ణపింగలభాసురాంగి!
భద్రకాళి! మహాకాళి! రుద్రపత్ని!, చండికా! నీ కిదే నమస్కార మమ్మ.

తే. దైత్యసేన వోలెఁ దగెఁ గౌరవులసేన, దేవసేనవోలె శీవి మెఱసెఁ
బాండుపుత్త్రసేన పరికింప నయ్యె నా,వసుధఁ గలుగు నెల్లవారి కపుడు. 227

వ. అని చెప్పె నని చెప్పిన విని జనమేజయుం డవ్వల నెట్లు నడచెం జెప్పు మని వైశం
పాయను నడిగె నని చెప్పుటయును. 228

క. ఆనైమిశవనవాసులు, మానసమున సంతసించి మాన్యచరిత్రా!
మానధను లట్లు పోరికి, నై నిలిచిరి పిదప నెట్లు లయ్యెం జెపుమా. 229

—♦ ఆ శ్వా సాం త ము ♦—

మ. జననంబుల్ మరణంబు నెట్టివెత కై సంధిల్లునో తొల్లి నే
ననుభూతంబుగ లోనెఱుంగుదును గర్భాంత్రంబులం జిక్కి తాఁ
పను గాశ్యాడమిఁ గళ్ళె కుత్తుకకుఁ గప్పల్ శ్వాసముల్ స్వామి యా
ఘన కైతిల్ భయ మయ్యె నాకిఁక నటుల్ దప్పింపు మో దైవమా. 230

క. ఒండరమ్మాటలు పుట్టిన, రెండవవర్షమున వచ్చి రెట్టింపఁగ రా
కుండి వెత లొందు టెఱుఁగుదు, వెండియు నవ్వేతకు నన్ను విడువకు మీశా. 231

అలసవృత్తము. నినుఁ దెలిసికొంటి నెద నీ దగుమహత్త్వం
బనితరసుసాధ్య మగు నక్కటకటా నా
మనము దహియించితివి మార్మ్మలయ కుండల్
ఘనుఁడ వెటు చేయుటకుఁ గాని ఒగసీశా. 232

గద్యము.

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్త్ర వేంకటయజ్వాగ్రపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందు
భీష్మపర్వంబునం బ్రథమాశ్వాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః

# శ్రీకృష్ణభారతము

## భీష్మపర్వము - ద్వితీయాశ్వాసము.



శ్రీమంతంబున నూర్జిత
మై మహాతివిభూతియుక్తమై వరతేజో
ధామ మయి సత్వసంస్థం
బై మెఱయు ప్రత్యగాత్మ నంఘ్రిఁ గొలుంతున్. 1

వ. అంత ధర్మజాదు లంఖాదిమహాయుధములఁ బట్టినయెడ నట్లుభయసైన్యంబులును దై
న్యంబు గల్గి యుక్కు మిగిలి యుక్కళించుచు నుండె నని చెప్పిన విని
ధృతరాష్ట్రుఁడు సంజయున కిట్లనియె. 2

—◆ భగవద్గీతాప్రారంభము ◆—

కం. సమరము సేయం గన్నైనా, మామకులును బాండుపుత్రకులు ధర్మక్షే
త్రమగు కురుక్షేత్రమునన్, సమయుచు నెట్లగుదు రేమి సలిపిరి చెపుమా. 3

వ. అనిన సంజయుం డిట్లనియె సవ్యూహమైనపాండవసైన్యము దుర్యోధనుండు మొగ్గరంబై యు
న్న పాండవానీకముం గాంచి ద్రోణాచార్యుని సమీపించి యిట్లనియె. 4

కం. ఆచార్య! నీకు శిష్యుఁడు, ధీచతురుఁడు ద్రుపదసుతుఁడు తీర్చుట వ్యూహం
బై చను నీపాండవసేనాచయముం జూచి [illegible]లు వయి యుండెన్. 5

సీ. ఈసేనఁ గలరు మహేష్వాసులుం బోర, భీమార్జునులఁ బోనిబిరుదుమగలు
యుయుధానుఁడును విరాటోర్వీశుఁడును ద్రుపదుఁడును ధృష్టకేతుండుఁ జేకి
తానుండును గాశీధరణీశ్వరుండును, బురుజిత్తును గుంతిభోజ శైబ్య
భూమీశ్వరులును యుధామన్యుఁ డుత్తమౌజుండు సుభద్రాసుతుండు ద్రౌప

తే. దేయులుం దొట్టియెల్ల రమేయవిక్రములు మఱియుచమూనాయకులును ముఖ్యు
లైనయట్టిరు వారల నారసికొన, విన్నవించెద ద్విజవర! వినుము తెలియ. 6

తే. ఈవు భీష్ముఁడుఁ గర్ణుఁడుఁ గృపుఁడు నీదు,తనయుఁడు వికర్ణుఁడును సౌమదత్తి సైంధ
వుఁడును మొదలైనశూరులు విషువఁ గలరు,ప్రాణములనైన నాకుఁగా నాహవమున.

సీ. అఖిలశస్త్రాస్త్రప్రహారణు లందఱు రణ,కోవిదు లిట్లొనగూడి ప్రబలి
భీష్మరక్షిత మయి వెలసినమనబల,గమ్ము చాలక యుండెఁ గాదె తెలియ
భీమరక్షిత మయి వెలసినరిపుబల,గము చాలి యుండెను గాన మీర
లందఱు మనవ్యూహ మండలిమార్గము,లందు యథాభాగ మాక్రమించి,

తే. మీరు భీష్ముని రక్షింపఁ గోరి యుండుఁ,డనుడు భీష్ముఁడు వానికి హర్ష మొసఁగ
సింహనాదము గావించి చేసె శంఖ,నాదము ప్రతాప మంతయు నలువు మీఱ. 8

వ. అయ్యవసరంబున శంఖభేరీపణవానకగోముఖప్రముఖతూర్యారవంబు లొక్కట పెట్ట
తుములం బై మిన్ను ముట్టె నట్టియెడ. 9

సీ. ధవళాశ్వయుక్తరథముపై వసించి యుద్దఱు కృష్ణులును దేవదత్తపాంచ
జన్యంబు లొత్తిరి శమనాత్మజుఁ డనంత, విజయంబు మొఱయించె వీరకర్ముఁ
డయినభీముఁడు పౌండ్ర మనుమహాశంఖంబు, నూఁదె సర్వప్రాణ మొప్పఁ జేసి
మాద్రేయులు సుఘోషమణిపుష్పకంబులు, పూరించి రత్యున్నతారవమున,

తే. మఱియుఁ బాంచాలపతియును మత్స్యపతియుఁ
గాశ్యుఁడును సాత్యకియును శిఖండి ద్రౌప
దేయు లభిమన్యుఁడును సైన్యనాయకుండుఁ
దమమహాశంఖముల నూఁది రమితశక్తి. 10

క. ఆరవము మాఱు మ్రోయఁగ, ధారణియున్ దివియు నిండి దారుణమై నీ
వారికి నెల్లన్ హృదయవి,దారణ మగునట్టు లయ్యె ధరణీనాథా. 11

—: అర్జునుండు శత్రుసైన్యంబున బంధుమిత్త్రులం గాంచి విషాదంబు నొందుట :—

ఉ. అంతట మోహరించి కవియం బడ నుండినధార్తరాష్ట్రులం
జెంతన చూచి శస్త్రమును జేకొనఁ గాఁ దఱి యం చెఱింగి వృ
త్రాంతకసూతి గాండివము హస్తయుగంబునఁ దాల్చి పల్కె దై
త్యాంతకుదిక్కు మో మయి నయం బలరారఁగ వాని కిట్లనున్. 12

ఉ. చేరఁగ నిమ్ము తే రుభయసేనలమధ్యమునందు నిల్పి య
క్కౌరవపక్షపాతు లయి కయ్యము సేయఁగ నున్నవారిలో
నేరు ననుం దలంపడఁగ నెంచుచు నుండిరొ యేరితోడ నేఁ
బోరితముం బొనర్చుటకుఁ బోలునొ పోల్చెదఁ గాక మాధవా. 13

ఆ. అనినఁ గృష్ణుఁ డట్ల యగుఁ గాత మని మూఁక,నడిమి కపుడు రథము నడవఁ దోలి
భీష్మముఖ్యులైన బిరుదుమగల మ్రోల, నిలిపి చూడు మనుచుఁ బలుకుటయును. 14

ఉ. ఆతఁడు తత్ప్రదేశమునయందు మెలంగుచు నుండు తండ్రులన్
దాతల దాయలన్ గురులఁ దమ్ముల నన్నలఁ గన్నవారలన్
మాతులులన్ సుహృద్వరుల మామల బావల బంధుకోటులన్
బ్రీతి దొలంగఁ జూచి మదిఁ బిమ్మట నొందుచు శౌరి కిట్లనున్. 15

సీ. కయ్యంబునకు నిట్లు కట్టాయితం బైన,స్వజనంబుఁ గన నంగసంధు లెడలె
మొగ మెండుకొని పోయెఁ దెగక గగ్గురుపాటుఁ, గంపంబు నెమ్మేనఁ గలిగి యుండెఁ
జేతి నుండక జాఱు నీతఱి గాండివం, బొడలితో లెంతయు నుడుక నయ్యె
నిలువ నోపవు కాళ్లు నెమ్మది తిరుగుడు,వడు దుర్నిమిత్తము లడరెఁ బెక్కు,
తే. స్వజనసంహార మొనరించి సంగరమునఁ,బొందఁ గల శ్రేయ మెద్దియుఁ బొసఁగఁ బోదు
నిజము చెప్పెద మాధవా! విజయ మిందుఁ,బొంది సామ్రాజ్యసుఖ మొంద బుద్ధి సేయ.

ఉ. రాజ్యము భోగముల్ సుఖపరంపర లెవ్వరిఁ బొందఁ జూతు మా
పూజ్యులు తండ్రులున్ గురులుఁ బుత్రులు మిత్రులు లోనివా రనిం
బ్రాజ్యధనంబు ప్రాణ మది పాయఁ దలంచి రకైన పిమ్మటన్
రాజ్యసుఖంబు లేమిటికిఁ బ్రాణము లేటికి మాకుఁ జెప్పుమా. 17

ఆ. కత్తి గట్టి వీర లెత్తివచ్చినఁ గాని, నేల మాట చెప్ప నేల వినుము
ధర్మమూర్తి! మాకుఁ ద్రైలోక్యరాజ్యంబు, దనరు నేని వీరిఁ దునుమ నొల్ల. 18

తే. ఆతతాయులయగుదు రట్లైన ధార్తరాష్ట్రులను జంపినంత మాత్రమున మాకు
గలుగు మే లేది పాప మొక్కండు దక్క, నెట్టు లే వీరిఁ జంపమి యే గుణంబు.

సీ. స్వజనసంహారంబు సలిపి మే మెట్టులు, సుఖపడు చుందుమో చూడు మయ్య
లోభోపహతచిత్తులును ఖలు లగుట వా,రలు కులక్షయమునఁ గలుగు నదియు
సఖులను వంచింప సమకూడు నదియును, బాపంబు పరికింప నోప రైరి
యెఱిఁగిన మన మిట్టిహీనకార్యమునుండి, తలఁగి పోవుట లెన్నఁ దగును గాదె,
తే. కులము క్షయమైనఁ గులధర్మములు నశించు, ధర్మము నశించెనేని యధర్మమున
గులము దూషింపఁ బడు నట్టికులమునందు, నైన స్త్రీ లెల్ల దూషిత లై చెడుదురు

మ. కులకాంతల్ సెడ వర్ణసంకరము గల్గున్ దాన నా నారకా
ధులు వంశఘ్నుల కట్టివారిపిత లెందున్ లుప్తపిండోదకా
దుల నై కూలంబగు నిట్టిదోషముల నోహో జాతిధర్మంబులుం
గులధర్మంబులు మాయు మాసి నగున్ ఘోరవ్యథల్ వారికిన్.

తే. కటకటా! రాజ్యలోభంబు గలుగుకతన, స్వజననాశన మొనరించి వృజిన మొంద
నుంటిమే మొల్లి శస్త్రంబు నంటకున్న, వారె మముఁ జంపెద రైన వర మెసుమ్ము.

—: అ. 2—శ్రీకృష్ణుం డర్జునునకు సాంఖ్యయోగం బుపదేశించుట :—

వ. అని పలుకుచుఁ ధనంజయుండు ధనుర్బాణతూణీరాదుల విడిచి విషణ్ణహృదయుం
డై యరదంబుపైఁ జదికిలం బడి కంట నీరు గ్రుక్కుకొనుచు వగచుచున్నం గని
వాసుదేవుండు వాని కిట్లనియె. 23

ఉ. ఎక్కడినుండి వచ్చెనొకొ దే విషమం బగునిట్టివేళ నిం
దక్కఁ గొనంగఁ గశ్మల మెద న్మది మందరు పెద్ద లిందుఁ గ
దక్కదు కీర్తి స్వర్గమును దవ్వగుఁ గావునఁ గ్లైబ్య మీగి లో
నెక్కొన నిక దుర్బలత నీ విడ కా దని లెమ్ము ఫాల్గునా. 24

మ. అనినన్ గాండివి వేఁడి యిట్లనియె దాశార్హా! సమర్చార్హులై
చనుగాంగేయుల ద్రోణులన్ శరములన్ సంధింపఁ గా నెట్లు నో
ర్తు నయో! యిట్టిమహానుభావులు గురుల్ త్రుంగం బ్రయత్నింప కు
ర్వి నజస్రంబును భైక్షముం గుడుచుట శ్రేయంబు నా నొప్పదే. 25

ఆ. అర్థకాము లైన యట్టిగురులఁ జంపి, పుడమి రుధిరదిగ్ధభోగములను
బొందు టెట్టిమేలొ పురుషోత్తమా! నీవె, తెలియఁ జెప్పవయ్య తెల్లముగను. 26

సీ. అని దైన్య మసము వారని గెల్తుమొ మొదటె వా, రెలమిచి మనలను గెలుతు రొండె
కలుగు నీరెంటిలోపల గరీయం బైన, దేది దై యుండునో యెఱుఁగ రాదు
మన మెవరిఁ జంపిన మన నేరకుందుమో, దాయాదు లెదిరి ముందఱ నిలిచిరి
కార్పణ్యదోషంబు కతమున ధర్మసమ్మూఢచిత్తుండ నై వ్రేఁకి దప్పి,

తే. నే నడుగుచుంట నెయ్యది నిశ్చయముగ, శ్రేయమై యుండు నద్దాని శిష్యుఁడను బ్ర
పన్నుఁ డగునాకు బోధించి సన్నుతమతి, వగచు శాసింపు మని చేసి ప్రార్థనంబు.

ఆ. నిస్సపత్న మైననిఖిలభూతలరాజ్య, మబ్బె నేని దేవతాధిపత్య
మబ్బె నేని యింద్రియముల నెండించునీ, శోక ముడుగ దనుచు నాకుఁ దోఁచు. 28

వ. అని పలికి గాండీవధరుండు నే నింక భండనంబు సేయ కుండెద నని యొండాడి
కూరకుండె నట్లుభయసేనామధ్యంబున వధ్యుంబునుంబోలె దుఃఖించుచుఁ గూలఁ
బడి యున్న వాసవిం గని నవ్వుచు వాసుదేవుండు వెండియు. 29

చ. వగవఁగ రానివారి కయి వారక నీ విటు పారెసారెకుఁ
వగచుచుఁ బ్రాజ్ఞుఁడుం బలెను వాదము లాడుచు నుంటి వక్కఁటా

తగ దిటు ప్రాజ్ఞలక్షణము దద్దిటి యుండదు ప్రాజ్ఞుఁ డెవ్వఁడున్
వగవఁడు ప్రాణముల్ విడినవానికి వీడక యున్నవానికిన్. 30

ఆ. నేను లేక పోను నీవును లేక పో, వీనృపతులును లేక పోరు
వినుము సవ్యసాచి! మన మందఱము ముందు, వెనుక నుండువార మనియెఱుఁగుము.

తే. దేహి కీదేహమున నెట్లు తేజరిల్లు, బాల్యయౌవనకౌమారవార్ధకమ్ము
లట్లు దేహాంతరప్రాప్తి యనుచు నెఱుఁగ,వలయువిద్వాంసులిట మోహవశులుగారు.

సీ. విను మింద్రియంబులు విషయముల్ శీతోష్ణ,గతుల సుఖంబు దుఃఖమునుగూర్చు
వచ్చి పోవుచు నుండువాని కనిత్యంబు,లకు ఖేద మోదము ల్గాదు సేయు
నవి సమసుఖదుఃఖుఁ డై ధీరుఁ డగువేని, గలఁపఁ జాలవొ వాఁడు గాంచు ముక్తి
గని యస త్తగుజగత్తునకు భావమ్ము స, త్తగునాత్మకు నభావ మనుట లేదు,

ఆ. తత్త్వవేత్త లిట్లు తన్నిర్ణయము చేసి, రెఱుఁగు మెల్లలోక మెది సేయు
నది వినాశరహిత మనుచు దానికి నాశ, మొనరుపఁగ నొకండు నోపఁ డనుచు. 33

తే. అప్రమేయుఁ డనాశి నిత్యస్థితుండు, దేహి వానికి నాశన మూహ సేయఁ
జనదు తద్దేహములు వినాశస్వభావ,ము లని చెప్పంగ బడుఁ గానఁ బోరు కొనుము.

ఉ. చంపెడువాఁ డితం డితఁడు చచ్చెడువాఁ డని యెంచునిర్వురుం
బొంకయి యున్నవాధ్యమున వేఁగెడువా రతఁ డెన్నఁ డేనియుం
జంపఁగను జంపఁ గాఁ బడఁడుఁ జావఁడుఁ బుట్టఁడుఁ బుట్టినట్టిఁడుం
బెంపటి చచ్చినట్టిఁ డని పెద్ద లెఱుంగరు వానిఁ గావునన్. 35

తే. అజుఁడు నిత్యుఁడు శాశ్వతుం డవ్యయుం డ,తండు తన మేను పోయినఁ దాను బోవఁ
డప్పరాణు నెఱింగిన యట్టిపురుషుఁ, డెవనిఁ జంపును జంపించు నెవనిఁ బార్థ. 36

క. జనుఁ డెట్లు జీర్ణవస్త్రము,లను విడిచి వినూతనంబులను నన్యములన్
గొనమాడ్కి జీర్ణదేహము,లను దేహియు విడిచి యొండులం గొనుచుండున్. 37

తే. శస్త్రములు వాని ఛేదింపఁ జాల వగ్ని, కాలుపం జాల దుదకముల్ కదిసి తడుప
నింతయును జాల దాశుగ మెగిచి తాఁకఁ,జాలి శోషింపఁ జేయఁగాఁ జాల దరయ

వ. ఇట్లచ్ఛేద్యుం డదాహ్యుం డక్లేద్యుం డశోష్యుం డగుటం జేసి జీవాత్ముండు నిత్యుండు సర్వగతుండు స్థాణుం డచలుండు సనాతనుం డవ్యక్తుం డచింత్యుం డవికార్యుం డై యుండు. 39

క. కావున నాత్ముం డిట్టిం, డై వఱలెడు ననుచు నెఱిఁగి యాత్మగతిం బై
చేవఁ దఱగించు శోకముఁ, బోవంగాఁ జేసికొనఁగఁ బోలు న్నికన్. 40

ఉ. పుట్టును జచ్చు జీవుఁ డిటు పోలఁగఁ జూచుచు నుందు [illegible]
నట్టిద యైన నీవు మనమం దిటు కుందఁగ రాదు చచ్చియుం
బుట్టును బుట్టి చచ్చెడిని భూతము లన్నియు నిశ్చయంబు గా
నిట్టి యపార్థమందు వగ పేటికిఁ జేయఁగ నీకు నర్జునా. 41

తే. మొదట నవ్యక్త మై మధ్యమున నొకింత, వ్యక్త మై తుద మఱియు నవ్యక్త మగుచు
భూతజాలంబు పొలుపొందు భూతలమున, నిట్టివానికిఁ జింతింప నేల విజయ. 42

ఉ. అచ్చెరుపాటఁ జూచు నొకఁ డచ్చెరుపాటన మాటలాడు న
ట్లచ్చెరుపాట నొక్కరుఁ డాపరమాత్ముని నాలకించు ని
ట్లిచ్చకొలంది నుండియు ననేకసహస్రములం దొకండు న
య్యచ్చపుజోతినిం దెలియనట్టిఁడ యై చను నేమి చిత్రమో. 43

తే. దేహి నిత్యుఁ డవధ్యుఁ డేదేహమందు, నుండియు నశింపఁ డెప్పు డో పాండుతనయ!
దేవురించుచు నీ వెద దిగులు పడకు, మెల్లభూతంబు లియ్యనిఁ ద్రెళ్ళు ననుచు. 44

సీ. స్వీయధర్మంబు నీక్షించి యైనను నీవు, సంభ్రమింపనియట్టిజనుఁడ వగుము
ధర్మానపేత మై తగినయుద్ధముకన్నఁ, గలదె శ్రేయ మొకండు క్షత్రియునకుఁ
ద్రిదివంబుతలుపులు తెఱచుచు నప్రయత్నము గాఁగ వచ్చిన సమరమునకు
నాసించి క్షత్రియు లగువార లెపుడును, సుఖవంతు లై యుండు చొప్పు వినమె,

తే. నీవు ధర్మానపేత మై నెగడునిట్టి, యుద్ధ మొనరింప మది సేయ కుందు వేని
స్వకులధర్మముఁ గీర్తినిఁ బాసినట్టివాఁడ వై పాపమును బొందువాఁడ వగుదు. 45

ఉ. నీ కపకీర్తి లోకమున నిత్యమ యై నెగడొందుఁ గీర్తినిం
గైకొని యుండువారి కది కాఁ దగుఁ జావునకన్న మిన్న యై
నీఁక నెదుర్ప లేక భయవిహ్వలుఁ డై రణ మీఁగె నంచు ని
న్నాకురుముఖ్యు లాడెద రహీ యని నీ కిల లాఘవం బగుఁ. 46

చ. మఱియు నవాచ్యవాదములు మాటికి మాటికి నీదువిద్విషుల్
కఱకరు లై పొనర్చుచును గాటము దూరుచు నీయశక్తిని
న్నెఱపుదు రింతకన్న ధరణీతలమం దొకదుఃఖ ముండునే
మెఱయఁగ నున్నవారల కమేయపరాక్రమ! చెప్ప నేటికిన్. 47

క. చచ్చితి వేనియు స్వర్గము, నిచ్చ మెయిం బొందు దరి జయింతువ యేనిన్
వచ్చును సామ్రాజ్యసుఖం, బచ్చుగఁ గృతనిశ్చయుండ వై లె మ్మనికిన్. 48

క. కొని సమముగ సుఖదుఃఖములును లాభాలాభకంబులు జయాజయముల్
గొనకొని రణ మొనరించిన, నినుఁ బాపం బంటఁ బోదు నిజ మిది పార్థా. 49

సీ. ఇది సాంఖ్యవిజ్ఞాన మెఱింగించితిని నీకు, నింక యోగవిజ్ఞాన మిదియు వినుము
కర్మబంధంబులు కడముట్టఁ దెగు దానఁ, బ్రారంభనాశము ప్రత్యవాయ
మిట లేదు కొంచె మే నిది భూరిసంసార,భయ మెడఁ బాపి యనయముఁ గాచు
వ్యవసాయి యగుబుద్ధి యగునొక్కఁ డవ్యవ,సాయులబుద్ధులు వేయికోట్లు;
తే. వేదవాదనిరతు లవివేకు లైన, వారు స్వర్గాదిభోగసంపదలకన్న
నన్య మొక్కఁడు లే దనునట్టి రగుచుఁ, బలుకుచుందురు విన నింపు గల్గునట్లు.
క. ఎపుడున్ గామాత్ములు స్వ,ర్గపరుల్ పశుదారపుత్రకప్రముఖైశ్వ
ర్యపరంబు జన్మకర్మఫ, లపరం బగు నిట్టివాకు లలి నెంతురనన్. 51
క. ఆవాకుచేత నపహృత,భావులు భోగాదిసౌఖ్యపరు లగువారల్
బోవఁగఁ జాలరు బుద్ధిం, దా వైనసమాధియందుఁ దగిలించుటకున్. 52
తే. విజయ! త్రైగుణ్యవిషయముల్ వేదములని, నీవు నిర్ద్వంద్వుఁడవు సత్వనిత్యుఁడవును
నాత్మవంతుఁడవు గుణత్రయాదిరహితుఁ, డవున విగతయోగక్షేముఁ డవునుగమ్ము.
చ. అలుపపునీటియొక్కఁ గొన నైనఫలం బది నల్గడన్ జలం
బులఁ గడు నిండి యున్నకడఁ బొంపిరివోయినయట్లు వేదమం
దలరుఫలంబు బ్రహ్మవిదుఁ డైనమహాత్మునిజ్ఞానచిత్తమం
దెలమి నడంగి యుండు నని యే యెఱుఁగం దగు నింద్రనందనా. 54
ఆ. కర్మ మాచరింపఁ గలదు నీ కధికార, మెపుడుఁ దత్ఫలప్రతీక్ష తగదు
కర్మఫలమునందుఁ గాకు హేతువు నక,ర్మమునయందు సంగమమును దగదు. 55
చ. భరతకులప్రదీప! సమభావముఁ జేయుచు సిద్ధ్యసిద్ధులన్
నిరతము సంగమున్ విడిచి నీ వొగి యోగమునందు నిల్చి ని
బ్బరముగ నీశ్వరార్థ మని భక్తి నొనర్పుము సర్వకర్మముల్
పరఁగెడు సిద్ధ్యసిద్ధిసమభావమె యోగము నాఁగ నొప్పెడున్. 56
తే. ఫలము నర్థించి చేయుట వలన నధమ, మగుచుఁ గర్మము మిగుల దవ్వయ్యె బుద్ధి
యోగమునకన్న నీ విట్టియోగ మాశ్ర, యింపుము ఫలాశ గలవారు కృపణు లరయ.
సీ. బుద్ధియుక్తుం డైనపురుషుండు సుకృతదు,ష్కృతముల విడనాడ నెంచుఁ గాన
సమహాపబుద్ధియోగమున నీ వుండుము, కర్మకౌశలమె యోగంబు సూవె
పుడమి సర్వసమత్వబుద్ధియుక్తులు కర్మ,ఫలముల విడనాడి ప్రాజ్ఞు లగుచు
మొగి జన్మబంధనిర్ముక్తు లై నిరుపద్ర,వోత్తమపద మొంది యొప్పుచుంద్రు;
తే. మోహకలుషంబు విడిచి నీబుద్ధి యెపుడు, నిర్మలం బగు నప్పుడు నీవు వినిన
దానికిన్ విన నుండినదానికిన్ ఫలముగ నిర్వేద మొందఁ గలవు నిజంబు. 58

తే. ఇంద్రియార్థంబులవలన నింద్రియముల, నెల్లయెడలను మరలింప నెవఁడు చాలి
యుండు నిమ్మహి నమ్మహాయోగిప్రజ్ఞ, సుప్రతిష్ఠిత మగు నని చూడు మనఘ. 72

తే. సర్వభూతములకు రాత్రిసరణి నప్ర,సన్న మగుబుద్ధి సంయమి జాగరూకుఁ
డగునుభూతములకువిషయసుఖ మొసఁగు, బుద్ధి నిశవోలె నగుఁ జూచుమునికిఁబార్థ.

ఉ. అంతట నిండియుం జలన మందనినీరధి నీరు సేరున
ట్లెంతయు నెల్లకామములు నెవ్వనిఁ జొచ్చి విలీన మొందు నో
శాంతినిఁ బొందునాపురుషసత్తముఁ డావిజితేంద్రియుండు లో
నింతయు శాంతి లేక చెడు నెంతటివాఁడును గామకామి యై. 74

తే. ఏపురుషుఁడు కామంబుల నెల్లఁ దెల్ల
ముగ విడిచి నిరహంకారుఁడుగను నిర్మ
ముఁడుగ నిస్పృహుఁడుగ నుండుపురుషుఁ డతఁడు
శాంతి నొందెడు నని నమ్ము సదమలాత్మ. 75

క. ఇదియే బ్రహ్మప్రాప్తికిఁ, బద మగుస్థితి దీనిఁ బొంది పండితుఁ డగువాఁ
డెద మోహ మొందఁ డీగతి, వదలక నిర్వాణ మందు వర్ష్మము వోవన్ 76

—♦ అ-3 -కర్మయోగము ♦—

వ అని సాంఖ్యయోగం బెఱింగించిన నర్జునుం డి ట్లనియె. 77

ఉ కర్మముకంటె జ్ఞాన మధికం బని నీమన మేసి ఘోర మా
కర్మమునందు నేమిటికిఁ గట్టెదు నన్ను విమిశ్ర మట్టివా
గ్ధర్మముచేత మోహపడఁ గా నొనరించెదు నాకు శ్రేయ మా
నిర్మలధర్మ మొం డిపుడు నిశ్చయముం బొనరించి చెప్పుమా. 78

సీ. అనవుడు భగవంతుఁ డను సాంఖ్యులకు జ్ఞాన,యోగంబునం గర్మయోగులకును
గర్మయోగంబునఁ గల దనుష్ఠానము, ద్వివిధం బనుచు మున్న తెలిపితి నిట
జనుఁడు కర్మారంభమును జేయ కున్న వి,జ్ఞానంబునుం బొందఁ జాలఁ డరయ
జ్ఞానహీనం బైనసన్న్యాసమునఁ జేసి, మోక్షసంసిద్ధినిఁ బొందు టరిది,

తే. అజ్ఞుఁ డెవఁడు నెప్డును క్షణ మైనఁ గర్మ,మును బొనర్పక యుండఁ డిప్పుడమి నెల్ల
వాఁడు స్వాతంత్ర్య మది లేక ప్రకృతిభవము,లయినగుణములఁ గర్మములాచరించు.

క. ఎవ్వఁడు కర్మేంద్రియముల, నివ్విటిలఁ గట్టి విషయనిచయంబు నెదన్
క్రెవ్వక స్మరించు చుండెడు, నవ్వాఁడు పొసంగెడున్ మృషాచారుఁ డనన్. 80

తే. ఎవఁడు జ్ఞానేంద్రియంబుల నెల్ల మాన,సమున నరికట్టి కర్మేంద్రియములఁ గర్మ
యోగమున సక్తుఁ డై చేయుచుండువాఁడు, కైతవాచారగునికంటె ఘనుఁడసుమ్మి.

ఉ. కర్మముఁ జేయ కుండుటకంటెను గర్మము సేత మేలగుఁ
గర్మము లేని నీ కరయఁ గాఁ దనుయాత్రయు నప్రసిద్ధ మా
గర్మ మగుఁ మఖార్థ మది గాకితరంబున లోక మంతయుఁ
గర్మనిబద్ధ మైశ్వరము కర్మ మొనర్పుము నీ వసంగుఁడై. 82

క. మున్ను ప్రజాపతి ప్రజలఁ, జన్నంబులతో సృజించి సదయుండై యీ
జన్నముల వృద్ధి నొందుఁడు, జన్నము లిష్టములు మీకొసంగెడు ననియెన్. 83

సీ. జనులార! మీర లీజన్నములను వేల్పుల భజింపుఁడు వార లలరి మిమ్ము
భావింతు రిటు పరస్పరము సంభావితులై పరం బగు శ్రేయ మందఁ గలరు
యజ్ఞభావితు లగునా దేవతలు మీకు, నిష్టార్థభోగము లిచ్చుచుంద్రు
వార లిచ్చినవాని వారికీక నుభవించుచు నుండు వాఁడె పో చోరుఁ డరయ,

తే. యజ్ఞశిష్టాన్నము భుజించునట్టిసుజను, లెల్ల కిల్బిషములఁ బాసి యెసఁగుచుంద్రు
తమనిమిత్తము వంటకం బమరుచుకొను,వారు పాపంబులం బొంది వనరుచుంద్రు. 84

ఉ. భూతము లెల్ల నన్నమునఁ బుట్టెడు నన్నము వృష్టిసంభవం
బై తగు వృష్టి యజ్ఞమున నయ్యెడు యజ్ఞము కర్మకాండని
ర్యాతము కర్మకాండ మది బ్రహ్మభవం బల బ్రహ్మ మక్షర
ఖ్యాతము గాన సర్వగత మయ్యును బ్రహ్మము యజ్ఞమం దగున్. 85

తే. ఇట్లు వర్తించుచక్రము నెవఁడు లోక,మునఁ బ్రవర్తింపఁ జేయఁడో పురుషుఁ డతఁడు
కలుషజీవనుఁ డింద్రియగ్రామరతుఁడు, నగుచు రిత్తగ జీవించినట్టిఁ డగును. 86

సీ. ఎవఁ డాత్మరతుఁ డాత్మతృప్తుఁడు నాత్మసం,తుష్టుఁడై యుండు నుత్కృష్టగతుల
నమ్మానవునకుఁ గార్యం బొక్కఁడును లేదు, జగతిఁ గర్మంబును జలుపు దానఁ
గలుగుఫలము లేదు సలుప కుండినదాన, నెట్టియనర్థము నేని లేదు
స్వార్థంబుపొంటె భూతాశ్రయం బొనరించు,కార్యం బొకండును గాని లేదు,

తే. కావున న్నీ వసక్తుఁడవై విడువక, చేయఁ దగు నని కర్మముం జేయు మనఘ!
పూరుషుఁ డసక్తుఁడై చేసి పుణ్యకర్మ,మునఁ బరంధామమును బొందు ననియెఱుఁగుము.

క. జనకాదులు కర్మముచే,తన సిద్ధినిఁ బడసి రీవు తగ లోన జగ
జ్జనసంగ్రహ మారసినై, నను గర్మము సేయఁ దగుదు నలువుగఁ బార్థా. 88

తే. అవనిపై శ్రేష్ఠుఁ డే దేది యాచరించు, నితరజనుఁ డది యది మది హితవు సేయు
నతని కేది ప్రమాణమై యలరుచుండు,జగమునకు నద్ది యె ప్రమాణమగుచునుండు.

సీ. ముల్లోకములనాకుఁ బొనరింపఁ దగినక,ర్మ మొకించుకయు లేదు మఱియుఁ బొందఁ
బడని దై యిఁకఁ బొంద వలసినయది లే,దట్లయినను గర్మమునంద యుందు

నెప్పుడేని ప్రాల్మాల కేను గర్మమునందు, వర్తింపకుందునే వసుధజనులు
సర్వవిధంబులం జనునాదుమార్గమే, యనుసరింతురు గదె యనవరతము,
తే. నేను గర్మము సేయక నిలుతు నేని, జగము నష్టమై చెడు వర్ణసంకరమున
కేన తలపోయఁ గర్తనై యెల్ల ప్రజలఁ, జెఱచినట్టి వాఁడ నగుదు నో శ్వేతవాహ. 90
ఆ. కర్మసక్తు లగుచుఁ గడఁగి యవిద్వాంసు, లెట్లు చేయుచుందు రట్ల లోక
సంగ్రహంబుఁ గోరి సక్తిలే కెల్లవి,ద్వాంసు లాచరింప వలయుఁ గ్రియలు. 91
తే. అజ్ఞులును గర్మసంగులు నైనవారి, నెఱిఁగి విద్వాంసుఁ డగుజనుం డపుడు బుద్ధి
భేదము జనింపఁ జేయఁ గా రాదు కర్మ,యుక్తుఁడై చేసి చేయింప నొప్పు ననఘ.
సీ. ప్రకృతిగుణంబులఁ బహువిధంబులు గాఁగ,సలిపెడుకర్మసంచయమునకు న
హంకారమూఢాత్ముఁ డగువాఁ డెపుడు నేనె,కర్త నంచుఁ దలంచు నార్తి గూర
గుణకర్మముల నేర్పుకొనుటయందుం దత్త్వ, మెఱుఁగువాఁడు గుణంబులెల్లగుణము
లగుతమకార్యములందు వర్తించెడు, నని యెఱుంగుచు సక్తి నొనరుపఁ డెదఁ,
తే. ప్రకృతిగుణమూఢులు గుణకర్మములయందు, సక్తు లగుదురుమందులజ్ఞులొ కింత
తెలియనట్టివా రంతయుఁ దెలిసినట్టి,యతఁడు చలియింపఁ జేయరా దట్టివారి. 93
తే. ఇట్టు లెఱిఁగినమనమున నీవు సర్వ,కర్మములును నాయందుంచి నిర్మముఁడు ని
రాశియును నయి సంతాప మవలఁ ద్రోచి, యేచి యుద్ధం బొనర్పుము లేచి యిపుడు.
ఉ. ఏజను లిట్టినాదుమత మెప్పుడు 'తప్పని యెప్ప కెంతయుం
దే జగు శ్రద్ధతో సలుప నిల్తురొ వారలు కర్మముక్తులై
రాజిలుచుందు రేజను లరాళమతిం దెగనాడి చూడరో
యాజను లజ్ఞులై చెడినయట్టియచేతసు లంచు నెంచుమా. 95
ఆ. జ్ఞానవంతుఁడైనఁ గాని స్వప్రకృతికి, ననుగుణముగఁ బనుల నాచరించు
ప్రాణికోటు లెల్లఁ బ్రకృతి ననుసరించు, నిచట నిగ్రహం బదేమి సేయు. 96
తే. జ్ఞానకర్మేంద్రియార్థసంచయమునందు,రాగమును ద్వేషమును ద్రోయరానివగుచుఁ
బొందుపడెఁ గానఁ దద్వశమందు నుండ,రాదు పరిపంథు లయ్యవి ప్రజల కెపుడు.
క. పరికింప స్వనుష్ఠిత మగు,పరధర్మముకంటె గుణము పడయని దైనన్
పరము స్వధర్మ మ్మందున్, మరణము మే లొండు భయసమావృత ముగుటన్. 98
వ. అనిన నర్జునుం డిట్లనియె. 99
తే. కోరుకొనకుండియును బలాత్కారముగ ని,యోజితుండువోలెఁ బురుషుఁ డీయోజ దేని
వలనఁ బ్రేరింపఁ బడుచుఁ బాపం బొనర్చు, నానతి మ్మనుటయుఁ గృష్ణుఁ డనియె నిట్లు.

సీ. ఇది రజోగుణమున నుదయ మందినకామ,మున నగు దానికిఁ గనము తృప్తి
యది క్రోధమున నై మహాపాపమూల మౌ, నీవు వైరిగ దాని నెఱుఁగు మిందు
పొగచేత ననలంబుఁ బొదువఁబడినయట్లు,మలముచే ముకురంబు మఱుఁగువడిన
యటు మావిచే గర్భ మావృతం బగునట్లు, కామముచేఁ బ్రాణి కప్పు వడియె,
తే. జ్ఞాని నిత్యవైరియు మహాశాస్వరూప, మైనదియుఁ బొంద నర్హము కానిదియును
దృప్తి చెందనిదియు నగునట్టికామ,మునను బుధుల జ్ఞానము పొదువఁ బడును.
మ. మనముం బుద్ధియు నింద్రియంబులును గామవ్యాధి కత్యాయత
త్వనిరూఢిం బొలుపొందు నబ్బలమునన్ వర్తించునక్కామ మె
ప్పుడు విజ్ఞానముఁ గప్పిపుచ్చి జనులన్ మోహాంధకారంబునన్
మునుఁగం జేయు నటంచు నీ కెఱుఁగ నొప్పం బ్రస్తుతిం జెప్పుదునే. 102
తే. కాన నీ వాది నింద్రియగణము గెలిచి, జ్ఞానవిజ్ఞాననాశక మైనదియును
బాపరూప మైనదియు నై పరఁగుచున్న, కామము నశింపఁ జేయుము కడిమి మెఱసి.
చ. తనువున నింద్రియంబులు ప్రధానము లయ్యెడు వానికన్న నె
మ్మనమగు దానికన్న గరిమం దగు శేముషి దానికన్న హె
చ్చనఁ బడు నాత్మ నిట్లెఱుఁగ నై మతిచే మన మూఁగఁ బట్టి కై
క్కొనఁ దగనట్టికామ మనుఘోరతరాహితునిం జయింపుమా. 104

—♦ అ. 4—జ్ఞానయోగము. ♦—

వ. అని కర్మయోగం బెఱింగించి భగవంతుండు వెండియు. 105
తే. అవ్యయం బగునీయోగ మాదికాల,మందు నే వివస్వంతునకుఁ దెలియఁగ
నానతిచ్చితి నిచ్చమై నతఁడు మనువు,నకుఁ దెలిపె నాతఁ డిక్ష్వాకునకు వచించె. 106
తే. ఇటు పరంపరాప్రాప్త మై యెసక మెసఁగు,నీని రాజర్షు లెల్లరుఁ దెలిసికొనిరి
పెద్దకాలంబునకు నెన్కఁ బృథివి నట్టి,యోగము ప్రణష్ట మై పోయె నోయిపార్థ.
క. నాకుఁ జెలియు భక్తుఁడ వగు,నీ కిపు డెఱిఁగించినాఁడ నే నాయోగం
బోకిరీటి! యుత్తమోత్తమ, మై కడఁగెడునిదిరహస్యమగు నెఱుఁగు మెదన్. 108
వ. అనిన నర్జునుం డి ట్లనియె. 109
క. ఇపు డిపుడు నీవు పుట్టితి, వెపుడో సర్గాదిఁ బుట్టె నినుఁ డీయర్థం
బపురూప మెట్లు నమ్ముదు, నపు డీ వారవికిఁ జెప్పినది యిది యనుచున్. 110
వ. అనిన భగవంతుం డి ట్లనియె. 111
తే. ఏ నాకును నీకు ననేకజన్మ,ములవి నాకుఁ దెలియు నీకుఁ దెలియ వజుఁడ
నవ్యయాత్ముఁడ భూతేశుఁ డయ్యు స్వప్రకృతి నధిష్ఠించి జన్మింతు నే స్వమాయ.

క. ఎప్పుడు ధర్మగ్లానియు, నెప్పు డధర్మాభివృద్ధి యొసకం బగునో
యప్పుడప్పుడు నను నే, నొప్పుగఁ బుట్టించుకొందు నోకురుముఖ్యా. 113

క. సజ్జనపరిరక్షణము న,సజ్జనసంశిక్షణంబు సలుపఁగ ధర్మం
బిజ్జగతి నిలుపఁ బెట్టఁగ, నజ్జనులకుఁ బ్రతియుగంబునం దుదయింతున్. 114

ఉ. ఇట్టులు తత్త్వబుద్ధిమెయి నెవ్వఁడు నా కగుజన్మకర్మముల్
నెట్టన దివ్యమంగళము లే యని లోఁ దెలియంగఁ జూచునో
యట్టిజనుండు మేను విడనాడి యనంతరమందు వెండియుం
బుట్టువు నొందఁ బోక ననుఁ బొందుఁ బరంతప! ముక్తిసంగుఁడై. 115

తే. వీతరాగభయక్రోధు లై తలిర్చి, యెపుడు మన్మయుల్ న న్నాశ్రయించి పెక్కు
మంది జ్ఞానతపంబును బొంది పూతు, లగుచు మద్భావమును గాంచి రాలకింతె.

సీ. ఎవ రెవ్విధంబున నెంచి సేవింతురో, యేను వారి నటుల గ్రహింతు నట్లె
మనుజు లందఱును నామార్గమే సర్వప్ర,కారంబులం బట్టి తీరఁ గలరు
కర్మజ బగుసిద్ధి గలుగు మానుషలోక,మున నొకింతటికాలమునను గానఁ
దత్ఫలాపేక్షు లై తవిలి ప్రార్థించుచు, నింద్రాదుల యజంతు రిందలిజను, ..

తే. లమర గుణకర్మములవిభాగముల నేను, నాల్గువర్ణంబులు సృజించినాఁడ సృష్టి
కర్తనై నను గర్తనై నకర్తఁ గాఁగ, నవ్యయునిఁ గాఁగఁ దెలియు మధ్యాత్మశక్తి.

ఉ. కర్మము లంటఁ జేవు నను గర్మఫలస్పృహ నాకు లే దటం
చెవ్వరి నన్నెఱుంగు నాతఁడు కట్టువడం డొకప్పుడున్
గర్మచయంబుచే నిటులు గాంచి పొనర్చిరి ముక్ ముముక్షువుల్
కర్మము లట్టిపూర్వకృతకర్మములం బొనరింపు మీవునున్. 118

తే. కర్మ మన నేమి మఱియు నకర్మ మనఁగ, నేమి యని పండితులును మోహింతు రిందు
దేనిఁ దెలిసిన నశుభంబు దెరలు నట్టి,కర్మవిధ మెల్ల నీ కెఱుఁగ న్వచింతు. 119

ఆ. కర్మ మిట్టి దని వికర్మంబు దా నిట్టి,దని యకర్మ మిట్ట దని యథార్థ
మెఱుఁగ వలయుఁ జువ్వె యెవ్వరి కేనియుఁ, గర్మగతి దలంప గహన మగును. 120

సీ. కర్మమునందు నకర్మ మకర్మము,నందుఁ గర్మము నెవ్వఁ డరయు వాఁడు
మనుజులందున్ బుద్ధిమంతుండు యోగియు,సకలకర్మములను జలిపినట్టిఁ
డరయ నెవ్వనిచేత లన్నియుఁ గామసం,కల్పవర్జితము లై కానఁబడునో
వాని బుధుల్ జ్ఞానవహ్నినిర్దగ్ధక,ర్మునిఁ బండితునిఁ గాఁగ ననుచు నుంద్రు,

తే. కర్మఫలసంగమును వీడి నిర్మలమతి,నిత్యతృప్తుఁడై యాశ్రయాన్వితుఁడు గాక
కర్మములు చేయునట్టిఁడై కానఁబడియు,నతఁ డొకంతయుఁ జేయనియట్టివాఁడు.

ఆ. స్పృహ యొకింత లేక చిత్తము నాత్మయు, నాఁగి పట్టి సర్వ మగుపరిగ్ర
హాముల విడిచి కేవలము మేను నిల్ప నొం, గర్మ మాచరింపఁ గలుగ దఘము.

సీ. తనయంత వచ్చినదాన సంతుష్టుఁ డై, ద్వంద్వంబులం దెప్డుఁ దగులు వడక
విగతమాత్సర్యుఁ డయి తగి సిద్ధ్యసిద్ధుల, సమత వహించి కర్మము నొనర్చి
బద్ధుండు గాకుండుఁ బరికింప విగతసంగుఁడు ముక్తుఁడును జ్ఞానగుప్తచిత్తుఁ
డగువాని యజ్ఞార్థ మైనకర్మము సమగ్రకము గా మాయు బంధకము గాక,

తే. బ్రహ్మ మర్పణపాత్రము బ్రహ్మము హవి, బ్రహ్మ మగ్ని యాజకుఁడును బ్రహ్మమెన్న
బ్రహ్మకర్మసమాధి యై గ్రాలునతఁడు, పొందుఫలమును బ్రహ్మమే పురుషవర్య. 123

ఆ. దేవతలను గూర్చి కావింత్రు యజ్ఞంబు, యోగు లైనకొంద ఱుర్వి నాత్మ
నాత్మచేత బ్రహ్మ మనునగ్నిహోత్రము,నందు వేల్చుచుంద్రు కొంద ఱనఘ

ఆ. సంయమాగ్నులందు శ్రవణాదు లగునింద్రి,యముల వేల్చుచుందు రన్యు లింద్రి
యాగ్నులందు నితరు లరసి వేల్తురును శ,బ్దాదివిషయములను నలరుఁ దెలివి. 125

తే. గరిమ సర్వేంద్రియంబులకర్మములును, బ్రసరణాదికప్రాణకర్మములుఁ గొంద
ఱాత్మసంయమయోగాగ్నియందు వేల్తు, రనిశమును జ్ఞానదీపిత మయినదాంత.126

తే. యతులు తీక్ష్ణకృతవ్రతు లగుచుఁ గొంద, అవని ద్రవ్యయజ్ఞముఁ దపోయజ్ఞయోగ
యజ్ఞములు వరస్వాధ్యాయయజ్ఞ మవల, జ్ఞానయజ్ఞము నొనరింత్రు సవ్యసాచి.127

శా. ప్రాణంబుం దగ నయ్యపానమున నిల్పం బూరకాఖ్యంబు నాఁ
బ్రాణంబందు నపానము న్నిలుపఁగా నో రేచకాఖ్యంబు నాఁ
బ్రాణాపానగతిప్రనిగ్రహ మొనర్పం గుంభకాఖ్యంబు నాఁ
బ్రాణాయామ మొనర్తు రన్యు లిలఁ దాత్పర్యంబున న్వింటివే. 128

క. కొందఱు నియతాహారులు, పొందుగఁ బ్రాణములు ప్రాణముల వేల్తురు వీ
రందఱు యజ్ఞవిదుల్ పొల్పొందెద రిల యజ్ఞనాశితోగ్రకలుషు లై. 129

తే. యజ్ఞశిష్టామృతం బానినట్టివారు, నడయుదురు సనాతన మైనబ్రహ్మపదము
నొండొకఁడు యజ్ఞ మొనరింపకుండువాని, కిహము లే దన్న చోఁ బర మెట్లు కలుగు.

తే. వేదముఖమున నిగ్గతి విస్తరింప్ప, బడియె బహువిధయజ్ఞముల్ వాని నెల్ల
నెఱుఁగు కర్మజము లని యిట్లెఱిఁగితేని, బంధముక్తుఁడ వయ్యెదో పార్థ! నీవు.

తే. అఖిలకర్మములుఁ జ్ఞానమందు లీన, మగుచు నుండును గాన నీయ్యవనియందు
ద్రవ్యయజ్ఞంబుకన్న వరంబు జ్ఞాన,యజ్ఞ మని నీ వెఱుంగు మోయమలచిత్త. 132

మ. ప్రణుతం బై తగునాత్మ నీ వెఱుఁగు మోపాండుక్షితీశాత్మజా
ప్రణిపాతంబును సేవయుఁ మఱి పరిప్రశ్నంబుఁ గావించినం

బ్రణయుం బేర్పడ నీకు జ్ఞానమును దత్త్వజ్ఞుల్ వచింత్రు తీవ్రవ్రత
ఘనశక్తిం గొని యిట్లు మోహమును బొందం బోవు వీ కెల్లప్పుడున్. 133
క. వినుమట్టి జ్ఞానమహిమం, గొని నీవు సమస్తభూతకోటుల నెల్లం
గనుఁగొనఁ గ శక్తిఁ గలనై, యనువొందుదు వాత్మయందు నటు నాయందున్.
ఆ. పాపు లయినయట్టి వారిలో నెల్లర,కంటె నీవు పాపకారి వయిన
జ్ఞాన మనెడుప్లవముఁ బూనితివే నెల్ల, వృజినజలధి సంతరింపఁ గలవు. 135
క. జ్వలియించునగ్ని యింధనముల నెల్ల న్నీఱు సేయుపోలుపునఁ గర్మం
బుల నెల్ల నీఱు సేయం, గల దాజ్ఞానాగ్ని వింటె కౌరవముఖ్యా. 136
సీ. జ్ఞానముతోఁ దుల్య మైనదియుఁ బవిత్ర,మైనదియును నొకం డవని లేదు
తడవులకుం దానిఁ దాన పొందును యోగ,ముల సిద్ధుఁ డైనముముక్షు వాత్మ
శ్రద్ధయునుం దత్పరత్వ మింద్రియనిగ్ర,హము గల్గి నరుఁడు జ్ఞానమున నొప్పు
విజ్ఞాన మమరినవెనుక నింతటిలోనఁ, బర మైనశాంతినిఁ బడయు నతఁడు,
తే. శ్రద్ధ లేనట్టి డజ్ఞుఁడు సంశయాత్మ,గలుగునట్టి డు చెడుదురు తెలియ నందు
నందఱకు మేటి యగుసంశయాత్మునకును, లే దిహంబుఁ బరంబును లేదు సుఖము.
తే. యోగమునఁ జేసి కర్మము లుజ్జగించి, జ్ఞానసంఛిన్నసంశయుం డైనయాత్మ
వంతు నెప్పుడు కర్మముల్ బద్ధునిఁ గను, జేయఁ జాల వెఱుంగు మో శ్వేతవాహ!.
తే. కాన నజ్ఞానమునఁ బట్టి మానసమున, నంటికొని యున్ననీసంశయంబు జ్ఞాన
ఖడ్గమునఁ గోసి కర్మయోగమును బట్టి, యుద్ధమున కీవు గడకట్టు మోయిపార్థ.

—♦ అ. 5—కర్మసన్న్యాసయోగము. ♦—

వ. అని యుపదేశించిన జ్ఞానయోగంబు విని యర్జునుండు. 140
తే. కర్మసన్న్యాసము వచించి కర్మయోగ,మును వచించుచుంటివి రెండియును ముకుంద
వీనిలో నేది శ్రేయ మో దాని నొకఁడ, నిశ్చితము చేసి చెప్పుము నేను వినఁగ. 141
వ. అనిన భగవంతుం డి ట్లనియె. 142
తే. ఆలకింపుము కర్మసన్న్యాసకర్మ,యోగములు రెండునుఁ గా మోక్ష మొసఁగు నట్టి
కర్మసన్న్యాసమునకంటెఁ గర్మయోగ,మధిక మని యెంచు మా రెంటియందు విజయ.
సీ. ద్వేషంబుఁ గాంక్షయు వీను నెవ్వఁడు వాఁడు,నిత్యసన్న్యాసి నా నెగడఁ బడును
ద్వంద్వంబులం బాయుదాన నాతఁడు సుఖ,ముగ బంధమున నుండి ముక్తుఁ డగును
సాంఖ్యము కర్మము చర్చింత్రు వే అని, బాలురు పండితుల్ పలుక రట్టు
లం దొంటు తెన్నగ నభ్యసించినవాఁడు,పొందు రెంటిఫలంబు పొందు పడఁగ,

తే. సాంఖ్యమ్మునఁ బొందఁ గలయట్టిస్థానమందఁ, గలుగు యోగమునను దానివలన సాంఖ్య
యోగములు రెండు నరయంగ నొక్కఁ డంచు, జూచు నెవ్వాఁడు వాఁడెల్లఁ జూచువాఁడె.

క. అతికష్ట మయోగమునన్, క్షితిపై సన్న్యాస మొందఁ జేరుట యోగా
న్వితుఁ డగుముని తద్బ్రహ్మము, నతులితగతిఁ గన్నుఁ దెఱచు నంతన పొందున్.

తే. యోగయుక్తుఁడు విజితేంద్రియుండు విజిత, దేహుఁడు విశుద్ధసత్త్వుఁడై తేజరిల్లి
యఖిలభూతాత్మభూతాత్ముఁ డగుచుఁ గర్మ, మాచరించియు దానితో నంటువడఁడు.

మ. కనుచు న్వినుచు స్పృశించుచు న్నడచుచున్ ఘ్రాణించుచు న్మెక్కుచున్
గొనుచు న్విడుచు నూర్చుచుం బలుకుచుం గూర్కొందుచుం గంటిఱె
ప్పను బై కెత్తుచు వ్రాల్చు చింద్రియము లాపై నింద్రియార్థంబు లొం
దును నేఁ జేయ నటంచు నెంచు మది యుక్తుం డాత్మతత్త్వజ్ఞుఁడై. 147

సీ. ఫలసంగమును వీడి బ్రహ్మార్పణము గాఁగ, సకలకర్మములును సలుపువానిఁ
బాపంబు లంటవు పద్మపత్రంబును, సలిలంబు లంటని చందమునను
యోగులు సంగంబు నుజ్జగించుచు నాత్మ, శుద్ధికై మనముచే బుద్ధిచేతఁ
దనువుచేతను మమత్వమును వీడిన యింద్రి, యములచేఁ గర్మము లాచరింత్రు,

ఆ. యోగి కర్మఫలము నుజ్జగించుచు నిష్ఠ, సంభవించు నట్టి శాంతి నొందుఁ
గామి యగుచు యోగి గానివాఁడు ఫలప్రసక్తి బద్ధుఁ డగును సంతతంబు. 148

తే. తెలివిఁ గర్తృత్వకారయితృత్వములను, గైకొనక జితేంద్రియుఁ డెల్లకర్మములను
విడి నవద్వారపురమనం బడెడు దేహ, మందుఁ బొందుగ నివసించు నమలచరిత.

తే. తలపఁ గర్తృత్వమును గర్మములును గర్మ, ఫలమును యోగమును మహాప్రభువు లోక
మునకుఁ గా సృజియింపఁడు పొసఁగు నంత, యును స్వభావమునం జేసి యొనరుచుండు.

క. ఎవ్వని పాపము పుణ్యము, నవ్విభుఁడు గ్రహింపఁ బూనఁ డజ్ఞానమునం
గప్పఁబడు జ్ఞానమందున, నివ్వటిలున్ జంతువులకు నెఱి మోహంబున్. 151

క. జ్ఞానమున నెవ్వ రాత్మా, జ్ఞానము నశియింపఁ జేయఁ జాలుదురో తద్
జ్ఞానము వారికి రవివలెఁ, గానంబడి వెలుఁగఁ జేయుఁ గదె పరమంబై. 152

తే. జ్ఞాననిర్ధూతకల్మషు లైనవారు, బ్రహ్మమున బుద్ధి నిలిపియు బ్రహ్మనిష్ఠ
లయ్యు బ్రహ్మపరాయణు లయ్యు బ్రహ్మ, మయ్యు నపునరావృత్తిని నందఁ గలరు.

తే. విద్య వినయంబు గలిగినవిప్రునందు, గోవునందును గజమందుఁ గుక్కయందుఁ
గుక్కఁ దినువానియందును నొక్కచూపు, చేయుచుందురు పండితుల్ శ్వేతవాహ.

సీ. సమభావమున నేరి స్వాంత ముండునో వారు, నిర్జితజన్ములై నెగడి యుంద
బ్రహ్మంబు సమము నిర్దోషంబు గావున, బ్రహ్మమునం దున్నవా రగుదురు

బ్రహ్మనిష్ఠుం డగు బ్రహ్మవిదుం డస,మ్మూఢుం డై స్థిరబుద్ధి పొందుపడఁగఁ
బ్రియము లైనయెడల నప్రియము లైనయెడల సం,తోషదుఃఖంబులఁ దొడరఁ బోఁడు,

తే. బాహ్యవిషయంబులం జిక్కువడక యెవండు, భావమున సుఖించునొ వాఁడు బ్రహ్మయోగ
మున సమాహితచిత్తుఁడై యనుభవింపఁ, గలఁడు తా నక్షయసుఖంబు సలలితాత్మ.

తే. వినుము విషయేంద్రియస్పర్శమునను బుట్టి, మొదలు తుది గల్గి కడుదుఃఖములకు నెల్ల
మూల మగు భోగములయందు బుద్ధి సేయఁ, బోఁడు బుధుఁ డని యెఱుఁగు మోకిరీటి నీవు.

క. కామక్రోధోద్భవ మై, భీమం బగు వేగ మొడలు విడుటకు మున్నీ
భూమి సహింపఁగ శక్తుం, డామనుజుఁడు సతము యుక్తుఁ డగు సుఖియు నగున్. 157

సీ. అంతస్సుఖుం డంతరారాముఁ డంతఃప్ర,కాశుఁ డై యెవ్వఁడు గ్రాలుచుండు
బ్రహ్మభూతుఁ డయి పరఁగి పొందును బ్రహ్మ, నిర్వాణ మాయోగి నేత యింద
ఋషులు పరిక్షీణకల్మషు లయి ఛిన్నసం,శయు లయి నియతాత్ము లయి సమస్త
భూతహితరతు లై పొందుగం బొందుదు,రా బ్రహ్మనిర్వాణ మట్లు మఱియుఁ,

తే. గామమును గ్రోధమును వీడఁ గలిగి నియత
చిత్తు లై విదితాత్ము లై చెలఁగు నట్టి
యతులు బ్రదికియుఁ జచ్చియు నందఁ గలరు
మోక్షపద మని యెఱుఁగు మో పుణ్యమూర్తి. 158

సీ. బయులఁ ద్రోయుచు బహిర్భవవిషయంబుల, భ్రూమధ్యమున నిల్పి పోసఁగ దృష్టి
నాసాంతరమునఁ బ్రాణము నపానంబును, సమములు గా నాడ నలిపి యింద్రి
యములు మనము బుద్ధి నరికట్టి మోక్షప,రాయణుం డయి యుండునట్టి వాని
కోర్కియుఁ భయమును గ్రోధంబు విడనాడి, నిత్యముక్తుం డయి నెగడఁ బడుచు,

తే. నఖిలయజ్ఞతపోభోక్త యనియు మఱియు, నఖిలలోకమహేశ్వరుం డనియు నఖిల
భూతజాలసుహృదుఁ డని బుద్ధి నన్నుఁ, బోలఁగ నెఱింగి శాంతిని బొందు ననఘ.

—♦ అ. 6 — ఆత్మసంయమయోగము ♦—

వ. అని యిట్లు కర్మసన్యాసయోగం బెఱింగించి భగవంతుండు వెండియు. 160

తే. ఫలముఁ గోరక నిచ్చలు సలుపఁ దగిన, కర్మముల నెల్ల సలిపెడు కర్మి యెవ్వఁ
డతఁడు సన్యాసియును యోగియగును గాని, యక్రియుండును నగ్నియు నతఁడు గాఁడు.

తే. ఏది సన్యాసమునఁ బెద్ద లెంచుచుంద్రు, యోగమున దాని నెఱుఁగుమీ యుల్లమందు
న్యస్తసంకల్పుఁ డై యుండనట్టివాఁడు, యోగి నాఁ బడఁ డెప్పుడు నో గుణాఢ్య 162

ఆ. ఆరురుక్షమునికి నలకర్మమును యోగ, కారణం బటంద్రు ధీరు లట్టి
యోగమం దెసంగు యోగికి శమ మది, కారణంబ యగును గారవేంద్ర. 163

నిలుపుకొనఁ జాలు నప్పుడా నలలితమతి
యుక్తుఁ డని చెప్ప నొప్పు నియ్యుర్వియందు. 172

క. యతచిత్తుం డయి యోగం, బతికనవరి యోగియాత్మ యనిలరహిత మహా
క్షితియందు వెలుఁగుదీపము,గతి చలనము లేక యుండుఁ గౌరవముఖ్యా. 173

సీ. ఘనయోగ సేవచేత నిరుద్ధ మగుచిత్త, మేయోగమున సుఖియించు చుండు
నాత్మ నాత్మం జూచునట్టి దై యేయోగ, మున నాత్మసంతుష్టిఁ బొందు చుండు
నాత్యంతిక మతీంద్రియమును బుద్ధిగ్రాహ్య,మగుసుఖ మేయోగమం దెఱుంగు
నేయోగమున నుండి యాయోగి తద్భావ,మున నుండి చలియింపఁ బోవ కుండు,

తే. నేది పొంది యితరలాభ మెంచఁ డధిక, మనుచు నెందుండి ఘనదుఃఖ మైనఁ గదలఁ
డదియె దుఃఖ యోగము లేనియట్టి యోగ, మనియెఱిఁగి దానిఁ దొడరనొనలరుమతిని.

మ. ఘనసంకల్పసముద్భవంబు లగునాకా మంబు లెల్లం ద్యజిం
చి నెఱిం గట్టిగ శేంద్రియంబుల ధృతిం జెల్వొందుబుద్ధిఁ మనం
బు నిజాత్మస్థము గా నొనర్చ గరమింబుం బూని యాత్మేతరం
బు నొకంతేనియుఁ జింతె సేయ కెపుడుం బొల్పొంద నౌ యోగి యై. 175

తే. చంచలం బస్థిరం బగునట్టి మెట్ట్ట,యెట్టిరీతిగఁ జరియించు నట్టి యట్టి
రీతినుండి మరల్చి విశ్రాంతి మెఱయ, నాత్మవశమునఁ నిలుపఁగ నగును పార్థ. 176

సీ. శాంతమానసుఁడు శాంతరజోవృత్తి,ముఁ డకల్మషుఁడు బ్రహ్మభూతుఁ డైన
యోగి నుత్తమసుఖ మొందు నిగ్గతి నాత్మ,యోగమునం గూర్చు చున్నవాఁడు
విగతకల్మషుఁ డయి వెలసిన యోగి బ్రహ్మస్పర్శ మత్యంత మైనసుఖము
పొందు ననాయాసముగ నెల్లపుడు యోగ,యుక్తాత్ముఁ డెంతయు నొప్పమీఱు,

తే. నంతటను సమదర్శనుం డగుటఁ జేసి, తనదునాత్మను సర్వభూతములయందు
సర్వభూతములుం దననదమలాత్మ, యందు వీక్షించు చుండు నహర్నిశంబు. 177

క. సర్వమునందును నన్నుఁ, సర్వము నాయందు దేవమ సమ్యగ్దృష్టుల్
సర్వఁగఁ గను నతనిక నే, నుర్విని నా కతఁడు లేక యుండము తెలియన్. 178

తే. ఎవ్వఁ డేకత్వమును బొంది యెల్లభూత,వితతి నెసఁగెడునన్ను సేవించు చుండు
నమ్మహాయోగి సర్వవిధమ్ములఁ దిరుగాడు చున్నను నాయందె క్రాడి మెలఁగు.

తే. ఎందునాత్మోపమాభావ మొందియెవఁడు, సుఖముగాని దుఃఖముగాని సొరిది సమత
నరయుచుండునో యోగి యై యలరునతఁడు, పరముఁడనుచుఁదలంపఁగఁబడినవాఁడు.

వ. అనిన నర్జునుం డిట్లనియె. 181

మ. సమతం జెప్పితి విట్టియోగ ముఖలేశా! నే మనశ్చంచల
త్వమునం దానిస్థిరస్థితిం గలుగమిన్ వర్తింతు నోకృష్ణ! చి
త్తము లోలంబు ప్రమాథియుం బ్రబలముం దన్నిగ్రహం బెన్న
నుగ్రమరున్నిగ్రహ మట్లు దుష్కరముగాఁ గన్గొందు డెందంబునన్. 182

వ. అనిన భగవంతుం డి ట్లనియె. 183

తే. సందియము లేదు మనము చంచలము గాన, నిగ్రహింప నశక్యమ్మ నే నెఱుఁగుదు
నైన వైరాగ్యమునను నభ్యాసమునను, వశముగా దానిఁ గైకొనవచ్చు విజయ.

తే. సంయతాత్ముఁడు గాకున్న జనున వడను, యోగమని నాదునిశ్చయ మ్మొగి మనమును
పాయమున గెల్చి యత్నంబు సేరఁగఁ జేసి, నట్టఁ డగునేని పొంద శక్యంబు సూవె.

సీ. అనవుడు నర్జునుం డన్ని శ్రద్ధాసమన్వితుం డయ్యుఁ బ్రయత్నశూన్యుఁ
డయి యోగసంసిద్ధి నందఁ జాలక యోగ, చలితాత్ముఁ డై తుదిసమయమందు
నేగతి నొందెడు నెఱిఁగింపుము మహాత్మ, యుఁడు బ్రహ్మమార్గసంయోగమందు
నొగి మోహమునుబొంది యుభయవిభ్రష్టుఁడై, ఛిన్నాభ్రమట్టులు చెడఁడుగదవె,

తే. చెప్పు మీసంశయంబు నిశ్శేషముగను, దీర్చుటకు నీవ తగుదువు దీని నన్యు
లెవ్వరుం దీర్పఁ జాలరు కృష్ణ యనిన, నర్జునున కిట్లు వచియించె నచ్యుతుండు. 186

క. ఇందును నందు వినాశం, బొందఁడు సుకృతికిఁ గాని యోగభ్రష్టుం
డెం దైనం గల్యాణము, పొందుఁగఁ గావించువాఁడు పొందఁడు చెడుగుల్. 187

తే. పుణ్యకృత్తులలోకముల్ పొంది యందు, బహుళసమలుండి యోగవిభ్రష్టుఁ డైన
వాఁడు శుచులు శ్రీమంతులై వఱలువారి, గేహమున వెండియుం బుట్టి కీర్తిఁ గాంచు.

తే. అట్లు కాదేని ధీమంతు లైన యోగి, వర్యులకులంబునను బ్రభవంబు నొందు
నిట్టిజన్మము లోకమం దేది కలదొ, యది కడుంగను దుర్లభ మగును సూవె. 189

సీ. ఆజన్మమునయందు సతఁడు ప్రాక్తనజన్మ, బుద్ధిసంయోగంబు పొందఁ గలుగు
నందున సంసిద్ధి నందుటకై వెండి, యును సుప్రయత్నము పొనరుచుఁ గద
యవశుఁ డయ్యును బూర్వభవగతాభ్యాసము, వలన నాకర్షింపఁ బడును దెలియ
యోగజిజ్ఞాసుఁ డై యుండునాతఁడు, ప్రకృతిప్రతిపత్తి నతిక్రమించు,

తే. నందునఁ శుద్ధకిల్బిషుఁ డయి యనేక
జన్మసంసిద్ధి గలఁ డయి జతనమునను
యోగమున యతమానుఁ డై యుండు యోగి
పరమగతి నొందు నను దులో నరయు మనఘ. 190

క. ఎన్నఁగ యోగి తపస్వుల, కన్న న్మంత్రాదిశాస్త్రకలితులకన్నన్
సన్నుతకర్మిప్రవరుల, కన్నఁగ ఘనుఁ డీవు యోగి గ మ్మోపార్థా. 191
తే. మద్గతం బగునంతరాత్మం దలిర్చి, శ్రద్ధధానుఁడై యెవఁడు నన్ సతముఁ గొల్చు
చుండు యోగులందఱలోన యుక్తతముఁ డ,తం డనుచు నేఁ దలంచెదఁ బాండుతనయ.

—•అ. 7—జ్ఞానయోగము.•—

వ. ఇట్లాత్మసంయమయోగం బెఱింగించి శ్రీకృష్ణుండు వెండియు. 193
సీ. నన్నాశ్రయించుచు నాయందుఁ దవిలిన,మదితోడ యోగము నడుపఁ జేసి
సంశయంబులు వోవ సంపూర్ణముగ నన్ను, నెఱుఁగఁ జాలినజ్ఞాన మిట్లు వినుము
దేని నెఱింగినపై నొం డెఱింగెడు,జ్ఞానంబు శిష్టమై కానఁ బడదొ
విజ్ఞానసహితమై వెలయునాజ్ఞానము, నే సమగ్రముగ నీ కెఱుకపఱతు,
తే. వేనవే లగుమనుజులలో నొకండు, యత్నమొనరించు సిద్ధికై యట్టిసిద్ధి
గలుగువారలలోన నొకానొకండు, నన్నెఱుఁగఁ జాలుఁ గలరూపునం గిరీటి. 194
క. ధారుణియు జలము ననలము, మారుతమును నంబరంబు మది మతియు నహం
కారము ననునివ్వెనిమిది, తీరుల నగుప్రకృతి నాయదియ తలపోయన్. 195
ఆ. ఇది నికృష్టమైన దియ్యచేతనమైన, ప్రకృతికంటె వేఱుప్రకృతి గలదు
జీవభూతమగుచుఁ జేవజగము దాల్చు, నదియు నాకు ముఖ్యమైనయదియ. 196
ఉ. భూతము లెల్ల నీప్రకృతిభూతము లంచు నెఱుంగు మిట్టినే
నేతఱి సర్వలోకముల కేడ్గడనై ప్రభవప్రణాశని
ఖ్యాతుఁడనైతి మత్పరతరాన్య మొకింతయు లేదు నాయెడన్
స్యూతము సర్వముం దెలియ సూత్రమునన్ మణిసంతతుల్ బలెన్. 197
సీ. నే నుదకంబులం దెనఁగురసంబును, రవిశశాంకులయందుఁ గ్రాలుప్రభయు
నెల్లవేదంబులం జెల్లినప్రణవంబు, నాకాశమునయందు నలరురవము
పురుషమూర్తులయందుఁ బొసఁగుపౌరుషమును, భూమియందుం బొల్చుపుణ్యగంధ
మాశ్రయాశునియందు ననువొందుతేజంబు, జీవులందుఁ దలిర్చుజీవనంబు,
తే. తపసులం దొప్పుతపమునై తనరుచుందు, భూతములకు సనాతనభూతమనియు
బుద్ధిమద్వరులకు మహాబుద్ధియనియు, నన్నెఱుఁగుమయ్య నీవు జగన్నుతమతి. 198
తే. ఏను దేజస్వులకుఁ దేజమే బలులగు,వారికిం గామరాగవివర్జితబల
మఖిలభూతములకును ధర్మావిరుద్ధ,మైనకామము నైతి నోయనఘ వింటె. 199
తే. ఏవి సాత్త్వికభావము లేవి రాజ, సమ్ములో యెవ్వి యెవి తామసములో యవ్వి
యన్నియును నావలనఁ బుట్టెనని యెఱుంగు,మందు నే లేను నాయందు నవ్వియుండు.

చ. త్రిగుణవికారభావములఁ దేజిత మీజగ మెల్ల మోహితం
బగుచుఁ బదార్థకోటిపరుఁడై తగునవ్యయు నన్నెఱుంగ లే
దు గుణమయంబు దైవి యయి తోఁచిననాదగుమాయ మీఱి రా
వోగిఁ దరియింత్రు నన్నె శరణొందినవారలు దాని నిద్దరన్. 201

మత్త. ఆసురం బగుభావ మొందినయట్టివారు నరాధముల్
గోష్ఠు వెట్టెడుమాయ జ్ఞానము గోలుపోయినయట్టిరున్
బోసరంబున మూఱుపుంతలఁ బోవుమూఢులు నాఁగ నొ
ద్దోసకారులు నన్ భజింపఁగఁ దోఁప రెందు ధనంజయా. 202

తే. ఆర్తుఁ డర్థార్థి జిజ్ఞాసు వైనవాఁడు, జ్ఞానవంతుఁడు ననునాల్గుచందములను
బొదలుసుకృతాత్ములగుజనుల్ పొందిపొసఁగి, నన్ను సేవించుచుందురో సన్నుతాత్మ.

క. ఈనలువురిలో నుత్తముఁ, డై నెగడెడు నిత్యయుక్తుఁడై యేకభక్తిం
బూనినజ్ఞాని యతఁడు నా, కే నతనికిఁ బ్రియుల మనుచు నెఱుఁగుము పార్థా. 204

క. వీ రందఱును న్నాకు ను,దారుల యయిన యుంగ్ర జ్ఞాని దా యుక్తాత్ముం
డై రహిం నన్నే గతి గా, నారయుఁ గావున మదాత్మ యని నేఁ దలఁతున్. 205

తే. ఎవఁ డనేకజన్మంబుల కవల జ్ఞానవంతుఁ డయి పుట్టి సర్వము వాసుదేవుఁ
డనుచు నన్నుపాసించెను నట్టివాఁడు, పుణ్యచిత్తుండును సుదుర్లభుండు సూవె. 206

ఆ. స్వీయ మైనప్రకృతిచే నియతాత్ములు, నట్టికామములను గొట్టఁబడిన
జ్ఞాను లైనవార లాని తన్నియమంబు, నన్యదేవతల సమాశ్రయింత్రు. 207

సీ. ఎవ్వఁ డేరూపము నెంచి భక్తుం డయి, శ్రద్ధ నర్చింప నిచ్ఛం బొనర్చు
నవ్వాని కాశ్రద్ధ యచల మై నిలిచెను, నట్లు గా నెంచి నే నాచరింతు
నాతఁ డాశ్రద్ధతో నలరారుచుం దత్త,దారాధన మొనర్పఁ గోరు చుండు
నాకారణంబున నాలోకికల నెల్లఁ, బొసఁగ నే నొసఁగినఁ బొందు చుండు,

తే. నల్పమేధసు లగువారి కాఫలంబు, గలుగు నాశము గలది యై తెలియ నన్య
దేవతలఁ గొల్చువార లాదేవతలన, కలియుదురు నన్ను నాభక్తగణము లట్లు. 208

ఆ. బుద్ధిహీను లైనపురుషులు నాదున,వ్యయ మనుత్తమంబు నైనపరమ
భావ మెఱుఁగ లేక వ్యక్తు నవ్యక్తునిఁ, గా ననుం దలంత్రు మానసమున. 209

సీ. యోగమాయం గూడి యున్న నే నందఱకు నజస్రము ప్రకాశకుఁడను గాను
మూఢ మీలోకము పొడఁగానఁ జాలదు, నన్నజు నవ్యయు సన్నుతమతి
నే నెఱుంగుదు వర్తమానములు భవిష్య,ములు భూతములు నగుభూతములను
నన్నొకఁడు నెఱుంగఁ డెన్న భూతము లెల్ల, నిచ్ఛయు ద్వేషంబు నెసక మెసఁగఁ,

తే. బుట్టినష్ట ద్వంద్వంబులమోహ మొందుఁ, బుణ్యకర్మములం బాపములఁ బడంచు
జనులు ద్వంద్వమోహంబులజతను విడిచి, నను భజింత్రుదృఢవ్రతు లనఘమూర్తి.

తే. వేరు జరయును మరణంబు విడుచుపొంటె
నన్నుఁ దగ నాశ్రయించి యత్నము పొనర్తు
రట్టివార లాబ్రహ్మ మధ్యాత్మ మఖిల
కర్మము నెఱింగి యుందు రోకారవేంద్ర. 211

క. ఏవా రధిభూతం బధి, దైవం బధియజ్ఞ మనుచుఁ దగ నన్ను మదిలో
భావింతురో వా ర్స్మృతులై, పోవుచు యుక్తాత్ము లగుటఁ బొందుదురు నన్నా.

—: అ. 8—తారకబ్రహ్మయోగము :—

వ. అని విజ్ఞానయోగం బెఱింగించిన నర్జునుండు శ్రీకృష్ణుం దిలకించి బ్రహ్మమేది? యధ్యాత్మ మెట్టిది? కర్మమన నెట్టియది? మఱియు నధిభూతంబు నధిదైవతంబు నధియజ్ఞంబు నేవి? యీదేహంబున నధియజ్ఞుం డెవ్వఁడు? నియతాత్ములు ప్రయాణకాలంబున నిన్నెట్లు తెలియుదురు? చెప్పు మనిన భగవంతుం డిట్లనియె.

సీ. బ్రహ్మంబు పరమాక్షరంబు స్వభావ మధ్యాత్మము భూతభావాదిజనక
మగువిసర్గము కర్మ మధిభూతము క్షరభావము పురుషుఁ డధిదైవతము మఱియు
నీదేహమునయందు నే నధియజ్ఞుఁడ, నంతకాలమున న న్నాత్మఁ దలఁచి
కొనచుఁ గళేబరమును విడి నాస్వభావము నొందెడు నసంశయముగఁ బార్థ,

ఆ. మరణకాలమందు మఱియు నెల్లప్పుడే, భావ మొందు నట్టిభావమునను
భావితాత్ముఁ డగుచు వర్ష్మంబు విడిచిన, జనుఁ డట్టిభావ మొనరుచుండు. 214

తే. కావున న్నీవు న న్నెల్లకాలములను, దలఁచుకొనుము సమరమున సలుపు మెపుడు
నీమనము బుద్ధి నాయందు నిలిపితేని, పొందెదవు నన్నె సందేహ మిందు లేదు. 215

ఆ. అన్యగామి గాక యభ్యాసయోగసంయుక్త మయినచిత్త మొప్పఁ జేసి
ప్రాకృతుండు గానిపరమపురుషు నన్ను, సంస్మరించి నన్నె నరుఁడు బొందు. 216

సీ. కవి పురాతనుఁడు సకలము శాసించువాఁ, డణువుకన్న నణువైనవాఁడు
నెల్లలోకములను సృజియించువాఁడును, దలఁప శక్యము గానితనువువాఁడు
తమమున కవ్వల ద్వాదశాత్ముఁడు వోలె, నెఱలువర్ణము గలవాఁడు దివ్యుఁ
డగుపరపురుషు భక్తిగలాఁ డెవఁడు యోగబలయుక్తుఁ డగుచు నిశ్చలమనమున,

తే. మరణకాలమునందు భ్రూమధ్యమందుఁ, బ్రాణవాయువు లెస్సగాఁ బాదుకొలిపి
ధ్యాన మొనరించునో వాఁడు తత్పదంబు, బొందఁగలఁ డని యెఱుఁగు మోపూరువంశ్య.

వ. వేదవేత్తలు లేపదంబు నక్షరంబుగం జెప్పుదురో దేనిని వీతరాగు లగుయోగులు
పొందుదురో దేనిం బొంద నెంచినవారు బ్రహ్మచర్యంబునం జరింతురో దాని
నీకు సంగ్రహంబుగం జెప్పెద నాకర్ణింపుము. 218

ఉ. ఎమ్మది నెల్లద్వారముల నిల్పి మనంబు హృదబ్జమందు ని
త్యమ్ముగఁ జేసి మూర్ధమునఁ బ్రాణము నాఁగఁగఁ బట్టి యోగి నై
యోమ్మను బ్రహ్మవాచకము నోం డగునక్షర ముచ్చరించుచు
న్నెమ్మి ననుం దలంచి మరణించినవాఁడు పరంబు నొందెడున్. 219

తే. ఎడ తెగక యెవ్వఁడు న్నన్ను నెవఁడ ననన్య, మైనచిత్తమున స్మరించు నట్టినిత్య
యుక్తుఁడును మహాయోగియై యుండువాని, కేను సులభుండ నయ్యెద నెపుడు విజయ.

క. వినుము మహాత్ములు పరసి,ద్ధిని గలవా రగుచు నన్నుఁ దెలిసిన పిదపన్
గోనేఁ బోవరు దుఃఖాలయ,మున శాశ్వత మైనజన్మముం గురుముఖ్యా. 221

సీ. నన్నుఁ బొందినపయి నరుల కెప్పుడు పున,ర్జన్మంబు గలుగనేరదు తలంప
బ్రహ్మలోకము దాఁట్టి పరఁగినలోకముల్, వెండియు నావృత్తి నందు నవి య
కాలజ్ఞులు చతుర్యుగసహస్ర మజునకుఁ, బగ లంత యైన రే యగు నటంచు
పగటి నవ్యక్తుఁడౌ బ్రహ్మవలన నెల్ల, వ్యక్తు లగుఁ రేయి యటన యడఁగుఁ,

తే. గర్మవశమున భూతసంఘం బిదెల్ల, నిట్టు లహరాగమంబునఁ బుట్టి పుట్టి
సరగ రాత్ర్యాగమంబునఁ జచ్చి చచ్చి, వెండియుం బుట్టి చచ్చుచు నుండు వింటె.

శా. ఆయవ్యక్తముకన్న నుత్తమము నిత్యం బింద్రియాగోచరం
బై యేవేళ నసంగు భావ మఖిలం బై పోయినం బోవ దె
ట్లాయవ్యక్తత నొంది వెండి జననం బొందం గఁ బో దక్షరం
బై యాసద్గతి నొప్పు నయ్యది మదీయం బైనధామం బగున్. 223

క. ఏవానిలోన భూతము, లేవేళం బొదలు నెవ్వఁ డసర్వముగా
నై వెలుఁగు పురుషుఁ డాతఁడు, భావింప ననన్యభక్తి పదసులభుఁ డగున్. 224

వ. ఏయేకాలంబుల దేహత్యాగంబు చేసినజ్ఞానులకు జన్మరాహిత్య పునర్జన్మంబులు
గలుగు నాయాకాలంబులఁ జెప్పెద వినుము. 225

సీ. అనలరూపజ్యోతియును బవల్ శుక్లము, నాఱుమాసము లుత్తరాయణంబు
నుత్తమదేవతాయుక్తము లపు డల్గి, బ్రహ్మవేత్త గమించు బ్రహ్మపదము
ధూమమును రాత్రియుఁ బోడరు కృష్ణంబును, నాఱునెలల్ దక్షిణాయనంబు
నపు డీల్గి యోగి హిమాంశుతేజము నొంది,యును బునర్జన్మము నొందు మరలు,

ఆ. శుక్లకృష్ణగతులు చొప్పడు నిట్లు శాశ్వతము లగుచు జగతి జ్ఞానులకును
మొదటిదానిచేతఁ బొదలు ననావృత్తి, కడమదాన జన్మ మడరు మరల. 226

క. ఈగతులు రెండు నెఱిఁగిన, యోగి యెన్నఁ డెపుడు మోహ మొందఁడు గానన్
వీఁగక నీ వేకాలము, యోగమునం బొంది యుండుము మోక్షద్యుమణీ. 227

తరళము. అరసి యోగి యి దెల్ల వేదములందు యజ్ఞములందు సు
త్తరతపంబులయందు నుత్తమదానధర్మములందు నే
వరఫలంబు ప్రతిష్ఠితం బయి వాసి గాంచు న దంతయున్
గరము మీఱి యనాది యై కడుఁ గ్రాలు తానము నొందెడున్. 228

—: అ. 9_రాజవిద్యారాజగుహ్యయోగము :—

వ. అని తారకబ్రహ్మయోగం బెఱింగించి భగవంతుం డర్జునుం గని గుహ్యతమంబు ను విజ్ఞానసహితంబును నగునీజ్ఞానము ననసూయుండవగునీకు నెఱింగించెద దీని నెఱింగి నీ వశుభంబుం బెడఁబాయుదు విది రాజవిద్య రాజగుహ్యము పవిత్రము త్తమము ప్రత్యక్షావగమంబు ధర్మానపేతం బనుష్ఠానసులభం బవ్యయంబు నీనియందు శ్రద్ధాభక్తులు లేనిజనులు నన్నుం బొందక మృత్యురూపసంసారమార్గంబునం బొందెద రాకర్ణింపుము. 229

సీ. అవ్యక్తమూర్తి నై యలరునాచేత నీజగ మంతయును వ్యాప్త మగుచునుండు
నఖిలభూతములు నాయం దున్నయవి నేను, వానియం దుండినవాఁడఁ గాను
బొందు గా నదియు నాయందు నుండవు నాను, నైశ్వరయోగంబు నరయు మేను
భూతభృత్తును గాను భూతస్థుఁడను గాను, భూతిభావనము నా పొదలుచిత్త,

తే. మెపుడు గగనస్థ మై యెల్లయెడల నడచు, మేటివాయు వదెట్టులు మెలఁగు నట్లె
సర్వభూతముల్ నాయం దెసఁగుచుండు, ననుచు నీవు దలంపు మోహమలమూర్తి.

సీ. అఖిలభూతములు కల్పాంతమునందు నా, దగుప్రకృతిం బొందు నంత మరలఁ
గల్పాది వాని నేఁ గలిగించుచుందు స్వప్రకృతి నధిష్ఠించి ప్రకృతివశము
వలన స్వాతంత్ర్యము గలుగనియాభూత, మండలము సృజింతు మఱియు మఱియు
నట్టికర్మములు నన్ గట్ట వసక్తుఁడ, నై యుదాసీనున ట్లలరు చుందుఁ,

తే. ప్రభు వయిననేను సచరాచరప్రకృతి సృజించెదం దాన జగము వర్తించు భూత
పతి నై యుననాదుపరమభావము నెఱుఁగక, నరుఁడనని నన్ను మూఢులు పరిభవింత్రు.

తే. ఆసురంబును రాక్షస మగుచు మోహ, మొనరుపం జాలుప్రకృతిని నొంది జడులు
నిష్ఫలజ్ఞానధనులును నిష్ఫలప్రయత్నులును నిష్ఫలాశలు నగుదు రవని. 232

ఆ. దైవి యయినప్రకృతిఁ దనరు మహాత్ములు, భూతములకు నాదిపురుషు నవ్య
యుని నన్ను గ్రహించి యొండు వోవనిమనంబున భజించు చుందు పురుషముఖ్య.

క. జతనించి దృఢవ్రతు లై, సతతము కీర్తించి మ్రొక్కి సంగతిఁ గల రై
స్తుతమతులు నన్ను నీశ్వరు, నతులితభక్తిన్ భజింతు రమలవిచారా. 234

తే. జగతిఁ గొందఱు జ్ఞానయజ్ఞమునఁ జేసి, తగ యజించి బహుత్వపృథక్త్వములను
విశ్వరూపుఁడై యున్నన న్వేడ్క నెఱుఁగ, నొప్పి యేకత్వముగ భజింతు రోయివిజయ.

సీ. నేనె మహాక్రతు వేన యజ్ఞంబును, నేన మహౌషధ మేనె స్వధయు
నేనె మంత్రంబును నేనె యాజ్యాదిక, మే నగ్నిహోత్రము నేనె హుతము
నేనె జగత్పిత నేనె పితామహుం, డేనె మాతృకయును నేనె ధాత
నేనె ఋక్సామము లేనె యజుస్సును, నేనె యోంకారము నేఁ బవిత్ర,

తే. మేనె వేద్యము గతియును నేనె భర్త, నేఁ బ్రభువు నివాసము నే సుహృత్తు
నేఁ బ్రభవలయస్థానము నే శరణము, నే నిధానము బీజము నేనె సాక్షి. 236

క. నేనె తపింపం జేయుదు, నేనే వర్షంబు నిలిపి నేనే విడుతున్
నేనె యసత్తును సత్తును, నేనే యమృతంబు మృత్యు వెఱుఁగుము పార్థా. 237

చ. శ్రుతులు పఠించి సోమపులు శోధితపాపులు నై సవంబు లం
చితగతిఁ జేసి స్వర్గమును జెంది యట న్వరదేవభోగసం
తతులను బొంది నైజసుకృతంబు క్షయించిన యంత వెండియున్
క్షితితల మొందుచుందు రిటు సిద్ధము కామఫలప్రసంగతిన్. 238

ఆ. వేదధర్మకర్మవిధి నాశ్రయించి యి, ట్లలరి కామకాము లగుచు దివికి
నేగి వచ్చుచుందు రిగ్గతి రాకపోక లగుఁ గర్మఫలము కాంక్ష సేయ. 239

ఆ. ఏమహాత్ము లన్య మెఱుఁగనివార లై, నన్నుఁ దలఁచి కొలుచు చున్నవారొ
నిత్యయుక్తు లగుచు నెఱి గొన్నవారి యోగమును క్షేమ మేను గాంచు చుందు.

ఆ. అన్యదేవభక్తు లై యేరు శ్రద్ధాస, మన్వితాత్ము లగుచు యజ్ఞముల య
జింతు రట్టివార లెంతయు నవిధిపూ, ర్వముగ నన్నె కొలుచువారు సూవె. 241

సీ. ఎల్లయజ్ఞములకు నేనె భోక్తను బ్రభు, విట్లు తత్త్వమున వా రెఱుఁగ రందు
వలనఁ జ్యుతిం బొందఁ గలరు దేవతల దే, వవ్రతుల్ పితలఁ బితృవ్రతులును
భూతంబులను భూతపూజకుల్ పొందుదు, రట్లు నన్ సేవించునట్టిరు ననుఁ
బత్త్రము పుష్పము ఫలము తోయము భక్తి, యతచిత్తుఁ డిడిన నే నది గ్రహింతు,

తే. నేది చేయుదు వేది భుజియింతు వేది, వేల్మి యొనర్తు వేయది ప్రీతిదాన
మిత్తు వేది తపింతు వ దెల్ల మత్స, మర్పణంబుగఁ జేయుము మాన్యచరిత. 242

తే. అనఘ ! సన్న్యాసయోగయుక్తాత్ముఁడ వయి,సలిపి యట్లు శుభాశుభ ఫలము లైన
కర్మబంధనముల వీడఁ గలిగి నన్నుఁ, బొందఁ గల వీవు సందియ మిందు వలదు. 243

ఆ. సముఁడ సర్వభూతసముదాయమునయందు,ద్వేషి లేఁడు నాకుఁ బ్రియుఁడు లేఁడ
టయిన నను భజించునట్టిరు నాయందు, నుందు రేను వారియందు నుందు. 244

క. సుదురాచారుం డైన, న్మది నన్యము రోసి నన్నె మానక కొలువన్
బొదలెడునాతఁడు సజ్జనుఁ, డ దలంపఁగ, మంచినిశ్చయము గలఁ డగుటన్. 245

తే. అతఁడు ధర్మాత్ముఁ డగు శీఘ్రగతిని శాశ్వ,త మ్మయిన శాంతి నొందుఁ జిత్తమునందు
నరయు మో పార్థ! నాభక్తుఁ డైనవాఁడు, నాశనము నొందఁ డెన్నఁ డైనను నిజముగ.

మ. నను సేవించిన పాపు లైనఁ జెలు లైనన్ వైశ్యులున్ శూద్రు లై
నను దివ్యగతిఁ గందు రన్న నికఁ బుణ్యప్రోద్భవుల్ భక్తు లై
చనురాజర్షుల విప్రుల న్వలయునే చర్చింపఁగా నస్థిరం
బు నసౌఖ్యం బగులోకము న్దిట నను న్భజింపుమా నీ వెదన్. 247

క. నాపైఁ జిత్తముఁ గల వై, నాపూజ యొనర్చి భక్తి నను మ్రొక్కుము కుం
తీపుత్ర! మత్పరాయణుఁ, డై పొందెదు నన్నె నిర్మలాత్ముఁడ వగుచున్. 248

—♦ అ. 10—విభూతియోగము ♦—

వ. అని రాజవిద్యారాజగుహ్యయోగం బెఱింగించి భగవానుండు వెండియు నో పాండు
తనయా! సంతసించుస్వాంతంబు గలనీహితం బభిలషించి మరల నంతయు సవిస్త
రంబుగం జెప్పెద నాకర్ణింపు మని యిట్లనియె. 249

చ. అమరగణంబులు న్మహర్షులు నా ప్రభవం బెఱుంగ రే
నమరులకు న్మహర్షులకు నంతకు మూలము మర్త్యులందు మో
హము విడినట్టివాఁ డజు ననాది నను న్జగదీశుఁ గా వివే
కమతి నెఱుంగు వాఁ డఖిలకల్మషముక్తుఁ డగుం గురూద్వహా. 250

చ. శమదమముల్ మనీషయు యశం బయశంబును దానధర్మముల్
క్షమ సుఖదుఃఖము ల్తపము సత్య మమోహ మహింస తుష్టి యున్
సమత భవం బభావమును జ్ఞానభయాభయముల్ పృథగ్గతి
న్సమకుఱు భావముల్ జగతి నావలనం గలభూతకోటికిన్. 251

సీ. తొల్లి మానసు లయి తోఁచినసప్తర్షు,లును మనువులు నల్వురును మునీశు
భావనం బొదలి రవ్వారివలన నీస,మస్తప్రపంచము నవతరించె
నిట్టినాదువి భూతి నెంచి తత్త్వంబున, నాయోగ మెఱిఁగిననరుఁ డతండు
నిశ్చలయోగసన్నిహితుఁ డై యొప్పెడు, సందేహ మింతయుఁ జన దొనర్ప,

నేను శబ్దంబులలోన నేకాక్షర, మేను గిరులలోన హిమగిరియును
నేను యజ్ఞంబులలోన నౌజపయజ్ఞ, మేను వృక్షంబులలోన రావి,
తే. నేను దేవర్షిచంద్రులలోన నారదుఁడను గంధర్వగణములో నడరుచిత్ర
రథుఁడ నేనుసిద్ధులలోనఁ బరఁగుకపిలమునిననుచునీవెఱుంగు మోయనఘమఱియు.
సీ. అశ్వంబులందు న న్నమృతోద్భవం బగు, నుచ్చైశ్శ్రవంబుగా నున్నతంబు
లైనగజంబులయందు న న్నైరావణము గా నరులయందు నరవిభునిఁగ
నాయుధంబులను వజ్రాయుధంబుగ నన్ను, ధేనువులం గామధేనువుగను
బ్రజనయితలయందుఁ బరఁగుకందర్పుఁ గాఁ, బాములయందు నన్ వాసుకిఁ గను,
తే. నాగములయందు నన్ను ననంతునిగను
వఱలుయాదసులందు నన్ వరుణునిఁగఁ బి
తరులయం దర్యమునిఁగ నన్ దండధరుల
యందు జమునిఁగ నెఱుఁగు మోయనఘ! మఱియు. 259
సీ. ప్రథితదైత్యులలోనఁ బ్రహ్లాదుఁ డైతి నే, గణకులలోపలఁ గాలుఁ డైతి
మృగములలోన మృగేంద్రుండ నైతి నేఁ, బక్షులలోన సుపర్ణుఁ డైతిఁ
బావయితలలోనఁ బవనుండ నైతి నే, శస్త్రులలో రామచంద్రుఁ డైతి
మత్స్యసంతతులలో మకరంబు నైతి నే, నదులలో జాహ్నవీనది నయితిన్
తే. సర్గముల కాదిమధ్యాంతసరణు లైతి, వివిధవిద్యల నధ్యాత్మవిద్య నైతిఁ
బ్రబలవాదప్రవక్తలవాద మైతి, నక్షరములలోన నకార మైతి నేను. 260
క. ఎసఁగుసమాసంబుల ద్వంద్వసమాసము నేనె నాల్గువలఁకుల ముఖముల్
పొసఁగినధాతయు నేనే, యనశ్వర మక్షయము కాల మయ్యది నేనే. 261
శా. నేనే సర్వము మ్రింగుమృత్యువను నేనే భావికళ్యాణ సం
ధానోత్పత్తియు మత్తకాశినులలోనన్ లక్ష్మియుం గీర్తియున్
నేనే వాక్కును మేధయున్ స్మృతియు నేనే శక్తియున్ ధైర్యమున్
నేనే యోరిమి నేనె సర్వ మనుచు న్నీ వెంచు మోఫాల్గునా. 26
తే. సామములలోన నేబృహత్సామ మెల్ల, ఛందములలోన గాయత్రి సకలమాస
సముదయములోన మార్గశీర్షంబు ఋతుచయంబులోపలఁ గుసుమాకరంబు నేన
సీ. వంచన మొనరించువానిలో జూద మేన్, దేజస్వులకు మహాతేజ మేను
యత్నించువారి ప్రయత్న మేన్ విజయ మేన్, సత్వవంతుల లసత్సత్వ మేను
వరవృష్ణికులములో వాసుదేవుఁడ నేను, పాండవేయులలోనఁ బార్థుఁ డేను
మునితల్లజులలోన ఘనుఁడు వ్యాసుఁడు నేను, గవులలో భార్గవకవిని నేను,

తే. దమన మొనరించువారలదండ మేను, నృపజయము గోరువారలనీతి నేను
మహితు లియి గోప్య లగువారిమౌన మేను, జ్ఞానవంతు లయినవారిజ్ఞాన మేను.
క. భూతముల కాదికారణ, మై తనరితి నేను జరము నచరము నగునే
భూతమును నన్నుఁ గా దని, భూతలమున లేనిమాట బుద్ధి నరయుమా. 265
తే. దివ్యములు నావిభూతులు తెలిసికొనఁగ, నవ్యయంబు లనంతము లగు నియత్త
లేదు వానికి నం దొక లేశ మేను, వినిచి న ట్లగుఁ జువ్వె యి విస్తరంబు. 266
క. శ్రీమంతంబును నూర్జిత, మై మహితవిభూతియుక్త మై తగుసత్త్వం
బీమహి మత్తేజోంశజ, మై మెలఁగెడు ననుచు నెఱుఁగ నగు నీ కెడఁదన్. 267
క. అటు గాకుండిన విభివిగ, నిటు చెప్పిన దాన నీకు నేమి ఫల మగుఁగా
స్ఫుటముగ నే నీజగ మం,తటి నేకాంశమున నిలిపి తనరుదు నసఘా. 268

—అ 11–విశ్వరూపసందర్శనయోగము—

వ. అని విభూతియోగంబు సెప్పిన విని యర్జునుం డి ట్లనియె. 269
ఆ. నన్ననుగ్రహించి నలినాక్ష! యధ్యాత్మ,సంజ్ఞితంబు నిరతిశయము గోప్య
మయినపలుకు పలికి తందున నాదగు,నట్టిమోహ మెల్ల నడఁగి పోయె. 270
తే. నీసకాశమునఁగా వింటి నే సవిస్తరముగ భూతభవప్రళయములు నీదు
నవ్యయమహాత్త్వమును గమలాయతాక్ష!, నీవచించిన దంతయు నిక్కువంబ. 271
చ. అది యటు లైన నీపరమైశ్వర్యరూపముఁ జూడ కెంచితిఁగా
సదమలచిత్త! చూచుటకు శక్యము నా కగు నంచు నీమదిం
గదిరినయేని కోరితిని గావున నవ్యయ మైనదాని ని
ప్పదమునఁ జూప నెంచు మని పల్కిన నాభగవంతుఁ డి ట్లనుఁగా. 272
సీ. పార్థ! నారూపముల్ బహువిధంబులు దివ్య,ములు బహువర్ణాకృతులును గలవు
వేనవే లై వానివిధ మెల్లఁ గనుము రు,ద్రులు నశ్వులును వసువులును మరుతు
లాదిత్యులును గన నగుదు రదృష్టపూ,ర్వమ్ము లాశ్చర్యముల్ పలులు నందు
సచరాచరం బగుజగ మెల్ల నొకమూల, నడఁగు నన్య మె దైన నరయు మచట,
తే. నట్టినను నీవు ప్రాకృత మయినయట్టి,కంటితోఁ జూడఁ జాలవు గాన నీకు
దివ్యదృష్టి నొసంగెదఁ దేరి చూడు, మిపుడు నాదునైశ్వరయోగ మెల్ల విజయ.
వ. అని యనంతరంబ యోగేశ్వరుం డగుపుండరీకాక్షుం డర్జునునకు నైశ్వరం బగు
విశ్వరూపంబు సూపె నదియు ననేకవక్త్రనయనంబును ననేకాద్భుతదర్శనంబును
ననేకదివ్యాభరణంబును ననేకదివ్యోద్యతాయుధంబును దివ్యమాల్యాంబరధరం

బును దివ్యగంధానులేపనంబును సర్వాశ్చర్యమయంబును సర్వతోముఖంబును
ననంతంబును ననంతప్రకాశమానంబు నై కరంబు డంబు మీఱె నప్పుడు. 274

ఆ. ఏకకాలమందు నాకసంబున సహస్రార్కు లుదయ మైనయట్టిపొడల
నడరుకాంతి యమ్మహావిశ్వరూపసంభూతకాంతితోడఁ బోల్ప వచ్చు. 275

క. నరుఁ డపుడు దేవదేవుని,వరతనువునఁ బెక్కుగతులఁ బ్రవిభక్తం బై
పరఁగినజగమంతయునుం, బరికించెం బెలుచ నొక్కభాగమునందున్. 276

వ. పరికించి ఫాల్గునుండు విస్మయావిష్టుండును హృష్టరోముండు నై శిరంబు వంచి నమ
స్కరించి కృతాంజలి యై హరి కి ట్లనియె. 277

తే. దేవ! నీదేహమున సర్వదేవతలను, సర్వభూతవిశేషసంచయములఁ గమ
లాసనస్థు నీశుని బ్రహ్మ నఖిలఋషుల, నఖిలదివ్యోరగంబుల నరయుచుంటి. 278

శా. ఓవిశ్వేశ్వర! విశ్వరూప! నిను నేనో లెక్క లేనన్నిబా
హావక్త్రోదరనేత్రము ల్గలిగి సర్వాశావకాశంబులం
దేవ వ్యాల్గుననంతరూపునిఁగ వాసిం జూచుచున్నాఁడఁ గా
నీ విజ్ఞానము లేకపోయెఁ దెలియ న్నీయాదిమధ్యాంతముల్. 279

శా. తేజోరాశియు దీప్తిమంతుఁడును సందీప్తానలార్కప్రభా
రాజన్మూర్తియు నప్రమేయుఁ డగుచున్ రంజిల్లునిన్ దుర్నిరీ
క్ష్యౌజోవంతు ననంతునిన్ గదయుఁ జక్రాద్యాయుధంబు ల్కిరీ
టాజస్రాభరణంబులుం గలిగి డాయం జూచుచున్నా నిటన్. 280

ఉ. ఈవు పరుండ వక్షరుఁడ వీవు సమస్తజగన్నిధానము
న్నీవు వికారశూన్యుఁడవు నీవు ముముక్షుజనైకవేద్యవి
ద్యావృతమూర్తి వీవు పరమాత్ముఁడ వీవు సుధర్మగోప్తవు
న్నీవు త్రిలోకనేత వని నేను దలంతుఁ బురాణపూరుషా. 281

తే. ఆదిమధ్యాంతరహితు ననంతవీర్య,సహితు శశిసూర్యనేత్రు భాస్వద్ధుతాశ
వక్త్రు బహుబాహు నిన్ను విశ్వముస్వతేజ,మునఁ దపింపఁ గఁ జేయువానినిఁగఁ జూతు.

క. నీ వొకఁడ విపుడు నిండితి, ద్యావాభూమ్యంతరమున నఖిలాశల నో
దేవ! సువిస్మయ ముగ్రము, నీవిగ్రహ మరసి వడఁకు నిఖిలజగములున్. 283

మ. సురసంఘంబు లి వెల్ల నిన్ గలియుచుం జూపట్టు నిప్పట్ల దు
ర్భరభీతిం గొని మ్రొక్కుచుండిరి శిరోబద్ధాంజలు లొక్కొంద ఱిం
దరయన్ స్వస్తి వచించి పెక్కులు స్తుతివ్యాహారము ల్వల్కుచున్
వరసిద్ధర్షిసమూహము ల్వొగడు నీవంకన్ జగద్వల్లభా. 284

తే. మఱియు రుద్రు లాదిత్యులు మరుతులు వసు
వులును సాధ్యులు విశ్వు లశ్వులును నూష్మ
పులును గంధర్వయక్షాసురులును సిద్ధ
సంఘములు నిన్నుఁ జూచు రాశ్చర్య మొదవ. 285

క. బహుబాహూరుపదంబులు, బహుముఖనేత్రోదరములు బహుదంష్ట్రలు గ
ల్గి హాళాహాళి భీతిదునీ,మహదాకృతిఁ గాంచి జగము మఱిమఱి వడఁకున్. 286

మ. దివముం దాయుచు ననేకవర్ణములతో దీపించుచుం దీప్తది
వ్యవిశాలాక్షులు వ్యాత్తవక్త్రములు పర్వం బొల్చునిం జూచి మా
ధవ! నేఁ బ్రవ్యథితాంతరాత్మ నగుచుం ధైర్యంబు వో శాంతియు
న్లవ మేలేక భయంబునుం బడ నెడ న్వర్తించు చుంటిం జుమీ. 287

తే. ప్రళయకాలానలప్రతిభములు భీతిదములు దంష్ట్రికరాళముల్ త్వన్ముఖములు
కనినయంతన దిక్కులు గనఁగ లేక,సుగ మెఱుఁగ కుంటిని ప్రసన్నుఁ డగుము దేవ.

సీ. సకలావనీపాలసంఘంబులం గూడి, ధృతరాష్ట్రపుత్త్రకు లెల్ల వీరు
నట్లస్మదీయయోధాగ్రగణ్యులతోడ, గంగాసుతద్రోణకర్ణముఖులు
త్వరమాణు లై నిన్నుఁ దవిలియు దంష్ట్రాకరాళములు భయంకరములు నైన
నీవక్త్రములఁ జొచ్చి పోవుచుండిరి కొంద, అదె దంతములమధ్యమందుఁ జిక్కి,

తే. పొడిపొడిగ నైనతలలఁ గన్పడుచు నుండ్రు
జలము లెల్ల వెల్లువ యయి జలధి కేదిరి
వెసఁ బఱచునట్లు నరలోకవీరు లెల్ల
వెలుఁగు నీనోళ్ళఁ బడుచుండి రలఘుమూర్తి. 289

తే. బగ్గు మని మండునగ్గిలోఁ బతగపంక్తి, వడివడిం బాఱి పడి చచ్చుపగిది నీస
మస్తలోకము స్వవినాశనార్థము భవదాస్యమునఁ బ్రవేశించెడి నతిరయమున.

చ. నలుగడ మండునీదువదనంబులఁ జేసి సమస్తలోకము
ల్వాలుపఱి పో గ్రసించికొని లోఁ గొనుచుంటివి తేజసం జగ
త్తుల మిది యెల్ల నిండుకొనఁ దద్దయు నొప్పెడునీదుదేహదీ
ప్తులు కడు భీతిదంబు లయి తోఁచి ప్రతాప మొనర్చు నచ్యుతా. 291

తే. ఉగ్రరూపుఁడ వెవరొ నీ వామహాత్మ, తెలియఁ జెప్పుము మ్రొక్కెదఁ దేరికొనఁ బ్ర
సాద మొనరింపు మాద్యుఁడ వై దలిర్చు, నిన్నెఱుఁగ నెంతు నెఱుఁగ నే నీప్రవృత్తి.

వ. అనిన భగవంతుం డి ట్లనియె. 293

ఉ. కాలము నై జగత్త్రయము గల్గఁగఁ జేయఁ బ్రవృద్ధి నొందితిన్
లీల సమస్తలోకమును లీనము గా నొనరింప నుంటి నీ
కాలమున న్విపక్షు లగుకౌరవయోధకు లెల్ల ధర్మరా
జాలయముం గనుంగొనఁగ నయ్యెద రియ్యెడ నీవు తక్కఁగన్. 294

తే. కావునన్ లెమ్ము శత్రులఁ గండడంచి, యశముఁ గైకొమ్ము, ప్రాజ్యరాజ్యమ్ము ననుభ
వింపు మిందఱు నాచేతఁ జంపఁబడిరి, తొలుత నీవు నిమిత్తమాత్రుఁడవు గమ్ము.

తే. ద్రోణుఁడు స్భీష్ముఁడు జయద్రథుండు కర్ణుఁ, డన్య లగుయోధవీరులు హతులు నీవు
గెలుము వెఱకుము పెనకువ సలుపు మరివి, జయము నీ కగు నీరణస్థలమునందు.

క. అనునక్కేశవవచనము, విని కంపితగాత్రుఁ డగుచు విజయుఁడు కేల్దో
యిని మోడ్చి మ్రొక్కి వెండియు, ననుఁ గృష్ణుని గద్గదోక్తి నతిభీతుం డై. 297

సీ. ఓహృషీకేశ ! నీమాహాత్మ్యమున జగ, మెల్ల రంజిలి సంతసిల్లుచుండె
దెస లంటి పఱచె భీతిల్లి రక్షస్సంఘ, మెల్ల సిద్ధులు నమస్కృతు లొనర్తు
రది యొప్పు బ్రహ్మకు నాదికర్తవు మేటి, పెల్లరు ని న్నేటి కెఱఁగ కుందు
రెది యక్షరమ్మును సదసత్పరమ్ము న, య్యది నీవ దేవ ! మహానుభావ !,

ఆ. నీవ తలఁప నాదిదేవుఁడవు పురాణ, పురుషుఁడవును విశ్వపరనిధాన
మీవ పరమధామ మీవ వేద్యము వేత్త, వెందు నిండి యుంటి వీవ దేవ. 298

ఉ. నీవ సమీరణుండవును నీవ యముండవు నీవ వహ్నియు
న్నీవ పితామహుండవును నీవ పితామహుతండ్రి వబ్జుఁడు
న్నీవ ప్రచేతసుండవును నీకు ననేకసహస్రముల్ నతుల్
భావన చేసి చేసెదను భక్తి భజించుచు మాటిమాటికిన్. 299

తే. సర్వ! నీముందువెన్కల సర్వదిశల, నే నమస్కృతు లొనరింతు నీ వనంత
వీర్యవిక్రమములు గల్గి విశ్వ మెల్ల, నావరించుట సర్వాత్ముఁ డయితి నూవె. 300

చ. తెలియక నీమహామహిమ తెంపరి నై సఖుఁ డంచు నెంచి ని
న్నొలసి ప్రమాదపుంగరిమ నో ప్రణయంబువిధంబొ నెమ్మదిం
గలుగుట కృష్ణ! యాదవ! సఖా! యనుచుం బరిహాస మేర్పడం
బిలిచి పరాభవించితిని పెక్కువిధంబుల విశ్వవల్లభా. 301

తే. మఱి విహారశయ్యాసనమజ్జనాదు, లందు ని న్నెడ చేసి చేయక పరాభ
వింతు నంతయు సైరింప నంతరంగ, మందుఁ బ్రార్థించుచుంటి ని న్నప్రమేయ. 302

చ. చర మచరంబు ప్రాణితతిసర్వము దానికి నీవు తండ్రి వో
నిరతిశయప్రభావ ! పురుణింప జగత్త్రయమందును లేడు నీ.

సరియగువాఁడు నా వెవఁ డెసంగెడు నభ్యధికుం డొరుండు నీ
వరయ గురూ త్తరుండవు మహామహా! పూజ్యుల కెల్ల భంగులన్. 303

ఆ. కాన మేను వంచి నేను ని న్నీడ్యు నీశునిఁ బ్రసన్నుఁ జేసికొనెద నీవు
కరుణఁగొడుకుఁదండ్రిగతిఁబ్రియుంబ్రియుఁడట్లు, సఖుని సఖుఁడువోలెసైపఁదగుదు.

చ. కని విని నే నెఱుంగ నొకకాలమునాఁటికి నీదురూప మో
ఘనిభుజ! సంతసించితిని గాని భయంబునఁ దత్తఱించునా
మన మది గానఁ దొల్లి గరిమం గన వచ్చెడురూపుఁ జూపి నీ
వనయము సుప్రసన్నమతి వై కరుణింపుము లోకరక్షకా. 305

తే. ఓమహాత్మ! సహస్రబాహా! మహేశ!, తొంటియ ట్లీవు చక్రహస్తుండవు గది
వయి కిరీటముతో నుండ నరయ నుంటిఁ, బూర్వరూపముతోఁ జతుర్భుజుఁడ వగుము.

వ. అనిన భగవంతుం డి ట్లనియె. 307

సీ. నేను బ్రసన్నుఁడ నై నీకు నాత్మయోగమ్మునఁ దేజోమయమ్ము విశ్వ
మాద్య మనంతము నగుపరరూపముఁ, జూపితి నీవు గా కేపురుషుఁడు
నీనృలోకమున ము న్నీక్షించి యెఱుఁగఁడు, వేదయజ్ఞాధ్యయనాదికమున
దానక్రియల నుగ్రతపముల నే నిట్టి,దొరను న న్నెఱుఁగుట దుర్లభంబు,

ఆ. వలదు వ్యథయు మూఢభావము నీ కిట్టి,ఘోర మైనరూప మారసి భయ
మరుగఁ బ్రీతచిత్తుఁ డగుము నాతొంటిరూపమునుఁ జూడు మిదిగొ పార్థ! నీవు.

వ. అని పలికి వాసుదేవుండు వెండియు స్వీయరూపంబుఁ జూపి ప్రసన్నుం డై భీతా
త్ముం డగునర్జును నాశ్వాసించుటయు నతండు. 309

తే. అనఘ ! నీసౌమ్య మగుమానుషాకృతిఁ గని, చేతనము గల్గి బ్రతికితిఁ జిత్త మిపుడు
ప్రకృతిభావము నొందె నోపరమపురుష !, నావుడును భగవానుఁ డన్నరున కనియె.

క. ఈనారూపము దేవత, లైనను దర్శింప నెంతు రనిశము కొంతే
యా ! నీవు సుదుర్దర్శం, బై నెగడెడునట్టిదాని నరసితి వెన్నన్. 311

క. నీ వేవిధమునఁ జూచితి, వావిధమునఁ జూడ శక్య మగునే నన్నున్
భావింపఁగ వేదంబుల,చే వరయజ్ఞాదికంబుచే దానముచేన్. 312

క. విను మిట్టినే ననన్య, మ్మనఘ మ్మగుభక్తిఁ జేసి యరసికొనంగా
ఘనతత్త్వమునఁ బ్రవేశ,మ్మును బొందం దగుదు జుమ్ము పూరుకులేశా. 313

తే. సంగవర్జితుఁ డై యుండి సర్వభూత,సమితిపై వైరమును వీడి సతము మత్ప
రముఁడు మత్కర్మకృత్తయి ప్రాలుసట్టి, నాదుభక్తుఁడు తలపోయ నన్నె పొందు.

—•అ. 12. భక్తియోగము•—

వ. అనిన నర్జునుం డిట్లనియె. 315

ఆ. భక్తులిట్లు సతతయుక్తులై కొందఱు, నన్నెఱింగి కొల్తు రన్యు గొంద
ఱక్షరంబు బ్రహ్మ మవ్యక్తమును గొల్తు, రిందు యోగవేత్త లెవరొ చెపుమ. 316

వ. అనిన భగవంతుం డిట్లనియె. 317

సీ. సతతయుక్తులు వరశ్రద్ధాసమన్వితు, లయి యెవరు నాయందు స్వాంత ముంచి
నన్నుపాసించుచున్నారొ వారలు యుక్తతము లభిప్రేతులు తలఁప నాకు
వినుము పరంతప! వేరింద్రియగ్రామ, మరికట్టి సమబుద్ధు లగుచు నెపుడు
నక్షర మచల మవ్యక్త మనిర్దేశ్యము ధ్రువంబు కూటస్థమును నచింత్య,

తే. మగుచు సర్వత్రగం బయి యలరు బ్రహ్మ, మారసి భజింతురో వార లఖిల
భూతహితరతులై నన్నె పొందఁగలరు, తెలియఁ జెప్పితి నింతయుఁ దెల్లముగను.

వ. మఱియు నవ్యక్తం బగునాత్మస్వరూపంబునం దాసక్తం బగుచిత్తంబు గలవారలకుఁ
గ్లేశం బధికతరం బగు నవ్యక్తం బగుగతియు దేహాభిమానవంతులకుఁ గష్టసాధ్యం
బుగం బొందఁ దగు నాకర్ణింపుము. 319

ఉ. వేరు సమస్తకర్మములు పెట్టియు నాపయి నాకుఁ గూర్చుచు
న్నారె కనన్యయోగమున నన్నుఁ దలంచి చెదిరిక భజింతురో
వారల నుద్ధరించెదను వాసవనందన! మృత్యురూపసం
సారమహాబ్ధినుండి యరుసంబున నింతటిమాత్రలోపలన్. 320

సీ. కావున నాయంద నీవు నిమనమును, బుద్ధిని నెలకొల్పఁ బూను మవల
నిలుతువు నాయంద నిస్సంశయంబుగ, నట్లు దిరంబుగ స్వాంత మూఁగ
నోపవే నభ్యాసయోగంబున న్నన్నుఁ, బొందంగ నిశ్చయింపుము గిరీటి!
యభ్యాసమునను నీ వసమర్థుఁడవ యేని, నిరతము మత్కర్మపరుఁడ వగుము,

తే. తలఁపఁగ మదర్థకర్మము సలిపికొనియు, సిద్ధి నొందెద వట్లును జేయ శక్తి
యలర దేనియు మద్యోగ మాశ్రయించి, సర్వకర్మఫలత్యాగసరణిఁ గనుము. 321

తే. జ్ఞాన మభ్యాసమునకన్న శస్యతరము, దానికన్నను ధ్యానంబు దనరు దాని
కన్నఁ గర్మఫలత్యాగ మెన్న నొప్పు, దానికన్నను శాంతి మే లౌను బిదప. 322

సీ. ఎల్లభూతంబుల నెపుడు ద్వేషింపక, కరుణయు మైత్రియుఁ గలిగి మమత
యును నహంకారము నొగి వీడి సమదుఃఖ,సుఖుఁడును క్షమియు నై చూడ నొప్పి
సతము సంతుష్టయు సంయతాత్మయు యోగ,మును దృఢనిశ్చయమును దలిర్ప
భక్తుఁడై నాయంద పరఁగమనముబుద్ధి, ననుఁ గొల్చుపురుషుఁడు నాకుఁ బ్రియుఁడు,

తే. వేనివలన లోకంబు క్షోభింప దెవ్వఁడు, లోకమువలన క్షోభింపఁ డాకులతయు
భీతి హర్ష మమర్ష ముద్వేగము విడి, యేఁ డలరుచుండునో నాకు వాఁడు ప్రియుఁడు.

క. అనపేక్షుఁడు దక్షుఁడు శుచి,యు నుదాసీనుండు గతభయుండును భక్తుం
డును సంత్యక్తారంభుఁడు, ఘనుఁ డెవ్వఁడొ వాఁడు నాకుఁ గడుఁ బ్రియుఁ డనఘా.

మ. జనుఁ డిష్టం బగుపట్ల హర్షము ననిష్టప్రాప్తి శోకంబుఁ గై
కొనఁ బో కెప్డు శుభాశుభంబులను వీడ్కోలు నుండి నిస్సంగుఁ డై
మనమందున్ స్వపరభ్రమల్ విడువ నై మానావమానంబుల
న్ఘనశీతోష్ణములన్ సముం డగునయే నాకుం బ్రియుం డాతఁడున్. 325

తే. తుల్యనిందాస్తుతియు మౌని దొరకునట్టి
దేనితో నైన సంతుష్టి నూనువాఁడు
స్థిరమతి యగారరహితుఁడు పరమభక్తి
యుక్తుఁ డగువాఁడు నాకుఁ బ్రియుండు తలఁప. 326

క. ఎవ్వారు ధర్మ్యామృతమును, నివ్వాటిలఁ జెప్పినట్లు నెఱిఁ గొని భక్తిం
గ్రొవ్వకొని శ్రద్ధ నొప్పెద, రవ్వారలు నాకుఁ బ్రియులు నధికులు ననఘా. 327

—♦అ. 13- ప్రకృతిపురుషవివేకయోగము♦—

వ. అని భక్తియోగం బెఱింగించిన విని యర్జునుండు ప్రకృతిపురుషక్షేత్రక్షేత్రజ్ఞస్వరూపంబును జ్ఞానంబును జ్ఞేయంబునుం దెలిసికొనం గోరుచుంటి నానతి మ్మనిన నతం డతని కిట్లనియె. 328

సీ. వినుము కుంతీపుత్ర! వివరింతు నీదేహ,మును క్షేత్ర మని యిది నెఱింగి
నట్టేఁడు క్షేత్రజ్ఞుఁ డనియును దెలిసిన,వారు వచింతురు సారబుద్ధి
నెల్లక్షేత్రంబుల నెనఁగెడు క్షేత్రజ్ఞు,నిం గూడ నన్నుఁ గా నీ వెఱుఁగుము
వెలయునీదేహాత్మవిజ్ఞాన మే జ్ఞాన, మని నాయభిప్రాయ మగును జూవె,

తే. యిపుడు చెప్పిననీక్షేత్ర మెదియొ యెట్టి
వగదొ యద్వికారిమై యెందువలన నగునొ
యేస్వరూపము క్షేత్రజ్ఞుఁ డెవ్వఁడో యెప్ర
భావములవాఁడో వినునేఁ గ్లుప్తముగ వినుము. 329

సీ. బహువిధంబుల ఋషుల్ వలికిరి మఱియును, వివిధశ్రుతులు వేఱువేఱ నడిచె.
హేతుమత్తులు నిశ్చితేద్ధార్థములు బ్రహ్మ,సూత్రపదంబులు నూటిఁ దెలిపె
నాలింపు పంచమహాభూతములు నహం,కారంబు నవ్యక్తకము బుద్ధి
యింద్రియదశకంబు హృదయ మేకంబును, శబ్దాదివిషయపంచకము మఱియుఁ,

తే. గాంక్షయును విరోధంబు దుఃఖంబు సుఖము
ధృతియునుం జేతనయును సంహతియుఁ గూడ
క్షేత్ర మన నొప్పు నిట్లు సంక్షేపముగను
జెప్పఁబడెఁ గార్యములతోడ నిప్పు డనఘ. 330

వ. మఱియు నమానిత్వము నదంభిత్వము నహింస క్షాంతియు నార్జవంబు నాచార్యోపాసనంబు శౌచంబు స్థైర్యంబు నాత్మనిగ్రహంబు నింద్రియార్థవైరాగ్యంబు ననహంకారంబు జన్మమృత్యుజరావ్యాధిదుఃఖంబులం దనుదర్శనంబును ననసక్తియుఁ బుత్త్రదారగృహాదులం దనభిష్వంగంబును నిష్టానిష్టోపపత్తులందు నిత్యసమచిత్తత్వంబును నాయందు ననన్యయోగంబున స్థిరం బయినభక్తియును వివిక్తదేశసేవిత్వంబును జనసమూహంబునం దరతియు నధ్యాత్మజ్ఞాననిత్యత్వంబును దత్త్వజ్ఞానార్థచింతనంబునుం గలుగుటయే జ్ఞానం బనియు దీనికంటె వ్యతిరిక్తం బగునంతయు నజ్ఞానం బనియుఁ జెప్పఁ బడు నని చెప్పి యప్పురుషోత్తముం డెద్ది తెలియం దగు దేనిం దెలిసిన నమృతత్వంబు ప్రాప్తించు దానిం జెప్పెద నాలకింపు మని వెండియు ని ట్లనియె. 331

సీ. అది పరంబును బ్రహ్మ మాది లేనిదియు సత్తని యసత్తని చెప్ప నొనరనదియు
నంతటఁ బాణిపాదాక్షిశిరోముఖశ్రుతులు గల్గి జగంబుఁ జుట్టి యుండు
సర్వేంద్రియగుణప్రశస్తము సర్వేంద్రియవివర్జిత మసక్త మవ్యయంబు
నఖిలంబును భరించునదియును నిర్గుణంబును గుణభోక్తయు భూతకోటి,
తే. లోపలను వెలుపలను వెలుంగుచుండునదియు నచరంబును జరంబు నగునదియును
సూక్ష్మ మైనకతంబునఁ జూడఁ బడనియదియుఁ జేంత గా దవ్వ గా నలరునదియు.
తే. భూతములలోన నవిభక్త మై తలిర్చియును విభక్తమ యైనట్టు లుండునదియు
నఖిలభూతముల భరించునది గ్రసించునదియుఁ బ్రభవిష్ణువని తెలియంగ నగును.

ఉ. జ్యోతుల కెల్ల జ్యోతి యయి శుద్ధము బుద్ధము నై తమఃపరం
బై తగి సర్వచిత్తములయం దయి జ్ఞానము జ్ఞానగమ్య మై
జాతి నెసంగుక్షేత్రమును జ్ఞానము జ్ఞేయము సంగ్రహించి వి
ఖ్యాతము చేసితిం దెలియఁ గల్గినభక్తుఁడు నన్నుఁ జెందెడున్. 334

సీ. ప్రకృతియుఁ బురుషుండుఁ బరికింప నివి యనాదులయనియువికారములుగుణములు
ప్రకృతిభవము లని పరఁగుఁ బ్రకృతికార్యకారణకర్తృత్వకలనమందుఁ
గారణంబు సుఖదుఃఖములభోక్తృత్వమునకు బురుషుఁడు కారణం బనఁ బడుఁ
బ్రకృతిసంభవము లై ప్రకటింపఁబడుగుణసముదయంబుల నెల్ల సంతతంబుఁ,

క. ఒకఁ డగురవి యెల్ల ప్రపం,చకముఁ బ్రకాశింపఁ జేయుచందంబున నను
త్ముకుఁడై క్షేత్రజ్ఞుఁడు క్షే,త్రక మెల్ల వెలుంగఁ జేయుఁ దాపత్యమణీ! 345
దే. ఇట్లు జ్ఞానచక్షుస్సున నెవఁడు ప్రకృతి
పురుషభేదమునుం భూతముల ప్రకృతియు
మోక్షము నెఱుంగఁ గలుగు నప్పురుషవరుఁడు
పరము నొందెడు నని లోన నరయు మీవు. 346

—♦అ. 14—గుణత్రయవిభాగయోగము♦—

వ. అని ప్రకృతిపురుషవివేకయోగం బెఱింగించి భగవంతుండు వెండియు. 347
తే. దేని నెఱిఁగి యితఃపర మైనసిద్ధి, పరమమును లెల్లఁ బొందిరో ధరణి నట్టి
జ్ఞానములలోన నుత్తమజ్ఞాన మిపుడు, మరల వివరించి చెప్పెద నరుఁడ వినుము.
క. ఏతద్జ్ఞానసమాశ్రితు, లై తనరుచు మత్స్వరూప మందినవారల్
భౌతికసర్గమునందుఁ, జాతము నొందరు ప్రలయసంగతిఁ గనరుఁ. 349
చ. తలఁపఁగ సర్వకారణ ముదారము నాఁ దగు బ్రహ్మమందు నే
నిలుపుదు గర్భ మందున జనించుచునుండు సమస్తభూతముల్
కలిగినయెల్లమూర్తులకుఁ గారణభూతము మేటి బ్రహ్మ మే
నలరఁగ బీజము న్నిలుపునట్టిఁడఁ గావునఁ దండ్రి నర్జునా. 350
సీ. ప్రకృతిసంభవము లై పరఁగుసత్త్వరజస్తమమ్ము లన్మూఁడుగుణమ్ము లెపుడు
నవ్యయుం డగుదేహి నరికట్టు దేహమ్మునం దందు నిర్మల మయిన దగుట
సత్త్వము సుప్రకాశక మనామయ మయి, పురుషునిసుఖసంగమునను జ్ఞాన
సంగమునం గట్టు నరగఁ దృష్ణాసంగ,భవము రాగాత్మక మవురజంబు,
తే. కర్మసంగమునఁ దేహిఁ గట్టిపెట్టు, సర్వసమ్మోహనమ్ము నజ్ఞానజమ్ము
తమము బంధించు నరుఁ బ్రమాదమున నలస,భావమున నిద్రవలన నోభరతముఖ్య.
సీ. సత్త్వము సుఖమందు సంగముఁ గలిగించు, రజము కర్మమునందు రమణఁ గూర్చుఁ
దమము జ్ఞానముఁ గప్పి క్రమముననుఁ బ్రమాద,మందు సంగము గల్గు నట్లొనర్చు
మఱి సత్త్వము రజస్తమములను మించు ర,జము సత్త్వతమములసరణి మించుఁ
దమము సత్త్వరజోగుణముల మించు నొకప్డు, జ్ఞానప్రకాశ మీమేన నెల్ల,
తే. ద్వారముల నొప్పునప్డు సత్త్వంబు ప్రబలు
రజము ప్రబలినయప్డు కర్మముల సేఁత
స్పృహయు నశమంబు లోభప్రవృత్తు లాదవు
నరున కంచు నెఱుంగు మోభరతముఖ్య 352

క. తమము వివృద్ధిం బొందిన,సమయంబున సంభవించు జనునకు నతిమో
హము నప్రవృత్తియుఁ బ్రమాద మప్రకాశమును దలఁపఁ దత్త్వజ్ఞమణీ. 353

చ. క్రమముగ సత్త్వవృద్ధి యగుకాలమునం బ్రళయంబు నొందె నే
నమలము లూర్ధ్వలోకముల నందు జనుండు రజోభివృద్ధి యౌ
సమయమునందుఁ గర్మములసంగతిఁ బుట్టుఁ దమోభివృద్ధి యౌ
సమయము మూఢయోనులఁ బొసంగఁగఁ జేయును జన్మ మర్జునా. 354

ఆ. సుకృతకర్మఫలము సూవె నిర్మలసాత్త్వికము రజోగుణముఫలము సుదుఃఖ
మగుతమోగుణఫల మజ్ఞాన మగు నని, పలికి రెల్లమునులు పార్థ! వింటె. 355

సీ. సత్త్వంబునం జ్ఞానసంభవం బగు రజో,గుణమున లోభంబు కొనలు సాఁగుఁ
దమమున నగుఁ బ్రమాదమును మోహంబు న,జ్ఞానంబును ననర్థజనకము లయి
సత్త్వస్థు లూర్ధ్వంబు చనెదరు రాజసుల్,మధ్యంబునం దుండ్రు మహిమ చెడఁగఁ
దామసు లధమవృత్తస్థు లై మూఢు లై, పోదు రధోగతిభ్రాంత వట్టి,

ఆ. యెప్పు డాత్మవేత్త యీగుణంబులకంటె, నితరమయినదాని నెడఁదఁ గర్తఁ
గను దలంప కప్పరుని నెఱింగెడుఁ గాన, నతఁడు నాదుభావ మందుఁ బార్థ. 356

ఆ. దేహి దేహజంబు లై పరువొందు నీ,మూఁడుగుణములు విడనాడఁ గలుగు
శక్తి గలిగె నేని జన్మమృత్యుజరాది,ముక్తుఁ డగుచు నమృతమును భజించు. 357

వ. అనిన నర్జునుం డిట్లనియె నయ్యా! నీచెప్పినయీమూఁడుగుణంబుల నతిక్రమించిన
వాఁ డెట్టిలక్షణంబులవాఁడు? వానియాచారం బెట్టిది! యెట్లు లీమూఁడుగుణం
బుల నతిక్రమింపవచ్చుం జెప్పు మనిన నప్పురుషోత్తముం డర్జునుం గాంచి యి
ట్లనియె. 358

సీ. విను మేజనుఁడు సంప్రవృత్తము లగు ప్రకా,శమ్ము ప్రవృత్తిమోహమ్ముల నెద
ద్వేషింప కెప్డు నివృత్తములం గోర, కనిశ ముదాసీనునట్టు లుండి
గుణచలితుఁడు గాక గుణములే తమకార్య,మునఁ బ్రవర్తించెను ననుచు నెంచి
స్వస్థుఁ డై సతతంబు సమదుఃఖసుఖుఁడును, సమలోష్టకాంచనుఁ డమలమతియుఁ,

తే. దుల్యనిందాత్మసంస్తుతి తుల్యమిత్ర,శత్రుపక్షుఁడు ధీరుఁడు సర్వయత్న
వర్జితుండు ప్రియాప్రియవస్తువిముఖుఁ, డయినవాఁడు గుణాతీతుఁ డనఁగ నొప్పు.

క. చలియింపనిభక్తి న్ననుఁ,గొలిచెడు నెవ్వాఁడు వాఁడు గుణరహితుం డై
వెలుఁగొందు బ్రహ్మపదమునఁ, గలకాలము విడనియట్టిగతిఁ గలుగంగన్. 360

తే. అమృత మవ్యయ మైనజీవాత్మరూప,మునకు శాశ్వతవరధర్మమునకు మఱియు
జ్ఞాను లొందంగ నయిన మోక్షసుఖమునకు, నేన యాధారభూతుఁడ నేన ప్రభుఁడ.

—♦ అ. 15-పురుషోత్తమయోగము ♦—

వ అని గుణత్రయవిభాగయోగం బెఱింగించి భగవంతుండు. 362

తే. అలరు నశ్వత్థ మవ్యయంబగుచు నూర్ధ్వ,మూలముఁగను నధశ్శాఖముగను శ్రుతులు
పలుకు దేనికి ఛందముల్ పర్ణము లని, యెఱిఁగిన యతండు వేదము లెఱిఁగినతఁడు.

శా. ఆవృక్షంబునకున్ గుణప్రసృతముల్ ప్రాప్తేంద్రియార్థప్రవా
ళావిర్భావము లన్యశాఖలు భరంబై క్రిందుగన్ మీఁదుగన్
బోవుం గర్మము లంటి వచ్చెడు మహామూలంబులున్ మర్త్యమం
దే వేళన్ విరియంగఁ బాఱెడిఁ గడున్ హెచ్చిల్లి తెల్లంబుగన్. 364

ఉ. అత్తరురూప మాదియును నంతము మధ్యముఁ జెప్పినట్లు గా
నెత్తఱిఁ దోఁపకున్నయది యిందుఁ గడుంగడు వేళ్ళు పాఱి నా
నత్తరువున్ దృఢంబును మహత్తర మైనయసంగశస్త్రసం
పత్తిని ద్రుంచుటన్ మరలి పాయనితానము నొంద నయ్యెడిన్. 365

ఆ. అప్పదంబుఁ దెలియ నరసి పురాణప్ర,వృత్తి యెవనివలన నెసక మెసఁగె
నాదిభూతుఁ డైన యమ్మహాపురుషుని,శరణ మొంద వలయు సవ్యసాచి. 366

క. గతమానవిమోహులు నిర్జితసంగులు నాత్మనిత్యచిత్తులును బహి
ష్కృతకాములు నిర్ద్వంద్వులు, యతు లవ్యయపదము దాని నందెద రనఘా. 367

ఆ. పొంది దేని మరలఁ బోవరో తత్పరం,ధామ మస్మదీయ మై మనోజ్ఞ
మగును దాని రవియు నబ్జుండు వహ్నియు, వెలుఁగఁ, జేయుశక్తిఁ గలుగ రెపుడు.

సీ. నాయంశము సనాతనం బగునాత్మయై, జీవలోకమునందు జీవభూత
మయి ప్రకృతిం బొందు నది మనష్షష్ఠము, లగునింద్రియంబుల నాఁగి తిగుచు
నాశయంబున నుండి యనిలంబు వాసన,లను గ్రహించెడునట్లు తనువు నొంది
వెడలి పోవుచు నీశ్వరుఁడు తదింద్రియముల, నొనర నాకర్షించుకొని గమించుఁ,

తే. గాయమం దుండి యాజీవుఁ డేయెడలను
శ్రోత్రమును ద్వక్కు ఘ్రాణము నేత్రము రస
నంబు మనము నాఁబడునింద్రియంబు లెల్ల
ననుసరించుచు విషయంబు లనుభవించు. 369

క. తనువున నుండియు గుణములఁ,బొనరియు విషయముల నెల్ల బొందియు వెడలం
జనియుఁ గనఁబడునాత్మను, గనలేరు విమూఢు లెపుడుఁ గందురు జ్ఞానుల్. 370

తే. యత్న మొనరించి దేహమం దలరునాత్మ, యోగివర్యులు చూచుచు నున్నవారు
యత్న మొనరించియును నకృతాత్ము లగు న,చేతసులు చూడనోపరు శ్వేతవాహ.

తే. ఏది యాదిత్యగత మయి యెసక మెసఁగి, యగ్నియందును జంద్రునం దతిశయిల్లి
జగము లెల్లఁ బ్రకాశిల్లఁ జలుపుచుండు, నట్టి తేజము మామక మని యెఱుఁగుము.

తే. భూమిని బొంది నే బలంబునఁ దలిర్చి, యెల్లభూతంబులం ధరియించు చుందు
నమృతరసమయుఁడగుసోముఁడగుచు నెపుడు, నోషధుల నెల్లఁబోషించుచుందు బార్థ

తే. నేను వైశ్వానరుఁడ నయి ప్రాణికోటి
దేహముల నాశ్రయించి ప్రదీప్తి నొంది
ప్రాణము నపానమును గూడ నగుచు నాల్గు
వగుదు లగునన్నమును బక్వముగ నొనర్తు. 374

ఉ. ఏను సమస్తభూతములహృత్పదమందుఁ దలిర్చి సంస్మృతిన్
జ్ఞానము నూహయుం గలుగ సల్పుచు నుందు నెల్ల వేదముల్
మానుగ నన్నెఱుంగుటకు మార్గము లయ్యెడు వేదశీర్షసం
ధానకరుండ వేదములు దాల్చిన వేదవిదుండ నేఁ జుమీ. 375

క. క్షరుఁ డక్షరుండు నాఁబడు, పురుషులు గల రిర్వు రిందుఁ బోలింపఁగ నా
క్షరుఁ డెల్లభూతచయ మ,క్షరుఁ డాకూటస్థుఁ డని తగం జెప్ప నగున్. 376

తే. ఉత్తముం డగుపురుషుఁ డన్యుం డతం డు,దాహృతుం డగుఁ బరమాత్మ యన నెవండు
పొందిలోకత్రయంబును మొగిభరించు, చుండునీశ్వరుండును నవ్యయుండునగుచు.

తే. క్షరు నొగి నతిక్రమించి యక్షరునికన్న, నుత్తముఁడ నౌట నేఁ బురుషోత్తముఁ డని
పలుకఁబడి నేను బ్రఖ్యాతిఁబడసినవాఁడ, లోకమందు వేదమునందు నోకురువర. 378

క. ననుఁ బురుషోత్తము నెవ్వఁడు, కనుఁగొను మోహంబు లేనిగతి నిట్టి తెఱం
గున వాఁ డెల్ల నెఱింగిన,ముని యై నను సర్వభావమున భజియించున్. 379

తే. ఇట్లు గుహ్యతమం బగునీరహస్య,శాస్త్రమును నీకుఁ జెప్పితి సదమలమతిఁ
బొదల దీని నెఱిఁగి నీవు బుద్ధిమంతుఁ, డవును గృతకృత్యుఁడవుగమ్ము ప్రవిమలాత్మ.

—♦ అ 16. _ దైవాసురసంపద్విభాగయోగము ♦—

వ. అని పురుషోత్తమయోగం బెఱింగించి భగవానుండు వెండియును. 381

సీ. అభయంబు జ్ఞానయోగాత్రివ్యవస్థితి, సత్త్వసంశుద్ధి యార్జవము తపము
దమమును దానంబు స్వాధ్యాయము యజ్ఞ మ,హింసయు సత్యము హ్రీయు శాంతి
త్యాగ మక్రోధమార్దవము లపైశునం,బు నలోలుపత్వము భూతదయయు
నద్రోహమును ధృతి నాతిమానితయుఁ దే,జము క్షమ శౌచ మచాపలంబు,

తే. దైవసంపదతోఁ బుట్టుధన్యున కగు, దంభదర్పాభిమానముల్ తామసంబు
క్రోధ మజ్ఞాన మధికపారుష్య మదయు, యసురసంపదతోఁ బుట్టునధమున కగు.

తే. దైవసంపద మోక్షంబు దరియఁ జేయు, నసురసంపద బంధంబు నందఁ జేయు
దైవసంపదఁ బుట్టితి వీవు పార్థ!, శోక మొక్కింతయును జేయఁ బోకు మేడఁద. 383

సీ. భూతసర్గంబులు పొసఁగు రెం డీలోక,మున దైవ మాసుర మనఁగ నందు
విస్తరించితి దైవవిధ మాసురం బిఁక, వివరింతు విను పార్థ! విశదముగను
నెఱుఁగ రాసురజను లింతయును బ్రవృత్తి, గాని నివృత్తియుఁ గాని వారి
కలరవు శౌచంబు నాచారమును సత్య,మును వార లిజ్జగంబును నసత్య,

తే. మనియు నప్రతిష్ఠ మ్మనియును ననీశ్వ,ర మ్మనియు నపరస్పరజమ్ము మఱియొ
కం డెదియు లేదు గావునఁ గామహేతు,క మ్మని వచింతు రజ్ఞానకారణమున. 384

వ. ఆకర్ణింపు మిట్టివిపరీతజ్ఞానం బవలంబించినవారు నష్టాత్ములు నల్పబుద్ధులు నుగ్ర
కర్ములుం బాపులు నై జగన్నాశనంబుపొంటెఁ బుట్టుచున్నవారు. దుష్పూరం
బైనకామంబు నాశ్రయించి మోహంబున నసద్గ్రాహంబులం బరిగ్రహించి యశుచి
వ్రతులును దంభమానమదాన్వితులు నై ప్రవర్తించుచున్నవారు. అపరిమే
యంబును బ్రళయాంతంబును నగుమనోరథపరంపర నుపాశ్రయించి కామభోగ
పరము లై యింతకంటెఁ బురుషార్థము లే దని నిశ్చయించుకొనుచు నాశాపాశ
బద్ధులును గామక్రోధపరాయణులు నై విషయానుభవంబున కన్యాయమార్గంబున
ధనసంచయంబులం గూర్పఁ గోరుచున్నవారు మఱియును. 385

సీ. ఇది యిప్డు పొందితి నీమనోరథమును, బొందెదఁ గలదు సంపూర్ణధనము
మఱియునుం గలుగు నీమాత్రురఁ జంపితిఁ, జంపుదు నన్యుల శక్తి గలిగి
నే నీశ్వరుఁడ భోగి నేనె సంపన్నుఁడ, నేనె బలాఢ్యుఁడ నేనె సుఖిని
నభిజనవంతుఁడ నాఢ్యుఁడ నైతి మత్తుల్యుఁ డెవ్వండును దోఁపఁ డొరుఁడు,

తే. యాగములొనర్చి దాతనై యలరుచుందు, ననుచు నజ్ఞానమోహితుఁ డయి విమోహ
పాశబద్ధుఁడు చిత్తవిభ్రాంతుఁ డగుచుఁ, గామములఁజిక్కి పడునరకంబులందు. 386

క. తనుఁ దాన గౌరవించుచు, ధనమానమదాన్వితుండు స్తబ్ధుం డగుచున్
బొనరించు నామయజ్ఞము,లను దంభముతోడఁ గువిధులం బశురీతిన్. 387

ఉ. ఘోరబలంబు దర్పమును గ్రోధముఁ గామము దుర్మనం బహం
కారముఁ గల్గి యాత్మపరకాయములం దగున న్నసూయచే
వైరము చేయుక్రూరులను వారలఁ బట్టి శుభేతరోగ్రసం
సారమునందుఁ ద్రోచెద నజస్రము నాసురయోనులం బడన్. 388

ఆ. అసురయోని నొందునన్నరాధములు నన్, జన్మజన్మములకుఁ జూడఁ దెలియఁ
జాలనట్టి రగుచు జాలి నొందుచు నుంద్రు, దానికన్న నీచ మైనగతిని. 389

క. కామము క్రోధము మోహము, నా ముగ్గతుల నగు నాత్మనాశక మగుచుఁ
భీమ మగునరకమార్గం, బౌమూఁడును గాన విడువ నగు నెవ్వరికిన్. 390

క. నరకద్వారము లగుచుఁ, బరికింపఁగ నైన వీని వర్జించినచో
నరుఁ డాత్మశ్రేయమ్ములు, పరఁగఁ బరంధామ మొందుఁ బాండుతనూజా. 391

ఆ. శాస్త్రవిధిని విడిచి జనుఁ డేఁడు తనయిచ్చ, వచ్చినట్లు తిరుగు వాఁడు సిద్ధి
వడయఁబోఁడు సుఖముఁ బడయఁగఁ బోవఁడు, పరమగతియు నింత వడయఁ బోఁడు.

తే. కావునం గార్యమందు నకార్యమందు, నీకు శాస్త్ర మగు ప్రమాణ మోకురువర!
యరసి శాస్త్రవిధానోక్త మయినకర్మ, మాచరించుటకు న్నీవ యర్హుఁడ విట. 393

—♦ అ. 17-శ్రద్ధాత్రయవిభాగయోగము ♦—

వ. అని దైవాసురసంపద్విభాగయోగం బెఱింగించిన విని యర్జునుం డి ట్లనియె. 394

తే. శాస్త్రవిధులను విడనాడి శ్రద్ధతోడఁ, గూడికొని నవనాదులు కొంద ఱిందుఁ
జేయుచుందురు వారలు చేయునిష్ఠ, సత్త్వమ రజమ్ము తమమ యోచక్రి దనఘ. 395

వ. అనిన భగవానుం డర్జునుం గాంచి సర్వప్రాణులకును శ్రద్ధ స్వభావజం బది సాత్త్వికం
బనియు రాజసం బనియుఁ దామసం బనియు మూఁడువిధంబులు దానిం జెప్పెద
నాకర్ణింపు మని యి ట్లనియె. 396

ఆ. సర్వలోకమునకు శ్రద్ధ యంతఃకర,ణానురూప మగుచు నలరు శ్రద్ధ
పౌనరునట్టిజనుఁడు తనశ్రద్ధ కనుగుణ, మయినఫలము నంద నగును బార్థ. 397

సీ. పూజింత్రు సాత్త్వికుల్ జేజేల రాజసు, ల్పూజింత్రు యక్షరక్షోజనమును
దామసు లన్యులు తవిలి పూజింత్రు భూ,తప్రేతగణములఁ దత్పరతను
గామరాగబలంబు గలిగి దంభము నహం,కారంబు నొందినకాపురుషులు
బుద్ధి లేక శరీరమున నున్నవాయ్వాది,భూతములను లోనఁ బొదలుచున్న,

తే. నన్నును గృశింపఁ జేయుచు నున్నవార, లగుచు శాస్త్రవిహితము కానట్టిఘోర
తపము గావించువారినిఁ దగ నెఱుంగు, మసురనిశ్చయు లనుచు నీ వంతరాత్మ.

వ. సర్వప్రాణులకును సత్త్వాదిగుణంబులంబట్టియాహారంబును యజ్ఞతపోదానంబులును
మూఁడేసివిధంబులం బొదలుచుండు నాయాభేదంబు లెల్లం జెప్పెద నాలకింపుము.

సీ. ఆయువు సత్త్వమ్ము నారోగ్యము సుఖమ్ము, బలముఁ బ్రీతియు వృద్ధిఁ బెంచునవియు
స్నిగ్ధముల్ రస్యముల్ స్థిరములు హృద్యము, లాహారములు సాత్త్వికాంచితములు
కట్వామ్లలవణరూక్షవిదాహితీక్ష్ణము, లత్యుష్ణములును శోకామయప్ర
దమ్ములు దుఃఖప్రదములు నాహారముల్, సర్వకాలము రాజసప్రియములు,

తే. పర్యుషిత మౌట రుచి వోయి ప్రాఁతవి యయి
పాసి దుర్గంధయుతము లై పరులు మెసవ
దాన నుచ్ఛిష్టములు నమేధ్యంబు లగుచు
నెసఁగు నాహారములు దామసేష్టదములు. 400

సీ. భగవదారాధన మగుట యజింపఁగ, వలయు నంచును మది వలనుపడఁగ
ఫలముఁ గోరక విధికలితవిధంబున, సలిపెడుయజ్ఞంబు సాత్త్వికంబు
హృదయంబున ఫలం బపేక్షించియును మహత్త్వప్రకటనము సేఁతకును జేయు
నట్టియజ్ఞము లోకమందు నెఱుంగ నై, ప్రాలు నర్జున! యది రాజసంబు,
తే. విధి యొకింతయు లేకుండ నధమముగ న,దక్షిణంబుగ హీనమాత్రముగ శ్రద్ధ
పొదలకుండ నదత్తాన్నముగ నొనర్చి,నట్టియజ్ఞము తామస మని యెఱుఁగుము.
సీ. దేవతలన్ గురుద్విజులను బ్రాజ్ఞుల, నర్చించుటయు శౌచ మార్జవంబు
బ్రహ్మచర్యంబు నెప్పట్ల నహింసయు, శారీరతప మని చదువఁ బడును
బరజనుల కదుఃఖకరము ప్రియంబును, హితము సత్యం బయి యెసఁగువాకు
పచరించుటయు వేదపఠనపాఠంబులు, వాఙ్మయతప మని పలుకఁ బడును,
తే. స్వాంతనైర్మల్యమును మౌన మాత్మనిగ్ర
హమును భావసంశుద్ధి సౌమ్యత్వ మనెడు
నియ్యయిదు మానవునియందు నెసఁగ మగుచు
నొప్ప మానసతప మని చెప్పఁ బడును. 402

తే. ఇట్లు మూఁడువిధంబుల నెసఁగుతపము, ఫల మపేక్షింపక సమాహితు లగునరులు
విపుల మగు శ్రద్ధతోడఁ గావించి రేని, తత్తపము సాత్త్వికం బనఁ దగును విజయ.
చ. మనుజులు తమ్ము సత్కృతుల మన్నన సేయుచు వందనాదిపూ
జనము లొనర్తు రంచు మది నల్పుచు దంభముతోడ నెత్తపం
బును బొనరింతు రత్తపము పొంపిరి వోక చలంబు నధ్రువం
బును నయి రాజసం బనుచుఁ బ్రోక్త మగున్ ధరణీతలంబునన్. 404

క. తనకుం బీడ దొలంగెడు, నని పరులకు నాశనంబు నగు నని చిత్తం
బున నెంచి మూఢనిశ్చయు,త నొనర్చిన తప మెసంగుఁ దామసమనఁగన్. 405

తే. దేశకాలపాత్రంబుల తెఱఁగు లెఱిఁగి, యనుపకారికి నిరపేక్షుఁ డగుచు నీయ
వలయు నని యెంచి యిచ్చినపరమదాన, మొనరుచుండును సాత్త్విక మనఁగఁ జెల్లి.
తే. తఱిఁ బ్రత్యుపకార మీతం డొనర్చు,ననియుఁ గాని ఫలం బగు ననియుఁ గాని
యితరులకు ఖేదబుద్ధితోఁ నీయఁ బడిన,యట్టిదానము రాజస మనఁగ నొప్పు. 407

తే. దేశకాలపాత్రంబులఁ స్థితిగతు లపవిత్రతను బొంద గౌరవవిరహితముగ
మిగులనవమానపూర్వకముగఁ బొనర్చు, దాన మది తామసం బని తలఁపఁ బడును.
సీ. నిగమంబులకుఁ దొల్లి నిర్దిష్ట మయ్యె నోం, తత్స త్తనుచుఁ ద్రివిధముగ శబ్ద
మ్మదాన విహితంబు లయ్యె వేదములు యజ్ఞమ్ములు బ్రాహ్మణుల్ సాధురీతి
నక్కారణమున నో మ్మని యుచ్చరించుచు, బ్రహ్మవాదులవిధిప్రస్తుతములు
యజ్ఞదానతపఃక్రియలు సంతతంబు ప్రవర్తిల్లుచుండు నివ్వసుధయందు,
తే. మోక్షకాంక్షులు తత్తని మునుప వచించి, ఫలము గోరక యజ్ఞతపఃక్రియలును
వివిధదానక్రియలు భక్తివిస్తరముగ, సలుపుచుండెద రిద్ధరాతలమునందు. 409
మ. పరఁగన్ సత్తది, సాధుభావమున సద్భావంబున న్మంగళా
కరకర్మంబున నొప్పెడిన్ మఱియు యాగంబందు దానంబున
న్వరమాసీంద్ర తపంబునం దగుస్థితి న్స త్తంచు వాక్రుత్తు నై
శ్వర మాతత్త్వదవస్తుజాతమును సద్వాచ్యంబ వర్ణింపఁగన్. 410
తే. వినుము శ్రద్ధ లేక వేల్చినహుతము దత్తమును దప్తమైనతపము మఱియుఁ
జేయఁబడిన దెల్లఁ జెప్పంగఁబడు నస, త్తనుచు నిహపరంబు లతని కరిది. 411

—♦ అ. 18 _ మోక్షసన్యాసయోగము ♦—

వ. అని శ్రద్ధాత్రయవిభాగయోగం బెఱింగించిన నర్జునుండు శ్రీకృష్ణుం గాంచి హృషీ
కేశా! కేశినిషూదనా! సన్న్యాసత్యాగంబుతత్త్వంబు పృథక్ప్రకారంబున విన నెంచితిం
జెప్పు మనిన నతం డతని కిట్లనియె. 412
సీ. కవులు కొందఱు కామ్యకర్మపరిత్యాగ, మది యెఱుంగుదురు సన్న్యాస మనుచుఁ
గొందఱు వచియించు చుందురు తత్ఫల, త్యాగమే త్యాగశబ్దార్థ మనుచు
నది గాన దోషము స ల్లెల్లకర్మము, త్యక్తవ్య మనుచుఁ గొందఱు బుధులును
మఱియుఁ గొందఱు దానమఖతపఃకర్మ మె, క్కాలము త్యాజ్యము కా దటనుచు,
తే. నాడుచుండెద రాత్యాగమందు నిశ్చ
యమును వివరించి చెప్పెద ననఘచరిత !
తెలియ వినుము త్యాగము మూఁడు తెఱఁగులుగను
సంప్రకీర్తిత మయ్యె నిజ్జగమునందు. 413
ఉ. పావనముల్ మనీషికిఁ దపంబు సవంబును దానధర్మముల్
గావున వానినిన్ విడువఁ గాఁ దగ దెప్పుడు నిట్టికర్మముల్
భావనచేసి సంగమును బాసి ఫలంబును రోసి చేయ నొ
నీ విది నాదునిశ్చిత మనింద్యమతం బని నమ్ము నెమ్మదిన్. 414

సీ. మనుజుండు నియతకర్మములు మానఁగ నొప్పఁ, దజ్ఞానమున మానినట్టు లైన
నది తామసం బన నగు దుఃఖకర మని, కాయకష్టభయంబు కారణమునఁ
ద్యజియింపఁ గర్మ మయ్యది రాజసం బగు, దానఁ ద్యాగఫలంబు దనరఁ బోదు
సలుపంగ నౌ నని సంగఫలత్యాగ,సరణి సల్పిన నది సాత్త్విక మగు,
తే. సత్త్వయుక్తుఁడు మేధావి ఛాతసంశ,యుండు త్యాగియు నగుపురుషుం డనిష్ట
కర్మముననను ద్వేషం బిష్టకర్మముననుఁ, బ్రీతియును జేయఁ బోవఁ డెవ్వేళ్ఁ గాని.
క. తనువు ధరించినవాఁ డెప్పును నిశ్శేషముగఁ గర్మమును విడలే డం
దునఁ గర్మఫలత్యాగమె, పౌనరును ద్యాగం బనంగఁ బురుషవరేణ్యా. 416
క. తనుపతన మైన పై నగుఁ, గన నత్యాగులకుఁ గర్మగతి ఫల మిష్టం
బు ననిష్టంబును మిశ్రం, బనఁ ద్రివిధఫలంబు జ్ఞాని కట్టు కా దెపుడుకా. 417
వ. కర్మాంతం బైనసాంఖ్యంబునందు సర్వకర్మసిద్ధికిని నైదుకారణంబులు చెప్పంబడు
నవి యెల్లఁ దెల్లంబు గావించెద నాకర్ణింపుము లోకంబున నరుఁడు మనోవాక్కా
యముల న్యాయాన్యాయమార్గంబునఁ దా నారంభించు సత్కర్మంబునకు నిచ్ఛా
ద్యధిష్ఠాన మైనశరీరమును గర్త యగుజీవాత్మయుఁ బృథగ్విధవ్యాపారము గలమన
షషంబు లగుకర్మేంద్రియంబులును నానావిధచేష్టలు గలప్రాణాదివాయువులు నంత
ర్యామి యగుపరమాత్మయును గారణంబు లని యెఱుంగుము. 418
ఆ. ఇట్టు లుండఁ గర్మ మెన చేసితిఁ గర్త, నేన యనుచుఁ దలఁచు నెవ్వఁ డాతఁ
డరయ నకృతబుద్ధి యనఁగ దుర్మతి యన, నగుచు నిజ మెఱుంగనట్టిఁడ యగు.
తే. ఎవనిభావము చేసితి నేన యనుచు, నుండదో వేఁడు కర్మలిప్తుండు గాఁడౌ
వాఁడు ప్రాణులఁ జంపినవాఁడ యయ్యుఁ, జంపనట్టిఁడ కర్మము నొంప దతని. 420
తే. జ్ఞాన మని జ్ఞేయ మని పరిజ్ఞాత యనియుఁ, గర్మచోదన త్రివిధము శరణ మనియుఁ
గర్మ మనికర్త యనియును గర్మసంగ్ర,హమును ద్రివిధము తెలియు మోవిమలచరిత.
వ. గుణసంఖ్యానశాస్త్రంబునందు జ్ఞానము కర్మము కర్తయు గుణభేదంబువలన మూఁ
డువిధంబులుగాఁ జెప్పఁబడియె నవియుంగూడ యథాశాస్త్రంబుగఁ జెప్పెద వినుము
సీ. ప్రవిభక్తము లగుసర్వప్రాణులందు నేక మగువస్తువు విభాగరహిత మని
యవ్యయం బని చూడ నమరినవిజ్ఞాన, మది సాత్త్వికం బని మది నెఱుంగు
మెల్లభూతములందు నెసఁగుభేదంబున, వివిధాత్మవస్తువుల్ వేఱు వేఱు
విధములు గల వని వివరించువిజ్ఞాన, మయ్యది రాజస మని తలంపు,
తే. మేకకార్యమున సమస్తహేతుభూత,విషయమునఁ బోలె సక్త మై వెలసి హేతు
విరహితం బయి తత్త్వార్థ మరయ కుండు, జ్ఞాన మది తామసంబనఁ జదువ నొప్పు.

తే. జోదులొండొరులనోర్వంగ జూచుకొనుచు, జాతసంరంభులై యున్న సమయమందు
నుభయసేనలుఁ జతురంగయుక్తముగను, బటమున లిఖించినట్లు చూపట్టెనపుడు.

తే. అవల ధర్మతనూజుఁడు నివల సిత,నూజుఁడును బురికొల్ప వినూతనగతి
సింహనాదంబు లొనరించి సేన లపుడు, కవియుదెంచె మహాద్భుత క్రమము దోఁప.

మ. ఘనభేరీరవఘోష మున్నతశరగ్రాహంబు చాపోరగం
బును గాఢేయకకచ్ఛపంబును జలదూర్భార్యశ్వభంగంబు స్యం
దనగోత్రం బగునర్ణవద్వయ మనన్ వర్ణింప నయ్యోర్ రణం
బు నొనర్పన్ సమకూడినట్టిబలఁగంబుల్ రెండునున్ మెండుగన్. 47

—♦ కురుపాండవయోధుల మొదటిసంకులసమరము ♦—

క. న్యూనాధికభేదము సు,త్తైనం గానంగఁ బడనియ ట్లయి బలముల్
బూని దురం బొనరించెను,నానందముతోడ నుండె నాసమయమునన్. 48

క. కౌరవులకుఁ బాండవులకుఁ, బో రారౌద్రంబునాఁటిపూర్వాహ్ణమునన్
ఘోర మయి తోఁచె వివిధా,కారాయుధకీప్తు లెల్లకడలం గ్రమ్మన్.. 49

సీ. భేరీనినాదముల్ భూరిశంఖధ్వనుల్, సింహనాదంబులు సింధురోగ్ర
బృంహితంబులు వాజిహేషితంబులు యోధ,కిలకిలారవములు తలరుతులును
జ్యాఘోషములు శరజాలపాతధ్వనుల్, ధ్వజపటాంచలమహాధ్వానములును
రథనేమిఘట్టనరవములు ఘంటికా,స్వనములు కింకిణీశబ్దములును

తే. వివిధతూర్యస్వనంబులు వేలువేలుఁ, బొడమి యిరువాఁగునం దవి పొంగి పొరలి
భీకరంబుగ నేకమై లోక మెల్ల, నిండి బ్రహ్మాండ మవియింప నుండె నపుడు. 50

తే. కరితురంగపదాతిసంఘట్టనమున, రేఁగి ధరణీపరాగము రేయి వడియె
ననఁగఁ దోఁపించె దివి కేగినవు డెలుంగ, నయ్యె నక్షత్రద్యుతుల మార్గ మాప్రజలకు.

చ. అతితుములంబుగా సమర మట్లు ప్రవర్తిలుచున్న వేళ ను
న్నతభుజుఁడై సభీష్ముఁడు దినప్రభువట్లు కడుం న్వెలుంగుచున్
జితయమరాజదండ మగుశ్రేష్ఠశరాసన మొండు పూని యు
ద్ధతగతిఁ బార్థుపైఁ గవిసెఁ దక్కఁవపా టనరానియుక్కునన్. 52

ఉ. పార్థుఁడు నట్లు వచ్చుకురువల్లభునిం గని పేల్లు రేఁగి ప్ర
త్యర్థులు మేలు మే లన సమస్తజనస్తుత మైనగాండివం
బర్థిమెయిం గ్రహించి బిరుదై యెదురై చని తాఁకె వారి క
త్యర్థముగా సమీక్ష మపు డయ్యెఁ బరస్పరతుల్యరూప మై. 53

—: కురుపాండవయోధుల ద్వంద్వయుద్ధము :—

ఆ. ఒకరి నొకరు నోర్వ నుండినవారిలో, నాపగేయుఁ డమ్ము లడరఁ జేసి
కడపఁ జాలఁ డయ్యెఁ గవ్వడి నతఁ డట్లు, సలిపి భీష్ము నొంపఁ జాలఁ డయ్యె. 54

క. సాత్యకియుఁ గృతవర్మయు, నత్యంతము పోరి పొలిచి రన్యోన్యశర
ప్రత్యాహతుల వసంత, ప్రత్యుద్గతకుసుమపలాశపాదపము లనన్. 55

మ. అభిమన్యుం డెదు రై బృహద్బలునిపై న మ్మేయ నక్కోసల
ప్రభు వల్కం గొని సారథిం దునిమి కూల్పం డెక్కెముం బాండవ
ప్రభవుం డొక్కకసాయకంబున ధ్వజాశ్వక్షత్తలం ద్రుంచి దో
ర్విభవం బేర్పడఁ దొమ్మిదింట నతనిన్ వేధించె రోధించుచున్. 56

తే. భీమదుర్యోధనులు డాఁకి భీమగతులు, చిత్రగతు లేర్పడన్ సునిశితశరాళి
సతతసంపాత మొనఁగించి సర్వభూత,విస్మయము గాఁ బెనంగిరి విసువ కపుడు. 57

సీ. దుశ్శాసనుఁడు గడు దోస్సార మేపార, నకులునిం దలఁపడి నవ్యములును
మర్మభేదులు నగుమార్గణంబులు పెక్కు, లేసి నొంచిన నతం డిసుఁ జేసి
వాఁడిపృషత్కముల్ వఱపి శరముతో శ,రాసనంబును డెక్కెయంబుఁ దునిమి
పంచవింశతి కలంబకము లారారాజు,తమ్మునిమై నాటఁ గ్రుమ్మటయును

తే. గనలి మాద్రిసుతునితురగములఁ గూల్చి, వైజయంతినిఁ బడ నేసి వానిఁ గాంచె
నీకుమారుఁడు తనచేతినేరుపునకు, లాఘవంబున కొండయ లెల్లరును మెచ్చ. 58

క. దుర్ముఖుఁ డాసహదేవుని,మర్మములం గాఁడ నేసి మారొక్కటయు నా
కర్మఠుఁడు వానిసారథి, నూర్మి మెయిం ద్రెళ్ళ నేసె నస్త్రమునన్. 59

మ. ఘనుఁ డాధర్మసుతుండు మద్రపతిపైఁ గయ్యంబుఁ గావించు న
ప్లనుమానింప కతండు వాసిధను వొం డై యుండి రెం డై పడన్
బొనరింపం గురువీరుఁ డన్యధనువుం బొంగారుచుం బూని శ
ల్యుని వాలమ్ములఁ గ్రమ్మి క్రమ్మె నిలు మం చుంకించి జంకించుచున్. 60

శా. ధృష్టద్యుమ్నుఁడు ద్రోణుపైఁ గవియ నాధీరుండు క్రూరక్రుధా
విష్టుం డై దున మాడి తద్ధనువు దోర్వీర్యం బవార్యంబు గాఁ
దుష్టిం బేర్చి తదీయదేహమునయందుం గూర్చెఁ బెల్లార్చి యు
త్కృష్టం బై లయకాలదండమునకుం దీ రైననారాచమున్. 61

తే. ద్రుపదపుత్రుఁడు వేఱొక్కదొడ్డవిల్లు, పూని పదునాల్గుసాయకంబులను జాప
గురుని నొ నేసె వారికఘోరసమర, మయ్యె నెయ్యెడకుం దీఱనట్టి దగుచు. 62

సీ. చలమున శంఖుఁడు సోమదత్తిం దలపడి దక్షిణభుజంబుపయి నడరిచె
నతఁ డావిరాటభూపతిసూతిజత్రుదేశము గాడ నేసె నిశాతశరము
బాహ్లికుఁడును జేదిపతి ధృష్టకేతుండుఁ, దాఁకి రోంకొరుపులు వీఁకఁ జేసి
ధృష్టకేతుని బహుతీక్ష్ణాంబకంబుల, నడఁచి బాహ్లికుఁడు పెల్లార్చె పేర్చెఁ
తే. జేదిదేశాధిపతియును జిచ్చఱపిసు,గట్టిఁడై వేఁడిఁ జూపె నవాంబకముల
బాహ్లికునకు నయ్యుద్ధ మాప్రధనమందుఁ, బోల్చ నొప్పె రంగారకబుధులుఁ నాఁగ.

శా. హైడింబుండు నలంబుసుండును మహాస్త్రాభిజ్ఞు లన్యోన్యముం
గ్రీడాకౌశల మొప్పఁ దాఁకునెడ దోర్వీర్యంబునన్ రాక్షస
క్ష్వేడల్ గ్రాల ఘటోత్కచుండు నవతిక్ష్ణాస్త్రముల్ వైచి, మై
గాఁడంజేయ నలంబుసుం డతని వీఁకం బుచ్చె నుచ్చైర్గతిన్. 64

సీ. గురుసుతుండు శిఖండిఁ గ్రూరాస్త్రముల నొంప, నతఁ డాతని శితాస్త్రహతునిఁ జేసె
విరటుఁడై భగదత్తుఁ గురువడించిన వారి, కాల మాఘీల మై కాళ్లె నపుడు
కైకేయుఁ డగుగృహిత్తు స్త్రుండుఁ గృపుఁడు నీ,సునఁ జేసి తలపడి పెనఁకువ కయి
ధనవు లొండొరుఁ జెండి ధవళాశ్వములఁ దున్మి, విరథులై దిగి రసుల్ విసరుకొనుచు
తే. ద్రుపదుఁడును సైంధవుండును దొడరినపుడు
మూఁడు వాఁడితూపుల మొయిఁ గాఁడ నేసె
ద్రుపదునిన్ సైంధవుం డట్లు ద్రుపదుఁ డతని
నేసెఁ గుజశుక్రులకుఁ బోలె నెసఁగె రణము. 65

మ. శ్రుతసోముండు వికర్ణుఁడుం దొడరి వీఁకన్ మ్లేచ్ఛఁ గ్ష్వేడన
ప్రతిఘల్ నించుచు మించి పోరి సుశర్మం జేకితానుండు దాఁ
కి తగం జేసినపోరు ఘోర మగుచున్ గీర్తింపఁగా నయ్యె నా
ప్రతివింధ్యుండును సౌబలుండు నని కైభాసిల్లె రుగ్రాకృతిన్. 66

తే. కెరలి కాంభోజుఁ డగుసుదక్షిణునిఁ దాఁకి, క్రూరనారాచపంక్తులఁ గ్రుమ్మరించె
ఘనుఁ డగుసహదేవుని శ్రుతకర్ముఁ డతని, దక్షుఁడై యొడ్డి పోరె సుదక్షిణుండు. 67

తే. అర్జునసుతుం డిరావంతుఁ డనెడువాఁడు, క్రుద్ధుఁడై శ్రుతాయువు తేరిగుఱ్ఱములను
గూల నేయ నతఁడు వానిఘోటకములఁ, గనలి కూల్చె నిజగదాగ్రఘాతములను.

సీ. ఆవంత్యులైన విందానువిందులు కుంతిభోజుఁ దాఁకిరి సహపుత్రు నాజి
నపు డంపసోనల ననువిందుఁ డడరించి, గుదెఁ గొని తాటించెఁ గుంతిభోజు
నతఁ డీసునన్ బరిమితి లేనిశరముల, నడరించి వానియు క్కడఁచి పుచ్చె
నాకుంతిభోజున కాత్మజుం డగుపురుజిత్తు విందునితోడఁ జేయిఁ గలిపెఁ

తే. గరలి గాంధారవిభులుఁ గైకేయపతులు, నేవు రేవురు మచ్చర మెచ్చఁ బోరి
దుత్తరుండును దీర్ఘబాహుం డనుభవ,దాత్మజుండును మొనకట్టి రాలమునకు.

క. చేదివిభుండు నులూకుఁడు, మోదంబున ననికి మొనసి మునుఁగు వడంగా
మోఁదుకొని శరము లొండొరు,భూదయితులు ప్రస్తుతింపఁ బోరిరి కడిమిన్. 70

— ♦ ప్రథమయుద్ధప్రకారాభివర్ణనము ♦ —

వ. ఇట్లిరువాఁగునందును శతాంగంబులయు వారణంబులయు వాహనంబులయుఁ బదాతివర్గంబులయు ద్వంద్వసహస్రంబులు దలపడి పోరునప్పు డప్పో రొక్కముహూర్తమాత్రంబు మధురదర్శనం బయ్యె నంతంత దురంతంబును దుర్దమంబును దుర్ధర్షంబు నై దేవాసురయుద్ధంబునుం బోలి యున్న దానిం గనుంగొను హర్షంబున దేవర్షిగణంబులును సిద్ధచారణసంఘంబులును సమాగతంబు లయ్యె నయ్యెడం గలదండిమగ లొండొరువులం దాఁకి తండ్రియుం గొడుకు నన్నయుఁ దమ్ముండును మామయు నల్లుండును నాక వీఁక మెయిఁ జుట్టఱికంబుఁ జూడ కున్మత్తులవిధంబునను గ్రహావిష్టులచందంబునను దలపడి చలంబు బలంబు మెఱయ గరిమంబు జూపుచుండి రాసందడికయ్యంబున రథంబులు రథంబులుం దాఁకునప్పు డొండొకఁ డుక్కుమడంప మిక్కిలి జవంబునం బాఱునవియు నొక్కదాని త్రాఁకున వే యొక్కండు ముక్క లగునవియును గింకిణీధ్వజంబులతో రథులు సారథులుం బోవ మోఁదుపడి యుండునవియును నిరుసులుం జక్రంబులు విఱుగ నొఱగునవియును గూబరంబులు వో నూఁగులాడునవియును గాఁడులు వెగ వీడిపోవునవియును వీరయోధప్రయుక్తాయసగదాఘాతంబులఁ జూర్ణీభూతంబులై భూతలంబునం గ్రుంగుచుపడునవియును నయ్యె గజంబులు గజంబులుం దాఁకి ఘీంకరించుచుఁ దుండంబులుం దుండంబులుం జుట్టి యిట్టట్టూఁగులాడునవియును రథంబుల రథ్యంబులం బట్టి బిట్టు త్రిప్పి నేలం బెట్టి కొట్టునవియును శూలంబులుఁ గరవాలంబులును శుండాదండంబులం గ్రుచ్చుకొన నొచ్చి గీపెట్టుచు మావంతుల నావంతైన లక్ష్యపెట్టక నెట్టుకొని పోవునవియును హస్తంబుల గదాదండంబు లమరించుటం జేసి రథహస్తిపత్తితురంగాదుల నుగ్గునూచంబు సేయునవియును దుండంబులును గండంబులునుం దెగి మొండెంబులై పోవునవియును గుంభంబు లవియ భైరవారావంబున నేలఁ గూలునవియును నయ్యె హయంబులును హయంబులుం దాఁకి రయంబునం బాఱి ముందఱికాళ్ళు మీఁది కెత్తి రాహుత్తుల నెత్తిపైఁ బెట్టునవియును జామరాపీడచాంచల్యంబు తమముఖంబులకు వింతసొంపు సంపాదింపఁ జిత్రగతులం జరించుచు నెదిరిం జేరనీయ కుండునవియును బిట్టలవలెం బిట్టెగచి

నంత దారుణమార్గణాపాతంబున భూతలంబునం బడునవియు నయ్యైఁ గాల్వురుం గాల్వురుం గవిసి చలంబు నెఱయ బలంబు మెఱయ నొండొరులపై నుఱువడించి యుంపసోనలం గురియించుచుఁ బరశుపట్టసముసలముద్గరగదాసికుంతకరవాలభిండివాలాదిసాధనంబులం బ్రయోగించుచుం బగఱఁ బ్రహరించి నొంచువారును దమతమచేతివిండ్లు విఱిఁగిన మాఱువిండ్లతివేగంబునం గొని కరలాఘవంబు సూపువారును సారథులు తెగినం దార రథచోదనంబు సేసికొనుచు వాసి మెఱయువారును విరథులై వాలును బలకయునుం గొని నేల కుఱికి విక్రమంబు సూపువారును నిజాంగవిభూషితజాంబూనదాంగదాదివిభూషణంబుల నిల నలంకరించువారును దలలు దెగినంత నంతకుమున్నెయ నంకించువారిని నేసి పడువారును నొండు రెండయ్యును బొమ్మముడిపాటు నొడుగఱపున్ను వీడనితలలు గలవారును నొచ్చియు నీడంబోక తమవారికిం దోడుసూపువారును దోఁకఁ ద్రొక్కిన కోడెత్రాఁచుల చందంబున నేఁచి వచ్చుజోదులచేదోయికిం జిక్కి పొక్కుచుం దమవారిం జీరుచు నాక్రోశించువారును వారణతురంగాదిసంపాతంబునం గాలుసేతులు విఱిగి డొక్కలు ముక్కలై నలుగంబడి మడియువారును బిపాసార్తులై యిందు నందు నీళ్లు లరయువారును దలయు నట్టయు వే అయ్యు నెయ్యొడకును నాక్రోశించుచుండువారును నీకొడుకునిమిత్త మింత లింతలు పుట్టెగా యని వాని దిట్టువారును నై యుండ భండనంబు నిర్మర్యాదంబుగం బ్రవర్తించుచుండె నపుడు మధ్యాహ్నంబగుడు దుర్యోధనప్రచోదితులై దుర్ముఖుండును గృతవర్మయుఁ గృపాచార్యుండును శల్యుండును వివింశతియు నను నేవురతిరథశ్రేష్ఠులు దోడుపడి తనకెలంకులఁ గొలుతల సేయుటయు దాని కానందించి మందాకినీనందనుండు. 71

—♦ భీష్ముఁడు పాండవసేనపైఁ గవిసి విజృంభించుట ♦—

సీ. తాళధ్వజోత్తాలధాళధళ్యద్యుతు, లాభీలమై క్రాల నతిశయిల్లి
పాండవానీకిని పాయలువడఁ జొచ్చి, చిచ్చఱపిడుగు నాఁ జెవ మెఱసి
కాశిపాంచాలకరూశచేదిశాది,రాజవరుల మొగ్గరంబు లెల్లఁ
గలగుండువడి కదుం గలఁగి తల్లడపడి, తిరుగుడువడ వడిఁ ద్రెళ్ళ నేసి
తే. వీరవిక్రమనృత్యంబు తేటదారు,లందు నానావిధంబుల నాచరించు
నంత నయ్యయిసైనికు లార్తు లగుచుఁ, జెదరి పఱచిరి దుర మీఁగి చెట్టొకఁడుగ.
చ. పులిఁ గని పాఱులేళ్లవలెఁ బోరుకులోత్తరుతేరిపైఁ దళ
త్తళ మనుతాళకేతనము దవ్వుల దవ్వుల దృక్ప్రవాహము

దోలయుద్ధ గుండె జల్లుమన నూర్చుచుఁ గూర్చెడువారికూటముల్
వెలిగ నరాజుల న్విడిచి బెగ్గడిలంపడి పాఱి రెల్లరున్. 73

వ. ఇట్లు విజృంభించినభీష్మునకు భీతిల్లి యెల్లసైన్యంబు లొల్లఁబోయి చెల్లాచెద రగు
చున్నసమయంబున నభిమన్యుండు మన్యు సమన్వితుం డై 74

మ. వరగోరోచనవర్ణవర్ణితము లశ్వశ్రేష్ఠముల్ పూన నొ
ప్పురథం బెక్కి సువర్ణకాంతులు కడున్ బొంగారఁగాఁ గర్ణికా
రరమం బొల్చిన వైజయంతి పరవీరవ్రాతభీతింగరన్
గరయుగ్మంబున నాట్యమాడ ధను వుగ్రంపశ్యుఁ డై పైఁ బడెన్. 75

సీ. తాలకేతువు నొకకోలఁ గూలఁగ నేసి, నవయించి భీష్ముని నవశరములఁ
గృతవర్మ నొకట నో, నేసి మద్రేశునిఁ, బంచాశుగమ్ముల బడలు వఱచి
నిశితాంబక మొకండు నిగిడించి దుర్ముఖు,రథసారథిశిరంబు పృథివిఁ గూల్చి
తఱిగి. వివింశతిధనువు ముక్కలు గాఁగ, మూఁట శారద్వతు నోటువుచ్చి

తే. తక్కనుం గలయోధుల నుక్కడంచి, మించి కొఱవి ద్రిప్పినరీతి సంచరించు
విజయనందనులాఘవవిభవమునకు, మేలు మే లని వేల్పులున్ మెచ్చిరపుడు.

క. మన్యుసమన్వితుఁ డియ్యభి,మన్యునిలాఘవము లక్ష్యమహిమంబు నసా
మాన్యము లఖిలధనుష్మ,న్మాన్యుఁ డితం డెచ్చుఁ దండ్రి మార్గణమందున్. 77

వ. అని భీష్మాదియోధు లెల్లం బ్రశంసించుచున్నసమయంబున. 78

— ♦ అభిమన్యుండు భీష్మునితోఁ బ్రతిఘటించి యుద్ధము సేయుట ♦ —

ఉ. చాప మలాతచక్రగతిఁ జంక్రమణం బొనరింప మేఘనా
దోపమ మై గుణక్వణన మొప్ప సుభద్రతనూజుఁ డాజిలో
నేపున నేచుచున్న నొకయించుక కస్గవఁ గెంపుదేర సే
నాపతి వాని మాఱుకొనె నారసముల్ నవకంబు లేయుచున్. 79

మత్త. మూఁడుతూపుల వాని కేతనమున్ ధరం బడ జేసెఁ బై
మూఁడుతూపుల సూతు నేసి సముద్ధతిం గనిపించుచోఁ
గూడి శల్యముఖుల్ గడుంగడు ఘోరశల్యము లేసి రా
ప్రోడ నేనికినిం జలింపక భూధరప్రతిమానుఁ డై. 80

మ. శరవర్షంబు కడున్ వడిం గురియుచున్ జాల్వారి పైఁ బడ్డ నే
గురితేరుల్ మునుఁగం బరంపరలు గాఁ గ్రూరాస్త్రముల్ వైచి వీ
రరసం బేర్పడ నార్చుచుం దొడరి స్వారాట్పౌత్రుఁ డాభీష్ము ము
ష్కరుఁ డై తాఁకి నవాంబకంబులఁ బతాకం జెండె రెం డై పడన్. 81

ఆ. తాళకేతనంబు గూలి నేల నలంకరించినంతలోనఁ గాంచి భీమ
సేనుఁ డాత్మ నలరి సూను నగ్గించుచు నార్చె నొక్కపెట్ట నతిరయమున. 82

ఉ. దానికి నల్గి భీష్ముఁ డెడఁదం బెడిదంబుల నారసంబులన్
బూని సుభద్రసూనుఁ గని పోకు మటంచును బల్కరించుచున్
వానిశరీరమున్ రథము వాపురముల్ గనరానియట్టు లె
న్నేనియు నేసి చేసె దుర మేసినచోటన వెండి యేయుచున్. 83

వ. అయ్యవసరంబున నభిమన్యునకుం బాసటయై భీమసేనుండును సాత్యకియు విరా
టుండు నుత్తరుండును ధృష్టద్యుమ్నుండును గైకేయులేవురుం బదుగు రొక్కపెట్ట
భీష్ముం జుట్టుముట్టుటయు నతండును. 84

— ఉత్తరుఁడు మద్రపతిపై కఱిగి చచ్చుట —

సీ. మూఁట ధృష్టద్యుమ్ను నాట నేసి శినిప్రవీరునిఁ దొమ్మిదినారసముల
నొగిలించి యొండొక్కఁ డగుశితక్షురమునఁ, బావనిసింగంపుఁబడగ విఱిచి
విక్రమించుటయుఁ బరాక్రమంబునఁ బ్రభంజనతనూజుఁడు మూఁడు శాతశరము
లడరించి మిన్నేటికొడుకు నొనేసి కృపుని నొకమ్మునఁ జేసి పొడ వడంచి
తే. మఱియుఁ గృతవర్మ నెన్మిదిమార్గణముల, నొంచి మించిన నుత్తరుం డంచితగతిఁ
గనలి మద్రేశుతేరిపై గంధసింధురమును బోఁ దోలె నెంతయు రయము మెఱయ.

ఉ. మత్తగజంబు మద్రపతి మార్కొని కార్కొని తేరికాఁడిపై
నత్తఱిఁ బూర్వపాదముల నానఁగ నిల్పి యొకింతలోపలన్
దత్తురగోత్తమంబులను నాల్గిఁటిఁ గైకొని నల్గ రాసినం
దత్తఱి మందిమద్రవసుధాపతి రౌద్రరసంబు పేర్పడన్. 86

ఆ. ఆయసంపుశక్తి నమరించుకొని వ్రేయ, నది రయంబు మీఱ నరుగుదెంచి
మత్స్యరాజసుతుని మైమఱువుం జించి, లోనఁ దూఱి వెలికిఁ గానవచ్చె. 87

క. ఆమాత్స్యసుతుం డంకుశ,తోమరములు గజమునంద తొఱఁగి మృతుండై
సామజమునుండి విడివడి, భూమిం బడె నెత్రు వాఁక బ్రుంగుడు వఱచున్. 88

ఆ. అంత నిలక శల్యుఁ డతిరయంబున వాలు, వెఱికి నేల కుఱికి నఱకె వాని
మదగజంబుతుండ మదియు గీపెట్టుచుఁ, గొండ వోలె నేలఁ గూలి చచ్చె. 89

— మత్స్యపుత్రుం డగు శ్వేతుండు యోధసప్తకంబుపై నడరుట —

వ. ఇట్లు చేసి శల్యుండు కృతవర్మరథం బెక్కె నంత. 90

చ. విరటసుతుండు శ్వేతుఁ డనువీరవరేణ్యుఁడు తమ్ముఁ డట్లు పో
దురపిలి చింతఁ గొంతవడిఁ దుప్పలుదూలుట మాలి వేళకున్

సరిపఱుసీరసం బెసఁగఁ జాపగుణక్వణనం బొనర్చుచుం
గరకరిఁ, దాఁకి యేఁడుగురికార్ముకముల్ విదళించె నమ్ముల౯. 91

ఆ. ఆపగాసుతాదు లగువారు వే ఱొంపు,వింట్లు గొనుచు నేఁడువిశిఖములను.
వానివారువములపై నేయు నాతండు, వెండి వారివింట్లు చెండి వైచె. 92

ఉ. వారు నిష్కృత్తచాపులయి వారనికోపము రూపు నొందిన
ట్లుగ్రరయ మేర్పడం గొని మహాద్భుతశక్తుల నేఁడు వానిపైఁ
జేరఁగ నేసి యార్చి రవి చెల్లుబడిం దివ మెల్ల నిండుకో
ఘోరము గాఁగ మండుచును గూడఁగ రాఁ గని శ్వేతుఁ డుద్ధతి౯. 93

చ. నడుమ న వన్నియుం దునిసి నల్గడలం బడునట్లు చేసె నా
తఁడు శరసప్తకంబునన దానికి నల్గి పితామహుండు పెం
పడరఁగ దివ్యబాణ మొకఁ డాతనిపై గుఱి చేసి యేసినం
గడువడిఁ బాఱి నాశరము కాయమున న్వడిఁ దూఱి వచ్చుటన్. 94

క. శ్వేతుఁడు బాణహతుం డై, చేతమునం దెలివి కప్పి చేష్పడి రథముం
దూఁత గొని నొగలు మూర్ఛా,నీతుం డై పడియె నంత వేగిరపడుచు౯. 95

వ. వాని నియంత రథంబు తొలంగం దోడుకొని చనియె నంతఁ గొంతివడి కాతండు స్వేదదేఱి తేరికి మాఱువారువంబులం బూన్చుకొని వచ్చి చిచ్చుఱపెడుగట్లు విచ్చల విడి విహరించుచు నయ్యేఁడుగురిం దాఁకు దెంచి. 96

మ. ధ్వజశీర్షంబు లిలం బడ౯ సలిపి వాహ్యంబుల్ ససూతంబు లై
నిజగాత్రంబుల నేలఁ గప్పుసుగిరి౯ నిర్మించి పేర్మి౯ మహా
ధ్వజినిం గూల్చుచు మద్రరాజ పెసకు౯ ధైర్యం బవార్యంబు గా
నజితుం డై చనుచుండ నీప్రజలు హాహాకారముం జేయుచుం౯. 97

తే. చిక్కఁ జిక్కి మద్రేశుఁ డీశ్వేతున కని, సంభ్రమించుచు నుండునాసమయమందు
భీష్మముఖ్యులతో నీసుయోధనుండు, తోడుపడి శల్యు మిత్రికిఁ దొలఁగఁ జేసె. 98

వ. అంత. 99

క. వైరాటి మద్రభూపతిఁ, జేరం జనునప్పు డుభయసైన్యంబుల౯
దారుణసమరము సెల్లెం, గౌరవవంశోత్తరుండు ఘనుఁ డం దయ్యెన్. 100

వ. అయ్యవసరంబున బకాంతకుండును సౌభద్రుండును సాత్యకియు విరాటుండును ధృష్టద్యుమ్నుండును గైకేయులును శిఖండిం బురస్కరించుకొని సేనాపతి యైన శ్వేతున కుం దోడుపడి భీష్ముం జుట్టు ముట్టి నానావిధాయుధంబులం దెట్టలు గట్టం గొట్టి రట్టి యెడ భీష్ముండు గ్రీష్మభానుండు నా నతిభీష్ముం డై క్రూరనారాచంబుల నెల్ల వార

వారించి శ్వేతుం దాఁకె దాఁకిన వారి కిర్వురకు నెయ్యెడకుం దీఱని ఘోరసంగ్రా
మం బయ్యె నయ్యెడ. 101

సీ. మోఁదిన లై తేరులు మునుమున్న చూపట్టె, ముక్క లై ధరమీఁదఁ గ్రోవుపడియె
బొందళంబులు ద్రెవ్వ డింపుపా టందెను, యోధులు తల లూడ నూడి పడిరి
వాహనంబుల నెక్కి వచ్చెడువా రంత, వాని క్రిందం జేరువార లైరి
చేతులతీఁట వో హేతు లందినవారు, కాలుసేతులు తెగ నేల కైరి
ఆ. యొండొకళ్లు వట్టి యుబ్బూఁత లూగించి, క్రిందు మీఁదు వడుచు సం దెఱింగి
పఱవ నున్నయంతఁ బఱియ లై పోయిన,వార లయిరి జోదు లారణమున. 102

వ. మఱియు మహారథు లగువారు సారథులతో దమరథంబు. వోవ విరథు లై పీత
మనోరథు లై వాలునుం బలకయుం గొని నేల కుఱికి వెఱచి పఱచువారిం బడ
నేయువారును దలలు వోయినను గరతలంబుల ఖడ్గంబులు విడక పడియున్నవా
రును మద వేదండంబులు తొండంబులం బట్టి నేలం బెట్టి కొట్టి కాళులం జమరినం జచ్చి
పచ్చడి యగువారును బదఘట్టనంబున రేఁగినపరాగం బెగసి చీఁకట్లు గావింపఁ
గన్ను గానక ధనుఃకూజితవిజ్ఞానంబున బరిపంథి నెఱింగి పోరువారును ఢక్కా
హుడుక్కాదివాదిత్రంబులం బరస్పరధనుష్టంకారరవంబు లెఱుంగనేరక లాత్రివారని
జాత్రివారిం దాఁకువారు నై సంకులసమరంబు సాగించుచుండె రాసమయంబున.

—♦ శ్వేతుండును భీష్ముండును ఘోరయుద్ధము సేయుట ♦—

ఉ. తాడిసిడంబువాఁ డడరి దాయల నేయుచు నున్నయప్పు డే
వాఁడును లేడు వానిశరపాతమునం గుఱి గానివాఁడు చే
యాడక చేడ్పడెన్ రిపుచయం బట శ్వేతుఁడు ధూమకేతు వై
వేఁడి వెలార్చెఁ బేర్చి కురువీరులసేనల కెల్లఁ జేటుగన్. 104

చ. అరదములం బగిల్చి తురగావళి డుల్చి గజాళిఁ ద్రుంచి కా
ల్వురఁ గడతేర్చి టెక్కియములుం ధనువుల్ దెగ నేసి నీప్రజల్
పరిపరిఁ బమ్మరిల్లి పొగులన్ జలిపెన్ శతముల్ సహస్రముల్
శిరములు చిత్తజల్లువలెఁ జిందఱవందఱ లాడునట్లుగన్. 105

తే. చెప్ప నేటికి మా కెల్ల శ్వేతునిభయ, మక్కజం బయి తోఁచె నయ్యవసరమున
దురము విడనాడి శరపాతదూర మపసరిల్లి గతి భీష్ముఁ డని యుండి రెల్లవారు.

చ. బెదరిన సేనలం గనుచు భీష్ముఁడు గ్రీష్మదివాకరద్యుతిన్
బొదలి సురాద్రి మాద్రి వెఱఁ బొందని డెందముతోఁ జలింప క

త్కారముల నేయుచుండఁగ నతం డతిదారుణ మై పరేతరా
ట్కారగతదండతుల్య మయి క్రాలెడుశక్తినిఁ బూని ఘూనికన్. 124

చ. నిలు నిలు మెందుఁ బోయెదవు నీ వని పల్కుచు నల్కఁ జేసి యు
జ్జ్వల మగుదానిన్ విసరి వానిపయిం బడనేయునంతలో
హాలహలశబ్ద మేర్పడె మహాభుజ! వీఁ డిదె నీకనర్థముల్
జలుపుచు నుండెఁ జూడు మని సారెకు నీసుతు లార్చి రార్చినన్. 125

ఉ. దేవనదీసుతుం డపుడు దిక్కులు పిక్కటిలంగ మండుచున్
జీవమెయిన్ మహోల్కవలెఁ జేరఁగ వచ్చెడు శక్తిఁ గాంచి లో
దేవురువుట్టఁ దొట్రుపడి దిట్టఁడు గాన శరాష్టకంబునన్
గైవడి కెల్ల మెచ్చ నవఖండము లై పడఁ జేసె దానినిన్. 126

తే. అట్లు వమ్మయి శక్తి వోవ విరాటు, సుతుఁడు వగచుచుఁ గాలోపహతుఁడు గాన
నెట్లు చేయుటకుం దోఁప కింత నిలిచి, పెలుచ నగుచుఁ గన్గవఁ గెంపు మొలక లెత్త.

ఉ. రెండుకరంబులన్ గద నరిందముఁ డై కొని వీకఁ జూపుచున్
రెండవదండపాణి యన రేఁగి వడిన్వడి నాపగాసుతుం
డుండినతేరిపై కుఱికె హాహారనుశబ్దము వుట్టఁ ద్రిప్పుచున్
[1]గండరగండఁ డాతఁడు నిగాఢముగాఁ బడ నేసె నీసునన్. 128

ఆ. తాఁకు మో పెలుంగుదంట గావున భీష్ముఁ, డంతలోన నుఱికె నవని కంత
వింతగా రథంబు హయములతో సూతు,తో ధ్వజంబుతోడ ధూళి యయ్యె. 129

వ. వైరాటి తాను విరథుం డయ్యు నతిరథోత్తరుం డగుభీష్ము నిరథం బిట్లు భస్మ
సాత్కృతంబు గావించి పాదచారి యై యున్న వానిం గాంచి తీఱనివైరంబునం జేసి
శల్యప్రభృతిమహారథు లెల్లరునుం గవిసి రంత శాంతనవుం డొండొక రథం బెక్కి
మొక్క వోనిపరాక్రమంబున నేతెంచి శ్వేతుం దాఁకుదెంచె నప్పు డుప్పరంబున.

క. దేవవ్రత! దేవవ్రత!, యీ వింకం దడయ వలవ దిది విధివిహితం
బై వెలసినట్టికాలము, [2]కావరునిన్ శ్వేతుఁ గూల్పఁ గడఁగుము కడిమిన్. 131

వ. అని దేవదూతవచనంబు శ్రుతిగోచరం బగుటయు నయ్యష్టమవసువు సంప్ర
హృష్టమనస్కుం డై వానిం జంప నుంకించుచున్నయప్పుడు సాత్యకియు భీమసేనుం
డును ధృష్టద్యుమ్నుండును ధృష్టకేతుండును నభిమన్యుండును గైకేయులును దద్ర
క్షణార్థం బరని మేషాంతరంబునం గవిసిన ద్రోణశల్యకృపాదు లడ్డపడి దొడ్డనార
సంబుల వారి నెల్ల వారించు చుండి రట్టియెడ. 132

1 గండరగండఁడు = శూరాగ్రేసరుఁడు; 2 కావరుఁడు = దుర్మదుఁడు;

ఉ. శ్వేతుఁడు చేత ఖడ్గమును జేకొని భీష్మునిచేతివింటి న
త్యాతతశౌర్య మేర్పడ రయంబున రెండుగఁ జేసె నంతలో
నాతఁడు వానిచావునకు నారయుచుం ధను వొంది పూని సం
ప్రీతిమెయిం గుణంబు సవరించుచు నుండె దదంతరంబునన్. 133

— శ్వేతుఁడు భీష్మునిబ్రహ్మాస్త్రమున హతుఁ డగుట —

క. భీమాదులు ద్రోణాదుల,తో మార్కొను టుడిగి వడిగఁ దోడ్పడి మత్స్య
క్ష్మామండలేశసుతునకు, భీమగతిం బోరుకొనిరి భీష్మునితోడన్. 134

చ. శర మరివోసి శ్వేతుఁ డెన సత్వరుఁడై చనునాపగాసుతుం
డరిపడుశత్రుసైన్యముల నారసి యారస మెచ్చ భీమునిన్
సురపతిపౌత్రు నర్వదిట సోమకసూనుని నిర్వదింట నా
హరియనుజన్ము నూటిటను నైదిటఁ గేకయులన్ మరల్చుచున్. 135

మహాస్రగ్ధర. అలుకన్ శ్వేతాభిముఖ్యం బగునటుగఁ జని బ్రహ్మాస్త్రమున్ శస్త్రమందున్
గలుగన్ సంధించి మంత్రాకలితబలమునన్ గ్రాలఁగాఁ జేసి యేసెన్,
జ్వలదగ్నిం బోలు నయ్యస్త్రము సుర లరయన్ సైన్యనాథోరమున్ వ్ర
చ్చి లలిన్ లోఁ జొచ్చి యుర్విన్ చిడిముడిఁ గొని వచ్చెన్ తృణాగ్రంబులోనన్.

తే. అస్తగతుఁడైన భానుని యట్లు తేజ, మిూఁగి శ్వేతుఁడు గిరినుండి శృంగమట్లు
కూలె నేలకుఁ బాండవుల్ కుందుచుండ, యుష్మదీయులు హర్షంబు నొందుచుండ.

తే. కృష్ణుఁడున్ దుష్టుఁడుం దొట్టియెల్ల నొందుఁ, గుందుచుండ దుశ్శాసనుం డిందు బూరి
గొమ్ములుం దప్పెటలును దారెమ్ము లొప్ప,నటుసిందమునం బొంది నాట్యమాడె.

వ. అని చెప్పిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 139

సీ. శ్వేతుఁ డీల్గుటకు నాచిత్తంబు హర్షించు, నక్కుటిలం బన దతఁడు మున్ను
నాకుమారుని మీఁద నేఁ బెనఁకఁ బాండవులకు, హితుఁ డయ్యెఁ దత్పితహితముఁ గూర్చె
నట్టివానిం జూచి సరిసిన వా కూర్తకుండురే యగ దీర్ప నుండ్రగాని
భీభత్సునిభయంబు పెద్ద నాఁ డింద్రునకు నపేంద్రునకు నుద్ద యునఁగవచ్చుఁ

తే. గొడుకులకు నెట్టిగొడ్డైనఁ గూర్పకుండఁ, డని మొనం గలసేనాని ఘనుఁడు వాని
తోడు గల్గినదామాదు లోడనిపగ,నుండి మనవారి వేధింప కుండు టెట్లు. 140

తే. మున్ను చేసినయపరాధములకు నిప్పుడు, శ్వేతు నీయుటకున్ వారిచిత్తమందు
మండుచుండున క్రోధ మప్పాండుసుతుల,కలంచిన న్యాంతినామది గలుగ దెపుడు.

వ. భీష్మద్రోణాదులకును నాకు నీసమరం బసమ్మతంబు వల దని వ్యాసాదులు చెప్పి
నను వినక పుత్రాఖ్యుండై మానుయోధనుండు కర్ణసౌబలాదులదుర్మతంబునం బ్రవ

ర్తించి పాండవులతోడం బగ వెట్టుకొని యింత పుట్టించె నింక నేమి సేయుదుం గానిమ్ము కానున్నది కాక పో దా శ్వేతవధానంతరమ్మున రణ మ్మెట్లు సెల్లె నారాయణసహాయుం డగునరుం డేమి చేసెం జెప్పు మనిన సంజయుం డును. 142

ఉ. ఇంతలు తెచ్చిపెట్టుకొని యీవ సుయోధనుమీఁద నంతయుం
వింతగఁ బెట్టఁ జూచెదవు పిఱిడికై వడిఁ గుందు చుందు వి
వ్యంతయు నిండ్లు గాలుసమయంబున బావులు ద్రవ్వుటల్ జలం
బంతయుఁ దెర్లి పోర్లి చనినప్పుడు కట్టలు గట్టుటల్ సుమీ. 143

—♦ శ్వేతాగ్రజుం డగుశంఖుండు శల్యునితోఁ బోర యోడుట ♦—

చ. వినుము త్రిరుండ వై వగపు పీడి రణం బది యెల్లఁ జెప్పెదన్
మనుజవరేణ్య! శ్వేతుఁ డటు మా నటి పోయిన వెన్క రెండుజాల్
చనఁగ దినాపరార్ధమున శంఖుఁడు తమ్ముని పాటుఁ జూచి లోఁ
గనలి హుతాశనుం డనఁగ గండరగండఁడ వై వెలుంగుచున్. 144

క. గౌనయము సారించుచుఁ దన, కైన యగురథచయముతోడఁ గృతవర్మరథం
బున నున్నశల్యుఁ దాఁకం, జనెఁ గురియుచు శరచయంబు జడివానవలెన్. 145

తే. మృత్యుదంష్ట్రాంతరగతుఁ డై సొలఁగుచున్న, శల్యునిం గావ మీవారిస త్తరథము
లడ్డుపడె నప్డు జలదమ ట్లార్చి పేర్చి, కవిసెఁ జెనువిల్లుఁ బూని గంగాసుతుండు.

ఆ. తాఁటిపొడుగువిల్లు దళ్కొత్త వచ్చెడు, నాపగాతనూజు సరసి [1]బెరసి
నట్టిశత్రుసైన్య మట్టెట్టువడె వాత, రయమునను జలధిఁ దరణివిధమున. 147

మత్త. అంత శంఖునకుం బురస్సరుఁ డై నరుండు కరంబు దు
ర్దాంతవిక్రముఁ డైనభీష్మునిఁ దాఁకి పీఁక నెదిర్చి యు
క్కింతసేపు మహాస్త్రశస్త్రము లేయుచున్ రణకేళియం
దెంతయేనియు సంతసంబున నేర్పరెన్ వడి పేర్చెడన్. 148

క. పిడుగుం బిడుగుం దాఁకిన, వడువున [2]నాభరతవంశవరిష్ఠులు పే
ర్చడఁ దాఁకి పోరునప్పుడు, పడియెన్ హాహారవంబు బహులం బగుచున్. 149

వ. అయ్యవసరంబున. 150

క. గదఁ గొని తే ర్డిగి శల్యుం, డుదితార్కుం డనఁగ మండి యురువడి శంఖుం
గదిసి తదీయాశ్వములం, జదిపె న్నాల్గింటి నొక్కచఱపున నంతన్. 151

తే. తురగములు లేనియరద మావిరటుసుతుఁడు, విడిచి ఖడ్గము చేకొని పుడమికి డిగి
వెఱపునం జేసి పఱచి యవ్విజయురథము, నెక్కె శాంతి వహించె లో నెంతయేని.

1 బెరయు—వ్యాపించు; 2 భరతవంశవరిష్ఠులు—భీష్మార్జునులు;

సీ. అంత శాంతనవుండు పంత మొప్పఁగ వేన,వేలు వాలమ్ములు గ్రాల నేసి
పాంచాలమత్స్యప్రభద్రకకేకయ,ముఖసైన్యముల నెల్ల ముసుఁగు వెట్టి
శతమన్యుసుతునితో సమరంబు సాలించి, పోలించి ద్రుపదునిపొంత వోయి
పోయినంతన వానిభూరిసైన్యంబుల, మారి మసంగినమాడ్కిఁ జేసి
ఆ. విగతధూమవహ్నివిధమున నుండుచుఁ, బట్టపగటిసూర్యుపగిది నగుచు
నేరుఁ జూడ రానితీరు పొసంగఁగఁ, గాంగి శత్రుబలముపాడ వడంచె. 153
తే. ఆఃగేయునికోల్తల కపుడు పాండ,వేయసైన్యముల్ సాధ్వసపీడితంబు
లగుచు నేడ్గడ లేమి శీతార్దితంబు, లయినగోవులు నాఁగ నూఁగాడ సయ్యె. 154
మహాస్రగ్ధర. కోఱికచ్చుం ద్రిప్పినట్లై గుడుసు వడి వడిన్ గ్రోలుచున్ మేటివిల్లం
పఱ నేల న్నింగి నిండం బడ విసరుచుఁ గైఁబల్లటీల్ ద్రాఁటుచుండన్
బిఱుసుంగయ్యంబునందున్ బిరుదుమగఁడు మీభీష్ముఁ డమ్మూఁక లెల్లన్
బఱవం గాఁ జేసెఁ దాఁ గోర్వక విఱిగి కడం బాయులై చీఱి లీలన్. 155
వ. అంత. 156
ఆ. భానుఁ డస్తమించెఁ బ్రభ సన్నగిల భీష్మ,భానుప్రభ సమృద్ధిఁ గానుపించె
నపుడు పాండవేయు లవహార మొనరించి, సేన దిగిచి చనిరి శిబిరములకు. 157
వ. ఇట్లు ప్రథమదివసాయోధనంబున యోధాగ్రేసరుం డగుభీష్ముండు గ్రీష్మభానుం
డై వెలింగినం గని దుర్యోధనుండు హర్షోత్కర్షంబునం దేలె నట యుధిష్ఠిరుం డో
హటించినచిత్తంబునం గలయుత్తలపాటున విన్నఁబోయి తమ్ములుం దానునుం
దగువారిం గూడుకొని గోపాలదేవునిపాలికిం జని జాలింబడుచు ని ట్లనియె. 158

—♦ ధర్మరాజు కృష్ణునితో భీష్మునిపరాక్రమంబు చెప్పి వగచుట ♦—

ఉ. భీమపరాక్రముం డయినభీష్ముఁడు గ్రీష్మమునందు వహ్ని నా
నీమెయి నాహుతిం బలె నొకించుకలోనన నాకి వైచెఁ బో
మామక మైనవాహిని సమాంతముగాఁ గొని కంటికాదె యో
తామరసాక్ష ! వాని ననిఁ దాఁకి యెదుర్పఁగ లేఁ డొకండునున్. 159
ఆ. వాఁడిమగని వానివంకఁ గన్నెత్తి చూ,చుటకు నైనఁ గాక చుఱుకు పుచ్చు
శరపరంపరలకుఁ దెరలి నాయోధులు, విఱిగి పఱచి రేమి విన్నవింతు. 160
మ. జమునిం గెల్వఁగ వచ్చు వజ్రధరునిం జక్కాడఁగా వచ్చుఁ బా
శముఁ జేఁ దాల్చినయట్టిజెట్టిబిరుదున్ సాధింప వచ్చున్ గదా
భిమరాభిజ్ఞుని గుహ్యకేశ్వరుని దేబెం జేయఁగా వచ్చు జ
న్యమునం దాతటినీతనూజు గెలువన్ శక్యంబు గా దేరికిన్. 161

చ. తెలియక దుర్బలం బయిన తేలికబుద్ధినిఁ జేసి బేల నై
మెలఁగితి భీష్ముఁ డన్ జలధి మేర యెఱుంగఁగ లేక యీఁదగా
బొలిచిన నేను బారమును ముట్టఁగఁ జాల మునింగి పోయెదన్
జలరుహనాభ! యే మని ప్రశంస యొనర్చెద నాయదృష్టమున్. 162

క. ఈరాజకోటి నెల్లన్, గోరచి గా భీష్మమృత్యుముఖమున వేయం
గోరను మది నీపో ర్విడి, ఘోరాటవి కేగి బ్రదుకఁ గోరెద ననఘా. 163

సీ. వితతమై చనన్ వేనవేలరథంబులఁ, గూల్చె భీష్ముఁ డస్త్రకోటి మీఁటి
వానిముమ్మన కైనవా రెల్ల నగ్గలోఁ, బడినమిడుతలట్లు మడియ నైరి
నాతమ్ము లందఱు నవసిరి శరవిద్ధగాత్రులై రేమందుఁ గమలనాభ!
నాకారణమ కదా లోకమునన్ వీరు, వాసికై నోమనివా రగుటకు

తే. విభుత విడనాడి వనులందు వేఁగివేఁగి, పుడమిఁ బడరానికష్టముల్ వడియు నిపుడు
భ్రాతృసౌహార్ద్రమునఁ జేసి ప్రధనమునకుఁ, దిగిరి జీవితాశన్ విడి తెగువఁ జేసి. 164

ఆ. రాజ్యకాంక్షఁ జేసి పూజ్యులన్ మిత్రులఁ, జుట్టములను మఱియు సుహృదు లైన
యందఱన్ రణంబునందుఁ జంపింపఁ గా, నభిలషింప నెట్టు లైనఁ గాని. 165

క. ఏవారు దుర్లభం బని, జీవితమున్ నెత్తు రనుట జీవితశేషం
బే వనుల నుండి తపముం, గావించుచుఁ గడప నెంతుఁ గమలదళాక్షా. 166

ఆ. ఏమి చేయు మందు వే నెట్లు చేసిన, మేలుగందు నిందు మేనమఱఁది
నీకు నాకుఁ దమ్ముఁ డీకిరీటి యుపేక్ష, చేయుచున్నయట్లు చేసితి మఱి. 167

చ. ఒకరుఁడు భీమసేనుఁడు మహోన్నతతేజుఁడు క్షత్త్రధర్మమున్
మొకమునఁ బూఁచి పట్టుకొని మొగ్గరముం జొఱఁబాఱి పేరి పే
ర్మికిఁ దగ బాహువీర్యమున మించి గదాహతి శత్రుసైన్యముం
దికమకలాడఁ జేసెడిని దెల్పఁగ నేటికి నే నెఱుంగుదున్. 168

క. కేవలభుజవీర్యం బే, తావలముగ నున్నయితఁడు తగ ఋజుగతిమైఁ
బోవుచుఁ బగఱ నడంచున్, జేవమెయిన్ వర్షశతముఁ జేకొని యైనన్. 169

ఉ. ఒప్పరికించి యుండె నరుఁ డొజ్జల మించినశస్త్రవేత్త యై
యిప్పుడు భీష్మముఖ్యు లిటు లేచినదాన నశించి పోవు నా
యొప్పినసైన్యముం గనియు నొప్పనివాఁ డన నుండె నింక నీ
ముప్పు దొలంగఁ జేయఁ గలపూరుషుఁ డుండిన నాకుఁ జెప్పవే. 170

ఆ. నీప్రసాద మింత నిలిచిన నామీఁద, బాండవేయు లెల్లఁ బగఱ నోడించి
బంధుగులును దారుఁ బరఁగ సుఖం బుంద్రు, లేక యున్న లేదు లేశ మైన. 171

వ. అని పలికి శోకోపహతచేతస్కుండై పలుక కున్నపాండవాగ్రజుం గని గదా
గ్రజుం డి ట్లనియె. 172

—శ్రీకృష్ణుండు ధర్మరాజు నూఱడించి పలుకుట.—

చ. వగవకు మయ్య! నీకు నిటు వందుర నొప్పదు నీదుతమ్ము లీ
జగతికిఁ జాలినట్టిరు భుజాబలనిర్జితసర్జరేంద్రు లీ
మగఁటిమి గల్గురాజులును మాత్స్యుఁడునుం ద్రుపదుండు బిడ్డలుం
దగిలిరి నీహితంబునకు తమ్ముని నన్నును జెప్ప నేటికిన్. 173

క. సేనాపతి యగుచుఁ బార్షతుఁ, డీనీదుప్రసాద మందునిచ్చం గాదే
పూనిక నుండె శిఖండి న,నీసందనుమృత్యు వగుట తెలియదొ నీకున్. 174

వ. అనిన విని ధర్మనందనుం డభినందించుచు దేవకీనందనుండు వినుచుండ ధృష్టద్యుమ్నుని
దిక్కు మొగం బై యి ట్లనియె. 175

చ. అవహితచిత్తముం గలవ నై విను మస్మదుపాస్యదైవ మై
భువి నగువాసుదేవుపనుపుం గొని మాకుఁ జమూవిభుండ వై
తవితవి వేల్పుమూకలకుఁ దారకవైరియుఁ బోలె నీవు శా
త్రవుల జయించి నీప్రజ కుదారగతిన్ విజయంబుఁ గూర్పవే. 176

క. నేనును నాతమ్ములు నా,సూనులు నాహితులు నాదుచుట్టంబు లనిన్
నానావిధాయుధంబుల,తో నిన్నుం గలసి యుంపుదుము జయకాంక్షన్. 177

వ. అని యుత్తేజంబు గలిగించుచుం బలికినపలుకుల కలరి పృషతపౌత్రుం డెల్లరు విన
ని ట్లనియె. 178

శా. చాపాచార్యున కంతకుండ నగుచున్ జన్మించితిన్ జాతవే
దోపారార్చులలో మహేశ్వరుకృపన్ దోర్వీర్య మే పాఱ నే
నీపోరాట సురాపగాసుతుండు మద్రేశుండు లో నైనవా
రేపుం జూపిన నెల్లు చేసెదనొ నీవే చూతు విం తేటికిన్. 179

క. పృతనాపతి పార్షతుఁ డీ,గ్గతి నాడినదాని కలరి కౌంతేయులు స
మ్మతిఁ జూపి రపుడు ధర్మజుఁ, డతిమోదముతోడ మఱియు నాతని కనియెన్. 180

మ. అమరేజ్యుండు సురాసురాహవమునం దానాఁ డెఱింగించె నా
నముచిద్వేషికి శత్రుభీషణ మనంతంబున్ జయస్థాన మై
నమహావ్యూహము క్రౌంచనామకము దానన్ నిల్పి సైన్యంబులన్
సముదాయం బొనరింపు మెల్లి సకలక్ష్మానాథు లగ్గింపఁగన్. 181

వ. అని యానతిచ్చి కృష్ణు నామంత్రణంబు చేసి సపరివారంబుగా శయనగృహంబు

నకుం జనియె నంత నిశాంతం బగుటయుఁ గౌంతేయాగ్రజుండు నిత్యకృత్యంబులం దీర్చుకొని సంగ్రామరంగంబునకుం జనియె నంతకుమున్న ధృష్టద్యుమ్నుండు దదృష్టపూర్వంబు నభేద్యం బగు క్రౌంచవ్యూహంబు నిర్మించె దానిముఖంబునం బాకశాసని పాకశాసనశాసనంబునం జేసి విశ్వకర్మనిర్మితం బై యింద్రాయుధసవర్ణపతాకాలంకృతం బై గంధర్వనగరోపమం బై నభోంతరాళంబున నృత్యంబు సేయునది యై కపివరాధిష్ఠితం బై యుండు మహాకేతనంబు గ్రాల నిలిచె మఱియు శిరోభాగంబున మహాసేనాసమన్వితుం డగు ద్రుపదుండును నేత్రయుగ్మంబునఁ గుంతిభోజశైబ్యులును గంఠదేశంబున దాశేరక దాశార్ణ ప్రయాగ అనూపక కిరాతపతులును పృష్ఠభాగంబునఁ బటచ్చర పౌరవక హూణ నిషాదగణపరివృతుం డై యుధిష్ఠిరుండును దక్షిణపక్షంబునఁ బిశాచ దరద పుండ్ర కుండీవిషాదిసహితు లగు ద్రౌపదేయాభిమన్యుసాత్యకులతో భీమసేనుండును వామపార్శ్వంబునఁ గుస్న వాహ్లిక తిత్తిర పాండ్యోడ్రాదిసమేతు లగు నకులసహదేవఘటోత్కచప్రముఖులతో ధృష్టద్యుమ్నుండును జఘనంబునఁ గాశిరాజ కేకయ శైబ్యప్రభృతులతో విరాటుండును నిలిచి యుండిరి దానిపక్షంబుల నయుతంబును శిరంబున నియుతంబును బృష్ఠంబున నర్బుదంబు నై నిలుచని వేలును గంఠంబున నియుతంబు నైఁ బెబ్బదివేలును జఘనంబున మూఁడయుతంబులును గా సైన్యసమూహంబులును బక్షిపక్షకోటిసంఘాతంబుల ననేకశతసహస్రసంఖ్యాకంబు లైనసామజరాజంబులు పర్వతోపమంబు లై ప్రకాశించుచుండె నిట్లు మోహరం బతిమనోహరంబుగ నున్నం గని యెల్లసైనికులు హర్షోత్కర్షంబునం జెలి యాడుచు సూర్యోదయంబున కెదురు సూచుచుండి రంత నిక్కడ నీసుతుండు సర్వసేనాసమన్వితుం డై సంగరాంగణంబునకుం జని ధృష్టద్యుమ్నాధిష్ఠితం బైన క్రౌంచవ్యూహంబు గని కుంభసంభవ కృప శాశ్వత్థామ శల్య సోమదత్తి వికర్ణ దుశ్శాసనాదులం గలయఁ బరికించి యి ట్లనియె. 182

—♦ భీష్ముని ద్వితీయదివసయుద్ధప్రకారము ♦—

ఉ. ఘనభుజులార మీ రొకఁ డొకండ సమర్థులు శత్రుసైన్యముం
గొనకొని సంహరించుటకుఁ గోవిదవర్యులు శస్త్రశాస్త్రముం
దనితరసాధ్య మీబల మనంతము భీష్ముని యంతవాఁ డిటుల్
బనిచెడు వాఁ డలంతి యగు పాండవసైన్యము గెల్చు టబ్రమే. 183

క. కావున్నఁ గ్రౌంచమొగ్గర, మీ కరణిం బొదలు దీని కెన యగుమోహో
డ్డీకడన పన్న నొప్పును, మూఁకలకుఁ రక్షణంబు మున్నేర్పడఁగన్. 184

వ. మఱియు నిమ్మోహరంబున దుశ్శాసన వికర్ణ శత్రుంజయ చిత్రసేన సువీర నందోపనంద మణిభద్రకులు శూరసేన వేణిక కుకుర రేచక మద్రక త్రిగర్త యవనాదిదేశాధీశపరివారపరివృతులై దేవవ్రతున కేడుగడలై సేనాముఖంబున నిలుచునది యని యాజ్ఞాపించిన భీష్ముండును ద్రోణుండును ద్రోణపుత్రుండు లోనగువారు ప్రతిపక్షవ్యూహంబుం బ్రతిఘటింపం జాలుమహావ్యూహంబు వన్ని రంత శాంతనవుం డనంతసేనాపరివృతుండై మరుత్వంతునిచందంబునం బొందుపడి సేనాముఖంబున నిలిచె భారద్వాజుండు కుంతల దశార్ణ మాగధ విదర్భ మేలక కర్ణప్రావరణాదిసైన్యంబులతో నతని ననుసరించె సౌబలుండును గాంధార సింధు సౌవీర శిబి వసాతిగణపరివృతుండై భారద్వాజుం బాలించుచు నడచె సర్వసోదరసమేతుం డగుదుర్యోధనుం డశ్వాతక వామన కోసల దరద వృక క్షుద్రక మాలవాదిమహాసైన్యంబులతో సైన్యమధ్యంబున నిలిచె శలశల్యులు భగదత్తభూరిశ్రవులు విందానువిందులు వానివామపార్శ్వంబునందును సుశర్మయు సోమదత్తుండు శతాయువును శ్రుతాయువును దక్షిణపార్శ్వంబునందును నిలిచిరి కృపాశ్వత్థామ కృతవర్మ లత్యాతతసేనాసమేతులై సేనాపృష్ఠంబునందును కేతుమంతుండు వసుదానుండు లోనగునానాజనపదేశ్వరులు వారి వెన్నుదన్ని పృష్ఠగోపులై యొప్పు మీఱి యుండి రిట్లు భీష్మునియుద్ధారంభంబుం గని నీయోధు లెల్ల బద్ధమత్సరంబున యుద్ధసన్నద్ధులై శంఖంబు లొత్తి సింహనాదంబులు చేసి రది విని నీతండ్రియు సింహనాదంబు చేసి శంఖంబు పూరించె నప్పుడు దుస్స్వరం బెల్లం బూరటిల్ల భేరీపణవానకాదు లొక్కపెట్ట మొరయం జొచ్చె నట్టియెడం గృష్ణార్జునులు పాంచజన్య దేవదత్తంబులును భీమసేనుండు పౌండ్రకంబును యుధిష్ఠిరుం డనంతవిజయంబును నకులసహదేవులు సుఘోషమణిపుష్పకంబులును ద్రుపద ధృష్టద్యుమ్న కాశిరాజ శైబ్య శిఖండి విరాట సాత్యకులును ద్రౌపదేయసౌభద్రులును దమతమ శంఖంబు లొత్తి సింహనాదంబులు చేసి రానాదం బంతయు ననంతంబై దిగంతవిశ్రాంతం బయ్యె నయ్యవసరంబున. 185

మ. మనదుర్యోధనుఁ డెల్లసేనలను సమ్మానింపఁ గా నుండి యి
ట్లని యోధులవంకఁ జూచి ఘనులారా! మీరు శస్త్రాస్త్రముల్
గాని వెన్నీయక పోరుఁడీ యని యెలుంగుం జూపుచుం బల్క వా
రని మానింపక పోరికిం దిగిరి రోషావేశభూషాఢ్యులై. 186

తే. అపుడు మీవారికిని వారి కతితుములమ్ము, రోమహర్షణ మగురణం బామతిల్లె
రథికబాణ పరంపర ప్రహారసతత, పతితరథరథ్యగజహస్తిపటల మగుచు. 187

చ. కవిసిన వాని దవ్వులన కన్గొని సైంధవకేకయాదిభూ
ధవపరిరక్షితుం డగుపితామహుఁ డామహనీయమూర్తితోఁ
దవిలె మహాప్రభావమునఁ దద్రభసం బుడివోవ శింజినీ
రవము దిగంతరంబుల నిరంతరముం బ్రతిశబ్ద మీనఁగన్. 198

క. గాండీవివడికి నడవ్రుత్తుంగమును వైకర్తనుండు ద్రోణుఁడు గాకె
వ్వం డైనం జాలెనువా, సుండం డని మెచ్చి రెల్ల రుచ్చైస్స్థితులన్. 199

వ. అంత నయ్యర్జునుం జుట్టుముట్టి. 200

సీ. సురనదీసూనుండు సునిశితంబులు పండ్ర,ండియు నేను బాణముల్ తిగిచి యేసె
నాలోన నాచార్యుఁ డలికిమి తా నిరువది,మొనతూపులఁ గృపుం డైదునూర్లు
శల్యుండు తొమ్మిదిసాయకంబులు సుయో,ధనుఁ డఱువదినాల్గు ఘనశరములు
గురుపుత్త్రుఁ డఱువది క్రూరనారాచముల్,శకుని మైదమ్ములు సైంధవుండు

తే. తొమ్మిద విశిఖంబుఁ బదియమ్ము లేసి, యీసునం జేసి ముంచి రయ్యింద్రసుతుని
దాన నింతయుఁ జలియింప కానరుండు, కొండవోలెను జూపట్టె కౌంతవడికి. 201

తే. ఇరువదేసింట భీష్మునిఁ గృపునిఁ దొమ్మి,దింటఁ గలశోద్భవుని నర్వదింట మద్ర
భూతలేశవిశస్త్రుల మూఁడుమూఁట, నొంచి రారాజు నేసింట నొవ్వ నేసె. 202

మ. అభిమన్యుండును గాత్రిపదేయులును సైన్యాధీశ్వరుండున్ శిని
ప్రభుఁడున్ మాత్స్యుఁడు లోనుగా రథులు కోపప్రస్ఫురన్మూర్తు లై
బుభురాట్పుత్త్రు నెసుర్చి భీష్మునకుఁ దో డై తెంచినారి త్త్రో
విభవం బేర్పడఁ దాఁకి పోరిరి జగద్విఖ్యాతవీరోద్ధతిన్. 203

క. దేవవ్రతహితరతుఁ డై, దేవనెయిం బోరుద్రోణుఁ డెచ్చెరఁ దాఁకెం
గైవడి మెఱయన్ ద్రుపద, క్ష్మావరతనయుండు సోమకసమేతుం డై. 204

వ. ఇట్లిందఱు నందఱం దాఁకి వీఁకం బోరుచున్నప్పుడు. 205

ఉ. అర్జును నెత్తికోలుపుపట్టిడ నై నవినాదనుండు వి
స్ఫూర్జితశౌర్యగర్వమునఁ బొంపిరివోయి యశీతిసంఖ్య న
త్యూర్జితముల్ శితంబు లగు నన్నతబాణము లేసినంత న
క్కర్జముఁ గాంచి నీసుతులు గంతులు వైచిరి అంతు మీఱఁగన్. 206

మ. నరసింహుండు నరుండు నీకొడుకు లానందంబునం బొందుచుం
బరఁగం జేయునినాదముల్ వినుచుఁ గోపం బేపు మీఱంగ నా
శరముల్ దారిన త్రుంచి యుంచితగతిన్ సైన్యంబుముఖ్యంబునం
దరదం బాడఁగఁ జొచ్చి చిచ్చునకు నెత్తై యేర్చెఁ దా నత్తఱిన్. 207

చ. ఇరువదిమైదుతూపులు సురేంద్రసుతుం డరివోసి యేసె ని
ర్జరవరవాహినీసుతుని శౌర్యధురంధరుఁ డాతఁ డాతనిం
గెరలి నవాంబకంబులను గీష్పతునట్టులు గొట్టెఁ బైఁ బర
స్పరశరవిద్ధగాత్రు లయి వార లవారిగఁ బోరి రుద్ధతిన్. 218

వ. అనంతరంబ. 219

తే. ఈసునం జేసి భీష్ముఁడు వాసుదేవు, నురము గాఁడంగ మూఁడమ్ము లురువడించి
మోఁద నాతఁడు పూచిన మోదుగట్లు, గ్రాలె రక్తౌఘసంసిక్తగాత్రుఁ డగుచు. 220

సీ. అంత సంక్రుద్ధుఁడై కుంతీసుతుఁడు మూఁడు, వాఁడివాలమ్ములఁ దాఁకిసిడము
వానిసారథి బిట్టు నొనేసె దాన నా, రలపోరు తీఱనిపోలుపుఁ గాంచె
నీతఁ డాతని నతం డీతని నొర్వంగ, నెంచియుఁ జెంగల్వ లైకగ నొడ్డి
రథుతు గతంబుఁ బ్రత్యాగతంబును మండ, లమును జిత్రముగతులకు నమరఁగ

తే. సూతసామర్థ్యలాఘవస్ఫూర్తి బొప్ప, నొప్పమీఱుచు నంతర మెప్పుడొదవు
ననుచు నెమకుచు నారి మ్రోయంగఁ జేసి, నంకులొత్తిరి సింహరవాంకితముగ. 221

ఉ. వారిరథధ్వనిం గలసి వచ్చుశంఖరవంబు పాటునన్
ధారుణి దద్దరిల్లియును దారితమై మొఱయంగఁ జొచ్చె నా
పోరునఁ దారితమ్ము మది, పోలుపు శక్యము గాని దయ్యె నె
వ్వారికిఁ గాని వారి గెలువం గలవాఁ డిల లేఁడు చూడఁగన్. 222

మ. అడియాలంబులఁ గాని పోల్చుటకుఁ గాకబ్భారతశ్రేష్ఠులా
క్రందుగాఁ గూడి రణంబు సేయుతఱిఁ దత్కాండప్రపాతం బిలం
బిడుగుల్ మొత్తము లై వడిం బడెడు నా విభ్రాంతిఁ గల్పించుచున్
గడు భీతావహ మయ్యె భూతములకుం గౌరవ్యవంశోత్తమా. 223

ఉ. అమ్ముల మున్గి కానఁబడ కంతటిలోనఁ బ్రకాశ మొంది మా
యమ్ములు వైచి యేచి భరతాన్వయభూషణు లిద్దఱట్లు యు
ద్ధ మొనరింపఁ గాంచి విబుధప్రకరమ్ములు నీరి మార్కొనన్
ముమ్మొనవాలుదాల్పయినఁ బోల్పఁగఁ జాలఁ డటంచు నెంచెసిన్. 224

ఉత్సాహము. ఇది మహాద్భుతం బొసంగు నిట్టిపోరు ధారణిం
బొదల దేష్టఁ గాని కెంపు పుట్టఁ బోదు దీనికిన్
నదిసుతుండు గాని యింద్రనందనుండు గాని యీ
కదనమందుఁ గెల్వ రంచుఁ గాంచి యెంచి రెల్లరున్. 225

వ. ఇట్లు వా రిద్దఱును శైన్యయుం బ్రద్దడివోని బీరంబున బిఱుతీక పోరుచున్నంత

నయ్యిరువురువారికిని బోరు ఘోరం బయ్యె నయ్యెడ ధృష్టద్యుమ్నుండు ద్రోణా
చార్యుపయిం గవిసె ననిన ధృతరాష్ట్రుం డిట్లనియె. 226

ఉ. వీరలపోరును న్వినఁగ వేడుక యయ్యెడుఁ గాని సంజయా!
భారతవంశభూషణుఁడు ఫాల్గును నోర్వఁగఁ జాలఁ డయ్యెనాఁ
బౌరుష మెచ్చి నాఁ బడదు పాపురె దైవము హెచ్చు కాని పో
నే రెదు రెల్లలోకముల నేర్పఁగఁ జాలినవాని కక్కటా. 227

తే. అనిన సంజయుఁ డిట్లను నధిప! వినుము, దారుణరణప్రకార మీతెలఁపు పిడుగు
త్రిదశు లెల్ల రింద్రుం గూడి కదనమునకుఁ, గెరలి వచ్చిన విన్వచ్చు గెలుచు టరిది.

వ. అది యటుండ నిమ్మెట్లు కలిసినధృష్టద్యుమ్నుం దలఁపడి ద్రోణాచార్యుండు. 229

—♦ ధృష్టద్యుమ్నుఁడు ద్రోణాచార్యుతో యుద్ధము చేయుట ♦—

తే. పెక్కుభల్లంబు లేయుచు నొక్కభల్లమునను సారథి నొనేసి మొనసి నాల్గు
గుఱ్ఱముల నాల్గుతూపులఁ గుదియ నేసి, వింతగా వాని స్రుక్కించె నింతలోన. 230

సీ. అలిగి ధృష్టద్యుమ్నుఁ డాచార్య! నిలు మని, తొంబదితూపులఁ దూల నేసెఁ
గలశీసుతుం డంతఁ గాలదండోపమం, బగుశరం బరివోసి యతని నేసె
నది వానిమృతి కగు ననుచు హాహాకార, మఖిలసేనాసమూహంబునందుఁ
గాంచి పార్షతుఁ డద్రికరణి నచంచలుం, డై దానిఁ దెగ నేసె నర్ధమునన

తే. వానిచేతకుఁ బాండవబలము లెల్ల, నుబ్బి బొబ్బలు వెట్టుచు నుండఁ బార్ష
తుండు శక్త్యస్త్రమును గొని ద్రోణుఁ డీల్గు,గాత మని వానిపై నేసెఁ గార్యమెసఁగ.

శా. చిచ్చుం జిమ్ముచు వచ్చుశక్తిఁ గని లోఁ జీకాకు లేకాగురుం
డచ్చో నిల్చి మహాద్రినాఁగ నది మూఁడై త్రెళ్లఁగా నేసి పైఁ
బొచ్చెం బింతయు లేక వచ్చువిశిఖంబుల్ దున్మి తద్ధస్తముం
దిచ్చం గూర్చెడుకార్ముకంబు విఱిచెన్ హెచ్చైనవాలమ్ములన్. 232

చ. విలు విఱుగన్ మహాగ్రహము విగ్రహ మొందినరీతి భీతి కై
వెలుఁగుచు వజ్రసార మగుపెద్దగదం గొని వైచెఁ బాండుపు
త్రులపడవాలు కూలె నని ద్రోణునిపై నతఁ డమ్మహాగదం
జులుకన తున్మవైచె నటఁ జూపఱు కచ్చెరుపాటు దోఁపఁగన్. 233

తే. అంతఁ బోక నిశాతసాయకము లెన్ని,యేని చెవి సోఁకునట్లీడ్చి యేసె నవియుఁ
బార్షతునిబొందళముఁ జించి వానిమేని,నెత్తురు లవారిగాఁ గ్రోలి నెఱి నెసంగె. 234

ఉ. పార్షతుఁ డొండువిల్లు గొని బాహుబలంబునఁ గుంభజన్ముపై
వర్షము వోలె భల్లముల వాఱఁగఁ జేయుచు నంత నేను దు

ఱఱ శిలీముఖంబుల నురంబున నాటఁగ నేయ రక్త మూ
ర్ఛగతి మయ్యె మేను సుమకల్పితకింశుక మట్లు చేయుచున్, 235

శా. చాపాచార్యుఁ డుదగ్రకోపమున నప్పాంచాలరాట్పుత్రుచే
జాపంబుం దెగ నేసి సారథితలం జక్కాడి క్రొవ్వాఁడి వై
వాటింపం దగునాల్గునారసములన్ వార్వంబులం ద్రుంచి ఘం
కోచం బింతయు లేక సింహరవ ముత్కంఠస్థితిం జేయుచున్. 236

క. ఓడక విభ్రాంతుఁడు గాన, చుండా గడికిండ లగుచు నర్వింబడఁ ద్రా
సిం డ్రొల్ల నేసి యార్చెన్, గండం పై చాపగురుఁడు గర్వస్ఫూర్తిన్. 237

మ. విరథుం డై పృషతాన్వవాయభవుఁడు దోర్వీర్యం బవార్యంబు గాఁ
గరవాలంబుం గదఁ జూప నేరుఁ డిగుచో ఖండించె దాని న్గురుం
డురుదారం గొని వాలుఁగం బలకయుం హా విరుఁ డాతండు స
త్వరుఁ డై ద్రోణునిపైఁ బరం గిఱపయుం బంచాననప్రక్రియన్. 238

ఆ. చాపగురునివారుమ బుచు గిరిలాఘు,వంబు నచ్చుడు మెచ్చవచ్చునట్టి
వమ్యోఁ బృషతిపత్రుఁ డంతివాఁ డయ్యె నా,గురుసింగడవ రాక కుతిలఁ గుడిచె.

క. గురుగురుశరవర్షంబునఁ, దెరలి చనం జాల కున్నఁ దలఁపిన భీముం
డరమరలు లేక ప్రాణమున, వరతనయుని కష్టంబెఁగ వచ్చె రయమునన్. 240

వ. ఇట్లు వచ్చి వాయుతనయుం డప్పాంచాలుఁ డాచార్యుం గాఁడ నేసి పాం
చాల్యు నొండొకరథం బెక్కించునంత దుర్యోధనుండు కళింగేశ్వరుం డగుశ్రు
తాయువునకుం జేయి వీఁచి ద్రోణునకుం దోడుపడం బుచ్చుటయు నతండును మహా
సేనాసమేతుం డై భీమసేనుం దాఁకుండయె భారద్వాజుండును ధృష్టద్యుమ్నుని విడ
నాడి తనపై నురవడించి వచ్చుపాంచాలద్రుపదులపయిం గవియుదెంచె ధృష్టద్యు
మ్నుండును ధర్మరాజునదెసకుం జనియె నని ధృతరాష్ట్రునకు. 241

ఉ. అచ్చెరు వయ్యె నాకు విన నయ్యుముఁబో నిమహాభుజుండు వి
వ్వచ్చునియన్న వాఁడు. గద వట్టిన నెట్టిమహాబలుండు నే
నొచ్చును ఒచ్చుఁ గాని యని నూల్కొనఁ గాలనిమాట నిక్కమై
మచ్చున భీమునిం దొడర మాకొనఁ జాలె శ్రుతాయు వక్కటా. 242

వ. సంజయుం డిట్లనియె. 243

—♦ భీముండు కళింగసేనలపైఁ బడి శ్రుతాయుప్రభృతులం జంపుట ♦—

సీ. వినుము దుర్యోధనప్రేరితుం డయి యమ్మెయి, తలఁపడినకళింగధరణిపతికి
బాసటగా వచ్చి పాల్గొనె నని నిషాదులతోడఁ గేతుమద్భూమిపతియు

నవల శ్రుతాయు వాసవమానసనందను, మార్కొనియెం గేతుమంతుఁ గూడి
చేదిమత్స్యకరూశసేన లాభీముని, గలసి పోర నిషాదగణముతోడ

తే. ఘోరమయు భయానక మయిపోరెసంగె, నపుడు సాగరగర్జితం బట్లు శబ్ద
ముప్పతిల్లెను బ్రవిదారణోర్వి యెల్లఁ, గానఁబడె మాంసశోణితకర్దమ మయి. 244

తే. ఒంటొరులఁ దాఁకి పోరుచు నున్నవేళఁ, జేది మత్స్యకరూశాదిసేన లెల్ల
బహుళకాళింగసైన్యపాదబలము నోర్వ, బలము చాలక వెఱపునఁ బాఱె విఱిగి. 245

వ. తనమున్నున్నమూఁకలు యథాయథలై చనఁ జూచి వాయునం
దనుఁడు చలింప కింతయు నుదగ్రభుజాబలదుర్నిరీక్ష్యుఁడై
మునుముగ నక్కళింగబలముం గొని మంగలమందు వేఁచిన
ట్లొనరుచుచున్నవేళ రణ మొప్పె భయంకర మైనచొప్పునన్. 246

చ. వడముడిచేతిశస్త్ర మనువహ్నిముఖంబున నైజసైన్యముల్
మిడుతలు వోలెఁ గూలఁ గని మిక్కిలి పొక్కుచు నుక్కుపెంపునన్
వడిఁ గొని శక్రదేవుఁ డనువాఁడు శ్రుతాయువుసూనుఁ డంతకుం
డడరెనొకో యనం గనఁగ నైకడు నచ్చెరుపాటు దోఁపఁగన్. 247

ఉ. మార్కొని భీమసేనుపయి మార్గణముల్ నిగిడించుచున్ వడిన్
జేర్కొని వానిరథ్యములు పృథ్విపయిం బడ నేసి పైఁ బయిన్
గర్కశబాణవర్షము నఖండము గాఁ గురియించి యింతలో
నర్కునికాంతి కానఁబడనట్లనిఁ జేసెఁ బ్రశంస కెక్కఁగన్. 248

పంచ. హతాశ్వుఁ డయ్యు భీమసేనుఁ డాగ్రహంబు పెంపునన్
శతాంగమంద యుండి సత్వసార మేర్పడన్ గదా
హతిన్ ససూతుఁ డక్కళింగునాత్మజాతుఁ డార్తికై
క్షితిన్ గతాసు నై పడంగఁ జేసె నొక్కవ్రేల్మిడిన్. 249

ఆ. కొడుకుచావునకును గ్రోధవిషాదముల్, పెనఁగొనం గళింగపృథ్విపతియుఁ
దేరిగములతోడ మారుతి నతిమి మార్కొనియె నస్త్రశస్త్రకోటితోడ. 250

వ. అంత గదాదండమండితకరుం డగుభీమసేనుండు వానిం జూచి వాలునుం బలకయుం
గొని యెదుర్కొనిన నక్కళింగేశ్వరుండు. 251

తే. నారి మ్రోఁగించి ప్రళయగర్జారవమునఁ
గ్రూరనారాచ మొక్కఁడు గొని రయమున
గాఢఘాతంబుగా నేసి గాలిపట్టి
నతఁడు దెగ నేసి దానిఁ బెల్లార్చి పేర్చె. 252

మత్త. అక్కళింగవిభుండు దానికి నంతరంగమునందు నీ
కెక్క నెక్కొని తోమరంబుల నెంచియుం బదునాల్గు గా
నక్కరూవ్యూహముమీఁద నేయుఁడు నాతఁ డంబరమంద యొ
క్కొక్క దానిని జెక్కఁ గొండయి యుండఁ జేసిన రాజుచేన్. 253

వ. ఇట్లు ప్రతాయువు తోమరంబు లన్నియు వ్యర్థంబు లగుచు విన్ననై యున్నం గని భానుమంతుఁ డను వాఁ డురవడించి మించి దంతావళంబు నధిరోహించి భీమసేనుం దాఁకుమెంచి శరవర్షంబున ముంచి సింహనాదంబు గావించుటయును. 254

మ. బకవిధ్వంసనుఁ డాస్యనంబునకు నైదంబాల కుచ్చైర్గతిన్
సకలప్రాణ మెసంగ సింహరవముల్ సాగించి వేగంబునన్
వికృతం బేర్పడ దంతిదంతములు దోర్వీర్యంబునం బట్టి మీఁ
దికి లంఘించి కళింగరాడనుజు మొత్తెన్ హస్తి తోఁ ద్రెళ్ళఁగన్. 255

ఆ. ఇట్లు మొత్తి భీముఁ డిభరాజమునునుండి, క్రిందికుఱుకునంతఁ గ్రందుకొనఁగ
నలిపు దంతిమీఁద నున్నట్టి దానితో, నుసుసిఁ గూలె భానుమంతుఁ డపుడు. 256

వ. అట్లు కళింగరాజానుజుం గాలాంతకుం గొలువఁ బుచ్చి విన్వచ్చుసగ్రజుం డుద గ్రాసిహస్తుం డై భయత్రస్తచిత్తుండు గాక ధాత్రీతలంబున నలాతచక్రంబు చాఁపున నవక్రవిక్రమంబున విచ్చలవిడి విహరించుచు వారువంబులఁ ద్రుంచియు వారణంబులఁ ద్రెంచియు రథంబుల గాల్చియుఁ బదాతులం గూల్చియు సైన్యం బుచందంబున విచిత్రచంక్రమణంబు సేయుచుఁ గాలాంతకయమోపముండై మూఁకల నెల్ల మోహసాగరంబున ముంచి పరాక్రమవిహారంబు గావించుచుండ వానికోర్తిలల కోహటించి కళింగసైన్యంబు దైన్యంబు నొందియు డిందియు వెఱచియుం బఱచియు నొచ్చియుం జచ్చియుఁ బొదలవంద అయ్యో నయ్యోడ. 257

సీ. శాతాసిపత్రప్రపాతంబునన్ మస్తకములు దెగుటం గూలుపూరుషులును
దుండములన్ గండములన్ తుంటెతుంటెము లైన, బెడగొండలోయసం బడెడుకరులుఁ
గంఠంబులుం గాళ్ళుఁ గడికండలై పోవ, గుట్టలై కూలిన ఘోటకములు
నిరుసులుఁ జక్రంబు లిరుసులుఁ దున్నటుఁ, దెరలి ప్రోవై యున్న తేరిగములుఁ

తే. బడగలుం గళ్ళెయంబులుఁ బల్లములును, గంటలుం జిఱుగంటలుం గార్ముకములుఁ
గత్తులుం భూషణంబులు ఖండము లయి, పుడమిఁ గప్పె నాభీముఁడు పోరునపుడు.

ఉ. కొందఱఁ గత్తి మొత్తియును గొందఱఁ జేతులఁ బట్టి నెట్టియున్
గొందఱఁ గాళ్ళఁ దన్నియును గొందఱ హుంకృతులన్ వెలార్చియున్

కొందఱఁ ద్రుద్దియున్ మఱియుఁ గొందఱ రుద్దియు నీబలంబులన్
మ్రందఁగఁ జేసె మారుతతనూజుఁ డమానుషవిక్రమంబునన్. 259

వ. అంత. 260

చ. కరువలిపట్టికోలుతలఁ గన్గొని సైఁపక వానిపైఁ బడన్
సురనదిసూనుఁ డద్దెసకుఁ జూచెననంతఁ గళింగనాథుఁ డ
చ్చెరువుగ నడ్డమై కవిసి చెచ్చెరఁ దొమ్మిదిసాయకమ్ములన్
బరువడి నాఁటె మేటి యగు పావనిపేరురమున డిందఁగన్. 261

తే. అంతఁ దోత్త్రార్దితం బగుదంతియట్లు, కనలి ఘనగంధనంబుల నవలమట్లు
పెచ్చి యసకోశుఁ డెదుటికిఁ జెచ్చెరఁ జని, తేరు రధిఁ ప్రేరేంచి కాళింగు వసకు నిగిడె.

చ. నిలు నిలు మొందఁ బోయెదవు నీ వనుచుం దెగఁ గళింగభూవిభుం
డలఘుతరాస్త్రముల్ గురిసె నాతనిపై నవసాఖ్య లేర్పడన్
గలఁగక దాని కీర్తియును గాసిఁబుట్టి సదాహతోగ్రకుం
డలివలె రోఁజుచున్ గనలుచున్ సయుఁడును దెప్పుటలంపఁగన్. 263

ఉ. సజ్యము చేసి కార్ముకము సప్తశరంబుల నాగ్రతాయువున్
బూజ్యత వోవ వధించి వెఱ వుట్టఁ గళింగునిచక్రరక్షకుల్
ప్రాజ్యభుజాబలంబున విభాసిలుసత్యుని సత్యదేవునిన్.
వ్యాజ్యము లేనియట్లు దునుమాడె రణంబునఁ గేతుమానురాజపుత్రులన్. 264

తే. అట్లు కాళింగుని జయుఁ కందరోషఁ, పావనిఁ ధరి కేతుమంతుఁడు శౌర్య మొనఁగఁ
దన్ను మార్కొన్న ఘనుఁ గెఖ్యాతేశిత,సాయకంబుల నాతనిఁ జావ నేసె. 265

వ. అంతం గళింగయోధులు పెక్కువేలు పెక్కు మిగిలి మొక్కుమ్మడి గదాశక్తిఖడ్గ తోమరపరశ్వధాద్యాయుధంబులం భీమసేను నొంచుటయు నతండు గదాదండమండితకరుండై సింహంబునుంబోలి రథంబునుండి వేదండంబు వోలెం డిగ నుఱికి నిజగదాపర్వంబు గావించి మదందళితంబై సింహ వేలయోధులు నాగురంజకాడి తక్కనుం గలవారి వాంఛితంబుల జంఘావాతంబు వోలెం దోలి సర్వప్రాణనంబునం జేసి శంఖంబు పూరించుటయు నమ్మహారవంబున సర్వకాళింగసైన్యంబులును దైన్యంబు నొంది సంచలించె నాసంచున సేనాసంచయంబున సామజంబు వలె సంచరించుచు బహువిధమార్గంబు లేర్పడం బేర్పడి యిట్టట్టు పర్వులిడుచుం బేర్చి యార్చుచు మాటికిని నీటిన ప్లుగిలిపిసుచుం గడువడిం జక్రచంక్రమణంబు సేయుచుం బాయక సరోవరంబున మహాగ్రాహంబుట్లు కళింగసైన్యంబుం గలంచి వేయుచున్న సమయంబునఁ బాండవసేనానాయకుండు నిజసైన్యంబుల కెల్లం జేయి

వీచి తాను బాలాపతాశ్వయోజితంబును హేమపరిష్కృతంబును గోవిదారధ్వజవిరాజితంబు నగురథం బెక్కి రయంబునం బనుదెంచి వృకోదరునకుం బార్ష్ణిగ్రాహకుండై శంఖం బొత్తి సింహనాదంబు గావించె నంత శిఖండిసాత్యకిప్రభృతు లాభీమసేనునకుం బాసటగా భీష్మాభిరక్షితం బైనసైన్యంబు దాఁకుటెంచిరి. ధర్మనందనుండును రంగానీకసహస్రంబులతో వారివెన్కఁ దన్నెచసియె నిట్లు ధృష్టద్యుమ్నాదిపరివేష్టితుం డగుభీమసేనుండు గండుమిగిలి కళింగబలంబులం దునుమాడి మాంసశోణితకర్దమం బగుకీలాలనదిం బ్రవహింపఁ జేసె నాసమయంబున. 266

తే. ఏటికొఱకు కంత భీముని పోటుబాటు,తనముఁ గని సైపఁ జాలక త్వరితుఁ డగుచు
మూఁకలం గూర్చుకొని వచ్చి తాఁకె వీఁక, బిరుగులంబోనిశరజాల మడరఁ జేసి.

తే. పవనతనయుండు సాత్యకి పార్షతుండు, తలకడచి వచ్చుస్వర్ణదీతనయు నెదిరి
మూఁడు మూఁడుగ్రసాయకముల నిగిడ్చి, యొడ్చి నొనేసి రసియాడ నీసుఁ జేసి.

ఉ. ఆతఁడు నన్నిబాణముల నందఱ నేసి భుజాబలంబు వి
ఖ్యాతికి నెక్క నొక్కొకఁ డొండసహస్రముల న్నిగిడ్చుచుఁ
బాతితరాజువాజులను వారనివైరమున న్వధించుచుం
జేతిముసం దిగు ల్వడనిచెల్వున నల్వలరారి భీముఁడున్. 269

ఉ. స్యందనమంద యుండి భుజశక్తి దలిర్పఁగ శక్తి నొక్కఁడా
నందముతోడఁ బూని నదినందను తేరిపయిం బడ న్వడిన్
డిందక నేసె నాతఁడు నడిందిమొంటిమి దాని మూఁడు గా
నందఱుఁ జూడ పీడనుగ చ్లొనరించెఁ దలంచునంతలోన్. 270

క. వడివడిఁ జేతం గుదె గొని, వడముడి యరదంబు డిగ్గి వచ్చెడులోఁ దో
డ్పడి సాత్యకి వడ నేసెన్, బెడిదము లగుతూపుగముల భీష్మునిసూతున్. 271

తే. వాయువేగంబు లగుతేరివారువముల, నిలువరించుసూతుఁడు లేమి నిలక తొలఁగి
చనియెఁ దే రెత్తుకొని రణంబునకుఁ గాని,వానిఁ గాఁ జేసి శంతనసూను నవుడు. 272

ఉత్సాహము. కాలిబంటు వోలె మెట్టుగాలిపట్టిఁ గాంచి పాం
చాలరాజనందనుండు శాతకుంభగుంఫితం
బై లలిం జెలంగుతనదుస్స్యందనంబుపైకి రాఁ
గేలు సాఁచి చేర్చుకొనియెఁ గ్రేవ విశ్రమింపఁ గన్. 273

వ. అప్పు డప్పాంచాలమాత్స్యసైన్యంబు లప్పావనిం బ్రశంసించె నతండును ధృష్టద్యుమ్నుం గౌఁగిలించుకొని సాత్యకిదిక్కు చూడ్కిం ద్రిప్పుటయు నప్పురుషోత్తమానుజుండు పార్షతుండు విన వృకోదరున కిట్లనియె. 274

ఉ. నొచ్చినవాఁడ గాఁ దెలిసి నూల్కొలుపన్ భవదగ్రనందనుం
డచ్చటి కేఁగి పుత్త్రునకు నాసిక సేయుచు నున్న వేళ వి
వ్వచ్చనిపుత్త్రుపైఁ గవియ వచ్చి ఘటోద్భవముఖ్యు లెల్లరున్
హెచ్చినవిక్రమంబున ననిం బచరించిరి మించి రెంతయున్. 283

క. అరదముల వారు పెక్కురు, కర మరుదుగఁ జుట్టికొనిరి గవ్వడికొమరుం
డురువిక్రమమున మామకు, సరివచ్చినవాఁడ కాన సడలక పెనఁగెన్. 284

—♦అర్జునం డభిమన్యునకుం దోడుపడి పరాక్రమించుట♦—

చ. పదుగురలోఁ దగుల్కొనినబాలునిఁ బోలఁగఁ జూచి దవ్వులన్
మొనలెఱుఁగ ఫల్గునుం డతనిమేనికి మైమఱువట్టెఁ దై వడిన్
గదురునడన్ రథంబు గొని క న్నెదలించెను సంతలో నటం
బదుగుర నొక్కట్టునకుఁ బాయఁగఁ ద్రోలుచు వచ్చెఁ జెచ్చెరన్. 285

తే. వచ్చి విచ్చలవిడి నంపవాన గురియు,వారిపై రథనాగాశ్వసేనతోడఁ
గూడి కసిరి రాజులు తాడిసిడము,వాఁడునుం బాగుమీఁదను నోము సూప. 286

మ. చతురంగధ్వజినీపదప్రపదసంజాతోన్నతోర్వీరజం
బతిమాత్రం బయి మింటి కేఁగి రవితేజోంతర్ధిఁ గావించుచున్
క్షితిఁ జీఁకట్లొసఁగంపుఁబక్షమున రేల్ జృంభించున ట్లత్తఱిన్
బ్రతిపాదించె రణాంగణంబున జనవ్రాతాతిభీతంబుగన్ 287

మ. రథులున్ సారథులున్ రథంబులును జక్రంబుల్ ధ్వజాగ్రంబులున్
బృథులాశ్వంబులు నశ్వపాలురును గుంభివ్రాతముల్ కాల్వురు
న్బృథకున్ మూఁడవపుత్త్రుఁ డైనసరుఁ డుద్వృత్తిం బ్రయోగింప ను
త్పథమై దాడెడునంపజాలె దెసఁ బాఱం ద్రోలెతాడంబుగన్. 288

క. కాలానలోపముం డై, క్రాలెడునాసవ్యసాచి గన్నత్తి కనం
జాలక కురుబల మెల్లన్, జాలింబడి పాతె నపుడు సమరము విడుచున్. 289

క. ఇది పూర్వం బిది పశ్చిమ, మిది కుంభిని యిది నభంబు నిది రవిబింబం
బిది యిది యని తెలియనిగతిఁ, ద్రిదశేశ్వరసుతశరాళి దెసలం గప్పెన్. 290

సీ. విరథు లై కాల్నడ వెడఁబాయురథికులు, రథులు నో మోడ్వడురథచయంబు
మావంతు లీల్గిన మత్తమాతంగముల్, మాతంగములు లేనిమావటీండ్లు
వారువంబులు ద్రెళ్ళ వగచురాపుతులును, రాపుతుఁ బోయినవారువములుఁ
గాలుసేతులు దెగఁ గూలుకాలుబలంబు, కాలిబలము సూపఁ గలుగుబంట్లు

తే. భీష్ము లగునన్నలలో డాఁగి వేఁగువారు, వాహనంబులు విడనాడి పఱచువారు
నాయుధంబులు విడి శరణ మనెడువారు, నైరి నీవారు కట్టిభయంబువలన. 291

తే. శ్వేతవాహనువరశరపాతమునకు, గుఱి యయినవాహనంబులు గూలఁ ద్రోయు
నేలకుం గూలి మూఁకలకాలతాఁకు,లం బడుచుఁ ద్రెళ్లె నీమబలంబు లెల్ల. 292

వ. మఱియు నయ్యర్జునుండు ప్రళయపర్జన్యునిపగిది బాణవర్షంబు గురియించుచుండఁ గాలుసేతులు దెగియుఁ దలలు పగిలియు తొక్కలు ముక్కలయ్యుం గూలినయోధులయు గజంబులయు హయంబులయు కళేబరంబులును విశీర్ణంబు లైనధ్వజంబులయు ఛత్రంబులయుఁ జామరంబులయు రథంబులయుఁ గ్రోవులును రాలినకేయూరాంగదాదినానావిధాభరణాదులకుప్పలును దునిఁగిపడిన గదాఖడ్గపరశుపట్టసముసలముద్గరతోమరభిండివాలపరిఘభ్రాంకుశప్రాసాదశరశరాసనాద్యాయుధంబులశకలంబులరాసులును సంగరాంగణంబునఁగుప్పలై తిప్పలై చూడనొప్పెనప్పుడు.

ఉ. కౌరవసేనలో ధనువు గైకొని యుండినవాఁ డొకండు గా
నీ రణరంగమందు జముఁడుం బురుడించి పరాక్రమించునా
భారతవంశభూషణునిఁ బోల్చని మారొకఁ డెవ్వఁ డే
ధీరతఁ జాలి యున్నఁ బిత్రుదేవతలం దగునట్టిఁడే చుమీ. 294

వ. ఇట్లు నీకొడుకులు బలంబు లెల్లం దొచ్చియుం జచ్చియు వెఱచియుం బఱచియుఁ జెందువం దగుచుండు గని నవ్వుచుఁ గృష్ణార్జునులు పాంచజన్యదేవదత్తంబులొత్తిన వినిమయంబు వంగుఱించుచు దేవవ్రతుండు భారద్వాజాదులకంచియిట్లనియె.

మ. అకటా! చూచితివయ్య! కృష్ణసహాయుం డైజిష్ణుఁ డతండు మా
మకసైన్యంబుల నెల్లఁ జెండుచునెనో మా గాడుచుండంగ న
ట్లొకటం జేసె లయాంతకుం డగుచు నీయుచ్చను నోర్వంగ నిం
దొకరుండుం దగి యుండఁ డవ్వానిని నే నూహింతు నుల్లంబునన్. 296

ఆ. మఱియు విఱిగి పఱచుమనసేన మరలింపఁ, దిరము గాదు మనకు ద్వాదశాత్ముఁ
డస్తగిరికి నరుగుచున్నవాఁడు జూపట్టు, సేనఁ దివియ నానతీయ నొప్పు. 297

వ. అని పలుకుచు నెల్లవారి కవహారం బొనరించి నిరువాగును దమతమసైన్యంబులం దివియించుకొని శిబిరంబులకుం జని యాకౌరవపాండవులు రేయిం గడవ నీఁదిరంత మరునాఁ డరుణోదయంబున. 298

—♦ భీష్మనిర్యాణ సమయ ప్రకారము ♦—

ఉ. శాంతనవుం డనంత మగుసైన్యముతోఁ జని జన్యభూమిలో
నెంతయు వింతగా గరుడి యే యన నొప్పెడు మొగ్గరం బొకం

డింతటిలో సమర్చి జయ మొంచుచు నీమకొమాళ్ళకుం దదీ
యాంతకసన్నిభాననమునం దయి యుండె నతండు దండి నై. 299

వ. మఱియు నాగరుడవ్యూహంబు నేత్రయుగ్మంబున భారద్వాజకృతవర్మలును శిరం బున మత్స్యత్రిగర్తకేకయవాటధానులతోఁ గృపాశ్వత్థాములును గళంబున సింధుసౌవీరమద్రకపంచనదచమూసమూహంబులతో శలశల్యభగదత్తసోమద త్తభూరిశ్రవులును పృష్ఠభాగంబున సకలసోదరపరివారపరివృతుం డై దుర్యోధనుం డును బుచ్ఛంబునఁ గాంభోజశకశూరసేన సైన్యంబులతో విందానువిందులును దక్షిణపక్షంబున దాసేరగణంబులతో మగధకళింగపతులును వామపక్షంబునఁ గోసలేశ్వరుం డయినబృహద్బలునిం గూడి కరూశపికుంజముండకౌండివృషాదిసేన లును దంశితంబు లై నిలిచి రంతఁ గౌంతేయుఁడును సర్వసేనాసమేతు లై సంగ్రా మరంగంబునకుం జనుదెంచునంతఁ గవ్వడి గాంగేయనిర్మితం బయినగారుడవ్యూ హంబు గాంచి ధృష్టద్యుమ్నునితోడం గూడి దానికిం బ్రతిఘటింపం జాలునర్ధచం ద్రవ్యూహంబు తమబలంబున నిర్మించె నావ్యూహంబునకు దక్షిణోత్తరశృంగం బుల నానాదేశాధీశ్వరులతో భీమసేనవిరాటద్రుపదులును వారివెనుకఁ జేదికాశి కరూశపౌరవసేనాసమూహంబులతో నీలధృష్టకేతులును మధ్యభాగంబునఁ బాం చాలప్రభద్రకసైన్యంబులతో ధృష్టద్యుమ్నశిఖండులును వారివెన్నుదన్ని గజా నీకసంవృతుం డగుయుధిష్ఠిరుండును వారివెన్నంటి క్రమంబున నానావిధసేనాస మన్వితు లై కైకేయద్రౌపదేయసుభద్రేయేరావద్ఘటోత్కచకేకయులును వామపార్శ్వంబున సకలజగద్రక్షకుం డగుపుండరీకాక్షుండు తనకు రక్షకుండుగా సహస్రాక్షసుతుండును నిలిచి గట్టిమొగ్గరంబు గట్టి రిట్లుభయసైన్యంబులును సన్నద్ధంబు లై భేరీమృదంగాదిరావంబుల భూనభోంతరంబులు నిండ నొండొంటిం దాఁకొని సంకులసమరంబు గావించుచుండె నాసమయంబున శ్వేతవాహనుండు.

చ. తనరథ మెల్లచోటుల నుదారగతిం బరవస్సృ గ్రక్కున
ట్లొనరి మెలంగఁ జేసి విశిఖోత్కరముల్ నిగిడించి జోదులన్
దునిమి రథంబులన్ విఱిచి తుత్తుము లై పడఁ గేతనంబులన్
ధనువుల రాల్చి రావుతుల డంచి గజంబులఁ గూలఁ బడంచియున్. 301

క. క్షయకాలకాలునట్టులు, జయ మందఁగఁ జేయుచున్న సమయమునందున్
భయ మేది నీదుమూఁకలు, పయిఁబడి పోరాడి రొక్కపఱి శరసమితిన్. 302

ఆ. ఉభయసేన లట్టు లుక్కెక్కి పోరెడునప్పు డెగసి ధూళి యుప్పరంబుఁ
గప్పెఁ గన్ను మిన్నుఁ గాన రా నట్లయి, తమ మభేద్య మగుచుఁ దనువు లూఁతె.

తే. చూపు సోఁకింపరానిచో దాపునకగు, సైనికులు గోత్రనామము లానవాళ్ళు
గాఁ జెనంగిరి భీష్ముఁ డీకడను భీముఁ, డాకడను గావఁ బిఱుతీక వీఁకఁ జేసి. 304

తే. హతనరగజాశ్వశోణిత మతులిత మయి, మాంససంపర్కమునఁ గర్దమంబు గాఁగ
సమరతల మొప్పఁ గెందూళి సమసె నంత, దెసలు చూపట్టె విమలత్వ మెసక మెసఁగ.

వ. అప్పు డిరువాఁగు నరిది రథియు రథియును నాశ్వికుండు నాశ్వికుండును హాస్తికుండు హాస్తికుండును బత్తియుం బత్తియును దలఁపడి పోరుటయ కాక రథి గజయోధుని గజయోధుఁడు రథిని రథారోహుండు హయారోహుని హయారోహుండు రథారోహునిఁ బదాతి రథిని రథి పదాతిని గజారోహుఁడు హయారోహుని హయారోహుఁడు గజారోహుని గజస్థునిఁ బదాతియుఁ బదాతిని గజస్థుండును బత్తిని సాదియు సాదినిఁ బత్తియుం దలపడి కార్ముకతోమరభిండివాలప్రాసపరిఘశక్తిగదాసికుంతనిస్త్రింశాంకుశాదులం బఱపి పోరుచున్నంత శాంతనవుండును గురుండును గురుమిత్రుండును సౌబలుండును సైంధవుండును వికర్ణుండును బాండవసేనపై నురవడించిన భీమసేనుండును ఘటోత్కచుండును సాత్యకియుఁ జేకితానుండును శైబ్యుండును ద్రౌపదేయులునుం దలపడి నీవారి నెల్ల నొల్లఁబోఁ జేయుచుండి రయ్యెడ నయ్యోధు లెల్లరు నన్యోన్యక్షతగాత్రులై వసంతసమయకుసుమితపలాశశాఖులం బోలి రంత నీపుత్రుండు రథసహస్రపరివృతుం డై భీమసేనఘటోత్కచులం దాఁకె యుధిష్ఠిరనకులసహదేవధృష్టద్యుమ్నులు భీష్మద్రోణులం దాఁకిరి సౌభద్రుండును సాత్యకియును సౌబలుం దలపడి రెల్లరు నెల్లవారిని మార్కొని పోరుచున్నంత సవ్యసాచి సర్వప్రదేశంబులం గలపార్థివులం దాఁకి వీఁకం జూపుచున్నప్పుడు. 306

ఉ. పార్థివు లెల్లఁ గ్రుద్ధు లయి బాహుబలంబున నోహటిల్ల క
త్యర్థముగా గదాసిపరిఘాశుగముద్గరపట్టసాదులం
బార్థునిఁ జుట్టుముట్టుటయు బాణపరంపరఁ బర్వఁ జేసి ప్ర
త్యర్థులు వారు బమ్మరిలునట్లు పొనర్చె నతండు దండి యై. 307

క. అతిమానుష మగునాహరి, సుతుకరలాఘవముఁ గాంచి సుర లద్దిర యీ
కృతహస్తుఁ డింత యొప్పునె, యితనికి నీతండె సాటి యీవిశ్వమునన్. 308

వ. అని ప్రస్తుతించి రంత సౌబలుండు గాంధారసేనాసమేతుం డై శైనేయాభిమన్యులఁ దాఁకుదెంచి. 309

సీ. శినివరునిరథంబు సునిశితాస్త్రంబులఁ, జిదురుపలై పోవఁ జిదుకనేసె
నతఁ డారథము వీడి యభిమన్యురథ మెక్కె, నిరువు రాబల మెల్లఁ దెరలఁ జేసి

రపుడు భీష్మద్రోణు లడరి ధర్మజు మొన, నగుసేనఁ జెడఁ జేసి రాసగముల

ధర్మజుండును మాద్రితనయులతోఁ గూడి, ద్రోణసైన్యంబెల్లఁ దోలఁగఁద్రోచె

తే. నవల దుర్యోధనుండు సహాత్మజుఁ డగు,భీమసేనుని మార్కొని భీమవిక్ర

మమునఁ బోరాడె నాపోరు తుములమగుచు, దేవదానవసమరము ధిక్కరించె.

క. హైడింబునిభుజవిక్రమ, మేడేనుజగంబులందు నెచ్చట నైనన్

జూడము విన మయ్యని నాప్రోఢుఁడు తనతండ్రి మించి పొగడిత కెక్కెన్. 311

—♦ దుర్యోధనుఁడు భీమునిం దాఁకి మూర్ఛిల్లుట ♦—

శా. రారా జుద్ధతి భీముపై నిశితనారాచంబులన్ వ్రేయుచున్

బోరాడం గని భీమసేనుఁడు వడిన్ బుంఖానుపుంఖంబుగాఁ

గ్రూరాస్త్రంబులఁ గాఁడ నేయుచును సంక్రుద్ధాత్ముఁడై జానుగుం

జేరన్ లాగి కడంక నొక్కశరముం జేవాఁడిమై వేయుచున్. 312

చ. కురుపతి భీమబాణహతిఁ గూబర మూఁతగఁ గూలె మూర్ఛయై

నరదమునందు నందలిమహారథు లందఱు డిందుపాటునన్

దురపిలుచుండ సూతుఁడు ప్రమోదముతో వడి నొప్పి వాజులన్

దురమునకుం దొలంగి చనఁ దోలె శతాంగము సంభ్రమంబునన్. 313

ఆ. విభునిపాటుఁ జూచి వెన్నిచ్చి మూఁకలు, దెరలి పఱవఁ జొచ్చె దిక్కుకడు గ

హానివెంట నంటి వాయుతనూజుఁడు, తఱిమె పఱియ మఱియు విఱిగి పఱవ. 314

ఉ. పార్థతుఁడున్ యుధిష్ఠిరుఁడు భండనముం బొనరించుచున్ మహో

దగ్రమునం బితామహుని మార్కొని పెక్కని యున్నమూఁకపై

వర్షము వోలె నంబుల సవారిగ నేయుచు విచ్చి పాఱె లో

హర్షము వోవ జీవములయందలితీ పది యేపు మీఱఁగన్. 315

క. కనుకనిఁ బాఱెడుసేనం, గని భీష్ముఁడు గురుఁడు పఱవఁ గా వలదు నిలుం

డని యెలుఁగు సూపి చెప్పిన, విన నొల్లక పాఱె రెల్లవీరులు భీతిన్. 316

క. శినిపుంగవుఁడు నస్యుస,తనయుఁడు నొకరథమునంద తనరుచు దర్పం

బునఁ బుష్పవంతుల ట్లయ్యనిమొన సౌబలునిబలము నడఁగించి రొగిన్. 317

క. ఫాల్గునుఁడు బాణవర్షము, నల్గుచుఁ గురియించి కౌరవానీకినిపై

వల్గుగతి నొప్ప నప్పుడు, నల్గడకుం బఱచె మూఁక నానాగతులన్. 318

చ. పఱచెడుసేనలం గని నృపాలునిపైఁ గలపేర్మి పెంపున

న్వెఱవకుఁ డోమహీక్షితులు! నిల్వుఁడు మీ రిట మళ్ళుఁ డంచు వా

దెలిచి గురుండు నిర్జరనదీసుతుఁడున్ జెయి వీచి పిల్చుడున్
విలసితముగాఁ బేరుకొనె వెండియుఁ గొండొకయింతలోపలన్. 319

వ. అంతలోనన్ దుర్యోధనుండు సేద దేఱి సేనావారంబులోనికి వచ్చి విచ్చినతనవారి నెల్ల నల్లనం గలియఁ గూర్చుచుఁ గురుపితామహునిపాలికిం జని వాని కిట్లనియె.

—♦ దుర్యోధనుఁడు సేద దేఱి వచ్చి భీష్మునితో మొఱ్ఱవెట్టుకొనుట ♦—

మ. అకటా! యే మని చెప్పువాఁడ నుతశౌర్యా! నీవు ద్రోణుండు ద్రో
ణకుమారుండుఁ గృపుండునుం బ్రదికి యుండ న్మాదుసైన్యంబు లి
ట్లు కడుం గాఱియఁగూరఁ బాఱుటలు పోలుం బోలుఁ బో మీమహా
త్ముకతాశక్తికి మీప్రశస్తి కిది మేల్ సూచించునో చెప్పుమా. 321

వ. అని మఱియును. 322

మ. మనమందుం గల దాప్పధాసుతులపై మాన్యస్వభావంబు దా
నన మీ రిట్లుర కుంప్రస్త గాక యెదురైన న్నిల్చువాఁ డెవ్వఁ డే
మనిలో వారిని వారివారిఁ గడుశౌర్యం బేర్పడన్ మాఱుకో
మని మున్నే వచియింతు రేనిఁ దగ నే నాకర్ణింపఁ జూడమో. 323

క. మీనుడులబడిన కాదే, నే నుంటిఁ గస్తు విడిచి నిర్మలమతి నై
గానిం డింకిట నైనన్, మానసమున నాదుమేలు మఱ కని కగుడీ. 324

వ. అనినం బితామహుండు కన్నెఱ్ఱఁ జేసికొని యుసన్వుచు నీకొడుకుం గాంచి యిట్లనియె.

మ. పలుమాఱు నేను వచించితిన్ హితము నీపాలం బ్రదర్శించుచున్
గలనం బాండవులం జయించుటకు లేఖస్వామియుం జాలఁ డం
చలతుల్ చెప్పినదాన నిట్లయితి వీవట్లుండని మ్మంతయుం
దెలియన్ వృద్ధుఁడ నోపినంత బెనఁగన్ నే నుంటి నిక్కంబుగన్. 326

తే. ఓల మాసింప కే నిప్పు డాలమందు, నిలిచి పాండవేయుల నేన నిలువరింతుఁ
జూడు మీవును నీవారుఁ గూడి యనుమ్మహామునఁ జేసి సంకొత్తి గాతఁ డపుడు.

వ. అత్తఱి నీసైన్యంబున నిస్సాణంబులు మ్రోసె నాసమయంబునఁ బాండవసైన్యంబునందును దుందుభులు మొఱయించి రనిన ధృతరాష్ట్రుం డట్లు ప్రతిన చేసినమాతండ్రి యేమి చేసెం జెప్పు మనిన సంజయుం డిట్లనియె. 328

చ. విజయము నొంది పాండవులు వీరవిహారము సేయుచున్న చో
నిజకిరణంబు లెల్లెడల నిండ వెలుంగుచు వేఁడివెల్పు భూ
ప్రజ కట రెండుజాల్గడచి వ్రాలఁగఁ జొచ్చె నసంగఁ దోఁచె న
ష్టజితుఁడు నీదుతండ్రి జవనాశ్వసమంచితుఁడై వడిన్ వడిన్. 329

తే. కడు బలంగముతో నీదుకొడుకు లెల్లఁ, దనకు బాసట లైయె వెన్నుదన్ని నిలువ
జితభృగూద్వహుఁ డానదీసుతుఁడు పాండ,వేయులబలంబునం జొచ్చి చేయి మిగిలె.

— భీష్ముఁడు పాండవబలంబులపై విజృంభించుట —

శా. ఘనకున్ వారికి రోమహర్షణము భీమం బైనసంస్ఫోట మ
స్థానగూడెన్ గుణనిస్వనంబులు కలంబోగ్రప్రపాతధ్వనుల్
దనరన్ యోధులు నిల్చిరిన్ నిలుము హస్తప్రస్తుతోగ్రస్థితిన్
గనుఁగోఁ జేయు మటంచుఁ బల్కుచును వీఁకం దాఁకి రొక్కుమ్మడిన్. 331

తరళము. బొమిడికంబులు బొందళంబులుఁ బొన్నుటెక్కెములుం బృష
త్కములుఁ గూలి యిరమ్మదమ్ములకంటె హెచ్చుగ నై రవం
బమరఁ జేయఁగ నుత్తమాంగసహస్రముల్ తెగి రాల మొం
డెములు మెండుగ నాడఁ గూడఁ బెనన్ రణంబు ఘనంబుగన్. 332

తే. మాంసశోణితకర్దమమహితతలము, మదగజమహాంగశిలము గోమాయుగృధ్ర
కాకకంకప్రియము నెత్రువాఁక వాఱె, నపుడు పరలోకసాగరప్రాంతముగను. 333

తే. రణహతులు గూలఁబడి రండు భ్రాత తాత
మాతుల వయస్య చుట్టమా భూతలమునఁ
బడితి ననుఁ గాఁగిటం జేర్పఁ డడలు మాన్పఁ
డనుచు మొఱ వెట్టి రటఁ గొంద ఱతులితముగ. 334

తే. జడిసి పఱచెద వేటికి వెడఁగుతనము, విడుము రా రమ్ము తిరుఁడ వై విచ్చుకత్తి
వెచ్చనం జూపు మే నిదె వెలయు చుంటిఁ, గాచుకొ మ్మని కొంద ఱక్కలన నైరి.

వ. రోమహర్షణం బగునమ్మహాయుద్ధంబున రథపథంబులం దెల్లెడలం ద్రెళ్ళిపడి నగం
బు లనం దోఁచునాగంబులకళేబరంబు లలంకరించుశిరస్త్రాణతనుత్రాణబాణధ్వజా
దులం దగులుకొని వ్రేలుహారకేయూరాంగదకిరీటాదివిభూషణంబుల నొప్పి
యప్పాలికల సదృష్టపూర్వంబు నశ్రుతపూర్వంబు నయ్యె నయ్యవసరంబున సమర
నదీనందనుండు గండు మిగిలి. 336

సీ. కొఱవిఁ ద్రిప్పినరీతి గుఱుసులు వాఱుచు, నెందును దనరథం బెసకమెసఁగ
మండలీకృతకార్ముకుం డై నిశాతశ,రమ్ముల నాశీవిషమ్ము లనఁగఁ
బాండవవాహినిపయిఁ బర్వఁ జేయుచు, నెందును దన్మార్గమే యనంగఁ
బాణిలాఘవమును బదుగురుఁ గని మెచ్చ, హెచ్చి నర్తకునట్లు నృత్య మాడె
ఆ. నేకవీరుఁ డతనియెత్తెఱుకన్ సృంజ,యులును బాండవేయు లొక్కపెట్ట
కనుపుగొట్టఁబడుటఁ గనుకనిఁ బాఱిరి, మొక మబ్బినట్టిమనుజులట్లు. 337

TEL. 1849



చ. పిడుగులఁ బోనిబాణములఁ బిమ్మట పుట్టఁగఁ జేయుభీష్మునిం
బడమటఁ జూచి తూర్పునకుఁ బాఱి యటం గని యుత్తరాశకుం
దడఁబడి పోయి యం దతఁడు దర్పము సూపుచు నుండ బీతునన్
వడివడి దక్షిణంపుదెస వట్టిరి పాండవయోధు లయ్యెడన్. 338

మ. అపు డాధర్మజుసేనయం దెవఁడు నే నయ్యాపగేయున్ రణో
ర్వి పయిం జూడఁగఁ జాలఁ డెల్లరును నిర్వీర్యంబునం దోఁగుచున్
విపులార్తిం బడి దీను లై పఱచి తద్విఖ్యాతబాణాగ్నిఁ దాఁ
కి పతంగంబులు వోలెఁ గూలి రిలకున్ గీడ్పట్టుచుం బెట్టుగన్. 339

సీ. దేవనదీసూనుచే విడంబడుచు వస్మినతూ ఫాక్కుఁడు నైన లేద
యొకతూపు రెండుమూఁడుకరీంద్రముల నేల పాలు గావించు నాభీలముగను
గడఁక భీష్ము నెదుర్పఁ గడకట్టువాఁ డెవ్వఁ డని చెప్ప వలయుఁ జువ్వె
కార్చిచ్చు పొదివినకరణిఁ బాండవసైన్య ముడి వోయి చిక్రుప లై నడ వొడంగె

తే. నపుడు బాణప్రపీడితు లై వెఱచి ప,ఱచుబలంబుల మరలింప నచట నున్న
కేశవార్జునులకుఁ గూడ లేశ మైన, శక్తి చాలని దయ్యె నాసమరమందు. 340

మ. మునుముం బెట్టి పితామహుం డటులు కన్పుం గొట్టుచోఁ బాండునం
దనసైన్యంబున నెల్లసైనికులు నార్తిం బంది హాహారవం
బున నాక్రందన మాచరించుచు నసిన్ బొందంగ నొండొక్కనిం
గనుఁగో కాపులఁ బిల్వ కేగి రపమార్గం బేర్పడం జేడ్పడన్. 341

తే. కత్తళంబులఁ బుచ్చియుఁ గైదువులను, విడియు వీడినక్రొమ్ముడుల్ మెడల వ్రేలఁ
బాండుపుత్త్రులసైనికుల్ పాఱి రపుడు, బెదరి వాలము లెత్తి పాఱ్మొదవులట్లు.

—♦ శ్రీకృష్ణప్రేరితుం డగునర్జునుండు భీష్మునిపైఁ గవియుట ♦—

వ. అట్లు విఱిగి పఱచునిజసైన్యంబులం గని యుగ్యంబులపగ్గంబులు వట్టి నిలువ
రించుచు వాసుదేవుండు సవ్యసాచిం జూచి యి ట్లనియె. 343

మ. ఉబుసుంబోకకుఁ జెప్పుచుందు మును నే నుగ్రాహవం బైన బా
హుబలం బేర్పడ ధార్తరాష్ట్రబలమున్ హెచ్చారాటమైఁ జీల్చివై
తు బదుల్ సెప్పఁగ లేరు నాకు నదిపుత్త్రుం దొట్టివా రంచు ని
ష్ఠ బటారం బయి వచ్చె నట్టితెఱి యేపుం జూపవే మర్జునా. 344

క. తెఱనోరు గలుగుజముఁ డన, వెఱఁ గూర్చెడుభీష్ముఁ గాంచి వివిధబలంబుల్
తెఱనోటిమొకముఁ గన్గొని, వెఱఁ బాఱెడు లేళ్లపగిది విరిసెం గనుమా. 345

వ. అనిన నర్జునుం డతని కి ట్లనియె, 346

చ. నడపుము తేరు వానిపయి నాకరలాఘవ మెల్లఁ జూపి తెం
చెడు నటు చేయువాఁడ నని చెప్పుచు నుండ జనార్దనుండు వే
న్వడి నదిసూతిచెంగటికి వాటముగాఁ జననిచ్చెఁ దేరి న
ప్పుడు వెలిఁ బొఱమాఁకు లవి ప్రోగుపడెన్ నరుప్రోపు నమ్ముచున్. 347

చ. తనపయి వచ్చునర్జునరథం బది దవ్వుల నుండఁ గాంచి శాం
తనవుఁడు సింహనాదము నుదంచితరీతి నొనర్చి పేర్చి పెం
పున శరవర్షముం గురిసి ముంచె నొకానొకయింకలో రణా
వని యది యంతయున్ దిమిరవర్తితి నై కన నయ్యె నయ్యెడన్. 348

తే. రథికుఁ డర్జునురథము సరథ్యసారథిధ్వజంబుగ నత్తఱిఁ దెలియఁ బడని
యట్లు శరజాలసంఛన్న మయ్యె నైన, సంభ్రమింపక యనువంశసంభవుండు. 349

క. ధీరుఁడు గాన్ నొచ్చిన,వారువముల దడివి తేర్చి వడివడి నడపెన్
వీరాగ్రేసరుఁడు సునా,శీరాత్మజుఁ డెయిది విల్లు చేఁ బూని వెసన్. 350

మ. జలదధ్వానము వోలె నారి మొఱయన్ సంధించి శాతాశుగ
మ్ముల దేవవ్రతుచేతివిల్లు విఱువన్ ముక్కారుకలం దేరుటన్
లలి భీష్ముండు మఱొక్కవిల్లుఁ గొని నైశ్చంబొప్ప సవ్యంబు చే
సి లసన్నాద మెసంగ నారి మొఱయించెన్ సాగె సారించుచున్. 351

చ. నడిమికి రెండుగా నరుఁడు నవ్వుచు నవ్విలుఁ ద్రుంచె నంతలో
నెడఁదఁ దదీయలాఘవము నేటికొమారుఁడు మెచ్చుకొంచుఁ గ
వ్వడి! నినుఁ బోల రెవ్వ రిటువంటి తెఱంగులు నీక చెల్లుఁ బ్రీ
తుఁడ నయితిం బొనర్చు మని దోర్బల మేర్పడ నంచుఁ బల్కుచున్. 352

క. ఒండొకధనువుం గొని కను,చుండం గోటానఁగోటు లున్నతశరముల్
దండిమగం డై వడి నా,ఖండలసుతురథము మునుఁగుగతి నడరించెన్. 353

ఆ. ఆపగాతనూజుఁ డడఁచునంత, యొక్కెడ తిమిఁ దాఁక కుందునట్లు
మండలాదిగతుల మావుల నడపించి, నమ్ము చేసె వాని నమ్ముగారి. 354

శా. అంతన్ శాంతనవుం డుదగ్రవిభవుం డై జిష్ణునిం గృష్ణునిన్
గొంతల్ గానిసశాతబాణతతులం గుప్పించి నొప్పించె వా
రెంతే విక్షతగాత్రు లై యపుడు ని ల్వొల్లి న్విపాణక్షతుల్
వింతం గూర్చఁగ నొప్పుగోవృషములన్ విఖ్యాతి కై రాతఱిన్. 355

ఉ. అంతన పోక భీష్ముఁడు మహాగ్రహ మేర్పడ వేనవేలు దు
ర్దాంతదురంతబాణము లుదగ్రగతిన్ నిగిడించి దిక్కు లం

చ్యుతి కై పోవుట లొప్పునే మరణ మెచ్చో నైన నేనాఁటికే
క్షితి లేకుండదు గాదె జంతుతతి కీచెయ్వోటి కీపాటికిన్. 364

క. మరలుఁడు చెదరక యెదురై, మరలింపుఁడు పగఱ నోర్చి మహితయశంబున్
ధర నిలుపుఁ డనుచుఁ బలికెడు, తరుణమునన్ శౌరి యిట్లు తమ్ముని కనియెన్. 365

ఉ. పోయెడువారి నేమిటికిఁ బో యిటు పిల్వఁగ నున్నవారునుం
బోయినఁ బోవువా రగుత పోర భయంపడువీర లుండినం
బోయిన నొక్కఁడే యగుదు బూరుషసింహమ! నే నొకండఁ జ
క్రాయుధముం గ్రహించి యిపు డాహవదోహలమూర్తి నయ్యెదన్. 366

మ. త్రిదివేశవ్రతునిన్ రణాంగణమునం ద్రెక్కోలు గావించి భూ
త్రిదశేశుం ధనురార్యునిం దునిమి దిగ్దేశాగతేశాళితోఁ
జిదియం జేసి సుయోధనాదుల మదిన్ జిష్ణ్వాదు లగ్గింప స
మ్మదముం బొంద నజాతశత్రునకు సంపాదింతు సామ్రాజ్యమున్. 367

— శ్రీకృష్ణుండు చక్రమును ధరించి భీష్మునిమీఁది కుఱుకుట —

వ. అని పలికి వాసుదేవుండు వజ్రసహస్రసదృశప్రభాభ్రాజితంబును సునాభంబును నిశితక్షురాంతంబు నగుసుదర్శనంబు సన్నిహితం బయిన దాని దక్షిణకరంబునం బట్టి నెట్టనం ద్రిప్పుచు నప్పుడ యుగ్యంబులపగ్గంబు లిగ్గ విడిచి రథంబు డిగ్గ నుఱికి.

ఉ. మత్తమతంగజంబుఁ గని మచ్చర మెచ్చఁగ దానిమీఁది కు
ద్వృత్తిగ నెత్తి పోవునురువీర్యవిరాజితసింహరాజ మ
ట్లత్తఱి ధాత్రి దద్దఱిల సద్దనుజాంతకుఁ డంతకాకృతిన్
మెత్తనఁ గాక వీఁకమెయి మెట్టుచు భీష్మునిమీఁదికిం జనెన్. 369

క. హరి పఱచువేళ నాతని, వరకాయమునందుఁ బీతవస్త్రము చెఱఁగుల్
పరికింప నయ్యె నల్లని, శరదము పై మెఱపుఁదీఁగ సాఁగెడుకరణిన్. 370

మ. హరిదేహాంబుసరఃప్రరూఢము తదీయాత్యంతకోపోదయ
స్ఫురదాదిత్యవిబుద్ధ మిద్ధభుజసంపూర్ణోరునాళం బతి
క్షురతీక్ష్ణాగ్రసుజాతపత్త్రము ఖరాంశుత్విడ్విశిష్టంబు నై
వెరఁగుం గూర్చుసుదర్శనం బెసఁగె నాభీజాతపద్మంబునాన్. 371

శా. శక్రావక్రపరాక్రమక్రమమునం జక్రంబు చేకొంచు ని
ర్వక్రప్రక్రియ నెల్లదిక్కులును నార్వం గట్టిగా నార్చుచుం
బక్రాంతాహితచక్రుఁడై కనుల శుక్రజ్వాల లొల్కన్ మృగేం
ద్రక్రాంతిం గొనుకంసవైరిఁ గని భూతంబుల్ వడంకెం గడున్. 372

మ. జగ మెల్లం గడతేర్ప నేర్పడి కడుం జాజ్వల్యమానాకృతిం
దగులం బుదినధూమకేతు వన నై తళ్ళోక్త్రి వృత్తంబు నా
నొగిఁ దీండ్రింపఁగఁ ద్రిప్పుచుం గుఱుసువా లుద్వృత్తిఁ బై వచ్చునా
జగదారాధ్యునిఁ గాంచి భీష్ముఁ డనియెన్ సంభ్రాంతి లేకిట్లుగన్. 373

ఉ. రమ్ము జగన్నివాస! యిటు రమ్ము జనార్దన! నీదుపాదప
ద్మమ్ముల కేను మ్రొక్కెద ముదమ్మున భూతశరణ్య! నన్ను జ
న్యమ్మునఁ జావ నేయుము గదాసిధరా! నినుఁ దాఁకి చత్తు నే
నిమ్మహి నమ్మహిన్ వినుత కెక్కెద నిక్కము నీకుఁ దక్కెదన్. 374

వ. అని ప్రార్థించుచుండం బుండరీకాక్షుం డతిత్వరితగతిం గురుపితామహుం దఱియ
నరుగుచు ని ట్లనియె. 375

తరువోజ. ఈవు ధర్మము తప్పి యి ట్లెల్లలోక, మేఁచియుంప యూల నై యొసఁగినదుష్ట
భావదుర్యోధనుపక్ష మై వానిఁ, బట్టి నిల్వఁగఁ బెట్టువాఁడ వై తకట
భూవరుం డధముఁ డై పోవుచు ధర్మ,మూర్తి నయి కగ్గడ పోలు వారింప
నీవిధి కాకున్న నేని యక్కిత వు, నింతిలో విడనాడి చెగుట లొప్పు. 376

తే. అనఁ బితామహుఁ డనియె వంశాపశముఁడు
ధార్తరాష్ట్రుఁడు నామాటఁ దవిలి వినఁడు
యాదవులు చెప్పి చెప్పి మర్యాదహీనుఁ
డైనకంసుని విడి రార్తి కతఁడు కాఁడె. 377

క. కాలప్రచోదితాత్ములు, మే లెంచి హితంబుఁ గఱపుమిత్రులనుసువుల్
పోలించి వినఁగ నొల్లక, పాలసు లై చెఱుదు రవలఁ బహుళార్తుల నై. 378

—అర్జునుఁడు శ్రీకృష్ణునిం బ్రాంచి మరలించుట—

వ. అని విన్నవించుచున్నంతఁ గుంతీసుతావరజుం డతిరయంబున సరదంబు డిగ్గ నుఱికి
పరుగుపరుగునం బఱచి పిఱిందివెనఁ గరంబుఁ గెంపులు గ్రుచ్చి పట్టుటయు నప్పట్టు
తోడన వానిం బురుషోత్తముండు మహావాతిం శాకవృక్షి బునుం బోలె నెట్టుకొని
పోవం బోవ నప్పార్థుండు బలంబునం బాదంబు నిలుపలంబునం దూని పట్టి యీడి
గిలంబడి పితామహునిపయిం బడ నున్నవానిం బదియవపదంబున నిలువరించి నమ
స్కరించి యి ట్లనియె. 379

చ. సమయము దప్పి నీ విటులు సల్పుట లొప్పు నటయ్య! యిమ్మెయిన్
శమము వహించి కోపమును బంపుము చంపెద నేఁ బ్రతిజ్ఞగన్

సమముగ నీసహాయమున శత్రుల నెల్ల నిజంబు చెప్పెదం
జుమి సమరంబునన్ సుతులు సోదరు లానగఁ బాస సేయుచున్. 380

క. గతి నీవ కాదె మా కో,నతభక్తజనావనైకనద్ధాత్మ! ననున్
క్షితిఁ బొల్ల చేసి ప్రతినన్, మితి మీఱినవాఁడ నగుట మేలే చెపుమా. 381

వ. అని ప్రార్థించినం బ్రసన్నుం డై పుండరీకాక్షుండు తత్క్షణంబునం దనమనంబున సమయప్రతిజ్ఞలం బరిపాలించుచు వాని ననుగ్రహించి మగిడి నొగ లెక్కి యుగ్యంబులపగ్గంబులు గొని దిక్కు లెల్లం బిక్కటిల్లఁ బాంచజన్యంబు పూరించెఁ గిరీటియుం దేరెక్కి మొక్కలంబుగా నొక్కమొగి దేవదత్తం బొత్తె నత్తఱి విఱిగిన సైన్యంబెల్ల దైన్యంబుదక్కి చక్కనై భేరీమృదంగాదినాదంబులు రోదసీకుహరంబు నిండ మెండుకొనఁ బాండవునిరథంబు వెన్నుదన్ని మోహరించి పోరికిం గడంగినం గని కౌరవులును నానావిధతూర్యనినాదంబు లెసంగం దాఁకుదెంచి రంతఁ గాంతేయుండును. 382

మ. స్తనయిత్నుప్రతిమాన మై భయద మై తళ్కొత్తుగాండీవ మ
స్తనిశం బుర్మలు మెర్మలుం గలిగి బాణాసారి మొండొండ మే
దిని నిండం గనుచుండఁ గౌరవబలోద్రేకంబు సైకంబు గాఁ
గొని దేవవ్రతముఖ్యులం దఱిమెఁ గోకొమ్మంచు నొక్కుమ్మడిన్. 383

తే. అపుడు ధూమకేతువు తోఁచినట్టు లేచి,వానిఁ గగ్గొని భూరిశ్రవఃప్రభృతుల
తో మహాసేనతో వచ్చి ధునిసుతుండు, పెద్దపోగాట మొనరించెఁ బెంపు మిగిలి.

సీ. భూరిశ్రవుం డేసుభూరిభల్లంబులు, దుర్యోధనుం డొక్కతోమరంబు
శల్యుండు గదయును శాంతనవుం డుగ్ర,శక్తియుం బరఁగించి చదుపుటయును
నరుఁడు భూరిశ్రవు నారాచముల నేసు,నారసంబులఁ ద్రుంచి కౌరవేంద్రు
వరతోమరం బొక్కక్షురమునఁ దునుమాడి, గుదెను శక్తి నొక్కొక్కకోలఁ గూల్చి
తే. గాండివమున నైంద్రాస్త్రముఁ గడఁకఁ గూర్చి, బాహుబలమేర్పడఁగ లాగి పగఱమీఁదఁ
బడ విసరుటయు నయ్యస్త్ర మడరి వేన, వేలముఖముల నరిసేనఁ గూలఁ జేసె. 385

శా. ఆమాహేంద్రమహాస్త్ర మస్త్రముల మాయం జేసి శత్రుప్రజా
స్తోమంబున్ సమయించి సామజములం దేర్వానువార్వంబులన్
భూమిం బండఁగఁ బెట్టి వింటులు సిడంబుల్ బొందళంబుల్ మహా
భూమీధ్రంబులు నాఁగఁ బ్రోవు లిడి పెంపుం జూపె అంపిల్లుచున్. 386

ఉ. అత్తఱి నర్జునుండు నిశితాంబకకోటులు పర్వఁ జేయుచున్
మత్తమతంగజంబులను మావులఁ దేరులఁ గాలుబంటులన్

దుత్తముల రై పదరఁ బలికి దుందుభినాదము ధిక్కరింప ను
ద్వృత్తగ గాండీవంబు మోయించె నరుల్ బెగ డంది కుందఁగన్. 387

తే. గాండివారావమును విని నిండువేడ్క, ద్రుపదుఁడును మత్స్యవిభుఁడును దొట్టినృపతు
లెల్ల నరునకుఁ జేయూఁత నిడఁగ వచ్చి, రచ్చటికి నిజబలంబును వచ్చి కవిసె. 388

ఉ. కోల్తల సేయునర్జునునకుం భవదీయులలో నొకండు నే
నిల్తు నెదుర్పఁ జాలుదును నే నని పూనినవాఁడు లే డటం
బొల్తుక లట్టి రై నృపులు పోల్లలు వోయిరి పాండవేయులు
న్మోల్తల గాఁగఁ బొంగుచు ననిం బొనరించిరి మించి యాడుచున్. 389

క. నానావిధాస్త్రశస్త్రము, లానరుఁ డడరించి కౌరవానీకినిలోఁ
దా నెత్తు రేఱు వాఱం, గా నొనరించె న్సమిన్ముఖంబున నదియున్. 390

మ. హతనాగాశ్వశరీరతీరము శిరోజాత్యంతశైవాల ము
న్నతరక్షోగణవృక్షభూతము నరాంత్రప్రోగ్రతాసృగ్జలం
బతిమాత్రాస్థినికృంతశర్కరము మాంసానద్ధపంకంబు కం
కతరక్షుప్రతిపాలితంబు ప్రబలెం గ్రవ్యాదపానార్హ మై. 391

వ. అమ్మహాప్రవాహంబుఁ గాంచి పాంచాలచేదికరూశమత్స్యాదిదేశాధీశు లానందం
బునం బొంది సింహనాదంబులు గావించి రాసమయంబునఁ గృష్ణార్జును లిద్దఱును
మృగమధ్యంబున నున్నమృగేంద్రులచందంబునం బొందుపడి పరమానందంబునఁ
జిందంబు లొత్తి రంత వివస్వంతుండు నస్తంగతుండై యొప్పుటయు నప్పటికిని నింద్ర
నందను నైంద్రాస్త్రంబు కల్పాంతకల్పం బై యెల్లప్రాణుల నేర్చుచుంటయుం గని
భీష్మద్రోణబాహ్లీకదుర్యోధనులు నిజబలంబుల నెల్లఁ దివియ నియమించి రయ్యవ
హారసమయంబునం గురుసైన్యంబునందు. 392

తరువోజ. బాపురే! పార్థునిబాహుబలంబు ప్రాచ్యుల సౌవీరపతుల మాళవమ
హీపతులన్ క్షుద్రకేశులఁ గూల్చి యింతలో నేనుఁగు లేమ్నూఱు రథము
లాపయిఁ బదివేలు నవనిపైఁ ద్రెళ్ళ నొనరించె మహావీరుఁ డతని
కోప రైరి పితామహుండు లోనైనయోధు లెల్లర గెల్చె నొకఁడ యీనాఁట.

వ. అని వినుతించుచు నెల్లవారుం గరదీపికలు వెలుంగ శిబిరంబులకుం జనిరి పాండవు
లును బరమానందకందళితహృదయారవిందు లై తమబలంబులం దివియించుకొని
చని రనిన విని నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు సెప్పుమని సూతు నడు
గుటయును. 394

## ఆశ్వాసాంతము.

ఉ. ఏని ననుగ్రహించుటకు నీవు మనంబునయందు నెంతువో
వాని సమస్తవిత్తము నవశ్యము గా హరియింతు వంచు నీ
కా నుడికార మిూనరుమహత్తరవిత్తము నెత్తుకొంటి వే
మేని తలంచుకొంటివె యతీశ్వరసన్నుత! సర్వసమ్మతా. 395

క. మేరువుఁ దృణముగఁ దృణముం, మేరువుగాఁ జేయుశక్తి మెయిఁగొను నీవి
చ్చారతి మెలఁగుదు నను నే,తీరుగఁ జేసినను సమ్మతించెద నీశా. 396

అతిజగతివృత్తము నీ వేమి చేయు దది నేఁ దొలుత నెంతేఁ
జేవాఁడికాఁడ నయి చేసినద కాదే
నావంక నైనవృజినం బుడిపి వన్నుఁ
దేవాదిదేవ! కడతేర్పు మనకంపన్. 397

గద్యము.
ఇది శ్రీమదఘునాతినోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందు
ద్విసప్తసర్గంబునఁ ద్వితీయాశ్వాసము.
శ్రీ శ్రీ. శ్రీ.



శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

## భీష్మపర్వము - చతుర్థాశ్వాసము.



కైవల్యప్రాప్తికి
నై కడఁగి మహామునీంద్రు లంతర్దృష్టిం
గైకొని సేవించెదులో
కైకేశ్వరు నంతరాత్మ ననిశముఁ దలఁతున్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లుభయసైనికులును శిబిరంబులకుం జని రనిన ధృతరాష్ట్రుండు సంజయుదిక్కు మొగంబై మనవా రమ్మాఁడవనాఁ డట్లోడి యేమి చేసిరి చెప్పు మనిన సంజయుం డాకర్ణింపు మారేయి వేగినంత శాంతనవుండు ద్రోణదుర్యోధనబాహ్లికదుర్మ్మర్షణచిత్రసేనజయద్రథప్రభృతిమహారథపరివృతుండై దేవసేనామధ్యంబునం జెలఁగు దేవరాజుం బోలి మహాసైన్యంబుతో నుత్తాలతాలకేతుశోభాభిరామంబుగం గదలి కదనంబునకుం జనుదెంచె నప్పుడు. 2

—♦ భీష్ముని చతుర్థదివసయుద్ధప్రకారము ♦—

క. వారణశతమేఘావృత, మై రత్నధ్వజతటిత్ప్రభాభిహితంబై
భేరీరవగర్జాంచిత, మై రమణించెఁ గురుసైన్య మాకాశగతిన్. 3

తే. శాంతనవగుప్త మై సువిశాల మయిన, ధార్తరాష్ట్రవాహిని జగద్భయద మగుచుఁ
బాండవబలాభిముఖ మయి పఱచె వేగ, గమనమునఁ జేసి దివ్యాపగాక్రమమున.

మ. శరపాతంబు ప్రవర్ష మాయుధము లంచచ్చంచలాజాలముల్
వరభేరీనినదంబు లుర్ములు గజాశ్వస్యందనాదుల్ మహో
త్తరపక్షంబులు గాఁ దలిర్చి పృథులాభ్రంబుం బోలి యనం గౌరవే
శ్వరుసేనానివహంబు వొల్చెఁ బఱపై సంరంభశుంభద్గతిన్. 5

వ. అంతఁ గౌంతేయావరజుండు పుండరీకాక్షసారథికంబు శ్వేతాశ్వసమూహ్యంబును
గపికేతనప్రభాభిరామంబు నగుమహాస్యందనం బధిష్ఠించి ధృష్టద్యుమ్నాభిరక్షి
తంబును నదృష్టపూర్వమహోన్నతవ్యూహాభిపన్నంబును నగుమహాసేనాసమూ
హంబుతోఁ దమవారిం గూడి పేర్చి కవియుం గదలి కదనంబునేల కవతరించె నప్పు
డుభయబలంబులును వివిధవిధతూర్యంబులును సింహనాదంబులును జెలంగ రణ
రంగంబునకై రవుతు రథికుండు రథికుండు హాస్తికుండు హాస్తికుండును దారం
గికుండుఁ దారంగికుండునుం బత్తియుం బత్తియుం దాఁకి ఢీకం బాయనంత నీరువాఁ
గునందును రథంబులు విఱిగియు రథులు సారథులును దొరంగియు డెక్కెయంబులు
ముక్కలయ్యు నేనుంగులు పీనుంగు లయ్యు గుఱ్ఱంబులు గూలియుఁ బ్రాసకుంతతో
మరాద్యాయుధంబులు వితథంబులై పోయియుఁ గేయూరాంగదాదిభూషణంబులు
పొడియై రాలియు భయానకం బైనం దెరలక పురికొని నానాముఖంబులఁ బర
రంగబలంబు లోహారిసాహరిం బెనంగుచున్నంత శాంతనవుండు. 6

మ. గజయూథావృతుఁడై గజేంద్రుఁ డన వేడ్కం బంచతాలోచ్ఛ్రిత
ధ్వజుఁడై దివ్యశరద్యుతుల్ దెసలఁ బర్వన్ బాహుగర్వంబు భూ
భుజు లెల్లం గని మెచ్చ మచ్చరికలం బొల్పొందు మస్వచ్ఛనిం
ద్రజునిం గాంచి రయంబునం గదిసి పంతం బేర్పడన్ మాఱ్కొనెన్. 7

ఆ. ఇంతలోన ద్రోణ కృప వివింశతి సోమదత్తతనయు శల్య ధార్తరాష్ట్రు
లొక్కపెట్ట సైన్యయుక్తులై పైఁబడి, మాఱుకొనిరి నరుని మత్సరమున. 8

వ. అయ్యవసరంబున. 9

క. వడి వడిగ వచ్చి చిచ్చఱపిడుగట్టులు పెచ్చు పెఱిగి విప్వచ్చనిపు
త్రుఁడు తండ్రిఁ గడచి మాఱ్కొని, కడిమిం బోరాడె నంపగమి నేస్వరతోన్. 10

ఉ. ఆజ్యము వేల్వఁ బ్రజ్వరిలునగ్ని తెఱంగునఁ దేజరిల్లుచున్
సజ్యము చేసి కార్ముకము సర్వముఖంబులఁ దాన యై యనిం
బూజ్యుఁడు కృష్ణునల్లుఁ డొకపూన్కిన కిన్కఁ గోల సత్తిఱిం
బ్రాజ్యతరాస్త్రనిర్ఝరిణి వాఱఁగఁ జేసె భవద్బలంబునన్. 11

క. అభిమన్యుఁ గడచి భీష్ముఁడు, రభసమ్మున నపుడు పార్థరథముపయిన్ శ
త్రుభయంకరాస్త్రశస్త్రము, లభయుండై యేసెఁ జూప అచ్చెరుపడఁగన్. 12

చ. నడుమన వాని నన్నిటి జనార్దనమిత్రుఁడు శత్రుకోటికి
న్గడుభయ మావహిల్లఁగ గుణాక్వణనంబు దిగంతరంబులన్

బడ వడిఁ ద్రుంచి శాంతనవుపై శరవర్షముఁ బర్వఁ జేయుచున్
దడఁబడ కాతఁడుం దఱిగెఁ దద్విశిఖంబుల నెల్ల నల్లనన్. 13

క. అనురూపంబుగ వార, ట్లని సేయుచు నుండ జోదు లందఱు డెందం
బున వెఱఁగుఁ జెంది కొదుకుచుఁ, గనుచుండిరి ప్రతిమ లట్లు కనుపండువుగన్. 14

—♦అభిమన్యుఁ డశ్వత్థామప్రభృతులతో యుద్ధము సేయుట♦—

వ. అట్టియెడ నశ్వత్థామయు భూరిశ్రవుండును శల్యుండును శల్యపుత్త్రుండును జిత్త్ర సేనుండును మత్తమాతంగంబులు సింహకిశోరంబునుం బోలె నభిమన్యుం బొదివి దివ్యాస్త్రశస్త్రంబులఁ జిక్కువఱచుటయు నక్కుమారుండు దనలాఘవలక్ష్యధైర్య స్థైర్యశౌర్యంబుల దవ్వులం దుండి కని వివ్వచ్చుండు సంతసించుచు సింహనాదం బు సేయుచుండ దండిమగం డై తన్నుఁ బరివేష్టించినవారి నేవుర మార్కొని మార్తండమండలంబున కెత్తువచ్చుమచ్చున మండలీకృతకార్ముకుం డై. 15

సీ. ద్రోణనందను నొక్కతూపునఁ దూలించి, శల్యు నేనమ్ములఁ జదియ మోఁది
శలుని కెక్కియ మష్టసాయకంబులఁ గూల్చి, భూరిశ్రవుఁ డేయుభూరిశక్తి
నొక్కబాణంబున ముక్కలుగాఁ జేసి, చిత్రసేనుని నొంటఁ జదియ నేసి
మఱియు నూర్లకొలంది మద్రేశుశరములు, పయిఁ బడినన్ వాని నయిచి వాని
తే. వారువంబుల నాల్గింట వసుధఁ ద్రెళ్ళ, నేసి యయ్యేవురకు జయ్యుఁ డై చెలంగె
నపుడు నీకొడు కార్తుఁ డై యతని నోర్వఁ, జాలువా రున్నరం డని కేలు వీచె. 16

వ. అంత నాదుర్యోధనుపంపునఁ ద్రిగర్తులు మద్రులుఁ గైకయులు లోనగునిరువది వేలురథంబులవారు కృపకృతవర్మలం గూడి యభిమన్యుఁ బొదువుటయు నది యంత యుం దవ్వులనుండి కనుచున్నవివ్వచ్చుండు ఱివ్వున వచ్చి కొడుకునకుం బాసట యై నిల్చె నంత. 17

ఉ. ఇందఱుఁ జుట్టుముట్టి కడు నేర్తెఱఁ జూపుచు దివ్యబాణముల్
వందలు వేలును న్విసరి వాసవపుత్త్రుని వానిపుత్త్రునిన్
డిందుపడంగఁ జేయుడు వడిన్ వడి నార్చుచు వచ్చి పార్థుతుం
డందఱ కన్నిరూపులుగ నై చెనఁగెం బరమాద్భుతంబుగన్. 18

క. తలకడచి మొల్లమూఁకల, కలఘుపరాక్రముఁడు ద్రుపదునాత్మజుఁడు భుజో
జ్జ్వలతేజ మెసఁగ నిశిత,మ్ములు వాలమ్ములు నిగిడ్చి పోరొనరించెన్. 19

మ. చతురంగధ్వజినీసహస్రవృతుఁ డై సారించుచున్ నారినిం
గృతహస్తుం డగుపార్షతుండు భుజశక్తిం జూపుచున్ గౌతమ

క్షితిదేవోత్తముజత్రుదేశమున నేసెన్ మూఁడు వాలమ్ములన్
బ్రతిపక్షుల్ గని పిచ్చలింపఁగను భీభత్సుండు హర్షింపఁగన్. 20

తే. మఱియుఁ బదిమార్గణంబుల మద్రకులను, గలఁచి కృతవర్మచక్రగతుఁడు కార
వాత్మజుం డగుదమను శాతాయసాశుగమునఁ జా నేసి సేనాని గండుమిగిలె. 21

—◆శల్యనందనుఁడు ధృష్టద్యుమ్నునితోఁ బోర మడియుట◆—

మ. అవలన్ శల్యసుతుండు మూఁకలకు మున్నై వచ్చి పాంచాల్యునిన్
జవనం బొప్పఁగ ముప్పదింట మఱియున్ దత్సూతు నీరైదిటన్
నొవ్వులం జేయుడు పార్షతుండు కినుకన్ సూచించుచున్ వానివి
ల్లు వెసం ద్రుళ్ళిపడంగఁ దున్మి మఱి వాల్తూపుల్ ప్రయోగించుచున్. 22

ఆ. ఇరువదేనువాఁడిశరములు శలునిమై, నినిచి రథ్యములను ధునిమి పార్ష్ణి
సారథులను గూల్చి సమరకేళి యొనర్చె, ద్రుపదసుతుఁడు తనదుతోయ మలర.

మ. విరథుం డై శలుఁ డంత వాలుఁ బలకన్ వేవేగఁ గైకొంచు న
య్యరదంబున్ డిగి మింటినుండి ధర కత్యంతిక్రుధన్ రోఁజుచున్
ద్వర నేతెంచెడుత్రాఁచు నా వెఱపు దోఁపన్ వచ్చి తాఁకంగ న
చ్చెరు వొప్పన్ ద్రుపదాత్మజుండు పగిలించెం దచ్ఛిరంబున్ గదన్. 24

ఆ. శిరము వ్రయ్య లగుడు చేతినిస్త్రింశము,తోడ లోనిప్రాణ మూడిపోవు
నంతఁ బ్రేత యగుచు నతఁ డిలం బడుడు హా,హా రవంబు నీబలాళి నయ్యె. 25

చ. కొడుకటు సచ్చుటం దెలిసి కోపము తాపము నేపు మీఱ శ
ల్యుఁడు వడి నేగు దెంచి నిశితోగ్రశరత్రయ మూని పార్షతుం
దొడిబడి మత్తవారణముఁ దోత్త్రమునన్ విదళించులాగునన్
జడియఁగ నేసె నప్డు కొనసాఁగె మహాసమరంబు వారికిన్. 26

వ. అనిన ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 27

చ. కటకట దైవమే పురుషకారముకన్న వరంబు కాని దో
నిటఁ గలవారి వార లెటు లేర్చఁగఁ జాలుదు రీవు నెప్డు న
చ్చొటివిజయంబు చెప్పెదవు చొప్పడఁ జెప్పవొ కప్పు డేని యి
చ్చటివిజయం బిఁ కేమని ప్రసంశ యొనర్చెద నోయి సంజయా. 28

క. పిఱుసన కందఱు కడిమిన్, మెఱయుదుఁ బోరాడుచుండ్రు మిసిమింతులు గా
రెఱఁగికొనఁ బాండుపుత్త్రులుఁ, నెఱిదప్పిరి నాకొమాళ్ళు నెగు లే మందున్. 29

తే. మనసుయోధనుకతమున వినఁగ వలసి, వచ్చె నెన్నని బన్నముల్ వారియోటు
పాటు మావారివిజయ మేనాఁటి కైన, విన వెరవు గందునో సూతతనయ! చెపుమ.

తే. పిదప దుర్యోధనునిఁ జూచి భీమసేనుఁ, డిపుడ యని తీర్చెదఁ జెప్పెద నే నటంచు
గదను గొని డిగ్గి రథము రాఁ గని భవత్కు,మారు లెల్లరుఁ బాఱిరి పోరు దక్కి. 39

వ. అప్పుడు. 40

—♦ మాగధుండు గజసేనతో భీమసేనుం దాఁకి యోడుట ♦—

ఉ. మాగధుఁ బిల్చి నీకొడుకు మారుతిఁ దాఁకుము నీవు చేవ నై
నీగజసేనతో వెనుక నిల్తును నే నని పల్కి వానినిన్
వేగమ పూన్చి తాను బదివేలగజంబులతోడ వెన్నడిన్
రాఁ గని భీమసేనుఁ డతిరంహముగాఁ బరవళ్లు ద్రొక్కుచున్. 41

ఉత్సాహము. కొండవోలె నున్నగదను గొని లయాంతకుండు నా
దండితారిమండలుండు దా విపక్షకోటికిన్
గుండె లవియ నార్చు లెసఁగఁ గుంజరాలిపై మృగేం
ద్రుండు నాఁగఁ గవిసి కూలఁ ద్రోచె నెల్లమూఁకలన్. 42

వ. అంత సౌభద్రుండును నకులసహదేవులును ద్రౌపదేయులును ధృష్టద్యుమ్నుండును
నమ్మహాబలనందనునకుం దోడు సూపి నానావిధాయుధంబుల గజయోధుల నుత్త
మాంగంబులఁ దుత్తుము రై పడం జేయుచుండి రప్పుడు. 43

క. ఇలఁ బడుమావంతులశిరములుఁ గాళ్లును జేతులు న్విభూషణములు మి
క్కిలి యై దివంబునుండియు, యొలసినపృథులాశ్మవృష్టి యో యనఁ నొప్పెన్. 44

క. కరులయుఁ గరియోధులయున్,శిరములు దెగి ద్రుపదసుతునిశితశరములచే
గిరిశిరమునుండి వ్రాలెడు,తరుచయముం బోలి కూలె ధరణికిఁ దఱుచై. 45

శా. ఆలో మాగధుఁ డేచి మూఁకమొగ మై యైరావణం బో యనం
జాలం బొల్చెడుగంధసింధురము నా సౌభద్రుపైఁ దోలుడున్
బోలం జూచి యతండు శాతవిశిఖంబుం బూని యొక్కండ భే
ట్పాలంబుం గుఱి చేసి యేసి మఱియున్ బాహాబలప్రౌఢిమన్. 46

క. ఆనరనందనుఁ డొండొకఁ, డూని శరము మగధనాథునుర మేయఁగ వాఁ
డేనుంగు నెక్కి నట్లే, పీనుం గై పీన్గుమీఁదఁ బెంపఱి కూలెన్. 47

చ. భిదురముఁ బట్టి చట్టుపల బిట్టగలించెడునింద్రుఁడో యనన్
గుదెఁ గొని భీమసేనుఁ డిభకోటుల నిల్చి రథాళి రాల్చి పెం
పెదవులఁ జీల్చి తుండముల ప్రీల్చి పదంబులు డుల్చి కుంభముల్
చిదురులు గాఁ బగిల్చి శయిసేసె వసుంధరఁ బీన్గుపెంటలన్. 48

క. తల ద్రెవ్వ నెత్రు గ్రక్కుచు, నిలఁ గూలినమదగజంబు లెల్లం బ్రోవై
బలునగము లట్లు చూపఱఁ, దలఁపించెన్ భీముఁ డనికిఁ దవిలినవేళన్. 49

చ. గజరుధిరార్ద్రమైనగదఁ గైకొని నెత్తురుఁ గ్రుంగియున్న సా
వ్రజమును మజ్జయున్ సకలవర్ష్మమునందును జేరి యూరువో
నజితుఁడు దండహస్తుఁ డగునంతకునట్లుఁ బినాకపాణియై
ప్రజ కగునుగ్రునట్లును బ్రభంజనసూనుఁడు గాన నొప్పెఁ బో. 50

మ. మగధాధీశుమతంగజౌఘమున నీమాడ్కిం బ్రవర్తించుచుం
దగి భీముండు పరేతభూతలమున న్నాట్యంబు గావించురు
ద్రుగతిం బోలఁగఁ దోఁచియున్ గజతతిం ద్రుంగించె గోపాలుఁడు
చ్చగతిం బర్వఁగ నాలఁ దోలుపగిదిన్ శౌర్యంబునం దోలియున్. 51

క. శరముల గుదెలం దెగినవి, తిరుగుడువడినవియుఁ గాక తెరలినయవి సిం
ధురములు వాతాహతిఁ జె, చ్చెరఁ దూలుమొగిళ్లు నాఁగఁ జెరచెరఁ బఱచెన్. 52

క. మాగధునిగజము లాగతిఁ, వీఁగినఁ గని నీసుతుండు వెఱచఱచి వడిన్
మూఁగుఁడు తూఁగుఁడు భీముని, నాఁగుఁడు రేఁగుఁడు భుజాబలాతిశయమునన్. 53

వ. అని నీపుత్త్రుండు పురికొలిపిన నాగాశ్వరథపదాతిస్ఫీతం బగుసైన్యంబు దైన్యంబు దక్కి పర్వంబునఁ శారావారంబు పోలె ఘూర్ణిల్లుచుం బొంగి పొరలి మరలి మరుస్స్యందనుం దాఁకుదెంచి వీఁకం జూపుటయు నతం డేపుమిగిలి చెలియలికట్ట పోలె వాని నెల్ల నాఁగి యనుజులుం దనుజులున్ బావలున్ మఱఁదులుం దనకు బాసటగాఁ బర్వ గదాపర్వంబు సేయుచు రథబృందంబులం గూల్చుచు నేనుంగుల రాల్చుచు హయంబుల నేర్చుచుఁ గాల్వురఁ గడతేర్చుచుఁ గార్చిచ్చు గానసాంతరంబులంబోలె మన సైన్యంబుల నేర్చుచుండ వానిమునుము మృత్యుదేవత కాటపట్టయ్యె నట్టియెడ.

మ. యమదండోపమ మున్న తాశనిసమం బై దావవైశ్వానర
క్రమ మొప్పం బవమానసూనునిగదాగ్రం బుగ్రమై వెల్గుచున్
శమముం దప్పి యొకొక్కపాటున శతాశ్వస్యందనేభంబులన్
సమయం జేసెను వీరనృత్యమునకై సంగ్రామరంగంబునన్. 55

—♦ భీష్ముండు భీమసేను నెదిరి పోరుట ♦—

క. క్షయకాలకాలుఁడో యన, భయదం బగుచాప మూని భవదీయచమూ
చయ మెల్ల నొల్లఁ బోవన్, రయమునఁ జనుధర్మజావరజుఁ గని యెదుటన్. 56.

చ. అమరనదీసుతుం డెడఁద నల్క జనింప శతాంగ మభ్రఘో
షమున నభంబు దీటుకొనఁ జల్పుచు నుండఁగ విల్లు బాణవ

ర్షము గురియంగ మాఱటపురందరుఁడో యనఁ దా నెసంగుచున్
సమయ మెఱింగి తాఁకె భుజసారఘనాదయు నావృకోదరున్. 57

తే. వ్యాత్తముఖుఁ డగునంతకునట్లు మీఁది, కడరి వచ్చెడునత్తాటిసిడమువాని
దవుదవులఁ జూచి భీమాగ్ని రవిలి వాని, వీఁకఁ దాఁకి యెదిర్చె దోర్వీర్య మెసఁగ. 58

సీ. ఆక్షణంబునఁ గృష్ణునను జుండు వడి వచ్చి, మాఱ్కొని భీష్ముని మార్గణాలి
నొనేసి నీసుత సేనాసమూహముం, గంపింపఁ జేసె నక్కాలమందు
వాని మాఱ్కొనఁగ నెవ్వారునుం జాలక, చీకాకుపడుచున్న చెద్దిఁ గాంచి
మించి యలంబుసుం డెంచి పృషత్కముల్, పది శినివీరు మైఁ బ్రిదుల నినిచె

తే. నినిచినన్ నొచ్చి శినినప్త కనుల నిప్పు, లొలుక నాల్గమ్ములన్ వానిఁ దొలఁగ నేసి
కౌరవబలంబు లెల్లఁ జీకాకుపడెడు, నట్లు కావించి మించి పెల్లార్చి పేర్చె. 59

తే. పట్టపగలింటిభాను నిభాతి మెఱయు,వాసుదేవానుజుని కోప కోసరిల్లి
తావకయుబలం బున్నతఱిని సోమ,దత్తపుత్త్రుఁడు సాత్యకిం దాఁకుదెంచి. 60

ఉ. తొమ్మిదిమార్గణంబులను దోత్త్రములం గరి నొంచునట్లు క్రో
ధమ్మున వాని నొంచుటయు దర్ప మెలర్ప నతండు పెక్కుబా
ణమ్ముల సోమదత్తిమెయి నాటి మహీక్షితు లెల్లఁ జూడ శౌ
ర్యమ్మున నాఁగెఁ దమ్ములును రాజును వానికిఁ దోడు సూపఁగన్. 61

వ. పాండవులును సాత్యకికిం దోడుసూపి రప్పుడు. 62

—◆ భీమసేనుఁడు విజృంభించి జలసంధాదికురుకుమారులం జంపుట ◆—

శా. కిమ్మీరాంతకుఁ డంతఁ గ్రుద్ధుఁ డగుచున్ గేలం గదాదండమున్
సమ్మోదమ్మునఁ ద్రిప్పికొంచు మిగులన్ శౌర్య మ్మవార్యమ్ముగా
నమ్మాడ్కిం దలపడ్డ నీతనయులన్ హాసించుచుం గాంచి నే
త్రమ్ముల్ కెంపున సొంపు మీఱఁ దెరలం దాఁకెన్ విజృంభించుచున్. 63

తే. వేనవేలరథంబులు వెన్నుదన్నఁ, గ్రోధతామ్రాక్షుఁ డై సందకుండు నీదు
నందనుఁడు కంకపత్త్రముల్ నాట నేసి, పోరె భీమునితోఁ గొంత ప్రొద్దువోవ. 64

క. అప్పుడు దుర్యోధనుఁ డా,చొప్పునఁ జెలరేఁగువాయుసూనునిఁ గని లో
నొప్పక తొమ్మిదిశరముల, నొప్పించెం గాఁడ నేసి నూల్కొని యురమున్. 65

వ. అట్లు దుర్యోధనార్దితుం డగువృకోదరుం డంతలోనం దనరథం బధిష్ఠించి విశోకుం
జూచి యి ట్లనియె. 66

ఉ. వీరు మహారథుల్ వినుతవిక్రము లెల్లరు నన్ను నొంపఁ గాఁ
జేరినవారు వీరి నొకచీరికిఁ గైకొన, కేను రాచవా

రారయ నొక్క ప్రేలుమిడి నందఱ నంపెదఁ గాలుప్రోలికిఁ
బోరున నీవు శీఘ్రగతిఁ బోవఁగఁ దోలుము వాఁపురమ్ములన్. 67

వ. అనిన నట్లు కాక యని విశోకుండు వలిరయంబున రథంబు వోవ నిచ్చె నంత భీమసే
నుండును. 68

తే. నిశితములు వాలుతూపులు, నిగుడఁ జేసి, పదిట దుర్యోధనుని మూఁట బాహుమధ్య
మ్మునను నందకు నొనేసి మొనసి యార్చె, నీసుతునిబలంగములకు నెగులు దోఁప. 69

సీ. అంత దుర్యోధనుం డఱువదిసునిశితాం, బకముల బక్కనైరి బడల నేసి
మూఁడమ్ముల విశోకుఁ గాఁడ నేయుచు మఱి, మూఁట భీముని చేతిమేటివిల్లు
పిడికట్టునం దెగి పడునట్లు గావించి, పరిహసించుచు నవ్వెఁ బక్కు మనఁగఁ
దననొవ్వ చూడక భీనసాది నొచ్చుట, కలిగి భీముం డొండువిలు గ్రహించి

తే. త్రుంచె వడివడి నొకతూపు దొడిగి నీదు, కొడుకు విల్లది విడనాడి కడక నతఁడు
మూఁఱువిలు పూని మృత్యుసమప్రభ మగు, నాశుగమున భీమునియురం బాఱ నేసె.

ఉ. గాఢతరాస్త్రవిద్ధుఁ డయి గాడ్పుకొమారుఁడు మూర్ఛ మున్గి లోఁ
బొర్షిమ దప్పటన్ రథముపైఁ బడినంతటిలోనఁ బాండవ
వ్యూథము సంచలించుడు నరోద్భవముఖ్యమహారథుల్ క్రుధన్
బాధము గా భవత్సుతుని బాణచయంబున ముంచి, రెంచఁగన్. 71

వ. అంతటిలోన. 72

చ. వడముడి సేదదేఱి తనపైఁ వడిఁ జూపినరాజరాజుపై
నడరి మహాబలుం డనఁగ నై బలిమిం గొని మూఁట నేసినన్
గడువడి నొవ్వ నేసి తనకంటికి ప్రేఁగయి యున్నశల్యునిం
బడలుపడంగఁ జేసె నొకపట్టున నిర్వదియైదుతూపులన్ 73

క. నొవ్వడర మద్రభూవిభుఁ, డవ్వాయుతనూజుబాఱి కగ్గము గాక
చ్చివ్వకు వెలియై చనె న, ప్డివ్వారికి భీముఁ డనిన నెడ రయ్యెఁ గడున్. 74

వ. అప్పుడు మప్పిరి యైనభీమసేనునిపరాక్రమంబు సైఁపఁ జాలక నీకొడుకులు సేనా
పతి సుషేణుఁడు జలసంధుఁడు, సులోచనుఁడు నగ్రుఁడు భీమరథుఁడు భీముఁడు
వీరబాహుఁడు నలోలుపుఁడు దుర్ముఖుఁడు దుష్ప్రధర్షుఁడు వివిత్సుఁడు వికటుఁడు
సముఁడు ననువారుపదునల్వురును క్రోధసంరక్తలోచను లై వానిం బొదివి
నానావిధప్రదరంబులు గుప్పించి నొప్పించుటయును. 75

తే. కదలి పశుమధ్యమున వృకం బన వృకోదరుండు సెలవులు నాకుచు దండికెక్కి
నిడుపనిం బట్టఁ బైనుండి పడెడుగరుడి,కరణి వారలపైఁ బడి యురవడించి. 76

సీ. సేనాపతిశిరంబు చిదిమి యొక్కక్షురప్రమున జలసంధుని మూఁటఁ [illegible]
యొక్కొక్కశరమున నుగ్రునిశిరము సు, షేణునిశిరమును జిదుక వైచి
వీరబాహుని సాశ్వసారథిధ్వజముగాఁ, జక్కాడి డెబ్బదిసాయకముల
భీము నొక్కమ్మున భీమరథున్ మఱి,యొక్కభల్లంబున నుక్కుమడఁచి
తే. యొక్కట సులోచనునిఁగూల్చి యుక్కుమిగిలె,నంతహతశేషులగువార లాపమీఱ
తనయునకు జంకి ప్రాణముల్ మనసుఁజేసి, పోరు విడనాడి పాఱిరి దూరముగను. 77
వ. అంతశాంతనవుండుమహారథులనందఱం జేపిచియెలుంగురాల్పడంబిల్చుచు నిట్లనియె.
మ. అనిలప్రోద్భవుఁ డుద్ధతిం దనరి కల్పానల్పవైశ్వానరుం
డన నుగ్రాకృతిఁ దాల్చి మండుచు మహీశాత్మోద్భవవ్రాతముం
దనబాణార్చికి వేల్మిగాఁ జలుపు చున్నాఁ డిట్లుపేక్షించుటల్
చనునే తాఁకుఁడు వీని నిందఱును మీశౌర్యం బవార్యంబు గన్. 79
క. అని పురికొల్పిన న్వారు, మనసైనికు లొక్కమొగిన మాఱొక్కనిరి మరు
త్తనయుని వివిధాస్త్రంబుల, నిగుచుచు భగదత్తుఁ డపుడు నిర్భీకుం డై. 80

—♦ భగదత్తుఁడు భీమసేనునిం దాఁకి మూర్ఛిల్లఁ జేయుట ♦—

మ. మదమాతంగము నెక్కి యుక్కు మెఱయం బ్రాగ్జ్యోతిషాధీశుఁ డ
మ్మదనాగాయుతశక్తియుక్తుని వడి న్మార్కొంచుఁ గాఁకొంచు నం
బుదముల్ భాస్కరుఁ గప్పినట్లు నిశితంబుల్ శాణజాలంబు లు
న్మదలీలం బొదలించి కప్పెఁ దెలియన్ రా కుండన క్లింతయున్. 81
మ. అభిమన్యుప్రభృతుల్ తృతీయగతి కత్యంతాగ్రహావిష్టులై
రభసం బేర్పడ నప్డు మాఱుకొని యాప్రాగ్జ్యోతిషాధీశుపై
నభిషేకించుచు బాణవర్షమున వ్రయ్యల్వాఱిపోఁ జేసి మే
నిభరాజంబును నొంప నయ్యదియు నెంతేని న్విశీర్ణాంగమై. 82
క. నిలువెల్ల నెత్తుమొత్తము, సెలయేళ్ళయి పాఱుదేఱఁ జిత్రమరీచి
జ్వాలనపరిస్ఫూర్తం బగు, జలదం బన నొప్పె నట్టిసమయమునందున్. 83
క. పురికొలుపన్ భగదత్తుఁడు, కరి కాలాంతకవిధంబు గైకొని గాఢ
త్వరఁ జరణన్యాసమునన్, ధరణీతలం బద్రువ మెట్టి తరలిచె బలమున్. 84
తే. దాని కోపక పాండవదళమునందుఁ, జెయ్యువాలం దక్కి విలుకాఱు చిన్నవోయి
చూచుచుండంగ నీకొడు కేచి భీము,సేనువక్షముఁ బగిలించె శితశరమున. 85
క. వడముడిపేరురమునఁ బడి, బెడిదపునారసము దూసి వెడలినదానన్
గడు సోలి కేతుదండము, వడి నూఁతగఁ గొనియె నార్చె భగదత్తుండున్. 86

—◆ ఘటోత్కచుండు మాయాలంబున భగదత్తాదుల నోడించుట ◆—

చ. కనలి ఘటోత్కచుండు తనగాదిలితండ్రికి నట్లు గా మనం
బున సయిపంగ లేక మునుమున్న కడంగి యదృశ్యరూపుఁ డై
ఘనతరమాయఁ గైకొని యొకానొక యింతటిలో మహేంద్రుఁడో
యనఁ గన నొప్పె నప్పు డట నభ్రమువల్లభు నెక్కి యొక్కటిన్. 87

వ. అంతలో వానియనుచరు లగున క్తంచరులు మువ్వురును దిక్పాలు రై వామనాంజనమహాపద్మంబు లనుమూఁడుదిఙ్నాగంబుల నెక్కి తన్ననుసరించిన మించి మహేంద్రుం డై నఘటోత్కచుండు తనయైరావణం బతిరయంబున నడపుచు నాగేంద్రవాహుండై గంధమిగిలియున్న ప్రాగ్జ్యోతిషేంద్రుం దాఁకి బాణవర్షంబుగురియుటయు.

శా. మాయానేకపరాజ మాగజముపై మాత్సర్యముం బూని తే
జోయుక్తిం గదియంగ నేగి చతురస్త్రోగ్రదంతాయుధ
వ్యాయామంబులఁ గ్రుచ్చి నల్గడల నొవ్వం జేయఁ బ్రాగ్జ్యోతిషా
గ్రీయేభం బశనిస్వనం బనుగతిం గీపెట్టె నప్పట్టునన్. 89

వ. అయ్యార్తస్వరంబు విని భీష్ముండు ద్రోణదుర్యోధనులం గాంచి యిట్లనియె. 90

మ. భగదత్తుండు హిడింబినందనునితో బాహాబలం బేర్పడం
దగిలెం గయ్యము గర్కశంబ యగు నానక్తంచరుం డుగ్రుఁ డీ
జగతీశుం డతికోపనుం డిరువురుం జాగింత్రని స్వేఁగ రె
ట్లగునో కాని వినంగ వచ్చు నట భద్రారావ మత్యర్థ మై. 91

మ. ఇట నార్తస్వరముల్ గజేంద్రువలనన్ హెచ్చిల్లఁ గాఁ జొచ్చె న
చ్చటి కాభూధవుఁ గావఁ బోవఁ దగు నాచందంబు గాకున్న నొ
క్కటి యాభక్తుఁడు సత్కులప్రభవుఁ డుం గానన్ క్షణార్ధంబు నే
నిటు లాలస్యము సేయుచుండఁ దగ దెంతే నైశముం బూనుఁడీ. 92

సీ. అని వచించిన ధనురాచార్యముఖ్యులు, భగదత్తునికిఁ దోడుపడఁగఁ జనిరి
వారిఁ గన్గొని పాండవజ్యేష్ఠునిం గూడి, వచ్చెఁ దద్బలములు పెచ్చుపెరిగి
తనబలంబులరాకఁ గని ఘటోత్కచుఁ డార్చె, నశనివిస్ఫోటమ ట్లయ్యె నులివు
నలిరేగివాని దంతావళంబులు బృంహితములతో నీసైన్యతతులఁ గూల్చె
తే. నింతయుం గని వెండియు శాంతనవుఁడు, గురున కను నిప్డు వీనితో దురము సేయ
రాదు సంజ వడన్ వచ్చె రాక్షసులకు, బలము పెచ్చుటకుం దఱి తెలియవచ్చు. 93

చ. నిజబలమున్ నిశాబలము నెయ్యురతోడుబలంబు గల్గ నీ
రజనిచరుం డజయ్యుఁ డయి క్రాలెడు వజ్రధరుండు వచ్చినన్

నిజముగఁ జెప్పెదన్ గెలువ నేరఁడు తాఁ గృపుఁ డెల్ల డస్సె రీ
ప్రజలు దురంబు నేఁడు నిలుపం దగు వేగిన వత్తు నాజికిన్. 94

వ. అనిన నీవా రెల్లరు ఘటోత్కచభయార్దితులు గావున నట్ల యగుం గావుత మని యుపాయంబున సేనలం దిగికొని శిబిరంబులకుం బోవుటయుఁ బాండవబలంబులును భీమసేనఘటోత్కచులం బురస్కరించుకొని పొగడుచు సింహనాదంబులును శంఖనాదంబులును జెలంగ సంతసించుచు నిజశిబిరంబులకుం జని నాఁటిరేయి పరమోత్సాహంబునం దేలుచుండిరి దుర్యోధనుండు భ్రాతృవధంబునం జేసి వ్యసనకర్శితుండై దీనుండును శోకసంతప్తచిత్తుండు నై వగచుచుండె నని చెప్పిన ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 95

—♦ ధృతరాష్ట్రుండు పాండవవిజయము విని విచారించుట ♦—

చ. అమరులకున్ సుదుష్కరము లైనపనుల్ పొనరించు పాండవుల్
సమరమునందు నాసుతులశౌర్యము నొప్పరికింప రన్న నా
దుమనమునం దిఁ కెట్టిగతి తోఁచెడునో యని సాధ్వసంబు దుః
ఖము నగు నాశరీరమును గాలిచెడి న్విదురోక్తు లక్కటా. 96

తే. దైవయోగంబుఁ జేసి యాతండు చెప్పినట్లుగా నగపడుచుండె నకట వార
లోహటింపక భీష్మముఖ్యులకుఁ గడిమిఁ, జూపుచుండిర సంగరక్షోణి నిపుడు. 97

ఉ. పాండవు లిట్లజయ్యు లయి భాసిలుచుంటకు వార లేతపం
బుండిరొ యేమి మంత్రముల నొందిరొ యెట్టిజపంబు సేసిరో
నిండి నభంబునం దెప్పుడు నిల్చి నశింపనిచుక్కలట్టి దై
మెండుగ వెల్గుచుండె రొకమిత్తియు లే కది యేమి సంజయా. 98

సీ. అనిలోన నాపుత్రు లట్లు పాండునిపుత్రు,లును వధ్యులే కదా కనుఁగొనంగ
మాటిమాటికి వారె మనవారిసైన్యంబుఁ, జెగ నేయుచుండుట దెలియవచ్చు
దైవంబు దారుణదండంబు నామీఁద, నే పడ వైచిన నెగులు దోఁచె
నీశోకసాగర మీఁది పారము నొంద, నోప నైరణ వుట్ట దుల్లమందు

తే. భీమసేనుఁడు గాంధారిబిడ్డలకును, కాలమృత్యుస్వరూపుఁడు కలన వాని
నోర్చి నాపుత్రకులఁ బ్రాణ నుండినట్టి, వీరు నొక్కనిఁ జూడంగ నేర నకట. 99

చ. తెలియఁగఁ జెప్పు మట్లు వెనుదీసి బలంబు వితాకు వడ్డఁ గ
న్నులఁ గని మాసుయోధనుఁ డనూనగతిం బొనరించె నెద్ది భీ
ష్ములు గురుగౌతముల్ సుబలసూతి వికర్ణ జయద్రథాదియో
ధులు తమ కెట్టినిశ్చయముతో నవు డుండిరొ డాఁప కంతయున్. 100

వ. అనిన నంతయుం జెప్పెద నవహితుండ వై వినుమని సంజయుం డి ట్లనియె. 101

ఉ. మాయలు మందులుం మఱియు మంత్రము లెవ్వియు లేవు వార ల
న్యాయముగా మెలంగుటకు నాస యొనర్పరు కీర్తికాము లై
యేయెడ ధర్మమే జయము నేర్పడఁ జేయును నారి కేదెసం
బాయదు ధర్మ మా దెసన పాయక యుండు జయం బజస్రముం. 102

ఉ. నీకొడుకుల్ దురాత్ము లవినీతులు పాపరతుల్ నికృష్టులుం
జేకొని హీనకర్మములు చేయుచు నుండిన దాన నోర్వమిం
గైకొను చుండ్రు నీచులు నికారము లెన్ని యొనర్చినం మఱిం
గాఁకకుఁ గాక మైత్రి కయి కార్య మొనర్చిరి వారు కూరిమిం. 103

తరువోజ. అది గణింపనివాఁడ వైతి నీపుత్రు లా పాప మిట్టుల యయ్యెఁ గింపాక
సదృశ మై దానిని సహబంధుమిత్రజనుల కై నీవు నీజ్ఞాతులు సుతులుఁ
బడ నైన ననుభవింపక పోరు నీకుఁ బలుమాఱు హితము మంచి పలికితి మేము
విదురుండు ద్రోణుండు భీష్ముండును దాని వినఁగ నొల్లవు నీవు వెఱఁగ వై యపుడు. 104

తే. సుతులమతమందుఁ బడి నీవు కలి మెఱుంగ, కాఁడఁ బాండవు లోడెద రని తలంచి
చపలుఁ డగురోగి పథ్య మౌషధము వోలె, నాప్తవాక్యము విన కిట్టు లైతి వకట.

వ. కుఱియుం బాండవులజయంబునకుం గలకారణం బడిగితివి గావున నే విన్నవిధంబు
నం జెప్పెద నాకర్ణింపు మానాయంసమయంబున నట్లు శిబిరంబులకుం జని నీకొ
డుకు భ్రాతృవియోగదుఃఖంబున సముద్వేగహృదయుం డై నిశాసమయంబునఁ
బితామహునిపాలికిం జని యి ట్లనియె. 106

—♦ దుర్యోధనుఁడు భీష్మునిశిబిరంబునకుం జని విచారించుట ♦—

తే. ఈవు ద్రోణుండు మద్రమహీశుఁడు కృతవర్మ కృపుఁడును భూరిశ్రవసుఁడు ద్రౌణి
యును వికర్ణుఁడు హార్దిక్యుఁడును సుదక్షిణుండు భగదత్తుఁడును జూడ నండమగలు.

చ. మగఁటిమిఁ జాలి యుండిరి సమస్తజగంబుల కట్టి వైన ని
ష్ఠగుననిఁ బాండవేయులసమక్షమునం దొకయింతయేని యుం
దగుదు రనంగ రా దరులు దర్పము నూఁపఁగ రేచు హేతువో
తగిలెను సందియంబు మది దానిని నాకెఱుఁగంగఁ జెప్పవే. 108

తే. అనుడు శాంతనవుం డిట్టు లనియెఁ దొల్లి, నేను బలుమాఱుఁ జెప్పితి నీకుఁ బాండు
సుతులతోఁ బొత్తు మే లని మతిఁ దలంచి, దానిఁ గైకొన వైతివి తప్పి పథము.

ఉ. ఇప్పటి కైన నీయెడ నొకించుక శాంతి వహించి నాహితం
బొప్పు నటంచు నెంచి సమయోచితభంగి ప్రసంగ వారితోఁ

దప్పక సంధి చేసికొని ధాత్రి సుఖంపుము బంధుకోటితోఁ
జెప్పితి వారితో నెదిరి జిష్ణుఁడు నేనియు నోడు నాజులన్. 110

క. పాండవుల గెలుతు నే నని, యుండకు మిఁక వారి గెలువ నోపవు జగముల్
చండప్రభావుఁ డగువిష్ణుం డక్కడఁ బ్రాపు గలఁడు సూవైతలంపన్. 111

వ. పురాణగీతం బయిననారాయణప్రభావంబు నాకు మహామును లెఱింగించిరి దానిం
జెప్పెద నవహితుండ వగుము. 112

—♦భీష్ముఁడు దుర్యోధనునకుఁ బురాతనేతిహాస మెఱిఁగించుట♦—

తే. గంధమాదనమునఁ దొల్లి కమలభవుఁడు, కొలువ దేవర్షులోకనాఁడు కొలువుదీరి
ధ్యాననిశ్చలచిత్తుఁడై తనరి కాంచె, దివి వెలుఁగువిమానమ్మునఁ దివురుహరిని. 113

వ. కాంచి యెల్లవారిం గూడి లేచి ప్రాంజలి యై సేవించి యి ట్లని ప్రార్థించె. 114

ఆ. విశ్వ ! విశ్వమూర్తి ! విశ్వావసూ ! విశ్వవేద్య ! విశ్వకర్మ ! విశ్వనాథ !
విశ్వవిజయ ! విశ్వవేశ్మ ! విష్వక్సేన !, వాసుదేవ ! నీకు వందనంబు. 115

క. జయజయ యోగపరావర!, జయ సర్వగుణోపపన్న ! జయ విశ్వవిభూ!
జయ విశ్వదిగీశార్చిత!, జయ సర్వజగన్నివాస! జయ విశ్వేశా. 116

సీ. నీపదంబులు భూమి నీశిరంబు నభంబు, నీభుజంబులు దిక్కులో భుజిష్య !
నీశరీరము సురానీకము నీచక్షువులు సూర్యచంద్రులో సలలితాత్మ !
నీతేజ మనలంబు నీశ్వాస మనిలంబు, నీనెఱుల్ నగము లోనీరజాక్ష !
నీస్వేద మప్పులు నీశ్రుతు లశ్వినుల్, నీనాల్క వాణి యోమానివర్య !
తే. నీబలంబు తపంబు నీనిర్మలాభ్యంజంబు కర్మంబు సత్య మై చను మహాత్మ !
నీప్రమాణము నీశక్తి నీమహత్వ, మెఱుఁగ రెవ్వరు యోగయోగీశ్వరేశ. 117

క. నీసంస్కారము నిష్ఠయు, భాసిల్లుఁ శ్రుతు లనంగఁ బరమేశ్వర ! నీ
చే సతతము నిలుపం బడు, నీసచరాచరజగంబు లెల్ల మహాత్మా. 118

చ. నిరతము భక్తియుక్తు లయి నిన్ను భజించి సమాశ్రయించి ని
ర్జరులును యక్షరాక్షసులుఁ బ్రస్తుతి కెక్కుచు నుందు రేను నీ
గురుకరుణాకటాక్షమునకుం గుదు రై సచరాచరంబు లై
పరఁగెడువిష్టపంబులను బర్వఁగఁ జేయుచు నుందు నీశ్వరా. 119

సీ. సర్వేశ్వరేశ్వర ! సర్వభూతములకు, నేతయు గతియును నీవ కావె
నీప్రసాదంబున నిర్భయులై విబుధులు వొల్చెదరు భూమి లలరు చుండు
నేను నీవలన విన్నిర్మింపఁబడితి నీ, బ్రహ్మర్షు లగ్గించి ప్రబలు చుందు
నీయందు సర్వంబు నిలిచి యుండును లోకహేతు వీ వని విప్రు లెంచుచుందు

శ్రీపతి వారికిఁ బలము చేకుఱఁ జేయు ననిఁ జయం బిడుఁ
గ్రాపగు శ్రేయ మిచ్చు యదువంశభవుం డయి సర్వసేవ్యుఁ డై. 128

క. నావుడు దర్యోధనుఁ డను, నావసుదేవాత్మజుం డనంతమహాత్వ
వ్యాప్తిష్ఠుఁ డంటి వాతని,చేవఁ బ్రతిష్ఠయును వినఁగఁ జేసితి మనముల. 129

వ. అని యడిగిన భీష్ముండు వెండియును. 130

సీ. పురుషోత్తముఁడు మహద్భూతంబు దైవత,దైవతం బావాసుదేవుకంటెఁ
బరముఁ డొక్కఁడు లేడు పరికింప నద్దేవు,మాయ యనిర్వచనీయ మతఁడు
తొలిదొల్త సృజియించె జలము లందు శయించి, యోగనిద్రాసక్తి నుండి వెనుక
మొగమునం గిలియు మొగిఁ బ్రాణమున గాలి,మది వాక్కృతులఁ జేసి మఱియుసర్వ

తే. భువనములు దేవగంధర్వముఖులతోడ, సలిపి జనులకుఁ బుట్టువు చావుఁ గలుగు
నట్లు గావించి ధర్మజ్ఞుఁ డై ప్రపంచ, కర్త యై స్వయంప్రభు వయి క్రాలుచుండు.

తే. భూతభవ్యభవిష్యముల్ ప్రీతిఁ జేసి, బొడ్డునఁ బ్రహ్మదేవునిఁ బుట్టఁ జేసి
భూతముల కాది సృజియించె భూరితేజుఁ, డైనసంకర్షణుని నతం డాద్యుఁ డగుచు.

వ. మఱియు నప్పురాణపురుషుండు శేషునిఁ సృజించిన నతం డనంతుం డై భూభారంబు వహించె నవల మధుం డనుమహాసురుండు తనకర్ణరంధ్రంబునుండి పుట్టి పరమేష్ఠికిం గీడు గావింప నద్దేవుండు వానిం దునిమి మధుసూదనుం డయ్యె మత్స్య కూర్మ వరాహవామనాద్యవతారంబు లాతండు లోకావనార్థం బెత్తియున్నవాఁ డన్నారాయణుండే ప్రాణికోటులకుం దల్లియుఁ దండ్రియు నై యున్నవాఁడు వానికన్న నన్యం బెద్దియు లేదు వానిముఖంబునుండి విప్రులును బాహువులనుండి క్షత్రియులు నూరువులనుండి వైశ్యులును బాదంబులనుండి శూద్రులును బుట్టిరి పర్వంబులందా సర్వేశ్వరు నారాధించినవారి కుత్తమపథంబు సిద్ధించు వానియనుగ్రహంబు వడసినవారికిఁ బుణ్యలోకంబు లక్షయంబు లై యుండు నాలక్ష్మీశ్వరు నాశ్రయించినవారికి భయమోహశోకంబు లుండవు కావుననే యుధిష్ఠిరుం డాకృష్ణు నాశ్రయించె నీవు నమ్మహానీయమూర్తి నాశ్రయించి సేవింపు మాపురుషోత్తముండు లోకభావనుండును భావజ్ఞుండు నైన దేవదేవేశ్వరుం డని నారదుండును భూతభవ్యభవిష్యంబు లెల్ల జనార్దనుం డని మార్కండేయుండును యజ్ఞంబును యజ్ఞపురుషుండును బురుషోత్తముండ యని ద్వైపాయనుండును సర్వభూతంబులకును స్రష్ట సర్వేశ్వరుం డగుహరి యని యంగిరసుండును దేవతలు దేవదేవువాక్కులం బుట్టిరని దేవలుండును వాక్రుచ్చిరి సర్వలోకంబులును దామోదరుని సర్వాంగంబుల సంజనించె నని మహాత్మును లనేకులు చెప్పిరి సర్వయోగంబులకుం

గతి మాధవుండే యని సనత్కుమారప్రముఖులు వాకొని రని చెప్పి భీష్ముండు
వెండియును. 133

మ. నరనారాయణు లెవ్వ రేమిటికిఁ గల్గన్ జన్మించిరో యంచు నీ
వేరిమిం గాంచి ధ్రువుఁ జేయు లంచు మనమం దూహించి భక్తుండ వై
శరణంచుల్ భజియింపు మట్లయినఁ గష్టం బెల్లఁ బోకార్చ నీ
ధరణిం దమ్ములతో సుఖింతు వటు గాదా చేటు వాటిల్లెడిన్. 134

వ. అని బోధించి పితామహుండు శయనస్థలంబునకుం జనియె దుర్యోధనుండును దదనుజ్ఞాతుండై నిజశిబిరంబునకుం జని శయనించి రాత్రి శేషంబు పుచ్చెనని సంజయుండు ధృతరాష్ట్రుం గాంచి. 135

క. ఇది నీయడిగినదానికిఁ, బొదలెడునుత్తరము గాఁగఁ బోల్చుకొనంగం
గుదురు నది యుండని మ్మికఁ, గదనము వెల్ల వినుము కలగూపు వెఱ్ఱులన్. 136

వ. అంత నమ్మఱునాఁ డరుణోదయంబున. 137

—♦ భీష్మనిపంచమదివసయుద్ధక్రమము ♦—

శా. నీదుర్మంత్రము కారణం బనఁగ నై నెక్కొన్న సంగ్రామమున్
నీదాయాదు లొనర్చువార లగుచున్ భీష్మప్రధానంబు గా
నైదం డెల్లఁ గడంగ సంగరము సేయ న్వచ్చి తద్రంగమం
దాదర్శింపఁగఁ జేసి రొడ్డనము గ్రాహాకార మేపారఁ గాన్. 138

వ. పాండవులును భండనోత్సాహంబు సెలంగఁ బోలికలనికిం జని నిజసేనాసమూహంబున శ్యేనవ్యూహం బమర్చి యెదిర్చి రద్దానిముఖంబున భీమసేనుండును నేత్రంబుల శిఖండిధృష్టద్యుమ్నులును శీర్షంబున సాత్యకియును గంఠంబున గాండీవధరుండును వామపక్షంబున సేనాసమేతుం డగు ద్రుపదుండును దక్షిణపక్షంబున నక్షౌహిణీపతు లగు కేకయపతు లేవురును వారిపిఱుంద సౌభద్రద్రౌపదేయులును బృష్ఠంబున మాద్రేయులతో యుధిష్ఠిరుండును నిలిచి యుండి రంత భీమసేనుండు గండుమిగిలి. 139

మ. మకరవ్యూహముఖంబు సొచ్చి కడిమిన్ మాత్సర్య మొప్పన్ శితాం
బకముల్ గుప్పుచు భీష్మునిం గవిసి నొవ్వం జేయ నాతండు సా
యకముల్ కోటులు మేటు లేసి రిపుసైన్యం బెల్లనుం బొల్లవో
యి కడున్ మోహము నందఁ జేసె నపు డెంతే వంత మేపారఁగన్. 140

మ. త్వరమాణుండయి ఫాల్గునుండు నదిపుత్రప్రేషితాస్త్రంబులన్
ధరఁ బైఁ బెండును మ్రొగ్గునై పడ వడిన్ దర్పించుచున్ వానిపై

Pancha-Dravida-Pandit
Balasubrahmanyam Sastri
Head Master, Central Jail School.
Residence

శరవర్షంబు నిగిడ్చి నొంచి కురుగాత్రసైన్యంబు దైన్యంబునం
దెరలం జేయుడు ధర్మరాజుబల మర్థిం బొల్చె హర్షంబునన్. 141

తే. తనబలంగము లెల్ల నత్తఱిఁ గలంగఁ, గని సుయోధనుఁ డాచార్యుఁ గదియ వచ్చి
యీవు భీష్ముండు నాహిత మెంచి నట్టి, ర యని మిమ్మాశ్రయించి నే రమణ నుంటి.

చ. అని మొన మీఱ లుండి రనినంత సురావళితోడ నైన నేఁ
బెనఁగుట కింతయే దలఁక బీర మెఱుంగని పాండుపుత్రులన్
బని గలదే వచించుటకు బాహుబలాంచిత! దానికిన్ దగన్
జను మరులం జయింపుము పొసంగఁగఁ జేయుము మాకు భద్రముల్. 143

—♦ ద్రోణుండు దుర్యోధనప్రేరితుండై పాండవసైన్యంబుపైఁ గవియుట ♦—

వ. అనిన విని యాచార్యుం డవార్యశౌర్యంబునం బెచ్చు పెరిఁగి చిచ్చువోలె నరిసైన్యం
బుపయిం గవిసి కసిమసంగినం గిరిసి శినిప్రవీరుండును బీరంబు తోరంబుగాఁ బోరి
వారించుటయుం బోరు ఘోరం బయ్యె నయ్యెడ. 144

సీ. కుంభసంభవుఁడు సంక్రుద్ధుఁడై సాత్యకి,జత్రుభాగము పదిసాయకముల
గాఁడ నేయుడు వానిఁ గానఁ బావని ద్రోణుఁ, దలపడి వివిధాస్త్రతతుల నొంచె
గురునకుం దోడ్పడి కురుపితామహుఁడు శల్యుఁడు భీముఁ గప్పిరి వడి శరాళి
ద్రౌపదేయులు సుభద్రానందనుఁడు నల్గి, చెల రేఁగి వారలం జెనకి పోరి

తే. రపుడు వారికి బాసట నైమె శిఖండి, ద్రోణభీష్ములపైఁ బెక్కుతూపులచవిఁ
జూప స్త్రీపూర్వుఁ డగువానిఁ జూడ నోడి, శాంతనవుఁ డోసరిల్లె నిజవ్రతమున.

మ. భవదాశ్రిద్ధ్వవచోదితుం డగుచుఁ గల్పప్రజ్వలద్వహ్ని నా
నవరోధించి శిఖండిఁ గాండముల ద్రోణాచార్యుఁ డస్త్రప్రయో
గవిధిం జూపుచు నేపుమీఱె నపు డుత్కంఠ స్ఫువత్పార్షతుఁ డు
త్సవముం గోరుచు సర్వసైన్యముల ద్రోణు దాపించెఁ దోడ్పాటుగన్. 146

క. గాండీవిపురస్సరులై, పాండవులును భీష్ముఁ దాఁకి బరవస మెసఁగన్
మెండుకొని పోరి రపు డా,భండన మగు దేవదానవవితతికి బలెన్. 147

తే. పరశురాములనోర్చినబల్లిదుండు, ప్రోరొనర్చె బకాంతకుపారినుండి
ధార్తరాష్ట్రుల రక్షించుతత్పరత్వ,మున జగద్భయంకర మగుపోలుపు దోఁప. 148

క. కురుపాండవవీరులకున్, దుర మాపూర్వాహ్ణమందుఁ దుములం బగుచున్
బరఁగె భయానకశబ్దం, బురుతర మై మిన్ను ముట్టె యుగ్రం బయ్యెన్. 149

మత్త. హేషితంబులు బృంహితంబు లనేకతూర్యనినాదముల్
రోషవాక్యము లెల్లదిక్కుల రొక్కటం బయి నిండ సం

తోషభూషితు లైనయోధులు తోడుతోడ నొక ళ్లొక
ళ్లపడానవిక్రమక్రమ మూరఁ దాఁకిరి వీఁకమై. 150

క. శరపాతంబునఁ ద్రెస్సిన,శిరములు భుజములును గాళ్ళుఁ జేతులుఁ దఱచై
ధరఁ బడుచు ఱాల వర్షము, గురియు ననం దోఁచె నపుడు ఘోరవిధముగన్. 151

తే. తుములరజ మెల్ల మేఘమ ట్లమర శస్త్ర,ధాళధళ్యద్యుతుల్ వైద్యుతప్రభ లయి
రోషపాతధ్వనుల్ స్తనితోపమంబు,లై రుధిర మంబుధారలై తీరె నపుడు. 152

క. కవచోపహితాంగము లా,ఢ్యవిభూషణభూషితావయవములు కనకా
స్త్రవిశేషంబులు తఱచై, భువిఁ గప్పిన నొప్పె నాలము భయంకర మై. 153

సీ. ఆయుద్ధమున క్షత్రియర్షభు లెల్లరు, నన్యోన్యశరవృష్టి ననఁగి పెనఁగి
రార్తస్వరముతోడ హాస్త్యశ్వములు ద్రెళ్ళి, రుధిరపంకంబునఁ గ్రుంకు లిడియెఁ
బట్టెంబులం దెగి పడినయట్టులు తలల్, గుప్పనఁగూరలై యొప్పె మిగిలె
నింత లింతలు గాఁగ నిడిసి రథంబులు, బొమిడికంబులతోడఁ బ్రోఁగుపడియె

తే. నెచటఁ గనుగొన్నఁ బీనుఁగు లెచటఁ గన్న
నెత్రువట్టులు నై భయాన్వీత మయిన
పొలికలను నాఁడు జంబుకములకుఁ గాక
ములకుఁ గంకగృధ్రాదుల కెలమిఁ గూర్చె. 154

వ. అంత దుర్యోధనుండు కాళింగసేనాపరివృతుం డై దేవవ్రతుం బురస్కరించుకొని
పాండవసైన్యంబుల నాక్రమించెఁ బాండవులును భీమసేనుం బురస్కరించుకొని
భీష్మసైన్యంబుల నతిక్రమించె నాసంగ్రామంబు నతిభీమం బయ్యె నయ్యెడ. 155

స్రగ్ధర. గాండీవజ్యారవం బుత్కటమయి దెసలం గ్రందుకో దేవదత్తా
ఖండధ్వానంబున న్నాకము వగిలి పడం గాఁ గపీంద్రధ్వజాభల్
నిండన్ బ్రహ్మాండమెల్ల న్నిశితశరముల న్భీష్ముని న్మాఱుకొంచుం
జాండాంశుం డో యనం దేజమున మెఱసి కృష్ణప్రియుం డగ్గలించెన్. 156

తే. కృష్ణసారథికం బగుజిష్ణురథము,నందు బహువర్ణభావిత మయి మహోన్న
తం బయినకపికేతు వయ్యంబరమ్మున, వెలిఁగె ధూమకేతువు నాఁగ వెఱపు దోప.

ఉ. ఇంద్రధనుర్వ్యారంబువలె నెంతయు వెగ్గెడుగాండివంబు ని
స్తంద్రగతి న్మహారవ మెసంగ నిరంతరధార లొప్ప న
య్యింద్రుఁడు వోలె నింద్రసుతుఁ డేర్తెఱఁ జూపుచు బాణవర్షము
న్సాంద్రముగా రణాంగణమునం గురిసెం దెసలెల్ల ముస్గఁగన్. 158

తే. తూరుపుం బడమటయును దోఁప కర్జునాస్త్రమోహితు లై భవదాత్మభవుల
తోడ నెల్లరు నార్తు లై తాఁకిసిడము,వానిమఱువు సొచ్చిరి ప్రాణభయమువలన.

తే. అరదములనుండి రథికులు తురగవార,ణములనుండియు జోదు లానరుని వేఁడి
గాండివమ్ము మ్రోఁత పిడుగట్లు గుండె లవియఁ, జేయ దద్దిర్లి పడిరి నీసేనయందు.

వ. అట్టియెడ దుర్యోధనుండు మద్ర సౌవీర గాంధార త్రిగర్త గోపాల కళింగ బలంబులతోఁ బదునాలుగు వేలగుఱ్ఱపురావుతులం దోడు చేసి శకునిదుశ్శాసనజయద్రథులం బురికొల్పి భీష్మునకుం దోడుపడం బుచ్చుటయు పెచ్చి వియచ్చరాపగాత్మజుండు వివ్వచ్చుం దాఁకె నంత నవంతీశ్వరులు కాశిరాజుతోడను సైంధవుఁడు భీమసేనునితోడను యుధిష్ఠిరుండు సహామాత్యపుత్రుం డగుమద్రేశునితోడను వికర్ణుండు సహదేవునితోడను చిత్రసేనుండు శిఖండితోడను మాత్స్యబలసమేతుం డగువిరాటుండు శకునిదుర్యోధనులతోడను ద్రుపదచేకితానసాత్యకులు సపుత్రుం డగుద్రోణునితోడను కృపకృతవర్మలు ధృష్టద్యుమ్నునితోడను దలపడి గదాసిముసల ముద్గర తోమర ప్రాసాద కుంతకరవాల భిండివాలాదులఁ బఱపుచుం బోరుచుండ హతగజాశ్వసంచయంబును జూర్ణీకృతరథధ్వజచ్ఛత్రచామరచయంబును బతితపదాతిజనసమూహంబును బిండీకృతకోదండశరవ్యూహంబును రక్తప్రవాహసంసిక్తంబును భూతప్రేతపిశాచసేవితంబును సృగాలకాకకంకగృధ్రమహానసంబు నై
రణరంగం బఖిలజనక్షయకరం బయ్యె నయ్యెడ. 161

## —♦ కురుపాండవయోధుల ద్వంద్వయుద్ధము ♦—

సీ. మాత్స్యునితోఁ గూడి మార్కొనియె శిఖండి, చండవిక్రముఁ డయి శాంతనవునిఁ
బార్థుండు ద్రోణికృపవికర్ణముఖ్యులఁ, బెక్కండ్రఁ దలపడి యుక్కుమిగిలె
ననిలజుండు సుయోధనుని దుస్సహు జయద్రథునిఁ బ్రాచ్యదాక్షిణాత్యుల నెదిర్చె
సౌబలోలూకుల సహదేవుఁడును ద్రిగర్తుల నకులుండును దాఁకి రలుక

తే. ధర్మజుఁడు గజసేనపై దాడి వెడలెఁ, జేకితానాభిమన్యులు శివివరుండు
సైన్యసంయుక్తు లై యున్నసాల్వకేక,యాధినాథులతోఁ బోరి రాగ్రహమున.

తే. ధృష్టకేతుఘటోత్కచుల్ తెంపుమిగిలి, నీకొమాళ్ళరథంబులు వీఁక దాఁకి
రవల ద్రోణునిఁ బార్షతుం డాఁగి పెనఁగె, విక్రమంబునఁ గ్రోధ మావిర్భవింప.

వ. ఇట్లు నీవారును వారునుం దలపడి పోరుచున్నంతం బట్టపవ లయ్యె నట్టియెడ నిరువాఁగునందును బరస్పరసంప్రహారంబులం జేసి కూలెడురథంబులును వ్రాలెడు నేనుంగులును బ్రీలెడుగుఱ్ఱంబులును సోలెడుకాల్వురునుం గలిగి రణాంగణంబు
దారుణప్రకారం బై యొప్పె నప్పుడు. 165

మ. కురువంశోత్తరుఁ డైనభీష్ముఁడు గడుం గ్రొవ్వాఁడిబాణంబులన్
కురుదాత్తోద్భవు నొవ్వ నేయుడు మదిన్ మాత్సర్య మేపార న
య్యురుతేజం డొకశక్తి శాంతనవుపై నుఱ్ఱూఁత లూఁగంగ నే
సి ధృతిం జేసె నతండు దానిఁ గడిమిం జెండాడి రెండై పడన్. 166

చ. వెనుక మహోక్కభల్లమున భీమునివిల్ విఱుఁగంగఁ జేసె లోఁ
గనలి యతం డొకింతటన కార్ముక మొండొక డందులోపలన్
శినివరుఁ డేగుదెంచి తనశింజిని మ్రోఁత దిగంతరంబులన్
వినఁబడ వాఁడితూపులను భీష్ముని బమ్మరిలంగ నేయుడున్. 167

ఉ. శాతశరం బొకండు గొని శాంతనవుండు శినీంద్రు తేరిపై
సూతునిశీర్షమున్ దెగి వసుంధరపైఁ బడ నేసె నంత న
వ్వీతులు తేరి నెత్తికొని వేగగతిం బరువెత్తె నత్తఱిన్
బీతునఁ బాండవధ్వజిని విచ్యుతిఁ గాంచెఁ జలించి పిమ్మటన్. 168

క. హాహాకారము లెసఁగ మ,హాహవమునఁ బాండుసైన్యమం దగుజనముం
దోహోహూ పట్టుఁడు నిలుపుం, డాహయముల ననుచుఁ దుముల మారవ మయ్యెన్.

తరువోజ. అక్కాలమున భీష్ముఁ డమరారిసేన హరిహయుండును బోలె నరిసేన నెల్లఁ
జక్కాడె నంతనాసమయంబునందు క్షాత్రధర్మమునఁ బాంచాలబలంబు
లుక్కెక్కి ద్రుపదసముద్భవుఁ డంటె యుండ శాంతనవుపై నురవడించి వడి
నెక్కటిపోర నీయెల్లవాహినుల నేర్చుటకుం బూనె నెంతయుఁ బేర్చి. 170

క. ఈవల ద్రోణప్రభృతులు, నావల మత్స్యావనీశ్వరాదులు తోడై
చేవమెయిఁ బోర సమరం, బావేళన్ మృత్యురూప మై పొల్పెసఁగెన్. 171

చ. విరటుఁడు మూఁడుబాణముల భీష్ముని గాఁడఁగ నేసి మూఁటఁ ద
త్తురగముల న్నొగుల్చుడును దోడన తాడిసిడంబుఱేఁడు దు
ర్భరదశసాయకంబుల విరాటుని నాటఁగ నేసె నంతలో
గురుసుతుఁ డాఱుబాణములఁ గొట్టె ధనంజయుఱొమ్ము గాఁడఁగన్. 172

—♦ అర్జునుండశ్వత్థామ నెదిరించుట ♦—

చ. కినిసి కిరీటి ఛీటి యని కీర్తికి నెక్కినవానివిల్లు లీ
లన తునుమాడి తత్తనువు లంపటఁ గాఁ గొని యేనుతూఁపు లే
పున నాఁగిలించుడున్ గసలు పుట్టి నతండు మఱొండువిల్లు గై
కొని నరుఁ దొంబదంబులను గొట్టె హరిన్ మఱి డెబ్బదంబులన్. 173

వ. ప్రహరించి నొప్పించుటయును. 174

ఆ. కన్ను లెఱ్ఱ చేసి కవ్వడి హరిజేవు,రించియున్న మోము నెంచి చూచి
యూర్పు లడర రోఁజి పేర్పడ గాండివం, బుఱుము నాఁగ మొఱయుచుండు నంత.

ఉ. సన్నతపర్వముల్ గలుగుశాతశిలీముఖముల్ నిగుడ్చి వీ
ర్యోన్నతి విస్తరిల్లఁగ గురూద్భవుపై నడరింప నన్నియున్
గ్రన్నన వారిమైమఱువు గండ్రికలై పడ వ్రచ్చి నెత్రువా
క న్నెఱయంగఁ జేసెఁ దృటికాలములోఁ జలియింప కాతఁడున్. 176

క. వివశుండు గాక శరముల, నవిరళగతిఁ బార్థుమీఁద నడరించుచు నా
హవభూమి నోహటింపక, తవిలి మహావ్రతము నోము తాత్పర్యమునన్. 177

ఉ. దెప్పర మైనచో వెఱచుడెందము గల్గినవాఁడ యయ్యు నీ
చొప్పునఁ గృష్ణు లిద్దఱును జుట్టనిపించిన నించుకే వడిం
దప్పి తలంక కోర్చెడిని దండ్రిగురుత్వము శస్త్రవిద్యయుం
జెప్పఁగ నేల మే లనుచు నీసుతు లెల్లరు మెచ్చి రచ్చటన్. 178

వ. అయ్యవసరంబున నర్జునుండు. 179

తే. గురుసుతుండును సహపాఠి ధరణిసురుఁడు, మాననీయుఁడు నాకు నిమ్మానధనుఁడు
వీని నొప్పింపఁ జన దని వీడి శౌరిఁ, గురుబలంబులపైఁ బడి దుర మొనర్చె. 180

—♦దుర్యోధనుఁడు భీముని పైఁ గవియుట♦—

చ. కురుపతి భీమసేనుపయిఁ గోల్తల సేయుచు గృధ్రపత్రభా
సురశరపంచయుగ్మమునఁ జూపఱు మే లని మెచ్చ నేయుచున్
గరువలిపట్టి యూరయిదుకాండములం గొని యూఁడ్చి వాని పే
రురమున నీరసం బెసఁగ నొక్కపరిం బరఁగించె నెంచఁగన్. 181

తే. రాజరాజునురంబునఁ దేజరిల్లు,హారతరళరత్నము పృషత్కావృత మయి
గగనభాగమునన్ గ్రహగణపరీతుఁ, డై వెలింగెడుదినమణియట్లు దనరె. 182

తరళము. కడిమిఁ గాస్పుతనూజుఁ డగ్గతి గాఁడ నేయుడు నొచ్చియున్
సిడులు చూపిన నేపుమీఱెడుసింధురంబును బోలి నీ
కొడుకు కోపము రూప మందినకోపునం దగి తూపులన్
దొడిగి వింట విదుర్చుచుం గడు నొవ్వఁ జేసె వృకోదరున్. 183

క. ఆతఁడు నాతని కోడక, శాతాంబకనివహ మేసి సంపాతము గా
నాతఱి మెలంగె నయ్యని, భీతావహ మయ్యె నెల్లపృతనేంద్రులకున్. 184

చ. తలపడి ఫాల్గునాత్మజుఁడు తత్సమయంబున నీదుసైన్యముం
బిలుకఱఁ జేయుచున్ మొనకుఁ బిల్చినయ ట్లగుచిత్రసేనునిన్

నలువురఁ బత్త్రిన స్తకమున న్నొగిలించియు నంతఁ జేవడిం
గలపురుమిత్రు నన్ని యగుకాండముల న్విదళించివైచుచున్. 185

క. నలుదశరంబులు తనపైఁ, నొలుకుచుఁ దలకడచి నచ్చునుగ్రంపశ్యున్
విలసద్ద్యుతు సత్యవ్రతు, లలి నొంచెన్ డెబ్బదమ్ములన్ వైచి వడిన్. 186

సీ. వీరనృత్యము సేయుచీరు నాతని నొంచెఁ, జిత్రసేనుఁడు పదిశితశరముల
సత్యవ్రతుఁడు నవసాయకంబుల మొత్తెఁ, బురుమిత్రుఁ డేడింటఁ దెరలనేసె
నభిమన్యుఁ డద్దాన నలుగుచుఁ జిత్రసేనునికార్ముక మొకంటఁ దునిమి రెంట
నుర మాడ నేసి నెత్తురు లూరఁ జేసి మైమున వఱవఱ లయి తెర్లఁ జేసె

తే. నపుడు నీమోఘు లొకపెట్ట నతనిఁ దాఁకి, పేర్కఁ జూపిన నాతఁడు వేసఁగి తఱిఁ
గారుచిచ్చెట్లు తృణములం గాల్చునట్లు, కసిమసఁగి యెల్లవారలఁ గసిమసంగె.

వ. ఇట్లు ప్రతిహతపరాక్రములై పేర్చి నీబలంబు నేర్చు సౌభద్రుం జూచి పరలక్షణ లక్షితుండును శుభలక్ష్మణుం డగు మీలక్ష్మణుం డుక్కుమిగిలి మొక్కలీఁడై.

—◆ అభిమన్యులక్ష్మణకుమారులయుద్ధము ◆—

ఉ. మార్కొని ఫాల్గునాత్మజుని మార్గణకోటుల ముంచి మించినన్
గార్కొని సాత్వతీసుతుఁడు శౌర్య మనార్యము గా మనంబునన్
ద్వార్కొనఁ జేసి రోసము నుదగ్రగతిన్ భవదీయపౌత్రునిం
గర్కశబాణషట్కమున గాఢతరంబుగ నేసె నేసినన్. 189

చ. తలఁకక లక్ష్మణుండు భుజదర్పము పేర్పడఁ దన్ను సారథిన్
దలరఁగ నేయుడుం గనలి తానును వానిని వానిసారథిన్
దొలకరివాన వోలె నెడతూపుల నేపున నేసి నొంచినన్
బలరిపుపౌత్రుఁ డాజ్య మిడ బగ్గున మండెడునగ్గియట్లఁ డై. 190

ఉ. నిట్టలమైనశౌర్యమున నీసుతసూతిరథాశ్వసూతులన్
బెట్టున నేలపైఁ బడఁగఁ బెట్టి శరంబుల వాని ముంచుడున్
దిట్టతనంబునం దనరి తేర్విడి పోవక ఘోరరూపమై
పట్టు గలట్టిశక్తిఁ గొని వైచెను వానిరథంబుపైఁ బడన్. 191

క. వైచిన దానిన్ నడుమనఁ, జూచుచు నుండంగ విజయసూనుఁడు రెంటై
తోఁచి పడఁ జేసె శితనారాచంబుల చేతిబలువు రాజులు మెచ్చన్. 192

తే. విరథుఁ డయి శక్తిఁ గోల్పోయి వెగడు గుడుచు, రాజరాజకుమారుని రక్షఁ గోరి
తనరథంబునఁ గొని కృపుం డనికి నెలిగఁ, దోలఁచి పుచ్చె నెల్లరుఁ గనుఁదోవలఁ జూడ.

చ. నరవర ! వారు వీరును గనన్ భయదం బగునారణాగ్నిలో
విరవిరఁ ద్రెళ్ళి దేహముల వేల్చెదువా రయిఁ యెత్తి యుత్తటిన్
విరథులు విక్షతేషుధులు విస్రుతకేశులు వీతచాపులై
తెరలక చేసి రాల మొకతీరునఁ జేయియుఁ జేయిఁ గల్పుచున్. 194

వ. అట్లు మహారథు లందఱుం బీరంబునం బోరుచున్నంత శాంతనవుం డనంతవిక్రమా
రంభుం డై సంరంభించి పాండవసేనం జెండాడుచుండె నాసమయంబున, 195

మ. శినివంశోత్తముఁ డుత్తరోత్తరగుణస్ఫీతప్రతాపాఢ్యుఁ డై
ఘనకోదండగుణప్రణాదమున నాకాశంబు మ్రోయ న
య్యనిమోనై కరలాఘవంబు లలితం బై యొప్ప మెప్పించుచున్
సునిశాతాంబకకోటులన్ నినిచె నీసూను ప్రజాంగంబులన్. 196

మ. శరసంధానవిమోక్షణాదులు గనన్ శక్యంబు గాన ట్లతం
డురుశౌర్యంబున నీకుమారుబల ముట్టాఁగన్ మహాహావేగి యై
పరిపంథుల్ వెఱగంద వీరవిహృతిం బాటించుచోఁ రాజు స
త్వరుఁడై పంచె మహారథాయుతము నవ్వానిన్ వడిన్ మార్కొనన్. 197

క. తనపై మూఁగినమూఁకలఁ, గని సాత్యకి కుప్పఁగూలఁ గా దివ్యాస్త్రం
బునఁ జేసి చేసె దారుణ, మును ఘోరం బయినకర్మము నొనర్చె వడిన్. 198

చ. ఎరగలియై భవజ్జనుల నేర్చుచునున్నశినిప్రవీరుపైఁ
గురుకులశేఖరుండును నకుంఠితతేజుఁడు సోమదత్తభూ
వరతనయుండు పైకొని జవంబున భూధరభిద్ధనూరుచి
స్ఫురణమునం దలిర్చుధనువుం గొని తీక్ష్ణశరంబు లేయుచున్. 199

తే. తనదుకరలాఘవము వేయిదాగలుగఁ బరిభ్రమింపఁగఁ జేయుభూరిశ్రవుఁ గనుఁ
గొనిన యుయుధానునిపదానుగులు వడి చెడి,పిఱుసనిరి కాందిశీకులై పెనఁగుటుడిగి.

మ. శినివీరాత్మభవుల్ పదుం డ్రపుడు సుస్ఫీతప్రభావంబు పెం
పున యూపధ్వజు నాతనిం బొదివి యొప్పుం జూపుచుం బల్కి రో
ఘనబాహాబలసార! మీ మఖిలలోకస్తుత్యవృష్ణ్యన్వవా
యనిగూఢస్థితి నై నవార మని సేయం గోరి నీతోన్ నిటన్. 201

క. వచ్చితిమి మమ్ము నందఱ, మచ్చరమున మాఱుకొందొ మాలో నొకనిం
గ్రచ్చుకొని పోరుకొందో, క్రచ్చఱ వచియింపు కీర్తికాముఁడ వగుచున్. 202

తే. రమ్ము మము గెల్చి కీర్తిఁ గైకొమ్ము లెమ్ము, శూరశేఖర! నావిని సోమదత్త
తనయుఁ డిట్లను సాత్యకితనయులార, లెస్స లగు మీనుడుల్ గాన లెండు పోర. 203

బరీక్షించి సేనలం దీర్చియు నియమించి యంత నిరువాఁగువారును దమతమశిబిరంబు లకుం జని యయ్యైనవరాత్రిం బుచ్చి మఱునాఁ డుదయంబున నానావిధవాద్యధ్వానంబులును వీరయోధసరస్వరాహ్వాననిస్వానంబులును జెలంగ సంగ్రామరంగంబునకుం జని రంతఁ గౌంతేయాగ్రజుండు ధృష్టద్యుమ్నుం బిలిచి మనసేనాసమూహంబున మకరవ్యూహంబు సంఘటింపు మనిన నతం డట్లు గావించుటయు దానిశీర్షంబున ద్రుపదార్జునులును నేత్రంబుల నకులసహదేవులును దుండంబున భీమసేనుండును గండంబున ద్రౌపదేయఘటోత్కచసౌభద్రసాత్యకులతో నజాతశత్రుండును బృష్ఠభాగంబున బహుళసేనాసమేతు లై విరాటధృష్టద్యుమ్నులును వామపక్షంబున నై కేయపంచకంబును దక్షిణపక్షంబున ధృష్టకేతుచేకితానులును జరణంబుల మహాచమూసమేతు లై కుంతిభోజశతానీకులును బుచ్ఛంబున సోమకసమన్వితుం డగుశిఖండియు నిరావంతుండును మొనసుకొని యుండి నానావిధోద్దామకేతుహేతివ్రాతశోభాభిరామంబు గా దీమసంబునం దేజరిల్లి దేవవ్రతాభిరక్షితం బయినసీవారిసైన్యంబుఁ దారుకొనుటయు దానిం గని దేవవ్రతుండును బ్రతివ్యూహంబు గాఁ గ్రౌంచవ్యూహంబు వన్నించె నందుఁ దుండంబున భారద్వాజుండును జక్షువులఁ గృపాశ్వత్థామలును శిరంబున బాహ్లికసమన్వితుం డై కాంభోజుండును గంఠంబున శూరసేనాంచితుం డై దుర్యోధనుండును నురంబున మద్రకేకయపరివృతుం డై ప్రాగ్జ్యోతిషాధీశ్వరుండును వామపక్షంబునఁ ద్రిగర్తచమూసమేతుం డై ప్రస్థలాధీశ్వరుం డగుసుశర్మయు దక్షిణపక్షంబునఁ దుషారయవనశకచూళికులును జఘనంబున శ్రుతాయుశ్శతాయుస్సోమదత్తులును నిలిచి రిట్లుభయసైన్యంబులును సన్నద్ధంబు లై యుద్ధంబునకు సిద్ధం బై యున్నంత. 213

—◆ భీ ష్మ ని ష ణ్ణ గ వ స యు ద్ధ క్ర మ ము ◆—

తే. భీమసేనాజ్ఞసయమాదవిశ్రుత మగు, పార్థసైన్యము నక్షత్రపరివృత మగు
రాత్రిఁ బోలె భీష్మాదిరక్షిత మగు, నిబలము గ్రహంబుల నొప్పునింగిఁ బోలె.

వ. అయ్యవసరంబున. 215

మ. రవళిం జూపుచుఁ జాప మొప్పసఁగ భారద్వాజుఁ డాసేనముం
దవిలి నాఁ వెల్గుచు నుండఁ గాంచి పవమానాత్మోద్భవుం డల్కమై
జవనాశ్వోద్ధతి కెల్ల మెచ్చఁ జని శశ్వత్సాయకౌఘంబులన్
నవయం జేసెఁ దదీయసైన్యసమితిం నానాప్రకారంబులన్. 216

క. గురుఁ డాకోల్తలఁ కింతయుఁ, బెరలక తిరుఁ డగుచుఁ గోపదీపితమతి యై
శరనవకంబున భీముని, మురళించుచు నేసె మర్మములు దాఁకంగన్. 217

చ. వడముడి క్రోధదీప్తుఁ డయి వాఁడిశరం బరివోసి యొక్కఁ డ
క్కడిప్రజ కెల్ల నచ్చెరువు గల్గ ధనుర్గురుదక్షిణాస్థునిన్
వడివడిఁ బుచ్చెఁ గాలభవనంబునఁ గాపుర ముండ ద్రోణుఁడున్
గడుసరి గానఁ దాన తురగంబులఁ గైకొని పోరె ధీరుఁడై. 218

ఆ. ద్రోణభీష్ము లపుడు దొడరి పాండవసేనఁ, దూలరాశి నగ్నిపోలె నడరి
కాల్చిపుచ్చి రంతఁ గైకయసృంజయుల్, కాందిశీకు లైరి కౌరవేంద్ర. 219

ఉ. ఫాల్గునుఁ డంత భీమునకు బాసటయై భవదీయసైన్యమున్
నల్గడ ముట్టి బిట్టడరి నవ్యశరావళి నగ్గిఁ జేయుడున్
వల్గుతపోత దైన్యమున వందురి కుందర మేటిజోదులున్
దల్గులలోనఁ జిక్కుకొని దారి యెఱుంగనిగోవు లట్లనై. 220

—◆ ధృతరాష్ట్రుని పరిదేవనము ◆—

వ. అని చెప్పిన ధృతరాష్ట్రుండు సంజయుదిక్కుమొగం బై యిట్లనియె. 221

సీ. పఱపయ్యె శాస్త్రోపపన్నమహావ్యూహ, కలిత మయ్యును మనబలఁగ మెల్లఁ
జిందువందై యిట్లు చేర్పడుటకుఁ గతం, బెయ్యదియో నాఁకు నెఱుఁగ రాదు
మనయోధు లతివృద్ధులును బాలురును గృశుల్, పీవరులును గారు పేర్మిఁ గలరు
నసిగదాశక్తికుంతాదియుద్ధములందు, బాహుయుద్ధమునందుఁ బండితేంద్రు
తే. లస్త్రశస్త్రాదివిద్యల నారితేఱి, నట్టిప్రోడ లనామయు లధికబలులు
రథగజాశ్వాదియానసంప్రబలితేక్తు, లిట్టు లయిపోయి రని చెప్ప నేమి యయ్యె.

చ. మఱియును మొగ్గరంబులను మాన్కను నేర్పును శత్రుసైన్యమం
దఱుముచుఁ జొచ్చునేర్పు నపయానము చేసెడునట్టినేర్పునున్
దఱిమెడునేర్పు పేర్పడఁగ దగ్గుటనేర్పును బాఱనేర్పునున్
దొఱఁగనివారు మాకిపుడు తోడ్పడి యుండినవీరు లారయన్. 223

తే. మాటబడిఁగాదు మో మోటనాటఁగాదు, కూటమునఁ గాదు ప్రతిబంధ మాటఁగాదు
కలన మాకిప్పు డొప్పినకాలుబంట, లెన్న వేతనమున కిడికొన్నవార. 224

వ. మఱియు లోకపాలోపము లైన భీష్మద్రోణకృపాశ్వత్థామకృతవర్మజయద్రథ
దుశ్శాసనభగదత్తవికర్ణసౌబలిబాహ్లీకప్రముఖశూరశేఖరాభిరక్షితం బై
సారవంతం బైనమనమహాసైన్యం బలంతి యగుశత్రుసైన్యంబుచే నోటువడు
చుండుట పురాకృతకర్మఫలంబు గాని యొండు గాదని వెండియును. 225

తే. ఇట్టివిపరీత మెందునే నెఱిఁగిరయ్య, ఋషులయంతటివా రైన నెల్లవిషయ
ములఁ బ్రశంశకు నెక్కి నాబలఁగ మిట్టు, లగుట దురదృష్ట మని చెప్పనగునుగాదె.

చ. విదురుఁడు బుద్ధిమంతుఁ డయి విన్నను వొప్పఁగఁ జెప్పెఁ దొల్లిటఁగ
బదరుచు నెల్లవారు వినఁ బథ్యముఁ దథ్యమునుం దలంచి దు
ర్మదమునఁ డగునాసుతుండు విన నెంచఁడు వానిహితోక్తు లేమి నే
యుదు నిఁకఁ దాతచేఁత యెటు లుండిన నట్లగుఁ గాదె సంజయా. 227

వ. అనిన సంజయుం డతని కిట్లనియె. 228

శా. నీదోషంబున నింత పుట్టెఁ గులముల్ నిర్మూలముం జేయ నీ
వే దీక్షించితి దుష్టచిత్తుఁడవు గావే యెల్ల నీపుత్రుపై
నేదోరీతిన పెట్టెఁ జూచెద వతం డేతప్పెఱుంగం డయో
జూదం బొప్పితి వప్పు డిప్పు డదియే చూపట్టె నిట్లాల మై. 229

క. తనచేసినకర్మంబున, కనురూపం బయినఫలము నందెడు నిహమం
దున కాని లేక పరమం, దునకానీ తెలియఁ గా జనుం డని వినవే. 230

తే. నీవు చేసినదానికి నీవ ఫలము, ననుభవింతువు గాక నేఁ డనఁగ నేల
వగఁ పుడిగి విన్ము దిరుఁడనై తగిలి నాఁటి,సమరవృత్తాంత మంతయుఁ గ్రమముమెసంగ.

వ. అట్టియెడ భీమసేనుండు భీష్మాభిరక్షితం బైనభవత్సేనాసాగరంబు పాయవడం
జొచ్చి దుశ్శాసన దుర్విషహ దుస్సహ దుర్మద జయ జయత్సేన వికర్ణ చిత్రసేన
సుదర్శన చారుమిత్ర సువర్మ దుష్కర్ణాదులైన నీదాయాదు లొక్కచో నున్నం
గని వారిపై నురవడించుటయును. 232

ఉ. వారును వచ్చువానిఁ గని వాఁడె వృకోదరుఁ డగుఁ దెంచెడిన్
బోరగు నిప్డు ఘోర మయి పోకడఁ బెట్టక వానిప్రాణముల్
ధీరతఁ బట్టి కొంద మని తెంపున నై లయకాలసూర్యునిన్
గ్రూరమహాగ్రహంబు లనఁ గూడఁగ ముట్టిరి ముట్ట నేయుచున్. 233

శా. పెక్కం డ్రిట్లు మహారథుల్ తనపయిం బ ల్లేచి రాఁ జూచి తా
నక్కాలంబున దేవదానవులపై నాయింద్రుఁడుం బోలె నై
మొక్కల్ వోనిపరాక్రమంబునను భీముం డొప్పి సర్వేశుయుం
బొక్కం తైనమిత్రిన్ బొనర్చుమతి నావ్యూహంబులోఁ జొచ్చుడున్. 234

తే. సర్వశస్త్రాస్త్రహస్తులై శతసహస్ర,రథికవర్యు లేకాకి యై క్రాలుభీము
నుక్కడంగింపఁగా నేచి యున్న నెత్తిఁగి, వారిదుర్వ్యవసాయము వాయుసుతుఁడు.

వ. గదాపాణి యై రథావతరణంబు చేసి ధార్తరాష్ట్రబలౌఘార్ణవంబున విచ్చలవిడి
విహరించుచు మంథాచలంబువోలె మథియింపం జొచ్చె నప్పుడు ధృష్టద్యుమ్నుండు
ద్రోణుం గ్రేణించి వానితోడం బోరు చాలించి సౌబలుం డున్నదిక్కుఁ మొగంబై

మన సేనం జంపి చెండాడుచుం జని చని యొక్కెడ రథికశూన్యంబయినభీమురథం
బు గాంచి దుఃఖించుచు రథసారథి యైనవిశోకుం బిలిచి బాష్పసంరుద్ధనయనయు
గళుండై గద్గదస్వరంబున నిట్టూర్పు నిగుడించుచు ని ట్లనియె. 236

—ధృష్టద్యుమ్నుఁడు విశోకు నడిగి భీమునకుం దోడుపడుట.—

ఉ. ఓయి విశోక! నీ వొకఁడ వుంటి విటుల్ రథికుండు గాన రా
డాయన నాదుప్రాణములఁ బ్రాణము యూఁ జుమి యేమి యయ్యె నో
యేయెడ కేఁగెనో తెలుప వే యని కన్నుల నీరు నించుచున్
బాయనిసంభ్రమంబునను బల్కఁగ వాఁ డంజలి యై యి ట్లనున్. 237

చ. తటుకున వత్తు నాకయి రథం బొకయించుక నిల్వరింపు మం
చిట ననుఁ బెట్టి బి ట్టదరి యేచినదాయలఁ జూచి చూడ్కి కు
త్కటగతి యుట్టిపైన గదఁ గైకొని పీఁక నొకండ నీహాతుం
డటఁ బఱచెన్ దళం బగుబలార్ణవమధ్యముఁ జొచ్చి ముచ్చటన్. 238

తే. అనినఁ బార్షతుఁ డి ట్లను నతని నిల్చి, విడిచి ప్రాణముతో నేను విడిచి చనిన
వాఁడనే నన్ను నృపులు నోనాడు లోకులు,కాదు దేవన్ను నన్వస్తి గట్ట కుండె.

క. నాకు ననుంగుంజుట్టము, కాకౌంతేయు ప్రియసఖుండు కావున నిపు డా
లోకైకవీరునిం గన, నాకడకుం బోవువాఁడ నని సత్వరుఁ డై. 240

ఉ. భీమగదాప్రహారములఁ బీనుఁగు లై పడియున్న యేన్గులన్
భీమునిమార్గముం దెలిసి పిరువరేన్కుఁగ పోయి చూచె ను
ద్దామబలంబునం దగులతావితతిం బలె ధార్తరాష్ట్రులన్
వేమఱుఁ గూల్చి కూల్చి భుజవిక్రమకేళి యొనర్చువిరునిన్. 241

వ. అంతలోన.

చ. వడముడి దైర్ఘ్య నేసినభవద్భల మంచిలిరాణికోటి వే 242
సెడిబహులార్తనాదమునఁ జేసి మహారథు లెల్ల రొక్క మా
ఆడరి వృకోదరుం బొదివి యస్త్రపరంపర ముంగ నేయ నా
తఁడు వడి వారిఁ గ్రోలుతతి దాపునకుం జన్ని పార్షతుం డటన్. 243

క. శరవిక్షతాంగుఁ డై సం, గరతలమునఁ గ్రోధవిషముఁ గ్రక్కుచుఁ జేతం
గురుగద గ్రాలం గాలుని,కరణి విజృంభించువానిఁ గౌఁగిట నిడుచున్. 244

వ. ఆశ్వాసించుచు వానిమేనం గలశల్యంబు లెల్లం దీసి తన రథం బెక్కించుకొనియె
నంత దుర్యోధనుం డెల్ల తమ్ములం బిలిచి 245

చ. ద్రుపదసుతుం డితం డిపుడు తోడ్పడవచ్చెను గాడ్పుపట్టి కీ
కృపణుని మాఱుచోటునకు నేగఁగ నీయక కూడి యెల్లరో
క్క-పటి శరంబులన్ నినిచి కాలునిపోలికి నేగఁ బుచ్చుఁడీ
వ్యపగతభీతు లై యనుచు వారలు వారనిబీర మేర్పడన్. 246

—♦ధృష్టద్యుమ్నుఁడు కౌరవులపై సమ్మోహనాస్త్రిమేయుట♦—

క. లయకాలధూమకేతువు, లయురువడిం బూని కరములం గొని విండుల్
భయదగతి మెఱయఁ జేయుచు, రయమునఁ బార్థునిఁ దాఁకి ప్రథనోత్సుకు లై.

తే. వారివాహంబు లద్రిపై వారిధార,లొలుకునట్లులు శరవర్షముల మునుంగఁ
జేయుటయు నల్గి వారిపై నాయుదార,చిత్తుఁ డేసెఁ బ్రమ్మోహనాస్త్రోత్తమంబు.

వ. దానంజేసి నీపుత్రు లెల్లరుం దెలివి తప్పి తమతమరథంబులపై మ్రొగ్గతిల్లి రక్కా-
లంబున నక్కడ ద్రోణుండును. 249

క. తనపైఁ గవిసినద్రుపదుని,మునుపటివైరమునఁ జేసి మునుకొని కినుకన్
గొని సంగ్రామ మొనర్చుచు, సునిశితబాణముల మూఁట స్రుక్కించె వడిన్. 250

చ. ద్రుపదుఁడు దాన నోసరలి దూరము వోవుడు శంఖ మొత్తె నా
కృపునిమఱంది డెందముల కెంతయు వింతగ సాధ్వసంబు రా
నపుడు తొలంగి సోమకులు నాహవభూమికిఁ గాక పోయి రా
విపులరవంబు వీనులకు ప్రీతిచెలంగ నఁగు దెంచునంతటన్. 251

వ. అంతలో ననంతశక్తిసంపన్నుం బగుసమ్మోహనాస్త్రంబునం జేసి నీసుతు లెల్ల విసం
జ్ఞులై పడియుండి రని విని ధనురాచార్యుం డతిత్వరితగమనంబున నటఁ జని విగత
చేతను లై యున్నవారిని వారిపైన్యంబులం గనుంగొట్టుభీమసేనధృష్టద్యుమ్నులం
గని విషాదామర్షంబులు ననంగొను బ్రజ్ఞాస్త్రంబున సమ్మోహనాస్త్రం బుడి
గించి నీవారిం బ్రత్యాగతప్రాణులం గావించి మించినపరాక్రమంబున భీమపార్ష
తుల నెదుర్కొనునంత నజాతశత్రునిపంపున సౌభద్రప్రభృతు లావృకోదర
ధృష్టద్యుమ్నులకుం దోడు సూపి రమ్మధ్యాహ్నసమయంబున. 252

సీ. ధృష్టకేతుండు ద్రౌపదేయులుఁ గైకేయు,లును సుభద్రాసుతు ననుసరించి
సన్నద్ధులై భూరిబలముతో సూచీము,ఖవ్యూహ మొక్కఁడు గట్టికొనుచుఁ
గసిమసంగి గమించి కౌరవానీకినిఁ, జించి చెండాడుచుఁ జేరి రటకు
నీసేన యాభీముసియుఁ బార్షతునియు సౌ,భద్రాదులయు భీతిఁ బరువ ముడిగి

ఆ. సడచి పెద్దదవ్వు బడలి మూర్ఛిల్లిన,ప్రమద వోలె నట్టిసమయమందుఁ
దఱియ వచ్చుచున్నతమవారిఁ గని ముదం,పడిరి ద్రుపదసుతుఁడుఁ బవనసుతుఁడు.

వ. అప్పు డాచార్యుం డురవడించి తన్ను మార్కొన నేతెంచినం గని ధృష్టద్యుమ్నుం
డు నీకొడుకులందఱ లంగివాయుసూనుం గేకయురథం బెక్కించి తాను మొక్కవో
నిపరాక్రమంబున నాచార్యు నెదుర్కొనుటయును. 254

—•ధృష్టద్యుమ్నుఁడు ద్రోణునితో యుద్ధము సేయుట•—

శా. భారద్వాజుఁడు రాజరాజుహితముం బాటించి పాంచాల్యునిం
ధీరత్వంబునఁ దాఁకి భీకరమెయి తద్దివ్యోగ్రకోదండముం
బీరు ల్మెచ్చఁగఁ ద్రుంచి పైఁ బయి వడిం వేవేలు వాల్తూపు లా
సారంబో యన ముంగ నేయుటయు ధృష్టద్యుమ్నుఁడుం ధృష్టుఁడై. 255

ఉ. ఒండొకవిల్లుఁ బూని బహులోద్ధతి నద్ధనురార్యశౌర్య ము
ద్దండము గాఁగ నెబ్బదిశితప్రదరంబుల నొవ్వ నేయుచుం
బెండియు నాతఁ డాధనువు ప్రేలిచి నాల్గిట నాల్గువాజులం
జెండి యొకంట సూతుతల చెండుసకుం దగఁ జేసె నీసునన్. 256

వ. అంత. 257

క. తన తేరు డిగ్గి ద్రుపదుని,తనయుఁడు సౌభద్రు తేరు తడయక యెక్కెం
ధనురాచార్యునికోల్తలఁ, గని పాండవసేన లెల్లఁ గనుఁ గనిఁ బఱచెన్. 258

తే. భీమసేనాదులకునైన బెదరి చెదరు, బలగముల నాఁగ శక్యంబు గలుగ దయ్యె
మేలు మే లని ద్రోణుని మెచ్చుకొనుచు, సంతసంబునఁ బొంగె నీసైన్య మెల్ల.

ఉ. అంతట మోహనాస్త్రమున నైనవిసంజ్ఞత దీఱ నీసుతుల్
పంతము మీఱ మాఱుకొని పావనిపై వివిధాస్త్రశస్త్రముల్
సంతతముం నిగుడ్చుటయు సైఁచి వృకోదరుఁ డెక్కె తేరు దా
నింతటిలో సుయోధనున కేర్తెలిఁ జూపె నృపాలు రెన్నఁగన్. 260

సీ. నీసుతుం డీసునఁ జేసి భీమునిమర్మ,ములు గాఁడఁగా వాఁడి ములుకు లేసె
నేసినఁ గను లెఱ్ఱఁ జేసి మూఁడిట నతం, డతనిబాహులు నురం బాడ నేసె
దానఁ జలింప కాధరణీధవుఁడు ధరా,ధరమునాఁ దిరుఁ డయి తనకె నవ్వుడు
దుర్యోధనానుజుల్ తొల్లి మంత్రించిన,నెఱి మాపుకొం బట్ట నిశ్చయించి

తే. మూఁగికొని బెట్టిదంబుగ మోఁదుటయును,సిడులు చూపినగజమట్టుఁ లెడఁద నలిగి
వారి నందఱ మార్కొని వాయుసుతుఁడు,శరపరంపర నొప్పించుసమయమందు.

వ. అభిమన్యుప్రభృతు లగునప్పన్నిద్దఱుమహారథులును యుధిష్ఠిరప్రేరితు లై మహా
రభసంబున నరుగుదెంచి కాంచనలిపట్టికిం దోడుపడుటయు సూర్యాగ్నిసదృశతేజస్కు
లగునాకాజపుత్త్రులం జూచి నీపుత్త్రు లెల్లరును. 262

తే. వెఱచి పఱచిరి వెన్నిచ్చి విడిచి దురము, చిత్రసేనాదు లగువారు చివ్వ నట్లు
బ్రదికిపోవుట కెంతయుఁ బవనతనయుఁ, డాత్మగతమునఁ జింతించె నట్టె నిలిచి.

వ. అట్టియెడ ధృష్టద్యుమ్నాదులం గూడి భీమసేనపురస్సరుం డగునభిమన్యుండు నవారిం దఱిమినంత దుర్యోధనాదులు వారి నెదుర్కొని పోరి రయ్యపరాహ్ణంబున మహాయుద్ధం బొప్పె నప్పుడు. 264

శా. సౌభద్రుండు వికర్ణుఁ దేరిహరులన్ జానేసి తద్గాత్రమం
దాభీమాస్త్రము లిర్వదే నొకవడిన్ హత్తించి మొత్తంగ నెం
తే భీతిన్ హతరథ్యమైనరథ మాధీరుండు వోనాడి తా
శోభం బొల్చెడుచిత్రసేనురథ మచ్చోఁ గాంచి యెక్కె న్వడిన్. 265

తే. చిత్రసేనవికర్ణులు చేరి బాణ,వర్ష మయ్యభిమన్యుపై వఱలఁ జేయ
దుర్జయుఁడు నేను తూపులు కొడిగి యేసెఁ,గనకగిరివోలె నతఁ డింతఁ గదలఁడయ్యె.

సీ. కైకేయులం దాఁకి పీఁక దుశ్శాసనుం, డద్భుతక్రియఁ జేసె నాహవంబు
దుర్యోధనుం దాఁకి ద్రుపదసౌహిత్రులు, మూఁడేసియమ్ములఁ గాఁడ నేసి
రప్పుడు దుర్ధర్షుఁ డలిపి పాండవపుత్ర,పంచకంబుం దాఁకె భల్లసమితి
నెత్తురువఱ్ఱున నరపుత్రుండు జొత్తిల్లి,ధాతురంజితపర్వత మన నొప్పె

తే. శాంతనవుఁ డంతఁ బాండవసైన్యములను, బశుగణంబుల గోపుఁడు బలెను ద్రోణ
బలమువలపట గాండీవ మెలమి మ్రోయ,నరుఁడు చెండాడె నరిసేన శరచయమున

క. ఇరువాఁగు నట్టలాడెన్, గరములు తెగి కాళ్ళు తెగియుఁ గరులున్ హరులున్
ధరణీధరంబులప్రోవుల,కరణిం గన్పట్టె నట్టికాలమునందున్. 268

ఆ. శోణితోదకంబు బాణభ్రమము గజ,ద్వీపమును హయోర్మిక్షిపితంబు
సైన్యసాగరంబు జనవరేణ్యులు రథ,తరణులం దరింపఁ దలఁచి రపుడు. 269

—భీమసేనుఁడు దుర్యోధనుని విరథుఁ జేసి నొప్పించుట—

తే. నింగి మొఱ్ఱలు వాఱంగ నిగిడినపుడు,వాయుతనయునిఁ జంపంగ వాంఛఁ జేసి
నీకుమారుఁడు వానిపైఁ జైకొనంగ, నలుకఁ గని భీమసేనుఁ డిట్లను నతనికి. 270

సీ. కడుపెద్దకాలంబు గాఁ బూచిపట్టిన,మాకోర్కి కిం దగె మంచికాల
మనిమొనం దోలఁగ కీ నగుదేని యిప్పుడ, నీప్రాణవాయువుల్ నేను గొందు
జనని కుంతీదేవి కొనరిన క్లేశంబు, వనవాసకష్టంబు వనితపాటు
నినుఁ జంపినం దీఱు నిజము చెప్పెద నోరి! నీచేయుపాపమే నీకుఁ దగులు

తే. శకునికర్ణాదిమతమున నకట మమ్ముఁ, బరిభవించితి కృష్ణుని బట్ట నెంచి
శివి పరుస మాడితి వులూకుఁ దివిరి పుచ్చి, యెగ్గొనర్చితి మాకు నీ వెంత యేని,

క. దానికి శాంతిగ నిప్పుడు, పూని నినుం బట్టి బంధుముఖ్యులతోడన్
మానక చీలిచిపుచ్చెద, నీనిలు గంతయును దీఱ నికృతివిహారా. 272

మ. అనుమానన్ ఘోరతరాశనిప్రభలఁ గ్రోయం జిలి జ్వాలాళి నిం
గి విలం గప్పెడుముప్పదాఱుశరముల్ గిలించి నీపుత్త్రుపైన్
ధనువున్ రెండిట రెంట సూతుశిరమున్ నాల్గింట నశ్వాళి రెం
టను ఛత్త్రంబును మూఁట కెక్కుఁయము నూడం గొట్టె బిట్టేయుచున్. 273

క. జలధరమునుండి క్రిందికి, మిలమిల మని మెఱసి దిగెడుమెఱుఁగు తెఱఁగునన్
వెలుఁగుచు మణినాగధ్వజ, మిలఁ గూలెం బార్థివేంద్రు లెల్లరుఁ గనఁగన్. 274

తే. అంకుశంబుల నేనుఁగు నడఁచినట్లు, మఱియు భీముఁ డాలోఁ బదిమార్గణముల
నేసె దరహాస మేర్పడ నృపతి నింత, లో నదరి సైంధవుఁడు భీమసేనుఁ దాఁకె.

మ. విరథుండై శరపీడితుం డయిన వో వీక్షించి కౌరవ్యునిన్
గురుతేజోనిధి యైన గౌతముఁ డటన్ గూపెట్టుచు న్వచ్చి చె
చ్చెర వానిం దన తేరిపై నిడికొనెం జేడ్పాటునం జేసి య
ప్డు రథోపస్థము నం దెఱుంగి కొఱగెన్ మూర్ఛాన్వితస్వాంతుఁడై. 276

వ. అంత నక్కడ జయద్రథుం డనేకసహస్రరథంబులతో భీమసేనుం బొదివి కదనంబు సేయుచుండ నక్కడ నిన్నొడుకులకును సౌభద్రాదు లగుపన్నిరుగురు మహారథులకును మహాయుద్ధం బగుచున్నంత నభిమన్యుండు మనస్విసమన్వితుండై. 277

సీ. వారి నొక్కొక్కని వరుస నొనేసి సన్నతపర్వనారాచశతుల నించె
వారలు వానిపై మేరువుపై మేఘములు వోలె శరవృష్టి మొలిక రలుక
నార్జునియును నిర్జరాసురసమరమునం గ సురేంద్రునిచాడ్పు మొంది
యొకపెట్ట నెల్లర నమ్ములఁ లూఁగించి, కైవడి యంతయుఁ గానుపించి
తే. పదను గలనాలుగుంబది ప్రదరముల వికర్ణుహయసూతకేతువుల్ గండ్రికలయి
పుడమిఁ బడ నేసి వానిపై వెడఁదనాఁడి, తూపు గిము లెన్ని యేనాటి యేపు మీఱె.

మ. అభిమన్యుప్రదరంబు లయ్యవి తదీయాంగంబు భేదించి లో
వ్రభిదాధ్వంబునఁ జొచ్చి వచ్చి వెలికిన్ వ్యాలంబులో నాఁగ నై
ప్రభవం బేర్పడ నెత్రు గ్రక్కుచుఁ గడున్ రమ్యప్రచారంబునన్
రభసంబుం గొని భూమిమధ్యమును జేరం గాఁజె ఘోరాకృతిన్. 279

వ. అట్లు శరవిద్ధుండై యుద్ధవిముఖుండైన వికర్ణుం జూచి వాని సహోదరు లోహటింపక సాహసంబున నోహరిసాహరిం బఱచి వచ్చి సౌభద్రాదిమహారథులం దాఁకి పోరుచుండి రప్పుడు, 280

తే. దుర్ముఖుం జేచి వడి శ్రుతకర్మ సేను,నారసంబుల నొప్పించి వారువముల
నాఱిటం దున్మి మేడింటనతనిసూతుఁ, గ్రౌంచిధ్వజ మొక్క తూపునఁ ద్రెరిచుటయును.

వ. విరథుం డై శ్రుతకర్ముండు ప్రతివిరకర్ముం డై దుర్ముఖునిపై దృష్టి నిగుడించె. 282

ఉ. మండెడు నుల్క వోలె నగుమంత్రితశక్తి నొకండు వూని చా
కుండఁగఁ బోవరా యనుచు నుద్ధతుఁ డై వఱగించె వానిపై
గొండనభాస్కరుం డనఁగ రెక్కొని శక్తి తదీయవర్మముల్
గండరువై పడఁగ నలిపి కార్ష్యపిగర్భముఁ జొచ్చె వచ్చుచున్. 283

క. శ్రుతకర్ముఁడు విరథుఁడు గా, శ్రుతసోముఁడు గొనియెదపదురుక్మరథముపై
శ్రుతకీర్తి యవ్వల న్నీ, సుతుని జయత్సేనుఁ దాఁకె సుడివడఁ గడిమిన్. 284

తే. మనజయత్సేనుఁ డంతయు మస్సరమున,వానిచాపము దునుమాడి వడి నేసంగఁ
గని శతానీకుఁ డడరె తమ్ముసకుఁ దలక,డంచి జయత్సేనుఁ బొదివెఁ గడంకతోడ.

—♦శతానీకుఁడు నీకుమారుల నోడించి వికర్ణుం జంపుట♦—

చ. పొదివి దశాశుగమ్ములను మొత్తియు నత్తఱిఁ గ్రొత్తయల్లుపూ
పది యరవోసి వక్షమసియాడఁగ నేసి మృగేంద్రునట్లు వె
ల్లదరఁగ దిక్కు లార్చె భవదాత్మభవుండును సొమ్మసిల్లె న
య్యదన న నీకొమాళ్ళు విలయాంతకులట్టిర యై రయంబునన్. 286

తే. పయిఁ బడఁగ నున్నయప్పు దోర్బలము మసంగ, నిగిడిదుష్కర్ణుఁ డాశతానీకుఁ దాఁకి
విల్లుద్రుంచిననొండొక్క విల్లుఁ బూని,యతఁడు నిలుమంచుఁ బెల్లేసి యార్చిమఱియు.

మ. ఒకబాణంబునఁ జాపముం దునిమి రెం డుగ్రాస్త్రముల్ వైచి వా
నికి సూతుం డగువానిఁ దున్మి పిదపన్ నిస్త్రింబు లీరార్కలం
బకముల్ చొన్పి తదీయవాహములఁ జావం జేసి తద్వక్షమం
దొకభల్లంబున నేయ ద్రొల్లి పడె వాఁ డుర్విస్థలిన్ బూర్వనాన్. 288

వ. ఇట్లు దుష్కర్ణుండు పడుటకుం గినిసి దుర్ముఖ దుర్జయ దుర్మర్షణ శత్రుంజయ శత్రుసహు లనునేవురుకుమారులు శతానీకుం జంపువా రై చుట్టుముట్టుటయు నట్టి యెడ రెట్టింగి కేకయు లేవురు నానకులనందనునకుం దోడుపడ వచ్చి రప్పుడు వారికిని వీరికినిం దీఱనిపో రయ్యె నయ్యెడ. 289

శా. ఎట్లు ల్లాఁటుచు నున్నకాలమునఁ గ్రోధోద్ధాత్ముఁ డై భీష్ముఁ డా
కట్లం గిట్టని జీరికిం గొనక లోకఖ్యాతసైన్యంబు లో
నట్టాడం జని సృంజయాదిబలసాహస్రంబు చేయాడ క
వ్విట్ల ట్లూఁగి యమక్షయంబునకుఁ బో యుద్ధం బొనర్చెన్నడున్. 290

సేవఁగ నైనఁ బోరుటక యెంచితి నీనుడి నాదరించి భూ
పా! విను మేను వారలనొ వారలు నన్నొ జయింతు రియ్యని. 299

—◆ భీష్మునిసప్తమదివసయుద్ధప్రకరణము. ◆—

వ. అని పలికి విశల్యకరణి యనుదివ్యౌషధంబు వాసి కిచ్చిన దాన నతండు విశల్యుండై వేదనం బాసి చనియె నంతఁ బ్రభాతంబున దేవవ్రతుండు సముచితప్రకారంబున సకలసేనాసమేతుండై సమరాంగణంబునకుం జని నానావిధశస్త్రాస్త్రసముచితానేకశతసహస్రరథాశ్వగజపదాతిబహులం బగునిజబలచయంబునఁ బ్రతిగజంబునకు నేడేసిరథంబులును బ్రతిరథంబునకు నేడేసియశ్వంబులును బ్రత్యశ్వంబునకుఁ బదుగురుధానుష్కులును బ్రతిధానుష్కునకు నేడ్వురు కాల్వురునుగా నుండ నియమించి మండలవ్యూహంబు రచించి దానిమధ్యంబున దేవగణపరివృతుం డగుదేవేంద్రునిచందంబున ననేకవీరపురుషపరివృతుం డైనదుర్యోధను నిలిపి పదివేలగుఱ్ఱంబులు నన్నివేలయేనుంగులు నన్నివేలరథంబులుం గలిగి చిత్రసేనాదు లగుపదివేవురు తన్నుం బరివేష్టింపఁ దాను సేనాముఖంబున నిలిచినంత శంఖారవంబులు రథనేమినిస్వనంబులును మురజమృదంగాదినాదంబులును జెల్లెగసి యెల్లెడం బర్వఁగయ్యంబునకుఁ గట్టాయితం బయ్యె నయ్యెడ యుధిష్ఠిరుండును నిజానీకంబుల వజ్రవ్యూహం బమర్చుకొని పశ్చాన్ముఖం బైనమండలవ్యూహంబు నెదిరించి నడచె నంత ద్రోణుండు విరాటునితోడను నశ్వత్థామ శిఖండితోడను దుర్యోధనుండు ధృష్టద్యుమ్నునితోడను నకులసహదేవులు శల్యునితోడను విందానువిందు లిరావంతునితోడను నానాదేశాధీశులు ధనంజయునితోడను భీమసేనుండు హార్దిక్యునితోడను సౌభద్రుండు చిత్రసేనవికర్ణదుర్మర్షణులతోడను ఘటోత్కచుండు భగదత్తునితోడను నలంబుసుండు సాత్యకితోడను భూరిశ్రవుండు ధృష్టకేతునితోడను యుధిష్ఠిరుండు శ్రుతాయువుతోడను జేకితానుండు కృపునితోడను డీకొని నానావిధాయుధంబులం బోరిన పోరు ఘోరం బయ్యె నయ్యవసరంబున జిష్ణుండు వార్ష్ణేయుం గాంచి యి ట్లనియె. 300

ఉ. పన్నిన మొగ్గరంబు తనప్రజ్ఞకుఁ బోల నదీసుతుండు నేఁ
డిన్నరనాథు లెల్లరు నహీనపరాక్రమ ముల్లసిల్లఁ గ
ర్వోన్నతి నున్నవా రిచట నో మురమర్దన! భ్రాతృయుక్తుఁ డై
క న్నిలుసేయు నాపయిఁ ద్రిగర్తమహీవరుఁ డట్లు చూడుమా. 301

ఆ. ఈవు చూచుచుండ నిందఱ వ్రేల్మిడిఁ, బట్టి పిలుకుమార్తు నట్టె యనుచుఁ
జెవులు దాఁటుగట్ట రవళిగా సారించి, గొనయ మంపవాన గురిసె నపుడు. 302

మ. పరమేష్వాసులు వారు కృష్ణులపయిం బ్రావృట్పయోదంబు లం
బరమధ్యంబు గలంచుచుంగఁ భ్రాతి జలసంపత్తిం దటాకంబున
ట్లురునారాచవితానవర్షమున ముం బొప్పింప నప్పట్ల స
చ్చరు లై తోఁచె భవచ్చమూచయమునం జెల్వారుహాహాధ్వనుల్. 303

వ. అంత నంతకాకారుం డై కౌంతేయావరజుండు. 304

శా. ఐంద్రాస్త్రం బరివోసి రోసమున నేయన్ రోదసి స్నిండుచు
న్సాంద్రజ్యోతు లెసంగఁ బొంగుచును దచ్ఛాతాశుగవ్రాతముం
దంద్రం జెందనిపాటునన్ బలిచి తత్తత్పారిసందోహము
దుం ద్రాసం బెసఁగించి మించెను భవత్సైన్యమ్ము భయం బందఁగన్. 305

మ. అరు లైంద్రాస్త్రమునన్ బడల్పడుడున స్థాతంబు పైపెచ్చు గాఁ
గరులం గాల్వురఁ గత్తలానులను దాఁకన్ రెంపు మూఁపసి మే
ల్మరముల్ సైన్యమునందు నెల్లకడలం జాఁగంగ నేయ న్నరే
శ్వరు లెల్ల న్వెఱఁ బాఱి భీష్మమఱు విచ్చం జొచ్చి రుద్విగ్నతిన్. 306

తే. అర్జునునికోల్తలకు సుశర్మాదు లోడి, పఱచునపుడు నీబల మెల్ల వాయువేగ
హాతమహార్ణవ మట్టు లత్యంతసంభ్రమంబునం జేసి క్షోభించె మనుజనాథ. 307

చ. బలఁగము చిందు వం దగుచుఁ బాఱు సుశర్మయు నోసరిల్ల న
బ్బలరిపునందనుండు నిజబాహుబలంబునఁ గోల్కొనంగ లో
నలిగి పితామహుండు వడి నర్జునుపైఁ బడ నేగుచుండఁ గ
న్గొనలఁ గని నీసుతుం డనిక నూల్కొనునట్లు సుశర్మ కిట్లనున్. 308

ఆ. ఓలి నూఁకఁ గొనక లీల గాంగేయుఁడు, విజయురథముఁ దఱియ వెడలె నదిగొ
నల్లన నేల నురలి నెసఁ నానికం దోడు, సేయుఁ డనిన వారుఁ జేసి రట్లు. 309

[illegible] ప్త్రిబలావృతుం డయి, వచ్చుచుగాంగేయు నిచ్చఁ జూచి
నివ్వ [illegible] శ్వేతాశ్వరథమునఁ, గపికేతనపురుచి గ్రందుకొనఁగ
సవ్య [illegible] బు సంభవించుటఁ జేసి, నీబలంబున నార్తినినద మెసఁగె
నపు [illegible] క నాతనికిం బోరు, ఘోరరూపంబునఁ గూడె నయ్యె
ఆ నాఁగ [illegible] గటిసూర్యుపగిది నుండెసకృష్ణు, నీబలంబు చూడ నేర దయ్యె
శ్వేతహారులకలము శ్వేతగ్రహమ్ము నా, వెలుఁగు భీష్ముఁ జూడఁ దలఁకి రరులు.

వ. అప్పుడు 311

మ. ధనురాచార్యుఁడు మాత్స్యునిం బొదివి క్రోధం బెక్క నొక్కొక్కటా
పనుకర్షంబునఁ జేసి విల్లు సిడముల్ హాసించుచుం ద్రుంచినం

గొని విల్లొం డొకఁ డాతఁ డాతనిఁ గడుం గోపించి మూఁడమ్ములం
దను వాఁడం బ్రహరించి నాలుగిట నొనాటం దురంగంబులన్. 312

—♦ ద్రోణుండు శంఖుం జంపి విరాటునిఁ గాందిశీకుం జేయుట ♦—

ఆ. అంతఁ బోక మఱియు నైదింట సారథి, నొకట ధ్వజము వేఱ యొకట విల్లుఁ
దాఁక నేయ గురుఁడు వీఁక విరాటుని, తేరిహరుల నెన్మిదింటఁ దునిమి. 313

ఉ. వాలికయ మ్మొకండు గొని వానిహయమ్ములఁ దోలువానినిం
గూలఁగ నేయుడు న్వైరపు గూరినచిత్తముతోడఁ దత్తఱ
న్నేలకు డిగ్గి మత్స్యపతి నెంజలి కై చని శంఖుతేరిపై
కాల మొనర్చెఁ దత్సహితుఁ డై గురు నేయుచు వాఁడికోలలన్. 314

క. కొడుకుం దండ్రియుఁ దనపైఁ, బిడుగులకుం బోనిపెక్కు బెడిదపుటమ్ముల్
వడి నేయుచుండ నాచార్యుఁడు వాల మ్మొకటఁ శంఖునురమున నేసెన్. 315

ఉ. అమ్ము తదీయవక్షమునయందు వడిం బడి వ్రచ్చి లోనికిం
గ్రమ్ముచుఁ జొచ్చి వెచ్చనయి కాలువ గట్టుచు నెత్రు ద్రావి సి
క్తమ్మును లోహిత మ్మగుచుఁ గ్రచ్చఱ వీఁపున దూసి వచ్చి వే
గమ్మున భూమిపైఁ బడియెఁ గాఁగలకార్యముఁ దీర్చిపుచ్చుచున్. 31

ఆ. తండ్రి చూచుచుండ ధరఁ ద్రెళ్ళె శంఖుఁడు, విడిచి యుసురుతోడ విల్లు నమ్ము
లపుడు కాలయముని కుపమింపఁ దగుద్రోణుఁ, బోరి నిలువ నోడి పాఱె నృపతి. 31

వ. ఇట్లు విరాటుండు కాందిశీకుం డైనం గని సంతసించుచు నాచార్యుండు వెండియు
పాండవసేనావారంబునయిం బడి కారించుచుండె నంత శిఖండియు నఖండ పరా
క్రమంబున నశ్వత్థామపై నురవడించి. 31

శా. భ్రూమధ్యంబున మూఁడువాఁడిప్రదరంబు ల్నాటి వైనాటినన్
హేమాహార్యము మూఁడుశృంగములతో సింపొందు నా నొప్పి య
య్యామువ్యాయముఁ డంతలో నతనిసూతాశ్వధ్వజంబుల్ శర
స్తోమంబు న్నిగుడించి త్రుంచెఁ గనలంచుం గెంపు సొం పొందఁగన్. 3

తే. పలుకయును వాలుఁ గొని హయంబులకుఁ గాని, తేరు విడనాడి నేలకు దిగ్గనుఁ
సాలువమువోలె నెడ మీఁక చని శిఖండి, కవిసి గురుసూతిశరతతిం దవిలి తుని

చ. గురుసుతుఁ డీసునం బసనుఁగోలల నేసి శిఖండిఖడ్గముం
బరియలువాఱ నేయుటయు బాహుబలం బఱి సోమకాన్వయుం
డరమర లేక సాత్యకిమహారథ మెక్కె ననంతరంబునన్
హరియనుజన్ముఁ డుగ్రతరుఁ డై యెదిరించుచు నయ్యాలంబునన్.

ఉ. లెక్కకు లేనిబాణముల లేశమునేఁ గృప లేక యేసినన్
రక్కసుఁ డయ్యలంబుసుఁడు రాక్షసమాయఁ బొనర్చి పేర్చుచుం
గ్రక్కున నర్ధచంద్రవిశిఖంబున సాత్యకివిల్లు ద్రుంచి యం
దెక్కుడఁ జూచినన్ శరము లే యగుసట్టులు చేసె నీసునన్. 322

తే. సూదిమొన మోపునంతటిచోటు గాన, రాక యుండఁగ దనదుమార్గణగణంబు
సమరభువి నిండునటు లేసి సవ్యసాచి, శిష్యు నొప్పించిన నతండు చెనర నపుడు.

తే. విజయసంప్రాప్త మగునైంద్రవిశిఖ మేయ
నది యసురమాయ నంతయు నడఁచి వైచి
యద్రిపైఁ గార్చిచ్చుగులకొని నస్త్రవృష్టిఁ
గురిసె నతఁ డంతటన్ వెఱ గూరఁ బఱచె. 324

వ. ఇట్లింద్రావిజేయుం డైనరాక్షసేంద్రు నిర్జించి శైనేయుండు దండిమగ లెల్లఁ జూచు
చుండ సింహనాదంబు గావించి నీనాఁడిపైఁ బడి నిశితాశుగంబులం బెఱలించె
నయ్యవసరంబున. 325

—♦ ధృష్టద్యుమ్నుఁడు దుర్యోధనుని విరథుం జేయుట ♦—

శా. ధృష్టద్యుమ్నుఁడు నీకుమారునిపయిన్ దివ్యాశుగవ్రాతమున్
ధృష్టుం డై పరగింప నాతఁడు కడున్ నిష్ఠుఁ డై నిల్చి య
త్కృష్టాస్త్రంబులు తొంబ దేసి కడిమిన్ దీపింపఁ బాంచాల్యుఁ డా
శ్లిష్టక్రోధుఁడ డై సుయోధనునివిల్ చెండాడి చండక్రియన్. 326

మత్త. కత్తలానుల నేడుకోలల గండడంచిన నాతఁడుం
దత్తరం డిగి తేరు వాల్ గొని తాను భార్గతునిమీఁది కు
ద్వృత్తి నేగుచు నుండ సౌబలుఁ డేగుదెంచి భవత్కుమా
రోత్తముం దనతేరిపైఁ గొని యుంచె నెంచఁగ నీప్రజల్. 327

వ. ఇట్లు గాంధారేయు నోడించి ధృష్టద్యుమ్నుండు నీసేనపైఁ బడి పరాక్రమించె
నప్పుడు. 328

మ. కృతవర్ముండు వృకోదరుం బొదివి శాతేషుప్రయోగమ్మునన్
సతతమ్ము న్జలజాప్తునిన్ జలద మాచ్ఛాదించుచందంబునన్
గృతహస్తుం డగువానిఁ గప్పుటయు నక్కిమ్మీరవిద్వేషియుం
బ్రతిబాణంబుల వానిసూతుశిరము న్వార్వంబులం ద్రుంచుటన్. 329

తే. అపుడు కృతవర్మ శకలీకృతాంగుఁ డగుచు, విరథుఁ డై నిల్వ నోపక ధరణికుతికి
నీకొడుకు సూచుచుండంగ నీమఱంది, వృషకుఁ డనువానితే రెక్కి వెడలి చనియె.

వ. భీమసేనుండును భీమపరాక్రమంబున మనవారిపైఁ బడి నుఱుమాడుచుండె ననిన
విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 331

తే. వారిజయమును నయము మావారియపజ
యమును భయమునె చెప్పెద వనయ మీవు
చెప్ప వింతకు విపరీత మెప్పుడేని
కారణము దైవమే కాని కలదె యొకఁడు. 332

తే. అనిన సంజయుఁ డిట్లను నధిప నీ ప్రజలు యథాశక్తి తమపౌరుషమునకుఁ దగఁ
బోరుచుండిరి వారిపై నేర మిట్లు,మోవఁ బెట్టుట తగు నని నీవు తలఁతె. 333

క. స్వాదు వగుగాంగజలము మహోదధిఁ బడి లవణభావ మొందినరీతిన్
మీదెసఁ గలపౌరుష మా,భూదయితులఁ జేరి వితగఁ బోయెం జువ్వే. 334

తే. అధిప! నీవును నీపుత్రుఁ డాచరించి,నట్టిదానన యింతలు పుట్ట నయ్యె
నాత్మదోషంబునం జేసి నైనదుఃఖ, మనుభవింపక తీరునే జనున కిందు. 335

తే. ఓల మాసింప కెల్లభూపాలవర్యు, లాలమందు వీరస్వర్గ మందఁ గోరి
శత్రుసైన్యంబునం జొచ్చి శక్తికొలఁది, విక్రమించుచు నుండిరి వినుము వెనుక.

వ. అయ్యెడ ననాటికయ్యంబున విందానువిందు లనునావంత్యు లిరావంతుం దాఁకి
పేఁకమెయిం బోరుచున్నంత నిరావంతుండు, క్రుద్ధుం డై. 337

ఉ. విందునిఁ దూల నేసి యనువిందునిపైఁ బడి నాలుగమ్ములన్
స్యందనఘోటకమ్ములను నాల్గిటిఁ జెక్కి యొకొక్కతూపునన్
మ్రందఁగఁ జేసి కేతనశరాసనముల్ ధరఁ గూల్చినంతటన్
విందునితేరిపై కతఁడు పేర్వఁసుచుం జనె వీతరథ్యుఁ డై. 33

క. విందానువిందు లేక,స్యందనగతు లగుచు దిక్కు లన్నియు నవి దై
క్రందుకొన శరచయంబుల, డిందించి రులూపిసుతుని డీకొని కడిమిన్.

ఆ. దాన నలిగి విజయతనయుఁ డావంత్యుల,నొవ్వఁ జేసి సూతుఁ ద్రెవ్వ నేయఁ
బోరు విడిచి వారు పోయిరి వార్వముల్,పొలిచి సంభ్రమించి పోయినట్లు.

వ. ఇరావంతుఁ డవంతీశ్వరులన్ గెలిచి కోల్తలం జేయుటయు విషంబు ద్రావిన
నీసైన్యంబు దైన్యంబు నొందె నంత. 3

శా. హైడింబుండు దివాకరాభ మగుదివ్యస్యందనం బెక్కి రా
పాడి న్మార్కొన రా మహాప్రతిఘు నాప్రాగ్జ్యోతిషాధీశ్వరుం
డీడంబోవక సుప్రతీక మనునాగేంద్రంబుపై నెక్కి తా
నీడాడె న్మను దారకాసురుని దేవేంద్రుండు వోలె న్వడిన్.

క. భగదత్తఘటోత్కచులకు, నగుసమరము దేవదానవాళికినిబలెం
దగె నృపతి యతఁడు సురపతి, తగిలి సురారులను బోలెఁ దఱిమె నరితతిన్. 343

—♦ భగదత్తుండు ఘటోత్కచు నోడించుట ♦—

సీ. భగదత్తునేనుఁగుమగఁటిమి కోపక, విఱిగి పాండవసేన వెఱచి పఱచె
నిలువరింపఁగ నందు నేరఁ డొక్కండున్న, వినుమన్క నై రెల్లవీరవరులు
భైమసేని యొకండు భారవహుం డయి, కాసంగ వచ్చె నక్కాలమందు
నాలింప నయ్యె నీయఖిలసేనలయందు, నార్పులు మింటిపై నంటికొనుచు
తే. నపుడు సైఁపక భగదత్తు నడఁచి రక్క, సుండు శరవర్షమున మొయిల్ కొండనుబలె
ముంచి మించినఁ గోపించి భూవిభుండు, రాక్షసుని నొంచె నెల్లమర్మముల నేసి. 344

చ. కదలక దాని కింతయును గ్రానముఁ బోలె ఘటోత్కచుం డనిం
బొదలుచు విక్రమించుటయు భూపతి కోపపరీతచిత్తుఁ డై
పదియును నాల్గుసర్వలల వాని నడంచిన మీఁచి వజ్రపుం
బదునున నొప్పుదెబ్బ దగుబాణముల న్నొగిలించె నాతఁడున్. 345

మ. నృపు డాదెబ్బది రెండుదెబ్బదులు గా నేలం బడం జేసి రో
షపరీతాత్మకుఁ డై హిడింబిసుతుఁ డశ్వవ్రాతముం ద్రుంచినం
జపలత్వంబున నుండి దైత్యుఁడు వడిన్ శక్తిం బ్రయోగించె న
ప్డు పయిం బాఱఁగవచ్చుదానిఁ దునిమెన్ భూజాని మూఁడై పడన్. 346

తే. అట్లు తనశక్తి రిత్త యై నాతఁ డులికి, మ్రోడు వడినట్టియరదంబు పీడి నముచి
పాకవైరికి వెన్నిచ్చి పాఱినట్లు, పాఱెఁ బ్రాణము లఱచేత బట్టుకొనుచు. 347

వ. అట్లు ప్రాగ్జ్యోతిషేశ్వరుండు దేవతేశ్వరాజేయుం డై విఖ్యాతపరాక్రమవిశ్రుతుం డగుఘటోత్కచు నోడించి పీడనివిద్వేషంబున నురవడించి పాండవసైన్యంబుపై దనమత్తవేదండంబు వోఁ దోలుటయు నయ్యాది పద్మాకరంబునం జొచ్చి విచ్చలవిడి విహరించి కలంచున ట్లెల్లసైనికులం గలంచె నంత మద్రేశ్వరుండు మాద్రేయులం దాఁకి రౌద్రంబు సూపుటయును. 348

క. నకులుఁడు సహదేవుఁడు మామ, మకు నెదురై వేనవేలుమార్గణములు త
త్సకలాంగకముల నినుచుచుఁ, బ్రకటగతిం బోరి రపుడు పార్థివు లెన్నన్. 349

వ. అయ్యవసరంబున శల్యుండును. 350

చ. నకులునివారువంబులను నాల్గిటి నాల్గుశరంబులన్ యమాం
తికమున కంపి నంత సహదేవునిపై నతఁ డెక్కి యుక్కునం

దికమకలాడ మద్రపతితేరు మునింగెనునట్లు మార్గణ
ప్రకరము లేయ నాతఁడు జనంబున నన్నిటిఁ ద్రుంచె నవ్వుచున్. 351

ఉత్సాహము. పిన్నయల్లు డపుడు మామపేరురంబునం బదు
న్వన్నె కెక్కినట్టిఘోరభల్లమొక్క టేయుచున్
గ్రన్న నేగి యది యురంబు వ్రచ్చిపోనఁ జచ్చిన
ట్లున్న రేంద్రు డారథంబునందుఁ బడియె సొమ్మసిల్లి. 352

ఆ. సొమ్మసిల్లినంత సూతుఁడు తద్రథం, బనికిఁ దొలఁగఁ దోలుకొని గమించె
నపుడు ధార్తరాష్ట్రు లార్చి రెక్కుడల్, నంకు లార్తి రాత్మ సంతసించి. 353

వ. అప్పు డింద్రోపేంద్రులం జూచి దైత్యదనుజసమూహంబు వోలె నకులసహదే
వులవిజృంభణంబునకు నీసైన్యంబు దైన్యంబు నొంది శిథిలపడియె నంత దివాక
రుండు మధ్యందినగతుం డయి కనుపట్టె నట్టియెడఁ బాండవజ్యేష్ఠుండు శ్రుతా
యువుం దాఁకి నతపర్వంబు లగుతొమ్మిదినారసమ్ము లేయుటయు నతండును.

చ. నసుమన వాని నన్నిటిని నవ్వుచుఁ ద్రెవ్వఁగ నేసి వానిపై
బెడిదపుటమ్ము లేడు పఱపెం దవ్విరతక్రియ నవ్వి ఱేన్వనం
బడి కవచంబు వ్రచ్చి కనుపారఁగ నెత్తురు గ్రావి పోయినం
గనువడి నొచ్చి ధర్మజుఁడు గన్నులు గ్రన్ననఁ జేవుఱింపఁగన్. 355

సీ. ఆశ్రుతాయువునురం బాడ నారాచకర్ణశిలీముఖమునఁ బూర్ణముగ నేసి
యరివోసి మఱియొక్క శరమున వానివిల్, క్కనుముక్కలుగఁ జేసి కేరలువాడిచెఁ
గనలి శ్రుతాయువు గాంతేయునెయి సప్త,నిశితసాయకముల నిలిచి యార్చె
దాన మహాక్రోధ మూని ధర్మసుతుండు, ప్రళయాగ్నివలెఁ గడుం బ్రజ్వరిల్లె

తే. నట్టు లలిగినపాండవు నరసి సురలు, విచ్చలించిరి భూతముల్ బెగడు వడియె
మూఁడులోకంబులకుఁగీడుమూఁడుననుచు,మునులుస్వస్త్యయనంబున మొనసిరపుడు

చ. నెలవుల నాకుచుం గనులు చెందొనల ట్లయి కెంపు లీనఁ గాఁ
బ్రళయవిభాకరుం డనఁగఁ బార్థుఁడు ఘోరతరాకృతిం దగం
దలఁకె భవద్బలంబు లొకదారిఁయుఁ బెన్నును దోఁప నట్టి నై
కల నది నాఁటితోన నరి గాఁ గల దంచుఁ దలంచి రెల్లరున్. 357

వ. అంతఁ గొంతవడికిఁ గాంతేయుం గ్రజుండు న్యగ్రుండు గాక ధైర్యంబునం జేసి తాన
తనకోపం బింత దిగఁద్రావి శ్రుతాయువుం గని. 358

చ. శర మరివోసి లస్తకము చక్కన వి ద్దెగ నేసి పిమ్మటన్
హరుల వధించి సారథి యమాతిథి గా నొనరించి వానిపై

మ. అసహాయుం డగుబాలునిం బొదువ భీష్మాదుల్మహాయోధు లా
వెసకుం బోయిరి చెప్పరా వెపుడు నేదిం గాన నోదేవ! తే
ర్వెస సవ్యాదులపైఁ బడం బఱపు మీ వేళ న్మదీయోద్ధతిం
బ్రసమీక్షింపఁ బొనర్తు నా నటు లొనర్పం జాలె నాతం డొగిన్. 369

తే. అలిగి నరుఁ డట్లు గవియ నీబలఁగములకు, భయము పెల్లయ్యె నయ్యెడ బడలువడక
యెదురఁ బడినసుశర్మపైఁ గదిసి చూపు,గముల గంభీరవాగ్గుంఫనములఁ బలికె. 370

చ. ఎఱుఁగుదు యుద్ధలంపటుఁడ వీ వని తొల్లిటినుండి వైరి వై
వఱలెదువాఁడవే యని నృపాలపతంగమ! యెక్కునాళ్ళ కి
ట్లుఱగొఱ లేనియట్టిఘల మై సమకూరె రణంబు నీకు ని
త్తఱిఁ గనఁ జేయుదుం బితృపితామహు లై చనునీదు ప్రేతలన్. 371

చ. పరుషము లిట్లు పల్కి నొకపల్కును బల్కక నేకచాపభృ
త్పరివృతుఁ డై సుశర్మ తనపైఁ గవియం జనుదెంచుకత్తిపైఁ
బరువడిఁ జుట్టు నై కవిసి బాహుబలం బలర న్నభోమణిన్
శరదము గప్పినట్లు శరజాలముల న్నిగుడించి కప్పినన్. 372

మత్త. తోఁకఁ ద్రొక్కినమొక్కలీఁ డయి తోఁచి యేచుసుత్రాఁచు నా
నాకిరీటి పరాక్రమమ్మున నమ్ము నమ్మున నమ్మునం
గాక లార్చుసువారివింపులు ఖండఖండము లై పడన్
వీఁక నేసియుఁ జేసె నెల్లయు విక్షతాంగులు గా ననిన్. 373

వ. మఱియు నానావిధకయ్యంబున సంక్రందననందనుండు గండు మిగిలి కేతనంబులఁ
గూల్చియుఁ గంకటంబుల రాల్చియు రథంబులఁ బగిల్చియు నేనుంగుల విదల్చియు
హయంబుల నుఱ్ఱియుఁ గాల్బలంబు గాల్చియుం బరమాభీలంబుగ నాలంబు సేయు
చుండ రక్తంబు సువర్ణంబై ప్రవహింప సందుఁ దలలు నట్టలు నట్టెట్టుఁ గొట్టుమిట్టు
లాడుచుండ మధ్యందినమార్తాండునిగతి మండుచున్న పాండవుం జేరికిం జూడ
రాకుండె నప్పుడు త్రిగర్తేశ్వరుండు ద్వాత్రింశచ్చక్రరక్షకరక్షితుండును మహా
రథుండు నై యురవడించి నరునిపై శరవర్షంబుగురియించుటయు నతండు సంజాత
రోషపరీవృతాంతరంగుం డై. 374

సీ. అఱువదియమ్ముల నమ్మువ్వదియ్వారఁ, జానేసి నదుసూనుచక్కి నడిచె
సంతలోన సుశర్మఁ దలిగి పెక్కురు బంధు,గులు మహారథులు తన్ గలియు దేర
నదరి కవ్వడి వడి నదలించుటయు శిఖం,డ్యాదులు తోడ్పడ నరిగి రటకు
నరుఁ డాత్రిగర్తుల నలిపి రారాజు జ,యద్రథముఖులతో నడ్డుపడిన

వారయఁ గామచారివి సమస్తవిధంబుల నైనమాయలుఁ
నేరుతు వౌర వైరమును నీ కగుఁ బార్థునిమీఁదఁ గావునన్. 52

క. వీనిఁ గడతేర్చి నామది, కానందముఁ గూర్పు మనుడు నాతం డటు లౌ
నౌ నని సన్నద్ధుం డై, తా నరిగె నులూపిసుతునిఁ దాఁకఁ వీఁకన్. 53

వ. వానితోడ నానాయుద్ధవిశారదులును ప్రాసాయుధధారులు నగు నిజయోధులు
పెక్కండ్రు మిగిలి రెండువేల గుఱ్ఱపుదళంబులవారునుం గూడి నడచి రట్లు
బహుళబలపరివృతుం డైనరాక్షసేశ్వరుం డిరావంతునిపైఁ గవియుటయు నతండును.

మ. తనపై వచ్చునలంబుసుం గని మదిం దన్నాశముం గోరుచుఁ
గినుకం గైకొని సత్వరుం డగుచుఁ దాఁకెఁ లోకు లెన్నంగ నం
తన కోపించుచు రాక్షసుం డెదిరి బాణంబుల్ ప్రయోగించుచుఁ
గన నక్తంచరమాయ యొక్కఁ డచటం గల్పించెఁ గల్పాకృతిన్. 55

వ. ఆమాయాప్రభావంబున నూలపట్టసపాణు లగు రెండువేలగుఱ్ఱపుదళంబులవారు
పుట్టి యిరావంతుని రెండువేల గుఱ్ఱపుదళంబులం జంపి తామును జచ్చి రంత
నిరావంతుండు క్రోధసంరబ్ధుం డై. 56

ఉ. వృత్రుఁడు వాసవుంబలెను వీసరవోవనిపౌరుషంబునన్
శాత్రవునెత్తికో లుడుప సంభ్రమముం గొని ఖడ్గహస్తుఁ డై
గాత్రము మూర్తి మైనగతిఁ జక్కటకిం జని విల్లు నమ్ములుఁ
ధాత్రిఁ బడంగ నేయుటయు దానవమాయ నలంబుసుండునున్. 57

తే. ఆకసంబున కెగయుఁడు నార్జునియును,దాను దనమాయ నడరించి వాని వెంట
నంటి సర్వాంగములఁ గోయునంత వాఁడు,జవ్వనం బంది యెప్పటి నివ్వటిల్లె. 58

వ. అట్లు నఱకి యిరావంతుండు మఱియుం బరశ్వథంబున శీర్షంబు దెగ నఱకుటయు
నతండు మ్రోడువడినవృక్షంబువలె నై బిట్టార్చుచు రుధిరంబు గ్రక్కుచు నొక్కిం
తలోన నిజమాయాప్రభావంబున మఱియు నెప్పటియట్ల ఘోరాకారంబునం
జూపట్టె నరుపట్టి బట్ట నుంకించె నంతలో నతండును. 59

ఉ. మాయకుఁ డియ్యలంబుసుఁడు మాటలఁ దీరఁడు మాతృవంశజా
తాయతమాయఁ గైకొని రయంబున మృత్యుముఖంబుఁ జేరఁ గాఁ
జేయుదు నం చనంతుఁ డయి చెన్నలరారి సరీసృపౌఘముల్
పాయక చుట్టువాఱుకొన వానిని ముట్టె భయంబు పుట్టఁగన్. 60

క. రాక్షసుఁడు గరుడరూపం, బాక్షణమునఁ దాల్చి యెల్లవ్యాలముల వడిఁ
గుక్షిం జేరిచి మోహితుఁ, డై క్షీణబలుఁ డగువాని నసిఁ దెగ నేసెన్. 61

తే. మకుటకుండలమండిత మకలుష మగు,నింద్రపౌత్త్రునిశిరము పద్మేందుసదృశ
మయి వెలుంగుచు నిలఁబడె నపుడు నీబ,లంగ మార్చెఁ బాండవబలం బంగలార్చె

మ. ఇరువాఁగుం జతురంగసైన్యములతో నేపారుచున్ భూపతుల్
వరశస్త్రాస్త్రములం బరశ్వధములం బ్రాసంబులన్ శక్తులన్
దురముం జేసిరి ఘోరరూప మగుచున్ దోరంబుగా నత్తఱిన్
ధరణిం ద్రెళ్ళె రథంబు లశ్వములు మాతంగంబులుం గాల్వురున్. 63

తే. అనిన ధృతరాష్ట్రుఁ డక్కథకునకు ననియె, నిట్లిరావంతుఁ డాలమం దీల్గుట విని
పాండురాజకుమారు లేపగిదిఁ జనిరి, సమర మెట్లయ్యెఁ జెపు మన్న సంజయుండు.

వ. ఇట్లనియె నయ్యవసరంబున ఘటోత్కచుండు. 65

—♦ ఘటోత్కచుండు ద్రోణాచార్యపరివృతులతో యుద్ధము చేయుట ♦—

ఉ. తమ్మునిపాటుఁ జూచి కనుదమ్ముల నొల్కఁగ నుల్క లల్కఁ బ్రా
ణమ్ముల నుగ్గఁ బట్టి జవనమ్మున నార్చెఁ దదారవమ్ము ఘో
ర మ్మయి తాఁకుదెంచుటయుఁ గ్రావములు న్వనధు ల్వనంబులన్
గ్రమ్మినభూమియుం దెసలు గాఢముగా వడఁకాఁజె నయ్యెడన్. 66

మ. పరమేష్ఠ్యండము వ్రేలున ట్లయిన సిధ్వానంబు శ్రోత్రపథం
బరు దే సింగముబాఱెఁ బక్షికరుల ట్లం దున్నవా రందఱున్
చరణద్వంద్వము తొట్రిలన్ వడఁకుచున్ సర్వప్రకారమ్మునం
బరివేష్టించుచుఁ జుట్టుముట్టుకొని కంపం బంది రెంతేనియున్. 67

చ. పిడుగున కెత్తువచ్చునటు పెల్లుగ నార్చి ఘటోత్కచుం డొగిన్
బెడిదపుశూలముం గొని విభీషణరూపులు ఘోరరాక్షసుల్
కడువడి వెంటనంట లయకాలయముం డయి నీదుమూఁకపై
నడరుటయున్ భవత్తనయుఁ డాగ్రహవిగ్రహుఁ డై రయంబునన్. 68

ఆ. శరశరాసనములు కరములం గైకొని, చెవులు తూఁటు గట్ట సింహనాద
మొదవ వానిఁ దాఁకెఁ బదివేలయేన్గుల,తోడ వంగవిభుఁడు తోడుపడఁగ. 69

క. తనపై వచ్చెడువారిం, గని హైడింబుండు కన్నుఁగవ కెంపెసం
దనవారితోడఁ గరిఘట,లను మార్కొని పోరెఁ బోరు లావై యొప్పెన్. 70

మ. శరశక్త్యస్త్రపరశ్వథప్రముఖశస్త్రవ్రాతపాతమ్మునన్
గిరిశృంగాగమసంప్రయోగమున నక్కానాశభృత్యు ల్గజో
త్కరము న్నాశముఁ జేసి రంధ్రములు దెగన్ గండంబులుం బిండిగాఁ
గరముల్ ద్రెవ్వఁగ దొక్కలుం బగిలి పోఁగా శీర్షముల్ నుగ్గుగన్. 71

మ. మదమాతంగము నేలపా లయి భయోన్మగ్నాత్ము లై సైనికుల్
కదనంబుల్ విడిపోవ నీకొడుకు సుక్షాత్త్రంబు మానంబు నె
మ్మది సంధించుచు నద్రిపోలెఁ దిరుఁడై మానొంది కాలాగ్నికిన్
బదులై వేఁడి వెలార్చునస్త్రముల నానక్తించరు న్మోఁదుడున్. 81

మ. తనపై మండుచు వచ్చుదాని నడుమన్ దర్శించి హైడింబుఁ డిం
తన లంఘించియు లాఘవంబునఁ దదస్త్రం బొంటరెం డై రణా
వనిఁ గై సేయఁగఁ జేసి యార్చెఁ బ్రళయాబ్దధ్వానముం బోలఁ గ
న్గొనలన్ నిప్పులు రాల నీబలము గర్గోలై కడుం దూలఁ గన్. 82

వ. అట్టియెడఁ గురుపితామహుం డాచార్యసన్నిధికిం జని యెల్లవారు విన నిట్లనియె.

ఉ. వింటిరె యోధులార! యదె భీషణనాదము శ్రోత్రపాత మై
కంటక మయ్యెడిన్ విభుఁడు గానఁగరా డతనిన్ ఘటోత్కచుం
డంటి రణంబు సేయు నన నయ్యెడు వాని జయించు లేని కే
నొంటరికిం దరం బనఁగ నొప్ప దసాధ్యుఁడు వాఁడు పోరులన్. 84

క. కావున మీమీసేనలతో వడి నట కేగి మీరాజు దుర్యోధనునిం
గావుఁ డిదె మనకుఁ జేయం, గా వలసినయట్టియుచితకార్యము చూడీ. 85

వ. అని యప్పితామహుండు సెప్పినప్పుడ ద్రోణ కృపా శ్వత్థామలును బాహ్లిక సోమదత్త భూరిశ్రవులును శల్య సైంధవ బృహద్బలులును విందానువిందులును వికర్ణచిత్రసేనవివింశతులును రథారూఢు లై బహులరథానీకంబులతో సుయోధనునకుం దలకడచి భీమసేనసూనుం దాఁకుటయు నతండు మైనాకంబుపోలెం బో కంతయుం గంపింపక శూలముద్గరాదిప్రహరణపాణు లైనపూర్వగీర్వాణులు దనకుఁ దోడ్పడుటయు నయ్యిరువాఁగువారికిని బోరు ఘోరం బయ్యె నయ్యెడ రాక్షసేంద్రుండు ధనుష్టంకారంబొనర్చుచు భైరవారవంబున నార్చుచు. 86

సీ. గురునివిల్ దునుమాడి యరచందుతూపునఁ,దఱిగి యొంటన్ సోమదత్తుధ్వజము
నొకమూఁట బాహ్లికు నుర మాడఁగా నేసి, కృపు నొక్కశరమునఁ గెరల నొంచి
చిత్రసేనుని మూఁట జెక్కి యొక్కట వికర్ణుని మూర్ఛ ముంచి జత్రువున నేసి
పదియేనుప్రదరముల్ పరఁగించి భూరిశ్రవసునిబొందఱిమును వడిగఁ జించి

తే. ద్రౌణియు వివింశతియు రథదక్షిణస్థులను ధరం బడ నొక్కొక్కమ్మున నొనర్చి
యర్ధచంద్రాస్త్రమున వరాహధ్వజంబు,ధనువునుం ద్రుంచి సైంధవుఁ దరల నేసి.

శా. ఆవంత్యాశ్వచతుష్టయంబు ధరపా లై పోవఁ గావించి కో
పావిష్టుం డయి యేసి సాయక మొకం డాతేరిపై మ్రొగ్గన

ల్లై వాపోవ బృహద్బలుం జెనకి దివ్యాస్త్రంబులన్ మద్రభ
దేవేంద్రప్రభృతిప్రధానుల ననిం దేలించి తూలించి యున్. 88

వ. ధైర్యస్థైర్యంబు లనువడ దుర్యోధనుం దాఁకు దెంచుటయు నంతలో బాలమాత్ర చాపంబుల ధరించి మహారథు లగునీయోధులు దుర్యోధనునకుం దలకట్టి మరల ఘటోత్కచు నెదిరించి శరవర్షంబు పరఁగించిన నతండు నతిగాఢవిద్ధుం డై తోత్త్రార్దితం బగుమత్తమాతంగంబుమాదిరిం గ్రోధతామ్రాక్షుం డై గగనంబున కెగసి దిక్కు లద్రువ నొక్కపెట్ట బెట్టుగ నార్చె నయ్యార్పు విని యుధిష్ఠిరుండు భీమసేనుం జీరి యి ట్లనియె. 89

మ. ధృతరాష్ట్రాత్మజముఖ్యులం దొడరి యెంతేఁ బోరు హైడింబుఁ డీ
క్షతిభారం బగు దెంచె నంచు వినదం బాలింప నయ్యెన్ భయో
న్నతి సూచించుచు నిమ్నగాతనయుఁ డౌన్నత్యంబునన్ సోమకా
యతసేనం బెరలించుఁ గార్యములు రెం డుం దిం దగుం జూడఁగన్. 90

తే. ఇవ్వలనఁ జాలి విజయుండు నివ్వటిల్లు, నవ్వలని కీవు చని పుత్త్రు నరయు మనిన
నా ననుచు సింహనాదంబు మారు మేచ్చు,లెల్ల భయ మందఁ గావించి యేగె వడిగ.

వ. అప్పుడు సత్యధృతి సౌచిత్తి శ్రేణిమంతుండు వసుధానుండుఁ గాశ్యపుత్త్రుండు గాంపదేయాభిమన్యుప్రభృతులును క్షత్త్రదేవక్షత్త్రధర్ములును నీలుండు నమాపాధిపతియు ననువా రాజు వేలగంధసింధురంబులును బెక్కువేలరథంబులునుం బరివేష్టింప సింహనాదంబులును నేమినిర్ఘోషంబులును నఖండభేరీనిస్వనంబులునుం బోరుకలుగ ఘటోత్కచావనతత్పరు లై భీమసేనుపిఱుందం జని నీవారిం దలపడుటయు వారును భీమసేనపురస్సరం బగునమ్మహాసైన్యముం దిలకించి భయాతిశయంబున వివర్ణవదను లై ఘటోత్కచుని విడిచియు నుడివోక వీరి నెదిరించి రప్పుడు నీవారికిని వారికినిం గొంత ప్రొద్దస్త్రప్రత్యస్త్రంబులం బోరు ఘోరాకారం బయ్యె నయ్యెడ. 92

శా. తేరుల్ తేరులు నేన్గు లేనుఁగులునుం దేజీలుఁ దేజీలునున్
వీరుల్ వీరులు దాఁకి వీఁక మెయి దోర్వీర్యం బవార్యంబుగా
నారాచంబుల నస్త్రశస్త్రముల నానారీతులన్ హేతులన్
బోరం బోరఁగ నెత్తు రేఱు వఱచెన్ భూరిప్రవాహక్రియన్. 93

వ. అంతలోన. 94

ఉ. భీమగదాభిఘాతములఁ బిమ్మట నొంది పరాఙ్ముఖంబుగా
నామహి శేష మై నిలిచినట్టిభవత్సుతసైన్య మీఁగిపో

భీముని దాఁకి వృకోదరుకు భీమబలంబున బాణవర్షముం
వేమఱు [illegible] జేసి ప్రభవించిన క్రోధరసంబు పెంపునన్. 95

తే. తీక్ష్ణమైన యర్ధచంద్రాకృతిం దలిర్చు, లోమవాహిశరంబున భీమసేను
కార్ముకము [illegible]దున్మి యంతలో గాఢతరశర మ్మురమ్ము చ్చిపోనేసె రయము మెఱయ

ఆ. గాఢవిద్ధుఁడైన గాడుపునందనుం, డూఁతఁ గొనుచు సోలెఁ గేతుదండ
మలరిఁ జూచి యేచి హైడింబసౌభద్ర, ముఖులు దాఁకి రాజి మొనసి రాజు. 97

వ. అంత నాచార్యుండు కృపాశ్వత్థామప్రభృతులం బిలిచి సంభ్రమించుచు నిట్లనియె.

చ. అడరి వృకోదరుం దెలిసినట్టిరమై యభిమన్యుముఖ్యు లి
ప్పుడు కడు పెల్లు రేఁగి తగుపూనిక నార్చుచుఁ జేరెలుంగునం
గడువడి సంభ్రమించుచును గైకొని శస్త్రము లుర్వినేతపైఁ
బడ నడె వచ్చి రెద్దుఁడు నృపాలునిఁ గావుఁడు లెండు నావుఁడున్. 99

వ. అయ్యాచార్యవచనంబునం గృపాచార్యాశ్వత్థామభూరిశ్రవశ్శల్యసైంధవబృహద్బ
లచిత్రసేనవివింశతివికర్ణవిందానువిందాదులు సోమదత్తపురోగములై యిరువది
యడుగులమేఱ నడచి పొదివికొని దుర్యోధనునకుం గావలియై యుండి రంత
భారద్వాజుండును ధనుష్టంకారంబు చేయుచుం జని. 100

—♦ గురుకృపాశ్వత్థామాదులు భీమునితోఁ బోరుట ♦—

చ. ఇరువదియాఱునారసము లేర్తెఱఁ గైకొని గాఁప్పుపట్టిపై
నురువడి నేసి యంతఁ జన కుద్ధతిపెంపున వారిధారలన్
ధరణిధరంబుఁ గార్మొగులు దద్దయుఁ గప్పినరీతి నాశుగో
త్కరములఁ గప్పెఁ దద్రథము దానఁ జలింప కొకంత భీముఁడున్. 101

ఆ. కనలి దశశిలీముఖముల నాచార్యుని, వామపార్శ్వ మేయ వ్యథితుఁ డగుచుఁ
దెలివి దప్పి గురుఁడు తేరిపైఁ బడె వయో, వృద్ధుఁ డగుటఁ జేసి వెరవు దప్పి. 102

చ. సొలసిన ద్రోణుఁ దేరిపయిఁ జూచి కడుంగడు సంభ్రమించుచుం
దలకఱియున్ భవత్సుతుఁడుఁ దత్సుతుఁడున్ బకవైరి తేరిపైఁ
బెలుచ నతిక్రమించి చని పెల్లు శరంబులవెల్లిఁ గొల్పుఁడున్
దొలఁగనియుల్కఁ గన్నుఁగవఁ దోరపుటల్కలు చిల్కరించుచున్.  103

క. వడముడి కాలాంతకుఁడై, వడివడి గదఁ బూని డిగ్గి వసుమతికిఁ గడున్
బెడిదముగఁ ద్రిప్పి వ్రేయుచుఁ, నడరె నచలమ్ములు లచలుఁడై రణభూమిన్.

సీ. గదఁ బూని శృంగంబు గలిగిన కైలాస, గిరి వోలె నెదిరింప గుఱుసుతుండు
దుర్యోధనుండును దోడివారును గూడి, యురువడించెనంత గురుఁడు దెలిసి

పదుగురతోఁ జ్వాటు పొదల నందఱతోఁడ, బహ్వస్త్రశస్త్రముల్ పరఁగఁ జేసి
ధరణీగతుం డగుమరుదాత్మజునిమేను, మునుఁగఁ జేయుచును గన్గొని తలంకి
తే. కృష్ణునల్లునితోఁ గూడి వృష్ణివరులు, మత్స్యపాంచాలకేకయమనుజపతులు
మొదలుగాఁ గలయోధులు వదలి భీతి, తాఁకఁ గనిసిరి రిపులపై నతిశయిల్లి. 105

—♦ అశ్వత్థామ నీలుని మూర్ఛితుం జేయుట ♦—

ఉ. నెచ్చెలి భీమసేనునకు నీలుఁ డనూపవిభుండు గాంచి తా
వచ్చినమచ్చరంబున సురేంద్రుఁడు తొల్లిట విప్రచిత్తిపై
వచ్చినయట్లు వచ్చి కడు వాఁడిశరంబున గాఁడ నేసినన్
నొచ్చి స్రవింప నెత్తురు లనూనగతిన్ గురుసూతి క్రుద్ధుఁడై. 106

మ. కని యింద్రాశనితుల్య మైనధనువుం గైకొంచు వేగంబునం
జని కర్మారవిచిత్రితాంబకములన్ సంధించి నాల్గింట వా
హనముల్ నాల్గును రెంటఁ గేతనము మాయం జేసి శేషాంబకం
బున నీలోరము నేయ నాతఁడు పడెన్ మూర్ఛాన్వితస్వాంతుఁడై. 107

వ. ఇట్లు నీలుండు మూర్ఛితుం డైనం గాంచి ఘటోత్కచుండు క్రోధమూర్ఛితుం
డై జ్ఞాతులతోడం గూడి భారద్వాజాత్మజుం దాఁకి నానావిధాస్త్రశస్త్రంబులం
బ్రయోగించి నొంచుచు నంతలో ఘోరరూపం బయినమహామాయ నొండు
గల్పించుటయుఁ దత్ప్రభావంబున ద్రోణసుయోధనాశ్వత్థామశల్యప్రభృతులు
మహారథులును దక్కినచతురంగసైన్యంబులును దైన్యంబు నొంది నిశాతహేతి
వ్రాతనిహతిగాత్రు లై ధాత్రిం బడి యెముకలు విఱుగ నెత్తుట నత్తమిల్లుచున్నట్లు
కానంబడిన మనసైనికు లెల్లరుం దల్లడిల్లుచు విస్మయంబోయి విముఖు లై శిబిరంబుల
దిక్కు మొగంబు వెట్టినంత నేనును దేవవ్రతుండు నెలుం గెత్తి. 108

మ. ఇది హైడింబునిమాయ గాని మఱియొం డేమేనియుం గాదు మో
హదశం గైకొని భీతుసం బఱవకుం డాలంబు గావింపుఁ డి
ప్పుడు మీ కిట్లని యెంత చెప్పినను మాపల్కుల్ పెడంబెట్టి బె
ట్టిదముల్ వల్కుచుఁ బాఱఁ జొచ్చిరి కడున్ డీల్పడ్డచిత్తంబులన్. 109

వ. ఇట్లు నెఱచఱచి చిందఱవందఱ యై మనసైన్యంబులు పఱచుచున్నం గని పాండవ
సైన్యంబులు హర్షోత్కర్షంబునం బొంగి సింహనాదంబులును శంఖనాదంబులును
భేర్యాదినాదంబులును గావించి రాసూర్యాస్తమయసమయంబున గాంధారేయుం
డు గాంగేయునిచెంతకుం జని ప్రాంజలి యై ఘటోత్కచునివిజయంబును దనవారి
పరాజయంబునుం జెప్పి నిట్టూర్పు నిగిడించుచు ని ట్లనియె.

మ. వసుదేవాత్మజు నాశ్రయించి విమతుల్ భాసిల్లున ట్లేము నిన్
వసుతుల్యప్రభు నాశ్రయించి యిటు లభ్యార్థముం జేతకుం
బ్రసమీక్షించి కడంగితిం బ్రబలు లై వర్తించునా సైనికుల్
నిసితుం డైనను నీనొడి న్నిలిచి రే నీయాజ్ఞ వర్తించితిన్. 111

మ. ఇటు లున్నన్ సుపరిస్థితుల్ పెరలు మ న్మెంతేని వేధింతు రే
నిట ము న్నాజి ఘటోత్కచాదులకు నై హీనుండ నై పోయితిన్
బటుబాహాబలనిర్జితారిజన ! నాస్వాంతంబు చింతాజ్వరో
త్కటవహ్నిన్ బడి కాలుచున్నయది యుష్మత్పాదము ల్మ్రొక్కెదన్. 112

ఆ. నిన్ను నాశ్రయించి నీప్రసాదమున నేఁ, బాత్ర మగుచు నున్నవాఁడ నేని
రాక్షసాపశదుని రాల్చి నాకోరికి, సఫల మగువిధమున జలుపు మనఘ. 113

వ. అనిన నతం డతని కి ట్లనియె. 114

మ. విను దుర్యోధన! నాహితార్థులను బృథ్వీనాథుఁ డెల్లప్పుడున్
దనసంరక్షణముం దలంచుకొనుచున్ దా నారితో వీరితో
ననికిం బూనక తుల్యునిం దొడర మే లౌఁ గానఁ నీ వింక పాం
డునృపాలాత్మజులం దొడంగి పెరతో నూల్కొకు మాలంబునన్. 115

ఉ. నేనును ద్రోణుఁడుం గృపుఁడు నీయనుజన్ములులోనియెల్లరున్
బూని సమస్తకార్యములు పొం పొడఁగూర్పఁగ నున్నవార మా
మానిసిదిండి నోర్చుపని మాపయి నున్నది దీని కేల యి
ట్లీవరనాథుఁ డెంతలకు నేని సమర్థుఁడు చూడు మీతనిన్. 116

క. అనిభగదత్తుని జేర్కొని, తనచెంగట మెలఁగురాజతల్లజు నతనిన్
గని మనరాజేంద్రునినుడి, వినినాఁడవ కాదె యేల వివరింపంగన్. 117

ఉ. నీవడి నే నెఱుంగుదును నీ వసురేంద్రులఁ దోల్లి పెక్కుఱన్
జావఁగ నేసినట్టిఁడ వెసంగెనునీకడ దివ్యశస్త్రముల్
దేవవిభుండు తారకునిఁ దెచ్చినయట్లు బలంబు లంటె రాఁ
జేవమెయిన్ ఘటోత్కచునిఁ జెట్టడఁ జేయుము పోరితమ్మునన్. 118

వ. అనిన విని భగదత్తుం డుత్తుంగమాతంగసంఘంబు వెంటనంటి నడువ గర్జానినాద
మేదురం బగుసింహనాదంబు సేయుచుం జని ఘటోత్కచుం దాఁకుటయు నంత
భీమసేనాభిమన్యు ద్రౌపదేయసత్యధృతిక్షత్రదేవ చేదిదాశార్ణపతివసుధాను లత
నికిం బాసట యై నిలిచిన నుభయబలంబులకు యమరాష్ట్రవివర్ధనం బగుమహా
యుద్ధంబు సిద్ధించె నందు రథులు విరథు లై సారథులు వీతమనోరథు లై రథం

బులు వితథంబు లై యేనుంగులు పీనుంగు లై తురంగంబులు విశలాంగంబు లై పత్తులు సంప్రాప్తవిపత్తు లై రణాంగణంబు భయానకం బై యున్నయప్పుడు. 119

మ. సెలయేర్లై మదధార లొల్కఁ గిరి నాఁ జెల్వొందునాసుప్రతీ
కలసన్నామగజేంద్రు నెక్కి గరిమం గన్పట్టుచో దంతిపై
బలవిద్వేషి గలిర్చునట్లు తగి ప్రాగ్జ్యోతిషాధీశ్వరుం
డలుకం దాఁకె వృకోదరున్ సునిశితాస్త్రాళిం బ్రయోగించుచున్. 120

తే. అలిగి భీముఁడు శరవృష్టి నడరఁ జేసి, చక్రరక్షకు లై వానిసామజంబుఁ
జుట్టియుండినవెక్కండ్రఁ జూడ్కి సాఁగు, నాతలో నంతకునివీటి కనుచుటయును.

సీ. పాదరక్షకులట్లు పడినఁ గన్గొని భగ, దత్తుఁ డలివి తనమత్తదంతి
ననిలజుపైఁ దోల నరిగోసి విడిచిన, శరమట్లు లది వడి నరుగుఁ దేర
నభిమన్యుముఖు లెల్ల నంపఱ నిగిడించి, యును దాని నాఁగలే కుండునవుడు
నెత్తువట్టున ధాఁకుచిట్టిగిరివోలె, వెలయుదాని దశార్ణవిభుఁడు గాంచి

తే. తాను దనమత్తగజమును దానిమీఁదఁ, దోలుటయు నది దానిని వేల సాగ
రమునుబలె నాఁగునా శౌండుఁగాంచునును, మేలు మేలని మెచ్చి రామేదినీశు. 122

మహాస్రగ్ధర. అలుకం బ్రాగ్జ్యోతిషేశుం డలరెడు పదునా లై నమేత్తోమరంబుల్
విలసచ్ఛైలంబువోలెన్ వెలసినకరిపై వేసినన్ దానిమేనం
గల మైమ ర్వెల్ల నుగ్గై కలిరయు ధరణిలో గాటముం దూరిపోవన్
బల మెల్లన్ విహ్వలింపం బలువిడి మొఱలుం బర్వఁగాఁ ద్రోసి పాఱెన్. 123

వ. అట్లు దశార్ణవృనిదంతావళంబు తోమరప్రహారంబునం దోదూయమానం బై మహావాతంబు మహీరుహంబులంబోలెం ద్రొక్కి పాడి పోయినం గని చలింపక. 124

ఉ. పాండవయోధు లెల్లరును బావని ముఖ్యులుఁ గొంచు మించి దో
ర్దండబలంబు పెంపున నుదగ్రగతిం గొని సింహనాదముల్
కొండలఁ బిండి సేయునట్లు కొల్పుచు నాభగదత్తుమీఁది కు
ద్దండరయంబునం గవిసి తద్గజముం గోరిర శస్త్రసంతతిన్. 125

మ. భగదత్తుం డలుకన్ స్వనాగమును గొల్పం దోత్త్రఘాతంబునన్
దగి సంవర్తకపావకం బనఁగ నాదంతీంద్ర మహ్వానికే
యగపస్యందనసైంధవౌఘముల డాయన్ జొచ్చి మర్దించుచో
మొగిఁ దత్సైన్యము లెల్లఁ జెల్లచెదరై మూర్ఛిల్లి త్రెళ్లెం ధరన్. 126

తే. తనబలం బట్లు భగ్న మై చనుటఁ గాంచి, కసలి హైడింబుఁ డద్రులఁ దునుమఁ జాలు
శూలమునుబూని ప్రాగ్జ్యోతిషునిగజంబు, పై విసరి వేసె నంతయుఁ బంత మెసఁగ. 127

చ. విదురుఁడు ప్రాజ్ఞుఁ డిట్లెఱిఁగి వీరికి వారి కనర్థదంబు పో
రది తగ దంచు మాముసలియయ్యకు నయ్యెడఁ జెప్పెఁ జెప్పినం
గదనము తప్ప దయ్యె విశిఖంబులతాఁకున నిందు నందునుం
బహుగురు నేలపా లయిరి పల్కఁగ నేమిటికింక మాధవా. 137

చ. ధనమునకై నికృష్ట మగుదారి మెలంగుచు నుందు రక్కటా
జను లిసిసీ ధనాశ గద జ్ఞాతివధం బొనరింపఁ జేయు ని
ట్లని ధన మందఁ గోరుచు ననార్య మొనర్చుచునుంట కంటె ని
ర్ధనుఁ డయి చచ్చు టే వరము రాచసిరుల్ రుధిరాక్తముల్ కటా. 138

తరువోజ. శకునికర్ణాదులసతతదుర్మంత్ర, సంగతిఁ ధృతరాష్ట్రజనపాలసుతుని
ప్రకటాపరాధంబువలన నేఁ డిట్లు, పడి చావఁ గా నయ్యె బహురాజలోక
మకట యుధిష్ఠిరుం డైదూళ్లొసంగుఁ, డని యొనర్చినయాచ్న యది లెస్స యగుచుఁ
బ్రకటితం బయ్యె నిప్పటి కంతమాత్ర, వా రొసంగనిదానఁ బ్రలయంబు వచ్చె. 139

చ. పుడమి శయించునట్టినరపుంగవులం గనినంత నామనం
బడలెడు నన్ను నేఁ దెగడనయ్యెద నియ్యెడ క్షత్రజీవనం
బిడుమల కౌ నిసీ యిసి యొకింతయు నాకు రుచింప దీరణం
బెడపి గమింతు నన్ను నను నిందఱు నింద యొనర్తు రక్కటా. 140

తే. తలఁకి యపకీర్తి కే కృష్ణ కల నొనర్పఁ, దలఁచితిని గాన వారువంబులను వడిగ
నడపు మరిసేనపై జగన్నాథ! సమర, సాగరం బీఁదెదఁ భుజసార మెసఁగ. 141

క. కాలం బిటు వృథ సేయుట, పోలదు సత్వరుఁడ వగుము పురుషోత్తమ! నా
మేలనుచుఁ బార్థసారథి, లీల మెయిం దరిమె హరుల లేఁబ్రొద్దుతఱిన్. 142

వ. అయ్యపరాహ్ణంబున నిరుసైన్యసంచయం బెల్ల వాతోద్ధూతం బై పర్వకాలంబునం బెల్లెగసి యుల్లకల్లోలం బగుమహార్ణవంబుచందంబున నమందారావంబునం బొంది క్రందుకొనియె నాసందడిసమయంబున గంగానందనుండు గండుమిగులుటయు నీనందను లెల్ల వసువులు వాసవుం బోలె నాచార్యుం బరివేష్టించి భీమసేనుం దాఁకుదెంచి రంత శాంతనవశారద్వతభగదత్తసుశర్మలు శతమన్యుసుతుం బొదివియుహార్దిక్యబాహ్లికులు సాత్యకిం దలఁపడియు నంబష్ఠకేశ్వరుం డభిమన్యు మాఱొక్కనియుఁ దక్కటివారుఁ దక్కినవారిం గవిసియుం బోరిన పోరు ఘోరరూపం బై భయావహం బయ్యె నయ్యెడ. 143

ఉ. భీముఁడు తన్ను మాఱుకొని బీరము సూపెడునీదుపుత్రులన్
దీమస మొప్పఁ గాంచి కడు తేజున రాజిలి నేయి వేల్వఁ గాఁ

డామరతంప రై తగు సదాగతిమిత్త్రున కెత్తువచ్చి పైఁ
బై ఘనసరయంగ వా రతనిపై నిగిడించిరి కాండసంతతుల్. 144

చ. శరముల నట్లు కప్పవడి శౌర్యధురంధరుఁ డామరుత్సుతుం
డురుతరకోపఘూర్ణితమహాగ్రదృగంచలుఁడై మృగేంద్రమ
ట్లురువడి నాకుచున్ వెలువు లొయ్యన బాణపరంపరాహతిన్
గురుబలముం దెరల్చుచును గో యని యార్చుచుఁ బేర్చెఁ బెంపునన్. 145

వ. అంత నాచార్యుండు వాని నెదిరించి శరాసారంబున ముంచినం గొంచె మేనియు సంచలింపక మహాసారంబునకు సరకు సేయక తల వాంచుకొని పోవుబలీవర్దంబు లీలం దగి గొఱియలపిండునం జొరంబడువృకంబువోలె వృకోదరుం డురువడించి నీవారిసేనలం జొరంబడి పోరుచు నిశితక్షురప్రంబున వ్యాఘ్రఘోరనుక్కునిఁ దీక్ష్ణభల్లంబునం గుండలినిఁ దీవ్రబాణంబున ననాధృష్టునిఁ బ్రచండకాండంబునఁ గుండభేదుని మేటినారసంబునఁ వైరాటుని నిశాతనారాచంబున దీర్ఘలోచను నిశిఖరశరంబున దీర్ఘబాహునిఁ దిగ్మవిశిఖంబునఁ గనకధ్వజునిం గూల నేయుటయు నుక్కుదక్కి తక్కనుం గలనీకొడుకు లెల్లం దల్లడిల్లుచుఁ గాలకాలుం బోని గాలిపట్టికట్టెదుర నిలుపం జాలక జాలిం బడి కాలికొలందిం గాందిశీకు లై రనంతరంబ. 146

సీ. నరుఁడు గౌతమ నదీనందన భగదత్తులకుఁ జాలి నీసేన లావ్రమాప
నభిమన్యుఁ డంబష్ఠనరదంబు నుఱుమాడ, నతఁడు సిగ్గున ధర కవతరించి
నిస్త్రింశ మతనిపై నిగిడించి కృతవర్మ, తేరెక్క - సౌభద్రుఁ డురసమున
నఱచేత నయ్యసిఁ జఱచి కాలఁగఁ గెడపె, మేలుమే లని సేన మెచ్చుకొనఁగఁ

ఆ. బార్షతాదులైన పాండవయోధులు, మఱియు నున్న నీదు మానధనులుఁ
గసిమసంగి కవిసి విసువక పోరి రా, క్రందనారవంబు గ్రందుకొనఁగ. 147

వ. మఱియు నిరువాఁగునం గలయోధు లొండొరులు కేశపాశంబులం బట్టి వంచియు ముష్టిఘాతంబుల నొంచియు మోఁకాళ్ల బొడిచియుఁ దలంబుల నడఁచియు నఖంబులం బఱికియు దండంబులం గొఱికియు శూలంబులం గ్రుచ్చియుఁ గరవాలంబుల వ్రచ్చియుఁ బాణంబు లేసియు ధనులం గోసియుఁ జేసిన నాఁటిసంగరంబున భిన్నమస్తకు లై మహిం బడినకాల్బలంబులు దుండంబులును గండంబులును దెగి పడినమదగజంబులును నాలుకలు వెడలించి లాలాజలంబు గ్రక్కుచుం గూలినగుఱ్ఱంబులును విఱిగి ప్రోవు లైనశతాంగంబులును శకలరూపంబు నొందిన నానావిధభూషణాస్త్రశస్త్రంబులునుం గలిగి రణస్థలంబు భయంకరాకారంబుఁ దాల్చె నప్పు డంబరమణి యస్తంగతుం డగుటయుఁ గురుపాండవులు తమతమ

బలంగంబుల కవహారంబు గావించి నిజనివాసంబులకుం జని రంత దుర్యోధనుడు కర్ణశకునిదుశ్శాసనుల రావించి పాండవుల నెట్లు జయింపవచ్చు నని మంత్రాలోచనంబు గావించి వారితో ని ట్లనియె. 148

ఉ. కారణ మే నెఱుంగ నని గౌతమశల్యనదీసుతాదు లా
వైరులఁ బార్థులన్ మిగుల వైవరు దాన నవధ్యమాను లై
వారు మదీయసైన్యముల వ్రాల్చుచు నుండిరి గాన నాబలం
బీరహిఁ సన్నగించె నిఁక నెట్టులు వారల గెల్వ నేర్తునో. 149

వ. అని వగచుచున్నవానిం గాంచి కర్ణుం డి ట్లనియె. 150

చ. వగవకుమయ్య నేఁ గల భవత్ప్రియముం జతిగూర్తు మార్తురన్
దగిలి వధింతు భీష్ము సముదాయమ్మునుండి తొలంపు మాతఁ డె
చ్చుగ సని సేయఁ డక్కటిక చొప్పడు వానికి వారిమీఁద వృ
ద్ధగుటను వారి గెల్చుటకు హస్తబలంబును లేదు చూడఁగన్. 151

తే. సత్వరంబుగ నీ విప్డు శాంతనవుని, బిరమునకు నేగి శస్త్రంబు విడుచునట్లు
సేయు మవ్వేల నాచేతిచేవవలన, న్యూఁడు లెల్లరుఁ దెగిరకా చూడు మధిప. 152

వ. అనిన విని దుర్యోధనుండు దుశ్శాసనుదెసం జూచి నే నిపుడ భీష్ముపాలికిం బోయెద దానికిం దగ సన్నాహంబు గావింపు మని కర్ణుం బిలిచి గాంగేయు సంగరవిముఖుం గావించి వచ్చెద నవల నీబీరంబు 'సూచి యానందిం చెద నని వాని నంపిపుచ్చి పన్నీట జలకంబు లాడి ధౌతవస్త్రాభరణంబులు దాల్చి కతిపయపరివారపరివృతుం డై కరదీపికాసహస్రంబు వెలుంగ నుత్తుంగతురంగమాధిరూఢుం డై గాఢాదరంబునం జని దేవవ్రతునిశిబిరంబుకడ గుఱ్ఱంబు డిగ్గి లోనికిం బోయి పాదాభివందనంబు గావించి వానిసమీపంబున నున్నయున్నతాసనంబునఁ గూరుచుండి ప్రాంజలియును బాష్పపూరితలోచనుండు నై గద్గదస్వరంబున ని ట్లనియె. 153

—♦ దుర్యోధనుఁడు భీష్మునికడకుం జని మొఱ్ఱపెట్టుట ♦—

శా. ఏమెల్ల న్నిను నాశ్రయించి రణమం దింద్రాదులం గూడి మా
పై మార్కొ నరుఁ డెత్తివచ్చిన, జయిం పం గోరి యున్నార మో
భూమీంద్రార్చితపాదపీఠ! కరుణం బొం దొందఁగాఁ జేసి సం
గ్రామంబందు జయింపుమయ్య పగరన్ గాఢ ప్రయత్నంబునన్ 154

క. పాంచాలసోమకాదుల, నొంచెద నను నీ పొసంగునుడి సత్యము గా
నెంచుము దైత్యుల నింద్రుఁడు, ద్రుంచినగతిఁ ద్రుంపు మెల్లదుర్వారుల ననిన్. 155

శా. ఏ [illegible] ప్రార్థన సేయుదుర్ విను ము నీయుం బందుఁ బెంపొందుటల్
గా[illegible] గోపముం గలుగుటల్ గానీ యదృష్టంబు వే
[illegible] గాని పాండవుల నేయం జూడ వే నాలముం
[illegible] కాంక్ష యి మ్మతేఁడు సంపుల్ వారలల్ వ్రేల్మిడిల్. 156

వ. అని [illegible] తున్నంత శాంతనవుం డప్పలుకులు ములుకు లై చెవులు సోఁక
[illegible] దర్వీకరంబువోలె రోఁజుచుం బెద్దద వ్వొద్దియుం బలుకక తనయలుక లోలో
[illegible]నుచుం గన్ను దెఱచి దుర్యోధనుం జూచి సాంత్వనపూర్వంబుగా ని
ట్లనియె. 157

ఉ. ఏమి సుయోధనా! పలికి తిట్లు నను న్నొగిలింపఁ బాడియే
నా మెయిమిూఁదియాశ విడి నా కగుశక్తికొలంది నీకుఁ గాఁ
బ్రేముడి నూఁపుచున్ వీడక వీరవిహారము సల్పుచున్ రణం
బీమెయిఁ జెల్లఁ జేయునపు డేటికి మాటలపోటు లక్కటా. 158

వ. అఖిలలోకదుర్జయుం డగునర్జునుం భఙ్గింపలే దని మీరు నభిప్రాయంబు గానోపు
నాకర్ణింపు మమ్మహాపురుషుండు. 159

సీ. ఆఖండలాదుల నాహవంబున నోర్చి, ఖాండవం బేర్చుట కంటి కాదె
గంధర్వుల నెదిర్చి బంధింపఁబడుమిమ్ముఁ, గరుణమైఁ దేర్చుట కంటి కాదె
మనల నందఱ విరాటునిప్రోల నోంచి గో,గణము మరల్చుట కంటి కాదె
యేకవీరుం డయి వీఁకఁ గర్ణాదుల, గెంటి చీఱలు గొంట కంటి కాదె

తే. వాసవుం డోపలేనినివాతకవచ,ముఖులఁ దునుమాడె నమ్మహామూర్తి గెలువ
నెవ్వఁడును జాలఁ డతని కేడుగడయుఁ, బ్రగ్గడయు నయి కృష్ణుండు ప్రక్కనుండు.

మ. నరనారాయణు లమ్మహాత్ము లమరేంద్ర ప్రస్తుతాభిఖ్యు లీ
ధరణీభారము వాపఁ బుట్టి రనుచున్ దర్కించి వార్తుత్తి రా
సురమౌనీంద్రునిదొట్టివా రెపుడు నీసోదర్యులు న్నీవు నీ
పరివారంబు నెఱుంగఁ జెప్పిన వినం బాటింప రేమందుఁ బో. 161

క. మోహమున నెఱుఁగఁ జాలని,దేహవ మై నీక నీవ తెచ్చితి వైరం
బూహింపన్ గందు గొద సం,దేహం బిసుమంత లేదు ధృతరాష్ట్రసుతా. 162

చ. మగఁటిమిఁ గల్గి పోరు మరి మాకొ౯ని వెన్కకుఁ దీయఁ బోకు మి
ట్లగుటతటి నిన్ను హితులు నందఱు మెత్తురె కాని నేను నా
కగునటు లేపు సోమకుల నందఱఁ జంపుదు నొండె వారిచేఁ
దెగి పడి చత్తు నొండె జగతిం గలకాలము నాదగు పేరు సెల్లఁగన్. 163

ఆ. ఏ శిఖండిఁ గాక యెల్లర వ్రేల్మిడిఁ, బిలుకుమార్చువాఁడఁ గలన నెల్లి
నీవు సుఖముగాఁగ నిద్రింపు మనుటయు, మ్రొక్కి వెడలె శిబిరమున కతండు. 164

క. తనవారి నెల్ల విడిదల, కనిచి నిజనికేతనమున కరిగి యటం దా
నను వొప్పఁ బుచ్చె రాతిరి, జనపతి మేల్కాంచె వేఁగుసమయమునందున్. 165

వ. ఇట్లు ప్రభాతంబున మేలుకాంచి కాల్యకరణీయంబులం దీర్చి యెడవాళ్లం బనిచి
మీ రెల్ల సన్నద్ధులై బయలువెడలుం డని భీష్ముండు విన రాజలోకంబుతో
ని ట్లనియె. 166

—♦ భీష్మునినవమదివసయుద్ధము ♦—

తే. ఇపుడ భీష్ముఁడు క్రుద్ధుఁడై యెల్లసోమకులను నుగ్గునూచంబుగాఁ జలుపును జూఁడి
పార్థివోత్తములార! నాఁ బలుకు వినుచు, భీష్ముఁ డిదిఁ బలఁచి రాత్రి పలపితాంబు. 167

క. అది తన్నవమానించుట, కొదవిననుడి గాఁగ నెంచియును నిర్వేదం
బును బొంది మాటఁ బడుటకు, నని నరు నెదిరించి పోర నగుటకు వగచెన్. 168

వ. అప్పుడు దుర్యోధనుండు పితామహుం దిలకించి యింగితజ్ఞుండు గావున దుశ్శా
సనుం బిలిచి యి ట్లనియె. 169

సీ. ఇరువదిరెండువే లిద్ధరథంబులు, పోదిలె భీష్ముని నేఁడు వొదువ వలయుఁ
గాపలి లెస్సగాఁ గలుగ నిమ్మోటిమ,గండు మూఁకల నెల్లఁ జెండి వైచుఁ
గలన స్త్రీపూర్వుఁడై గదియని ప్రతినను, నితఁడు శిఖండిని నెదుర కుండు
వృకము కావలి లేనిమేకములరాఁ జంపుఁ, గాన భీష్మునిరక్షఁ బూనఁ దగును

తే. దాన విజయంబు మనకు సిద్ధంబు శకుని,శల్యగురులును గృపవివింశతులుఁ బూని
శాంతనవుపాల బాసట సలుప వలయు,నిదియ మన కిప్డు కర్తవ్య మెఱుఁగ నొసఁగ.

వ. అని మఱియుం జక్రరక్షకులైన యుధామన్యూత్తమోజులపరిరక్షణంబున లక్ష్మిం
పంచు గాండీవి తనకు రక్షకుండుగా శిఖండి గండుమిగిలి కురుపితామహుం దాఁక
నెంచుఁ గావున మనము వాని కెప్పుడు నెడ సేయకుండునది యనిన దుశ్శాస
నుండు దేవవ్రతుఁ బురస్కరించుకొని నడచుటయుం దక్కనుం గలయోధు లెల్ల
రును రథవంశంబులతో నతనిం బరివేష్టించి రంత గాంగేయుండును భూరిసేనా
సమేతుండై సర్వతోభద్ర మనుమహావ్యూహంబు నిర్మించినంత దాని కగ్రభాగం
బున భీష్ముం జుట్టువాఱుకొని నీకొడుకులును గృపకృతవర్మశైబ్యశకునిసైంధవ
కాంభోజసుదక్షిణులును దక్షిణపక్షం బాశ్రయించి ద్రోణభూరిశ్రవశ్శల్యభగ
దత్తులును నుత్తరపక్షంబు పాలించి సోమదత్త్యశ్వత్థామ విందానువిందులును
కౌసల్యఁటికి శ్రుతాయురలంబుసప్రముఖులును మధ్యభాగం బావరించి త్రిగర్తసైన్య

పరివృతుం డై దుర్యోధనుండును బొంముపడి ప్రవర్గ్యాగ్ను లుంబలెఁ బ్రజ్వరిల్లు
చుండి రట్టియెడ మనవారి గట్టిమోహరంబు గని శ్వేతవాహనుండు ధృష్టద్యు
మ్నుం బిలిచి మన మీవ్యూహంబునకుం బ్రతివ్యూహంబు పన్నవలయు నని
చెప్పి యప్పితామహుని కెట్టయెదుట శిఖండిం బెట్టి వానికిఁ దా నొక్కవలనను
ఘటోత్కచుం డొక్కవలనను గావలి యై యుండి భీమసేననకులసహదేవులును
ధృష్టద్యుమ్నవిరాటసాత్యకులును జతురంగచమూసమేతు లై పరివేష్టింప యుధి
ష్ఠిరు నగ్రభాగంబునం బ్రతిష్ఠించి చేకితానకుంతిభోజాభిమన్యుద్రుపదకైకయులుం
దక్షిణవారును యుద్ధపాశితు లై ధర్మరాజుకెలంకుల నుండ నియమించి గట్టి
మునఁ గట్టి ప్రకటించిన నుభయబలంబు లభయప్రకారంబున నానావిధతూ
ర్యారావంబులు బోరుకలుగ నొండొంటిం దాఁకె నట్టియెడ సారణ్యపర్వతం బగు
ధరాతలం బెల్లఁ బెల్లు చలించెఁ బక్షులు ఘోరంబుగ నార్చుచుం బరిభ్రమించెఁ
బ్రభాకరుండు నిష్ప్రభుం డయ్యెఁ బ్రభంజనుండు బెట్టిదంబుగ వీచె నశివశివార
వంబు లసదృశంబు లయ్యె దిగ్దాహంబు చూపట్టె మాంసాస్థిసమ్మిశ్రం బై రుధిర
వర్షంబు గురిసె వాహనంబులు కన్నీటితోడ శకృన్మూత్రంబులు విడిచెఁ బురుషాదు
లగు క్రూరరాక్షసులయు గోమాయుశ్వానవాయసాదులయు నిస్వనంబు నిరంతరం
బయ్యె దివాకరుం దాఁక నుల్కలు రాలె నిట్లు భయసూచకంబు లగు ననేకో
త్పాతంబులు దోఁచుచుండ నుభయసైన్యంబులును వాతోద్ధూతసముద్రంబుల
మాద్రిఁ బెల్లు ఘూర్ణిల్లుచుండె నప్పుడు. 171

—♦ అభిమన్యుండు విజృంభించి పోరుట ♦—

మ. అభిమన్యుండు పిశంగవర్ణతురగోహ్యం బైన తేరెక్కి తా
రభసంబుం గొనికొల్మసంగి మొగు లుగ్రధ్వానభూయిష్ఠ మై
నభము న్నిండఁగ వర్షముం గురియుచందం బేర్పడన్ వజ్రస
న్నిభశస్త్రాస్త్రపరంపరన్ గురిసి ప్రాంచెన్ భవత్సైన్యమున్. 172

క. అనివార్యవిక్రమక్రముఁ, డు నరాత్మప్రభవుఁ డప్పుడు మహాసేనా
వనధిం గలఁచుచు యమదండనిభాంగకతతులఁ బగ నడంగం బోరెన్. 173

చ. అలుక నతండు దండిమగఁ డై రథులన్ రథవారమున్ గజం
బుల గజయోధులన్ హయసమూహములన్ హయసాదులన్ భటా
వలిఁ బటుబాణపంక్తులను వ్రయ్యలు సేయుచు నుండ రాజమం
డలి భళిరే కుమార! యని డాకొని మెచ్చిరి ఫాల్గునాత్మజున్. 174

వ. అప్పుడు. 175

మత్తకోకిలము. వాళికోట్లల కోహటించి భవద్బలం బతిదుర్బలం
బై నభస్వదురూద్ధతిం దెస లంటి తూలెడుతూలమ
ట్లానఁ జాలనికాలఁ బాటియు నష్టు పంకనిమగ్న మై
కాన కేగతి డిగ్గు నేనిఁకకై వడిం బడి బెగ్గిలెన్. 176

సీ. పోగ లేనివహ్ని పెంపున వెల్గు నభిమన్యు, నంటి సిబలఁగేసుల్ మంటఁ బడిన
పతగంబుల ట్లయి బడలువడి పశించె, వజ్రహస్తుఁ డనంగ వఱలువాని
చాపంబు మొగులపై నేపు చూపెడుమెఱు, మట్లు నల్లడ నాట్య మూడఁ జొచ్చె
ఫుల్లద్రుమమునుండి పెల్లు రేఁగినతుమ్మెదలు నాఁగఁ దచ్ఛరంబులు దలిర్చెఁ

తే. గాంచనాంగరథం బెక్కి కదనరంగ, ముందు నెటఁ జూడఁ దాన నై యుండెఁ గొలవిఁ
బోలెవిలు ద్రిప్పుచునుగ్రాల మోహవివశు, లైరి ద్రోణుఁడుఁ గృపుఁడులోనైనవారు.

ఉ. మాఱటఘాఁ డనఁ డని సమస్తజనంబును వానికై వడిన్
మాఱు మొగంబు వెట్టి పలుమాఱు నుతించుచుఁ జెట్టొకండుఁ గాఁ
బాటిరి చెప్ప నేమిటికిఁ బార్థివతల్లజ! నీదు సేన యు
ద్ధాజిడి పోయె మధ్యమున నట్టిటు లై పసుపాల్లి పోలికన్. 178

తే. చిందువందయి నీసేన చెన్ను దఱిగి, పోవఁ గాఁ జేసి యర్జునపుత్రుఁ డపుడు
మయుని నేసినవాసవుమాడ్కి నొప్పి, సుహృదులకు నెల్ల సంప్రీతి సూపసాగె 179

వ. ఇట్లురవడించిన వాని కోపక నిబలం బార్తస్వరంబు సేయుచుం బాఱుచున్నం
గని దుర్యోధనుం డలంబుసుం బిలిచి యి ట్లనియె. 180

ఉ. ఒక్కఁడు కార్ష్ణి వచ్చి యిటు లుగ్రగతిం బచరించి వృత్రుఁ డు
క్కెక్కి సుపర్వసైన్యముల నేర్చినయట్లు మదీయ సేనలన్
జక్కఁడఁ చెన్ దదామయము చక్కఁబడం బొనరింప నీవు గా
కొక్కమహారామధం బవని నుండనిమాట నిజంబు చెప్పితిన్. 181

ఉ. రాక్షసనాథ! నీ విపుడు రంహగతిం గవియంగ నేగి నీ
రూక్షతరాస్త్రకోటి కనుమాపముగా రణకేళిఁ దేలుచున్
దక్షుఁడ వై యరిం గెలుము దర్పము సూపుచు ద్రోణభీష్ములన్
బక్షములందుఁ బెట్టుకొని పార్థుని గెల్తుము భండనంబునన్. 182

వ. అని చెప్పిన నలంబుసుం డప్పడ ప్రావృట్పయోధరంబువలె గర్జిల్లుచుం బాండవ
చమూసమూహంబుపైఁ గవిసె నంత. 183

శా. ఆరాకాసిరవంబునన్ రిపుబలం బత్యంతవాతాహతిం
బారావారము నాఁ గలంగి దెసలం బర్విన్ క్షణార్థంబులో

వీరాగ్రేసరు లందుఁ గొందఱు మదుల్ భేదిల్ల మూర్ఛిల్లియున్
ఘోరం బొందిరి డింది రట్టియెడ సౌభద్రుండు రౌద్రాకృతిన్. 184

—◆అలంబుసుండు దుర్యోధనప్రేరితుండై యభిమన్యుపైఁ గవియుట◆—

చ. శర మురివోసి నృత్యము పొసంగ నెసంగుచు నయ్యలంబుసున్
గరిమ నెదిర్చి పేర్చుటయుఁ గన్గొని కిన్గొనలన్ స్ఫులింగముల్
దొరఁగ నతండు వానిపయిఁ దోమరముల్ నిగిడించి నొంచి త
ద్గురుతరవాహినిం జెరలఁ గొట్టె బలుం డమరావళిం బలెన్. 185
తే. కరికిఁ జిక్కినపద్మినికరణిఁ దమ్ములము సెడం గని క్రుద్ధులై లావు మెఱసి
ద్రౌపదేయులు రాక్షసోత్తము నెదిర్చి రపుడు లయచంద్రు గ్రహములై దాఁగినట్లు.
వ. అంతలోన. 187
మ. ప్రతివింధ్యుండు మహోగ్రబాణముల నారక్షోవిభున్ నైచి త
త్తనుతిపాత్రం బగుబొందళంబు దునుమన్ జొత్తిల్లి రక్తంబు సం
తతధారాతతు లూర రాక్షసుఁడు మార్తండాంశుసంస్యూతసాం
ద్రతటిత్వద్వరమూర్తినిం దొరయనై తళ్కొత్తెఁ దానత్తఱిన్. 188
ఉ. ఏవురు నన్నదమ్ములు నపు డేర్తెఱఁ జూపుచు నార్ష్యశృంగిపైఁ
జేవ మెయిం దలిర్చెడు ప్రసిద్ధశరంబులు వేనవేలుగాఁ
జేవడి నేయ సొమ్మసిలి చిత్రముగా నతఁ డింతమాత్రలో
నావలఁ దేఱి రెట్టి యగునట్టిమహాక్రుధ మట్టుమీఱఁగన్. 189
తే. ధనువులన్ సాయకంబుల ధ్వజములఁ దునుమాడి యేవురనై దేసివాఁడిములుకు
లేసి నొప్పించి హయసూతులిలకు వ్రాలఁ, జేసి చంపఁ దలఁచి వారిఁ జేరుటయును.
ఉ. తమ్ములపై మహోగ్రగతి దర్పము సూపుచు నున్నవాని దూ
రమ్మున నుండి కన్గొని నరప్రభవుండు రయంబు పెంపునన్
బిమ్మట పుట్టఁ జేయఁ గలవేఁడిశరంబుల గాఁడ నేయుచున్
రమ్మిటు రమ్మటంచు వడి రాక్షసవీరునిఁ దాఁకె నార్చుచున్. 191
ఉ. వాఁడును వాయువేగమున వచ్చి మహారథుఁ దాఁకి వీఁకమై
వేఁడుర నీవు నిల్వు మని వీఁగకు పీనిమహాభుజాబలం
బోడక చూచుచుండు మని యొయ్యన నార్చుచు నున్నవారికిన్
వీడని కయ్య మయ్యె నట వృత్రునకున్ సురనేతకున్ బలెన్. 192
తే. రాక్షసేంద్రుఁడు మాయావి రణవిదుండు, నర్జునాత్మభవుండు దివ్యాస్త్రవిదుఁడు
వీరు లగువీరిపో రెట్టిదిరున నగు, ననుచుఁ జూచుచు నుండి రం దందు జనులు. 193

నావరశిష్యుఁడుం బ్రియము నందినవాఁ డయి భక్తి సేయు వా
రేవగఁ బోరఁ దారసిలి రింతయు నాకు నెఱుంగఁ జెప్పవే. 212
వ. అనిన సంజయుం డతని కి ట్లనియె. 213
మ. గురుఁడున్ శిష్యుఁడుఁ దండ్రియున్ దనయుఁడుం గొంచెంబు నే
డారుఁ బోర స్వానుదీయఁ బొవ రెపుడున్ యుద్ధంబులన్ ఘోరధ
ర్మరతిం జేసి నరేంద్ర! ఫాల్గునుఁడు భారద్వాజుఁడుం బోరి ర
ద్దిరనా వారలలోనిప్రేమ మది యెందేఁ బోయె నేమందుఁ బో. 214
వ. ఆకర్ణింపు మపుడు. 215

—•అర్జునుఁడు ద్రోణాచార్యుఁతో యుద్ధము సేయుట•—

ఉ. ద్రోణుని మూఁడుబాణముల దోర్బల మేర్పడఁ బార్థుఁ డేసినన్
స్థాణువు నా నతండు తగి తచ్ఛరపాతము లెక్కసేయ కా
క్షోణిధరారినందనునిచుట్టును గట్టలు గట్ట గట్టివా
బాణము లేసి రోసమునఁ బ్రజ్వరిలెన్ దవవహ్నివైఖరిన్. 216
వ. అంత దుర్యోధనునిప్రేరణంబునఁ ద్రిగర్తేశ్వరుండు ద్రోణునకుం బాసట యై పార్థు
నిం దాఁకుదెంచి కార్ముకంబు సంచి నానావిధాయోముఖమార్గణంబులఁ దద్రథం
బుఁ గప్పె నప్పుడు. 217
చ. గురుఁడు త్రిగర్తనాథుఁడును గోపము సూపుచు నేసి నట్టి మేల్
శరతతు లాకసంబునను శారదవేళ నెసంగునంచల
ట్లరయఁగ నైగమించి విహగావళి పండినమ్రాఁకున్నుం బలెన్
సురపతిసూతి తేరిపయిఁ జుట్టును ముట్టడి వ్రెల్ట నెట్టనన్. 218
సీ. అర్జునుం డార్చుచు నాత్రిగర్తపతిన్ స, పుత్త్రుని నొంచె మేల్పత్త్రిసమితి
వారు చావునకు రవం తైనఁ గొంకక, విజయునిపై శరవృష్టిఁ గురిసి
రతఁడు చలింపఁ కిం తైన మబ్బుల మారు, తమువోలె వారించెఁ దచ్ఛరాళిఁ
గవ్వడిహస్తలాఘవమున కప్పుడు, మింట వేలుపు లెల్ల మెచ్చి రంతఁ
తే. గట్టిక న్నట్టఁ జేసి త్రిగర్తబలము
మీఁద బగఁ బూని విడిచె నమేయవిక్ర
మమునవాయవ్యనామకాస్త్రము రణముఖ
మునమహావాయు వుదయించి మొనసె దెసల. 219
మత్తకోకిలము. ఏడుగాలులు వీచునప్పటియొత్తునం దగి మొత్తమై
కూడి మ్రాఁకుల నెల్లఁ గూల్చుచుఁ గుప్పతిప్పలు గా నటన్

స్త్రీపూర్వుం డగుశిఖండి నేయు టుడిగి మిగిలినముప్పుర మూఁడు వాఁడికోలల
నొవ్వఁ జేసినం గినిసి. 228

సీ. దావానలంబు నాఁ దవి మండి పృషతపౌత్త్రుఁ డురమూడఁగ మూఁడుతూపు లేసెఁ
పాంచాలనాథుండు పంచవింశతినిశితాశుగమ్ముల నొచ్చునట్లు చేసె
నీరైదువాలికనారసంబుల మత్స్యభూవల్లభుండును బొడ వడంచె
నిరువదియేన్ శితశరముల నరివోసి, నోనేసెను శిఖండి పూని విల్లు

ఆ. నింద జెట్లు గాఁడ నేయ గాంగేయుఁడు, రక్తసిక్తుఁ డగుచుఁ గ్రాలెఁ బుష్ప
శబల మైన వసంతసమయమందు నశోకభూరుహంబుపగిదిఁ బొలుపు మీఱి. 229

మహాస్రగ్ధర. ముగురన్ మూఁడేసివాలమ్ముల నొగిలిచియున్ బూని పాంచాలువిల్లుం
దగుభల్లం బొక్కఁ డేయం దఱిగి ముగురకున్ దా నొక్కం డై మహోగ్రం
బగుసంస్ఫోటం బొగిం జేయఁగ నట ద్రుపదుం డాతనిన్ వానిసూతున్
మొగిఁ దా నైదింట మూఁటన్ మొనసి నొగిలిచెన్ బూని వేఱొక్కవిల్లున్. 230

వ. అయ్యవసరంబునం బాంచాలరక్షణతత్పరుం డై ధర్మతనయుండు దాను భీమసే
నుండును ద్రౌపదేయపంచకంబును కేకయపంచకంబును సాత్యకియుం దోడు
సూపఁ గోపంబున నాపగేయుం దాఁకుటయు నీవారును సేనావారంబుతో దేవ
వ్రతునకు బాసట యై రప్పు డిరువాగునం గ్రందుకయ్యం బయ్యె నందుఁ బరస్పర
శరప్రహారంబున భగ్నరథంబులును భగ్నరథ్యములు నై తెగి పడినరథికదంబం
బులు నేనుంగులు పీనుంగు లైన వానితోడం బడి పీనుంగు లైనహాస్తికులును
వారువంబులు నేలపా లైనం గూలిపోవునాశ్వికులును బీరువోక వీరంబునం బోరి
పోరి ధారుణిపైఁ ద్రాలిన కాల్వురును ద్రెళ్లినటెక్కెయంబులును డొల్లినభూష
ణంబులును దుత్తుము రైనకైదువులును ముత్తెంబు లై విఱిగి పడినఛత్రచామ
రాదులును గలిగి సంగరాంగణంబు ఘోరాభిరామం బయ్యె నయ్యెడ సువ్యక్తం
బై రక్తప్రవాహంబు యమరాజ్యవివర్ధనం బై కరంబు డంబు మీఱె నయ్యపరా
హ్ణంబున నెల్లయోధులు నోహరిసాహరిం బెనంగియుం బెండువడి ధృతరాష్ట్రి
దుర్యోధను లెంతపాపాత్ములో. యింత లేసిపనుల కొడిగట్టి యిట్టి మహారాజులం
జంపించుచుండి రని నిన్నును నీకన్నవానినిం దెగడి పాండవులం బొగడి రంత నీకొడు
కంతయు వినియు భీష్మద్రోణకృపశల్యులం గాంచి కొంచ కిట్టితఱి బెట్టిదంపుఁబోరు
గావించి కీర్తిం గాంచుఁ డని పురికొల్పుటయును. 231

చ. వినుము నరేంద్ర! వారికిని వీరికి జూదముకారణంబునన్
గనుఁగొన నైనకయ్య మది గాఢతరం బయి ఘోరరూప మై

పూనరె వినంగ నొల్ల విటు పూర్వము సెప్పిరి నీకుఁ దత్ఫలం
బను భవ మయ్యెడిన్ ధరణియుం దగు నెల్లరుఁ ద్రెళ్లి నై రయో. 232

వ. ఆకర్ణించు మర్జునుండు త్రిగర్తసైన్యంబుల నట్లు కనుపుగొట్టుచున్నంత. 233

— సుశర్మాదు లర్జును నెదిరించి పోరుట —

చ. కనలి సుశర్మ కార్ముకముఁ గైకొని డెబ్బది వాలుతూపులన్
దనుజవిరోధి నేసి భుజదర్పము పేర్పడఁ దొబ్మి దమ్ములన్
ఘనభుజుఁ డైన పార్థుపయి గాటముగాఁ బరఁగించినంతటన్
గనుఁగవ నిప్పు లొల్కఁగని కవ్వడి నొ వ్వడరంగ నవ్వుచున్. 234

తే. ఆసుశర్మునిబాణము లన్నియు నడుమన తునిఁగి పడఁ గావించి ఘనశరాళి
వానిఁజోదుల జమునింటివారికఁ జూచు, నట్టివారిఁగ నొనరించె నతిశయించి. 235

తరువోజ. బలఁగంబు లెల్ల నప్పార్థునిచేత, బలిమి కోపక వారువంబుల విడి
కలభంబులను వీడి గజముల వీడి, ఘనరథంబుల వీడి కైదువుల్ వీడి
పలుదెఱంగులు గాఁగఁ బాఱఁ గాల్బలము, పది మూనలేక మీఁపదల కై పడియెఁ
గలను గావింపఁ ద్రిగర్తేశ్వరుండు, గడుకొని వారింపఁ గా నిల్వఁ దమ్మ. 236

చ. బలఁగము లట్లు వాఱినను బాహుబలంబు చలంబు మీఱ న
చ్చల మగుబీరముం గలిగి సంగరముం బొనరించుచుండె ని
శ్చలుఁ డయి తానుఁ దమ్ములు సుశర్మవిభుం డొకరుండ తక్కువా
రలు బ్రదుకాసఁ జేసి బవరంబునకున్ వెలివోయి రత్తఱిన్. 237

ఆ. వారిఁ గాంచి వారిఁ గావఁగ నెంచి, నీసుతుండు భీష్మునిం బురస్క
రించుకొంచు బలము లంచద్ధతిం గూడఁ, గూడ ముట్టె దాఁకెఁ గ్రీడి నంత. 238

తే. పాండవబలంబు లప్పుడు గండుమిగిలి, తలకడచి పార్థునిం భీష్మునెలని నిలిచి
కెలుచ నదరి హాహాకారకలితు లగుచు, సంగరోత్సాహమునఁ జేసి పొంగి రపుడు.

క. బాలజ్వలుండు క్రోధో, ద్వేలపరాక్రమము మెసంగ వీరవిహారం
బాలోనఁ జేయుచున్ శర, జాలంబుల పాలు సేసె శాత్రవబలమున్. 240

క. పాండవులును గౌరవులును, భండనమునకుం గడంగి బహువిశరాళిన్
మెండుకొన్న పోరి రప్పుడు, నిండినప్రభ రవి మెలంగె నెఱి నడిమింటన్. 241

సీ. ప్రాంచముఖులుకుల సాత్యకి కృతవర్మ, నొప్పించి శరకోటి గుప్పి కప్పె
ద్రుపదుండు ద్రోణునిఁ దొడరి డెబ్బదితూపు, లడరించి సూతుమై నైదు నినిచెఁ
బ్రపితామహుం డగుబాహ్లికున్ భీముండు, నొనేసి పులివోలె నుసిఁగి యార్చెఁ
బ్రతివింధ్యుఁ డా చిత్రసేనుని నొమ్ము, మూఁడమ్ముల సుభద్రపుత్త్రుఁ జేసి

తే. మఱియు వార్వుమ్మల న్నాల్గు మార్గణముల, సూతుఁ దొమ్మిదితూపుల నుఱక నేసి
దెసలు పూరటిల్లఁగ నార్వ దిగి యతండు, దుర్ముఖుని తేరిపై కెక్కి తొలఁగి చనియె.

వ. అంతలో మఱియును. 243

ఉ. సన్నతపర్వబాణములఁ జాపగురుండును బూర్వవైరముం
ము న్నిడికొంచు సోమకుని ముట్టఁగ నేసి తదీయసారథిన్
గ్రన్నన నొంచి మించుటయుఁ గాంచి స్మరించుచుఁ దత్ప్రభావమున్
సన్నగ సన్నఁ జాఱె వడి సంగరరంగము పీడి తోడుతన్. 244

తే. మఱియు భీముఁడు బాహ్లీకుమాపులను వధించి సూతుని ద్రుంచి తే ర్త్రెంచుటయు న
తండు సంశయాత్ముండయి తొత్తఱపడి, ధరకు లంఘించి లక్ష్మణునరద మెక్కె. 245

మ. కృతివర్మన్ బెగడొందఁ జేసి కడిమిన్ గృష్ణానుజుం డాపగా
సుతుని దాఁకి పృషత్కషట్కదశకస్ఫూర్తిన్ విదారించినన్
గృతహస్తుం డగునాతఁ డాడి ధను వుంగెంగేల నాడించుచున్
క్షితిపాత్రం బగుశక్తి నాత్యకిపయిన్ నూల్కొంచు నేసె న్వడిన్. 246

తే. మృత్యుకల్పమై మండుచు మీఁది కేగు, దెంచుశక్తిని గని లాఘవాంచితుఁడయి
శినివరుఁడు మీఁది కుఱికించెఁ జెదఁ శక్తి, ధరణిపైఁ బడి వమ్మయ్యెఁ దక్షణమున.

సీ. పైనేయుఁ డంతట స్వర్ణప్రభం బైన, తనశక్తిఁ గొని వైచెఁ దాతమీఁదఁ
గాలిరాత్రి యనఁగఁ గ్రాలుచు వచ్చెడు, నాత్యకిశక్తి నామానధనుఁడు
కని రెండుగాఁ జెండె కత్తివాయమ్ములఁ, దొమ్మిదింట న్వానిఁ దూల నేసె
నురము గాఁడ శినీంద్రుఁ డట్టూఁత లూఁగుచు, పీఁగక పోరె దోర్వీర్య మెసఁగ

తే. నపుడు సరిఘనాగాశ్వులై యతనితోడ, పాటు సేయఁగఁ బాండవుల్ బహుభటాళి
తోడఁ గవిసిరి దేవవ్రతునిపయి స్వహాసమీకమునకు నెల్లె నతులితమయి. 248

వ. అట్లు పాండవసైన్యంబు దేవవ్రతుని ముట్టుముట్టినం గని దుర్యోధనుండు దుశ్శాస
నుం బిలిచి యి ట్లనియె. 249

—♦దుర్యోధనప్రేరితుఁ డగుదుశ్శాసనుండు భీష్మునకుం దోడుపడుట♦—

ఉ. తమ్ముఁడ! చూచితయ్య మనతాతను బాండవవీరు లెల్లఁ గ్రౌ
ర్యమ్మునఁ జుట్టుముట్టి రట రక్షణము న్బొనరింపఁ జెల్లు నే
మమ్మున నాతఁ డున్న మనసేనము నాతనిమీఁద నుంచు వే
గమ్మున నీవు మూఁకలను గైకొని వానికిఁ దోడు సూపుమా. 250

వ. అనిన దుశ్శాసనుండు మహాసేనాసమేతుం డయి తానును దురంగశతసహస్ర
పరివృతుం డయి సౌబలుండును భీష్మునకుం బాసటయై రపుడు విమలప్రాసతోమర

భిండివాలకరవాలాద్యాయుధధారులును నానావిధాయోధనకుశలులు నగుయోధా
గ్రేసరులతో నకులసహదేవులం గూడి ధర్మజుండు ధనంజయునకుం దోడుపడియె
నప్పుడు సుయోధనుండు వెండియును. 251

క. పదివేవుర రావుతులన్, గదనంబునం దోడుపాటు గం డని పనుపన్
బదిలపడి ఖరఖురాహతి, గదురం గడుచులివు చనిరి కడ లద్రువంగన్. 252

ఉ. తెక్కలు గల్గి పుల్గులకు తియ్యురయంబున మింటి నంటి యొ
క్కొక్కతఱిన్ ధరిత్రిపయిఁ జూనుచుఁ గాల్లి వెదుల్లి ప్రేలుఁ
ట్లక్కజ మైనశబ్ద మొలయన్ రజ మేగి నభంబు ముట్టఁ బె
ల్లెక్కి తురంగపంక్తు లపి యెచ్చితె నచ్చట నంచపిం డనన్. 253

ఆ. పౌర్ణమాసి నొప్పునర్ణవంబును బోలెఁ, బొంగుచున్న నీకుపుత్రు నాశ్వి
కబలము మాఁగె వేలకరణి యుధిష్ఠిరుఁ, డెప్పుడు మాద్రిసుతులు నంటి నడువ. 254

వ. ఇట్లు తలపడి పాండవాగ్రజుండు నకులసహదేవసహితుండై గండుమిగిలి వనపా
లుండు పాదపంబులనుండి పండ్లు రాల్చువిధంబున రావుతులతలలు కరవాలంబు
లం దెగ నఱకియుఁ బ్రాసకుంతాయుధంబుల బొడిచియు నడిదంబుల నడచియు శరం
బులం ద్రుంచియు భిండివాలంబులం జెండి గావించియు గదల మొత్తియు శూలం
బులం గ్రుచ్చి యెత్తియు నత్తఱిఁ గోలుమసంగినం దుర్గంబు లెల్ల నొచ్చునవియు
విచ్చునవియుఁ జచ్చునవియు నై విఱిగి పాఱం బులుగుచున్న గొన్నిఁ లేటమొగంబు
వడి చెదరి మృగరాజంబుఁ గన్నమృగంబులుం బోలె వెఱచి పఱచ నంతఁ గౌంతేయు
లెంతేసియు సంతసంబున శంఖభేరీమృదంగారవంబులును సింహనాదంబులునుం
గావించి రయ్యవస్థం గాంచి దుర్యోధనుండు గినుకం జై శల్యుం బిలచి యిట్లనియె.

మ. కవలం గూడి యుధిష్ఠిరుం డిపు డిదిగో నిగ్గోలు గావించుచున్
జవసత్వంబులు సూపుచుండెఁ గను మాసైన్యంబు సైన్యంబునన్
దవులం జిందఱవందరై పఱచెరీ దర్పం బెలర్పంగ నీ
వు వడిన్ వాని నెదుర్చి యంబునిధిపెంపున్ వేలవోలెన్ విభూ. 256

వ. అనిన నమ్మద్రమహీవల్లభుం డట్ల యగుంగాక యని మహాసేనాసమేతుండై
చని వారలతోఁ దలపడియె నంత. 257

క. పదితూపులు ధర్మజుఁ డతనిం, బదునాలుగు మార్గణములు మాద్రిసుతుల్ నా
సదమదము గాఁగ నేసిరి, కదనమునను మద్రరాజు గడఁగినయంతన్. 258

ఉ. మద్రవిభుండు రౌద్రమున మాఱొకని ముప్పది మూఁడుమూఁడు ని
ర్నిద్రశరంబులం జదిపి రెక్కొని చక్కటి కేగి ధర్మజున్

మాద్రికి మీఱునర్వ దగుమార్గణము ల్నిగిడించి నొంచి యా
మాద్రికొమారులం బిలుకుమాలెడునట్లుగఁ జేసె నాల్గిటన్. 259

వ. అంత బకాంతకుండు మృత్యువాతిం బడినవారుం బోలె శల్యుబారిం [illegible] యున్న
యన్నదమ్ములం గాంచి కాంచనంతన వారి కడ్డంబుసనుటయు నద్దినాపర[illegible]గంబున
మహాయుద్ధంబుసిద్ధంబయ్యె నాకర్ణింపుమప్పుడప్పితామహుండుమ[illegible]గ్రుండై.

—♦ భీష్ముండు మహాపరాక్రమంబునఁ బరాక్రమించుట ♦—

ఒదిరెంట భీమునిఁ దిరెంట ధర్మజుఁ, దొమ్మిదింటఁ గా హారితమ్ముకుత్తి
మఱి తొమ్మిదింట సోమకతనూభవుని నేఁడిట సహదేవు మూఁడింట నకులుఁ
బ్రహరించి మించినఁ బరికించి గాంగేయుఁ, గవలు పండ్రెంట మ్మాధవుఁడు మూఁటఁ
గావని యొడింటఁ గాండవాగ్రజుఁడు పండ్రెంట ద్రుపదసూతి డెబ్బదింట

తే. మూఁఁడు నొనేసి రాలోన మాఱుకొని ర,యమ్మన గురుఁడు నై దేసి యమ్ముల శిని
వరుని భీముని నొప్పింప వాయు వాఁ, మగుఁ నేసి మూఁడేసిమార్గణముల. 261

వ. అట్టియెడం బ్రాచ్యోదీచ్య ప్రతీచ్యప్రముఖు లైన సౌవీరశూరసేనాదులైన మహీ
నాథు లెల్లపాండవయోధు లై గంగసుమీఁది నీతంద్రిం దాఁకుటయు నంత నానా
దేశసమాగతు లగు నీయోధులును బాండవులఁ గా మాఱొని వివిధాయుధంబుల
విస్తరిల్లం బ్రస్తరించి స్వగ్రామునుటు గావిఁ చిరంత. 262

చ. అరదము వేది గా ధనువు లర్చులు గా ముసలాసిముఖ్యముల్
పరఁగె నింధనమ్ములు బాణచయంబు స్ఫులింగపంక్తి గా
గురుతరకోపతాపమునకుం గుడు రై సురనిమ్నగాసుతుం
డరయఁగ నయ్యెఁ గారడవియందు వెలింగెడువహ్నివైఖరిన్. 263

వ. ఇట్లు వెలుంగుచుం గాంగేయుండు సువర్ణపుంఖంబులును గార్ధ్రపత్రచిత్రితంబు
లును దీక్ష్ణాగ్రంబులు నగుకర్ణినాళీకనారాచనిచయంబుల నిగిడించి వనపాలుండు
తాళఫలంబులం బడఁ ద్రోయునట్లు యోధులతలలు డొల్లనేయుచు రథంబులఁ
ద్రుంగఁజేయుచు, ధ్వజంబులఁ గూల్చుచు ధనువుల రాల్చుచు నేనుంగులఁ
బీనుంగులఁ గాఁ జేయుచు వాఘవంబులఁ బౌనువంబులు గాఁ గోయుచుఁ గాల్బ
రం ద్రుంచుచు నెత్తురువాక లడరించుచు వీరవిహారం బొనర్చుచు వివృతాస్యం
బైనమృత్యువు వలె నున్న వానికట్టెదుర నెట్టియోధుండును నిలువ నోపక చచ్చియు
నొచ్చియు విచ్చియు నొక ళ్ళొకళ్ళం గానక తండ్రి కొడుకు కన్నదమ్ముఁ డని
చూడక హతశేషులు వికృతవేషంబులు గ్రాల వెంద్రుకలు జాఱువాఱ గోపాలుండు
లేనిగోవులవిధంబునం బాఱఁ జొచ్చి రాచిచ్చఱపిడుగుకడింది వేఁడి కన్నాదు కాశ

కరూశచేదిసైన్యంబులం గులపుత్త్రు లగుమహారథులు పదునాలుగు వేవురు పరలోకం
బునకరిగిరి యిట్లు భజ్యమానం బై యఱచి పఱచుచున్న బలంబులం గనుపట్టి నిజ
రథంబు నిలువం బెట్టి గోపాలకృష్ణుండు జిష్ణుం గాంచి యి ట్లనియె. 264

ఉ. కోరినకయ్య మిప్పటికిఁ గూడె విమోహితమానసుండ వై
యూరక చూచుచుంటి విటుఁ లొప్పునె విక్రమసింహ! నేఁ డిటన్
వీరము సూప వేమిటికి వేమరుమాదిరి నుంటి క్షత్రియా
చారము వెచ్చఁబెట్టితివి చాలుఁ బురే నిను నవ్వరే జనుల్. 265

చ. వినుము విరాటుపీట మును వీర్య మవార్యము గాఁగ నీవు నే
నును మఱి సంజయుండు విన నూల్కొని భండన మైన భీష్మసిక్
మును మును ద్రోణముఖ్యులను ముట్టి వధించెద నంటి వానుడుల్
ఘనభుజ! నేఁడు సత్యములు గా నొనరింపక యుంట యొప్పునే. 266

వ. అనిన బీభత్సుం డకాముండు నధోముఖుండును దిర్యగ్దృష్టియు నై కృష్ణున
కి ట్లనియె. 267

చ. తునుమఁగ రానివారలను దున్మి తుది న్నరకంబు నొందఁగా
నొనరెడురాజ్యముం గొనుటయో వనవాసమునందు దుఃఖముల్
గొనుటయొ మే లటంచు మది గోడ్డగ మై నను వేఁడుచుండె నో
వనరుహనాభ! యేమి యని వాకొనువాఁడను నీదుసన్నిధిన్. 268

క. నీచిత్తమునకు వేఱుగఁ, దోఁచెదనే నీదునుడియె దొసఁగు లడంపన్
జూచెద వేదం బని నీ,తోఁచినగతి నడపు తేరు తునిమెద నరులన్. 269

వ. అనిన జనార్దనుండు నదీనందనాభిముఖంబుగా స్యందనంబు నడపించుటయుం గాంచి
క్రేళ్ళువాఱిన యుధిష్ఠిరబలంబునుం గవియుదెంచుటయుం గాంచి సింహనా
దంబు గావించి మరున్నదీనందనుండు మరుత్పతినందనుని తేరిపై బాణాసారంబు
పరఁగించె నప్పుడు. 270

మ. కనుచుండన్ రథిరథ్యసూతరథముల్ గానంగ రాకుండఁగ
ప్పినబాణంబుల నెల్లఁ దప్పుకొనుచున్ బీతాంబరుం డంబర
మ్మున నేవీథుల రీతులన్ మెలపు నాఁ బొల్పొంద సారథ్యమున్
బొనరించెన్ జను లెంచ సంభ్రమ మెదం బోఁ దోలి ధైర్యంబునన్. 271

వ. అంతఁ గాంతేయావరజుండును. 272

శా. గాండీవధ్వని మేఘగర్జనముతోఁ గైకో సగోత్రత్వముల్
జంఘాత్రంబుల నాపగేయునిమహాచాపంబు ఖండించి కో

దండం బింకొకఁ డాతఁ డందుకొనులో దాని న్వడిన్ రెండు గా
ఖండించెం గరలాఘవంబున జనుల్ గైవారము ల్సేయఁగన్. 273

శా. అంతన్ శాంతనవుండు మేలు కృతహస్తా! మేలు నీలాఘవం
బింతింతం చనఁ బోల దంచుఁ బెనువి ల్లింకొంచు గైకొంచు దు
ర్దాంతాజిహ్వగసంతతుల్ నరునిమీఁద న్వైచె నం దేది యు
క్కింతేఁ దాఁకక యుండెఁ దోలె హరులన్ గృష్ణుండు రోచిష్ణుఁడై. 274

తే. తెనదునమ్ములు వమ్మయి ధరణిఁ బడుట, కలిగి యుర్వర నొనేసె నాపగేయుఁ
డంపరం జేసి నా రప్పు డలరి రాజు, కొమ్మలం జిమ్ముకొన్న వృషమ్ము లట్లు. 275

మ. వసుదేవాత్మజుఁ డాజి నర్జునమృదుత్వంబున్ ఖరాశుంగు నా
నసమాన ప్రభ గల్గి పాండవులసైన్యం బెల్ల మాయించుచున్
బసమీఱ న్వెలుగొందుభీష్ముని ప్రతాపంబుం బ్రభావంబునన్
బ్రసమీక్షించి కృధారసం బొలుక నేత్రద్వంద్వమున్ విప్పుచున్. 276

—♦ శ్రీకృష్ణుండు రథంబు డిగ్గి భీష్మునిపై కుఱుకుట ♦—

మ. తనచేతం గలపగ్గము ల్విడిచి క్రోధజ్వాల లేపారఁ గా
మునికోలం గొని భూమిపై కుఱికి సమ్మోహంబు పుట్టంగ బి
ట్టొనరన్ సింహరవం బొనర్చుచును దా నుర్విన్ బదద్వంద్వఘ
ట్టనఁ గంపింపఁగఁ జేయుచుం బఱచె వెట్టన్ భీష్మునిన్ ముట్టఁగన్. 277

తే. పీతకౌశేయసంవీతుఁ డై తలిర్చు, శ్యామసుందరదేహుఁ డాజానుబాహుఁ
డాతఁ డార్చుచు భీష్ముపై నరుగునపుడు, మెఱసె మెఱుము లుర్ములు గలమేఘమట్లు.

తే. అల్లఁ బఱతెంచుశ్రీకృష్ణు నరసి నీదు, నాఁగు లెల్లను చిత్తంబు లోలయునట్టి
రగుచుఁ జచ్చెఁ జచ్చెం భీష్ముఁ డనుచుఁ బలుకఁ, జొచ్చి రార్తస్వరంబునఁ బిచ్చలించి.

క. సింగము మాతంగముపై, లంగం గొనునట్లు పైఁబడ న్వచ్చెడు కృ
ష్ణుం గాంచి సంభ్రమింపక, పొంగారం బలికె భరత పుత్త్రుఁడు భక్తిన్. 280

శా. నీచేఁ జచ్చిన నూర్ధ్వలోకముల నెంతే శ్రేయ మౌఁ గావునన్
నాచక్కిం గరుణించి దాసుఁ డన మన్ దాత్పర్యముం జేయుచున్
జూచాయన్ సమరాంగణంబున నను న్ద్రుక్కింపు మో దేవదే
వా! చేమోడ్పు ఘటించి మ్రుక్కెదను జోహారు ల్సమర్పించుచున్ 281

వ. అంతఁ గౌంతేయావరజుం డత్యంతసంరంభంబున రథంబు డిగ్గున డిగ్గనుఱికి శర
వేగంబునం బఱచి పట్టుకొని యెట్టకేలకుం బదియవయడుగునన్ నిలువంబెట్టి

బంధుండు నీహితుం డయినవాఁ డగు నాకు హితుండు గావునన్
దగవటం బూని నే నిపుడ తీర్చిపుచ్చెద నెల్లకర్జముల్. 301

ఉ. నీకు ననుంగుఁదమ్ముఁ డయి నెమ్మి నెసంగెడుపార్థుఁ డారయన్
నాకు సఖుండు శిష్యుఁడు ననుంగునచుట్టము గాన వానికిం
గైకొని మంచు నాయొడలికండలు గోసి యొసంగ నెంతు నే
నాకు నతండు ప్రాణ మయినన్ విడువం జనుపోయి నెప్పుడున్. 302

తే. ఏను భీష్ముని జంపుట యింతలోని, దైనఁ బార్థుఁ డుపప్లావ్యమందు నాఁడు
జనులు వినఁ జేసె భీష్ముని జంపఁ బ్రతిన, దాని నిలువంగఁ బెట్టుట తగును గాదె.

క. మానసమున మిట్టియది యై, భాసిలు నతఁ డియకొనుచుఁ బలికిన యేనిన్
నాసాహసంబు శౌర్యం, బీసమరమునందుఁ జూప నెంచెద నిఁకన్. 304

వ. అయిన నిప్పు డింత యేమిటికి గాక్షింపుము. 305

చ. ఘనభుజుఁ డైనఫాల్గునుఁడు నైదువుఁ గైకొని తేని కయ్యమున్
దనితరసాధ్యు లైనఁ ద్రిదశారులు వైరులఁ గూడి వచ్చినన్
గనుఁగొనుచుండునంతటను గట్టిమొనం గలఁగించి గెల్చు నాన్
విను ముదిమిన్ బలం గలుగు భీష్ముని గెల్వుట కేమి మారుదో. 306

వ. అనిన యుధిష్ఠిరుం డిట్లనియెన్. 307

చ. అగు నగు నీవు చెప్పినది యంతయు వింతగు నయ్య నేతు వే
తగవును లేదు గాని విను వారిజలోచన ! నీయన ప్రయా
బగునది యైన నే సురల కైన జయింపఁగ సేకి దలంక నా
మగఁటిమిఁ జూపు భీష్ముఁ డని మాటకు నీవు వచింప నుందునే. 308

తే. అయిన నొకమాట చెప్పెద నంబుజాక్ష, పోరు గొనక మాకు నే హితబోధనంబు
సేయుదు నటన్న నీమాట చేటు గాఁగ, నిన్ను బొంకునఁ బడవేయ నేఁ దలంప.

తే. వినుము సమయంబు భీష్ముఁడు మున్న వచియెఁ
బోరుదు సుయోధనార్థ మేఁ బోరి నీకు
విజయ మొనఁగూడ సాధింతు వెడలు మన్న మి
నిపుడు తఱి వచ్చెఁ దనబోధ యట్టి దగుట. 310

చ. అరయఁగఁ గీలు సేఁత మన మందఱ మాతనిపాలి కేగి యా
కురుకులదీప! మాకు మును గూర్చెద నన్నహితంబు గూర్పు మా
దరమున నంచు వేఁడుద మతండు కృపామతి నానతిచ్చు నిం
దరమర లే దొకింతయు జనార్దనునాజ్ఞయు నెట్టిపాటిదో. 311

వ. అని మఱియును. 312

ఉ. అక్కట తండ్రి లేనిమము నందఱ ముందఱ వచ్చునట్లుగా
నక్కటికంబునం బెనిచినట్టిపితామహు నుక్కడంప లో
నిక్కరణిం దలంచెదము హీనుల మే మని చెప్ప వచ్చుఁ గా
కెక్కడిక్షత్రధర్మ మది యెంచఁగ నెంతటిక్రూరకర్మమో. 313

వ. అనిన గదాగ్రజుండు కౌంతేయాగ్రజున కిట్లనియె. 314

చ. కురువర! నీవచించినది కొంచెము గాదు రుచించె నాకు న
క్కురుకులశేఖరుం డొరులకుం గదలింపఁగరానివాఁడు సం
గరమున వాని మార్కొనఁగఁ గల్గినవాఁడు భృగూద్వహుండుఁ గాఁ
డరయఁగ నిప్పు వానిశరణంది గమించుట శ్రేయ మన్నిటన్. 315

తే. తనవధోపాయమును నీకుఁ దాన సెప్పుఁ, జెప్పినట్టులు చేసినం దవ్వ నరుల
నోర్చి విజయంబు నొందెద మోమువార్త్ర, మన కిపుడు భీష్ముపాలికిఁ జనుట లగ్గు.

—♦ ధర్మరాజు రహస్యపరీక్షణంబున భీష్మునియొద్దకుఁ బోయి ప్రార్థించుట ♦—

వ. అనినం బాండవు లప్పుండరీకాక్షుం బురస్కరించుకొని విముక్తశస్త్రాస్త్రకవచులై
వివిక్తంబుగఁ గౌరవస్కంధావారంబున కరిగి దేవవ్రతుశిబిరంబు పరియం జొచ్చి
హెచ్చినభక్తి వానిపాదారవిందంబుల కభివందనం బాచరించి శరణంబు వేఁడు
టయు నతండు వారిం గాంచి. 317

ఉ. స్వాగతమయ్య! మీకు యదువల్లభ! పాండుకుమారులార! మీ
రీగతి రాకకుం గత మదేమి వచింపుఁడు మీయభీష్టముల్
వీఁగక తీర్పఁగా నిపుడు వేడుక సేయుచునుండ నావృషన్
బాగరి యున్న మోమునను బల్కెఁ బృథాతనయాగ్రజుం డొగిన్. 318

సీ. మాకు జయంబు సామ్రాజ్యంబు సమకూరు, తెఱఁ గెట్టులో కాని తెలియఁ బడదు
సైన్యక్షయము కానిచందంబున జేసి, నీవధోపాయంబు నీవ చెప్పుము
కలన నిన్నెదిరించి గెలువంగ నోపదు, శక్రాదిదేవతాసమితి యైన
గుడుసువాటిననీదుకోదండమున ఘమ్ము, మ్రోఁగుగుట వినుచుట తోఁప దెపుడు

తే. రథముపై నెక్క మాఱటరవి యనఁగ, వెలుఁగుచు రథాశ్వనరనాశములను గుప్పఁ
గూల్చు నిన్నెదిరించిపోరొక్క నెవఁడు వాఁడు, లేఁడు ముల్లోకములయందుఁ జూడఁ జూడ.

క. నీశరవర్షంబునకున్, నాశన మై పోయె నాదునానాసేనల్
ధీశాలి వీవు మాకుం, బ్రాశస్త్యము గలుగుదారిఁ బలుకం గదవే. 320

వ. అనిన నతం డతని కిట్లనియె. 321

ఆ. నేను బ్రదికి యుండ నీకు జయము లేదు, నను జయించినంత నోపరేడు నది
కాన విజయకాంక్షు లైనచో నను మున్న, చంపఁ దలఁపు డవలఁ జచ్చు నెల్ల. 322
వ. అనిన ధర్మజుండు వెండియును. 323
మత్త. దండహస్తుఁడువోలె నీ వని దర్ప మేర్పడ నున్న నా
ఖండలాదులు నైన మార్కొనఁ గా సమర్థులు గారు నా
బెండువోయిననాబలాంగముఁ జేర్కొనం బని యుండునే
నిండుప్రేముడి నీవ చెప్పుము నిన్ జయించునుపాయమున్. 324
సీ. అనిన దేవవ్రతుం డను నీవు చెప్పిన, యంతవట్టును నిజం బనఁగ వచ్చు
నాచేత విల్లున్న నను జయింపఁగ రాదు, శక్రాదులకు నైన సంగరమున
శస్త్రగ్రహణ మేను జాలించినప్పుడు, కృతహస్తులకు గెల్వ జతనుపడును
విస్రస్తశస్త్రుని విగతవర్మధ్వజు, పతితునిన్ భీతునిఁ బాఱుఁబోతు
తే. నేను నీవాఁడ ననువాని నేకపుత్త్రు, నప్రశస్తుని వికలుని నశివపేరు
నూనువానిని స్త్రీపూర్వుఁ డైనవాని, స్త్రీ నమంగల్యకేతు నేఁ జివ్వఁ దాఁక. 325
క. ఇది నాచేసినసమయము, విదితము స్త్రీపూర్వుఁ డగుచు వెలసినవాఁ డై
పొదలుశిఖండిని మునుకొని, కదనముఁ గావింప నేను గైదువు విడుతున్. 326
వ. స్త్రీపూర్వుఁడు నమంగళ్యధ్వజుండు నగుశిఖండిని నే నేయ నుడిగినను వాఁడు నన్నేసి నొంపఁ జాలండు గావున. 327
ఉ. అంతరముఁ గ్రహించి నరుఁ డాతని ముం దిడుకొంచు వచ్చి దు
ర్దాంతదురంతబాణసముదాయమునం బడ నేయ నోప్పు నన్
వింతగ వాసుదేవుఁడును వీఁడును గా కొకరుండు లోకమం
దెంతటివాఁడు నేనిఁ దగఁ డిత్తెఱఁ జూపఁగ నాపుఁ జెంగటన్. 328
వ. ఇట్లయిన నీకు విజయంబు చేకూరు నట్లు సేయు మవల నంతయు సుకరం బగు నని పరలోకదీక్షితుం డై పలికి వాని కనుజ్ఞ నొసంగుటయు వారును వానిచరణకమలంబుల కభివందనం బాచరించి వాసుదేవసహితు లై నిజనివాసంబులకుం జని రప్పు డెల్లరును విన నర్జునుండు లజ్జావిషాదంబు లుల్లంబున మల్లడిగొన మధుసూదనున కిట్లనియె. 329
తే. గురుఁడుఁ గురువృద్ధుఁడును నిద్ధగుణుఁడు బ్రాజ్ఞుఁ
డగుపితామహుఁ బడఁ ద్రోయ నగుదు నెట్లు
ధూళిఁ బ్రుంగుడువడ నాఁడు బాలు నన్ను
నెత్తికొని ధూళి బ్రుంగెఁ నాఁ డెలమి నతఁడు 330

ఉ. అంకముఁ జేరి నేను శిశుఁడనై చనునయ్యెడ నయ్య యంచు నేఁ
గొంకక పిల్చినంతఁ గనుఁగొల్కుల నశ్రులు జాలువాఱ నా
వంకకుఁ ద్రిప్పి మోము నినువా! విను మయ్యకు నయ్య నీకుఁ గా
నిం కిటు లాడ కంచు నను నేలినతాతను జంప నేతు నే. 381

క. నను నాబలఁగంబులఁ జం, పినఁ జంపుం గాక నాకుఁ బీకం జూపక్
మన సొప్ప దేమి చెప్పుదు, వనజోదర! యుచితార్థము వచియింపఁ గదే. 332

ఉ. నావుడుఁ గృష్ణుఁ డిట్లనియెఁ నవ్వుచుఁ జిన్నపోసంగినప్డు నే
నేవగనైన భీష్ము వధియించెద నంచుఁ బ్రతిజ్ఞ చేసి నేఁ
డీవను సర్ వచించెద వి సీ! యిది క్షాత్త్రియధర్మమోటు నీ
భావము చక్కఁ జేసికొని భండనముం దరిఁ జేరఁ జూడుమా. 333

తే. దేవనిర్మిత మిది దీనిఁ దీర్చి పుచ్చి, కాని విజయంబు నొందంగఁ గాదు నీకు
నీవు గా కెవ్వరును మిత్తి కెత్తువచ్చు, భీష్ము నేయంగ నోప రే వేల్పులైన. 334

ఉ. నానుడు లాలకింపు మొకనాఁడు దివస్పతితోడ వచించె మే
ధానిధి యైనగీష్పతి బుధప్రవరా! గురువృద్ధుఁడైనన్
దనను నాతతాయి యగునట్టెడ దుష్టుఁ జనుంచె నేని లోఁ
బూన కొకింత సంశయము పోలు వధింపఁగ నంచు వింటివే. 335

తే. ఎదురుకొనునట్టివారు దుష్టులైనటుయున్న, నాత్మరక్షణమును జయం బరసి తెలిసి
కొనుటయును క్షాత్త్రధర్మంబులుగ మొలంగి, నగపుడిక భీష్ము నేయంగఁదగులు మనకు.

తరువోజ. అనిన నర్జునుఁ డిట్టు లనియె శిఖండి యాపగాతనయవధార్థ మవని
జనియించె నందు రాజనవల్లభాత్మజన్మంబు భీష్మునిపైఁ జనిన నాతండు
గన నొల్లఁ డతని సక్కాలముం దతఁడు ఘనకాండములఁ జేసి గండడఁగించు
విను మే శిఖండి వెనుకొని లాఁతిపిగిల నాఁగొను విశిఖవర్షమున. 337

వ. అనినఁ గృష్ణుండును దిక్కఁటివారు నట్లు యగుం గాత మప్పటికి కేట్లు కాఁగల
దట్లు కాకుండ దననిశ్చయంబున నియ్యకొని నిజనికేతనంబులకుం జని రనిన
ధృతరాష్ట్రునకు సంజయుదిక్కుఁ మొగంబై పాండవు లాశిఖండిం బురస్కరించు
కొని భీష్మునితోఁ భండనం బెట్లు గావించి రనిన నతం డిట్లనియె నట్లు సూర్యో
దయసమయంబునం బాండవులు శంఖభేరీమృదంగానకంబులు మొఱయుచుండ
శిఖండిం బురస్కరించుకొని సంగరరంగంబునకుం జనుదెంచి సర్వశత్రునిబర్హణం
బుగా నొక్క మోహరం బమరించుకొని రం దగ్రభాగంబున భీమసేనార్జునులు
చక్రరక్షకులై యిరుగడం బరివేష్టించి యుండ శిఖండియు వానిపిఱుందన్

ద్రౌపదేయసౌభద్రచేకితానసాత్యకులును వారివెనుకఁ బాంచాలసేనాసంచయ సమావృతుండై ధృష్టద్యుమ్నుండును నచ్చోట నకులసహదేవసహితుండై యుధిష్ఠిరుండును వానిపశ్చాద్భాగంబున సర్వసైన్యసంవృతుండగువిరాటుండును వాని వెన్నంటి బలంగంబులతోఁ ద్రుపదుండును వానిజఘనభాగంబునఁ గైకేయపంచకంబును ధృష్టకేతుండును నిలిచి నీసైన్యంబున కెత్తి వచ్చి రంత నీచమూస మూహంబునం గలమోహరంబునగ్రభాగంబున భవత్పుత్రపరివృతుండై దేవవ్రతుండు నవ్వల నశ్వత్థామయుం గృపుండు భారద్వాజుండును, నెమ్మిట గజానీకంబుతో భగదత్తుండును వానివెనుకఁ గృపకృతవర్మలును వారి ననుసరించి కాంభోజమాగధసౌబలబృహద్బలసుశర్మాదులును నిలిచి కల్లు మొగ్గరంబులు నీరియున్న యప్పు డుభయసైన్యంబులకును గుమురొప్పినప్పుడు నగుమహాయుద్ధం బయ్యె నయ్యెడ. 338

మ. విజయుండున్ సహదేవుఁడున్ నకులుఁడున్ ఘటోత్కచుండును బాండవా
గ్రజుఁడున్ సాత్యకియున్ ఘనుఁడై నెకుట బోరాడి నానావిధ
ధ్వజినీచక్ర మవక్రవిక్రమమునన్ ద్రుంచంగ నాజిన్నరన్
నిజబాహాబల మొప్ప నీబలములన్ నెల్లెచి గర్వించెన. 339

ఆ. నెత్తురేట మునిఁగి నివారు పరలోకమునకుఁ జని వ్రాయులిసియుచేతి
గదయు తమకు దారిఁ గనఁ బయియునట్లుగాఁ గన్పఁ దెలుచునంతకాలమునను.

క. పాండవబలములచే నిట్లు, విచ్చలవిడి మగుడు నీపుత్రులబలంబుల్
బెండువడి వెఱచి పఱచెను, దశదిశలఁ గొండలకుఁ బ్రాఁపు దవ్వులనికతనన్. 341

తే. అనిని ధృతరాష్ట్రుఁ డిట్లను నట్టు వినుచు, బలములం గాంచి మాతండ్రి బాహుబలము
చూపకెల్లుండెఁ జెప్పు మన్న సూతసుతుఁడు, విను మనుచుఁ జెప్పె భీష్ముని విక్రమంబు.

—♦ భీష్మునిదశమదివసయుద్ధప్రకారము ♦—

చ. అటు లోకయింతమాత్ర బలము త్రెయు విరిగ వీఁగి పాఱఁ జొ
చ్చుటఁ గని శంతనూద్భవుఁడు సోమకముఖ్యుల నెల్ల నల్కమైఁ
బటువిశిఖంబులం బఱపిఁ బమ్మరి బోసెటి చెచ్చెరన్
దటుకునఁ గూల్చెఁ గోల్మసఁగి దైత్యులఁ గూల్చెడువజ్రయోధుఁ డనన్. 343

ఆ. కాలుబలము గూలెఁ గత్తిలాసలు రాలె, హస్తిగములుఁ ద్రెళ్లె నరదములును
దుత్తుమురుగ నయ్యె నుత్తలి సంవర్తసమయమట్లు దోఁచె జనుల కెల్ల. 344

తే. మండలీకృతచాపుఁడై గంగసుతుఁడు, పాండవబలంబులం గూల్చు దండిమగని
వానిఁ గని నీదుపుత్రులు వగపు విడిచి, మెచ్చి పూజించి రంతయు మేలటనుచు.

క. విమనస్కు లగుచుఁ బాండవు, లమితవ్యథ విప్రచిత్తి నమరులు పోలన్
దమ రెల్లఁ జూచుచుండిరి, సమరము సేయంగ నోడి శాంతనవు పటిన్. 346

చ. పదియవనాఁటిరే పటులు భారతవీరుఁడు వీరవిక్రమం
బది జగ మెన్నఁ జేయుచు దవాగ్ని వనంబుల నేర్చుచాడ్పునన్
గదిరి శిఖండిసైనికుల నాశనముం బొనరింపఁ గ్రుద్ధుఁడై
ప్రదరము లేసె మూఁడతనిబాహుయుగాంతరమం దతం డటన్. 347

వ. ఇట్లు శిఖండిచండకాండత్రయవిద్ధుం డై కురువృద్ధుండు వానికిఁ మాఱేయక నొల్లక
నవ్వుచు ని ట్లనియె. 348

ఉ. ఓసిశిఖండినీ! నలువ యుగ్మలిఁ గా సృజియించె నిన్ను నీ
చేసినదానఁ బుంస్త్వమునఁ జెన్నలరారినఁ బూరుషుండవై
భాసిలఁ బోవు నీ విపుడు ప్రజ్ఞకుఁ బోలెఁ బృషత్కకోటి న
న్నేసిన నేయ కున్న నిను నేయఁ దలంప నిజంబు సెప్పితిన్. 349

వ. అనినం గ్రోధమూర్ఛితుం డై శిఖండి సెలవుల న్నాకుచుఁ బితామహుదిక్కు
మొగం బై యి ట్లనియె. 350

చ. ఎఱుఁగుదు నీప్రభావము మహిం గలక్షత్రియకోటి నెల్ల నే
డ్తెఱఁ దునుమాడినట్టిఁడవు దివ్యయశుండవు జామదగ్న్యునిం
బిఱుసుతనంబునం గెలిచి పేర్మికి నెక్కినవాఁడ విట్టి ని
న్నెఱిఁగి యెఱింగి మాఱుకొన నే నిదె వచ్చితిఁ బేర్మి పెచ్చునన్. 351

ఆ. పాండవులకు నాకుఁ బరమప్రియంబుగా, నిన్ను మన్నిగొందు నేఁడు నిజము
పలుకుచుంటి నాదుపలుకులు విని సేతు, కాలినట్లు సేయు మేల మనల. 352

క. ఏసిన నేయక యున్నన్, నే సాయకకోటు లేసి నిను మడియింతున్
నాసరసఁ బడితి వీ విఁకఁ, బాసి చనఁ జూడ లేవు ప్రాణంబులతోన్. 353

చ. అని నతపర్వసాయకము లై దశకముఁ బిగిడ్చి భీష్మునిం
గొనకొని యేసి రోసమునఁ గొంతపరాక్రమ మొప్పఁ జూపునా
తనిఁ గని సవ్యసాచి యుచితం బగువేళ యి దంచు నెంచి యి
ట్లనియె నదీసుతుం బొదివి యాహవముం బొనరింపు మిత్రతన్. 354

తే. నిన్నుఁ దలపడువారల నేను దవిలి, తెరలఁజేయుదు నీ కింక నరులభయము
వలదు భీష్మునిపైఁ బడు మలరి వానిఁ, జంప కరుదెంతు వే నిన్ను జగము నవ్వ.

తే. మాకు నవ్వఁబోటు రాకయుండెడునట్లు, దుర మొనర్చి భీష్ముతో నెదిర్చి
విజయు మందు మేను వెనుక రక్షకుఁడనై, నీకుఁ దోడుపడుదు లోకమాన్య. 356

తే. యందునాతని కెన్నత్తి పాండవబల,మందు నెవ్వఁడుఁ జూడలేఁ డయ్యె సవ్య
సాచిబలములు తెంపున నేచి చుట్టు,ముట్టి పోరిరి భీష్ముని బిట్టు తాఁకి. 365

— అర్జునుండు శిఖండికిఁ బ్రోత్సాహము గలిగించుట —

ఆ. అర్జునుండు మఱియు నరసి శిఖండి నో, రాజపుత్ర! వెఱకు మే జతపడి
శాతశరము లేసి భూతలంబున భీష్ముఁ, బండఁబెట్ట నుంటి గాండివమున. 366

వ. అని యుత్సాహంబు గలిగించిన శిఖండి నిజకోదండపాండిత్యంబు నివ్వటిల్ల మందా
కినీనందను మాఱుకొనియె నంత ధృష్టద్యుమ్నుండును సౌభద్రుండును విరాటద్రుప
దులును గుంతిభోజుండును భీమసేనసాత్యకులును నకులసహదేవులును చేకితాన
ఘటోత్కచులును ధర్మజుండును లోనగువా రాతనిం గూడ ముట్టిన నీవారును
భీష్మరక్షణతాత్పర్యంబునం బోయి వారలం దలపడి రందుఁ జిత్రసేనుండు చేకితా
నుం దాఁకెఁ గృతవర్మ ధృష్టద్యుమ్నుం దలపడియె భూరిశ్రవసుండు భీమసేను నెది
రించె వికర్ణుండు నకులుం బొదివె శారద్వతుండు సహదేవు మాఱుకొనియె
దుర్ముఖుండు హైడింబు నాఁగె సుయోధనుండు సాత్యకి వారించె సుదక్షిణుండు
సౌభద్రుం బ్రతిఘటించె నశ్వత్థామ విరాటద్రుపదుల నిలువరించె భారద్వాజుండు
పాండవాగ్రజు నడ్డగించె దుశ్శాసనుండు శిఖండిం బురస్కరించుకొని యున్న సవ్య
సాచిం గవిసె మఱియుఁ దక్కినుం గలవారు తక్కినవారి నాఁగంబెట్టి రట్టియెడఁ
గాఙ్గేయుం డెలుంగెత్తి యెల్లసైనికులఁ జూచి యిట్లనియె. 367

ఉ. అప్పుడు పితామహుఁ డహంకృతి మీఱఁగఁ దాఁకుఁ డంచు స
త్యోర్జితతీక్ష్ణసాయకము లొయ్యన నేయుచు సాహసంబున
న్నిర్జరనాథుఁ డైన నరునిం దరలింపఁగ లేఁడు శత్రుగ
ర్వార్జకులార! మీరు వెఱఁ బొందక భీష్మునిమీఁది కేఁగుఁడు. 368

తే. అనుచుఁ జేపేచి సేనాని పనుచుటయును, విని పదేయుసైనికు లెల్ల వెఱపు విడిచి
కవిసి రాభీష్మురథముపైఁ గసిమసంగి, నీబలంబును వారల నిలువరించె. 369

చ. భయము మెఱి దుస్ససేనుఁ డటఁ బార్థురథంబున కడ్డ రా ధనం
జయుఁడు నుదగ్రకోపుఁ డయి శాతశరంబుల వేయుచుం బ్రదీ
ప్తయమును వేలవోలె ధృతరాష్ట్ర! భవత్సుతుఁ డాఁగె నాతనిన్
జయమఖవన్మహారణము మాఱ్కొ రణం బసు డయ్యె వారికిన్. 370

వ. అంత. 371

సీ. దుశ్శాసనుఁడు మూఁడు తూపులఁ బ్రమథుని, సవ్యసాచిని నైదు గృష్ణు వడిగ నొత్తె
సజ్జనుండును గ్రుద్ధుఁడై యొక్కతూపున, నూఱువాలమ్ముల నొవ్వ నేసె

మ. భగదత్తుండును గాలదండమునఁ బోల్ప న్వచ్చునుగ్రాయసం
బగుశక్తిం గొని సాత్యకేయుపయి నేయం దానిసిం గాంచి వే
గగతిం బాఱఁగ నేసి సాయకములన్ ఖండించె నాతండు రెం
డుగఁ జల్లారినయుల్కవోలె నది తోడ్తోఁ గూలె నుర్వీస్థలిన్. 381

ఆ. వానిశక్తి యట్లు వమ్ముగాఁ గని నీదు, తనయుఁ డలిగి తనకు తమ్ములను
గ్రత్తి విలిచి వీని నిట్ప్రాణములతోడఁ, బోనీని యట్లు పోదువుఁ డెల్ల. 382

క. అతఁడు దెగ నేఁ బాండవు, లేతెఱఁగున నేసి తెగిరి యే యన నాఁ
తేతముల మెచ్చి యెల్లరు, నాతని నజీ మునుఁగు పెట్టె రవనీనాథా. 383

మ. అభిమన్యుంపు సుదక్షిణుం డెదురు రా నశ్వాంతకోపారుణ
ప్రభ లీనం గనుదమ్ము లగ్ని కెన యై గ్రాలం జతుష్షష్టిసం
ఖ్యభుజంగోగ్రశరంబు లేయ నతఁ డుగ్రంపుష్యుఁడై వానిదో
ర్విభవం బేర్పడ నేనిటన్ రథకుటుంబిన్ దొమ్మిదింట న్వడిన్. 384

వ. ప్రహరించుటయు నంత వారియుద్ధంబు పరమాద్భుతంబై యొప్పె నయ్యెడ విరాట
ద్రుపదు లశ్వత్థామం బొదివి పోరాడుచున్నంత. 385

తే. పదిట విరటుండు మూఁట ద్రుపదవిభుండు, గునుసుతుని నొంప నతఁడును క్రూరశరస
హస్రములు వారిపై నేసె నపుడు వారి, దూల మచ్చెరు వయ్యె వియచ్చరులకు.

సీ. సహదేవునిం దాఁకి శారద్వతుఁడు సప్తతిశితాశుగంబులఁ బరిల నేసె
నతఁడు రెండుగఁ దచ్చరాసనం బొనరించి, తొమ్మిదిటన్ వానిఁ దూల నేసెఁ
గృపుఁడొండు విలుఁ బూని కెఱలి మూఁడిటను, నురమునఁబదిటూఁపు లొరయ నేసె
నాతండు క్రుద్ధుఁడై గౌతమద్విజుఁ బ్రాణ, హానికరం బొంత యనాడ నేసె

తే. వనమునన్ మత్తకరులట్లు వారు పోరి, రవ్వ నకులుని వికర్ణుఁ డర్వదమ్ము
లేసి నొప్పింప నాతండు నీసుఁ జేసి, డెబ్బదేనమ్ముల న్వానియు బ్బడంచె. 387

క. తనపై నడరినదుర్ముఖుఁ, గని యురమున నాఱు పేటికాండ మొకఁ డతం
డును వాని నర్వదమ్ముల, జన మెన్నఁగ నేసి యార్చె సమరముఖమునన్. 388

సీ. కృతవర్మపై నైదు నేబదియును దూపు, లడరించెఁ బ్రాస్తతుం డతఁడు గనలి
వానినిం దొమ్మిది వాలికతూపుల, నొగి నేసె వారిపోరుగ్ర మయ్యె
భూరిశ్రవుఁడు వాయుపుత్రుని సిలు మా, యఱచుచు నొక్కటూ పడరి యేసె
నదివక్షమున నాట నతఁడు కుమారశ, క్తిసమంచితక్రౌంచ గిరి వలె నయి

తే. సోమదత్తిని నోనేసి సమరకేళిఁ, దేలె నాచార్యుఁ డంత యుధిష్ఠిరునకుఁ
బ్రతిఘటించి పోరంగఁ దత్ప్రాంతవర్తు, లగుప్రభద్రకులును ఘోరి రతనితోడ.

ఆ. చేకితానుఁ దాఁకి చిత్రసేనుఁడు నిజశక్తియుక్తిఁ జేసి శాతశరము
లేసి నరుఁడు నట్లు చేసి వీసరవోక, పెనఁగె వారిపోరు భీష్మ మయ్యె. 390

మ. విముఖుం డయ్యును వచ్చి నీసుతుఁడు దోర్వీర్యాం బవార్యంబుగా
సమరంబుం బొనరించుచున్నతఱి రోషప్రస్ఫురన్నేత్రుఁ డై
యమరేంద్రాత్మజుఁ డత్యుగ్రశక్తి రణమం దగ్గింపఁగాఁ జూపుచున్
విమనుం డై చనె దుస్ససేనుఁ డరిగెన్ విత్రస్తుఁ డై చేపయున్. 391

వ. ఇట్లర్జునుండు శత్రుదుర్జయుం డై విరవిక్రమంబు గావించి నీ సేనం గారించుచున్నంత ధృతమహోత్సాహుం డగు ధనురాచార్యుం డఖండకోదండపాండిత్యంబు మెఱయఁ బాండవబలంబులం గలఁచె నపుడు నిమిత్తంబు లగుటం జేసి నిజపుత్త్రుం బిలిచి యిట్లనియె. 392

క. ఈనాఁట భీష్ము నేయం, బూని యుజ్జె సవ్యసాచి భూరిరణంబున్
దా నొనరించు మహాంతా, గాన యెడిమెడి నిమిత్తకములును గంటే. 393

సీ. దొనలపై కోరెఱఁ దూపఁ బడుచుండె, విల్లస్త్రములయోగ మెల్లఁ జెడియె
నఱచుచుండెన్ ఘోర మగునట్లు మృగములు, పక్షులు నలుగడఁ బఱువు లిడుచు
గ్రద్ద లాడుచునుండెఁ గౌరవసేనపై, మాసె నభోమణి గూడె వఱదు
నెత్తురువానలం దెస లెల్ల నేల వడంకుచుండెఁ గంకాదులు నిండుకొనియె

తే. నొలికె నుల్కల నరుణమండలము పరిధి, నడఁగియపసవ్యగతుల గ్రహంబు లెల్లఁ
దిరిగెడు నవాక్ఛిరంబుగాఁ గురిసెడు నిల, దేవతావిగ్రహము లాడు దేవళముల.

శా. తేజోహీనులుగాఁ మహీంద్రులు గనం దీపించుచున్నారు ని
ర్వ్యాజప్రక్రియ గాండివధ్వని దిశాభాగంబులం దోఁగెడిన్
నైజప్రాభవ మేర్పడన్ గురిసె నానాశస్త్రజాలంబులన్
హోజింపంబడి భీష్ముపై నడరె హస్తోద్రేకముం జూపుచున్. 395

చ. అతఁడు శిఖండి మున్నుకొనినట్టిఁడ యై చని కోల్మసంగెడిం
బ్రతియుసుమంతి లేక మును బోస యొనర్చినదాన భీష్ముఁ డ
త్యతివమొగంబువాసిఁ గనఁ డాలము సేయఁడు గాన నింక నే
గతి గలదో యటంచు మది గాటము గంపము నొందు నందనా. 396

క. యమనందను సమ్ముఖమున, నమితం బై క్రోధ మెల్ల నాకృతి గనిన
ట్లమరె నది చాలు నిక్కటి, సమరమునన్ ఫలమెల్లఁ జల్లార్చుటకున్. 397

చ. విజయుఁ డనంతవిక్రముఁడు విశ్రుతతేజుఁడు నరకర్ముఁ డున్
[illegible]మరాసురప్రజుఁడు వీరవరేణ్యుల నెల్ల ప్రేల్మెడిన్

గాటిబిజి సేయుచుండె నదె గన్గొను మాతని కండ దైర్యటా
యుజుఁడును మాద్రినందనులు నుగ్రదవంబున కాసుగక్రియన్. 398

—◆ ద్రోణాచార్య అశ్వత్థామను భీష్మునకు సహాయముగాఁ బంపుట ◆—

చ. కనుఁగొను మశ్వముల్ కరులు గాల్బరు కార్ముకముల్ రథంబులున్
ఘనతర కేతుదండములు గాళ్యపిఁ గుప్పలుఁ దిప్పలై పడెన్
వినుతయశుండు ఫాల్గునుఁడు వీరవిహారము సేయు నయ్యెడన్
వనజదళాక్షుఁ డాతనికి బాసట యైనఁ గొఱంత లుండునే. 399

శా. హాహాకారములు న్వినంబడెడి సైన్యం బెల్ల మంథాచల
గ్రాహక్షుబ్ధమహార్ణవంబుపగిదిన్ గ్రాలెం బృథాసూనుఁడున్
సాహంకారతఁ బేర్చి యేర్చెడిఁ బ్రజన్ జాకుండఁ బోకుండ దే
దేహం బైనను గాన నీవు చను మా దేవవ్రతుం దోడ్పడన్. 400

తే. కలరు ధర్మజునకుఁ దోడు గలుగ నిచటఁ, బార్షతుఁడు సాత్యకియును సౌభద్రుఁడాది
గా మహారథు లెంచ జేఁ గసిమసంగి, వీరలం బెట్టి పో నాకు వెరవు గాదు. 401

క. ఏవాఁడు ప్రియకుమారుని,జీవిత మాసింపకుండుజీవి గలండే
యీవిధ మెఱింగి క్షాత్రం, బావల మది నెంచి నిన్ను ననుపఁ దలఁచితిన్. 402

ఉ. ప్రాణము దాఁచికోఁ దగినపట్టిది గాదు సుయోధనుండు సం
త్రాణపరాయణుం డతని ప్రాపున నైతిమి నేను నీవు నీ
క్షోణిపతుల్ జయం బయినచో నిట నోండొకఁ డైనచో నటన్
రాణ లెసంగ వచ్చు నని రంహగతిం జను మందుఁ దోడ్పడన్. 403

వ. అని నియోగించిన నతం డాఁగాత మని దేవవ్రతునకుం దోడ్పడం జనియె వాని
పిఱుందఁ గృప శల్య కృతవర్మ భగదత్త విందానువింద సైంధవ చిత్రసేన వికర్ణ దుర్మ
ర్షణాదులు పదుంగ్రు మహారథులు మహాసేనాసముచితు లై చని భీష్మునకుం
దలకడచి భీమసేనుం దాఁకి. 404

సీ. శల్యుండు తొమ్మిది శాతసాయకములు, గృతవర్మ మూఁడు ప్రత్యేకనములు
గౌతముఁడు నవాశుగమ్ములుఁ జిత్రసేన,భగదత్తవికర్ణనామవిభులు
చెఱి పదిపది సునిశితకాండములు జయద్రథుఁడు మూఁ డుత్తమప్రదరములును
నావంత్యు లై దేసి యంబకంబులును దుర్మర్షణుం డిర్వది మార్గణములు

తే. వరుసగా నేసి నొప్పింప వాయుసుతుఁడు, నేడిటన్ శల్యుఁ గృతవర్మ నెన్మిదింట
విందు ననువిందు మూఁడేసివిశిఖములను, నేనిటం జిత్రసేను నోనేసి మఱియు.

వ. ఇరువదింట దుర్మర్షణుం దూలించి పదింట వికర్ణుని వితాకుపడం జేసి యైదింట

ప్రాపడ్డా జదియ సేసి శారద్వతునివిల్లు విఱిచియు నేడు వేఁడిబాణంబు లాతని మేనం గ్రుచ్చి యార్చుటయుఁ గృపుండు. 406

ఉ. ఒండొకవిల్లుఁ జేకొని దళోగ్రశరంబుల భీమసేను వే
దండము సంకటంబులవిధంబున నేయ నతండు క్రుద్ధుఁడై
మండుచు గౌతమున్ జదిపి మార్గణకోటుల నంతఁ జెంత రా
నుండినసింధురాజవారు లుర్విఁ బడం బొనరించి మూఁడిటన్. 407

క. సూతునితలఁ ద్రెంప నతం, డాతఱి నిల కుఱికి తూపు లడరించుడు న
వ్వాతజుఁడు వానిధనువుఁ, బ్రీతిమెయిం ద్రుంచె రెండు పృథువిశిఖములన్. 408

వ. సైంధవుం డట్లు విరథుం డై చిత్రసేనునిరథం బెక్కి నంత బకాంతకుం డేపు సూపుటకు సైఁప నోపక శల్యుం డడరి కడువడిం జూపుచు నిలు నిలు మని యదలించుచుఁ బెక్కుప్రదరంబు లేయుచున్నంతఁ గృపకృతవర్మభగదత్తవిందాను విందచిత్రసేనదుర్మర్షణవికర్ణసైంధవు లతనిపయిం గవిసి శరపరంపరలం గురిసినం గినిసి కిమ్మీరవైరి వారి నందఱ వేఱువేఱ నైదేసిబాణంబుల నోనేసి శల్యునిపై నశీతిశాతశిలీముఖంబు లేయుటయు నతండును. 409

ఉ. తొమ్మిది వాఁడితూపులును దోడన యేనును వైచి వానిపై
న మ్మొకఁ డవ్విశోకుతను వాడగ నేసిన నల్గి భీముఁ డు
గ్రమ్ముగ నార్చి శల్యునియురమ్మునఁ గ్రుచ్చి శరత్రయమ్ము శౌ
ర్యమ్మునఁ దక్కునుం గలుగునందఱ నొంచెను మూఁట మూఁడిటన్. 410

తే. వార లందఱు మూఁడేసి నారసముల, నపుడు భీముని నోనేసి రతఁడు వారి
ధారలం జేసి భూరిగోత్రాధరంబు, మాడ్కి నిశ్చలుఁ డై యుండె మానవేంద్ర.

వ. అంత నతండును. 412

సీ. మద్రేశ్వరుని మూఁడు మార్గణంబుల నొంచి, భగదత్తునిఁ నూట బడలుపఱచి
కృపుఁ బెక్కుతూపులఁ గెరలించి కృతవర్మ, ధను వొక్కశరమునఁ దునుముటయును
వేఱొక్కవిలుఁ బూని పేరుఁ డాతఁడు భీము, భ్రూమధ్యమునఁ గ్రుచ్చె భూరిశరము
పదతాడితోరగప్రతిముఁ డై వడముడి, కృతవర్మ నెనిమిదిశితశరముల

తే. మూఁట భగదత్తు శల్యు ముమ్మూఁట గౌత, మాదియోధుల రెండేసియంబకముల
నొగుల నేయుఁడు వారును దెగువఁ బెక్కు, లేయ నతఁ డెల్లరం జూచెఁ దృణములట్లు.

వ. అట్లు విజృంభించినవృకోదరునిపై భగదత్తుం డొక్కశక్తిం బ్రయోగించె సైంధవుం డొక్కతోమరంబును బట్టసంబును నిగిడ్చె శారద్వతుం డొక్కశతఘ్నిం బఱపెఁ దక్కునుంగలవా రేనేసిశిలీముఖంబు లేసి రంత నతండు నొక్కక్షురప్రం

బునఁ దోమరంబు రెండుతుండెంబులు గావించి మూఁటఁ బట్టిసంబును మఱి మూఁట శక్తియును ముక్కలు చేసి తొమ్మిదింట శతఘ్నిం దూలవుచ్చి పల్లర మూఁడేసిభల్లంబులఁ ద్రుళ్ళచేసె. నాసమయంబున సవ్యసాచి మారుతికిం దోడు పడి పోఁడిమిం జూపుటయుం జూచి దుర్యోధనుండు సుశర్మం బిలిచి యిట్లనియె.

క. పడముడియు నరుఁడు సేనల, సుడివడఁ గాఁ జేయుచుండఁ జూచుచు నీ వి ల్లిడఁ దగు నోటు నీదగు,కడిమిం వారల జయింపఁ గడఁగుము వేగన్. 415

వ. అనినం బ్రస్థలాధిపతి యనేకశతసహస్రరథపరివృతుం డై చని భీమార్జునులం దాఁకె నంత నరుండును. 416

సీ. వివిధాస్త్రముల మద్రవిభుని ముసుఁగువెట్టి, మూఁడేసి నారసమ్ముల సుశర్మ శారద్వతవికర్ణ సైంధవభగదత్త,చిత్రసేనాదులఁ జెవర నేసి నీలంగంబుల నెవులు పుట్టఁగఁ జేసె, నపుడు సైంధవుఁడు భీమార్జునులను దాఁకి పోరెన్ శరతతుల నేయుచుఁ జిత్రసేనరథస్థుఁ డై చిత్రగతులఁ

తే. జిత్రసేనాదులున్ మద్రధాత్రిపతియుఁ, గృపుఁడు వేర్వేఱ నై దేసి విపులవదన బాణముల వారి నేసిరి వారు వాని, నడఁచియుఁ ద్రిగర్తబలముపై నడచి రంత.

ఆ. ఆసుశర్మ పార్థు నాహ్వానఁడు ప్రదరమ్ము, లేసి యార్చె నితరు లెల్ల వారి నెదిరి నిశితశరము లేసిన నన్నయుఁ, దమ్ముఁ డాజికేళిఁ దనరి రపుడు. 418

ఉ. ఆరథికాళిమధ్యమునయందుఁ బృథాసుతు లాని మేపున్న కోరిక నాలమధ్యమునఁ గోవులు నూకెడుసింహరాజము లై రమణించి మించి విశిఖావళిఁ జేసి ధనుష్కరాళితో వీరులశీర్షముల్ దునిసి పృథ్విపయిం బడఁ జేసి రీసునన్. 419

మత్త. వారువంబులు వారణంబు లవారిగా నొగిఁ ద్రెళ్ళ నై క్రూరప్రోవులు నొంగ నప్పుడు గొప్ప లై ధరఁ గప్పఁ బెం దేరు లొప్పయిపాటుగాఁ బడి తేలి యాడె రయంబునన్ బోరుజోదు లొడళ్లు ముక్కలుముక్క లై పడ నై రటన్. 420

—♦ దుర్యోధనుఁడు సుశర్మాదుల భీష్మునకుఁ దోడు పంపుట ♦—

వ. అట్టియెడ సుయోధనుండు భీమార్జునులపరాక్రమంబున కోహటించి గాంగేయ రథాభ్యాశంబునకుం జని కృపకృతవర్మసైంధవాదులం బురికొల్పి వారితో నయు తంబు నర్బుదంబు నగుతురంగసేనం బంపుటయును. 421

ఉ. పార్థులు నంతలోనఁ బలుపైఁ దమపైఁ బడఁ బొంగి వచ్చు ప్రత్యర్థుల నెల్ల ద్రెళ్ళిడిన తర్లఁ గఁ జేయుచు నశ్వసేనలన్

వ్యర్థముగా రణాంగణమునందుఁ బడల్పఁడఁ జేసి యార్వ న
త్యర్థపరాక్రమం బడర నప్పుడు మద్రవిభుండు క్రుద్ధుఁడై. 422

తరళము. ఎగిచి పార్థునిపేరురమ్మున నేసి భల్లముఖం దొగిన్
నొగులఁ జేయుఁడు నాతఁడుం గడు నూలుకొంచు రయంబునన్
దగి తదీయశరాసనం బొకనారసంబునఁ ద్రుంచి యు
నగుశరమ్ముల వానిమర్మము లాడ నేయుడు శల్యుఁడున్. 423

ఉ. కొండొకయింతలోపల నకుంఠితతేజమువిూఱ నల్లి యె
క్కొండు ధనుర్వరంబు కరయుగ్మమున న్వహియించి సూాటు నా
ఖండలసూతి నేనిటను గైటభమర్దను దొమ్మిదింట నొ
క్కొండ వృకోదరుం బలిమి నేసె భనత్సుతు లెల్ల మేలనన్. 424

వ. అంత దుర్యోధనునిపంపున ద్రోణుండును మాగధుండగుజయత్సేనుండును గండు
మిగిలి వారి కడ్డుపడి రందు జయత్సేనుండు. 425

ఉ. భీముని నష్టబాణముల బిట్టడరించిన నించుకే నతఁ
డామెయి సంచలింపక రయం బెసఁగం బదునైదుబాణములన్
గోమఱునట్లు చేసి యొకకోలన సారథిఁ ద్రెళ్ళ నేయ నా
భూమికిఁ గాక యుండఁ గొనిపోయెం దురంగము లొక్కొసమున్. 426

తే. గురుఁడు తలపడి భీమునిఁ గ్రూరమూర్తి, నేడ్వుఁ గోలల నేసి యానిలసుతుండు
కనలి షష్ట్యసముఁ డగువాని గంతుకంగ, నర్వదేనమ్ములన్ వైచి యార్చెఁ బేర్చి.

క. ఏడు రైనసుశర్మ న్నరుఁ, డడయుం డై నొంచి సునిశితాగ్రశరము
నదమదముచేసెఁ దత్సైన్య, న్యదళంబుల మబ్బుల న్మహాబలముబలెన్. 428

తే. ఆపగానందనుండు బృహద్బలుండును, యోధుడను దుర్వనుండు నింద్ర వాయుసుతులపయిఁ
బడఁగఁ బార్థమాద్రేయులు నవ్వుతుఁ డయి, కవిసి ధర్మజుఁ డానశల్యనునిమాడ. 429

వ. అయ్యవసరంబునం బాండవు లెల్లరు నిఖిలసైన్యంబులు న్యూహారంభించుకొని సృంజయబలా
వృతు లై మందాకినీనందనుం దాఁక నిక్క జూపుమంద శిఖండియు నఖండపరాక్ర
మంబునం బితామహునిపై శరవర్షంబు గురియుచుండ ధృష్టద్యుమ్నుండును భయం
బఱి మీ కెల్ల భీష్ముపయిం బకుఁ డని తనసైనికులం బురికొల్పిన వారు ననల్పపరా
క్రమంబున మొక్కవోకొక్కపెట్ట చుట్టు ముట్టి పితామహుం దెట్టులు గట్టం
గొట్టుటయు నతండును. 430

క. పాండవపాంచాలచమూ, దండంబులు పెల్లు రేఁగి తనపైఁ గవియన్
బొండువడ కాఁగె నంభో, ధిం డిగ్గున నాఁగువేల తెఱఁగేర్పడఁగన్. 431

క. ఇరువాఁగునందు నప్పటి, దరమునఁ బెక్కండ్రు మేను దొరఁగిరి నాఁడున్
సురనిమ్నగాతనూజుఁడు, శరములపాల్సేసె నయుతసైనికవరులన్. 432

వ. ఇట్లు పదినాళ్లు గ్రీష్మాదిత్యునివిధంబున భీష్మప్రతాపంబున వెలింగినభీష్ముం డప్పుడు తనజీవితంబున నిర్వేదంబుఁ జెంది మోమునం బడినవాని నేనిఁ జంప నోడి సమీపించినధర్మజుం గాంచి యిట్లనియె. 433

—◆భీష్ముండు ధర్మరాజుతోఁ దననిర్వేదం బెఱింగించుట◆—

ఉ. చేసితి క్షాత్రధర్మమునఁ జేసి సపత్నవధంబు లెన్నియే
రోసితి మేనిపై నిపుడు రోసము ముట్టఁగ బుద్ధి పుట్టదో
భాసురమూర్తి! నాపయిఁ గృపారస మించుక చిల్కఁ జూతువే
నోసర కిప్డు నన్ దునుమ నుండుము పార్థపురస్సరుండవై. 434

వ. అని బోధించి చనిన విని యుధిష్ఠిరుండును ధృష్టద్యుమ్నుండును దాము పితామహునిపయి సర్వసేనాసమూహంబుతోడం బడ నెంచి సైనికులం గాంచి. 435

ఉ. బీతఱి మీర లెల్లరును భీష్ముని మార్కొని పోరుకొండు మీ
కీతఱి వాయునందనుఁడు నింద్రసుతుండును బార్షతుండు వి
ఖ్యాతభుజాబలంబునను గావఁగ నుండిరి వేగిరింపుఁ డో
భూతలనాథులార! యశముల్ గణియింపుఁడు పెంపుఁ దున్నతిన్. 436

వ. అని ప్రోత్సాహించి పురికొల్పుటయు వారునుం బరలోకయాత్రాపరతంత్రులై చేదిపాంచాలపాండవబలంబులతో సవ్యసాచికిం దోడుపడిన నతండు శిఖండిని మున్నిడికొని పితామహునిపై నడరుటయు దుర్యోధనాదులును ద్రోణాశ్వత్థామపురస్సరంబుగా వారి నెదిరించి రందు శిఖండిపురస్సరుం డగు విజయుండు దుశ్శాసనాదులతోడను నైనేయుం డశ్వత్థామతోడను ధృష్టకేతుండు పౌరవునితోడను యుధామన్యుండు సహామాత్యుం డగుదుర్యోధనునితోడను విరాటుండు జయద్రథునితోడను యుధిష్ఠిరుండు మద్రేశ్వరునితోడను భీమసేనుండు నాగానీకంబుతోడను ధృష్టద్యుమ్నుండు ద్రోణాచార్యునితోడను సౌభద్రుండు బృహద్బలునితోడను వీడని పోఁడిమిం దాఁకి పెనకం బోరాడుచున్నంత నేమిఘట్టనంబులయు శంఖదుందుభిసందోహంబులయు గజబృంహితంబులయు వాజిహేషితంబులయు జ్యాతలంబులయు సింహనాదంబులయు నిరంతరనిర్ఘోషంబు భీషణం బయ్యె వీరాంగదకిరీటాదివిభూషణంబులును శస్త్రాస్త్రంబులును వీతతేజంబు లయ్యె రజోమేఘంబులు శస్త్రవిద్యుద్విరాజితంబులై పెల్లేచి యెల్లెడల నావరించె నిట్లు చతురంగబలంబు లన్యోన్యంబునుం బొదివి పోరుచున్నప్పుడు. 437

మ. అభిమన్యుండు బృహద్బలు న్విడిచి నిజాత్మోద్భవుం డాఁక దో
ర్విభవం బొప్పఁగ నాతఁ డాతనిని బండ్రెండమ్ముల నొంచినన్
రభసం బేర్పడ మిత్తికిం జెలియలై రంజిల్లు శక్తిన్ బర
ప్రభవుండుం భవదగ్రనందనునిపైఁ బాఱం బ్రయోగించుటన్. 438

తే. అతఁడు తనమీఁద వచ్చుచున్నట్టిఘోర, శక్తి దవ్వులఁ గని దాని సత్వరముగ
నొక్కక్షురప్రంబునం దెగి యుర్విఁ బడ నొ, నర్చె నాయుద్ధ మెంతయుఁ దీప్తి పేర్చె.

మ. శినివీరుణ్ గురునందనుం డురము సంకీర్ణంబుగా నేయ నా
తనిమర్మంబుల గాఁడ నేసె నతఁ డుద్యద్విక్రమప్రక్రమం
బున ముమ్మాఱు శరమ్ము లప్డు ద్విజుఁడున్ మున్మాఱుమూఁడుం బదుల్
ఘనభల్లంబుల వైచి వానియురము గాయంబు నొంచెం గడున్. 440

ఆ. ద్రోణపుత్త్రు డట్లు తూపుల నొప్పింప, నలుకఁ జేసి మాధవానుజుండు
వాని మీఁదఁ వాఁడివాలమ్ముల నొంచె, మేలు మే లటంచు మెచ్చ నృపులు. 441

సీ. పౌరవుం డచ్చేదిపతిధృష్టకేతుని, శితశరంబుల నొంప నతఁడు వాని
విలుఁ దున్మి ముప్పదివిశిఖంబులన్ వైచెఁ, బౌరవుండును వానిబాణవితతి
విలుఁ ద్రుంచి యార్చిన వెనుకఁ జేదీశుఁ డొం, డొకవిల్లుఁ గొని వానియొడలు నిండ
వడిగ డెబ్బదిమూఁడు వెడఁదవాయమ్ములు, విసరె నంతట వారు విక్రమమున

తే. నొండొరులచాపహయములఁ జెండికొనుచు,
విరథులై వాలుఁ బలుకయు నెస గ్రహించి
యలరు లంఘించి చిత్రమండలగతులఁ బో
సంగ సింగముల ట్లని సలిపి రపుడు. 442

తే. పౌరవుఁడు ధృష్టకేతుని ఫాలభాగ, మున నొగిల్చిన నాతఁ డాఘూనునిజస్త్రు
దేశమున నేయ నిగుడ్చుటుం దెలివి దప్పి, పడిరి చచ్చినవారికిఁ బ్రతియ యగుచు. 443

వ. అప్పుడు జయత్సేనుండు పౌరవుని సహదేవుఁడు ధృష్టకేతునిం దమతమరథంబు
లెక్కించుకొని తొలంగి చని రనంతరంబ. 444

సీ. అఱువదితొమ్మిది యమ్ములఁ జిత్రసే, నుండు సుశర్మం డాఁక నొవ్వఁ జేసెఁ
బదిపది గ్రాఁగ ముప్పదిబాణములఁ జిత్ర, సేను నేసె సుశర్మ చెన్ను దఱుగ
నభిమన్యుఁ డెన్మిదియాశుగంబులఁ గోస, లాధీశు నేసిన నతఁడు వాని
నిరువదియేను మేల్శరముల నొగిలించె, ఫాల్గుని వానిచాపంబుఁ ద్రుంచె

తే. ముప్పదింట బృహద్బలుఁ డొప్ప మిగిలి, కప్పె నాతని శరముల నప్పు డనిల
సుతుఁ డదరి వజ్రధరుఁ డద్రితతులఁ బోలెఁ, గరిఘటల నెల్లఁ గూలిచె ధరణిఁ ద్రెళ్ళ

క. మద్రవిభుండును ధర్మజుఁ, డద్రులుబలె మాఱుకొంచు నన్యోన్య మునిఁ
మాద్రికి మీఱి పెనంగిరి, రౌద్రరసం బేర్పడంగ రణరంగమునన్. 446

ఆ. విరటుఁ దాఁకి సింధుధరణీధవుఁడు ముప్ప, దియును దొమ్మిదియును దివ్యబాణ
ముల నిగుడ్చ నతఁడు ముప్పదితూపుల, నురము గాఁడ నేసి దుర మొనర్చె. 447

శా. చాపాచార్యుఁడు పార్థుతుం బొదివి పంచాశత్కలంబంబులన్
జాపంబుం దునుమాడి మోదుటయుఁ బాంచాల్యుం డటౌల్యంబునన్
జాపం బొండొకఁ డందుకో నదియుఁ దున్మం జేయ నాతం డొదం
గోపాటోపముమీఱ ద్రోణునిపయిం గొమ్మంచు నేసెన్ గదన్. 448

మ. తనపైఁ జివ్వున వచ్చుదాని నని కోదండజ్యాఁ డాజ్యాఁబు వే
ల్చినవైశ్వానరుఁ డట్లు మండుచును వాసిం జేసి పంచాదశ
ప్రణుతాజిహ్వగపంక్తులం దునిఁగిపోనం జేయుచుం బార్షతుం
డును శక్తిన్ విడ దానిఁ దొమ్మిదిట ద్రోణుం డేసె వమ్మై పడన్. 449

వ. అప్పు డర్జునుం డాపగానందనుం దాఁకి శరవర్షంబు గురియుచున్నంతఁ బ్రాగ్జ్యోతి
షాధీశ్వరుండు మదమాతంగంబుతో నెదిరించి ప్రదరంబు లేయుటయు నమ్మేటి
విలుకాఁ డొక్కయేటు నాటనేసిన నతండు క్రీడిం గ్రేడించి ద్రుపదురథంబుపై
నడరె నంత నరుండు. 450

—♦అర్జునుఁడు శిఖండితో భీష్ము నెదిరించుట♦—

చ. ఎయిదుము భీష్ము నేయ మిఱు లేటిక నివ్వెఱపాటు మేటి వై
భయమఱి లెమ్ము రమ్ము పయిపాటన లగ్గకు నెక్కి శాత్రవున్
రయమున నేసి కూల్తము శరంబుల నంచు శిఖండి ముంగలం
గయికొని భీష్ముచెంగటికిఁ గ్రన్నన నేగె భుజాబలోన్నతిన్. 451

తే. అప్పుడు నీసైన్యమునఁ గలయట్టివారు, తల్లడాక్రోశ మొనరించి యొద్దు విజయు
నడ్డకొనుటయు నాతండు నభ్రములను, మారుతమువోలె నెగిరించెమాటలోన. 452

క. అసహాయమున శిఖండియు, భాసురగతి భీష్ముమీఁద బహులోగ్రకలం
బాసారము నిగిడించెన్, ద్రాసం బిసుమంత మదికిఁ దాఁకనిదానన్. 453

వ. అయ్యవసరంబున. 454

చ. అరదము వేదిగా ధనువు నర్చిగ శక్తిగదాదు లింధనో
త్కరములు గా శరంబు లెసకం బగుజ్వాలలు గా నదీసుతుం
డురుతరజాతవేదుఁ డయి యుద్ధతిఁ జూపుచు సోమకాదిభూ
వరులను నీఱుసేసె నటుఁ బౌర్షదానగు లెనవారలన్, 455

ఆ. వేడి లెక్కసేరు కీడఁబోనిపరాక్రమమునఁ గ్రీడి సైన్యసమితి సొచ్చి
యున్నయపుడు మనసు మోదమందె ట్లనుఁ, జేయి వీచి పిల్లసేనలెల్ల. 465

ఉ. సైనికులార ! మీ రిపుకు శౌర్య మవార్యము గాఁగఁ జూపుచుం
బూనిక నొక్కపెట్టఁ బడి పోరుఁడు కవ్వడితోడ జాహ్నవీ
సూనుఁడు చాలి యుండ భయశోకము లందఁగ నేటి కింక మీ
కేనును వాని మాఱుకొని యేర్తిఁ జూపెదఁ జూడుఁ డిందఱున్. 466

వ. అనిపురికొల్పిన ననల్పపరాక్రమంబునం గడంగి విదేహ కళింగ దాశేరక నిషాద సౌవీర బాహ్లీక దరద ప్రతీ చ్యోదీచ్య మాల వాభిషాహ శూరసేన శిబి వసాతి సాల్వ శక త్రిగ ర్తాంబష్ఠ కేకయు లొక్కపెట్టఁ బావకునిఁ బతంగంబులు వోలెఁ బార్థునిం జుట్టుముట్టుటయు నతండును గోపాటోపాతిశయంబునం జేర్చి దివ్యాస్త్రంబుల నమ్మూఁకల నెల్లం దాఁకి గజారోహకుల గజంబులతోడం గూల్చియు నశ్వారోహకుల నశ్వంబులతోడ రాల్చియు రథికుల రథసారథుల తోడం ద్రుంచియుఁ బదాతుల వివిధ హేతివ్రాతంబులతోడం దంచియుఁ గోలుమసంగి సంగ్రామాంగణం బెల్లఁ బీనుంగుపెంటలు గావించి భూమియు నాకసంబును దనబాణపరంపరల ముంచియు మించినం గని చావఁ జిక్కినమూఁకలు చీకాకుపడి పిక్కబలిమిం జూపునంత దుశ్శాసనుండు దోస్సామర్థ్యంబునం జేసి కిరీటిం దాఁకు దెంచి నానావిధాస్త్రంబులం బ్రయోగించి విక్రమించుటయు నవ్వీరవర్యుండు. 467

మ. ధనువుం ద్రుంచి ధ్వజంబుఁ ద్రెంచి రథరథ్యవ్రాతముం గూల్చి సూ
తుని దేహంబు వగిల్చి మేనిమఱువుం దుందుడ్కలై పో నొన
ర్చి నిశాతాశుగకోటిఁ దూర్చి కడిమిం జెల్వార నీపుత్త్రుఁడున్
దను వెల్లన్ రుధిరంబు గా విరథుఁడై తాఁ బాఱ వెన్నిచ్చియున్. 468

వ. అపుడు కృపశల్యవికర్ణవివింశతులు తనపై నరుదెంచినం గని కవ్వడి వారల వేఱు వేఱ యేనేసియమ్ము లేసి విరథులం జేసిన వారునుం గాందిశీకు లయి రప్పార్థాగ్రహంబున. 469

క. పొగ లేనివహ్నివిధమునఁ, దగ వెలుఁగుచు నర్జునుండు దక్కటివారిం
దగిలి మహాశుగతతులం, దెగ నేయుచు రణ మొనర్చె ధీరులు మెచ్చన్. 470

చ. రుధిరనదీప్రవాహ మది రూక్షముగాఁ బ్రభవించె నప్పు డ
వ్విధమునఁ బోరునర్జునుని వెన్కయు ముందుఁ దదంతరంబులన్
వధ కయి కూలునేన్గులును వాజ్యములున్ భటులున్ రథంబులున్
విధికృతమార్గముం గలుగ వీసరపోయెను వేన వేలుగన్. 471

క. తలలుం గాళ్ళును జేతులు, బలుతుండెంబు లగుచు సమరభాగము నిండెన్
బొలిసిన హయనాగాదుల, కెలనన్ భిన్నాయుధప్రకీర్ణము లగుచున్. 472

తే. కాకులును గ్రద్దలుం గృధ్రకంకములును
వృకములును నక్కలును భూతవితతు లపుడు
తినియుఁ ద్రావియు గట్టునఁ ద్రేఁచుటకును
సమరతలము మహానసశాల యయ్యె. 473

వ. అనంతరంబున సమరాపగానందనుండు. 474

మ. అనలాస్త్రం బరివోసి జిష్ణుపయి నేయం బూనియున్ ముందటం
గని కాదంచు నుపసంహరించె శరముం గౌరవ్యు లెల్లం గనం
గొనుచుండం దఱి యంచు నెంచి నరుఁడుం గో యంచుఁ బెల్లార్చుచున్
మనసైన్యంబుల నెల్లఁ గూలిచె ససామాన్యప్రభావంబునన్. 475

వ. ఇట్లమానుషక్రమంబునం గ్రీడిపరాక్రమంబు సెల్లుచున్నంత నిరువాఁగునం దును రథహస్తిపత్తితురంగాదులు రథహస్తిపత్తితురంగాదులతోడం దలంపడి ఘోరంబుగం బోరుచుండఁ గృపశల్యచిత్రసేనదుశ్శాసనవికర్ణులు రథాంతరంబు లెక్కి వచ్చి చిచ్చఱపిడుగులుంబోలెఁ బైఁబడి పాండవబలంబులం గాఱించు టయును. 476

క. నీరాకరమున జంఝూ,మారుతమున నావవోలె మును మగలపడన్
బారిప్లవమై పాండవ,భూరిచమూచయము కొంత పోడ నడఁగె నృపా. 477

వ. అట్టియెడ గాంగేయుండునుం గవిసి శైశిరకాలం బాలమర్మంబులం ద్రెంచునట్లు పాండవబలంబులమర్మంబులు ద్రుంచుచు గుఱ్ఱంబులం గూల్చుచు నేనుంగులఁ బీనుంగులం జేయుచు శతాంగంబుల భంగంబు నొందించుచుఁ గాలుబంట్ల నేల పాలు గావించుచుఁ బెనంగుచుండ భీభత్సుండునుం గంటుమిగిలె మనవారును బ్రహ్మలోకపరాయణు లై పితామహునకుం బాసట యైన వారును వారిసేనాని పురికొల్పుటం జేసియు నీవును నీకొడుకునుం బెట్టిన బాములు తలంపెట్టికొనియుఁ జావున కైనం జంక కిట్టునునకుం దోడుపడి తాడిసిడంబువానిం దాఁకిన నతం డును దనకు జామదగ్న్యుండు ప్రసాదించినశితాస్త్రప్రభావంబునం జేసి పరబలక్ష యంబు గావించుచు నాఁడును బదివేలయేనుంగులఁ బదివేలగుఱ్ఱంబులఁ బంద్రెం డువేలరథంబులను బదునాల్గువేలకాలుబంట్లనుం గాల్చిపుచ్చె నాసమయంబున.

శా. సేనాసంతతియు మోర్వఁ జాలనిమదిం జేకొంచు మత్స్యావనీ
జానిభ్రాత యెదిర్చి భీష్మునిపయిన్ శాతాశుగవ్రాత మొం

తే నల్కఁ గొని యేసి యార్చుడు నతం డీక్షించి యక్షీణబా
హానద్ధాతిపరాక్రమంబునను సింహధ్వానముం జేయుచున్. 479

—♦విరటుతమ్ముఁ డగుశతానీకుండు భీష్మునిచేఁ జచ్చుట♦—

క. వీఁక మెయి నొక్కకోలం, గైకొని సంధించి తిగిచి కడు వడిగ శతా
నీకునిపై నడరించిన, నాకడఁ బడె నతఁడు మిత్తి కప్పన మగుచున్. 480

వ. ఇట్లు శతానీకుం జంపి నీతండ్రి వెండియుం దనపైఁ గవిసినరాజలోకంబు నెల్ల గండడంగించుచు నెందుఁ జూచినం దననారాచంబులఁ దోఁపం జేయుచు మధ్యందినమార్తాండునిచందంబున నుభయసేనామధ్యంబున వెలుంగుచుఁ బ్రగృహీతశరాసనుం డై గండుమిగిలి దేవేంద్రుండు దేవారిసైన్యంబులం బోలెఁ బాంచాలపాండవబలంబులం గనుపుగొట్టుచుండం గని కృష్ణుండు జిష్ణుదిక్కు మొగం బై యిట్లనియె.

మ. బలభిత్తుల్యపరాక్రముం డని జగత్ప్రఖ్యాతినిం గొన్నవాఁ
డలఘుం ద్యునదీనందనుండు భవదీయప్రాజ్యసైన్యంబులన్
బెలుచం గూల్చెడి వీనినిం గెలిచినన్నే మీకు సామ్రాజ్య మొం
డులకున్ గెల్వఁగ రాదు నీవ యొకరుండుం గాక లోకంబునన్. 482

చ. తడయక విక్రమింపు మని దానవవైరి ప్రచోదనం బొన
ర్చుడుఁ గపికేతనుం డడరుచు న్వడి ముట్టి నదీకుమారుపైన్
వెడఁద వెడందతూపులను వీసరపోవక యేసి వానిత
త్తడులును గేతనంబును రథంబును ముగ్గుగఁ జేసె నీసునన్. 483

మత్త. పాండవేరితభూరిసాయకవార మెల్ల నదీకుమా
రుండు మాఱుశరంబు లేయుచు రోదసీకుహరంబున
న్నిండఁ జేయుచు నిండువేడుక నిల్వరించుచుఁ బోరె నొ
క్కండ చాలు జగత్త్రయంబును గాల్వ నం చని మెచ్చఁగన్. 484

వ. అప్పుడు భీమసేననకులసహదేవధృష్టద్యుమ్నధృష్టకేతుకేకయచేకితానద్రుపదద్రౌపదేయవిరాటసాత్యకిసౌభద్రఘటోత్కచశిఖండికుంతిభోజసుశర్మప్రభృతు లొక్కపెట్ట చుట్టుముట్టి బెట్టేసిన బిట్టగ్గి నదికట్టి తెట్టెలుగట్టిన ఖిల్లర నెల్లవోవం గొట్టుచున్నం గని పాండవేయాభిరక్షితుం డై శిఖండి గండుమిగిలి చండకాండంబులం బఱపుచుండె భీష్ముండును వానికి మాఱేయక తక్కనుం గలవారి నుక్కడంచుచు మొక్కవోనిపరాక్రమంబున సంగరక్రీడం దేలుచుండె నంతఁ గ్రీడి పేడి మున్నిడుకొని వానిపైఁ గవిసి యనర్గళప్రసారంబున మార్గణాసారంబు గురియుటయును దక్కినవారును గడిమి మెఱసి సురనదీసుతుం దలపడి పరిఘుపర

శక్త్యథముసలముద్గరప్రాసకుంతతోమరకరవాలభిండివాల శూలాది నానాహేతివ్రాతంబు లొక్కమొగి నేయుచుం దాయుచున్నంత శంతనుసూనుండు పీడితుం డయ్యును విశీర్ణతనుత్రాణుం డయ్యును డయ్యం బోక చయ్యన నయ్యాయుధంబుల నెల్లం ద్రెళ్ళ నేయుచు యుగాంతాగ్నిసమప్రఖ్యుం డై మత్స్యపాంచాలచేది సైన్యంబులం జొచ్చి విచ్చలవిడి విహరించుచు ధృష్టకేతుప్రభృతుల కభిముఖంబు గాక శిఖండిం గన్నెత్తి చూడక భీమార్జునసాత్యకిద్రుపదవిరాటధృష్టద్యుమ్నుల నార్చుచుం దాఁకి ఏకమెయిం బోరుచుండ వారును వేలువేలుఁ బదేసిసాయకమ్ము లమ్మేటిమగనిపై నిగిడించినంత శిఖండియుఁ జండకాండంబులం బరఁగించుచుండె నట్టియెడ నర్జునుండు శిఖండి మున్నిడుకొని పుంఖానుపుంఖంబుగా నేయుచు నొక్క శితసాయకంబున శాంతనవుశరాసనంబుఁ ద్రుంచినం దాని కోర్వక ద్రోణకృతవర్మసైంధవభూరిశ్రవశ్శల్యశల్యభగదత్తు లేడ్వురుదార లెత్తెఱం జూపుచు నేపు మీఱుటయు భీమసేనసాత్యకిధృష్టద్యుమ్నవిరాటద్రుపదఘటోత్కచాభిమన్యు లేడుగురును వారి నెదిరించిన దేవదానవులకుం బోలె నాహోరుఘోరం బయ్యె నయ్యవసరంబున శిఖండియును. 485

చ. విగతధనుర్వరుం డగుచు వేడుకఁ జూచెనునాగసుతుం
దగిలి దశాంబకంబుల నుదగ్రతి నేసియు నన్నితూపులం
దిగిచి తదీయసారథికి నవ్వగఁ గూర్చి నిశితశక్తమ్మునం
దెగిపడ నేసి యార్చిన నదీసుతుఁ డొండొకవిల్లుఁ బూనుచున్. 486

తే. దాని మూఁడమ్ములం ద్రుంచి వాసరధ్వజాను నొండియు దేవవ్రతుండు గొనెను
నన్నివింటులు దునుమాడ నాతఁ డలిపి, శక్తిఁ బట్టవైచె విజయునిస్యందనమున.

క. పిడుగువలె వడిగ వచ్చెడు, బెడిదం బగుశక్తిఁ గాంచి బెదరక విజయుం
డడరుచు దానిం దునిమెం, గణికంపలు గాఁగ నైదుకాండంబుల వడిన్. 488

వ. అట్లు తనశక్తి విఫలం బగుటకుం గనలి కురుపితామహుండు తనమనంబున. 489

—భీష్ముండు తనమనంబున దిష్టాంతంబు నిశ్చయించుకొనుట.—

సీ. భగవంతుఁ డగుయదుప్రభవుఁ డేడ్గడ గాక, యున్నచో నెల్లర నొక్కనాఁట
నుక్కడంపఁగఁ జాలి యుంటి నే నిప్పుడు, వాసుదేవాశ్రయుల్ వారవధ్యు
లది గాక స్త్రీపూర్వుఁ డగుశిఖండికి మాఱు, గడఁగనివాఁడ నై నుడివియుంటి
నీరెంటఁ బాండుమహీనాథసుతులతో, భంజనం బొనరింప నుండదు మది

తే. సత్యవతిఁ బెండ్లియాడుసమయమందుఁ, గరుణ నాతండ్రి స్వచ్ఛందమరణమూల
మం దవధ్యత్వ మొసఁగె నా కందున నిది, ప్రాప్తకాలము దిష్టాంత మందుటకును,

వ. ఇట్లు తాండు తలంచుట లెఱింగి యంతరిక్షంబున నుండి ఋషులు వసువులును దేవవ్రతుం బిలిచి యి ట్లనిరి. 491

ఆ. నీతలంపు మేలు నిఖిలదేవతలకుఁ, బ్రియము సేయు మట్లు నయవిశాల!
యుద్ధమందు నీదుబుద్ధి మరల్పు మిప్పట్ల ననుచుఁ దెలియఁ బలుకుటయును. 492

చ. చల్లనిమందమారుతముఁ సౌరభముల్ వెదజల్లె నంతటం
జల్లునఁ బుష్పవృష్టి పెలుచం గురిసెన్ దివినుండి యెల్లెడం
బెల్లుగ దుందుభుల్ మొరసె వీనులవిందుగ దేవగాన మ
ల్లల్ల వినంబడెం గురుకులార్ణవచంద్రున కుత్సవంబుగన్. 493

తే. ఋషులవాక్యములుం బుష్పవృష్టియు దివిఁ బదులదుందుభిరవము నప్పదమునందు
వినికనియెఱుంగఁ దేవవ్రతునాభీష్ముఁడొకఁడు, మునికరుణ నేనొకఁడగాక మనుజనాథ.

సీ. వేల్పులవాక్యముల్ విని భీష్ముఁ డర్జునుం, జేసిన మా ఱేయ నెంచఁ డయ్యెఁ
దఱి వసువు శిఖండి తనయురంబాడ నేసిన నాతఁ డద్రి నాఁ దనరి నిలిచె
నపుడు గాండీవి యిర్వదైదును నూఱుమూర్ధ్నిణము లమ్మేటిమర్మముల నాటె
నాలో నని నెఱింగి యభియాతు లెల్లరు, నతనిమై నాటిరి శితశరములు

తే. నాటిన నతండు విలుఁ బూని మేటిశరము, లేసి వారించె నర్జునుం డేయునవియ
కాక యిసుమంతయు శిఖండికాంచెయము, తాల కేతను నొప్పింపఁ జాలవయ్యె

ఉ. అంత శిఖండి మున్నుగాని యప్పొజయుండు పడింటఁ గార్ముకం
బింతలు గాఁగఁ దున్మి సిడ మెక్కటితూ పొకఁ జేసి కూల్చి దు
ర్దాంతదురంతబాణములఁ దద్రథసారథి నొవ్వ నేయ నొ
క్కింతన శంతనూద్భవుఁడు నింకొకవిల్గొని యెక్కువెట్టుచోన్. 49(

తే. నరుఁడు శితభల్లముల దాని నడుమ విఱుగ
మఱియునుం గొన్నవిం ల్లెల్ల మఱియుఁ ద్రుంచి
పంచవింశతిశరము లాభరతవంశ
తిలకుమెయి నాటె నొకపెట్ట తలకుమాని. 49

వ. అనంతరం బర్జునబాణపీడితుం డగుపితామహుం డుపకంఠంబున నున్నదుశ్శాసనుఁ
జీరి యి ట్లనియె. 49

మత్త. దేవదానవరాక్షసుల్ నను దేరి చూడఁగ లేరశం
గా వచింపఁగ నేల మర్త్యులఁ గత్తె న న్నిటు లొర్చునే
కేవలుం జనకింద్రుఁ డేనియు గెల్వఁ జాలఁడు వీని నే
నేవిధిం గెలువంగ నేరుతు నింక నారయ నేటికిన్. 49

వ. అంతట మఱియు నమ్మహేంద్రనందనుం డనేకశతసహస్రశరంబు లానదీసుతుని శరీరంబున న్నాటించి నొప్పించుటయు నతండు వెండియు దుశ్శాసనున కిట్లనియె. 500

సీ. వజ్రాశనులఁ బోలి వచ్చె మే నివి శిఖం, డివి గావు గాండీవి వపును గాని
యినుపరోఁకళ్లు నా నెమ్ము లెల్లం బిండి, గావించె నివ్వి శిఖండి వేట్లు
బ్రహ్మదండము వోలెఁ బ్రాణముల్ పెకలించు, నివి కిరీటివి గాక యెవని వగును.
శలిహానములట్లు గ్రోలు నావాయువు, లిట్టి వాస్త్రీఫూర్వనింటఁ గలవె

తే. నాదుమర్మములం ద్రెంచి వేదన కయి
యమభటులు నాఁగఁ జెప్పనై యతిశయించు
నీశరంబులు పార్థునివే నిజంబు
కాకయుండిన నీవేఁడి కలుగు పీడ. 501

క. గాండీవి గాక జగముల, నుండినవా రెల్లఁ గూడియును నన్నిట్లు
ద్దండగతి నొవ్వఁ జేయఁగ, దండిమగల్ లేనిమాట తథ్యము కాదే. 502

వ. అని పలుకుచు నలుక పొడమ వడివడిం గొని భీష్ముండు మహాభీష్మం బైనశక్తిం
దీసి పార్థుమీఁదఁ బడవేయుటయు నతండును. 503

ఉ. దానిని మూఁడుబాణముల దారిన మూఁడుగఁ జేయుటకున్ నదీ
సూనుఁడు వాలునుం బలుకఁ జుల్కఁ గ్రహించెడునంతలోనఁ బం
చానన మట్లు పెల్లడరి యర్జునుఁ డవ్వియు నవ్వసుంధరం
గానఁగ రానియంతకడికండలుగా నొనరించె నెంచఁగన్. 504

వ. అట్లు పోరుచుండ యుధిష్ఠిరుండు మీ రెల్ల పై నేచి పితామహుం బొదువుం డని
చేయి వీచి చెప్పుటయు నప్పు డెల్లసైనికులును బ్రాసముద్గరముసలభిండివాలకర
వాలాదు లడరించుచు నొక్కుమ్మడి నక్కురుపితామహుం దాఁకి సింహనాదంబుఁ
గావించినంత నీకుమారులును నానావిధసేనావారంబుతో నాడి నెదిర్చినం బోరు
ఘోరరూపం బయ్యె. 505

తే. బలఁగముల మొగంబున నిల్చి పార్థుఁ డపుడు, నేలయుం గోలయుం దచ్చె నీదుసేన
వాని శరములఁ వేఁడి కావసుధ నిలువ, లేక పాఱె భవద్బలం బీకొన కని. 506

వ. అపుడు సౌవీర కితవప్రాచ్యప్రతీచ్యోదీచ్యమాలవాభిషాహ శూరసేన శిబి వసాతి
సాల్వత్రిగర్తాంబష్ఠ కేకయప్రభృతు లగ్గునశరార్తులయ్యుం బితామహుం బాయక
పాండవసేనతోడం భండనంబు గావించుచుండి రట్టియెడ. 507

క. పడ నేయుఁడు వడి డాయుఁడు, విడువక పోరాడుఁ డనెడువిపులధ్వను ల
ప్పుడు భీష్ము నెదుటఁ బోరెడు, వడి గలరిపుసైన్యమందు వఱలెం దఱచై. 508

వ. అంతలోనం గురుపితామహుండు. 509

—భీష్ముండు శరతల్పగతుం డగుట—

మ. అకటా యేమని చెప్పవాఁడఁ గురునాథా! ఫాల్గునాస్త్రాళిచే
కక గాత్రంబున నంగుళాంతరముభాగం బైన లే కల్లసా
యకపంక్తుల్ మెయి నంటి యుండఁ బడె సంధ్యారాగముల్ గప్పఁగా
సకలోర్వీశులు సూడఁ బ్రాక్ఛిరముగా సంగ్రామరంగంబునన్. 510

క. దివి భువి హాహాకారము, లవిరళముగ మ్రోసెఁ బుడమి యద్రువంగ రథ
ప్రవరంబునుండి గంగా,భవుఁ డమ్ములతోడఁ గ్రిందఁ బడియెడు వేళన్. 511

ఆ. అంపగములమీఁద నవని స్పృశింప కిం,ద్రధ్వజంబువోలెఁ ద్వనరి పడిన
వానిఁ గనినయెల్లవారిచిత్తంబులు, జాఱిపడియె నట్టిసమయమందు. 512

క. శరతల్పంబున గంగా,నరతనయుఁడు సేరినపుడు వడనడ వడకెం
ధరణితల మల్పవర్షము, కురిసెన్ దేవత్వ మతని గొబ్బున నొందెన్. 513

చ. అరుణుఁడు దక్షిణాయనము నందినవాఁ డౌట లేఁగు టొప్ప దం
చరయుచు నున్నచో సురలు నట్లు వచించుట లాలకించి ని
ర్జరతటినీసుతుండు దివిషద్వరులార! భవద్వచస్స్థితిన్
బరఁగెద నుత్తరాయణము వచ్చెడునంతకు దేహధారి నై. 514

తే. అంతలో గంగ దక్షిణాయనము మృతికిఁ,బోల దని పుత్రునకుఁ జెప్పఁబుచ్చె ఋషుల
వారు రాయంచ లై వచ్చి వాని కెల్లఁ, దల్లిబోధన లెఱిఁగించి తరలి చనిరి. 515

క. జనకునివరమున మరణము, తనచేతం గలదు గానఁ దా నుదగయనం
బునఁ గాని మేనఁ బ్రాణం,బును బాయనినియమ మూని పొలుపొందె నటన్.

వ. అట్లు భారతపితామహుండు శరతల్పగతుం డగుటకుఁ బాండవపాంచాలబలంబు
లెల్లఁ జెల్లు రేఁగి సింహనాదంబులు సేయుచు శంఖంబులు పూరించిరి మనబలం
బులును విగతేంద్రియవ్యాపారంబు లై హాస్యప్రాయంబు లై పరిదేవనంబు గా
వించె దేవవ్రతుండును మహోపనిషద్యోగంబునం బొంది కాలాకాంక్షి యై
జపించుచుండె ననిన విని ధృతరాష్ట్రుండు సంజయుదిక్కు మొగం బై. 517

శా. ఘాతం జేసె విధాత నాదుమనముం జా ఘైయైన నీ చో నయో
ఖ్యాతాఖ్యాతుఁడు తండ్రి గూలె నని యాకర్ణించియుం గొంచె మే
రీతిం దప్పదు వజ్రసార మని గుర్తింపంగ వచ్చెన్ గులో
ద్భూతాభాగ్య మి దెల్లఁ జెప్పఁ బనియే దుఃఖంబు సామాన్యమే. 518

తే. జామదగ్న్యనిదివ్యాస్త్రశస్త్రములకు, నోడనిపరాక్రమము గలప్రోడ నాడు

[illegible] ద్రుపదునితనయుచేతఁ, బడియె నని విన్న నాశ్చర్య మడరెనకట.

వ. [illegible] యింత యేమిటికిఁ గాని మ్మవలివృత్తాంతంబు కొంత గలదేని చెప్పు [illegible] డిట్లనియె నట్లు శాంతనవుండు సాయాహ్నంబున విశీర్ణకవచ [illegible] శరశయనం బలంకరించి నీవారికి ఖేదంబును వారికి మోదంబును [illegible]చినప్పు డెల్లభూతంబులును హాహాకారంబు సేయుచు. 520

సీ. గంగామహాదేవిగర్భంబునం బుట్టి, ఋషులతోఁ జదివెఁ బెం పెసఁగ నితఁడు
పితృదేవతాప్రీతి కితఁడు పెండిలియాడ, కూర్ధ్వరేతస్కుఁ డై యొరిమఁ గనియె
ధర్మమే జయ మని తవిలి భార్గవరాము, నెదిరించి విఖ్యాతి నితఁడు గాంచె
ముజ్జగంబులఁ గలమునులకే నితనిచె, ప్పినమాట విజ్ఞానమునకు మాట

తే. బ్రహ్మవిద్వరిష్ఠుఁ డితండు పాండవులకు, హితుఁడ యయ్యును గౌరవహితముఁ గోరి
భండనము చేసి పదె నిట్లు భానుఁ డస్త, మించినప్పు డపరభానుఁ డంచు నెంచ. 521

వ. అని ప్రశంసించుచున్నంతఁ గర్ణదుర్యోధనకృపాదు లామేటివిలుకానిపాటున కోహటిల్లి నిట్టూర్పు నిగిడించుచుండం గని దుశ్శాసనుం డన్నయనుమతంబున సేనాపరివృతుం డై గురుం డున్నచోటికిం జని యేటికోలుపాటు చెప్పిన నతండు మూర్ఛితుం డై తేరిపై నొరగంబడి కొంతవడికి సేదఁ దేఱి సేనలం దిపియించి విముక్తకవచుం డై కౌరవపితామహునిపాలికిం జనియె నంత నిరువాఁగుయోధులును దమతమశస్త్రాస్త్రకవచాదులు విసర్జించి శరతల్పంబుకడకుం బోయి ప్రణమిల్లి నిలిచి రర్జునుం డొక్కరుండు మాత్రము ధనుర్బాణపాణి యై చనియె నిట్లు కురుపాండవయోధుఁ లెల్లం జనుదెంచి ప్రణమిల్లి యున్నం గని దేవవ్రతుం డెల్లరకు వేఱువేఱ స్వాగతంబు వలికి మీదర్శనంబునం జేసి నేను బరితుష్టుండ నైతి నని వారి నభినందించి తనశిరోలంబత్వనుం జూచి యెల్లరు విన ని ట్లనియె. 522

—♦అర్జునుండు భీష్మున కుచితోపధానంబు గల్పించుట♦—

ఉ. క్రిందల యయ్యె నా కిపుడు క్రిందఁ బోకానోక యింతలోన నెం
తేఁ దగునట్లు గా నిలుపుఁడీ యుపధాన మొకండు నా వుడున్
నీదుసుతుండు చేఁ బనిచి నిల్పె సటుల్ మృదులోపధానముల్
కా దిది వీరశయ్య కని కైకొన కానదిసూతి నవ్వుచున్. 523

తే. విజయునిం గాంచి నా కిట్లు వేలెడుఁ దల
తగినతలగడ యొకఁ డిడఁ దలఁపు మనుడు
నతఁడు గాండీవమును బెట్టి యస్త్రపూర్ణ
నయనుఁ డై మ్రొక్కె నెంతే వినయము దోఁప. 524

క. నీకున్ భృత్యుఁడ నే నీ, వా కౌఁదలఁ బూని యెపుడు వర్తించెద నో
లోకైకవినుతచరితా, నీ కిప్పటి కగుతలాడ నేఁ గల్పింతున్. 525

వ. అని మఱియుం బితామహునాజ్ఞ వడసి గాండీవంబు గ్రహించి మూఁడుమార్గణం
బు లభిమంత్రించి యేయుటయు. 526

క. తలక్రిందు లగుచు నగ్రం, బులు నేల న్నాటుకొనఁగఁ బొలిచి శరంబుల్
తలక్రింద నిలిచి శయ్యా, తలమున కప్పటికిఁ దగినతలగడ యయ్యెన్. 527

మ. తనచిత్తంబున నున్నదానికిఁ దగం దార్కాణగాఁ గార్యముం
బొనరం జేసినసవ్యసాచిఁ గని లోఁ బొంగారి గంగాసుతుం
డనిలోనం బనుక్షత్రియోత్తములశయ్యల్ సూడ ని ట్లుంట ధ
ర్మనిబద్ధం బగునంచుఁ బల్కుచుఁ గను న్మన్నించుచు న్మెచ్చుచున్. 528

వ. తనచుట్టునుం గూరుచున్నరాజులను రాజపుత్రులం గాంచి యి ట్లనియె. 529

సీ. కపికేతనుఁడు నాకుఁ గల్పించినతలాడ, గనుఁగొంటిరే మీరు కన్నులార
ననుఁగూప మైనయియ్యంపపాన్పునఁ బండి, రవి యుత్తరాయణ మవ్వఱకును
బ్రదికి యుండెద నాదుపరిరక్షణ మొనర్పుఁ, డిటఁ బరిఘం ద్రవ్వ నేర్పఱపుఁడు
మీరు పరస్పరవైరంబులన్ మాని, శాంతి వహింపుఁడు సమరమునకు

తే. ననుచుఁ బలుకుచు నున్నప్పు డటకు శల్య, వైద్యు లుపకరణములతో వచ్చి మేము
సాధుశిక్షితులము మాకు శస్త్రవైద్య, మునకు నాజ్ఞ యొసంగు మోఘనయశుండ.

వ. అని విన్నవించుచున్న యశాంతనవుండు నీతినయుని గాంచి యి ట్లనియె. 531

మ. శరతల్పంబున నున్నక్షత్రియున కాశస్త్రంబులన్ దగ్గ మై
పరముం గాంచుట చెల్లుఁ గాన నిపు డీవైద్యోపయోగంబు లే
దరయన్ వీరిని గౌరవించుచు ధనం బర్పించి పుచ్చుం డనం
గురురా జగ్గతి వైజ్యులం బనిచెఁ గోర్కుల్ దీర్చి పూజించుచున్. 532

వ. అనంతరం బెల్లపార్థివులును రక్షావిధానం బేర్పఱచి శరతల్పగతుం డగుభీష్మునకు
మ్రొక్కి ముమ్మాఱు ప్రదక్షిణంబు చేసి రుధిరోక్షితు లగుటం జేసి వేగిరించుచు
నిజశిబిరంబులకుం జని రంత శాంతనవపతనసంహృష్టచిత్తుం డగుపాండవజ్యేష్ఠుని
పాలం బుండరీకాక్షుండు సాక్షాత్కరించి యి ట్లనియె. 533

శా. నీపుణ్యంబునఁ జేసి దేవతలకేనిం గెల్వఁగా రానిగం
గాపుత్రుండు రణాంగణంబునఁ బడం గా నయ్యె నీవారిపెం
పీపట్లన్ నుతియింపవచ్చె నని యెంతే మెచ్చెఁ గౌంతేయుఁ డా
గోపాలుం గని గౌరవించి యనియెం గోర్కిం బ్రదర్శించుచున్. 53

తే. వేదనార్తశరీరుఁడ నోదివస్పతిసుత! నాకింతపానీయ మొసఁగు [illegible]
నీవు శక్తుఁడ వుచితపానీయ మీయ, ననుడు నర్జునుఁ డట్లాత [illegible] 543

—అర్జునుండు పర్జన్యాస్త్రంబున భూజలంబులఁ బుట్టించి భీష్మునిదప్పి [illegible]—

చ. అరదము నెక్కి గాండివశరాసన ముక్కున నెక్కువెట్టి స
త్వరము ప్రదక్షిణించి కురువర్యున కాతఁ డింతలోపలన్
శర మరివోసి యొక్కఁడు ప్రశంసకు నెక్కఁగ వారుణాస్త్రభా
సురముగఁ జేసి యేసె నొకచో నరపుంగవు లెల్లరుం గనన్. 544

వ. ఇట్లర్జునుండు పర్జన్యాస్త్రంబున నస్త్రవిద్వరిష్ఠుం డగు కురుశ్రేష్ఠుని దక్షిణభాగంబున భూభాగంబు గాఁడ నేయుటయు నవ్వివరంబునుండి దివ్యగంధబంధురంబు నమృతకల్పంబును నత్యంతవిమలంబు నగు శీతలోదకంబు ధారారూపం బై పైకెగసి పితామహునిపైఁ బడి డప్పి దీర్చి తనియం జేసె నప్పు డెల్లపార్థివులును నప్పరమామానుషంబు గని వెఱఁగుపడి యుత్తరీయంబులు విదిర్చికొనుచు నుండి రంత నీసంతానంబును శీతార్ద్రితం బగు గోగణంబు ఏందంబునం బొంది వేపమానగాత్రం బై కర మాత్రంబునం గుందె నిందు నందు శంఖదుందుభినాదంబు మెమురం బయ్యె నయ్యెడ నట్లు వినిష్పత్తింపాసుం డై పరితృప్తిం గాంచిన భీష్ముండు బీభత్సుం జేరం బిలిచి యిట్లనియె. 545

మ. ఇది నీ కొక్కవిచిత్రమం చనఁగ [illegible] కేసరుండున్
బదవిం గన్నపురాణమానుల నుదర్ వాక్రుచ్చె నాతోడ నా
రదమౌనీంద్రుఁ డుపేంద్రుమిత్రి కలిమిన్ రాగిల్లి ని విం ద్రము
ఖ్యదివౌకస్తుతి సేయలేనిదియుఁ జెయుం జాలు ని న్నేటికిన్. 546

వ. అని మఱియు నో వత్సా! నీవు జంతుసంతతులలో మనుష్యుండును బక్షులలోఁ దార్క్ష్యుండును సరిత్తులలో సాగరుండును జతుష్పాత్తులలో నావును దేజస్వులలో నాదిత్యుండును గిరులలో హిమవంతుండును వర్ణంబులలో బ్రాహ్మణుండును బ్రతిభం గాంచినట్లు ధనుర్ధరులలో నెల్ల నుత్తరుండ వై ప్రతిభం గాంచితి విట్లు నేనును విదురుండును ద్రోణుండును సంజయుండును జనార్దనుండును జామదగ్న్య ప్రభృతిమహర్షులును మాటిమాటికిఁ జెప్పినను విపరీతబుద్ధి యగు ధార్తరాష్ట్రుండు విన నొల్లఁ డయ్యె శాస్త్రాతిగుఁ డగువాఁడు భీమసేనగదాభిఘాతంబునం జేసి భూతలంబునం బడకుండఁ డని దీనాననుం డై యున్న నీసూనుం గాంచి. 547

శా. కంటే కౌరవనందనా! నరుఁ డిటన్ గార్యంబు గావించె నే
వెంటం గాని యెవండు నిల్లొనరుపన్ విశ్వంభరాభాగమం

దుంటకు గంటికి విలిచిమే యెపుడు నేనూహింప నీతండు ము
క్కంటికిఁ గెంటినవాఁ డెఱుంగవఁటె సంగ్రామంబునం దొల్లిటన్. 548

— భీష్ముండు యుద్ధం బుపసంహరింపు మని యుపదేశించుట —

వ. ఆగ్నేయ వారుణ వాయవ్య వైష్ణ వైంద్ర పాశుపత పారమేష్ఠ్య వైవస్వతాదిదివ్యా
స్త్రంబు లెల్లఁ దెల్లంబుగ నెఱింగినవా రొక్క కృష్ణార్జునులు తక్కఁ దక్కినవా
రెవ్వరు నివ్వసుంధరాతలంబున లేరు వినుము. 549

క. గెలుతుఁగ లే రియ్యర్జును, గలస సురాసురులు దా రొకటి యై మొనయం
గలిగినను సకలసద్గుణ, కలితుం డగు నరుని పొందు గామే లొదవున్. 550

సీ. మనకు స్వాధీనుఁడై మాధవుం డుండిన, యంతలోఁ జేయంగ నొప్పు సంధి
హతశేషు లగు నీదు ననుజులు నృపు లొప్ప, నంతలోఁ జేయంగ నొప్పు సంధి
యమసూతికిం గోప మగ్గల మై రాని, యంతలోఁ జేయంగ నొప్పు సంధి
భీమాదియోధులు బిఱుసు పూనక యున్న, యంతలోఁ జేయంగ నొప్పు సంధి
తే. నీవు సౌహార్దమున సంధి నెఱపవలయుఁ, బాండుపుత్త్రులతోడ నీ భండనంబు
ముగియుఁ గావుత నేఁ గడముట్టు నింత, తోన యును నానుడి హితమై తొడరుఁ గాత.

మ. ఇఁక నీకోపము సంహరించుకొని నీ వీయొల్లచుట్టాలకున్
సుకముం గూర్పఁగ నుంటివేని యనికిన్ సోహాటు గావించి కొం
చక రాజ్యార్ధము నీపితృవ్యజులకున్ సంధించి సంధిం బొన
ర్చుకొనం జూడుము పాపభాజ వగుచున్ శోకింపఁ బోకేపయున్. 552

మ. నిజ మేఁ జెప్పుచునుంటి మోహవశతన్ సి విప్పు నాచెప్పిన
ట్లు జరీనం బొనరింపవే వినుము గోల్పోవై సమస్తంబు నీ
ప్రజలు న్నీవును మిత్త్రివాతఁ బడుచుం బొల్పారి పల్మారు దుః
ఖజవిజ్ఞానమునం దపించెదవు నిక్కం బిట్లు వాక్రుచ్చెదన్. 553

వ. అని సౌహృదంబునం జేసి నీతండ్రి నిఖిలరాజలోకసమక్షంబున నీకొడుకునకుం జెప్పఁ
గలంతవట్టు చెప్పి శరసంతప్తశరీరుం డై తనకుం గలిగిన వేదన యెల్ల లోలోన నడం
చుకొనుచుం గనులు మోడ్చి యేమియుం బలుకనేర కూరకుండె మీఁదుర్యోధ
నుండు ధర్మార్థసహితంబును ననామయంబు నగు నవ్వాక్యంబు విని ముమూర్షు
వౌషధంబునుం బోలె గ్రహింప నొల్లఁ డయ్యె నయ్యెడ నెల్లవారును భీష్ముండు
తూష్ణీంభూతుం డై యుంటం దెలిసి వానికిం బ్రదక్షిణనమస్కారంబు లర్పించి
నిజనివాసంబులకుం జని రనంతరంబ కర్ణుండు పితామహునిపాటు ఆకర్ణించి శర
తల్పంబుకడ కొక్కరుండ చని జన్మశయ్యాగతుం డైన కార్త్తికేయుం బోలి నిమీ

లితాత్ముండై యున్నగాంగేయుం గాంచి పాదంబులపయిం బడి ప్రణమిల్లి దుఃఖించుచు ని ట్లనియె. 554

—కర్ణుండు భీష్మునియొద్దకుం బోయి వినతుం డగుట—

క. నీకంటికి నెప్పుడు ద్వేష్యాకృతిఁ గానఁగ వచ్చునట్టి జడుఁడన్
వాఁడన్ రాధేయుఁడ, నాకుం గరుణింపు మనుచు నయమునఁ బలికెన్. 555

తే. మాట యాలించి యయ్యేటికొడుకు, నెట్టకేలకు ఱెప్పల నెత్తి మంద
మందముగఁ జూచి స్నేహార్ద్రమానసమునఁ, గదియఁగాఁ బిల్చి యొకచేతఁ గౌఁగిలించి.

వ. రక్షకభటుల నవలం బోఁ బనిచి మంద్రస్వరంబున ని ట్లనియె. 557

సీ. కర్ణ! నీరాకకుఁ గడు మెచ్చితిని వచ్చి, మే ల్చేసికొంటివి మిసిమిఁ గంటి
నీవు కౌంతేయుఁడవె కాని రాధేయుఁ, డవుకావో యధిరథుం డవునో తండ్రి
నీసత్య మంతయు నే వింటిఁ దొల్లింట, వ్యాసనారదమునివరులవలన
లేదు నీపయి నాకు లేశమే ద్వేషంబు, తేజోవధము సేయఁ దెగడుదు నటు

తే. లకట పాండవులం దూలనాడుచు నది, తగ దనుచు మాన్పఁ జెప్పెడుతగవు గాని
కా దొకండు ధర్మలోపముకతన నిట్లు, పుట్టితివి నీచసంగతి నిట్టు లైతి. 558

చ. ఎఱుఁగుదు నిన్ను శౌర్యమున నెల్లర మించిన దానసంగతిన్
వఱలితి కేల్ప్రవృత్తి మెయి నాఁడె నెసంగితి పితృభక్తి ని
ల్లలఁగియు దుష్టులం దిరిగి యీవిటు లుండెడఁ గులప్రభేదముం
బలు పడి వంచి నిన్ గినిసి పల్కుదు నేఁ బరుషాక్షరంబులన్. 559

చ. అరయఁగ నీవు శస్త్రముల నస్త్రములన్ భుజవిక్రమంబునన్
గురువులవాడ్కి గెల్తుననకున్ హరికిన్ సరి దూఁగ వత్తు వి
క్కురుపతికాలుఁ దేరఁగ నొకండవ కాశిక నేఁగి రాజులం
దురమున గెల్చి తెచ్చితివి యస్త్రీలు నీ కలమాగధుం డనిన. 560

తరువోజ. సమరంబులన్ నీకుఁ జాలినవాఁడు, చర్చింపఁగా లేఁడు సర్వగుణములు
సమకూరె నీ యందు స్వర్గాయపుత్రి, సదృశుండ వీమర్త్యసంతతిలోన
సమరతి మేటి వై యనఘ నీమీఁద, నగుకోప మది నాకు నాటె నీనాఁటఁ
గ్రమము దప్పినమనకలఁతకు నైన, కారణం బగుఁ గాని కా దొండు వేఱు. 561

ఉ. తమ్ములు నీకుఁ బాండవులు దాయలు గారు కుమార! నాకుఁ జి
త్తమ్మున గోర్కెవేని క్రమముగ నెమ్మి వారలతోడఁ గూడి యు
ద్ధమ్ము నివృత్తమై చనెడుదారి మెలంగుము దాన భూధవుల్
సమ్మతి నింట్ల కేఁగి సుఖసంగతి నుండ్రు నిరామయమ్ముగన్. 562

వ. అనిన విని కర్ణుం డవకర్ణించి పితామహున కి ట్లనియె. 563

ఉ. నీయనినట్టి దంతయును నేను నెఱుంగుదుఁ దొల్లి వింటిఁ గాం
తేయుఁడ నౌట నిక్క మని తెల్పెద నొక్కటి నాలకింపు మ
న్యాయము గాఁగ గొంతి విడనాడుట సూతుఁడు పెంచి పెద్దఁ గాఁ
జేయుట సూతిజుండ నని చెప్పఁగ నొప్పితి నోపితామహా. 564

వ. మఱియు నాకర్ణింపుము. 565

సీ. దుర్యోధనునిమహైశ్వర్య మెల్లను వాని,పరమాదరంబునఁ బడయఁ గలిగి
మాఱటరా జనుమాటకై నే నిప్పు, డపమార్గమునఁ బోవ నగుదు నెట్లు
వసుదేవసుతునిఁ బాండుసుతు లర్థించిన,పగిది నాకై రాజు భార మిడియె
నేను నాసొమ్ము నామేను నాసతి సుతు,లను వానికై విడువన తలంతు
తే. డెప్పరంబులు పొసఁగినయప్పుడు తన,నమ్మియుండినవానిని బొమ్మ టంచుఁ
ద్రోసిపోవుట పోలునే ద్రోహకారిఁ, గాని నేను సుయోధను మాని చనిన. 566

తే. వ్యాధిమరణంబు క్షత్రియవల్లభునకుఁ, దగదు రణమరణం బది తగును గాని
పాండవేయుల నడకించి పలికినాఁడ, మానఁ గా దిప్పు డని నాకుమాన్యచరిత.

ఉ. దైవము నెత్తికో లుడుప దానన్వైరియు నే సమస్థఁ దై
పోవఁ డవశ్యముం జరిగి పోఁ గల దంతయుఁ బోకపోదు తా
నేవగ నైన భూషయము నేర్పడఁ జెప్పనిమిత్తముల్ మహా
భావ! వచింప నేమిటికి ఖండన మాఁగెడుమేటి యుండునే. 568

శా. కుంతీనందను లెంతయేనియు భుజాకుంతప్రభావాఢ్యు లిం
తింతం బోవరు సంగరాంగణమునం దెవ్వార లే వారలన్
బంతం బేర్పడఁ గా నెదుర్పఁ దగ దావైకుంఠుఁడున్ వారితో
డం తైన న్విడువం డెఱింగియును నే నిట్టులముం గోరితిన్. 569

ఉ. వారికి నాకు వైరము ధ్రువం బయి యుండె నరేంద్రకారణం
బై రహిమించి దాని నొలయుంగ నశక్యము నే స్వధర్మముం
దీరుప జిష్ణుతోఁ బెనఁగ నిల్పితిఁ జిత్త మనుజ్ఞ యిమ్ము నా
కీరణరంగముం జొరఁగ నీవు ప్రసన్నుఁడ వై పితామహా. 570

చ. తెలియక కాని చాపలము దిక్కొనఁ జేయుటఁ గాని సంభ్రమం
బలరుటఁ గాని క్రూరతన మంటుటఁ గాని మహాత్మ! మున్ను నా
పలికినప్రల్లదంబులఁ గృపామతి వై క్షమియించిపుచ్చు మే
నలఘుతభక్తి వందనము సల్పి భజించెద నీకు నిచ్చలున్. 571

శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

## ద్రోణపర్వము - ప్రథమాశ్వాసము.



గలవా రని నృపతుల
వేగతులం బొగడి పొగడి విసివితి మతి నా
రాగద్వేషము లుడిగెన్
యోగక్షేమముల నరసి యోమవె దేవా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు దేవవ్రతుననుజ్ఞ వడసి కర్ణుండు దుర్యోధనునికడకుం జనియె నని చెప్పిన విని జనమేజయుండు వైశంపాయనుం గని యిట్లనియె. 2

### ద్రోణాభిషేకపర్వము

చ. మునివర ! భీష్ముఁ డట్లు రణభూమిఁ గూలఁ బడె నంచుఁ జెప్పఁ గా
విని ధృతరాష్ట్రుఁ డెట్టిసంవిం బొలుపొందెనో? భీష్మముఖ్యులం
గొని రణమందుఁ బాండవులఁ గూలిచి రాజ్య మొకండ యేల నెం
చినధృతరాష్ట్రనందనుఁడు చేసిన దేమొ యెఱుఁగఁ జెప్పవే. 3

వ. అనిన వైశంపాయనుం డతని కిట్లనియె. 4

తే. తండ్రిపాటునకుం జాల తహతహపడి, కురువిభుఁడు పుత్రవిజయంబుఁ గోరుకొనుచుఁ
బోరరయఁబుచ్చి సంజయుఁ [illegible]చుండు, నంతనొకరేయి చనుదెంచె నతఁడు మరల.

వ. అట్లు శిబిరంబునుండి తనచెంతకు వచ్చియున్న సంజయు నెఱింగి ధృతరాష్ట్రుండు దుఃఖించుచు నిట్లనియె. 6

ఉ. భీమపరాక్రముం డయినభీష్ముఁడు గూలినమీఁద నాసుతుల్
దీమస మేది దుఃఖజలధిం బడి మున్గి పరంబు గాన కే
మేమి యొనర్చి రుర్విపతు లేగతి నుండిరి పాండవేయసే
నామహిమం బొగిం ద్రిభువనంబులకున్ భయ మిచ్చుచుండఁ గన్. 7

చ్యుతుఁ డం దేడ్గడ వారలం గెలుచువా గుంప్ర ధరామండలిక్. 27

చ. బలము బలంబునర్ మఱిఁ దపంబుఁ దపంబున నాఁగఁ జాలున
ట్లలమినశత్రుసైన్యముల నాఁగఁగఁ జాలుదుఁ బెక్కు లేటి కేఁ
గలన నఘాతులం దునుమఁ గల్గితినేని యశంబొ లేని నో
బలమటి శత్రుశస్త్రములపాల్పడి చచ్చి పరంబొ గాంచెదన్. 28

వ. అని తనసారథిం బిలిచి యి ట్లనియె. 29

—♦కర్ణుండు వచ్చి కౌరవుల నూరార్చి యుద్ధసన్నద్ధుం డగుట♦—

చ. అరిల వధించి కౌరవుల నూరసి ప్రోచెదుభారి మ్మల్ల నా
శిరమున నుండె నే నిపుడ చివ్వకుఁ బూనెద మిత్రి మంచు నా
దరమున రాజు న న్నరయుదానికి ని ట్లగు కొల్వుఁ గాని నో
ధరపయి మిత్రఘాతి యనుదబ్బరమాటకుఁ గా నోకో యిఁకన్. 30

తే. ప్రాణములమీఁదిపేరాసఁ బాఱఁ ద్రోలి, పౌరుషంబున సరిసేన బడలువడఁగఁ
జేయుదుం జేయలేకున్నఁ జెన్ను దఱిగి, సదసుతుపిఱిండవాఁడ నై నడతు దివికి.

క. పరిదేవనంబు సేయుచుఁ, గురుసైన్యం బుండె నిపుడు కొనకొని రిపులన్
బరిమార్చి మహారాజ్యము, కురుపతికిం గట్టు కొప్పగుం గ దె నాకున్. 32

వ. అది గావున. 33

సీ. కనకచిత్రం బైనకిత్తళంబును మణిమయశిరస్త్రాణంబు మహితసూర్య
మండలాధికభాసమానచాపము పావకవిషాహికల్పమార్గణగణంబు
తొలివొల్త నా కిచ్చి తూణీరములు పది,యాఱును సన్నిశరాసనములు
శరసంచయంబులు శక్తులున్ గదలును, స్వర్ణచిత్రితమహాశంఖవరము

తే. తేరపయిఁ బెట్టి కట్టి దేదీప్యమాన,నాగకక్ష్యధ్వజంబు నానావిధమణి
మాల్యవస్త్రాదిదివ్యాలంకారమండితంబు, చేసి దివ్యాస్త్రములఁ బూనఁ జేసి తెమ్ము.

మ. జయభేరుల్ మొఱయింపఁ బంప సరిగన్ సజ్యంబుఁ గావించి ని
ర్ణయవృత్తిం గొని తెమ్ము తే రరిచమూవ్రాతంబుపైఁ దోలు మే
నయముం గోరి సహాయముం గొనక యాపత్శక్తి దీపింప ని
ర్భయచిత్తంబున నిత్తఱిన్ రిపుల నోర్వం జాలి మే లందెదన్. 35

వ. అనిన నతం డాచెప్పినచొప్పున రథంబు సజ్యంబు చేసి తెచ్చుటయు రాధేయుం డాయోధనోత్సాహంబున దాని నధిష్ఠించి కౌరవు లెల్ల మేలు మే లని త న్నగ్గిం చుచుండ విమానాంతర్గతుం డగు వేల్పు ఱేనిచందంబునం బొందుపడి మందాకినీ నందనుండు పడియున్నచోటికిం జని మహేంద్రపాలితం బైన నమైనాకంబుమాడ్కిని

క. నీ వాజ్ఞ యిత్తు వేని౯, నే వడిఁ బార్థునకు నొడ్డి నిలిచి రణంబు౯
గావించి నొంతు మంత్రము,చేవం గాలాహి నడఁగఁ జేయువిధమున౯. 45
క. అని పలుకుచున్నకర్ణునిఁ, గనుఁగొని కాలోచితంబు గాఁ బలుక మనం
బానందించి కురుపితామహుఁ, డనుకంపం జూచి యిట్టు లనియెఁ బ్రియమున౯. 46
సీ. ప్రాతిస్వాముల కర్థి స్తోత్రుల కర్పంబును, లోకంబులకు భూమి భూజనులకుఁ
బర్జన్యుఁడుం బోలె బాంధుమిత్రుల కెవ్వు, గని సురలిం ద్రునికరణి నిన్నుఁ
బొంది వారు సుఖింతు రిందిరాధవుఁ డమరులకుఁ బోలెఁ గౌరవులకు నీవ
యెఱుఁగుదు నీవిర్య మను ము న్నంబష్ఠ,పాంచ్ర కళింగాదిపతుల గెలిచి
తే. ధార్తరాష్ట్రులకుఁ బ్రీతిఁ దగులఁ జేసి, తీవు దుర్యోధనునియట్టు లెల్లఁ గౌర
వులకు నాధార మైతివి పలుక నేల, పెక్కు లిఁక నీదుసౌదల కెక్కు భరము.
మ. గతి నై కౌరవసేనల౯ నడపు మీ కయ్యంబున౯ నీవు నా
ధృతరాష్ట్రాత్మజుఁ డట్లు పౌత్రసముఁడో దన్నంగ మ మ్మాత్రఁ డే
గతి మన్నించునొ నీవు న ట్లగుట నో కర్ణా! ప్రియం బయ్యెఁ జె
ప్పతి నింక౯ మఁనాడి సందియ ము లిఁక౯ విఖ్యాతిపిం గాంచుమా. 48
తే. దేహసంబంధమునకన్న స్నేహబాంధవంబ వర మని పెద్దలు వలుకు చుండ్రు
గాన మేలొందవన్నీవు కౌరవులకుఁ, గూర్చుచుట్టమ వై మేలు గూరుపు మని. 49

—♦ కర్ణుండు దుర్యోధనునితో మంత్రాలోచనంబు సేయుట ♦—

వ. అని పలికిన విని వైకర్తనుండు గాంగేయునిపాదంబుల కభివాదనంబు గావించి మించినవేడ్కం గదలి కౌరవసేనావారంబుఁ జేరం జని వీరంబు నుత్సాహంబు దీపింపం జూపుటయుం జూచి దుర్యోధనపురోగము లగు నల్లధనుర్ధరులు నల్లంబులు పల్లవింప నల్లన సింహనాదంబులును భుజాస్ఫాలనంబులును ధనుష్టంకారంబులును శంఖారవంబులునుం గావించి పూజించి రయ్యవసరంబున దుర్యోధనుండు సంతుష్టహృదయుం డై రథస్థుం డైన రాధేయుం గాంచి యి ట్లనియె. 50
క. నీకతిన నాదుసైన్యం, బో కర్ణ! సనాథ మగుచు నొప్పారె నిఁక౯
వాకొను మే నొక్కహితం, బాకాంక్షించితిని నాఁగ నతఁ డి ట్లనియె౯. 51
చ. పురుషవరేణ్య! నీవు నృపపుంగవు లందఱికన్న మిన్న వై
పరఁగినయట్టివాఁడవును బ్రాజ్ఞుఁడవు౯ నినుఁ బోల రెవ్వరు౯
ధరపయి భారవాహకునెదం బోలుపొందెదు నన్ని కర్జముల్
పెరలకుఁ గావు న్యాయ్యమును వీడవు నీనొసు లే నెఱుంగుదు న్. 52
వ. అనిన దుర్యోధనుం డతని కి ట్లనియె. 53

చ. శ్రుతమున విక్రమంబునను శుద్ధచరిత్రమున న్వయోగతిన్
బృతనల కెల్ల తేఁ డగుచు భీష్ముఁడు దాఁ బదినాళ్లు లాహవ
క్షితిఁ బరవాహినిం జదియఁ జేసి శయించెను వీరశయ్య ను
న్నతమతి! మాన్యుఁ డైనపతి నాబలఁగంబుల కుండ నొప్పదే. 54

తే. కర్ణధారుఁడు లేనట్టికలము నీరు,వామి నెడలినయట్లు నావాహినియును
జెడును గావున నీ పొక్కు కడిఁదిమగనిఁ, జెప్పు మాతనిఁ బతి గాఁగఁ జేయుద మిటు.

వ. అనినఁ గర్ణుండును. 56

సీ. ఈపురుషవరేణ్యు లెల్లరు నర్హులు, సేనాధిపత్యంబు సేయుఁ బొంటె
సందియ మేటి క్రియ్యండఱుఁ గులబల,విక్రమ ప్రజ్ఞల నెలయువార
లైన నందఱను సేనానులం జేయ రా, దందఱకు న్మేటి యైనయొకని
దళవాయిఁ జేయఁ గాఁ దగు నట్టు లైనఁ బ,రస్పరస్పర్ధలు ప్రబల కుండు
తే. వినుము విలుకాండ్ర కందఱకును గురుండు, వృద్ధుఁడున్ నీకు గురుఁడును బుద్ధిమద్వ
రిష్ఠుఁడున్ గురుకవినమశ్రేష్ఠచరితుఁ, డొప్పి ద్రోణుఁడు పెంపొందుచుండుఁ గాన.57

ఉ. సర్వసమర్థుఁ డై గురుఁడు సైన్యవిభుత్వము నొంద నర్హుఁ డై
పర్వతధీరుఁ డై యెదుట భాసిలుచుండఁగ నే నటంచు నే
గర్వి వచింపఁగాఁ గలఁడు గావునఁ జాపగురున్ భజించుచున్
సర్వచమూవిభుత్వ మిడి సత్కృతిపాత్రునిఁ గాఁగఁ జేయవే. 58

వ. అనిన దుర్యోధనుం డిది లెస్సమాట యని సేనామధ్యగతుం డైనభారద్వాజుని
చెంతకుం జని యి ట్లనియె. 59

—♦ ద్రోణాచార్యులను సర్వసేనాధిపత్యంబు నిర్ణయించుట ♦—

మ. సరి రాఁ డెవ్వఁడు నీకు నియ్యెలఁ గులశ్రేష్ఠ్యంబునం బుట్టుకన్
వరశాస్త్రంబున బుద్ధివైభవమునన్ దాక్ష్యంబున న్విక్రమా
వరణప్రాప్తి వయోవిశేషమున దివ్యజ్ఞానసంపత్తి స
త్వరతిన్ నీతిఁ గృతజ్ఞతన్ దపమునన్ ధర్మార్థకామాదులన్. 60

ఉ. అన్నిటఁ బెద్ద వై వరగుణాఢ్యుఁడ వై తగునీవు పేర్మి నై
యున్నతికెక్కి మమ్ముఁ బురుహూతుఁడు వేల్పులఁబోలె బ్రోచినన్
సన్నుతిఁ గాంచి మే మరులఁ జంపఁగ నోంపఁగఁ జాలి యుందు మం
దున్న యెవండు గాని మము నోపఁడు కోపమతిం గనుంగొనన్. 61

వ. దేవా! నీవు మాకు రుద్రులకుం గాపాలియు వసువులకుం బావకుండును యక్షు
లకుం గుబేరుండును విబుధులకు వాసవుండును విప్రులకు వసిష్ఠుండును తేజస్సులకు

దివాకరుండును బితృదేవతలకు సమవర్తియును యాదోగణంబులకు వరుణుండును నక్షత్రంబులకుం జంద్రుండును దైత్యజాతికిఁ భార్గవుండునుం బోలెఁ గార్యనిర్వాహకుం డైనసేనానాయకుండ వై గండుమిగిలి నానావిధాక్షౌహిణీబలంబుల నడపించుచు దేవేంద్రుండు దానవులం జయించిన ట్లరులం జయింపు మని విన్నవించి మఱియును. 62

ఆ. వెలుపులకు వహ్నిపోలె మాకీ వగ్రసరుఁడ వగుచు నాజి సలుపు మేము
గోగణంబు లెల్ల గోరాజమును బోలె, ననుసరించి నడతు మాజ్ఞ వడసి. 63

చ. అనిమొన వాహినీశ్వరుఁడ వై విలుఁ ద్రిప్పుచు నీవు నిల్తువేఁ
గనుఁగొను చుండుసంతటను గం డడఁగింతు సబాంధవంబు గా,
ననుజులతోడిధర్మజు నటంచు వచించెనునంతలోన మే
లని వినుతించుచుక్ నృపతు లందఱు చేసిరి సింహనాదముక్. 64

వ. అంత సంతుష్టచిత్తుం డై భారద్వాజుం డి ట్లనియె. 65

శా. సాంగోపాంగము గాఁ బఠించితి శ్రుతుల్ బ్రహ్మమండలోక్తార్థవి
ద్యం గంటిక్ వివిధాస్త్రశస్త్రముల భవ్యఖ్యాతిఁ గొంటిక్ ననుక్
శృంగారించితి రీతిఁ కెన్నో గుణముల్ చెల్వార వాక్రుచ్చి నే
నుం గా దాడఁ బ్రభుత్వ మంది రిపులన్ నూచంబు గావించెదన్. 66

తే. నన్నుఁ జంపఁగఁ బాంచాలుం డున్న వనత,రించె నాతనిఁ దక్క నే మించి సోమ
కుల వధించి తద్బలములఁ గలఁచి వైతు, నని నను బాండవులు మాఱుకొనఁగ లేరు.

ఉ. నావుడు సంతసించి నృపనందను లందఱుఁ గుంభసంభవున్
దానవసర్వసైన్యవిభుతాపనముం దభిషిక్తుఁ జేసి నా
దేవత లగ్నిజుం బలె నుతీర్ణరవంబున స్వస్తివాదన
శ్రీ వెలసెన్ గడున్ మొఱసె సిద్ధసుతిక్ వరశంఖదుందుభుల్. 68

క. స్తుతిపాఠకగీతంబులు, వితతజయరవములు నృత్యవిభవంబులు ను
న్నతవాదిత్రధ్వానము, లతులితమై తోఁచె నట్టియుపసరమందుక్. 69

తే. వడసి పడవాలుగా నిట్లు బ్రాహ్మణోత్తమునిఁ భవన్బలములు కడు మోదముననుఁ
బొంది పాండవబలములు పొడ వడంగుఁ, గా రిరుడు నెకునిశ్చయంబున నగ్రాలె నపుడు.

వ. ఇట్లు సర్వసైన్యాధిపత్యంబు వడసి భారద్వాజుండు కృపాశ్వత్థామ కృతవర్మకర్ణ వికర్ణ సైంధవ గాంధార చిత్రసేనదుశ్శాసన కళింగకాంభోజాదినానారాజపరివృతుం డై శకటవ్యూహంబు వన్ని యెల్లవారికి హస్తోత్కర్షం బాపాదిల్లఁ జేయుచు భీమసేనార్జున నకుల సహదేవ సాత్యకి సౌభద్ర ఘటోత్కచ ద్రౌపదేయ ధృష్టద్యుమ్న

ధృష్టకేతు ప్రముఖ మహాయోధ పరిరక్షితంబును గ్రౌంచవ్యూహాభివ్యూహితంబు
నగు పాండవసైన్యంబుపైఁ గవియుదెంచి కడిందిమగంటిమిం జేర్చి పాంచాల కేకయ
సోమక ప్రభద్రకాము లగు పెక్కండ్ర విలుకాండ్ర నుక్కడంచి విరాటద్రుపదముఖు
లగు పెక్కండ్ర రాజులం ద్రుంచి యొక్కయక్షౌహిణి కక్షీణం బయినబలంబు
నాశనంబు గావించి సంగ్రామరంగంబు పీనుఁగుపెంటఁ గాఁ జేసి నెత్తురేఱులు
పాఱించి ప్రళయకాలరుద్రునిరౌద్రంబు దీపింప నేవురిమాఱి తుట్టతుదకు దుష్ట
చరితుం డైనధృష్టద్యుమ్నునికారణంబున మరణంబు నొందె భూమ్యాకాశంబులు
దిక్చక్రంబు ముఖరితంబు లయ్యెఁ బాండవబలంబులసింహనాదంబున భూతలం బెల్లఁ
గంపించె ననిన విని వైచిత్రవీర్యుండు విషాదభరితాంతరంగుం డై [illegible]కవడి
నిశ్చేష్టితుం డై యుండి గద్గదకంఠంబున సంజయుదిక్కు మొగం బై యి ట్లనియె.

సీ. అకట సంజయ! ధనురాచార్యుఁ డప్పు డేమి, సేయుచు నుండె? [illegible]జయులును
బాండవేయులు నింతపని సేయఁ జాలిరో, శస్త్రాస్త్రనిపుణుం డగుచాపగురుఁడు
రథభంగ మయ్యెనో శిథిల మయ్యెనో విల్లు, కడు నలసినాఁడో కాక యున్న
నమ్మహాత్ముని క్షిప్రహస్తుని జితశ్రమో,ధుని దుర్ధర్షు ద్రుపదపుత్రునకు వశమె

తే. నలుదెఱంగుల నగునస్త్రబల మెఱింగి, మేటి యగునొక్కఁడేరీతి మిసిమి చెడుటఁ
దలఁపఁగాఁ బౌరుషముకన్న దైవమ వర, మనుచుఁ దోఁచెడి నేమందు హతకవిధికి.

తే. బ్రాహ్మదైవాదిదివ్యాస్త్రబలకలితుండు, చాపగురుఁ డిట్లు వడుట భాస్కరుఁడు వడుట
సంద్ర మింకుట మేరువు సంచలనము, గాంచు టని యెంచవచ్చెడుఁ గాదె సూత.

ఉ. దేవనిభుండు ద్రోణుఁ డటు ద్రెళ్ళె ననన్ విని నూఱుప్రయ్యలై
పోవదు నాదుడెంద మిది పోలిచి చూడఁగ [illegible]త నైన పై
గావలయుం గటా! యతనికై దువురన్ జయ మాస సేయుచున్
గావలిఁ గొన్న నాసుతులు కన్గొన నందఱు మందభాగ్యులే. 74

సీ. ప్రజ్ఞాతులితబృహస్పతికల్పుఁ డగుచాప,గురుఁ డట రథికుండు గొప్ప యైన
శోణాశ్వములు పూనఁ ద్రోణ నెసంగెడు,రుక్మరథం బట రూఢి మెఱయు
సకలాస్త్రశస్త్రముల్ సన్నిహితము లఁట, కను దేవురించినఁ గలన నొకఁడు
నిలఁ జాలఁ డఁట యట్టివిలుకాని సలఁతి ధృష్టద్యుమ్నుఁ డనువాఁడు జంపె నంట

తే. యకట యే మందు విధిచేఁదు కతనిచేతి,విల్లు మోఁగుడు జగ మెల్లఁ దల్లడిల్లు
సురలు త్రిదివేంద్రునిం బోలె శూరు లెల్ల,నలఁగు చుండెద రవ్వీరు నాశ్రయించి.

ఉ. మ్రొక్కడిమూఁకలం దనదుముందటఁ గైకొని ధర్మపుత్త్రుఁ డే
చక్కన వచ్చి చాపగురుసన్నిధి నున్నతిఁ జూపఁ జాలెఁ బో.

చిక్కినతచ్ఛరంబులకు నెక్కరణిన్ బ్రదుకంగ నోపిరో
పిక్కబలంబు సూప కటఁ బెంపఱి తెంపరు లైన సైనికుల్. 76

చ. నిబుపనిఁ జీమగుంపు లవి నెట్టనఁ బట్టినయట్లు చుట్టునున్
దడములు మూఁగి ముట్టుకొని తట్టువడం బొనరించుచో నరుం
డెడరు గ్రహించి పార్షతుని కేత్తెఱఁ గల్గఁగఁ జేసి ద్రోణునిన్
బెడిదపుటమ్ములన్ బొదివి పృథ్విఁ బడం బొనరించె నెంచఁగన్. 77

—◆ ధృతరాష్ట్రుండు పాండవసైనికులం దలంచి పరితపించుట ◆—

సీ. ఆఖ్యానములతోడ నైదవనాల్గు వేదములు సాంగములుగాఁ దవిలి చదివి
బ్రాహ్మణప్రవరుఁ డై ప్రఖ్యాతిఁ గాంచిన, గురుని వృద్ధునిఁ బార్థు లరసి యరసి
సిరిఁ గోరి చంపిరి చిఱుచేఁపగమిఁ దిమ్మి, గిలమునుబోలె లోఁ దలఁప కఘము
మనయోధు లందఱు మొనసి చూచుచు నుండ, ద్రుపదసుతుం డెట్లు త్రుంపఁ గలిగె
తే. నయ్యయో యయ్యహీనబలాంచితునకు, వలపటన్ దాపటన్ ముందుదలను వెనుకఁ
గావలి యెవండునన్ లేఁడు గాక యేమి, యోటమిం గాంచి వెన్నిచ్చునో యతండు.

క. ఆతఁడు పడె నని వినుటం, జేతము తహతహ తపించి చేడ్పడె సంజ్ఞో
పేతుఁడ నై మఱి యడిగెద, నేతానన్మాత్రి నిలుపు మిక్కథ యెల్లన్. 79

వ. అని ధృతరాష్ట్రుండు హృచ్ఛోకాక్రాంతుం డై పుత్త్రులవిజయంబున నిరాశం జెంది వంది నంది మూర్ఛం బొందుటయు నందు నందుఁ గలసుందరీజనం బల్లన శీతల జలంబు లొత్తనిపయిం జల్లి తాళవృంతంబుల వీచుచు శైత్యోపచారంబు లాచరించి కరంబులం బట్టి లేవనెత్తి చిత్రాసనంబునం గూరుచుండం బెట్టి రట్టియెడ నెట్టకేలకు సేదదేఱి వడంకుచుం గొంతసడికి గావల్గణిదిక్కు మొగం బై. 80

శా. హాహా పుట్టెడు సంజయా! సమరమం దాధర్మసూనుఁడు సం
దేహం బింతయు లేక వీఁకమెయి నాదిత్యుండు నా మండుచున్
సాహంకారత వాశితాసహిత వేదండంబు వే ఱెన్గులన్
బాహాశక్తి నదల్చున ట్లరుల నోంపం జాలు నీనాఁటికిన్. 81

క. నాగాయుతసమబలుఁడు స, దాగతితనయుండు దా గదాదండముతోఁ
రాఁ గాంచి యెవ్వ రెదురం, గాఁ గల రాగురుఁడు లేనికాలమునందున్. 82

సీ. ప్లవగకేతుప్రభాభాసి చైత్రరథంబు, ధారాధరము నేమిభూరిరవము
స్తనితంబు గాండీవచాపంబు విద్యుల్ల, తావిభవము సంతతశరచయము
బహులవర్షము గాఁగఁ బర్వఁ దాఁ బర్జన్యుఁ, డో యన నర్జునుం డొప్పు మొఱసి
యశనిసంకాశము లగుతీవ్రశస్త్రముల్, కురియుచు నెత్తురే ట్లురలఁ జేసి.

తే. వాసుదేవసహాయుఁ డై వారిదముల, వాయువుం బోలి కౌరవవాహినులను
దొడరి యోహరిసాహరిఁ ద్రోలునపుడు, నిల్ప వేల్పైన లేఁ డని నేఁ దలంతు. 83

క. సుకుమారులు యువకులు నై, నకులుఁడు సహదేవుఁడున్ గుణశ్లాఘనము ది
క్ప్రకరముల మ్రోయ శాత్రవ, నికరములం దోలునపుడు నిల నెవని కగున్. 84

చ. ధృతియును సత్యముం గలఁడు ధీరవరేణ్యుఁడు సాత్వతుం డతం
డతులితశౌర్యసంపదల నన్నలఁ బోలినవాఁడు లోకవి
శ్రుతముగఁ బార్థుతోఁ జదివె శూరత వైరులఁ బోఱఁ దోలి సు
వ్రత యగుభోజకన్యఁ గొనివచ్చె నతం డొకపాటివాఁ డొకో. 85

తే. ద్రుపదకులమున నుత్తమస్తుతికిఁ బాత్ర, మయినవాఁ డుత్తమౌజుఁడు యమసముండు
విజయుపైఁ బ్రీతి మమ్మోర్వ వెడలువాని, కోపఁ డా ద్రోణుఁడే నన్న నుండు నెవఁడు.

సీ. చేదిప్రజల వీడి చేరెఁ బాండవులందు, ధృష్టకేతుఁడు వాని తేజ మసదె
మున్ను గిరిద్వారమున రాజపుత్త్రుఁ జెక్కిన కేతుమంతుఁడు కేవలుండె
కలన నోటమి యెఱుంగనిభీష్ము నోడించి, నశిఖండి నెదిరింప నరులవశమె
సకలసంపదల మామకుఁ దండ్రి కేన వచ్చె, యలరెడునభిమన్యుఁ డలఁతి యొకొ

తే. వాఁడు సర్వశస్త్రాస్త్రవిద్యార్యుఁ డార్య, జనవినుతమనీషన్ బృహస్పతినిఁ దేజ
మున రవిం బోలి జముఁ డనం బోర నిలువ, లేదు మనసేన నెదిరింప నేఁడు గాని. 87

వ. మఱియు ద్రౌపదేయు లేవురుం దండ్రులం బోలినవారు ధృష్టద్యుమ్నపుత్త్రు లైన క్షత్త్రంజయక్షత్త్రదేవక్షత్త్రధర్ములు క్రూరకర్ములు వారు పండ్రెండువత్సరంబులితరక్రీడలన్ మాని మహావ్రతంబుఁ బూని దేవవ్రతునితో సకలాస్త్రశస్త్రంబు లెఱింగినవారు వృష్ణివీరుం డైన చేకితానుండు నూఱుగురుపోటుమానుసులకుం దీటువచ్చినవాఁడు రక్తవర్ణవర్మాయుధధ్వజు లైన కైకేయు లేవురుం బాండవులకు మాతృష్వసేయు లగుటం జేసి వారికి విజయంబుఁ గోరి పోరుదురు యుయుత్సుండు బద్ధమత్సరుండు వారణావతంబున వాని నోడింపం బూనినరాజు లాఱునెలలు పోరి తార యోడుట లోకవిదితంబు ధృష్టద్యుమ్నుఁడు ద్రోణవధార్థము పుట్టినవాఁడు పాండవప్రియుం డగునమ్మహావీరుండు వారాణసీపురంబునం దొల్లి స్త్రీకాముం డగుకాశిరాజపుత్త్రుం బరిమార్చె శైబ్యుండు కృతారాతివైక్లబ్యుండు వినుము. 88

చ. అతఁ డఖిలావనీపతుల నాజి జయించి దశాశ్వమేధముల్
తతగతిఁ జేసి గాంగసికతాగణసంఖ్యగ గోగణంబులన్
క్షితిసురకోటి కిచ్చె నిటు చేసె నుశీనరసూతి తత్క్రతుల

లగురాజుల నెల్లరం గెలిచె ననియుఁ గృష్ణున కోడనివాఁడు ముజ్జగంబుల లేఁ డని యు విందు మని మఱియును. 98

ఉ. పొందు పొసంగఁ జేయుటకుఁ బూని యిటం జనుదెంచి మాధవుం
డందఱుఁ జూచుచుండఁగ మహాద్భుతదీప్తిని విశ్వరూపముం
బొందుగఁ జూపె నే నతని పూర్ణకృపాదృష్టి లబ్ధదృష్టి నై
విందుగఁ జూచి మ్రొక్కితిని విశ్వమయుం జగువిష్ణుఁ గృష్ణునిన్. 99

ఆ. ఇట్లు చేయ లాతు లెవ్వరు నేర్తురు, పరమపురుషుఁ డాతఁ డరసి చూడ
నయ్యుపేంద్రుతోడ నఖిలజగంబుల, నీడు నచ్చువాఁడు లేఁడు నిజము. 100

క. అతఁ డున్నకడకు హలియున్, మతి సేయుం జేరఁ బోను మహామోన్నతి వా
రతుకుకొని యున్న విజయుం, బతుకుకొనుం జెప్ప నేటి కాపక్షమునన్. 101

వ. అయ్యుదారచరితునాహ్వానంబున గద సాంబ ప్రద్యుమ్న విదూరథ భాగావహానిరుద్ధ చారుదేష్ణ సారణోల్ముక నిశఠ ఝల్లి బభ్రు పృథు విపృథు శమీక ధారామేజయ ప్రభృతు లగువృష్ణివీరు లెల్లరును బాండవులకుం దోడుపడ వత్తు రిట్లు సర్వలోక జనకుం డైనజనార్దనుండు వారిపక్షంబున నుండ మనవారికి జయం బగుట యెట్టి మాట యెట్టికారణంబున నేని పాండవుల కోటమి యగుదెంచు నట్లు లైన జనార్దనుండు చక్రంబు వట్టి జయించు మనవారు గట్టిమొనఁ గట్టి వారి నెల్లం జంపి నప్పు డైన నప్పురుషోత్తముండు రత్తివోక కర్తవ్యసర్వజననాశనంబు గావించి కుంతి కైనం బట్టంబు గట్టక మానం డెట్లు చూచినను గౌరవులకు విజయంబు గామియే సిద్ధాంతం బగుచున్న యది వినుము. 102

మ. నరనారాయణు లర్జునాచ్యుతు లనన్ జన్మించి రిద్దఱుం
దురముం జేయుచు నుండ వారి నెదురన్ ద్రోణాదు లేలెక్క ని
ర్జరనాథాదులు నోప రింతయు యథార్థం బెంత మోహంబొకో
పరికింపండు సుయోధనుం డిటులు సెప్పన్ మిత్తి ప్రేరేచుటన్. 103

ఆ. హరియు నర్జునుండు నరు లౌటచేఁ గాక, లేక యున్న నెల్లలోకములను
వలయు నేని యొక్కపరి నీఱు గాఁ జేయ, నోపినట్టివార లోయి సూత. 104

చ. వ్రతములు బ్రహ్మచర్యముఁ దపంబును వేదము లస్త్రశస్త్రముల్
క్షితిపయి మృత్యువుం గెలువ లేవని భీష్ముఁడు ద్రోణుఁడున్ రణ
క్షితిఁ బడుపాటు సెప్పకయ చెప్పెడు నక్కట యట్టివాఁడు వో
బ్రతికితి నేను నా బ్రతుకు ప్రస్తుతి సేయఁగ నౌనె సంజయా. 105

క. ము న్నే సిరికి నసూయా,సన్నుల మై యుండు మిపుడు శమనాత్మజున

త్యున్నతి మగునాసిరిచేఁ, బన్నమునక్ బ్రదుకవలసివచ్చెఁ గట్టా. 106

క. నాయనయమువలనం గా, దే యమనందనున కిట్టిదివ్యైశ్వర్యం
బై యునికియును గురుకృపయ, మై యునికియు నరయ నయ్యె నని యనఁ బనియె.

ఉ. కాలము వీఱి పక్వదశఁ గాంచఁగ నుండినవారిఁ ద్రుంప దం
భోళి యగుం బ్రమాణం బయినఁ బోల్పఁగ ధర్మజకోపతాప మే
కాలిచె ద్రోణభీష్ములను క్రూరమ నైన కనుఁగో నధర్మ మీ
లీల సుతాజయుంబు పొదలించె సమస్తవినాశనంబుగన్. 108

తే. ధరణి జనచింతితార్థముల్ పైన మనను, కూల నైన యున్న మతియొక్క లీలఁ బరిణ
మించు నపరిహార్యం బని యెంచ నైన, యేతదర్థము చింతింప నేమి ఫలము. 109

వ. కావున నే నీచింత లెల్లం దిగఁ ద్రావితి నింక సమరప్రకారం బంతయుఁ దేటతె
ల్లంబుగం దెలియఁ జెప్ప మాకర్ణించెద ననిన సంజయుం డతని కి ట్లనియె. 110

తే. పాండవులు సృంజయులు నెట్లు [illegible], [illegible] సమరమం దట్టి దెల్లఁ
దెల్లముగఁ జూచి వచ్చితిఁ దెలియ [illegible], [illegible] మాటలు చెప్ప టుడిగి.

వ. అట్లు సేనాపతిత్వంబు వడసి భారద్వాజుండు సర్వ[illegible]ముఖ్యగణంబు మహీపతు
లెల్లరు విన దుర్యోధనుం గాంచి యి ట్లనియె. 112

క. కురువంశోత్తరునియనంతరమున సేనానిఁ జేసి నన్నిట్లు మహీ
శ్వరు లెన్న సత్కరించితి, వర మిచ్చెద నడుగు మిచ్చ వచ్చినదానిన్ 113

వ. అనిన నతండు కర్ణదుశ్శాసనులతోడ నాలోచనంబు చేసి చాపాచార్యున కి ట్లనియె.

చ. గురువర! నాకుఁ గూర్చుటకుఁ గోరిక వేసి సజీవు నయ్యుధి
ష్ఠిరు ననిఁ బట్టి యి మ్మనుచుఁ జిత్తమునం గలవాసిఁ దెల్పెనన్
గురుఁ డను వానికిన్ బ్రియముఁ గూర్చు నెవ్వఁడు ధర్మపుత్రుఁ డా
దారను వధింపఁ గోర కటు తోడ్కొనఁ గోరెద వేమ చెప్పుమా. 114

ఆ. అతఁ డజాతశత్రుఁ డగుట నీ వి ట్లైతి, కులముఁ బ్రోచువలఁపు గలదు గాన
నసువు లేగకుండ నమ్మహారథుఁ బట్టి, నీ కొసంగు మంట నృపకుమార. 115

మ. అది గాదే ననిఁ బాండుపుత్రులను బాహాశక్తి నిర్జించి య
ప్పుదిపక్ వారిక వారిరాజ్య మిదె సంప్రీపిం గొనుం డంచు ని
చ్చెదె సౌభ్రాత్రముఁ జూపునిచ్చ గల వై చెల్వార వా కి మ్మనిన
మది నౌదాసిని దాఁప లే కనియె నమ్మందుండు మోహాంధుఁ డై. 117

సీ. ఆచార్య వినుము మా కంతకాత్మజుఁ జంపి, నంతమాత్రన విజయంబు లేదు
విజయుఁ డాతఁడు రణోర్విం బడినను బాండు, ఇ య్యాదఁజుల బట్టి యుట్టి పట్టు

ష్టమ్మున నుండఁ జూచు మనికమ్ము సుయోధనుకోర్కి వమ్ముగాన్. 125

క. నావుడు నర్జునుఁ డిట్లను, దేవా! నినుఁ గావ కౌరులచెప విడుముటయున్
దేవాధుఁ డైనగురునిన్, జావఁగ నేయుటయు నొక్కనరి యని తలఁతున్. 126

తే. పుడమి వ్రయ్యలు వాఱినఁ బొడ వడంగి, చుక్కగమితోడ నాకము వ్రక్కలైన
నీచుఁడు సుయోధనుఁడు నిన్ను నిగ్రహించి, సుకల మేలంగఁ జాలఁడు కౌర్కిడీఱ

మ. సుమనస్సంఘముతోఁ సురేంద్రుఁడును విష్ణుండున్ సమాఘాతము
ధ్యమునన్ సాయముఁ జేయ వచ్చినను నేఁ బ్రాణంబుతో నుండఁగా
నమరేజ్యప్రతిమానుఁడున్ గురుఁడు తా నన్నట్లు నిన్మ్రుట్ట నై
న మతిం జేయఁగఁ జాలఁ డిట్లు ప్రతినన్ గావించెదన్ భూవరా. 128

ఆ. పలికి బొంకి యెఱుఁగఁ గల నైన నన్నృతంబు, పలుకఁ దలఁప నేను బలికినవలు
కెపుడు మఱొకదారి నెసఁగదు నా కసంజయము గలుగు టెఱుఁగ జనవరేణ్యా.

వ. అని పలుకుచున్నసమయంబునఁ బాండవనివేశనంబున శంఖభేరీమృదంగానకనిస్వనంబులును ధనుర్జ్యాతలశబ్దంబులును సింహనినాదంబులును నింగి ముట్టి నట్టిట్టిదంపుటులివు విని నీవారిసైన్యంబునందును నానావిధవాదిత్రంబులు మ్రోసె నంత నుభయసైన్యంబులును దైన్యంబు దక్కి యుద్ధంబునకు సిద్ధం బయ్యె నయ్యెడ నాచార్యుండు వేదికాకేతనోల్లాసభాసురుం డై సేనామధ్యంబున మధ్యందినమార్తాండునిచందంబున నుండు చుండ ననవారు పౌలికలనికిం బోయి శకటవ్యూహంబు మోహరించి రందు వలపల సైంధవుండును గళింగవికర్ణులును వారివెన్నడి గాంధారసేనాసమేతుం డగుసౌబలుండును దాపలఁ గృపకృతవర్మచిత్రసేనవివింశతిదుశ్శాసనులును వారివెన్నంటి కేకయయవనకాంభోజపతులును మధ్యభాగంబున మద్రత్రిగర్తాంబష్ఠప్రాచ్యప్రతీచ్యోదీచ్యదాక్షిణాత్యమాలవశిబిశూరసేనశూద్రమలదసౌవీరకితవచమూగణసేవ్యమానుం డై భారద్వాజపురస్సరుం డగుకురురాజును సేనాముఖంబున హస్తికేతనోల్లాససముదీర్ణుం డై సకర్ణుండును నిలిచి రప్పుడు. 130

మ. అపహార్యుం డన నొప్పి వైభవకళాహ్యాస్త్రిన్ విజృంభించునం
గపతిం గన్గొని నీకుమారులబలంగంబుల్ భయం బెద లో
నపురూపం బగుసాహసం బొదవ ధైర్యస్థైర్యముల్ గల్గి యు
ల్లలు డాభీష్ముఁడు లేనియట్టికొఱ లే కత్యంతహర్షంబునన్. 131

శా. ఈవైకర్తనుఁ డింద్రముఖ్యులకు నే నింతేనియుం జంకఁ దా
దేవద్వీపవతీసుతుం దరుల కాత్మిం గూర్పఁ తేఁ డయ్యె న

ద్యాతం బక్కుడఁ గల్గుదాన నితఁడో తద్వైరముం బూనుటన్
జేవంజేసి నిమేషమాత్ర రణముం జెల్లించుఁ దెల్లంబుగన్. 132

వ. అని ప్రశంసించుచుండి రట్టియెడఁ బాండవులును భండనోత్సాహంబునం జని
శ్శాంకోత్సాహం బమర్చుకొని రం దగ్రభాగంబున. 133

మ. గగనస్పృక్కపికేతనాంచలరుచుల్ కల్పాంతభానుక్రియన్
దగి వెల్గన్ ధవళాశ్వయోజితము చైత్రంబైన తే రగ్ని కె
త్తగుచుం గ్రాలఁగ వాసుదేవసహితుం డై గాండివజ్యారవం
బాగి బ్రహ్మాండము ముట్ట నిల్చె విజయుం డుగ్రాకృతిం జూపుచున్. 134

తే. వాని కెలన మహారథవ్యూహ మైన, పార్థతుఁడు వహ్నికుండసంభవమహార
థోత్తమాయూథుఁ డై నిల్చె నుగ్రధన్వుఁ, డగుచు బలగంబులకు నెల్ల హర్ష మెసఁగ.

వ. మఱియు వృకోదరాదిసోదరులును ద్రౌపదేయ సౌభద్రేయాదికుమారవర్గంబును
మత్స్యపాంచాలాదిబంధుబృందంబును ధృష్టకేతుముఖ్యదండనాథులును దక్కనుం
గలపరివారంబును నయ్యైయెడల నిలిచిన యుధిష్ఠిరుండును సంగరోత్సాహంబు
నకుం దగినసన్నాహంబు గావించుకొని సేనామధ్యంబున నిలిచె నివ్విధంబున
నిరువాఁగునుం బ్రోగుపడి కయ్యంబునకుఁ గాలు ద్రవ్వ చున్నంత. 136

సీ. ఆర్తనాదముతోడ నవని గంపించెఁ బెన్,గాలి రేఁగి రజంబు గ్రమ్మిఁ గప్పె
మబ్బు లేక నభంబు మాంసాస్థిరుధిరవ,ర్షము గురిసె వఱళ్ళు ప్రబలి కూసెఁ
గౌరవసేనపైఁ గాకగృధ్రాదులు, వ్రాలెఁ గ్రవ్యాదరావము సెలంగె
నుఱుములు మెఱుములుఁ దఱచయ్యెఁ గొఱవులుఁ,బిడుగులువడినలుగడలఁబడియెఁ

తే. బృథులపరివేష మినుఁ జుట్టి బెట్టు దోఁచె, దట్టమై పుట్టె దారుణోత్పాతశతము
లెన్ని యేనియుఁ గురువాహినీశ్వరత్వ, మంది గురుఁ డింత కదలినయంతలోన.

తే. ఉభయసైన్యంబు లొకపరి నుగ్రభంగి, శంఖభేర్యాదిరవంబులు సలిపి కొంత
సేపు కుసుమితచూతముల్ మూపు మూఁకలఁ, బొందిన ట్లుండె మొదలక పొదలకుండ.

వ. అనంతరంబ. 139

—• ద్రోణుండు పాంచాలబలంబుపై విజృంభించుట • —

మ. నడిమింటం గలద్వాదశాత్ముఁ డనఁ దైనట్లొప్పుచున్ ద్రోణుఁ డ
ప్పుడు పాంచాలబలంబుపైఁ గవిసి కన్నుంగొట్టుచుం బెట్టిదం
బడరం గ్రూరశరంబు లేయుచు నొకం డట్లుండఁబో నాఁగ నె
క్కుడుఁ గన్గొన్నను దాన యై సమరముం గావించె నంచద్గతిన్. 140

క. కవిసినధృష్టద్యుమ్నుని, నవిరళముగఁ గప్పి మార్గణాసారములన్
దవుదవులఁ ద్రోలె సింగం,బు వనాంతరమునకు లేళ్ళఁ బోలె బలములన్. 141

ఆ. దైత్యభేది యైనదైవతాధిపునట్లు, ప్రబలి చాపగురుఁడు వహ్ని వెట్టి
కాల్చునట్లు చండకాండంబులం బొంచు,రాజసుతులసేన రాసిఁబ్రోచె. 142

చ. పిడుగులు గూలునో యనెడుభీతు జనింపఁగ నారిమ్రోఁత తె
ప్పడు నెడ లేనియ ట్లెసఁగఁ బుఙ్ఖలనామకవారిదంబు నాఁ
గడువడి నస్త్రముల్ గురియుచై వడి నమ్ములఁ జిమ్మి కుంభజుం
డడరి బడల్ పడన్ సలిపె నశ్వరథేభపదాతిపంక్తులన్. 143

వ. అయ్యవసరంబున. 144

సీ. క్షతజోదపూర్ణంబు జైత్రరథావర్త,కలితంబు హాస్త్యశ్వగాత్రతీర
ముష్ణిషఫేనిల మున్నతకవచోత్పలము మాంసపంకాకులము బలౌఘ
పరిపూర్ణ మున్నతప్రాసమత్స్యసమేత, మస్థిమజ్జాసికతాంచితంబు
స్యందనకచ్ఛపసంకులం బుత్తమాంగోపలతటము సమున్నతతను

తే. దారుసంఘట్ట మసిఝషదర్శితంబు, గజమహానగకలితంబు కంకగృధ్ర
సేవితము కేశశైవాలభావితంబు, శోణనద మప్పు పాతె నాక్షోణియందు. 145

ఉ. చాప మలాతచక్రగతిఁ జంక్రమణం బొనరింపఁ జేయుచున్
జూపఱు మెచ్చునట్లనికిఁ జొచ్చి చమూచయముం గలంచు నా
చాపగురుం గనుంగొని నిజప్రజ లల్లడతల్లడం పడన్
సైఁపక ధర్మనందనుఁడు సాధ్వసకంపితచిత్తవృత్తి యై. 146

వ. ధృష్టద్యుమ్నార్జునులం గాంచి యి ట్లనియె. 147

ఆ. కొఱవిఁ ద్రిప్పినట్లు కోదండమును ద్రిప్పి, తఱలఁ జేయు నితఁడు దండు నెల్ల
నబ్ధి వేలవోలె నాచార్యుఁ డాఁగుఁడు, మీర లస్త్రశస్త్రసార మెసఁగ. 148

వ. అని పంచిన వా రాదివ్యాస్త్రవేదిం దాఁకునంత. 149

క. ద్రోణుఁడు పార్షతునిం బది,బాణంబుల నొవ్వఁ జేసి పైపై నతనిన్
ద్రాణ చెడఁ జేసి యార్చెన్, క్షోణీధవు లెల్లఁ దన్నుఁ జూచి నుతింపన్. 150

వ. అంత వృకోదర నకుల సహదేవులును ద్రౌపదేయ సౌభద్రేయ శైనేయులును విరాటద్రుపదులును సాత్యకి ధృష్టకేతు శిఖండి చేకితాన యుయుత్సు ఘటోత్కచ ప్రముఖులు నొక్కుమ్మడి నమ్మహారథుం దాఁకి రప్పుడు కృప కర్ణ శల్యాశ్వత్థామ కృతవర్మ భూరిశ్రవో భగదత్త హారవాలంబుస ప్రభృతులు మనయోధులును వారిం దలపడినం బోరు ఘోరం బయ్యె నయ్యెడ. 151

మ. శతమాయానిపుణుండు సౌబలుఁడు భాస్వద్బాణజాలంబులన్
ప్రతిరోధించుచు మాద్రిపిన్నకొడుకున్ రథ్యంబులున్ డెక్కెమున్

క్షితిపైఁ ద్రెళ్ళఁగ నేయ నాతఁ డతనిన్ గ్రేడించి తత్సూతకే
తుతురంగౌఘధనుస్సులం దునిమి యెంతో పంత మేపారఁగన్. 152

ఉ. అర్వదితూపు లాసుబలునాత్మజుదేహముఁ దాఁక నేయుదుర్
గర్వము వీడ కాశకుని గైకొనుచుం గద సత్వరంబుగా
నుర్వికి డిగ్గి సూతుతల నుర్లి పడం బొనరింప నాతఁడుర్
బర్వతధీరుఁ డై గుదెను బట్టి రణం బొనరించె నెంచఁగన్. 153

ఉ. వింశతిసాయకంబుల వివింశతి నేసి వృకోదరుండు వా
య్వంశమహత్వముం దెలుప నాతఁడు వానిధ్వజాశ్వచాపముల్
సంశయ మేది త్రుంచుటయు సైనికు లెల్లరు మెచ్చి రంతలో
దంశితదంష్ట్రిఁ డై చదియఁ దాచె గదం బకవైరి వాజులన్. 154

క. అంత హతాశ్వుం డయ్యుం, బంతంబున వాలుఁ బలుక వడిఁ గొని భీమున్
మంతనము లేక తాఁకెం, గొంతటిలో నీసుతుండు కుంజరముగతిన్. 155

తే. నకులునిం దాఁకి, శల్యుఁడు నవ్వుచు శర,శతము లేసిన నీసున నతఁడు వాని
వార్వముల నాతపత్రము ధ్వజముధనువు,సారథిం ద్రెళ్ళఁ గా మొత్తి శంఖ మొత్తె.

చ. పొదలఁగ ధృష్టకేతుఁడుఁ గృపుండును బోరుచు నుండఁ జేదిరా
జదయత డెబ్బదింటఁ దనువాడఁగ నేయుచు మూఁటఁ గేతువున్
బ్రిదులఁగఁ జేయ బ్రాహ్మణుఁడు రెచ్చి మునుం గిడె వాని నమ్ములన్
బదుగురు మేలు మే లనుచుఁ బ్రస్తుతియించిరి వారియుద్ధమున్. 157

సీ. సాత్యకి కృతవర్మ స్తనమధ్యమున నొవ్వ, నేసి డెబ్బదియమ్ము లేయుటయును
గృతవర్మ డెబ్బదియేడమ్ము లేసియు, నతనిఁ గదలుపలే డయ్యె నపుడు
పార్షతుఁడు త్రిగర్తపతిమర్మముల్ నొంప, నాతఁ డాతనికొంకు లాడ నేసె
మాత్స్యవైకర్తనుల్ మత్సరంబునఁ బర,స్పరము పోరినపోరు భార మయ్యె
తే. ద్రుపదభగదత్తు లిర్వురు దొడరినపుడు, ద్రుపదునినియంత రథముఁ గేతువునుదూల
నేసె భగదత్తుఁ డాతని నీసుఁ జేసి, ఱొమ్ము వసియాడ ద్రుపదుండు నమ్ము లేసె.

క. భూరిశ్రవుఁడు శిఖండిని, నారసములగముల గప్పినం గ్రుద్ధుం డై
యారథికాగ్రేసరుఁ డా, కౌరవ్యుని నవతిసాయకంబుల నొంచెన్. 159

క. హైడింబుండు నలంబుసుఁ, డోడక యుండోరులు రాక్షసోచితమాయల్
వేడుక వోలె నొనర్చుచుఁ, బోఁడిమి మెయిఁ బోరి రపుడు భూభుజు లెన్నన్. 160

తే. చేకితానుఁ డయ్యనువిందుఁ దాఁకినపుడు, దేవదానవసమరంబు లేవ నొప్పె
నావలన్ లక్ష్మణక్షత్రదేవులకును, హరిహిరణ్యాక్షులకుఁ బోలె దుర మెసంగె. 161

సీ. పౌరవుం డభిమన్యుపైఁ గవిసి మహోగ్ర, శరములు గురిసిన శరములందు
వడి వానిఁగొడుగును బడగయు వార్వముల్, పడ నేసి మఱి యేడు ప్రదరములను
వాని నొంచియు నేనువాఁడితూపుల వాని,సారథి నొంచియు నంతసమునఁ
బౌరవాంతకరంబు వరశరం బరివోయు, నంతలోఁ గృతవర్మఁ దరసి చూచి
తే. రెండుతూపుల వడి నేసి రెండు గాఁగ, సలుపుటయు నాశరముతోడ నతనిధనువు
విడిచి పగవీడ కార్జుని యడిదము గొని, పౌరవుని తేరిమీఁదికిఁ జేర నుఱికె. 162
మ. అసిపాతంబునఁ గేతుదండమును బాయం జేసి తత్సూతునిన్
వెసఁ బాదంబునఁ దన్ని తార్క్ష్యుఁడు తరస్విత్వంబునం బాముని
ట్లసిఁ బోకుండఁగఁ బట్టి కౌరవుని కేశాంతంబుల న్మీఁది కె
త్తి సమాప్తింపఁగఁ జూచు చుండె నసిక్రీడన్ దిక్కులం గప్పుచున్. 163

—♦ సైంధవాభిమన్యులయుద్ధము ♦—

ఉ. సింగమునోటికిం దగిలి చేష్టలు దక్కినసారభేయ మ
ట్లంగద భ్రుంగి యున్నతఱి నారసి పౌరవునిం జయద్రథుం
డంగము వొంగ నార్చుచు రయంబున ఖడ్గము వూని క్రందికిన్
లంగ యొనర్చి పేర్చినబలంబున నార్జునిమీఁది కేగుచున్. 164
తే. కార్ష్ణి సైంధవు నీక్షించి కన్నుఁ గొనల, మిణుఁగురులు రాలఁ బౌరవు విడిచిపెట్టి
డేగవలె నరదమునుండి డిగ్గ నుఱికి, కదిసె నాజయద్రథునిపైఁ గడిమి మెఱసి. 165
చ. కవిసి జయద్రథానుగులు ఖడ్గములున్ శితశస్త్రసంతతుల్
దవులఁగ నేయ వాని నసిధారఁ దెగం బొసరించి మించినన్
జవమును సత్వముం గలిగి సైంధవుఁడున్ మునుకొంచు వానిపైఁ
గవియుఁడు వార లొండొరులు గ్రాలిరి యక్కలకొండలో యనన్. 166
తే. వ్యాఘ్రమును సింహమును బోలె వార లపుడు
కోపతాపము లినుమడిఁ గొనఁగ వడిగ
సదరి డాయుచు నేయుచు నసిఁ బొనర్చు
నంత నంతర మెఱుఁగ రై రెంత లైన. 167
వ. అంతఁ గొంతవడికి. 168
మ. అభిమన్యుండు కృపాణము న్విసరి ప్రేయం జూచుచుండంగ దో
ర్విభవం బేర్పడ సింధురాజతని నిస్త్రింశంబున న్మోఁదుడున్
రభసాధిక్యమున న్నరాజి యది తద్రంగన్మహామండలా
గ్రభువిం దాఁకుట భగ్న మై పడియె సంగ్రామోర్విఁ గైసేయుచున్. 169

క. విఱిగిన జయద్రథుం డుర్, బిఱిదికి నాఱడుగు లోదిగి వెసఁ దేరెక్కెన్
నెఱచఱి తనదిక్కఁ దొలఁగిన; తెఱఁగుల్ గని నరసుతుండు తెగఁబడి నగుచున్.

మ. శరవాలంబు విదిర్చుచున్ మునుమునం గన్పట్టి తత్సైన్యమున్
విరియం జేయుచు నార్చుచున్నఁ గని దోర్వీర్యంబునన్ మద్రభూ
వరుఁ డుగ్రాయసశక్తి కాన్పించియు వైవం దాని నాతండు స
త్వరుఁడై తార్క్ష్యుఁడు పన్నగంబు వలెఁ జేతం బట్టి మట్టాడుచున్. 171

క. గిరిశిఖఁ ద్రిప్పుచు శక్తిని, గరలాఘవ మేర్పడంగ గ్రమ్మఱ మద్రే
శ్వరురథముమీఁద వైచెన్, ధరఁ బడెఁ దత్సూతుఁ డుల్లి తత్పాతమునన్. 172

వ. అంత విరాటద్రుపదులును ధృష్టకేతుధృష్టద్యుమ్నులును భీమసేనయుధిష్ఠిరులును నకులసహదేవులును [illegible]డేయకైకేయులును శినివీరశిఖండులును మేలు మే లని సౌభద్రుం బొగడుచు సంతసంబున సింహనాదంబు గావించిరి నీకొడుకులును దాని నోర్వక వారిదంబులు భూధరంబునుం బోలె నాసౌభద్రుం జుట్టు ముట్టి నానావిధాయుధంబులం గప్పుచుండి రప్పుడు సూతపాతపరాభవంబునకు సైఁపక శల్యుండు నీకొడుకులకుఁ బ్రియంబు సేయుచున్ గదాపాణి యై గీర్వాణప్రభుప్రియపౌత్రునిం దాఁకు దెంచె ననిన విని ధృతరాష్ట్రుండు సంజయుదిక్కు మొగం బై యి ట్లనియె. 173

ఆ. వింటి నీవు సెప్ప వివిధంబు లగునవ్వి, యుద్ధముల నేఁ గొన్నియును వినంగఁ
దలఁతు దేవదానవుల యుద్ధమును బోలె, నిది యు విస్మయంబు పొదలఁ జేయు. 174

క. ఈకురుపాండవయుద్ధము, లోకమునం జెప్పఁ గొంద్రు లోలుభు లగుచున్
లోకులు కథలుగ సంజయ!, వాకొను మాశల్యనరజవరయుద్ధంబున్. 175

వ. అనిన సంజయుం డతని కి ట్లనియె. 176

—♦ భీమసేనశల్యుల గదాయుద్ధము ♦—

మ. గద సారించుచు దోర్యుగంబున మహోత్కాంతి న్నామంచుచున్
గదియన్ వచ్చెడు మద్రరాజుఁ గని పాకద్వేషిపౌత్రుండు న
న్మదవృత్తిన్ శతకోటికిం దగు గదం గైకొంచు రా రమ్మనిన్
జదియం జేసెద సంచుఁ బల్కుచు నడిన్ సంరంభముం జూపు చోన్. 177

క. అడ్డపడి వాయుతనయుఁడు, గొడ్డగమున నాఁగి సుతునిఁ గోకొమ్మని మా
ర్కొడ్డి వడి హుంకరించుచు, దొడ్డగిరిం బోలి నిలిచె దోర్బల మెసఁగన్. 178

తే. మద్రపతి భీమసేనుని మత్తదంతిఁ, గోలుపులి వోలె మార్కొని కోలుకొనియె
నప్పుడు శంఖారవములు దూర్యస్వనములు, సింహనాదములున్ మ్రోసెఁ జెలఁగ నింగి.

తే. మద్రపతి గాక భీముని మాఱుకొనఁగఁ, గలుగఁ డొక్కఁడు భీముఁడు గాక మద్ర
పతిని మార్కొన నుండఁ డీక్షితితలమ్మునందు నని సాధువాదము లతిశయిల్లె. 180

మ. వరజాంబూనదపట్టబద్ధ మగుచున్ వర్ణింప నయ్యెన్ వృకో
దరుహస్తంబుల నాట్య మాడెడుగదాదండంబు మద్రావనీ
శ్వరుహస్తంబుల మండలాగ్రగతులన్ వర్తించుచుం జంచలా
తరళం బై వినుతింప నయ్యెను గదాదండం బఖండద్యుతిన్. 181

సీ. గదలు శృంగములుగాఁ బొదలుచు నాబోతు, లట్లు వా రిద్దఱు నసఁగి పెనఁగి
జంకెనచూపులన్ అంకెలు డొంకులున్, మండలావర్తకమార్గములును
గలుగ గదాదండములఁ ద్రిప్పి వేయుచు, వ్రాయుచుఁ బాయుచుఁ డాపలకును
వలపలకును సారె పరవళ్లు ద్రొక్కుచుఁ, దాఁకుచు వీఁకమైఁ దప్పుకొనుచు

తే. నేఱు తప్పక యుండఁగ నేయు చొండొకండునుం గండు మిగిలి యుద్దండగతుల
నతులబాహాపరాక్రమ మడర నెపరు, వేచి పోరాడి రెంతయు నేచి యేచి. 182

మ. గద లొండొంటిపయిన్ రయంబునను దాఁకన్ ప్రేఁకనన్ నప్రహా
తవశం బొప్పఁగఁ జేయుచున్ మిణుఁగుఱుల్ దట్టంబుగా నల్గడం
గదురన్ వార్షికయామినీముఖమునన్ ఖద్యోతసాంద్రంబులై
పొదలం జొచ్చెడువృక్షరాజములకున్ బోలింపఁ గా నై తగెన్. 183

చ. పులులతెఱంగునం బొదివి పోరెడువారు గదాభిఘాతసం
కలితమహాస్రపూరమున గాత్రములం దెఱుఁ గన్న నెత్రువాఁ
కలు మొలతేర పాఱ నసకారునఁ బూచిన కింశుకంబు ల
ట్లలరయునుం జలంబు గల వైరి మహోద్ధత మావహిల్లఁగన్. 184

ఉ. వారిగదాభిఘాతము లవారిగ శక్రమహాశనిధ్వని
స్ఫారము లై దిగంతములఁ బర్వుచు నుండఁగ ధైర్యధుర్యు లై
పోరుచు నంగ లెన్నిదిగఁ బాపుచు నెక్కుచు వెండిఁ దాఁకుచున్
ధారుణిఁ గూలి రిద్దఱును దప్పి గదల్ పయిఁ బడ్డపాటునన్. 185

సీ. అంతటఁ గృతవర్మ వరుదెంచి పిన్వాల, మానుఁ డై పడియున్నమద్రపతినిఁ
గనుఁగొని సంభ్రమంబునఁ దన తేరిపై, నెక్కించుకొని పోవ కెడఁ జనియె
మారుతియు నిమేషమాత్రఁ దెప్పిలి లేచి, గదఁ గొని మసమసఁకఁ జదువఁ జొచ్చె
వానిసన్నపు మైసనాదంబులు వోలెఁ, గురుసైనికులు పాఱి బొరిమిఁ దొఱఁగి

ఆ. గెలుపుఁ గాంచి పాండవులు వహ్నుల ట్లయి, వెలిఁగి సింహనాదములును శంఖ
నాదములు నొసర్చి వాదిత్రము లవెల్ల, మ్రోయఁ జేసి రపుడు మోద మెసఁగ.

వ. ఇట్లు మనమూఁకలు చీకాకుపడి పాఱుట కోపక వృషసేనుం డెల్లసేనల కడ్డుపడి నానావిధాస్త్రశస్త్రజాలంబు లడరించుచు. 187

మ. తురగాంగంబులు తున్కతున్క లగుచుం ఘోరంబుగా ధారణిం
దొరఁగన్ దంతులు నింతలింతలుగ నెందుం ద్రొవ్వులై పోవఁగా
నరదంబుల్ దుమురై పడన్ భటులు నుగ్గై మ్రగ్గ నెత్తేరులుం
బరపై పాఱఁగఁ జేసె శాత్రవచమూవారంబులం జేరుచున్ 188

వ. ఇట్లురవడించి మహామారుతంబు పాదపంబులం బోలెఁ బాండవబలంబుల లీల మెయిం గూల్చుచున్నంత శతానీకుండు గండుమిగిలి వికర్ణుం దాఁకె. 189

మ. పదునుం బెట్టుట మర్మభేదు లగుచున్ భాసిల్లుదివ్యాస్త్రముల్
పది కర్ణాత్మజుమేన దూర్చుటయు నాబాహాబలాఢ్యుండు పెం
పొదవం బేర్చి మహోగ్రహంబునను దా నొక్కమ్మునన్ వానివి
ల్లు దెగం జేసి సిడంబు గూల్చి యుఱుచెన్ లోకంబు లగ్గింపఁ గన్. 190

వ. అంతలోన. 191

తే. భ్రాతృరక్షణతత్పరత్వమునఁ జేసి, ద్రౌపదేయులు వృషసేనుఁ దాఁకి పేర్కఁ
గాండజాలంబునన్ వాని గప్పి వడఁగ, నేయుటయు ద్రోణిముఖు లెల్ల నేగుదెంచి.

క. ద్రోవదిబిడ్డల నేవురఁ, జేవమెయి న్మాఱుకొనుచు శితసాయకముల్
నో వడర నేయఁ బాండవు, లేవురుఁ బఱతెంచి కవిసి రెత్తెఱ మీఱన్. 193

వ. అప్పు డుద్యతాయుధులై పాంచాల కైకయ మత్స్యసృంజయప్రముఖు లెల్లరును బెల్లు రేఁగి మనవారిపై నడరుటయును వారునుం గ్రోధోద్ధతులై సన్నద్ధులై రాయుద్ధంబు దేవదానవయుద్ధసదృశం బయ్యె నందు భీమకర్ణకృపద్రోణద్రౌణి పార్షత సాత్యకు లేడ్వురు నాహవభూమిం బొడిచినకాలసూర్యులచందంబునం బొలుపొందిరాసంకులసమరంబున. 194

తే. పర్వదినసాగరముభంగి బహుళనిస్వ, నంబుసం బర్వ ధర్మనందనుని సైన్య
ముక్కుమిగిలి భవత్సేన నుక్కడంప, విఱిగి పఱవంగ నై యది వెతలఁ గుడిచె. 195

మ. అరివీరార్దితమై వెఱం బఱచునీయాత్మోద్భవానీకమున్
గురుఁ డీక్షించి గుణంబు మోగిఁగొన నోక్షోణీశులారా! రణాం
తరమందుం బఱవంగ నిట్లు చనునే తాళుండు నే నుండ మీ
కరవాయిం గొన నేటి కంచు నభయం బత్యంతముం గూర్చుచున్. 196

ఉ. సారథిఁ గాంచి తేరు వడి సాఁగఁగని మ్మరిసేన డాయ నా
నారథకారవంశభవుఁ డట్లుగుఁ గావుత మంచు నేర్పు పెం

పార రథంబు దోలుటయు నాగురువర్యుఁడు పార్థసైన్యముం
జేరి యుధిష్ఠిరుం బొదివి చేసె శితేషుశతప్రయోగముల్. 197

### ద్రోణాచార్యులు ధర్మరాజుతో యుద్ధము చేయుట

ఆ. తనరథంబు మునుఁగ సునిశితాస్త్రము లేయు,గురునిఁ గంకపత్రశర [illegible]
బడలుపడఁగ నేసెఁ బాండవాగ్రజుఁ డస్త్ర,కౌశలంబు జనులు గని [illegible]. 198

క. గురువరుఁడు గినిసి యమరా,ధ్వరపుత్రునివిల్లు దునిమి వడిగ నలుముడుల్
బరికించి చక్రరక్షుఁడు, కర మదరుగ నాఁగె వేల కడలిబలె గురుల్. 199

స్రగ్ధర. అంతం బాంచాలపుత్రుం డయి తనరుకుమారాఖ్యుఁ డాలందు రోష
స్వాంతుం డై ద్రోణువక్షస్స్థలమున విలసత్సాయకం బేసి యొక్కం
డింత గ్లానట్టి తీలౌనిషువులు పయిపై నేసి [illegible] పేర్చెన్
సంతోషం బొప్ప నైరుల్ సలిపిరి జయసంస్థానసింహాస్వనంబుల్. 200

సీ. అందుల కోర్వ కస్త్రాచార్యుఁ డాకశిలా,కాండంబులఁ గుమారు గం డడంచి
పరసైన్యములఁ బాయవడఁ జేయుచు శిఖండి, సంక్రందసుతూపుల బడలు పఱచి
వింశతిశరముల వేధించి యుత్తమౌ,జుని నేసిటను నకులుని నొగిలిచి
సహదేవు నేడింటఁ బ్రహరించి ధర్మజు, ద్వాదశాస్త్రంబులఁ దరలఁ జేసి
తే. కాశ్యపదేయుల మూఁడేసి ప్రదరములను, [illegible] సాత్యకి నరపదిట నేసి
[illegible] బోఁ దోలుచు సునిశితాస్త్ర,ముల యుధ [illegible] నుఱియును బొదువు నంత.

క. అక్షము వచ్చి యుగంధరుఁ, డక్షీ గురుని [illegible] నాపెఁ దురగ్రుం డగుచున్
ద్రోణశిలీముఖమున నా, యెక్క నిలం గూల్చి [illegible] కేకైంఁ జూపెన్. 202

వ. అయ్యవసరంబున విరాటద్రుపదులును కైకేయులును శిబిసాత్యకులును బాంచా
లపుత్రు లయినవ్యాఘ్రదత్తసింహసేనులును మున్నగువారు ధర్మరాజరక్షాపరత్వం
బున నతపర్వంబు లగుబాణంబులం [illegible] మార్గంబున కడ్డు పడిరంత.

తరళము. వడిగ నార్చుచు నేబ [illegible] వ్యాఘ్రద
త్తుఁడును దోడన సింహసేనుఁడు దోర్బలంబుల [illegible]
యుఁడు గురుండు చలింప [illegible] కమ్మున [illegible]
[illegible] నేసి రథాళిఁ దోలుచు వచ్చె ధర్మజుచెంతకున్. 204

వ. అట్లు మృత్యురూపుం డై ధర్మరాజుం దరియ వచ్చునాచార్యుం గాంచి పాండవ
సైన్యంబునం గలజనంబులు. 205

చ. ఉడుగఁడు ద్రోణుఁ డిప్పు డొకయూఁకునఁ [illegible] సజాతశత్రునిం
[illegible] ఫాల్గునుఁడు [illegible] నేసి నచ్చునో

క. అట్టియెడ ద్రోణుఁ డేదుపుఁడు, పట్టుఁడు చంపుఁడు బాహుబలదర్పితులై
దిట్టఁపడుఁ డంచు నెలుఁగులు, దట్టము గా వినఁగ నయ్యె ధర్మజసేనన్. 290

వ. అనంతరంబ సాత్యకియుఁ జేకితానుండును ధృష్టద్యుమ్నుండును శిఖండియు వార్ధ
క్షేమియుఁ జైత్రసేనియు సేనాబిందుండును సువర్చసుండును లోనుగాఁ గలనానా
జనపదేశ్వరు లెదిరించిన నాథమధ్యరగురుండు వారల నందఱ నోడించి దైత్య
దానవసైన్యంబుల దైన్యంబు నొందించినశతమన్యునిచందంబున విక్రమించి
మత్స్యపాంచాలాదిబలంబులం గనుపుగొట్టుచుండె నట్టియెడ వ్యాత్తాననవ్యా
ఘ్రంబువలె నున్నవానికెట్టెదుర నొక్కరుండును నిలువ నోపఁ డయ్యె ననిన ధృత
రాష్ట్రుండు సంజయున కిట్లనియె. 291

క. పాండవపక్షమునం గల, దండిమగలయం దొకండు ధైర్యంబున నా
చండపరాక్రముఁ దాఁకఁగ, నుండమిఁ దలపోయ విస్మయోదయ మయ్యెన్. 292

వ. అనిన సంజయుం డాకర్ణింపు మట్లు ద్రోణునిప్రతాపంబునకు నోడి పాండవపాం
చాలమత్స్యకేకయాదిబలంబు లూడనిం బాఱుచున్నం గని మనవారు సింహనా
దంబులు గావించి యాసమయంబున దుర్యోధనుం డానందసాంద్రుండై కర్ణుం
గాంచి యి ట్లనియె. 293

మ. కనుఁగొంటే యిటు పాండవేయబలముల్ గాలాగ్నికైనద్రో
ణునిబాణాహతిఁ ద్రస్తలై వనమునందున్ సింహముం గాంచి మిం
చినభీతిన్ వెసఁ బాఱునట్లు వెరయం జెప్పంగ నేలిం కిటన్
మొనకట్టం గమకింప దంచుఁ దలఁతు న్మోహాతిరేకంబునన్. 294

తే. వెఱచి పఱవంగ నెంచిన వెనుక ముందు, గురునిబాణాగ్ని యేర్చుచుఁ గూడికొనుడు
మండలీభూతులై వార లొండొరువుల, గట్టుకొని యాకులం బిందె లట్టులయిరి.

మ. తనవా రెవ్వరు నండ నుండమియు నాదం డంతయుం జుట్టుచున్
గినుకం బూని మెలంగుచుండుటయు నీక్షింపంగ నావాయునం
దనుఁ డార్తిన్ సకలంబు ద్రోణమయ మన్భ్రాంతిం గలాఁ డయ్యె నిం
క నిరాశం గొని యుండు రాజ్యమునఁ గాంక్షం జేయుఁటవంబునన్. 296

వ. అనిన రాధానందనుండు గాంధారీనందనున కి ట్లనియె. 297

ఉ. ఎప్పటి కిట్లు కా దనుచు నీవు తలంపుము ప్రాణ ముండఁ గా
నిప్పవమానజుండు రణ మీఁగి గమింపఁడు చిత్తమందు మీఁ
యిప్పటిసింహనాదముల కింతయు నోర్వఁడు పాండవేయు లీ
చొప్పిసయట్టు లోటమిని జెందఁగఁ బోవరు యుద్ధదుర్మదుల్. 298

మ. కినుకం గూరిన వారు శూరులు విషాగ్నిద్యూతసంక్లేశమర్మ
వనవాసశ్రమముం దలంచుకొని జీవంబుం బెకంబాయనే
మనముం జేయుదు రింతె కాని వెఱపు న్మన్నించి సామాన్యుల
ట్లనికిన్ జొకెదుచట్టిరే తెలియ లేవై తిట్లు రాజోత్తమా. 299

సీ. పావని బాణకృపాణగదాదియుద్ధములఁ బ్రచండుఁ డాతం డఱిమిన
రిపువోడు మహారథోత్తములను నేఁడు, యేరి చంపెడు శౌర్య మేర్పడంగ
సాత్యకిప్రముఖు లాచక్కిని దోడ్పడి, పాంచాలమత్స్యాదిబలములఁ గొని
భీమచోదితు లయి భీమగతిం జాప,గురుఁ దలపడ నుండి రరయ నిప్పు

తే. డింద లోకమ్ము మ్రాడి న్మట్టిరే నరక్ష్యమాణదీపము శలభముల్ మాపినట్లు
ద్విజునిపని పట్టకుండ రా వెనుక మనకు, దెప్పరం బెంతయే వచ్చెడి న్నరేంద్ర. 300

వ. కావున మన మందఱము సమందగతిం జని ఘోరద్యాజుం గూడ ముట్టుద మను
టయు సుయోధనుం డెల్లబలంగంబులం దోడుకొని ద్రోణరథంబునకుం గావలి
యయ్యెఁ బాండవులును ప్రభంజనాత్మజపురోగములై నానావర్ణహయోత్తమంబు
లతో మహారావం బెసంగ ధనురాచార్యుం దాఁకఁ బరమసమ్మర్దంబుగా నడచి
రనిన ధృతరాష్ట్రుం డప్పటిపాండవులరథచిహ్నంబు లెట్టివి చెప్పుమనిన సంజయుండు
వెండియును. 301

—◆ సంజయుఁడు ధృతరాష్ట్రునకుఁ బాండవులరథాదిచిహ్నంబు లెఱిఁగించుట ◆—

క. నరవర! పాండవబలరథ,వరచిహ్నము లెల్లఁ దెలియఁ బలుకుట వశమా
పరికించి కొన్ని మాత్రము, సరిదాఁకం జెప్పుబుద్ధి సలిపెద వినుమా. 302

వ. వృకోదరునివీతులు మనుఁబోతువర్ణంబులు సైనేయునశ్వంబులు రజతవర్ణంబులు
యుధామన్యుహయంబులు సారంగవర్ణంబులు ధృష్టద్యుమ్నునితురంగంబులు పారా
వతవర్ణంబులు క్షత్రధర్మునిరథ్యంబులు శోణవర్ణంబులు శిఖండిపుత్త్రుం డయినక్షత్ర
దేవునిఘోటకంబులు పద్మపత్త్రవర్ణంబులును మల్లికాక్షంబులును నకులునితురం
గంబులు శుకపక్షవర్ణంబు లుత్తమౌజునివాజులు మేఘవర్ణంబులు సహదేవునిసైం
ధవంబులు తిత్తిరివర్ణంబులు యుధిష్ఠిరునిగంధర్వంబులు గజదంతవర్ణంబులు పాంచా
లేశ్వరునివారువంబులు జాతరూపవర్ణంబులు విరాటునిఘోటకంబులు పాటలవర్ణం
బులు విరాటపుత్త్రునికత్తలానులు హరిద్రావర్ణంబులు కైకేయులగుఱ్ఱంబు లింద్ర
గోపవర్ణంబు లమితౌజసుని హయంబు లామపత్త్రవర్ణంబులు శిఖండిమావులు దంత
వర్ణంబులు శిశుపాలపుత్త్రుం డగుధృష్టకేతునివాహనంబులు సారంగశబలవర్ణంబులు
దుర్జయునిసప్తులు శబలవర్ణంబులు బృహత్క్షత్త్రునితురంగంబులు పలాలధూమ

వర్ణంబులు సేనాబిందునివాహంబులు కౌశేయవర్ణంబులు కాశిరాజపుత్త్రపత్త్రంబులు క్రౌంచవర్ణంబులు ప్రతివింధ్యునితురంగంబులు శ్వేతవర్ణంబులు కృష్ణగ్రీవంబులు శ్రుతసోమునిగుఱ్ఱంబులు మాషపుష్పవర్ణంబులు నకులపుత్త్రుం డయినశతానీకుని సప్తులు సాలపుష్పవర్ణంబులు శ్రుతకర్మునిమావులు మయూరగ్రీవవర్ణంబులు శ్రుతకీర్తిహయంబులు మాషపత్త్రివర్ణంబు లభిమన్యునశ్వంబులు పిశంగవర్ణంబులు నీసుతుం డగుయుయుత్సునిహయంబులు పలాలకాండవర్ణంబులు వార్ధక్షేమితురగంబులు పలాలవర్ణంబులు సౌచిత్తిఘోటకంబులు నీలపాదంబులు శ్రేణిమంతునిగుఱ్ఱంబులు కౌశేయవర్ణంబులు సత్యధృతిహయంబు లరుణవర్ణంబులు చేకితానుని యశ్వంబులు పింగలకౌశేయవర్ణంబులు కుంతిభోజునిహయంబు లింద్రాయుధవర్ణంబులు రోచమానునితురంగంబు లాకాశవర్ణంబులు పాంచాలపుత్త్రుం డయినసింహకేతునిగుఱ్ఱంబులు శశలోహితవర్ణంబులు పాంచాలవరుం డైనజనమేజయుని వాజులు సర్షపపుష్పవర్ణంబులు దండధారునివారువంబులు పద్మకింజల్కవర్ణంబులు వ్యాఘ్రదత్తునివాహంబులు మూషికవర్ణపృష్ఠంబులు రాసభారుణవర్ణంబులు సుధన్వునశ్వంబులు చిత్త్రవర్ణంబులు చిత్త్రాయుధునిగుఱ్ఱంబు లింద్రగోపకవర్ణంబులు కోసలపతిపుత్త్రుం డగుసుక్షత్త్రునితురగంబులు చక్రవాకోదరవర్ణంబులు క్షేమసుతుం డైనసత్యధృతిసప్తులు శబలవర్ణంబులు శుక్లునిగుఱ్ఱంబులును గేతనాదులును శుక్లవర్ణంబులు సముద్రసేనసూనుం డగుచంద్రసేనునివాహనంబులు చంద్రవర్ణంబులు శైబ్యునిహయంబులు నీలోత్పలవర్ణంబులు రథసేనునిరథ్యంబులు కలాయపుష్పవర్ణంబులు పటచ్చరిపతితురగంబులు శుకవర్ణంబులు చిత్త్రాయుధునర్వంబులు కింశుకవర్ణంబులు నీలునికత్తిలాసులుం గేతనాదులును నీలవర్ణంబులు చిత్త్రుని పత్త్రంబులును గేతనాదులును చిత్త్రవర్ణంబులు రోచమానపుత్త్రుం డైనహేమవర్ణుని హయంబులు పుష్కరవర్ణంబులు దండకేతునికాండంబులు కుక్కుటాండవర్ణంబులు సారంగధ్వజుం డైనపాండ్యునితురంగంబులు చంద్రవర్ణంబులు పాండ్యానుయాయులగుఱ్ఱంబు లాటరూషకవర్ణంబులు ఘటోత్కచునిగంధర్వంబులు నానావర్ణంబులు బృహంతునిహరు లుసువర్ణంబులు మఱియుం గలవారిగుఱ్ఱంబులునానావర్ణంబులు మఱియు వేదికమండలుధ్వజుం డైనభారద్వాజుం దాఁక వచ్చినధర్మరాజుధ్వజంబున గ్రహగణాన్వితుం డైనసోముండును నందోపనందకంబు లనుమృదంగంబులు రెండునుం గలవు భీమసేనుని కేతనంబున వైడూర్యమణిలోచనం బగు సింహరాజంబు విరాజిల్లు నకులునిసిడంబునందు సౌవర్ణపృష్ఠం బయినశరభంబు డంబుమీఱుసహదేవుని టెక్కెయంబున ఘంటాసహితరాజహంసంబు రాజిల్లు ద్రౌప

దేయుల కేతనంబులం గ్రమంబున ధర్మమారుతశక్రాశ్వినీదేవతలవిగ్రహంబు లొప్ప నభిమన్యునిధ్వజంబున హిరణ్మయశార్ఙ్గపత్త్రి వెలుంగు ఘటోత్కచునిపడగపై గృధ్రరాజంబు కోమరారు నాకర్ణింపు మయ్యుధిష్ఠిరునివిల్లు మాహేంద్రంబు భీమునికార్ముకంబు వాయవ్యంబు శ్వేతవాహనునికోదండంబు గాండీవంబు నకులునిచాపంబు వైష్ణవంబు సహదేవునిశరాసనం బాశ్వినంబు ఘటోత్కచునివిల్లు పౌలస్త్యంబు బలరామదత్తం బగుసౌభద్రునికార్ముకంబు రౌద్రంబు ద్రౌపదేయులచాపంబులు రౌద్రాగ్నేయకౌబేరయామ్యగిరిశంబులు తక్కనుం గలవారిచాపధ్వజంబులు నానావిధంబు లిట్లు సన్నద్ధులై యెల్లవారును నామగోత్రంబు లెఱిఁగించుచు నాచార్యుసైన్యంబు దఱియవచ్చి రనిన ధృతరాష్ట్రుండు. 303

సీ. సంజయ! యేమందు సామీరిముఖులైన,వారు దేవళ్ళతోఁ బోరఁ గలరు
దైవయోగముఁ గాక తలఁప నొం డగునొట్టు, రాజ్యచ్యుతుల కిట్లు రాజు లగుట
భాగధేయం బొక్కపగిది నుండఁగ మన, మొక్కపగిదిఁ బోవ నొప్ప దెపుడు
ద్యూతవ్యసనకర్శితుం డై జటిలుఁ డయ్యె, యమజుఁ డింతటిసాయ మందఁ గలిగె
తే. మందు డగునాసుతుఁడు నన్నుఁ బొందుఁ బుడమి, చేదికేకయవంగాదిభూదయితులు
నాకు బానట యైరని నాసమక్షమునను వర్ణించి పలుమాఱు మున్ను పలుకు.

ఉ. ఇంద్రజతోడుపాటు తన కిప్పుడు కల్గిన బార్థుతుం డొకం
డందఱుఁ జూచుచుండ నటు లాగురునద్యుని మిత్తివాతికిం
బొందఁ గఁ జేసె నన్న యది పోల్ప నదృష్టముఁ గాక యుండు నే
మందుఁడ నేను నాగురుల మాఱుచుకొంటిని గొంటెమాటలన్. 305

మ. గురుఁడుం దండ్రియు బిడ్డలుం దెగిరి నాకు న్మేనిపై నాస యుం
దరలె న్మావిదురుండు సెప్పినగతిన్ దాపించెఁ దాపం బయో
దురమందున్ సుతు లెల్లరుం దెగిన నాదుర్యోధనుం డొక్కఁడే
ధర శేషించినఁ జాలు నందు నదియుం దథ్యంబు గా దయ్యెడిన్. 306

క. ఘను లగుప్రధానపూరుషు, లనిఁ ద్రెళ్ళినపిదపఁ దక్కనగువా రెట్లే
మనఁ జాలుదు రని యెంచుట, మనముం జెడినట్టివారిమాటయ సువ్వే. 307

తే. ధర్మము పరిత్యజించి యేధరణినాథుఁ, డర్థపరుఁ డై మెలంగు నాయధముఁ డిందు
నందునన్ తుద్రభావంబు నందఁ గలఁడు, నిక్కువం బని పలికిరి నీతివిదులు. 308

వ. నే నీయర్థంబున నిరాశుండ నై యున్నవాఁడ నింకఁ గాఁ గలయది యెట్లునుం గాక మానదవహితుండ నై తి సమరప్రకారం బంతయుఁ జెప్పు మెవ్వ రెవ్వారు పెనంగి రెవ్వరెవ్వరు తొలంగిరి వృకోదరార్జునులభయంబు నాకు భూయిష్ఠంబు పాండవబలంబు

లట్లు భారద్వాజుం బొదివిన మనవా రెట్లు ప్రవర్తించి రది యంతయు సవిస్తరంబుగా విన నెంచితి ననిన సంజయుం డిట్లనియె నట్లు పెక్కండ్రు పాండవసైనిక లొక్కమొగి నాచార్యుం జుట్టుముట్టుటయు నట్టియెడ దట్టమై లేచి యేచినపరాగంబు మిన్ను ముట్టి దృష్టిరోధంబు గావించిన మనసైనికు లేమియుం గానక ద్రోణుండు హతుండగా వగచుచుండు నంత సుయోధనుం డెలుంగెత్తి యిట్లనియె.

—♦ కురుపాండవవీరుల ద్వంద్వయుద్ధప్రకారము ♦—

ఆ. వీరవర్యులార! మీరు మీయుత్సాహ, శక్తిసత్త్వములకుఁ జాలి పోరి
యరిబలంబు నాఁగుఁ డనుటయు మనవారు, మాఱుకొనిరి వారి మసలకపుడు. 310

క. మనదుర్మర్షణుఁ డేడ్తెఱ, ననిలజునిం దాఁకి వీఁక నస్త్రహతునిఁ గా
నొనరింప నాతఁ డాతని, ఘనబాణంబుల నడంచి కల నొనరించెన్. 311

క. మదమాతంగము చెంగున, మదమాతంగంబుమీఁద మాత్సర్యమునన్
గదిరినవిధమున శినివరుఁ, గదిసెం గృతవర్మ శస్త్రకౌశల మెసఁగన్. 312

సీ. వడి సైంధవుఁడు క్షత్రవర్మపైఁ బడి బెడిదపుటంపఱ న్వానిఁ దఱల నేసె
నతఁ డల్గి వానిశరాసనధ్వజముల, మలఁచి పదింట మర్మములు నొంచె
సైంధవుఁ డొండొకచాపంబుఁ గొని వాని, పయి వివిధాస్త్రముల్ పరఁగఁ జేసె
నవల సుబాహుఁడు దవిలి యుయుత్సునిఁ, బెక్కుసాయకముల నుక్కడంచె

తే. దాన నలిగి యుయుత్సుఁడు వానిబాహు, యుగము శరశరాసనయుతముగఁ దెగంగ
నఱకె సితమును బీత మై వఱలు రెండు, క్షురములం జేసి యాశ్చర్యకరము గాఁగ.

ఉ. మద్రవిభుండు ధర్మజుని మాఱ్కొని మార్గణసంచయంబునన్
రౌద్రము సూపినం గనలి రాజశిరోమణి ధర్మరాజు ని
ర్నిద్రపరాక్రమంబునఁ బొరింబొరి బాణపరంపరాహతిన్
మాద్రికి మీఱిన ట్లగుచు మర్మముల న్నొగిలించె నెంచఁగన్. 314

ఆ. అతఁడు నంతఁ బోక యఱువదినాలుగు, కోల లేసి యూర్వ గురువిభుండు
కనలి వానివిల్లు గడిగండలుగఁ జేసి, సిడము గూల నేసె శితశరముల. 315

సీ. అపుడు బాహ్లీకుఁడు ద్రుపదునిం దాఁకిన, వారలపో రయ్యె ఘోరగతుల
విందానువిందులు వెస విరాటు నెదిర్చి, రతఁడు వారికిఁ జాలి యని యొనర్చె
మత్స్యకేకయులకు మత్సరం బెచ్చుట, నతిభీకరం బగు నాలమయ్యె
భూతకర్ముఁడు తన్నుఁ బొదివిన నకులాత్మ, భవుఁడు తచ్ఛిరము బాహువులు దునిమె

తే. వడి వివింశతి సుతసోముఁ దొడర నతఁడు, వానిఁ బెక్కమ్ముల న్నొంచి వాసిఁ గాంచె
భీమరథుఁడు సాల్వునిఁ దాఁకి భీమగతుల, సాళ్వసారథికంబుగా నతనిఁ జంపె. 316

మ. శ్రుతకర్ముం గని చిత్రసేనసుతుఁ డుగ్రుండై పితృప్రీతికై
ప్రతిరోధించి సమీకముఁ సలిపె భారద్వాజపుత్రుం డనిం
బ్రతివింధ్యుం బొదువంగ నాతనిపయిఁ బహ్వాస్త్రశస్త్రావళుల్
క్షితిపై విత్తులు చల్లిన ట్లతఁడు చల్లెం దమ్ములుం దోడుగన్. 317

మహాస్ర. శ్రుతకీర్తిం ద్రౌపదేయున్ సురుచిరవిశిఖస్తోమముం గప్పి మారో్క
సతతక్రోధుండు దుశ్శాసనసుతుఁ డలరం జూచి చూపున్ సుభద్రా
సుతుఁ డాలో వానివిల్లున్ సుడివడ సిడమున్ సూతునిం ద్రుంచి బాణ
తతియుంబున్ వైచి ద్రోణాంతికమున కరిగెన్ దీవ్యదోజోతిదీప్తిన్. 318

సీ. లక్ష్మణుండు పటచ్చరక్ష్మాపతిం దాఁక, నతఁడు తల్లక్ష్మశరాసనములు
దునుమాడి వానిపైఁ దూపులు కడు నేసి, పెనఁకువ సాఁగించెఁ బెద్దతడవు
మనవికర్ణుఁడు శిఖండిని మాఱుకొని పోరె, వివిధాస్త్రశస్త్రముల్ విస్తరించి
యుంగదుం డభిముఖుఁ డగును త్తమౌజసు, నెదిరించె వారిపోరెసక మెసఁగె

తే. దుర్ముఖుఁడు పురుజిత్తుతోఁ దొడరి పెనఁగ, నాతఁ డాతనిభ్రూమధ్యమందు నొక్క
నారసము నాటుటయు మోము నాళసహిత, మైనపంకజముం బోలి యతిశయిల్లె.

క. వైకర్తనుఁ డపు డేవురఁ, గైకయులం దాఁకి యేయఁగా వారలు న
స్తోకశరంబులఁ గప్పిన, నాకాలంబునకుఁ దోఁప రైరవ్వీరుల్. 320

వ. అపుడు నీపుత్రులు దుర్జయ జయ విజయులు మువ్వురును నీల కాశ్య జయత్సేను
లనుమువ్వురం దాఁకి వీఁకం జూపిరి క్షేమధూర్తి బృహంతులు సాత్వతు నెదిరిం
చుటయు వారిపోరు భీకరం బయ్యెఁ జేదిరా జంబష్ఠరాజు నాఁగిన నాతం డస్థిభేది
యగునొక్క శలాకచే వాని నేసిన వాఁడు శరశరాసనంబులు విడిచి రథంబునుండి
పృథివికిం బడియె శారద్వతుండు వార్ష్ణేయుం డగువార్ధక్షేమిం దలపడి ఘోరయు
ద్ధమ్ము గావించె భూరిశ్రవసుండు మణిమంతునిపైఁ గవిసి పెక్కమ్ము లేసిన
నతండు వానికేతనశరాసనచ్ఛత్రంబులం దునిమి సూతుం గూల నేయుటయు
యూపకేతు వగునాసౌమదత్తి కృపాణపాణి యై తత్తఱంబున రథంబు డిగ్గ నుఱికి
సాశ్వసూతధ్వజరథుం డగువానిం దెగ నఱికి మగిడి రథంబెక్కి చాపాంతరగ్రహ
ణంబు చేసి తాన యశ్వచోదనంబు చేసికొనుచుం బాండవసైన్యంబుల గండ
డంచెఁ బాండ్యుని వృషసేనుండు పొదివి నిలువరించునంత ఘటోత్కచుండు
గదాపరిఘపట్టసనిస్త్రింశముసలముద్గరపరశ్వథచక్ర కరవాలభిందివాలాది నానావి
ధాయుధంబులు గుప్పించుచు నొప్పించుచున్నం గని రాక్షసప్రవరుం డగునలంబు
సుండు ప్రతిఘటించె నప్పుడు వారిపోరు శంబరామరేశ్వరులపోరుం బోలె ఘోరం

బయ్యో నిట్లిరువాఁగునం గలయోధులు ద్రోణుం గావను ద్రోణు[illegible] సన్న
ద్ధులై ద్వంద్వయుద్ధంబు గావించి రట్టిది మున్నెన్నఁడుం గని [illegible]ంగ
మని వియచ్చరులుఁ గూడ నచ్చెరు వంది రనిన ధృతరాష్ట్రుం డి ట్లనియె. 321

తే. ద్వంద్వయుద్ధమునకు వారు దలపడి పయి, సలిపి రెట్టులు నంత స్తతులును నవ్య
సాచియును దొడంగిన పోరుసరణి యెట్లు, చెప్పు మంతయు విన నిచ్చఁ జేసినాడ.

ఉ. నావుడు సంజయుండు నరనాథ! వచించెద నాలకింపు మా
కేవఁ బరస్పరంబును గడిందిరణంబునకుం గడంగి వా
రావహిలం బరాక్రమ మహంయువులై కలహించుచుండ దం
తావళసంతతు ల్గలిగి తావకసూతి యెదిర్చె భీమునిన్. 323

ఆ. గోవృషంబు పిలువ గోవృషంబును బలె, మదగజంబు పిలువ మదగజంబు
కరణి గాఢ్పపట్టి కడుదర్పమున నొప్పి, ముద మొనర్చె నపుడు కదనమునకు. 324

చ. ఎడ తెగనట్టి బెట్టిదపుటింగలముల్ బలె మండుచుంపఱన్
వడముడి వారణౌఘములపై నడరించిన ఘీంకరించుచుం
బడియును జచ్చియు న్వెఱచి పాఱియు జోరున నెత్రు గ్రక్కుచుం
గడలకుఁ బట్టె నన్నియును గాలికిఁ దూలినమబ్బు లట్టులై. 325

తే. కిరణజాలంబులను నాల్గుకడలు గప్పి, యొప్పు మీఱెడుసూర్యుని చొప్పు దోఁపఁ
గరిఘటల నెల్ల శరపరంపరలఁ గప్పి, చొప్పడియె నప్పు డాభీముఁ డప్పళించి. 326

ఆ. అనిలసుతునిబాణహతి రక్తసిక్తము! లై నకరటిఘటలు భానుకిరణ
జాలలిప్తము లగు స్తనయిత్నువులు వోలెఁ, జూడ నొప్పె నపుడు చోద్య మొదవఁగ.

చ. తెరలి గజంబు లట్లు కడ తేఱఁగఁ జేయుచు నున్న భీముపైఁ
గర మలుకన్ భవత్సుతుఁడు కాండచయంబు నిగిడ్చుచున్ క్షణాం
తరమునఁ గెంపుగ న్మొలయ నాగపురీశునిఁ జక్కఁ బెట్టనై
దయుపలిపట్ట బట్టడం గాయముఁ దూఱఁగ నేసెఁ దూఁపులన్. 328

ఆ. మఱియు నలుక గదుర మణినాగకేతువు, కార్ముకంబు రెండు ఘనతర ప్ర
దరము లేసి తునిమి కురురాజు నొప్పించె, మేనినిండ నించి మేల్ శరములు. 329

వ. అయ్యవసరంబున. 330

మ. ప్రభురతామతి వంగభూపతి మహోగ్రక్రోధతామ్రాక్షుఁడై
యిభముం గొల్పుచు నడ్డు వచ్చి కరమం దిష్వాసముం గూర్చి చో
దభవం బేర్పడఁ గుంభమధ్యమున నారాచం బొకం డమ్మరు
త్ప్రభవుం డేసిన వార్చుచుం బడియె నాదంతావళం బద్రినాన్. 331

ఆ. పుడమి నద్రువ గజము పడుచుండఁ గడువడి, నడరి వంగు నుత్తమాంగము తెగి
బంతివోలె డొల్ల భల్లంబు వరఁగించె, భీముఁ డెల్లబలము పెల్లగిల్లె. 332

వ. ఇట్లు వంగాధీశ్వరుండు పడుటయు మనబలంబు లెల్ల వెఱచి పఱచుచున్నంత. 333

—♦ భగదత్తుండు భీమునిపైఁ దనదంతిం బుఱికొల్పుట ♦—

మ. భగదత్తుండు సమీరనందనునిపైఁ బాఱంగ మత్తేభముం
దగఁ గొల్పెన్ గిఱికొంచు నయ్యది మహాధ్వానం బనూనంబ యై
గగనం బంటఁగ నేచి ఱాచి పదయుగ్మప్రాప్తి సైన్యంబు దై
న్యగతిం బొందఁగఁ జేయుచున్ వడముడిం బ్రాపించి కోపంబునన్. 334

చ. అరదముఁ బట్టి యీడ్చి తురగావలితోఁ ధరఁ బెట్టి కొట్టఁ గాఁ
బరియలు వాఱె నుగ్గగుచుఁ బాఁడి దొలంగెను భీమసేనుఁ డం
తరమున ధాత్రిపై కుఱికి తద్గతి నొందక కుంద కగ్గజో
త్తరపృథులోదరంబుకడ దాఁగెఁ జలింపనిమానసంబునన్. 335

ఆ. పొట్టక్రింద నిలిచి ముష్టిఘాతంబుల, నొవ్వఁ జేసె దాని నవ్వడముడి
వానిఁ బట్ట నెంచి వారణము కులాలచక్ర మట్లు తిరిగె సంభ్రమమున. 336

క. నాగాయుతబలుఁ డగుటన్, వేఁగక పవమానసుతుఁడు వేడుక మెయి న
న్నాగము నగ్రస్థానముఁ, దాఁ గొని మెలఁగంగఁ బొలిచెఁ దక్షిణమందున్. 337

చ. తలఁగక సుప్రతీక మతిదారుణకార్యము సేయ నెంచి పెం
జలమునఁ బట్టి పావనిని జానువులం దిడి పట్టి తుండమున్
గళమునఁ జుట్టి కొట్టుటకుఁ గాఁ గడగట్టినయంతలో నతం
డలవునఁ బట్టు దప్పుకొని నైచనె వెండియుఁ బొట్టక్రిందికిన్. 338

వ. అంతలో బకాంతకుండు తమబలంబు లయ్యేనుఁగుం దాఁకి వచ్చుట లెఱింగియొప్పుడో
కుందునం దప్పించుకొని తొలంగి చనియె నప్పుడు. 339

తే. ఆటఁ జంపెను జంపె నాహస్తి భీము, నెయిదుఁ డెయిదుఁడు పడి నట కెల్ల రనుచు
నార్తనాదము లెసఁగ నయ్యరిబలంబు, వడివడిం బాఱె భీముఁడు పడిన కడకు.

వ. అంత నజాతశత్రుండు వాయుపుత్రుండు పడియెనకా తలంచి చతురంగబలసమేతుం
డై పాంచాలపురస్సరంబుగాఁ జని సుప్రతీకంబుపై శరవర్షంబు గురియుచున్నంతఁ
బ్రాగ్జ్యోతిషేశ్వరుండు వాని నెల్ల నంకుశంబున వారించుచు వారణంబుఁ బుఱికొ
ల్పుటయు నది యవక్రవిక్రమంబున నెల్లర నతిక్రమించుచుండె నయ్యవసరంబున.

క. కినుకం జేసి దశార్ణావనినాథుఁడు తనదుమత్తవారణమును ద
ద్ఘనవారణంబుమీఁదం, జనఁ గొల్పె ననల్పశౌర్యసంపద లెసఁగన్. 342

సీ. అది యాశుగామి యై యడ్డంబు గాఁ జని, భగదత్తుదంతితోఁ బ్రతిఘటించె
ఘీంకరించుచు నది గిట్టునఁ దిరిగి ద, శార్హేశ్వరునిహస్తి సరగఁ దాఁకెఁ
బక్షముల్ గలిగినపర్వతంబులు నాఁగ, నారెండుగజములు ననఁగి పెనఁగెఁ
గొమ్ముల నొండొంటఁ జిమ్ముకొనం బుట్టు, విస్ఫులింగంబులు విరియఁ బాఱె
తే. దండధరుదండ మనఁగ నుద్దండలీలఁ, దొండమును దొండమున జొట్టి తొడిబడంగ
నీడ్చి వైచుచు ముంగాళ్ళ నెత్తి పైకి, నెత్తిపైఁ బెట్టి పోరె నాహత్తు లపుడు. 343
వ. అట్టియెడ. 344
ఆ. సుప్రతీక మేచి సుంత వెనుక కిగ్గి, వీఁక మగిడి యొక్కతూకునను ద
శార్హనాథుపార్శ్వమందు నొవ్వఁ గఁ దాఁకి, వానిదంతి నొఱగ వడిగఁ బొడిచె. 345
చ. ద్విరదము నేలపై కొఱఁగఁ దేఱకునందునఁ బొంది పర్వతే
శ్వరుఁడు వడిన్ దశార్హపతి సప్తశితోన్నతతోమరంబులన్
శిరము దెగంగ నేయుటయుఁ జెచ్చెఱ నచ్చపలుండు దంతితో
ధరపయిఁ గూలె గాలికి వితావిత యై పడుభూజముం బలెన్. 346
క. అపుడు రథానీకముతో, వ్యపగతభయుఁ డగుచుఁ దాఁకె భగదత్తుని స
త్యపరాక్రముండు ధర్మజుఁ, డపురూపముగా శరంబు లడరించి వడిన్. 347
వ. ప్రాగ్జ్యోతిషాధీశ్వరుం డాశరంబుల నెల్లఁ బ్రతిశరంబుల వారించుచు ధర్మరాజుం
గూడి తనపై నురవడించుచున్న సాత్యకిం గాంచి వాని తేరిపైఁ గవియఁ దనభద్ర
దంతిం బఱపుటయును. 348
ఉ. ఆవరవారణంబు రయమారఁగ నాయుయుధానునశ్వసం
భావిత మైనస్యందనముఁ బట్టి పెనంచి కరంబు పెట్టునం
జేవమెయిం ధరిత్రిఁ బడి చేష్పడి పోవఁగ వీఁచి వైచె నా
లో వడి దాఁటిపోయి రతిలోకబలుం డతఁడున్ నియంతయున్. 349
వ. ఇట్లాసుప్రతీకం బవక్రవిక్రమంబున నెల్లవారిం జంచి చెండాడుచుండం బెండు
వడి పాండవబలంబు లెల్ల దాని నొక్కదానిన పెక్కువేల సుప్రతీకంబులు గా
నెంచుచు నార్తనాదంబు లుప్పతిల్లఁ జెల్లచెద రయ్యె నయ్యెడ. 350
ఉ. భీముఁడు సజ్జితం బయిన నేకొక తేరిపయిన్ వసించి సం
గ్రామభువిన్ మెలంగుటయుఁ గన్గొని పర్వతవల్లభుం డిభ
గ్రామణిఁ గొల్పె వానిపయిఁ గ్రౌర్య మవార్యము గాఁగ నద్ది యు
ద్దామపరాక్రమం బెసఁగఁ దద్రథముం గదియంగఁ బాఱుచున్. 351

చ. ద్విరదము కాలమృత్యు వయి విద్విషసైన్యముఁ గన్నుఁగొట్టుచో
ద్విరదరథాశ్వపార్థివతతిం బ్రభవించె మహాధ్వనుల్ దిగం
తరములు నిండ మెండుకొని తత్పదజాతరజంబు రేఁగి భా
స్కరునికరంబులం గరిముఁ గప్పుచుఁ జొప్పడె నుప్పరంబునన్. 361

వ. ఇట్లెక్కడిపో రక్కజం బై యుండ నక్కడ నెక్కటిం బోరుచున్నయర్జునుండు తమ
క్కన జననిస్వానంబును ధరణీరజోవ్రజంబును నిట్టలం బై మిన్ను ముట్టుటయుఁ
గని వాసుదేవునిదిక్కు మొగం బై యిట్లనియె. 362

సీ. ప్రాగ్జ్యోతిషుఁడు నాగరాజంబుతో రేఁగె, నదె మనదెస రావ మతిశయిల్లె
నలఁతి గా డతఁ డిభయానమునం దింద్రుఁ, డొండె తా నొండె ము న్నోప్పవార
సుప్రతీకమున కీసుప్రతీకం బుద్ది, శ్రమ లేక తాఁ గొర్వ నమరి యుండుఁ
గాల్చిపుచ్చిన యేని కడలదు మనమూఁక, నది యొక్కఁడే నుఱుమాడఁ జాలు
తే. నీవు నేనును దక్క నయ్యేనుఁ జేని, మాఱుకొని నిల్వఁ జాల రేమనుజు లైన
వేగిరింపుము తేరట కేగనిమ్ము, గారుతో వానిఁ గూల్చెదఁ గాని కృష్ణ. 363

వ. అనుటయు నతం డట్ల కాక యని యటఁ బో నరదంబు ద్రిప్పుటయు నంతలో
సంశప్తకులు పదునాల్గువేవురును త్రిగర్తులు పదివేవురును నారాయణగోపాలురు
నలువదివేవురును రమ్ము రమ్ము మమ్ము గెలువ కెందు బోయెద వని పిలుచుచు
ధనంజయువెంట నంటుటయు నతండును. 364

చ. కలనికిఁ బిల్వఁ బోవమియుఁ గా దటఁ బర్వతనాథుకోల్తలం
గలఁగిననాబలంగములఁ గావఁ గఁ బోమియుఁ గాదు రెండునున్
నలుపఁగఁ జెల్లు నెట్లు కొనసాఁగు నిటన్ మది రెండుపాయ లై
తొలఁగెడి నేది సేయుదునొ యేయది సేయక యుందునో కటా. 365

తే. అని వితర్కించి యర్జునుం డప్పటికిఁ ద్రిగర్తులం దాఁకు టుచితంబు గాఁ దలంచి
మరలి కపికేతనము గ్రాల మహితశక్తి, నొకఁడ బహుసహస్రములతో నొక్కి సెసఁగె.
తే. కర్ణదుర్యోధనులు కట్టిగండడంపఁ, దలఁచి సంశప్తకసహస్రములకు నొకని
కని పొసఁగఁ దంత్రమును బన్ని రాతఁ డక్క, టకట వెన్నిచ్చునే జగం బొకటి యైన.

వ. అట్టియెడ. 368

శా. ఆసంశప్తకు లందఱుం గలిసి కోపావిష్టచేతస్కు లై
కాసం బైనను గొంక కానరునిపై గాండప్రకాండంబు లె
న్నేసాహస్రము లొక్కపెట్ట విడువన్ గృష్ణుండు జిష్ణుండు తే
రాసాంబ్రాణులు కంటికిం బడనియ ట్లయ్యె న్నిమేషంబునన్. 369

క. అపాయకవిద్ధుం డై, త్రాసమున జనార్దనుండు తబ్బిబ్బు పడన్
వాసవి గనుఁగొని కినుకన్, బ్రేసెను బ్రహ్మాస్త్ర మపుడు రిపుసేనపయిన్. 370

వ. అబ్బ్రహ్మాస్త్రప్రభావంబునం జేసి సంశప్తకసైన్యంబున శతసహస్రసంఖ్యాకం బైన ప్రాణిలోకంబు లోకాంతరంబునకుం జనియె నయ్యెడం దెగినకాలుసేతులును విఱిగినకేతుదండకోదండాదులును గూలినరథరథ్యసారథులును రాలినభూషణాంబరాయుధాదులును గలిగి సంగరాంగణంబు భయంకరంబై చూపట్టె నట్టియెడ. 371

క. నలినీవనసంస్థిత మై, చెలఁ రేగినమత్తగజముచెలువున రిపుసే
నల నులిమిపెట్టు నరు న, ర్మిలి భూతగణంబు మేలు మే లని మెచ్చెన్. 372

వ. అంత నత్యంతవిస్మయావిష్టచేతస్కుం డై వాసుదేవుండు వాసవిం గని కరస్పర్శంబు సేయుచు ని ట్లనియె. 373

తరళము. కలన నీ విపు డేచి చేసినకర్జ మాసమవర్తియున్
గులిశహస్తుఁడునుం గుబేరుఁడుఁ గూడఁ జేయఁగఁ జాల రీ
వలఁతివే నిమిషంబులోన సహస్రముల్ దెగె దేహముల్
విలుకయింగొనువారిలో నిను వేఁడు వోలును జెప్పఁగా. 374

ఆ. అనిన నగుచుఁ బార్థుఁ డందు నిం దున్నసం, శప్తకులను గూల్చి చనుము కృష్ణ
సుప్రతీకమునకుఁ జూపుద మీవాఁడి, వేఁడి వేఁడి బాణవితతు లేసి. 375

వ. అనినఁ గృష్ణుండు జిష్ణునిపాండురాశ్వంబులం ద్రిప్పి ద్రోణానీకంబుదిక్కు మొగంబు వెట్టిన సుశర్మ భ్రాతృసహితుం డై వెన్నుదన్ని వచ్చి వివ్వచ్చునిం జివ్వ కాహ్వానించుటయును. 376

చ. హరిఁ గని యర్జునుం డనియె నంబుజలోచన! పిల్చుచుండె నన్
దురమున కన్నదమ్ములకుఁ దోడ్పడఁ జిత్తము లాగుచుండె నె
క్కరణిఁ బొనర్ప నా కుచితకార్యమొ చెప్పుము నాఁగ నాతఁడుం
దురగముల న్మరల్చె నొకతూఁగున మూఁగినమూఁకపైఁ బడన్. 377

చ. కవిసి సుశర్మపై నరుఁడు కాండము లేసి నిగిడ్చి రెంటఁ గే
తువు ధనువుం ధరం బడఁగఁ ద్రుంచి తదీయసహోదరున్ సహా
శ్వవరనియంతృకంబుగను సాఁగఁగఁ దోలె యమాలయంబుఁ గ
న్గవఁ గని మెచ్చి యచ్చటను గాపుర ముండెడునట్టివారిఁ గన్. 378

వ. అంత సుశర్మయును. 379

తే. తమ్మునిపాటు చూచి కనుఁదమ్ముల మంటలు దేరఁ గాలస
ర్ప మ్మన నైనశక్తి నరుపై నడరించి మురారిపై మహా

గ్రమ్మఱుతోమరమ్ము గడఁకం బరఁగించిన మించి మూఁడు మూఁ
డమ్ముల వానిఁ ద్రుంచె నరుఁ డద్భుతమునం దవి తుండెలై పడన్. 380

తే. పెక్కు లగువాఁడికోలల నొక్కయమ్ము, దీని ద్రిగర్తునిపైఁ గవ్వడి వడి గురియు
టయును నాతఁడు కడు నొచ్చుటను వివేష్టుఁ, డగుచు సొమ్మసిల్లెన్ రథమందె యొరగి.

ఉ. అట్లు సుశర్మ మూర్ఛపడునట్లు పొనర్చి కపీంద్రకేతుఁ డ
ప్పట్ల సుదర్శనాయుధునిపైఁ గనుఁగోయి నిగిడ్చి చూడు మం
దెట్లు రజంబు రేఁగెడినొ యెట్లులి వాకస మంటెనో బలం
బెట్లు చలించెనో జనుల కెట్టివిపత్తిగు వెంచెనో కదే. 382

క. మాధవ! పఱపుము తేరా, యోధులకున్ సాయపడుద ముగ్రాస్త్రములన్
నా ధీనిధి మరలిచి తగ, బోధించుచు నడపె రథ్యముల రయ మెసఁగన్. 383

శా. కక్షస్థం బగునగ్నిఁబోలె నరుఁ డుగ్రంపశ్యుఁడై మండి ప్ర
త్యక్షుం డైనకృతాంతుఁడో యనఁగ నై దర్పించి నీసేనపై
నక్షుద్యోగధియుగ్మసంకలితబాణౌఘంబులన్ మిత్తికిన్
లక్షీభూతులఁ జేసి సైనికులఁ దూలం జేసె నీ సేర్పడన్. 384

తే. అశనిపాతమునకుఁ బోలె నమరనాథ, సుతుని వేగంబునకు నీదుసుతునిసైన్య
మింతయును దాళఁ జాలక యిట్టునట్టు, గాఁగఁ బడి పాయలై చీలి వీఁగనయ్యె.

మ. భవదాత్మోద్భవనాశనార్థ మగుచున్ ప్రఖ్యాతినిం గొన్న గాం
డివమున్ సారెకు మ్రోఁగ నింద్రసుతుఁ డుద్ఘనంబు గావించుచున్
జవసత్త్వంబు లెసంగఁ దార్క్ష్యుఁ డిలకున్ లంఘించునట్లింతలో
దవులన్ దంతినిఁ ద్రిప్పుపర్వతపతిం దాఁకంగ వచ్చె న్వడిన్. 386

తే. పార్థవిక్షోభ్యమానమై బడలువడిన, నీబలంగము లొంగి మున్నీటఁ బర్వ
తమును దాఁకి యవిసినకలము తెఱఁగున, వికలమైఁ బోయె నొక్కింత వివరులోన.

చ. విఱిగినమూఁకలోనఁ బదివేవురు వీరవరేణ్యు లంతఁ గ
మ్మఱి నరుఁ జుట్టుముట్టి బహుమార్గణపంక్తుల ముంచి మించి ర
త్తఱి నలినీవనంబున మదావళిమట్టులు వారలోన సే
త్తెఱఁ గొని చొచ్చి విచ్చలవిడి న్విహరించె నరుండు దండియై. 388

క. అందఱు నట్టులు చిందఱ, వందఱ గావింపఁ జూచి భగదత్తుఁడు సం
క్రందననందనుఁ బొదువ న, మందగతిం దోలెఁ దనదుమాతంగపతిన్. 389

క. తనపై వచ్చెడుభగద, త్తునిఁ గని నరుఁ డెదుర్కొనియెఁ దోలించి రథం
బనుమానింపక వారికి, ననూనమై ఘోరమైనయని యయ్యె నృపా. 390

—♦ అర్జునుండు రథంబు దోలించుకొని వచ్చి భగదత్తు నెదిరించుట ♦—

క. మత్తకరీంద్రారూఢుం, డత్తఱి భగదత్తుఁ జేసె నర్జునుమేనన్
హత్తించె నిశితశరముల, మొత్తము లాతండు వాని మొగి ఖండించెన్. 391

చ. ఘనశరసంహతుల్ విఱుగఁ దారిన వో భగదత్తుఁ డుగ్రుఁడై
దనుజవిరోధిని న్నరు నుదారశిలీముఖకోటి ముంచి మిం
చినకినుకం గరీంద్రమును జిందఱవందఱఁ జేయఁ గొల్పెఁ గొ
ల్పిన నది తొండ మెత్తుకొని లీలమెయిం జనె దాఁక వారలన్ 392

ఉ. అంతకునట్లు లంకెకము నందఁగ వచ్చెడుగారుఁ జూచి దై
త్యాంతకుఁ డంతలోఁ ద్వరితుఁడై యపసవ్యగతిన్ రథంబు వో
వింతఁగఁ జేసినం దెలిసి వీరవరేణ్యుఁడు ప్రక్కయేటునన్
దంతినిఁ గూల్పఁ జాలి యది ధర్మము గా దని యుండె నంతటన్. 393

ఆ. సుప్రతీక మలిగి సూరెల నుండిన, శూరవరుల నెల్లఁ జుట్టి రథగ
జాశ్వసమితిఁ ద్రోడ నఱిముఱి గావింప, నరసి నరుఁడు దాని కభిముఖుఁ డయి. 394

చ. నిలిచి శరంబు లేయునరునిన్ హరిని న్నిశితాశుగమ్ములన్
బలరిపువిక్రముం డయినపర్వతనాథుఁడు గప్పె నప్పు డం
దలిజను లెల్ల మృత్యుఖరదంష్ట్రల జిక్కినవారిఁ గాఁగఁ గృ
ష్ణులఁ దలపోయుచు న్నిలిచి చూచుచు నుండిరి పర్వతేంద్రుఁడున్. 395

ఆ. కార్ముకంబు దిగిచి కర్ణాంతకృష్టంబు, గా నొనర్చి క్రూరకాండములను
వాసుదేవుమీఁద వడి నేయ నవి వాని, మేనిమఱువు సించి మేదిని దిగె. 396

సీ. విజయుండు భగదత్తువిల్లు ముత్తునియఁ గా, సలిపి కూలిచెఁ బరిచారు నంత
నతఁ డర్కకిరణసమాయసతోమరం, బులు పదునాల్గేసి పిలుచ నార్చె
నర్జునుం డొకఁ డొక్కఁడవి మూఁడుమూఁడు కం, డ్రిక లయిపడ ద్రుంచి ప్రకటశక్తి
వరభల్లమున నాగవర్మంబు వగిలించి, వానిమై నినిచెఁ బెన్వాఁడితూపు

తే. పక్కెరం బాసి నెత్తుటఁ బరిఢవిల్లి, దంతి విఱియ మొయులకప్పు ధాతురాగ
రంజితం బగుగిరివోలెఁ గ్రాలె నచ్చోట, నెల్లవారికి వెఱఁ గావహిల్లె నపుడు. 397

మహాస్ర. అలుకం బ్రాగ్జ్యోతిషేశుం డడరి కనకదండాంచితం బైనశక్తిం
జలుకం గైకొంచుఁ గృష్ణుం జఱచుఱ వ్రేడమం జూచి వైవంగ జిష్ణుం
డలన వ్వేపార రెం డై యుడిసి పుడమిపై నీడఁబోఁ జేసి దానిన్
విలసచ్ఛత్రధ్వజంబుల్ విఱిచి దశశరావిద్ధుసిం జేసె వానిన్. 398

మత్త. కంకపత్త్రశరంబున న్మాయి గాఁడి నెత్తురు లూరుచో
జంక కాభగదత్తుఁ డత్తఱిఁ జండతోమరపంక్తులం
గొంక కేసి కిరీటముం బెడఁ గొట్టి యార్చినఁ బేర్చి నీ
వింకఁ జూపుము బీర మంచు సురేంద్రసూతి రయమ్మునన్. 399

మ. తనపై శౌరిపయిం బ్రవర్షగతి శస్త్రంబుల్ ప్రయోగించునా
తనితూణీరములున్ శరాసనము నింతల్ సేసి తా నింతలో
పున నే డెబ్బదిరెండుకాండము లొగిం బుంఖానుపుంఖంబు గాఁ
గొని మర్మంబుల నాట వైచె నృపతుల్ గొండాడఁ జండక్రియన్. 400

—♦ భగదత్తునివైష్ణవాస్త్రమునకుఁ గృష్ణుం డడ్డుపడుట ♦—

మ. భగదత్తుం డెద వైష్ణవాస్త్రమును దోషం జేసికొంచున్ జయుం
బగుదానిం దనయంకుశంబునను సంప్రాప్తింపఁ గా మంత్రముం
దగ సంధించి కిరీటిపేరురముపైఁ దాఁకంగ నేసె న్మహో
గ్రగతిన్ దిక్కులు పిక్కటిల్లురవ మెక్కన్ సర్వభాగంబులన్. 401

ఆ. సర్వఘాతి యైనపర్వతేశ్వరు వైష్ణవాస్త్ర మేగుదేర హరి నరునకు
నడ్డు గాఁగ నిలువ నది వానియురమున, వైజయంతి పోలె వఱల నయ్యె. 402

క. అది తన కవమానంబుగ, మది నెంచుచు నర్జునుండు మాధవుఁ గని నీ
కిది తగునె రథము గడపుట, కొదవియు ననిపనికి దిగుట యుచితమె చెప్పుమా.

ఆ. అస్త్రమునకుఁ జిక్కినపు డొండె వారింపఁ, జాలనప్పు డొండె చాలి నీవు
చేసి తన్నుఁ జెల్లుఁ జెల్లమి నచ్చె నా, మేటితన మెఱుంగ పోటు కృష్ణ. 404

తే. శరశరాసనములు పూని సమరమందు, నే నెసంగిన లోకము లెల్ల నొక్క
టైన నను గెల్వఁ జాలనియదియు నీకు, విదిత మిటు సేత కేమందు వృష్ణివర్య. 405

వ. అనిన వాసుదేవుం డతని కిట్లనియె. 406

సీ. వినుము చెప్పెదఁ బురావృత్తం బొకఁడు నేజ, గద్రక్షణార్థము గాఁగ నాల్గు
మూర్తు లైతి నొకండు పుడమిఁ దపము సేయు, చుండు నొకఁడు మఱియొక్కఁ డుర్విజనుల
మంచిచెడ్డ లెఱుంగఁ బొంచి యుండు మఱొండు, లలి మానుషికకర్మముల నొనర్చు
చుండు నింకొక్కటి యోగనిద్రాసక్తి, వేయేండ్లు వేగించి వెనుక లేచు

తే. నపుడు తగువారికి వరంబు లలర నిచ్చు, నరసి భూదేవి తత్కాలమందు వచ్చి
వరము వేఁడె సురాసురావధ్యుఁ డగుచుఁ, గొడుకు వైష్ణవాస్త్రమునొంది[illegible]ను

క. నరకునిరక్షార్థము నే, వర మిడి వైష్ణవ మొసంగి పంచితి భూమిన్
గురువర ! దానన్ నరకుం, డొరులకజయ్యుండ యగుచు నొప్పెం జువ్వే. 408

ఆ. వానివలనఁ బడసె దానిఁ బ్రాగ్జ్యోతిష,వల్లభుండు దానివడికిఁ జావ
కుండువాఁడు దేవుఁ డొండె దానవుఁ డొండె, లేఁడు ముజ్జగముల వేఁడు గాని. 409
వ. కావున నే నిట్లు గావించితి దీని కొండు తలంపకు ఋప్పు డిప్పరమాస్త్రవిముక్తుం
డగుభగదత్తునిం దొల్లి నేను నరకునింబోలె నఱికివైచుట నీకు సుకరం బనిన నౌఁ
గాక యని మహేంద్రనందనుండును. 410

—♦ భగదత్తుఁడు సుప్రతీకముతో నేలం గూలుట ♦—

మ. పటుకాండంబులు పర్వతేంద్రునిపయిం బాటించి కాటించి నె
త్తుటఁ జొత్తిల్లఁగఁ జేసి వాసి గలమేల్తూపొండు సంధించి త
ద్ఘటకుంభాంతరమందు వైచుటయు నాదంతీంద్ర మప్పాటునన్
స్ఫుటితాకారము గాఁగ నార్తగతులం బొందంగఁ బెల్లార్చుచున్. 411
క. సుడి దిరిగి తిరిగి భగదత్తుఁడు పూనికఁ జేసి నిలుపఁ దోఁగిన దంతీం
ద్రుఁడు వజ్రాహత మగుగిరి,వడువున ధరఁ గొమ్ము లూఁది పడి చచ్చె వడిన్. 412
చ. అపవృశ తేజుఁ డైననరుఁ డర్ధశశాంకశిలీముఖంబునన్
వెస భగదత్తువేరురము బిట్టగలంగఁ గడంక నేయుడుం
గుసుమితకర్ణికార మది కొండశిరంబున నుండి కూలున
ట్లసురుసు రై యతండు వడె నమ్ములు విల్లును వీడి క్రిందికిన్. 413
క. నరబాణంబునఁ ద్రెస్సిన, నరవరునిశిరంబు కృత్తనాళం బగుచున్
ధరఁ బడినకోకనద మను,కరణి న్వర్ణింప నగుచుఁ గడు నొప్పారెన్. 414
వ. ఇట్లింద్రనందనుం డింద్రప్రియసఖుం డయినప్రాగ్జ్యోతిషేశ్వరునినేనుంగుతోడఁ
బీనుం గై పడం జేసి ప్రదక్షిణప్రచారంబున మాఱు లేక మలయుచున్నంత
గాంధారరాజకుమారు లగువృషకాచలు లిద్దఱు నుద్దవిడిం దాఁకి పూర్వపశ్చిమ
భాగంబు లాక్రమించి పరాక్రమించుచుఁ బ్రదరపరంపరలం బ్రహరించుటయు
నర్జునుం డవక్రవిక్రమంబున. 415
తే. అలిగి వృషకునిసారథి హయచయంబు, ధ్వజము ఛత్రము రథమును ధనువు శితశ
రమ్ములఁ దిలప్రమాణఖండమ్ములుగను, గూలనేయుచు గాంధారకులను దోలె.
క. ఏకూర్గురుగ్గాంధారుల, నానరుఁ డొక్కింతలోన యమపురమునకున్
వేగొంతఁ బుచ్చె యెదురే, వానిం గననట్టిఁ డగుచు వాసి మెలంగెన్. 417
వ. అంత విరథుం డగువృషకుం డచలునిరథంబెక్కి యతండును దానునుం బూని
నానావిధాస్త్రశస్త్రంబు లేయుచు నింద్రుని వృత్రబలులుంబోలె నింద్రనందనునిం
దాఁకి వీఁకరేఁ జూపుటయును. 418

ఉ. తేరొకఁ డెక్కి యుత్కలనను దేరిపయిం బడ వచ్చువారలన్
వీరుఁడు ఫాల్గునుండు గని వేఁడి వెలార్చెడునారసం బొకం
డారసి తీసి యేసె నిమిషార్ధములోనన వార లిద్దఱున్
బోరన ప్రాణముల్ విడిచి భూమిపయిం బడి రల్లు రేఁడ్వఁగన్. 419

ఉ. తమ్ములపాటు సూచి కనుదమ్ముల నశ్రులు జాలువాఱఁ జి
త్తమ్మున నగ్గలం బయి కృధారస ముప్పతిలంగ సౌబలుం
డమ్మెయిఁ గృష్ణులం బొదువునట్టిఁడ యై చనుదెంచె నాజికిన్
ముమ్మర మైనమాయలను మున్న పొనర్చినయట్టివాఁడ యై. 420

వ. అట్లయిన శకునిమాయాప్రభావంబున లగుడాయోగుడశక్తిశతఘ్నిగదాపరిఘపట్టసముసల ముద్గరశూలకరవాలభిందివాలపరశ్వథక్షురవత్సదంతవిశిఖప్రాసకుంతాదినానావిధాయుధంబులును ఖరోష్ట్రమహిష వ్యాఘ్రసింహాసృమరసాలావృకగృధ్రకపిసరీసృపాదిక్రూరసత్వంబులును వివిధరక్షోగణంబులును వేనవే లుత్పన్నంబులై వివ్వచ్చునిం జుట్టుముట్టి బిట్టు వేధించుటయు దివ్యాస్త్రవిదుం డగునతం డొక్కింతలోన వాని నెల్ల నల్లనం జక్కడంచె నంత. 421

—♦ అర్జునుఁడు శకునితోఁ బోరి యోడించుట ♦—

ఉ. నీదుమటంది భూతలము నిండఁగ మెండుగఁ జిమ్మచీఁకటుల్
ప్రోది యొనర్చి ఘోరరవముం బొనరించి భయంబు నెంచినన్
మేదురశక్తిఁ గవ్వడి నిమేషములోనన జ్యోతిరస్త్రసం
పాదన మొప్ప సంతమసభార మడంచె న దెంతొ వింతగన్. 422

తే. శకునిమాయాబలంబునజలదచయము, నలుగడం గ్రమ్మి భయమిడ నరుఁడు భాస్క
రాస్త్రమున దానిపొడ వెల్ల నడఁగఁ జేసి, సునిశితాస్త్రంబుల న్వాని స్రుక్క నేసె.

మ. తనమాయాబల మెల్ల వమ్మగుచుఁ బోఁ దస్త్రాత్ముఁ డై సౌబలుం
డనుమానింపక ప్రాకృతుండుబలె నై హాహాకృతుల్ మూఁకలం
దొనర న్మానము వీఁటిబుచ్చి రథముం దోలించి పోయెన్ రణం
బునకుం గానిబహిఃప్రదేశమునకున్ భూపాలకుల్ నవ్వఁగన్. 424

వ. అంత నస్త్రవిద్వరిష్ఠుం డగుభరతకులశ్రేష్ఠుండు నిజకరలాఘవం బెల్లవారికిం జెల్లంబు గావించుచు నానావిధనారాచాసారంబునఁ గౌరవానీకినిం గనుపుగొట్టి మహామారుతంబు వారివాహావారంబు విరియించునట్లు తెఱలించిన నత్తాఁకున వితాకువడిననామూఁక పెనుగొండతాఁకున ద్వైధీభూతం బయినగంగాప్రవాహంబువలె రెండుమొత్తంబులై ద్రోణదుర్యోధనులమఱువు సొచ్చె నప్పు డప్పార్థునిన్ మార్కొన నొక్కండేని

పోలఁ దద్యోఁజాలినవాఁ డున్న యే వాఁడగ్గిం బడి మ్రగ్గుమిడుతలచందంబునం
జాపట్టె నట్టియెడ. 425

చ. కురువర! యేను చెప్పెద నకుంఠితగాండివచండనిస్వనం
బురుముగ దక్షిణంపుదెస నగ్గల మై జనియించి మించి మి
న్నొరయుచు నెంటఁ బ్రాఁకె నపు డుల్లము తల్లడమంద నే నటన్
సరగునఁ బోయి చాపగురుసన్నిధిఁ గల్గఁ గఁ గంటిఁ గయ్యమున్. 426

క. నరుఁ డేకాడా మొనఁ గల, నరవరు లందఱును గూడి నారాచచయం
బురుదారఁ బఱపి నీసుతు, వరసైన్యావళులఁ బాఁకిపఱఁగించి రనిన్. 427

క. కాండచయంబునఁ దెగుటల్, భండనములఁ జెల్లు నదియె పరికింప నిటన్
గాండీవజ్యారవమున, గుండెలు వగులంగఁ దెరి కురుయోధు లొగిన్. 428

చ. నరకరముక్తశస్త్రము లనారతమున్ శరభంబులో యనన్
ధరణియు నాకమున్ దిశ లుదగ్రగతిం గలయంగ ముట్టుచున్
హరుల గజంబులన్ రథచయంబులఁ గాల్వురఁ గండరించి గ
హ్వరిఁ జొరఁ బాఱెఁ బాము లెవి వట్టుచుఁ బుట్టలు సూఱునట్టుగన్. 429

ఉ. ఒక్కొకసారి పాఱునరునొక్కశరం బది యొక్కదంతి నిం
కొక్కతురంగమంబు మఱియొక్కనరుం బరిమార్చి పెర్చి నం
దెక్కుడఁ జూచినన్ శవములే యగుటం బలలంబు గోరుచున్
నక్కలుఁ గుక్కలుం దిరిగె నల్గడలన్ రణభూమి నయ్యెడన్. 430

క. కొడుకులఁ దండ్రులు తండ్రులఁ, గొడుకులు ప్రియసఖులఁ బ్రియసఖులు చూడక క
వ్వడివడికి వెఱచి పఱచిరి, వడివడి మనవారు విడిచి వాహనము లనిన్. 431

తే. అనిన ధృతరాష్ట్రుఁ డిట్లను నట్లనీకములు విఱిగి పాఱునప్పుడు కలఁతపడిన
మామకము లెట్టులయ్యె నామీఁదమఱియు, మనబలముపేర్పుదుష్కరమనితలంతు.

వ. అనిన సంజయుం డిట్లనియె నట్లు మనమూఁకలు చీఁకాకుపడి పాఱునప్పుడు మూర్ఛఁ
దేరి సంశప్తకులు నారాయణగోపాలురం గూడి వచ్చి వివ్వచ్చు ననికిం బిలిచిన
నతం డాక్షణంబున దక్షిణదిగ్భాగంబునకుం జనియె నత్తఱిపిం గని నీకొడుకు
ప్రేరణంబున మనమూఁక మరల మూఁగికొని ద్రోణునకుం దోసట యై పాండవ
బలంబులపై నురవణించుటయు భీమసేనసాత్యకిధృష్టద్యుమ్ను లయ్యుధిష్ఠిరుం బొదు
వుకొని ద్రోణుం దలపడి పోరుచుండి రప్పుడు. 433

క. ద్రోణుని రక్షింపుఁ డనియు, ద్రోణుని శిక్షింపుఁ డనియుఁ దొడరెడు రవం బా
క్షోణిఁ గురుపాండుసేనల, ద్రోణద్యూతంబు సెల్లె దుర్భర మగుచున్. 434

క. ఎందెందు గురుఁడు తఱిమిన, నందం దాపార్థతుండు నతనికి నడ్డై
పొందుపడి శౌర్యసంపద, లందఱు మెచ్చంగఁ బోరె నతిఘోరముగన్. 435

వ. ఇట్లు మహాఘోరసంగ్రామంబు ప్రవర్తించునప్పు డప్పాండవేయులు తొల్లి తమ పడినపాట్లెల్లం దలంచుకొని ప్రాణంబుల కాశింప కత్యంతామర్షంబునఁ బయిపయి నడరుటయు తాయి తాయియుం దాఁకినట్లు వారికిని మనవారికిని బోరు ఘోరం బయ్యె వినుము. 436

క. క్షితి దృష్టపూర్వ మగుచున్, శ్రుతపూర్వం బగుచు నిట్లు చొప్పడదు రణం
బతిదారుణ మని వృద్ధులు, మతి చేసిరి యట్టివేళ మానవనాథా. 437

ఆ. ద్రోణుఁ డేచి వారిరాణువపై శరవర్ష మడరఁ జేయఁ బార్థతుఁడు
గురునిమీఁద నడరి ఘోరాహవ మొనర్చె, నదియు సాటి లేని దయ్యె నధిప. 438

వ. అయ్యవసరంబున. 439

—♦ నీలుఁ డశ్వత్థామతోఁ బోరి చచ్చుట ♦—

చ. శరములు విస్ఫులింగములు చాపము లర్చులు గాఁగ నీలుఁ డన్
నరవరుఁ డగ్నివోలెఁ గురునాథజనాటవిఁ గాల్చుచుండ నా
గురుసుతుఁ డాతనిం బొడివి క్రూరశరావళిఁ గప్పి నవ్వుచుం
దరియఁగ వచ్చి యి ట్లనియె ధైర్యము శౌర్యము నివ్వటిల్లఁగన్. 440

క. నొచ్చినయిూవీరులపై, విచ్చలవిడి నీదుశౌర్యవిధ మిది యేలా
వచ్చితి నాపైఁ జూపుము, సచ్చరితుఁడ వైననీవు చాలితి వైనన్. 441

ఉ. నావుడు నీలుఁ డెంతయు మనంబున నల్కజనింప ద్రౌణినిం
జేవ దలిర్ప భల్లములఁ జేడ్పడ నేయుడు నాతఁ డుగ్రకో
పావృతమూర్తి యై వడిగ నాతనికేతన మాతపత్రముం
జే వడి నాడుచాపమును జెంచెను జండశరత్రయంబునన్. 442

తే. వాలునుం బల్కయుం గొని నీలుఁ డంత, నంతకాకారుఁ డై భూమి కవతరించి
గ్రద్దవలె ద్రౌణిశీర్షంబు గండరింప, నెంచి మీఁదికి నుంకించె నింతలోన. 443

క. కరలాఘవంబు మెఱయన్, గురునందనుఁ డపుడు వానికుండలగండ
స్ఫురితం బగుశీర్షం బొక, వరభల్లంబునను ద్రుంప వాఁ డిలఁ బడియెన్. 444

ఉ. నీలునిపాటు చూచి కడు నెంజిలి నొందుచు వంది వంది యి
వ్వేళ ధనంజయుం డిచట వీరవిహారము సేయుచున్న మ
మ్మేలుఁ గదా విపద్గతికి నేగక యుండ నటంచు నార్తు లై
జాలి వెలార్చుచున్నతఱిఁ జాలి వృకోదరుఁ డుగ్రమూర్తి యై. 445

నానావిధహేతివ్రాతంబుల నెదిరి నెదిర్చి విదిర్చి డాసి వ్రేసి త్రుచ్చి త్రచ్చి నొంచి త్రుంచి మొత్తి మిత్తివాతం బెట్టఁ దుట్టతుదకు సొమ్మసిల్లియుఁ దాఁకు పెల్లున డొల్లియుఁ ద్రెళ్లియు మల్లడిఁ గొనునవియు నై రథగజాశ్వాదులు వోవ వాలునం బలుకయుం గొని నేల కుఱికి పోలిన తెఱంగునం బోరి పోరి తెగి పడిన జోదులును నొదుఁ బోయి తోయి తండ్రీ! తమ్ముఁడా! కొడుకో! యని తనవారి నెలుంగెత్తి పిలుచుచుఁ బ్రాణరక్షాపరత్వంబునం జేసి శస్త్రంబు విడిచి కాందిశీకు లయినదుర్బలజనులుం గలిగి గడిక్కండ లయినకాలుసేతులును దూడితుండంబు లయినమొండెంబులును విశీర్ణంబు లయినశీర్షంబులును ముక్కలయినడొక్కలును గండరంబు లయినగండంబులును విడి పుడమిం బ్రొగుచువడిన కేశపాశంబులును గలపీనుంగుపెంటలును జూర్ణీభూతంబు లయినవిమానాస్థిఖురభూషణాదులును వీఁగి ప్రేఁగుప్రేవులప్రోవులును భిన్నధ్వజచ్ఛత్రచామరధనుర్బాణతూణీరాదిశకలంబులకుప్పలును బ్రేతకుల కత్యంతభయం బాపాదించుచుండ మెండుకొని నభంబు నిండినధరాపరాగంబు గజవాజినరగాత్రనిస్సరద్రుధిరమేదోమాంసవసామస్తిష్కాదులం గలిసి పంకిలం బయి కాకకంకగృధ్రసృగాలశ్వానసంసేవితం బయి మహాఘోరనాదమేదురం బయి సంగరాంగణం బతిభయానకం బయ్యె నయ్యెడ ధృష్టద్యుమ్నుండు. 448

— ధృష్టద్యుమ్నప్రభృతులు ద్రోణాచార్యు నెదిరించి పోరుట —

చ. తెఱి యిది ద్రోణుని బొడువ ధైర్యము శౌర్యము నివ్వటిల్లఁగా
సఖులుఁడు తర్మఁ జేయుఁడు రయంబున డాయుఁడు రౌతులార! నా
సఖులుఁడు తర్మఁ జేయుఁడు రయంబున డాయుఁ డటంచు వారును
స్మృతిమతి గొంతొరుం బిలిచి మార్కొని రాగుకునిన్ రయంబునన్. 449

క. సేనాపతిశాసనమున, సైనికు లొంటరులుఁ గలిసి సత్వరగతి హం
సానీకము సరసిం బలెఁ, బూనిక నా ద్రోణురథము ముట్టిరి కినుకన్. 450

క. ఆహో దుర్ధర్షుఁడు రథ, జాలముతో నష్టపడిన సైనికులు కృధా
జ్వాలలు నిగుడఁగ నాతని, పై లగ్గం గొనిరి బాహుబల మేర్పడఁగన్. 451

వ. అంత ద్రోణకృపశల్యకర్ణాశ్వత్థామసుయోధనజయద్రథవిందానువిందు లాముందఱి మూఁకం దాఁకి వీఁకం జూపి రంతలో ధనురాచార్యుం డవార్యశౌర్యధుర్యుం డై గంతుమిగిలి. 452

మ. శరసంపాతము నల్గడం బొదలఁ బాంచాలాదియోధావళిం
గర మల్క న్నొగిలించుచున్ సకలలోకఖ్యాతబాహాబల

శిరశ్శోణోజ్జ్వలుఁడై ధనుర్గుణము సుస్ఫీతధ్వనిన్ మ్రోయఁగ భూ
ధరముల్ వ్రక్కలు సేయునట్టికడిమిం దళ్కొత్తెన శ్వేతుఁగన్. 453

వ. అయ్యవసరంబున. 454

మ. ఘనశస్త్రాస్త్రగభస్తిసంచయములం గల్పాంతసూర్యాకృతిం
గొని గాండీవధరుండు మండుచు నసృఘ్ఘోరప్రదాపూర్ణమై
చనుసంశప్తకసాగరం బనికిఁ బోఁ జండక్రియం జేసి కే
తనకాంతుల్ దివి నిండఁ బొల్చె నిజయోధప్రాంతదేశంబునన్. 455

తరళము. పొలిచి ద్రోణునివాఁతఁ గూలఁగఁ బోవుసోమకసైనికా
వలికిఁ బ్రోపుగ నై శరార్చులు వాఁడి పోఁడిమి నీబలం
బుల యుగాంతముధూమకేతువుఁ బోలి కాలిచిపుచ్చె ని
చ్చలపుమచ్చర మెచ్చ నచ్చట సంచరించుచు నిచ్చమై. 456

—♦ కర్ణార్జునులద్వంద్వయుద్ధము ♦—

మ. విజయాస్త్రార్దితులై సజోదులు వడిన్ వెన్నిచ్చి ప్రాణంబులన్
నిజహస్తంబులఁ బూని ప్రేలఁగ సిగల్ నెత్రూఱ మైఁ బాఱ రా
ప్రజ లార్వం గడు నూర్చుచున్ వెఱచి యూర్ధ్వధ్యానముం జేయుచున్
స్వజనంబుం జనుదేరఁ బిల్చుచు వెసల్ సంభ్రాంతి నీక్షించుచున్. 457

ఆ. విఱిగి వీఁపుఁ జూపి వెఱచి పాఱెడివారి, క్షాత్త్రధర్మబుద్ధి సవ్యసాచి
చంపఁ డయ్యె నట్టిసమయంబునఁ గర్ణ!, కర్ణ! యనెడునులివు ప్రాలెనచట. 458

మ. విని వైకర్తనుఁ డోడకుండుఁడు ప్రజల్! వే వచ్చి నే మీకు వ
చ్చినకీడుం దొలఁగించి నైతు నని సుస్మేరాస్యుఁడై కాలపృ
ష్ఠనిరూఢధ్వని దిక్కులం దొలయఁ బర్జన్యుండు నా బాణవృ
ష్టి నితాంతం బెసఁగించుచు న్వడిఁ గిరీటిం దాఁకెఁ దాఁ గోర్చుచున్. 459

సీ. కర్ణుండు కురుహితాకాంక్షియై నరుసైఁ, బఱపె నాగ్నేయాస్త్ర మొఱపు దోఁప
నతఁడు దాని న్వారుణాస్త్రమున నడంచి, బహ్వస్త్రశస్త్రముల్ పరఁగఁ జేసె
నాధిరథియు వాని నన్నింటి నన్నింటిఁ, దగ నేసి సింహనాదంబు చేసె
నంతలో భీమసాత్యకిసారథులు తల్కి కడచి కర్ణుం దాఁకి కడు రయమున

తే. మూఁడుమూఁ డమ్ము లడరింప వాఁడి మెఱసి, కర్ణుఁ డర్జునశరముల గండరించి
ముగురుదొరలచాపంబులుమూఁడుబాణ,ములను నఱుమాఱుదునియలైపోవ నపుడు.

ఉ. కృత్తధనుష్కు లా ముగురు కీల్వడలించినత్రాఁచు లట్టిరై
తత్తఱపాటు నొందియును ధైర్యముఁ గైకొని యంతలోఁ బలన్

మిత్తికి నెత్తువచ్చి మిసిమిం జనుశక్తులు దీసి యార్చుచున్
మొత్తిరి కర్ణు నాతఁడును మూఁడుశరంబులఁ ద్రుంచె మూఁటినిన్ 461

క. అధిరథిసింహనాద మ,సాధారణగతి నొనర్చి శాతశరాళిన్
గ్రోధించి యేసె నరుపై, మాధవుపై నెదురుకొంచు మాత్సర్యమునన్. 462

మ. కినుకం గవ్వడి గాండసప్తకమునం గ్రీడించుచు న్నొంచి క
ర్ణుని శత్రుంజయు నాఱునారసములన్ భూమిం బడం జేసి యొ
క్కనిశాతేషువున న్విపాటుశిరమున్ ఖండించి రాధేయుఁడుం
గనుచుండన్ సహజన్ములన్ ముగురఁ జక్కాడెన్ జగం బెన్నఁగన్. 463

చ. అరదము డిగ్గి భీముఁడు రయంబునఁ గైకొని వాలుఁ బల్కయున్
గరుడి తెఱంగునం బఱచి కర్ణునిపక్షమువారి వీరశే
ఖరులఁ బదేన్గురం దునిమి క్రచ్చర వచ్చి రథంబు నెక్కి వి
ద్రొరకొని నొంచెఁ గర్ణుఁ బదితూపుల మావుల నేనుతూపులన్. 464

సీ. పార్షతుండును వాలుఁ బలుకయుఁ గొని పోయి, చంద్రవర్మను బృహత్క్షత్రుఁ జంపి
మగిడి రథస్థుఁ డై మఱియొక్కధను వెత్తి, కర్ణు డెబ్బదిమూఁటఁ గాఁడ నేసె
శైనేయుఁ డొండొక్కచాపంబు నడసి రా,ధేయుఁ జతుష్షష్టిసాయకముల
నొనేసి రెండింట వానివి ల్విఱిచి మూఁ,డింట బాహువు లుర మంట నేసె.

తే. నపుడు దుర్యోధనుఁడు సైంధవాస్త్రగురులు, శినివరార్ణవమున మున్గ జనెడునంగ
పతినిఁ గాచిరి సౌభద్రపార్షతనర,భీమమాద్రేయు లాశినివీరుఁ బొదువ. 465

వ. ఇట్లు పోదివినప్పు డిరువాఁగునం గలచతురంగబలంబులకును యమరాష్ట్రవివర్ధనంబును గ్రవ్యాదప్రహర్షణంబును మహారౌద్రంబు నగుయుద్ధంబు సిద్ధించె నందు.

సీ. ఏన్గు లేనుంగులనే కాక రథరథ్య,పత్తులపైఁ బడి మొత్తిపుచ్చె
రావుతుల్ తమతోడిరావుతులనె కాక, గజపదాతిరథాళి గం డడఁచిరి
రథులు రథులఁ గాక రవుతులన్ రథరథ్య,సారథులం గూలఁ జదిపి రేఁగిచి
కాలుబంటులు తమకాలుబంట్లనె కాక, హయరథేభాదుల నలుకఁ గూల్చి

ఆ. రపుడు నెత్రువెల్లి యపురూప మై పాఱె, గుట్ట లగుచుఁ దలలు నట్టలు పడెఁ
గరపదాద్యవయవఖండరాసులు దేలె, రౌద్ర మయ్యె సంగరస్థలంబు. 467

వ. అంత. 468

ఉ. భానుఁడు పశ్చిమాంబునిధిపజ్జ మెలంగుచునుండ సంజయుం
గానఁగ నయ్యెఁ గుక్కలు వృకంబులు నక్కలు మాంసభక్షణా

నూనమనోరథంబున మహోన్నతరావ మెసంగ నార్చుచుం
బీనుఁగుపెంటలం దిరిగెఁ బెల్లడరెం గడలం బిశాచముల్. 469

వ. అట్టియెడ నుభయసైన్యాధిపతులును దమతమసైన్యంబులం దివియించుకొనినంత మనవా రర్జునునికోర్కుల కోహటించియు నాచార్యుని ప్రతిజ్ఞాభంగంబునకుం బరితపించియుఁ జింతాభరదోదూయమానమానసు లయ్యును బెరవారు ఫాల్గునునిపరాక్రమంబు వినుతించియు వానిపై వాసుదేవునకుం గలయనుగ్రహంబున కభినందించియు నానందకందళితహృదయారవిందు లయి క్రందుకొని నిజశిబిరంబులకుం బోయి రని చెప్పిన నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు సెప్పు మని సూతు నడుగుటయును. 470

—♦ ఆశ్వాసాంతము ♦—

శా. నీపాదంబులు నిల్పి నెమ్మనమున న్నీసేవ గావించుచున్
నీపై నమ్మిక చేసి ప్రోవు మనుచున్ నిత్యంబుఁ బ్రార్థించినన్.
నాపై నింతకృపారసంబు గలవై నల్వొంద వో తండ్రి! నే
నేపాపంబుఁ బొనర్చినాఁడనొ కదే యేజన్మమం దేనియున్. 471

గద్యము.

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందు
ద్రోణపర్వంబునఁ బ్రథమాశ్వాసము.
శ్రీ శ్రీ శ్రీ



శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః

# శ్రీకృష్ణభారతము

## ద్రోణపర్వము - ద్వితీయాశ్వాసము.



శ్రీమద్భారతరచనా
వ్యామోహముతోడ నున్నవాని న్నన్నుం
బ్రేమింప కట్లు చేసిన
నీమీఁదన్ భక్తి విడుతునే భువనేశా. 1

### అభిమన్యువధపర్వము

వ. అక్కురుకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు విడిదలకు వచ్చి మాపు
పుచ్చి మఱునాఁ డరుణోదయంబున లేచి నీకొడుకు విషాదవివర్ణవదనుండై ప్రణ
యాభిమానంబులు తనమనంబున బెనంగొనఁ గుంభసంభవుఁ గని సంరబ్ధుండై
యెల్లయోధులు నాకర్ణించుచుండ నవకర్ణించుచు నిట్లనియె. 2

ఉ. నిక్కము గాఁగ మే మిపుడు నీకు విరోధుల మేము కానిచో
దక్కఁ సదాయఁ బో విడిచి తచ్చసలాడు నె నీవు పూనితే
నొక్కఁడు దప్పి పోవఁ గలఁడో సుర లైనను నీ కిలంతు లో
చక్కఁ వరం బొసంగియుఁ బొసంగఁగఁ జేయక యున్కి యొప్పునే. 3

క. వర మిడి భక్తుల కార్యాలు, ధర నాశాభంగ మైనదారి మెలఁగ రో
ధరణీసురేంద్ర! నిన్నే,కరణి న్వాక్రువ్వ నేర్పు గలనో చెప్పుమా. 4

వ. అనిన లజ్జితుండై చాపజ్ఞుం డాతని కిట్లనియె. 5

ఉ. నీకుఁ బ్రియంబ కూర్చుటకె నిల్చిన న న్నిటు లాడ నొప్పునే
లోకములన్ సురాసురులలో నొకరుండును బార్థరక్షితుం
డై కొని గెల్వఁ జాలఁడు జగత్పతి తోడయి యుండె వానితో
నా కన నేల మూఁడునయనంబులవానికిఁ బోర శక్యమే. 6

మ. నిజమే పల్కెద నాదుపల్కు లనృతాన్వీతంబు లై కావు బా
హుజ! యిట్లేటికిఁ జెంద నాఁడెదవు నావ్యూహప్రభావంబు నా
భుజశక్తిం గను మిప్డు చెందఱు ఘనుల్ పోఁ గాడి పో నుందురో
ధ్వజినీచక్రము లేమి యే మగునొ యభ్యామర్ద మె ట్లొప్పునో. 7

ఆ. ఎట్టులేని పన్ని యిహ వర్జునుని నేఁడు, నొంచువలని కేగి యుండునట్లు
సలుపు మతఁడు వివిధసమరరహస్యముల్, దెలిసినట్టివాఁడు దివ్యుఁ డరయ. 8

మ. అని ద్రోణుండు వచించుచున్నతఱి శౌర్యం బొప్ప సంశప్తకుల్
విని మే మప్పని కొప్పికొంటి మని యువ్విష్వాచ్ఛునిం జిష్ణుకున్
జను దేఁ జీరిరి భూరితేజుఁ డతఁ డాసంఘంబుతో దక్షిణం
బునకుం బోయి పెనంగె నట్టిరణ మొప్పుం జూడ రెవ్వారున్. 9

వ. ఇట్లర్జునుం డొండువలనికిం బోయి యున్నంత నిక్కడ ధనురాచార్యుండు సర్వసే
నాసమేతుం డై భండనంబునకుం జని పద్మవ్యూహంబు పన్ని తాను మధ్యందిన
మార్తాండునిమాడ్కి మండుచు మధ్యంబున నుండుటయుఁ బాండవులును యుద్ధ
సన్నద్ధు లై వచ్చి హెచ్చియున్న యమ్ముగ్గరంబు భేదింపనేర కున్నంత నభిమన్యుం
డామోహరంబు సొచ్చి దుష్కరకర్మం బాచరించి వేనవేల వధించి వీరాగ్రేసరు
లార్వు రొక్కపెట్టఁ జుట్టుముట్టి నప్పుడు నాశ్వాసనివశంగతుం డై వసుంధరం బడి
ప్రాణంబులు వాసె నని చెప్పిన విని ధృతరాష్ట్రుండు. 10

ఉ. పెక్కురు చుట్టుముట్టి యటు పిన్నవయస్సున నున్నవాని స
ట్లక్కటికంబు లేక తెగటార్చిరి నా వినినంత వ్రక్క లై
పొక్కెడు నామనం బిపుడు ముద్దులమన్మనిఁ జంపుకొంటి నే
నక్కట క్షత్రధర్మ మరయన్ ధరయం దొకక్రూరకర్మమే. 11

తే. వగవ నేటికి సంజయా! తెగినదాని, కస్మదీయులు రాజ్యప్తు లగుచుఁ బదుగు
రొక్కనిం దాఁకి పోరుట యొప్ప దయిన, విందు నాతనిరణ మెట్టిచందమయ్యె. 12

— ద్రోణునిమూఁడవనాఁటియుద్ధము —

వ. అనిన సంజయుం డిట్లనియె నట్లు వచ్చినసౌభద్రునిపరాక్రమంబు సెప్పఁ గొలం
దిగా దలంచుకొల్తల సేయ మనమూఁక దావానలంబు ముట్టినశుష్కగుల్మలతా
వృతవనంబుపోలె సేవు తఱిఁగె నక్కుమారుండు సర్వగుణసంపన్ను లయినపాం
డవులకును గృష్ణునకునుం బోలినవాఁ డండు ధైర్యంబున యుధిష్ఠిరునకును సచ్చ
రిత్రంబునఁ గృష్ణునకును భీమకర్మంబున భీమసేనునకును శ్రుతరూపవిక్రమంబుల
శ్వేతవాహనునకును వినయాతిశయంబున నకులసహదేవులకును సాటివచ్చినవాఁ

ఢట్టివానిమరణం బెట్టివానికిని దుఃఖంబుఁ బుట్టింపక మానదు నీవు ధైర్యంబున దుఃఖధారణంబు సేసి సమరప్రకార మాకర్ణింపు మట్లు భారద్వాజుండు పన్నినపద్మవ్యూహంబున వివిధదేశాధీశులుం దళంబులై యుండిరి ద్వారస్థానంబుల రక్తమాల్యాంబరాభరణభూషితులును రక్తచందనాగురుదిగ్ధాంగులును రక్తపతాకాభిశోభితులునునగు రాజపుత్త్రులు పదివేగురు లక్ష్మణకుమారుం బురస్కరించుకొని కింజల్కంబులై యుండిరి సైన్యమధ్యంబునఁ గర్ణదుశ్శాసనకృపప్రముఖమహారథపరివృతుండై దేవరాజోపముండైనకురువిభుండు శ్వేతచ్ఛత్రపతాకాంచితుండై కర్ణికయై యుండె నిట్లభేద్యక్రమంబైన మహావ్యూహంబునగ్రభాగంబున శ్వేతాతపత్రప్రభాభాసురాంగుండై చాపాచార్యుం డుద్యతకార్ముకుండై యుదితార్కుం గ్రేడించుచు నిలిచి యుండె దానిద్వారదేశంబున సైంధవుండును వానికిం గావలియై కృపాశ్వత్థామకృతవర్మశకునిభూరిశ్రవశ్శలశల్యాదులుం గాచి మోహరించి కయ్యంబునకుఁ గట్టాయితంబై యుండు నంతఁ బాండవపాంచాలసృంజయాదియోధులైన ధృష్టద్యుమ్న ధృష్టకేతు చేకితాన సాత్యకి సౌభద్ర కుంతిభోజ ద్రుపద విరాట క్షత్రధర్మ బృహత్క్షత్ర మాద్రేయ ద్రౌపదేయ కేకయ ఘటోత్కచ శిఖండి యుధామన్యూత్తమౌజఃప్రభృతులు యుధిష్ఠిరభీమసేనపురస్సరులై వచ్చి భారద్వాజుం దాఁకి పేఁకమెయి నానావిధాయుధంబులం దీర్చి పేర్చుటయును. 13

శా. భారద్వాజుఁ డసంభ్రముం డగుచు శుంభచ్ఛౌర్యసంరంభుఁ డై
చేరన్ వచ్చినపాండవేయబలమున్ శీఘ్రప్రచారంబునన్
సారానేకమహాస్త్రశస్త్రములఁ దీక్ష్ణత్వంబు గాన్పించుచున్
భూరిక్ష్మాధర మొక్కయేటికడిమిం బోలె న్నివారించుచున్. 14

క. మున్నీటి వేల వోలెన్, గ్రన్నన నరిసైన్య మెల్లఁ గదలక యుండన్
గన్నాకు ద్రోణుఁ డాఁగెన్, ఖిన్నతకై నొచ్చి రెల్లఁ గింకిరిపడుచున్. 15

—◆ ధర్మరా జభిమన్యునిం బిలిచి పద్మవ్యూహంబు ఛేదింపఁ బుచ్చుట ◆—

ఉ. మూఁకలు పేఁకఁ జూపుగుటపాంత నొకింతయు నిల్వలేక చీ
కాకుపడన్ యుధిష్ఠిరుఁడు గన్గొని పెక్కుతెఱంగులం దగం
జేకొని చింత చేసి యెటు చేసిన నోపమి నిశ్చయించి లో
కైకధనుర్ధరుం డగునరాత్మజుపై నిడ నెంచె భారమున్. 16

వ. అట్లెంచి కృష్ణార్జునులకుం బోని యభిమన్యుకుమారుం బిలిచి యి ట్లనియె 17

చ. నరుఁ డరుదెంచెనే మనల నవ్వనిమార్గము సూడు మివ్వసుం
ధర నరుఁడున్ మరుండును జనార్దనుఁ డీవును గాక యిట్టిచో

గ్గరము బడల్పడన్ జలుపఁగాఁ గలయేనవవాఁడు చూడరా
డరయ వరంబు నీవలన నందఁగ నుండిరి జోదు లందఱున్. 18

ఆ. ఎక్క టెక్కటి నగునీయొద్దన మగల్చి, కూల్చి పగఱ నీకుఁ గూర్చుతండ్రు
లకును మేనమామలకును సైనికులకు, హితముఁ గూర్పఁ దలఁపు మిపుడు తండ్రి.

వ. అనిన నభిమన్యుండు తండ్రి కిట్లనియె. 20

ఉ. తండ్రులకుఁ జయంబు నెడఁదం దలపోయుచుఁ దమ్మిమొగ్గరం
బాండ్రయి శాత్రవుల్ గన నొకంతన వచ్చి పరాక్రమింతు మా
తండ్రి ప్రవేశముం దెలిపె దాన బయల్పడుచొప్పు దెల్పఁ డే
వాండ్రకు లోఁగ నెట్లదరు వచ్చినఁ గాని నరేంద్రచంద్రమా. 21

వ. అనినంత యుధిష్ఠిరుం డిట్లనియె. 22

ఆ. తెఱపి చేసి నీవు తెగి ప్రోమ్ము మేము నా,దారివెంట నిన్నుఁ దఱిసి వత్తు
మెట్టిడెప్పరంబు పుట్టనీయము నీపి,ఱుందఁ గాచుచుందు మిందఱ మట. 23

వ. అంత భీమసేనుం డిట్లనియె. 24

ఉ. నేనును బార్షతుండును శినిప్రవరుండును మత్స్యకేకయుల్
లోనగుజోదు లందఱ మలోలమతి న్నిను నంటి వత్తు మీ
లోన మొనం దెరల్చుచు వెలుంగుము నాలుగుదిక్కు లేము బా
ణాసలసన్నిపాతముగ నంటి దహింతుము దాని నంతయున్. 25

వ. అనిన నభిమన్యుండు వెండియును. 26

ఉ. పాండవవంశ్యమం దయినబాలుఁ డొకం డఖిలావనీశులన్
భండనమం దమందగతిఁ బట్టి వధించి పరాక్రమంబునన్
దండికి నెక్కె నంచు విబుధప్రకరంబు నుతింప ద్రోణును
ద్దండచమూసమూహమును దండ్రులు మామలు మెచ్చఁ జొచ్చెదన్. 27

క. మాతాపితృవంశము లీ,భూతలమునఁ గీర్తిఁ గాంచ భూరిభుజబలో
పేతుఁడ నై నేఁ బద్మ,ఖ్యాతవ్యూహంబు సొచ్చి కయ్య మొనర్తున్. 28

ఉ. ఇవ్వగ నైనమోహరము నేఁ జొరఁ బాఱి రిపుక్షయంబు గా
జివ్వ యొనర్చి నాదయినచేవడి లోకము సూది మెచ్చుకో
నివ్వటిలంగఁ జేయుటకు నేరనివాఁ డయి యూరకుందు నేన్
గవ్వడికిన్ సుభద్రకును గాదిలిబిడ్డఁడఁ గాక పోయెదన్. 29

వ. అని పలుకుచున్నసమయంబున ధర్మనందనుండు నందనుం గాంచి వత్సా ! పురుష
వ్యాఘ్రరక్షితం బై దురాసదం బైనద్రోణానీకంబు భేదింపఁ గడంగి పలుకుచున్న

నీకు బలోత్సాహశౌర్యధైర్యంబులు వర్ధిల్లం గాక పోయిరమ్మనిన నభిమన్యుండు సారథిం జీరి సుమిత్రా! మనరథం బవితథం బగురయంబున ద్రోణానీకంబుపైఁ బఱపు మనిన నతం డతని కిట్లనియె. 30

మ. అతిభారంబు భవచ్ఛిరంబు పయి మోయం బెట్టి రిప్పాండవుల్
మతి నీచాలమి నెంచుకొంచు నరికిన్ మా యోడు మాచార్యుఁడో
కృతహస్తుండు కృతశ్రముండు కృతియున్ గీర్తింప నీ వన్ననో
కృతి వైనం గడుబాలుఁడై నసుఖసంవృద్ధుండ వై తారయున్. 31

వ. అనిన సౌభద్రుండు సుమిత్రుం జూచి. 32

ఉ. ద్రోణుఁ డనంగ నెంత యొకతూకునఁ గైకొని పోకడంపఁ గాఁ
ద్రాణ గలాఁడ క్షాత్త్ర మిది తక్కువ లెక్కకు రాదు సర్వగీ
ర్వాణులతోఁ బురందరుఁడు భద్రగజంబును నెక్కి వచ్చినన్
స్థాణుఁడు చిచ్చుకన్నొలయ దాఁకిన పేఁక నెదుర్పకుందునే. 33

ఆ. పలుక నేల పెక్కుపలుకులు కృష్ణుండు, జిష్ణుఁ డొక్కఁ డగుచుఁ జివ్వ కెత్తి
వచ్చిరేని వారివలన భయంబును, గొనక పెనఁగి గెలుతు నని వచింతు. 34

చ. బెదరకు మీవు చిత్తమున విద్విషసైన్యమి చెల్లఁ దెల్ల గా
మదిఁ దలపోయ నాకుఁ గళమాత్రకుఁ జాలమి నీ వెఱుంగవో
పద పద మంచు సూతజునిపల్కులు సల్కులు వమ్ముసేయుచుం
బదరిన నొండు పల్కక నుమానము మానసమును గలంపఁగన్. 35

తే. ఆసుమిత్త్రుఁ డప్పుడు త్రిహాయనములవయ,సున నెసంగుచుఁగాంచనంబున నలంక
రింపఁబడి చూపఱకు నింపుఁ బెంపఁ జాలు,వారువంబులఁ దోలె నావంక కరుగ. 36

వ. ఇట్లు రవడించి సువర్ణకర్ణికార కేతనంబు గ్రాల యుయుత్సుం డై శుండాలతండం బుపైఁ గవియుసింహకిశోరంబుచందంబునఁ బరవసంబు సేయుచుఁ దఱియ వచ్చు విన్వచ్చునిపట్టిం గనిపట్టి మనవారు భారద్వాజపురస్సరు లై యుండియు నొండొరులం దలమిగిలి తలపడి సంప్రహారం బుపక్రమింప నుండి రప్పు డొక్కముహూర్తమాత్రంబు సైన్యసంచయంబు గంగాప్రవాహసంగత సాగరంబుభంగి సభంగురం బై యుండె నంత. 37

ఉ. జోదులు తాఱుమాఱుకొని జోరున నారసముల్ నిగుడ్చుచున్
మీఁదికి వచ్చుపార్థసుతుమీఁద నెదిర్చిన నాతఁ డుగ్రుఁ డై
ప్రొద్దిని వోలెఁ దేరు మెఱయ న్సొరయించుచు నారి మోహరం
బాదరి నీదరి న్బడెడున ట్లొనరించుచుఁ జంచె మోమునన్. 38

భద్రాకారుం డగుసౌభద్రునిదెస స్యందనంబు పఱవం జేసెన్. 40

ఆ. అపుడు గురుఁడు సూచి నృపతులదెసఁ జేయి, వీచి యోధులార! వెడలె రాజు
విజయతనయుఁ డాఁక వెస మీరు వానికి, నడ్డు పడుఁడు పగతు నాఁగఁ జనుఁడు.

వ. అని తాను వానిమీఁదఁ గవియుటయును. 42

మ. శలుఁడున్ శల్యుఁడు సోమదత్తియుఁ గృపాశ్వత్థాములుం గర్ణసౌ
బలహార్దిక్యబృహద్బలప్రభృతులున్ బాహాబల ప్రౌఢి పెం
పొలయన్ బాణపరంపరాహతుల నొండొంటన్ వడిన్ దాఁకున
ట్టులు సౌభద్రుని నేసి దంతిపురరాట్టుం గాచి రంచద్గతిన్. 43

క. పులినోటికండఁ బెఱికిన, చెలువున సౌభద్రు బాఱిఁ జెల్లెడురాజుం
దొలఁగించి కాచి ప్రోచిరి, విలుకా రందఱును గూడి విక్రమ మెసఁగన్. 44

చ. పలువురు చుట్టుముట్టి యటు బాధశరాహతి బిట్టు నొంచినం
గలఁగక క్రాష్ణి నోటఁ బులి కండను గైకొని మ్రోఁగునట్టు లా
డులు బిగియించి హుమ్మని కడుంగడు రోఁజుచుఁ బాణవర్షమున్
జిలుకుచు నెల్లరం దఱిమి చేసెను వాసిగ సింహనాదమున్. 45

తే. అట్లు సాశ్వసూతమహారథాళిఁ దోలి, యామిషార్థి యై హర్యక్షు మఱి[illegible]ట్లు
సింహనాదంబు చేసినశ్వేతవాహ, నాత్మజునిమీఁద ద్రోణాదు లాగ్రహించి. 46

—♦ దుర్యోధనాదు లందఱు నొక్క పెట్ట యభిమన్యునిపైఁ బడుట ♦—

ఉ. అందఱు నొక్కయుమ్మడి నరాత్మజు ముట్టి శితాస్త్రపంక్తులన్
దందడి పుట్ట నేయుటయు దానికి నల్గి సుభద్రసూనుఁ డ
య్యందఱ బాణముల్ నడుమ నట్టేటు లై తెగ నేసి వారలన్
ముందఱ నిల్వనీనిగతి ముంచె శరావళిఁ జూప రెంచఁగన్ 47

శా. దానం గోపితు లై భవజ్జనులు సంద్రంబట్టు లుప్పొంగి శా
తానంతాశుగసంతతుల్ నఱపి పార్థాత్మోద్భవుం జంపువా
రై నల్దిక్కుల నంటి వచ్చుటయు బాహాశౌర్యధుర్యుం డతం
డానందంబున నాఁగె వారల నొకం డై సంద్రము న్వేలనాన్ 48

వ. అట్లు ఘోరంబుగాఁ బోరుచున్నయెడ నన్నరాత్మజుం దాఁకి. 49

సీ. కృపుడు మూఁడమ్ములు కృతవర్మ సప్తశరములు శల్యుం డాఱుప్రదరములును
ద్రోణుండు పదునేడుదొడ్డబాణమ్ములు, ద్రోణపుత్రుం డేడురోపములును
దుర్యోధనుఁడు మూఁడు తూపులు దుశ్శాసనుండు పండ్రెండు మేల్కాండములును
సౌబలుండును రెండుశాతసాయకములు, భూరిశ్రవుఁడు మూఁడునారసములు

తే. దుస్సహుండు డాఱుమూఁడుపత్త్రులు బృహద్బ, లుండు నెన్మిదిభల్లంబులును వివింశ
తియును డెబ్బదివిశిఖముల్ తీసి వాస,వాత్మజునిసూతిపై నేసి రార్పు లెసఁగ. 50

మ. అభిమన్యుండును మన్యువేగమున నయ్యస్త్రాళి వారించి దో
ర్విభవం బేర్పడఁ జాపహస్తుఁ డగుచున్ నృత్యంబు గావించున
ట్లభయుం డై నడయాడుచున్ రణమునం దయ్యందఱ న్నొంచె స్వ
ర్గభవుల్ మెచ్చఁగ మూఁడుమూఁడు నిశితప్రక్ష్వేడనంబుల్ విడన్. 51

క. శిక్షాభ్యాసకృతబలం, బక్షీణం బగుచు నుండ నార్జుని కడిమిన్
లక్షింపఁ జేసె నాశుగ,పక్షము లగువారువముల పౌరుషత్వమునన్. 52

ఆ. మాఱుమలయువారు మాట కేనియు లేమిఁ, గోలుమసఁగి యున్నకాలమందుఁ
గార్ష్ణి దశరములఁ గారించి నిలునిలు, మనుచు నాఁగె నశ్మకాత్మజుండు. 53

వ. అంత నయ్యభిమన్యుండును. 54

మ. పదిబాణంబుల నశ్మకాత్మజుని బాహాలన్ ధనుర్వర్యమున్
విదితం బైనపతాకయున్ రథకుటుంబిన్ దున్మి బాహాద్వయిన్
మొదలంటం దెగనేసి శీర్షమవనిం బొర్లాడఁ గాఁ జేసినం
జెదరెన్ నీబల మెల్లదిక్కులకుఁ గాసిం జెందియుం గుందియున్. 55

వ. అంతలోనం గర్ణాశ్వత్థామకృపద్రోణశాబలశలశల్యభూరిశ్రవఃకార్థసోమదత్త
వివింశతి వృషసేన సుషేణ కుండభేది ప్రతర్దన బృందారక లలిత్థ ప్రబాహు
దీర్ఘలోచననులు దుర్యోధనపురస్సరంబుగాఁ బురికొని వచ్చి వివ్వచ్చునిపట్టిం
జుట్టుముట్టి నానావిధాస్త్రశస్త్రంబుల నవయం జేయుటయు నక్కుమారుం డుక్కు
మిగిలి పెక్కుబాణంబు లొక్కమొగి నేసి యెల్లర నొత్తుటఁ జొత్తిల్లం జేసి
రాధేయుపయి నురవడించి. 56

—♦ అభిమన్యునితోఁ బోరి కర్ణుండు మూర్ఛితుం డగుట. ♦—

మ. శరమొక్కం డరివోసి యేసిన మహాశబ్దంబు రోదోంతర
స్ఫురితం బై పఱతేరఁ గా నది రయంబుం గొంచుఁ దద్వక్షముం
గరిమన్ వ్రచ్చి నిమేషమాత్రమునఁ దద్గాత్రంబునం దూఱి పో
యి రిరంసన్ జొరఁబాఱె ధారుణి భుజంగేంద్రంబు పుట్టం బలెన్. 57

ఆ. దాన వివశుఁ డగుచు మానటి కర్ణుండు, భూమికంపమందు భూధరంబు
వలెఁ జలించి రథముపయి వ్రాలె నొక్కింత, కూబరంబు నూఁతఁ గొనుచు నంత.

ఆ. మూఁడు నిశితబాణములు పూని దీర్ఘలో,చనునిఁ గుండభేదినిని సుషేణుఁ
జావనేసి యార్చె శతమన్యుపౌత్త్రుండు, దిక్తటంబు లద్రువఁ బెఱుల బలము. 59

క. ఆలోనం దెలిసి కర్ణుఁడు, వాలాయం బలిగి పాండవకుమారునిపైఁ
బోలఁగ నిరువదిమై దగు,వాలికతూపులును వైచి వాచవిఁ జూపెన్. 60

మ. ధనురాచార్యునిసూనుఁ డిర్వదిమహాస్త్రంబుల్ ప్రయోగించి నొం
చినమీఁదం గృతవర్మ సప్తశరముల్ చేవాడిమై నేసినన్
గని సౌభద్రుఁడు రుద్రుఁడో యనఁగ నై కన్పట్టి కోపారుణా
ననముం జూపఱకున్ భయంబు గొలుపన్ వర్తించె నవ్వర్తనిన్. 61

ఆ. చాపహస్తుఁడైనసవ్యసాచిసుతుండు, పాశహస్తుఁడైనప్రళయకాలుఁ
డనఁగ నలిగి దఱియ నగుశల్యుఁ శరవర్ష, మునను ముంచి యార్చె జనము దలఁక

తే. శల్యుఁ డట్లస్త్రవిద్ధుఁడై స్యందనమున, నొఱగఁబడి సొమ్మసిల్లిన తెఱఁగుఁ గాంచి
బెగ్గడిలి మూఁక లెల్లను పెల్లగిల్లె, గురుఁడు గనుచుండ హరిఁ గన్న హరిణము లన.

క. దివి దేవసంచయంబులు, భువి భూతగణంబు లెన్నఁ బురుహూతసుతో
ద్భవుఁ డాజ్యసిక్తహుతవహు,నివలెన్ వెలిఁగెన్ రణావనీభాగమునన్. 64

తే. అనిన ధృతరాష్ట్రుఁ డిట్లను నట్లు మూఁకఁ, బట్టి పాలార్చునర్జునుపట్టి మనమ
హారథులలోన నొక్కఁడు నైన నాఁగ, నోపినట్టిఁడు లేఁ డయ్యె నోటు చెపుమ. 65

చ. అడిగిన సంజయుం డనియె నంతయుఁ జెప్పెద నాలకింపు మ
ప్పుడు రథకూబరంబునను మూర్ఛితుఁడై పడి యున్నశల్యు నే
ర్పడఁ గని వానితమ్ముఁడును బార్థకుమారుని మాఱుకొంచుఁ బెం
జడివలె నంపఱన్ గురియ సాఁగిన 'వేఁగని విక్రమంబునన్. 66

వ. విజృంభించి విజయాత్మజుం డత్యంతలఘుహస్తుండై శల్యానుజుం బొదివి. 67

మ. సిడముం ద్రుంచి త్రివేణుకల్పములతో శ్వేతాతపత్త్రం బిలం
బడఁ గావించి హయంబులం దునిమి చాపంబున్ నిషంగంబులున్
గడికండల్ పొనరించి చక్రము లుపాకర్ణాదులుం ద్రెంచి తే
రిడియం జేసి నియంత నేసి వడితో నీల్గించి తద్గోప్తలన్. 68

తే. కాలుసేతులు దెగనేసి కడకు సిరము, దఱుగ నాతఁడు పెనుగాలి ధరణిరుహము
తెఱగునం గూలె ననుచరుల్ తెఱలి చనిరి, మేలు మే లనిల భూతముల్ మెచ్చె నరజు

వ. అట్లు శల్యభ్రాతభూతలంబునన్ బడిన వానిసైనికు లెల్లరుం బెల్లుఱేఁగి కులాధి
వాసనామధేయంబులు దెలుపుకొనుచు నినుమడించినకోపంబునం బేర్చియా
ర్చుచు నహంకారంబులును హుంకారంబులును జ్యాతలనిర్ఘోషంబులును సింహ
నాదంబులును జేయుచు నేము బ్రతికియుండ నీవు బ్రతికి పోవ లే వనుచెలుంగు
లెసఁగఁ బొంగి గంగాప్రవాహంబువలె నాసౌభద్రుం దాఁకుటయు నవ్వీరవర్యుండు

ధైర్యధుర్యుండై సవ్యచునవ్యాసుదేవధనంజయానుగ్రహలబ్ధ ధనుర్విద్యాప్రభా
వం బేర్పడ శరత్కాలసవితృమండలంబువోలె మండలీకృతకోదండుండై మెండు
కొని చిత్రమార్గపాతాదిగతుల నస్త్రప్రయోగంబు సేయుచు మహాశనిసమం
బగుజ్యాతలనిర్ఘోషంబున దిశాతలంబులు బీటలు వాఱించుచు క్ష్వేళారావంబులు
నిగిడించుచు మృదుపూర్వంబును దారుణాంతంబుగం బోరుచు నాచార్యాదులు
సూచుచుండ క్షురప్ర వత్సదంత విపాఠార్ధచంద్ర భల్లాంజలికాదినానావిధ
బాణపరంపరల రథానీకంబుపై వీఁకం జేసి యేసి మనవారి నెల్లం బరాఙ్ముఖులం
జేసె ననిన ధృతరాష్ట్రుండు సంజయుదిక్కు మొగంబై. 70

చ. మనుమనిబీరముల్ వినినమాత్రమునన్ మితి లేని మోదమున్
మనదొర లిట్టు లేందులకు మాలినవా రయి రన్న ఖేదముల్
మనమున రెండుపాయంలయి మట్టునమీఱుఁ గుమారవిక్రము
డనఁబడువానిపోరితమ దంతయుఁ జెప్పుము నాకు సంజయా! 71

తే. అనుడు సంజయుఁ డిట్లను నట్లు చుట్టు, వాఱ నరదంబుఁ ద్రిప్పుచుఁ బాఱనీక
కొఱవిఁ ద్రిప్పినతెఱఁగునం గూడ నంటి, పిన్నపెంటలు గాపించెఁ బెద్ద సేన. 72

వ. అప్పుడప్పార్థనందనునికోలుతలకోహటించి ద్రోణకృపాశ్వత్థామకర్ణశల్యభోజబృహ
ద్బలసోమదత్తి సౌబల సుయోధనప్రముఖమహారథోత్తము లందఱు నానందంబతి
పరిపరివిధంబులం బఱచుచుండునంత నాచార్యుండు హర్షోత్ఫుల్లలోచనుండై నీకొ
మరునుల్లంబునకుం దాఁకి రాఁ గృపాచార్యుం బిలిచి యి ట్లనియె. 73

—◆ ద్రోణుఁ డభిమన్యు నగ్గించి పలుకుట ◆—

ఉ. కొండికవాఁడు వీఁ డొకఁ డకుంఠితవిక్రమ ముల్లసిల్ల మా
ర్తండునిరీతి మండుచును దండ్రులుఁ దమ్ములు నిష్టబంధువుల్
నిండుగ సంతసింపఁగ ననిం బొనరించెడు వీని కుద్ది యై
యొండొకరుండు విల్లు గొని యుండనిమాట నిజంబు సెప్పితిన్. 74

క. తలఁచిన నొకపెట్టన మన, బలగంబుల నెల్ల నేలపాలుగఁ జేయం
గలఁ డీసౌభద్రుం డటు, తలఁపఁడు యీచిఱుతకరుణ తలమే పొగడన్. 75

వ. అని సుభద్రానందను నగ్గించి పలికినభారద్వాజునిపలుకులు ములుకులై చెవులు
సోఁక నలిగియుం బయికి నగుచు నీనందనుండు కర్ణశల్యబాహ్లీకదుశ్శాసనులు విన
ని ట్లనియె. 76

శా. విల్లుం బట్టినవారి కెల్ల గురు వీవిప్రుండు తా నల్గినన్
ముల్లోకంబుల లే డొకం డెదుర నీయూఢాత్ముని జంపఁ గా

నొల్లం డర్జునపుత్రుఁ డాట మదిఁ బేర్కో శిష్యవాత్సల్యముల్
దెల్లం బింతయు ఛాత్రపుత్రులు ప్రియుల్ దేహాద్యభువుల్ వోలె నై. 77

క. కసుగందుఁ బెద్ద సేయుచు, గొసరక పొగడుచు నుపేక్షఁ గొని యిరుఁ దుంటల్
పసి మించుఁ దనదుపౌరుష, మసదృశ మని పొంగు వీని నదుముఁడు వీరుల్. 78

తే. అని వచించిన నందఱు ననుమతించి, సాత్వతీపుత్రు మార్కొన సత్వరు లయి
చనఁగ నుండినయపుడు దుశ్శాసనుండు, వారి వారించి నన్నతోఁ బలికె నిట్లు. 79

చ. వినుము నరేంద్ర! నే నొకఁడ వీనిని రాహు వహస్కరుం బలెం
గొని కబళింతు నింతటన గొంతికుమారులు సూచుచుండ నీ
తనిమృతి విన్న నన్నరుఁడు దైత్యహరుండును బిట్టు సత్తు ర
ప్పని గని ధర్మజాదులు నవశ్యము సచ్చెద రొక్కపూఁటలోన్. 80

క. విజయమునకు మూలం బీ,విజయసుతుం జంపు టరయ వెస బంపుము నే
ను జయించి వత్తు నరి నని, గజిబిజి గా నార్చి తాఁకెఁ గవ్వడితనయున్. 81

తే. అల్లు శరవర్ష మొలుకుచు నరుగుదెంచు, దుస్ససేనుని జిష్ణుపుత్రుండు గాంచి
తిగిచి యిరువదియాఱమ్ము లెగిచి యేసి, వానిమే నంతయును నెత్తురువఱ్ఱ చేసె. 82

ఉ. నెత్తురు లూరుచుండినను నేరుపు పెంపున దుస్ససేనుఁడున్
మత్తగజంబుచందమున మార్కొని పేర్కొని పోరె వారికిం
గ్రొత్తవిధంబునన్ రణము కొంతటిలోపల నెంత యేని మై
చిత్త మెలర్పఁ జేసె రథచిత్రగతాగతమండలాదులన్. 83

వ. అట్టియెడం గొంతవడికి దుశ్శాసనుండు శరవిక్షతగాత్రుం డై కాలు సే యార్పనేర
కున్నంతం గని ధీమంతుం డగునవ్వాసవిసుతుండు నవ్వుచు నతని కి ట్లనియె. 84

క. శూరంమన్యుఁడ నగుచున్, గ్రూరుఁడ వై ధర్మ మీఁగి కొని ప్రల్లదముల్
సారెకుఁ బెల్లఱచెదునిను, నీరణమును జూడఁ గంటి నే దిష్టమునన్. 85

ఉ. ఓరి దురాత్మ! జూదమున నోటమిఁ గాంచనిసౌబలుండె నీ
భూరిబలంబు గాఁ దలఁచి పొంగుచు ధర్మజు నొవ్వఁ బల్కియున్
మారుతిఁ జెందనాడియును మానిని ద్రోవది కొప్పు వట్టియున్
గ్రూరము లైనకార్యములకుం గడకట్టితి పీవు చెట్ట వై. 86

మ. పరవిత్తాహరణాదిపాపములకుం బ్రత్యక్ష మై వచ్చె నీ
దురమం దీవు ఫలంబు నొందఁ గల వై తోతెంచి తోదుర్మతీ
శరసంపాతమునన్ భవజ్జనులు గాంచన్ నిన్ను నేఁ గూల్చి మా
తరపిత్రాదిఋణంబు దీర్చెద ననిన్ దా వీడ కీవుండినన్. 87

— దుశ్శాసనుఁ డభిమన్యుతోఁ బోరి పాఱిపోవుట —

వ. అని పలికి. 88

శా. కాలాగ్నిప్రతిమాన మైన శర మొక్కం డల్కఁ సంధించి భూ
పాలానంతరజన్ము పేరురమునన్ బాధంబుగా నేయ నా
భీలాజిహ్మగ మందు మిట్టిపడి వే వే జత్రుదేశంబునన్
లీలన్ వ్రచ్చియుఁ జొచ్చె లోపలికి వల్మీకంబులోఁ ద్రాఁచనన్. 89

ఆ. అంతఁ బోవ కిరువదైదుతూపులు చెవిఁ, దాఁక నీడ్చి క్రీడితనయుఁ డేయ
నతఁడు గాఢవిద్ధుఁ డై కూలె నెప్పుడో, చచ్చినట్లు గానె స్యందనమున. 90

వ. ఇట్లు సౌభద్రశరపీడితుం డై దుశ్శాసనుండు మూర్ఛిల్లినం ద్వరమాణుం డై వానిసారథి రణమర్యాదం జేసి రథంబు రణరంగంబునకుం దొలంగం దోలుకొని పోయె నంతఁ బాండవపాంచాలసైన్యంబులసింహనాదంబులును శంఖభేరీప్రముఖ నిస్వనంబులును నింగి ముట్టె నట్టియెడం దల యెత్తి శత్రుపరాజయముం గాంచి సంతసించుచుధర్మరాజ భీమసేనమాద్రేయద్రౌపదేయశైనేయకైకేయచేకితాన ధృష్టద్యుమ్నధృష్టకేతువిరాటద్రుపదశిఖండి పాంచాలసృంజయసోమకప్రభద్ర కాదులు ద్రోణానీకంబులం దాఁకి వీఁకమెయి నేలకుం గోలకుం దెచ్చుచుం దఱిమి వచ్చుచున్నంత సుయోధనుండు రాధేయుదిక్కు మొగం బై యి ట్లనియె. 91

ఉ. అక్కట సొమ్మసిల్లి పడ నయ్యెఁ గదయ్య సుయోధనానుజుం
డొక్కనిచేతఁ జిక్కి కను ముగ్రు నికైనడిఁ గ్రాలునీనిసుం
గక్కడఁ బాండవేయులు మహాగ్రహ మొప్ప మృగేంద్రులట్లు ఱం
పెక్కి కుమారునిం గలియ నిట్లరుదెంచుచునుండి రుద్ధతిన్. 92

మ. అనుచున్నంతన రాజరాజువచనం బాలించి రాధేయుఁ డొం
డన కుద్దండపరాక్రమంబునను డాయ న్వచ్చుశత్రుసైన్యమున్
ఘనశస్త్రంబుల నాఁగి పార్థతనయుం గైకొక నానావిధా
స్త్రనికాయంబుల నొవ్వ నేసి యఱచెన్ శౌర్యం బవార్యంబుగన్. 93

క. అది తన కవమానంబుగ, నెద నెంచుచు విజయతనయుఁ డెత్తెఱఁ గొని డె
బ్బదిమూఁడమ్ములఁ గర్ణున్, మద మఱుగన్ వైచి ద్రోణు మార్కొనఁ జనియెన్.

క. ఆకాలంబున ద్రోణుఁడు, గాకాసౌభద్రుఁ దాఁకఁ గా నెవ్వండున్
వాకొనఁగ నొప్పఁ డివ్వల, వ్రేఁకపుబలగంబునందు వింటె నృపాలా. 95

మ. వసుషేణుండు తదుగ్రబాణములఁ జేవం దూలియుం దేలి పా
ర్థసుతుం దాఁకి భృగూద్వహోత్తవరవిద్యావైభవం బేర్పడన్

వెస శస్త్రాస్త్రశతంబు లాతనిమెయిం బీడింపఁగా నేసి పె
ల్లెసఁగం గాంచి సుభద్రసూనుఁ డచలుం డీతం డనం దండి యై. 96

చ. సునిశితభల్లసంతతుల సూరెలఁ బోరెడువారివింటులన్
దునిమి రయంబునం దఱిమి దోర్బల మేర్పడ మండలాకృతిన్
గనఁబడ కార్ముకం బెసఁగఁ గర్ణుని మార్కొని సూతవీరకే
తనవిమలాతపత్రములఁ దాఁకఁగ నేసె శరాళి నవ్వుచున్. 97

తే. నొచ్చి కర్ణుఁడు కనలి వివ్వచ్చుసుతుని, మేన నతపర్వబాణము లేను నిలిచె
నతఁడు క్షణమాత్రలో నంగపతిసిడంబు, విల్లుఁ దునుమాడి నొనెసె భల్లవితతి.

ఉ. అంగధ బ్రుంగి కర్ణుఁ డగునప్పుడు వానిసహోదరుండు ద్వా
రంగతుఁ డై కనుంగొని కరం బలుకం జనుదెంచి యార్చుచున్
గంగున నారిమ్రోఁత లెసఁగ స్సరనందను దాఁకి వీఁకమైఁ
బొంగుచు సూతకేతుహయముల్ నొగులంగ దశాంబకంబులన్. 99

క. ఇంచుక యభిమన్యుని నొప్పించినమాత్రమున నీదుప్రియనందను లా
కొంచెపుఁబనికి స్మది హర్షించుచు వినుతించి రతనిఁ జెల్లఁగ నొప్పల్. 100

వ. అంతలోఁ గుంతీపౌత్రుండు కర్ణభ్రాతం బొదివి. 101

ఉ. కన్నులఁ గెంపు నింపెసఁగఁ గల్గిననవ్వున నివ్వటిల్లుచున్
సన్నతపర్వమైనయొకశాతశరం బరివోసి యూసునం
గ్రన్నన నేసి శీర్షమును గండ్రక చేసినఁ గూలె వాఁడు వే
గ న్నగమందునుండి ధర గాలికిఁ గూలినకొండగోఁగు నాన్. 102

వ. అంతఁ గర్ణుండును. 103

ఉ. తమ్మునిపాటుఁ జూచి కనుదమ్ముల నశ్రులు చాలువాఱఁ గా
నెమ్మది నెమ్మదిం దొఱఁగి నిర్జరనాథకుమారజన్మశౌ
ర్యమ్మున కోర్వఁ జాలక పరాక్రమ మేర్పడఁ దాఁకి వెండియున్
ముమ్మర మైనబాణచయముం గురిసె స్సరసూనుతేరిపైన్. 104

తే. అర్జునాత్మజుఁ డపుడు పర్జన్యునట్లు, కంకపత్రశరాసార మంకిలి విడఁ
గురిసి కర్ణునిపై విముఖునిగఁ జేసి, తఱిమెఁ దక్కినగలధనుర్ధరుల నెల్ల. 105

క. ధృతరాష్ట్ర! నీకుమారుని,చతురంగబలంబు గలఁగి చనియె ద్వివిధ మై
స్థితిఁ గొనఁ జాలక కర్ణుఁడు, గతి చెడి తొలఁగెర దురంగగమన మెసంగన్. 106

తే. శలభపంక్తులువలె నింగి శరము లెల్ల, కడలఁ గ్రమ్మంగఁ జేయుచుఁ గర్ణకొడుకు
విఱిగి పఱచెడువారల వెన్నుదన్ని, తఱిమి శంఖంబు పూరించి నెఱి నెసంగె. 107

సీ. వనమధ్యమున వహ్నివలెఁ గురుసేనలో సౌభద్రుఁ డప్పుడు సంచరించి
రథహస్తితురంగంబు లెల్లెడఁ, గుప్పగూల్చెను రణక్షోణియందు
నరసావు లచ్చియు హతశేషు లగువార, లఱచి పఱచిరి జీవితార్థు లగుచుఁ
ద్రస్తులై కొందఱు తడఁబడి కాళ్ళు బెనఁచుకొనఁగ నడువలేక చాటు వడిరి
తే. కూలినగజాళి వ్రాలినఘోటకాళి, నుగ్గయినరథచయమును లొగ్గడిలిన
కాలుబంటులు ప్రోవులై నేలఁ బడిన, బాణతూణాదిశకలముల్ ప్రబలె నందు.
చ. తునిగినకాలుసేతులును ద్రుళ్ళి వడిం బడునట్టలుం దలల్
సినిగినపట్ట లక్కలును జిట్లినవెన్నులు నుగ్గునూచమై
కనఁబడువిండ్లు నమ్ములును గల్గియుఁ గండలతోడి నెత్తురే
ఱనయము వాఱె నారణమునందు గజంబులు నీఁదునట్లుగన్. 109

వ. ఇట్లు సౌభద్రుండు మధ్యందినమార్తాండునిక్రమంబున నేరికిం దేరి చూడరాక యొందునుం దాన యై యవక్రపరాక్రమంబున సంగరక్రీడం దేలుచుం బాలికల నెల్లఁ బీనుంగుపెంట గావించుచు నేకవీరుండై గండుమిగిలి యుండె ననిన ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 110

మ. సుకుమారుండు కుమారుఁ డట్లొకరుఁడై చుట్టంగ నస్మచ్చమూ
నికు లెల్లం గురుసైన్యసాగరమునన్ బాహాబలప్రౌఢి నీఁ
తకుఁ గైకొనఁ డయ్యుధిష్ఠిరునిబృందం బందు నేఁ డైనవా
ని కనిం దోడ్పడ నుండిరే యనుడు ఱేనిం గాంచి సూతుం డనున్. 111

వ. అట్లనన్యసామాన్యంబుగ జన్యం బొనర్చునక్కుమారాగ్రేసరునకుం దోడుపడువారై యుధిష్ఠిరభీమసేననకులసహదేవసాత్యకిద్రుపదవిరాటశిఖండిధృష్టద్యుమ్నధృష్టకేతుకైకయులు మత్స్యపాంచాలాదిచమూసమూహంబులతో మనసేనపైఁ బడి కోల్తలు సేయుచు నెల్లర నొల్లఁబోఁ జేయుచుండునంత నీయల్లుండు వృద్ధక్షత్రపుత్రుండు వారి నెల్ల దివ్యాస్త్రశస్త్రంబులం జేసి వారించె ననిన విస్మితుండై విచిత్రవీర్యాత్మజుండు వెండియును. 112

మ. అతిభారం బని నేఁ దలంచెదను సూతా! సైంధవుం డాపృథా
సుతులం డాఁకి తదీయసైనికులకున్ శూరత్వముం జూపె నా
నతఁ డీపాటికిఁ జాల డానమ తపమ్మా హోమమా చేసె న
ద్భుత మయ్యొం గత మెద్ది చెప్పు మనఁ దోడ్తో సంజయుం డిట్లనున్, 113

సీ. వినుము నాఁ డాద్రౌపదిని హరించుటఁ జేసి, మారుతిచే నవమాన మొంది
సంతప్తచిత్తుండు సైంధవుఁడు వరార్థి, యయి యరికట్టి యింద్రియము లెల్ల

నెండకు వానకు నివమునకును నోర్చి, క్షుత్పిపాసాదులజాడఁ బోక
స్థిరుఁడై తపించుచు దేవదేవుని మహా,దేవు నారాధించెఁ దెంపు లేక
తే. పెక్కులేం డ్లంత నాతని కొక్కనాఁడు, కలను సాక్షాత్కరించి శంకరుఁడు కరుణ
వరము వేఁడుము మెచ్చితి వత్స యనుడు, ప్రణతుఁడై సింధురాజిట్లు పలికె భక్తి.
తే. పాండవేయుల నెల్ల నొక్కండ నేను, భండనంబున వారింప వరమొసంగు
మనుడుహరుఁడిట్టులనునింద్రతనయుఁదక్కఁ,దక్కనల్వుర గెలిచెద వొక్కనాఁట.
వ. అని పరమేశ్వరుండు వరంబు ప్రసాదించెఁ దత్ప్రభావంబున జయద్రథుండు నాఁడు
పాండవుల నెల్ల నాఁగఁ జాలెఁ దత్ప్రకారం బాకర్ణింపుము. 116

—♦సైంధవుం డభిమన్యునకుం దోడుపడుపాండవుల నడ్డగించుట♦—

సీ. వరవజ్రమణిమయవర్మంబు మైఁ దాల్చి, స్వర్ణాంగదాదిభూషలు ధరించి
వాయువేగంబులు వార్వంబులు వహింప, నలరురథంబుపై నధివసించి
తులితవరాహకేతువు చిహ్నముగఁ బూని, ఛత్రచామరముల సొరుమీఱి
యింద్రచాపంబున కెనవచ్చుమణిమయ,చాపంబుతోడ శస్త్రములఁ బూని
తే. వింటి నడుమను వెలుఁగొందు వేవెలుంగు,లీల వెలుఁగుచు జ్యాఘోష మోలిఁ గ్రమ్మఁ
జిత్తజల్లుగ శరములఁ జిమ్ముకొనుచు, నడ్డువడెఁ బాండవులకు జయద్రథుండు. 117
వ. ఇట్లడ్డుపడి యురవడించి. 118
సీ. సాత్యకి మూఁడింటఁ జదిపి ధృష్టద్యుమ్ను, నఱువదమ్ముల నేసి యనిలసుతుని
నెనిమిదింట నొవ్వ నేసి మత్స్యేశుని, దశసాయకంబులఁ దరలఁ జేసి
పాంచాలు నేనింట నొంచి శిఖండినిఁ, బదితూపులం బడల్పడఁగ సలిపి
పంచకేకయులను బంచవింశతిమహా, రోపంబులం దూల్చి ద్రౌపదేయ
తే. పంచకమ్మును మూఁడేసి ప్రదరములను, దఱిమి డెబ్బదియమ్ములు ధర్మసుతుని
మేన నిగిడించి తక్కినమానధనులఁ, బెక్కుతూపుల నొప్పించి యుక్కుమిగిలె.
చ. కనలియుధిష్ఠిరుం డపుడు కన్నుల నిప్పులు రాల నవ్వుచున్
సునిశితపీతభల్లమునఁ జూపఱు మెచ్చఁగ సింధురాజుచేఁ
దనరెడువిల్లు దున్మటయు దానికి నోర్వక తం డొకింతలో
నన మఱియొక్కవిల్లు గొని నాటఁగఁ నేసెఁ బదింట ధర్మజున్. 120
క. కరలాఘవంబు మెఱయన్, ధరణీధవ! సైంధవుండు తన సైనికులన్
వరుసమెయి మూఁడుమూఁ డగు, శరముల నోనేసి యార్చె సరభస మొసఁగన్.
క. తలకడచి భీమసేనుఁడు, వలుదలు నిశితములు నైనవాల్తూపులు మూఁ
డలరించి వానిగొడుగున్, విలు నమ్ములు పడగ నేసె విఱిగి పడంగన్. 122

మత్త. కాలకాలునిలీలఁ గ్రాలుచు గాలపక్వశరీరులం
బోలఁ గైకొని వారిజీవనముల్ హరించుచు నీయనీ
కాలినంతయు నింతలోపల నట్టు నిట్టయి పోవఁ గా
నాలముం బొనరించెఁ గృష్ణునియల్లుఁ డబ్రము దోఁపఁగన్. 132

వ. ఇట్లు వక్రపరాక్రమంబునం బోరుచు. 133

ఉ. క్షుద్రమృగాళిపైఁ గవిసి సొం పలరారెడు సింహమట్లు సౌ
భద్రుఁడు నీబలంబులను బాహుబలంబునఁ దాఁకి వీఁకమై
రౌద్రము సూపుచున్నతఱి రాజులు రాజకుమారు లెల్లరున్
మాద్రికి మీఱి మాఱుకొని మార్గణపంక్తుల నేసి రాతనిన్. 134

తే. అక్కుమారుఁడు వార్ధిమధ్యంబునందు, క్షుద్రమత్స్యంబులం దిమి మాద్రిఁ గలఁచి
వైచుచుఁ గడంగి సత్యశ్రవసుఁ డెదిరిన, వానిఁ గండడఁగించె నీవారు దలఁక. 135

వ. ఇట్లు మన సేనలెల్ల విఱిగి వెఱచి పఱచునప్పుడు. 136

—♦ అభిమన్యుఁడు శల్యనందనుం ద్రెళ్ళ సేయుట ♦—

చ. క్రుధఁ గొని శల్యనందనుఁడు రుక్మరథుం డనువాఁడు పోఁడిమిన్,
మృధమును వీడి పోవుతనమిత్రులఁ జీరుచు నిట్లు వల్కునో
రథికవరేణ్యులార! యిటు త్రాసము నొందఁగ నేటికే నితన్
బ్రథితపరాక్రమంబునను బ్రస్తుతికెక్కుచునుండ నుండఁగన్. 137

క. జీవగ్రాహముగా నే, నీవిజయాత్మజునిఁ బట్టి యిప్పుడ తెత్తున్
బోవలదు మరలుఁ డనుచున్, దా వడి నభిమన్యుఁ దాఁకె ధైర్యం బెసఁగన్. 138

ఉ. తొమ్మిదిబాణముల్ తొడిగి తోడన మూఁట నురంబు నేసి స
వ్యమ్మును దక్షిణమ్ము నగుబాహులు రెండును మూఁడు మూఁడు వా
లమ్ముల నొంచి యార్చుటయు లాఘవలక్ష్యవిధిజ్ఞుఁ డాతఁ డు
గ్రమ్మున నేచి శల్యసుతుకాండము లన్నియుఁ జెండి దండియై. 139

ఆ. తొలుత వానివిల్లు తునిసిపడం జేసి, వెనుక భుజయుగంబు తునిమి వైచి
యవల శిరముఁ ద్రుంప నది కందుకమువోలె, నెగిరి పడియె నవని నెదిగి యెదిగి.

వ. ఇట్లు సౌభద్రుం బట్ట నెంచిన రుక్మరథుండు హతమనోరథుండై త్రెళ్ళినం గని సంగ్రామదుర్మదులును వానిసుహృదులు నగు రాజపుత్రులు తాలమాత్రధనుర్ధరులై మౌర్వి సారించుచు నూర్వి రొక్కపెట్ట నక్కిరీటినందనుం జుట్టుముట్టి శరవర్షంబున రథరథ్యకేతుసూతసమేతంబుగా నతనిం గప్పి యప్పుడు మూఁడేసి మూఁడేసి యమ్ము లేసి నొప్పించుటయును. 141

ఉత్సాహము. కాంచి హృష్టచిత్తుఁ డగుచుఁ గౌరవేశ్వరుండు లో
నెంచెఁ గాలయమునితోడ నెత్తువచ్చునట్టియీ
కించు నేఁటితోడఁ దీఱెఁ గీడు వోయె నంచు నా
సంచునం గలట్టి రెల్ల సంతసించి రంతటన్. 142

వ. సౌభద్రుం డట్లు గాఢవిద్ధుం డై తోత్త్రార్దితం బైనదంతీంద్రంబుచందంబునం గ్రుద్ధుం డై తొల్లి తనతండ్రి తపంబునకున్ మెచ్చి తుంబురుప్రభృతు లొసంగినగాంధర్వమాయం బ్రయోగించెఁ దత్ప్రభావంబున. 143

మ. ఒకఁడే నూర్వురు వేవు రై రణమునం దున్నట్టివిల్కాండ్రకున్
బ్రకటింపంబడి ఫాల్గునాత్మజుఁడు దోర్దర్పంబున న్వేనవేల్
సుకలంబంబు లలాతచక్రగతులన్ జుట్టంగఁ దే రెల్లసై
నికచక్రంబులపై నిగుడ్చుచు వడిన్ విభ్రాంతిఁ గల్పించుచున్. 144

మ. వడియున్ వాఁడియుఁ గల్గునారసములన్ వర్మంబులం జించియున్
బడగల్ ద్రెంచియు విండ్లు ద్రుంచియు రథవ్రాతంబుల న్నొంచియున్
గడికండల్ పొనరించియున్ భుజములన్ ఖండించియున్ శీర్షముల్
బుడమిన్ బీన్గుల నించియున్ నృపతులం బోకార్చె నొక్కింతలోన్. 145

క. చిగురుంజొంపంబులలోఁ, దగు నెలమావులను బోలె ధన్వివరేణ్యుల్
తెగి నెత్రువాఁక బ్రుంగిన, వగు మేనులతోడఁ జూడ నై రవనిపయిన్. 146

—◆ దుశ్శాసనుం డభిమన్యుతోడం బోరి పాఱిపోవుట ◆—

తే. రాకుమారుల నూర్వురఁ బోకడంచి, మించి యొక్కకుమారుఁడు మిసిమి గన్న
తనబలంబుల మర్దింపఁ గని సుయోధ, నుఁడు భయంబును గ్రోధంబు నెడ జనింప.

క. తా నక్కుమారుబీరము, గానఁగ లేనట్టిఁ డగుచు గవిసి యతనిపై
నానాశుగంబు లేసియు, వానిశితాస్త్రముల కోడి పాఱె విముఖుఁ డై. 148

వ. అనిన ధృతరాష్ట్రుండు సంజయుదిక్కు మొగం బై. 149

ఉ. ఒక్కనితోడఁ బెక్కురకు యుద్ధము వచ్చియు నందుఁ బెక్కురా
యొక్కనిచేత నోటమిని నొందుటయుం గన నబ్బురంబు నా
నెక్కొను గాని ధర్మమున నిల్చినవారి కసాధ్య మెందు నే
యొక్కటి గానరాదనుచు నూఱట నొందెద నుల్లమం దికన్. 150

తే. అట్లు రాజపుత్రశతంబు హతముగా సు, యోధనుఁడు విముఖుం డయి యోడి పఱవ
గా నవల మామకులు పార్థసూనునియెడ, నేమిప్రతిపత్తి నొందిరో యెఱుఁగఁ జెపుమ.

వ. అనిన సంజయుం డి ట్లనియె నట్లు సౌభద్రునికోల్తల కోహటించినసైనికులు నో

ళ్ళెండఁ గాళ్ళు వడంకఁ జలన్నేత్రులును బ్రస్విన్నగాత్రులు నై హతభ్రాతృపితృపుత్రసుహృత్సంబంధిబాంధవులం దొఱంగి హయద్విపాదివాహనంబులం దఱుముకొని చెట్టాకండుగం బాఱుచున్నంత ద్రోణాశ్వత్థామబృహద్బలకృపదుర్యోధనకర్ణకృతవర్మసౌబలు లత్యంతసంక్రుద్ధు లై సౌభద్రుం దాఁకియు వానితోఁ గోర్వంజాలక పశ్చాన్ముఖంబు వెట్టినం గని దుర్యోధనపుత్త్రుం డగులక్ష్మణుండు బాల్యధర్మంబునం జేసి విగతభయుం డై సుభద్రాపుత్త్రుపయిం గవియుటయుఁ బుత్త్రప్రేమం జేసి వానిం బెట్టి చన నోపక దుర్యోధనుండు వాని ననుసరించెఁ దక్కునుంగలవారును మగిడి వానికి బాసట యై వారివాహంబులుంబోలె నారాచాసారంబు గురియుటయు నభిమన్యుండు మన్యుసమన్వితుం డై. 152

—♦ అభిమన్యుండు లక్ష్మణకుమారుం జంపుట ♦—

మ. ఘనవాతూలము తూలముంబలెను మూఁకం ద్రెళ్ళఁగాఁ జేసి వా
సి నిశాతాస్త్రచయంబులం బఱపుచున్ శీఘ్రప్రకారంబునన్
ధనువుం బూని ధనేశపుత్రసముఁ డై తళ్కొత్తి తాఁతాంత్రికం
బున మెప్పొందెడులక్ష్మణుం బొదివి పెంపుం జూపుచున్నంతటన్. 153

తే. లక్ష్మణుఁడు వానిబాహువులన్ స్తనాంతరమ్మునన్ వాఁడిములుకులు గ్రమ్మ నేయఁ
దోఁకద్రొక్కినత్రాఁచు నా వీఁక నేచి, పార్థనందనుఁ డిట్లు నీపౌత్త్రు ననియె. 154

ఉ. లోకులు సూడ నిన్ను యమలోకముఁ జేరఁగఁ బుచ్చువాఁడ నీ
లోకములోన నీ విపు డలోలత నెల్లరు మెచ్చుమచ్చునన్
బోక వరంబు గావున నభూతపరాక్రమ మేర్పడంగ నిం
డై కలనుం బొనర్పుము నృపాత్మజ! వీఁగక నన్నుఁ దాఁకుచున్. 155

క. అని పలికి యేన్గుకొదమం, గని యేనుఁగుకొదమపోలెఁ గవ్వడిసుతుఁ డా
మనుజేంద్రసుతుని మార్కొని, మనమున హర్షంబు పొదల మఱిమఱి నగుచున్.

శా. నిర్ముక్తోరగసన్నిభం బయి లసన్నిస్త్రింశరూపాఢ్య మై
కర్మారాంచిత మైనసాయకము నుగ్రంపశ్యుఁ డై పూన్చుచున్
భర్మాలంకృత మై సుదర్శనము నై భాసిల్లుతచ్ఛీర్షమున్
గర్మిణుం డయి తున్మె నీబలములన్ హాహాకృతుల్ సెల్లఁగన్. 157

వ. ఇట్లభిమన్యుండు తనప్రియపుత్త్రుం దెగటార్చుట కలిగి దుర్యోధనుం డెల్లధనుర్ధరులం జెయి వీచి పిలిచి వీనిం బిలుకుమార్పుం డని యెలుంగు తాల్పడం బలుకుటయుం ద్రోణకృపకర్ణద్రోణపుత్త్రబృహద్బలకృతవర్మ లార్వురుఁ దార లక్కుమారునిపై నడరి కాండజాలంబులం గీలించుటయుఁ గీలిం బోలి మండి పాండవనంద

నుండు భండనోద్దండుం డై చండకాండంబుల మా ఱేసి వారినెల్ల మాఱుమోము వెట్టించి తనవారి కడ్డంకి యై యొడ్డినజయద్రథుఁ జయింపఁ దద్బలంబులపై రథం బు దోలించుచున్నంతఁ గ్రాథపుత్రుండు గజానీకంబులతోఁ గళింగనిషాదసైన్యం బులు తనకుం దోడు సూప నేపుమిగిలి సుభద్రాసూను నెదిరించుటయు నతండును.

సీ. చండాశుగము రేఁగి జలదతండము వోలెఁ, గుంజరానీకంబుఁ గుప్పఁగూల్చి తెఱలించి మూఁకలఁ దేజుమీఱినఁ గాంచి, క్రాథపుత్రుఁడు మహాకార్యమెసఁగ. శరపంక్తి నార్జునిరథంబు ముసుఁగు వెట్టినయంతలోన బెట్టిదము గాఁగ ద్రోణాదు లరుదెంచి దోడ్డనారసముల, నడరింప నన్నియుఁ బొడవడంచి

తే. కార్ష్ణి యక్క్రాథపుత్త్రునికార్ముకంబుఁ,బడఁగగొడుగును సూతు నశ్వములఁ గూల్చి మణిమకుటకుండలాంచితమస్తకంబు, నఱకె మనవారు గని భీతి విఱిగి రపుడు. 159

వ. అనిన నాంబికేయుండు సంజయా! సౌభద్రుండు త్రిహాయనాజానేయాశ్వయో జితరథాధిరూఢుం డై కాందిశీకుండునుం బరాజితుండునుం గాక యాకసంబునం బరిభ్రమించునట్లు సంగరాంగణమునం గులానురూపంబుగ నేపుమీఱి పోరువాని మనవారిలో నేరైన నాఁగఁ జాలిరే యనిన సంజయుం డిట్లనియె. 160

తరువోజ. అభిమన్యుకోల్తల కట్లోహటించి యందఱు విముఖు లై యట్లు గుటయును రక్షసంబునం దొంటిరథికు లార్వురు నరజుఁ దాఁకి రంతలో రవళించి సింధు విభునిపైఁ బాండవవీరు లెల్లరును వెసఁ గవిసిన నట వెడలిరి కొంద ఱభయు లై మఱికొంద ఱాచార్యముఖుల కండ గానుండి రయ్యాలంబునందు. 161

వ. ఇట్లు మనసైన్యంబులు రెండు పెద్దమొత్తంబు లై పెనఁగులాడు చుండునప్పుడు గాండీవినందనుండు గండుమిగిలి చాపాచార్యు నేఁబదింటను బృహద్బలు నిరువదిం టను గృతవర్మ నెనుబదింటను గృపు నఱువదింటను ద్రోణనందను బదింట నొప్పించి.

తే. కర్ణి నారాచమునఁ గర్ణుకర్ణభాగ, మందు నోనేసి కృపునిరథ్యములఁ జక్ర రక్షకులఁ గూల్చి పదిటఁ దద్వక్ష మేసి, కూల్చె బృందారకుని నీసుకొడుకు లరయ.

సీ. దానఁ గ్రుద్ధుం డయి ద్రౌణి యిర్వదికుప్పె,కోలల నార్జునిం గొట్టుటయును బదివాఁడితూపు లాపార్థనందనుఁ డేసి, యఱచె నీవారెల్ల నరయుచుండ నతనిపై నాచార్యసుతుఁ డల్గి యర్వది,తూపులు నిగిడించి తొట్రు వడమి నెఱిఁగి డెబ్బదిరెంట మఱియు నెఱకులాడ, నేసె నాలో గురుఁ డేగుదెంచి

తే. యతనిపై శరశతము తత్సుతుఁడు షష్టి,కాండములు కర్ణుఁ డిర్వదిరెండుకోల లైదుపదులు బృహద్బలుం డైదురెండ్లు, కృపుఁడు కృతవర్మ పదునాల్గు నేసి రపుడు.

వ. అప్పుడు. 165

చ. పదిపదివాలుతూపులను బాండవనందనుఁ డెల్లవారి ను
క్కు దఱుఁగ నేసి వాసిఁ గొని కోసలనాథుఁ డురంబు నేయ స
త్త్రిదశవిభూద్భవాత్మజుఁడు రేఁగి బృహద్బలువిల్లు ద్రెక్కమో
జిదురుపలై పడన్ సలిపి చీలిచిపుచ్చె రథాశ్వసూతులన్. 166

— అభిమన్యుండు బృహద్బలుం దునుమాడుట —

మ. విరథుం డై కరవాలచర్మములు దోర్వీర్యంబునం బూని గ
హ్వరికిం డిగ్గి బృహద్బలుం డవుడు బీభత్సూద్భవుం ద్రుంప స
త్వరుఁ డై మీఁదికి రాఁ దలం చెదుటఁ దచ్ఛీర్షము ద్రుంచె స
న్నరసూతుండు నిశాతసాయకమునన్ బాహాబలం బేర్పడన్. 167

వ. ఇట్లు కోసలేశ్వరుం గూల్చి. 168

సీ. అంతటఁ బదివేవు రవనీపతులు ఖడ్గ,కార్ముకధారు లై కడచి వచ్చి
పైపై నడర వారిఁ బట్టి మృత్యువువాతఁ, బెట్టి నీబల మెల్ల మట్టుపెట్టెఁ
గర్ణునిపై నొక్కకర్ణినారాచము, మఱి యేసె నేఁబదిమార్గణములు
రాధేయుఁ డన్నిమార్గణము లాతనిమీఁద, నడరింప నతఁడు శరాచితాంగుఁ
తే. డయ్యెఁ గర్ణుఁడు రక్తసిక్తాంగుఁ డయ్యె, నిరువురుం బుష్పితాశోకవృక్షము లని
చూప రెంచఁగ నొప్పిరి చూచుచుండ, నోల మాసించి వసుషేణుఁ డోసరిల్లె. 169

వ. అంత నభిమన్యుండు. 170

ఆ. అంగరాజసచివు లార్వుఱు దాఁకిన, వారిసూతకేతువాహనరథ
సహితముగను ద్రుంచి చాపగుర్వాదుల,పయిఁ బదేసితూఁపు లెయిది యేసి. 171

ఉ. మాగధు నశ్వకేతు వడి మాఱొక్కని మార్గణపట్క మేయుచున్
వీఁగక వానిమస్తకము వీతులతోడను సూతుతో నిలం
దోఁగఁగఁ జేసి కార్ణి యొకతూపునఁ గుంజరకేతనున్ మహా
భాగుని మార్తికావతికవల్లభునిం దెగటార్చి నార్చుచున్. 172

శా. ఆసంరంభము సైఁపఁ జాలక మహాహంకారహుంకారముల్
వాసిల్లన్ వడి దుస్ససేనుసుతుఁ డాపార్థాత్మజుం దాఁకి సం
త్రాసం బేర్పడ నాలుగింట హరులన్ దత్సూతు నొంటన్ దశ
ప్రాసప్రాయశరంబులన్ నరసుతున్ బాధంబుగా నేయుచున్. 173

వ. అతండునుం బదిబాణంబుల వానిఁ బ్రహరించి రోషసంరక్తనేత్రుం డై వానిం జేరి
యిట్లనియె. 174

ఉ. కాపురుషుండువోలె విముఖత్వముఁ గైకొని పాఱె భీరమున్
జూపఁగ లేక నాకెలనఁ జూచితి విప్పుడు నీదుతండ్రి నీ
వోపి దురంబు సేయుటకునో యన వచ్చితి మెచ్చితిం గుమా
రా! పఱవంగఁ బోక నిలు మంతకుఁ గొల్వఁగఁ బుత్త్రు నింతలోన్. 175

తే. అనుచుఁ గర్మారపరిమార్జితాశుగం బొ, కండు వింటను సంధించి కర్ణికొడుకు
నీమనుమనిపై నేయం గని గురుసుతుఁడు, దాని నూఁడింట నడుమన తఱిగి వైచె.

క. గురుసుతునిదిక్కు సూడక, నరసుతుఁ డాదుస్ససేనునందనచాపం
బరమరలు చేసి సూతుం, బరిమార్చి శరంబు లాఱు పఱపె నతనిపైన్. 177

వ. దాన నొచ్చి విరథుం డై సీమనమం గోసరిల్లి యొండొకకతే రెక్కె నంత
గాంతేయాత్మజుండును. 178

సీ. మద్రేశ్వరుని మూఁడుమార్గణంబుల నొంప, నతఁడు తొమ్మిదితూఁపు లడర నేసె
నతఁడు చలింప కప్పతివిల్లు ఖండించి, చక్రరక్షకులను జావ నేసి
యాఱుబాణంబుల నపసరిల్లఁగఁ జేసి, శత్రుంజయుండును జంద్రకేతుఁ
డును మహామేధాఖ్యుఁ డును సువర్చసుఁడును, సూర్యభానుండును శౌర్యనిధులు

తే. నేవు రప్పుడు తనపయి కేగుదేర, వారి వ్రేల్మిడిఁ బెదరులదారి వట్ట
నలిపి శకునిపై నస్త్రవర్షంబు గురిసి, విక్రమక్రీడఁ దేలె నావిజయసుతుఁడు. 179

చ. శరముల వేఁడికిం దలఁకి సౌబలుఁ డాబలభిత్సుతాత్మజున్
గరమున నున్నమూఁడయినకాండములన్ స్పృశియించి కోపమున్
బెరుగ నొనర్చినట్టిఁ డయి పిమ్మట పుట్టఁగ నిల్వ నోడి స
త్వరముగఁ గౌరవేశ్వరునిదగ్గరకుం జన నేగి యిట్లనున్. 180

క. ఎల్లర మీనరనందను, ద్రెళ్లన్ వేయుదము పూని తెగ నటు గా దే
నెల్లర నొక్కొక్కనిఁ గాఁ, జెల్లించు నితండు మనల సిద్ధము గానన్. 181

—♦ ద్రోణుఁ డభిమన్యు నోడించునుపాయఁబు సెప్పుట ♦—

వ. ద్రోణకృపాదులతో మంతనం బుండి వీనిఁ జంపునుపాయంబు నిర్ణయింపు మనుచుండు
నంత వైకర్తనుండు ధనురాచార్యునిదిక్కు మొగం బయి మొక్కలీఁ డగునిక్కు
మారు నుక్కడంచు టెట్లు చెప్పు మనిన నతం డెల్లరు విన ని ట్లనియె. 182

ఉ. కొండిక యయ్యు నీమగఁ డకుంఠితవిక్రమమందుఁ దండ్రికిన్
మెం డగువాఁడ యెల్లెడల మెచ్చెడు నంతర మింత చూడ రా
కుండఁగ వీని శీఘ్రతయు నొప్పెడు బాణము పూను టేయుటల్
మండలరూపచాపమున మూర్తులు లెల్లరుఁ జూడ రెప్పుడున్. 183

మ. తగ నీబాలుఁ డలాతచక్రముగతిం దళ్కొత్తి పై ల్లేయఁ గం
తగతప్రాణుఁడ నైతి నే నయిన నానందంబు నా కయ్యె నో
జగతీనాయకులార ! నా కితఁడు శిష్యప్రాయుఁ డై ప్రీతికిం
దగిలెం జెప్పఁగ నేల యిప్పు డితనిం దాఁకంగ లే రెవ్వరున్. 184

మ. అనినం గర్ణుఁడు వెండి యి ట్లనియె నార్యా! శౌర్యధౌరేయుఁ డీ
తని బాణంబుల నొచ్చి విచ్చి చనఁ జిత్తం బైనఁ గా దంచు నే
ననుమానించితిఁ గాని లేనియెడ నెట్లై యుండునో డెందమున్
మునిశాతాస్త్రము లివ్వి గాల్చెడి ననఁ జూపట్టు నిప్పట్టునన్. 185

వ. అనిన నాచార్యుం డల్లన నవ్వుచు నవ్వైకర్తనున కి ట్లనియె. 186

సీ. వీనితండ్రికి నేను వెలయించితి నభేద్య, మగువర్మధారణ మనెడువిద్య
దాని నీతఁ డెఱుంగుఁ గాన వీనిని మన, శస్త్రాస్త్రములు నొంపఁ జాల విపుడు
విలు చేతఁ గైకొన్నవీని సురాసురుల్, చెనయ లే రనుచు నేఁ జెప్పుచుంటి
నెదిరించి విలుఁ ద్రుంచునదియు నశక్యంబు, చాలుదే వెనుకొని సలుపు మట్లు

తే. విల్లు డెగునంత రథమును విఱుగ వలయు, సూతవీతులతోఁ గూడఁ జూచుచుండ
ననుడు వైకర్తనుం డప్డు వెనుక కొదిఁగి, పిఱిఁదికిం జని వంచన విల్లు ద్రుంచె. 187

వ. అయ్యవసరంబున. 188

— కర్ణాదులు వంచనచే నభిమన్యు విరథుం జేయుట —

ఉ. వార్వములన్ వధించెఁ గృతవర్మ కృపుండును గూల్చె సారథిన్
సర్వధనుర్ధరుల్ గలసి స్యందనముం బగులించి కార్ష్ణిపై
గుర్విషుసంతతుల్ విసరి కో యని యార్చిరి పేర్చి జాలి లే
కుర్విధరంబువోలె నతఁ డుండి చలింపనిచిత్తవృత్తి నై. 189

తే. విరథుఁ డై వీతధన్వుఁ డై వెస ధరిత్రి
కుఱికి వాలును బలుకయు నొడిసిపట్టి
కౌశికాదిమార్గములు లాఘవము బలము
నెఱయఁ జరియించె దివిఁ దార్క్ష్యుతెఱఁగు దోప. 190

వ. వెనుదీయ కిట్లు క్షాత్త్రధర్మమ్మున విహరించు చుండునంత. 191

ఉ. ఎవ్వని నెత్తిపైఁ బడునొ యెవ్వని కాయువు సెల్లి పోయెనో
యెవ్వఁడు మిత్తి కౌనొ యని యెల్లరు నౌదల లెత్తి చూచుచున్
గ్రొవ్వఱి బాణజాలములఁ గూర్చుచునుండెడునంతఁ ద్రోణుఁడున్
దివ్వన వానివా ల్దునిమె వ్రేసె నిలం బడఁ బల్కఁ గర్ణుఁడున్. 192

ఉ. చక్రికి శిష్యుఁడై విమతచక్రభయంకరుఁడైన కార్ష్ణి ని
ర్వక్రపరాక్రమంబునను వ్రాలుచు నేలకుఁ దేరిచక్రముల్
నక్రమయుక్తిమైఁ గొని వెసన్ గురుమీఁదికి దాఁటె నయ్యెడన్.
జక్రధరుండు రాక్షసులఁ జంపఁగ నేగెడునట్లు దోఁచుచున్. 193

సీ. ప్రస్రవద్రుధిరైకరాగయుక్తాంగము, శోణభూధ్రమువోలె సొంపు మీఱ
నిటలతటంబునం గుటిలమై భ్రూకుటి, వడ సింహనాదము గడిమిఁ జూప
రోషభీషణశోణరుచిరుచిరేక్షణంబు, లై నిప్పుకలఁ గ్రక్కినట్లు క్రాల
ననిలసముద్ధూతమైన కేశాంతము,ద్యతవరాసికరణిఁ దనరుచుండ

ఆ. దేవతలకు నేని తేఱి చూడఁగ రాక, చిత్రరోచు లభ్రసరణి నిండఁ
గ్రోధమూర్తి యగుచు ఘోరాభిరాముఁడై, చూడ నొప్పె నపుడు క్రీడిపట్టి.

వ. అంత. 195

చ. పలువురు దండనాయకులు పట్టి ధనంజయుపట్టిచేతిలో
నలరెడుచక్రముం దునియలై పడ నేయ నతండు తేరిపైఁ
గలగద నింతలోపలన కైకొని ద్రోణిపయిన్ వడిం బడెం
దోలఁగె నతండు నాగదకుఁ దోఁపక యుండెనునంతదవ్వగన్. 196

సీ. అభిమన్యుఁ డంత గదాహతిన్ వానిఘో,టకములఁ జక్రరక్షకులఁ జదివి
యోధశరావళి నోడ లెల్లఁ గలుగుట, నేదు వెఱిగినట్టు లెసక మెసఁగి
తునుమాడి సుబలాత్మజునిఁ గాలికేయునిఁ దదనుచరులను గాంధారకులను
డెబ్బదియేడ్వుర డెప్పరంబుగఁ గూల్చి, బ్రహ్మవసాతీయరథికవరులఁ

తే. బదుగురం జెండి కైకేయపతులరథము, లేడునేనుంగు లొకపది యేటఁ గలిపి
యలుక దౌశ్శాసనిరథంబు నశ్వములను,జదియఁగా మోఁదిగదతోడఁజలిపెఁగ్రీడ.

—♦ అభిమన్యుదౌశ్శాసను లిరువురుం బోరి చచ్చుట ♦—

మ. విరథుండై గదఁ బూని సీమనుమఁ డుర్వీచక్రమల్లాడఁగా
జరణద్వంద్వము మోఁయ మెట్టుచు వడిన్ సౌభద్రునిం దాఁకి నీ
వెరవుం జూపుము నిల్ము నిల్మని కడున్ వేరమ్మునం బల్కుచున్
నరపుత్త్రుండును వాని మార్కొనె గదన్ సాట్యంబు గావించుచున్. 198

క. ఒండొరువు లిట్లు మార్కొని, మండుగదాదండములను మఱిమఱి శక్తుల్
మొండుకొనం దాఁటించుచు, నొండొండం దవిలి వ్రాలి రుర్వీస్థలికిన్. 199

ఉ. ఇద్దఱు నన్నదమ్ము లొక యింతటిలోపల లేచి వెండియున్
బద్దునఁ దాఁకియుం గదలపాటును బోటును నేటు వ్రేటునన్

సద్దుగ నొండొకండు నొకసారె గదాహతిఁజేసి శీర్షముల్
బ్రద్దలు గా గతాసు లయి వ్రాలిరి నేలకు నద్భుతంబుగన్. 200

వ. అట్లొక్కరుండఁ బెక్కండ్రుమహారథికులకుం జిక్కి చక్కమసంగిన సుయ్యభిమన్యుకుమారుండు. 201

సీ. నలినీవనంబెల్లఁ గలఁచి కలఁచి వ్యాధ,గణహతం బగుమత్తగజముకరణి
శిశిరాత్యయమున నిశ్శేషంబుగా నెల్ల, వనిఁ గాల్చి చల్లారువహ్నివలెను
నిగురుజొంపంబుల నెల్లెడం దొల్లించి, సన్నివృత్తం బగుశ్వసన మట్లు
పగలెల్ల బీరెండఁ దగఁ గాచి వెలుఁగొంది, యస్తగతుం డగునర్కుపగిదిఁ

తే. బెక్కురం గూల్చి యభిమన్యుఁ డక్కటకట
వ్రాలి ధరణి రాహుగ్రహగ్రస్తుఁ డైన
నెల విధంబున వట్టినజలధివోలె
సొంపు విడియును బెంపునఁ జూడ నొప్పె. 202

తే. కాకపక్షంబులం గ్రాలుకన్నుఁదోయి, గలిగి చంద్రప్రకాశ మై చెలువు మిగులు
వదన మొప్ప నిలం గూలువానిఁ జూచి, సంతసించిరి నీవారు సంకులార్తి. 203

చ. చితికిఁ బ్రదక్షిణించుతతిఁ జీల్చినకుంభమునుండి ధార గా
క్షితిపయిఁ గాఱునీరములచెల్వునఁ జెల్వము దప్పి యశ్రువుల్
సతతముఁ జాలువాఱుకొన సల్పి రనల్పమనోవ్యథాయుధ
ప్రతిహతు లైనపాండవులు బమ్మెరవోయిరి పట్టిపాటునన్. 204

ఉ. ఆర్వురు ద్రోణముఖ్యు లగునాఘ్యులు గైకొని యొక్కబాలునిన్
గుర్వొషుసంతతిన్ ధరణిఁ గూలఁగ నేసినకారణంబునన్
గర్వముతోడ సంతసిలు కార్య మధర్మ మటంచు భూతముల్
సర్వజగజ్జనుల్ వినఁగఁ జాటి వచించెఁ గడిందియెల్గునన్. 205

చ. క్షతజపరిప్లుతం బయినకయ్యపునేల నిశాముఖంబునన్
దత మగుసంజకెంపున నుతం బగునింగివలెం దలిర్చె నం
చితమణిభూషణాదు లటఁ జెన్నలరారెను జుక్కలట్లు త
ద్గతుఁ డగుపార్థనందనుఁడు గ్రాలెఁ గళానిధిచంద మొందుచున్. 206

తే. కలసఁ గృష్ణార్జునులఁ బోలఁ గలసుభద్ర, పట్టి కౌశల్యముఖ్యులఁ బదియువేల
రథికులను వేనవే లైనరథగజాశ్వ, ములను దెగటార్చి పుణ్యభూములకుఁ జనియె.

వ. మఱియు నయ్యభిమన్యునికయ్యంబున నికృత్తంబు లై మొత్తంబు లైనకుండల
గండభాగోల్లసితవీరోత్తమాంగంబులును దెగి పడినపతాకోష్ణీషాదులును దునిసిన

తే. అన్నదీవరమునయందు నఖిలరాక్షసులును దిని త్రావియును నీఁది జలకమాడి
సంతసించిరి భైరవస్వనము లెసఁగ, వృకతరక్షుశివాదు లవ్వేళఁ గూడ. 214

ఉ. వారును వీరు నాక కలవార లొకళ్ళు నొకళ్ళుగా నటన్
వీరవరేణ్యుఁ డై దెసల వెల్గఁగఁ జేసి దినావసానమం
దారవి వోలె నేలఁ బడినట్టిధనంజయుపట్టిదేహమున్
ధారుణి వ్రాలఁ జూచి యెడఁదం గడుదుఃఖము నొంది రందఱున్. 215

వ. అట్లు శిబిరంబున కరిగి శోకోపహతచేతస్కుం డయినధర్మరాజు విముక్తసన్నాహు లై చింతాక్రాంతాంతరంగు లై యెల్లవారును బరివేష్టించి యుండ నొక్కచో నాసీనుం డై యిట్లని దుఃఖించె. 216

—♦ ధర్మరాజభిమన్యునిమరణంబునకు దుఃఖించుట ♦—

మ. అకటా నాకుఁ బ్రియంబుఁ గూర్చుటకు ద్రోణానీకముం జొచ్చి సిం
హాకిశోరంబు గజంబులం దునుమున ట్లం డైనశూరాగ్రగ
ణ్యకుల న్వేలకువేలు గూల్చి మఱియు న్మాదాయ దుశ్శాసనున్
సకలోర్వీశులు సూడ నాకొడుకు మూర్ఛ న్ముంచి కెపించెఁ గా. 217

తే. ద్రోణబలమహార్ణవ మీఁది తొడరి లక్ష్మణాదులను గూల్చి దుశ్శాసనాత్మజునకు
వశగుఁ డై పోయెఁ బట్టి వైవస్వతక్షయమున కేమందు విధివ్రాత క్రమము మీఱె.

తే. కొడుకు వోయిన దుఃఖంబు కడలుకొనఁగ, విన్నఁదనమున నున్నమావిజయు నతని
సుదతి మోమును నే నెట్లు సూతు నెట్లు, పలుకరింతు నెట్లు మెలంగఁ దలఁతు నకట.

మ. అభిమన్యుం బొడఁగాన కెందును మదీయాభ్యర్ణముం జేరి కై
టభజిజ్జిష్ణు లెఱుఁగఁ గార్ష్ణి యని వేడ్కం బోలెఁ బ్రశ్నింపఁ గా
నభయాత్ముండన నై యె వచింపఁ గల నె ట్లవ్వారితో నక్కటా
శుభముల్ గూర్చెదు నేస యి ట్లశుభముల్ సూచింతునో వారికిన్. 220

ఉ. లోభము మోహమూల మయి లోన నొగిన్ జనియించి మించు నా
లోభహతాత్ముఁ డెట్టుఁ దనలోఁ గనఁ జాలఁడు మీఁదిచేటులన్
భూభృదధిత్యకం బెరను బొందెడువాఁడు ప్రతాపముం బలెన్
బ్రాభవ మంద నేఁ గొడుకుఁ బంచితి వైరుల నెంచ కక్కటా! 221

మ. సుకుమారుండు కుమారుఁ డాలపుగతుల్ సూడండు పెక్కండ్రు లో
నొకయింతేని తలంప కేఁ బనిచితిన్ వ్యూహంబు భేదించి రా
నకటా! కవ్వడివేఁడిచూడ్కులకుఁ బా లై పోవుకంటెన్ గుమా
రకునిం గైకొని వానితోఁ జనుటె కర్జం బంచు నే నెంచెదన్. 222

ఆ. కొడుకు కటంచుఁ బ్రేమఁ గూరిచి ర మ్మని, కుడువఁ గట్టఁ బాయఁ దొడువ మున్న
పనుప వలయుఁ గాక పనుపునే తా నిట్లు, ఘోరసమరమునకుఁ గ్రూరుఁ డెవఁడు. 223
ఆ. అట్టిబుద్ధిమంతుఁ డట్టిప్రేమంతుఁడు, నట్టిధైర్యవంతుఁ డట్టిశౌర్య
వంతుఁ డట్టిరూపవంతుఁడు నగువానిఁ, గోలుపోయి బ్రదుకఁ గోలు నొక్కొ.
ఉ. ఆదివిజేంద్రముఖ్యులకు నైన జయింపఁగ రానికాలకే
యాదులకున్ నివాతకవచాదులకున్ దృటిలోఁ బరేతరా
ట్సోదుల్లవిశ్రమింపఁ జనుపీథి ననిం బొనరించి వేల్పులన్
బ్రోది యొనర్చినట్టిప్రభుపుత్రునిఁ బ్రోవఁగ లేక యెవ్వఁడున్. 225
ఉ. క్షుద్రుఁడు ధార్తరాష్ట్రుఁ డిటు క్షుద్రులసంగతిఁ జేసి చంపె సౌ
భద్రుని దానఁ గ్రుద్ధుఁ డయి పార్థుఁడు కౌరవవంశ మెల్ల న
క్షుద్రశరాగ్నిఁ గాల్చెడిని జూవె జయం బగు నైన మాకు మా
భద్రము లేనిరాజ్యమును స్వర్గము సౌఖ్య మొసంగఁ జాలునే. 226

— ♦ ధర్మరాజునకు వేదవ్యాసుండు దర్శన మిచ్చుట ♦ —

వ. అని పలుదెఱంగులం బలవించుచున్న సమయంబునం బారాశర్యుం డాసమక్షంబు
నం బ్రత్యక్షం బగుటయు నజాతశత్రుండు ప్రత్యుత్థానాభివందనావాహనాసనవి
న్యాసనాద్యుపచారాపచితుల నమ్మునిం బూజించి పుత్రశోకసంతాపసంతప్తచి
త్తుం డై తత్తఱంపడుచు నతని కి ట్లనియె. 227
సీ. పెరమొగ్గరంబును భేదించి మార్గంబు, వెట్టుము, మేము నీవెంట వత్తు
మని సుభద్రాసుతు ననిచితి నే నంత, నబ్బాలువెనువెంట నరుగుమమ్మ
సైంధవుం డడ్డె నాసమయంబునఁ గుమారుఁ, డొంటనంబునఁ జొచ్చి యుక్కుమిగిలి
పెనఁగుచున్న నధర్మమునఁ జొచ్చి పలువురు, వంచనమైఁ జంపి రెంచ వాని
తే. ననమయుద్ధంబు పగ ఱట్లు పొసగఁ జేసి, రందునం గుందఁగా నయ్యె నధికశోక
తప్తగాత్రుఁడ నై శాంతిఁ దగులకుంటి, ననిన వానికి నమ్ముని యనియె నిట్లు. 228
శా. బాలుం డయ్యు నబాలవిక్రమమునన్ బాహాబలం బేర్పడన్
లీలం బెక్కుర సంహరించి దివికిన్ విచ్చేసె నీనందనుం
డేలా దీనికి నింత చింతిలఁగ నోపృథ్వీశ ! ప్రాజ్ఞుం డనం
జాలం బొల్చితి నిన్నుఁ బోలుఘను లీచందంబుమై నుందురే. 229
క. అనతిక్రమణీయము విధి, ఘనుల సురాసురుల నైనఁ గాలప్రాప్తం
బున ఘోరం బగుమృత్యువు, గొనకొని వాచవిగఁ జేసికొను నిక్కముగన్. 230
వ. అనిన యుధిష్ఠిరుండు వెండియును, 231

చ. అతిబలు లైనరాజులు మహాహవమందు నొకళ్ళొకళ్ళనుం
హతు లయి నేలపైఁ బడుదు రట్టిబలాఢ్యుల కెల్లు మృత్యువో
మృతి యన నేమియో మృతియు మృత్యువు నొక్కఁడొ లేక భిన్నమో
క్షితి నగుమృత్యురూప మది చెప్పఁగదయ్య సవిస్తరంబుగన్. 232

వ. అనిన ధర్మజు నూరార్చుచు నమ్మునీశ్వరుండు నీయడిగినదానికి నుత్తరంబుగాఁ దొల్లి నారదుం డకంపనునకుం జెప్పినపురాతనేతిహాసంబు గల దాకర్ణింపు మది స్నేహబంధనసంశ్రయం బయిననీవ్యసనం బపనయించి చిత్తశాంతి నొసంగఁ జాలు నవహితుండ వగు మని యి ట్లనియె. 233

—♦ వ్యాసుం డకంపనునకు నారదుండు చెప్పినమృత్యుప్రభావంబు చెప్పుట ♦—

సీ. కలఁ డాదియుగమున ఘనుఁ డకంపనుఁ డను, రాజొకకలన శాత్రవుల చేతఁ
కైనతత్పుత్రుఁడు హరి యనువాఁడు కృ, తాస్త్రుఁడు పగఱతో నని యొనర్చి
తండ్రిని విడిపించి తా నందు హతుఁ డైనఁ, దండ్రి కోపించి శాత్రవులఁ ద్రుంచి
హరి కూర్ధ్వదైహిక మంతయు నొనరించి, యిలు సేరి దుఃఖభాయిష్ఠుఁ డైన
తే. వాని కొకనాఁడు నారద మౌనివరుఁడు, దర్శనం బిచ్చుటయు రాజు తపసి కెఱఁగి
విధివిధంబునఁ బూజ గావించి తనదు, వృత్త మంతయు నెఱిఁగించి యిట్టు లనియె.
ఆ. మృత్యు వనఁగ నేమొ మృత్యువునకు వీర్య, బలము లెట్టియవియొ తెలియ వినఁగ
నభిలషించుచుంటి ననుడు నారదమౌని, చంద్రుఁ డిట్టు లనియె సాదరమున. 235

వ. తొల్లి సృష్ట్యాదికాలంబునఁ బరమేష్ఠి ప్రజల సృష్టించి నానాఁటికిం బెచ్చుపెఱుంగువారి మోవం జాలని భూదేవి ప్రార్థనంబునం జేసి చింతాక్రాంతచిత్తుం డై సంహారంబున కుపాయంబు చింతించు చుండునంత వానిహృదయాంతర్గతం బగురోషంబున మహోగ్రం బయినమహానలంబు పుట్టి జ్వాలామాలాసమాకులం బై సకలదేశంబులు నాక్రమించి మించి ప్రపంచంబులం గలచరాచరభూతసంచయంబులఁ గాల్చుచున్నంత నంతకాంతకుండు కరుణాతరంగితాంతరంగుం డై సురజ్యేష్ఠునిపాలికిం జని నీచేయు ప్రజాక్షయం బుపసంహరించి నాకుఁ గా జగంబుల కనుగ్రహంబు ప్రసాదింపు మని ప్రార్థించుటయుం బ్రసన్నుం డై పితామహుం డతని కి ట్లనియె. 236

ఆ. వత్స! నీవు నాకు వఱలినకామంబు, వలనఁ బుట్టితయ్య తెలియ నీదు
హితము దీర్చుపొంటె నే నుంటి నీప్రజా, క్షయము నాకుఁ బ్రియము గాదు వినుము
ఉ. పెద్దయ ప్రేఁగు మోచుటకు వేఁగి ధరాసతి నన్ను వేఁడికో
నద్దెసఁ జిత్తము న్నిలిపినప్పుడు పుట్టినకోప మగ్ని యై

హద్దును మీఱి కాల్చెడి సమస్తచరాచరభూతకోటి నా
నద్దివిజార్చితుండు హరుఁ డాదల నంజలిఁ బూని యిట్లనున్. 238

చ. ప్రతిభు నడంచి మించినకృపం గొని లోకము లుద్ధరింపు మో
స్తుతమతి నీకు ధాగ్ని వనధుల్ గిరులుస్ బురముల్ వనంబులుస్
క్షితిఁ జెడిపోయె భూతతతి చేష్టచెడియెన్ విధి వైననీవె యి
గ్గతి నకలంబు నొక్కపటిఁ గాలిచిపుచ్చుట లొప్పి యుండునే. 239

క. కోపాగ్ని నెల్ల నీలో, నీపట్ల నడంచివేయు మే నీయాజ్ఞా
రూపమున నెల్లలోకము, లోపి తగం గాఁచువాఁడ నోపరమేష్ఠీ. 240

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై హిరణ్యగర్భుండు ప్రజాహితకాముండై ప్రవృత్తి నివృత్తిరూపంబు లెఱింగించుచుఁ దన తేజం బుపహరించుటయు దానం జేసి జగంబు లం గాల్చుక్రోధాగ్ని యుపశమించె నాసమయంబున నాస్వయంభువు సర్వాం గంబులనుండి రక్తజిహ్వాస్యలోచనయు రక్తకృష్ణపింగళవర్ణయు రక్తారుణవస్త్ర యుఁ దప్తకుండలమండితగండస్థలయుఁ జారుజాంబూనదభూషణభూషితాంగియు నగునొక్కదివ్యాంగన పుట్టి దక్షిణంబు వట్టి విశ్వేశ్వరుల నిద్వారం జూచి నవ్వు చుం బోవుచుండ లోకాదినిధనేశ్వరుండైనవిధాత మృత్యువా! యని సంబోధిం చుచు నిట్లనియె. 241

శా. నాకుం బుట్టితి వీవు లోకములకున్ సంహారముం గూర్చుని
చ్ఛాకల్పంబునఁ గోపవహ్నివలనన్ జర్చింప నాపంపునన్
బోకీరితినిఁ బోక నీకుఁ దగునే పూఁబోఁడి! సంహారకా
ర్యాకల్పాకృతి నుండు మట్లయిన నీ కొఁ జుమ్ము శ్రేయముల్. 242

— ♦ మృత్యుదేవి కూర్రకృత్యంబునకుఁ జింతించుట ♦—

వ. అనినం గ్రమ్మఱి యమ్మృత్యుదేవి దేవదేవునిపాలికిం జని స్వేదయుంబ్రా ద్దెలుంగు రాలుపడ నేడ్చుచుండుటయుఁ గమలాసనుండు మున్నిరై నదాని కన్నీరు కరపు టంబులం బట్టి లోకహితార్థం బనునయించుచున్నంతఁ గొంత శాంతించి వినయం బునం జేసి వంచినతీవ పోలె నించుక మేను వాంచి విరించిం గాంచి ప్రాంజలి యై యి ట్లనియె. 243

చ. నెలఁతుకనై సృజింపఁ బడి నీకరుణాతిశయంబు పెంపునన్
ఖలులకునైనఁ గ్రూర మగుకర్మము సేయఁగఁ బూనుదానికిన్
దలఁకెద నే నధర్మములదారి మెలంగెడుబుద్ధి చిత్తముం
జలుపఁ దలంప నాయెడఁ బ్రసన్నుఁడవై చను మోపితామహా. 244

చ. కొడుకుల నన్నదమ్ములను గూఁతుల నేతలఁ దల్లిదండ్రులన్
బడఁతులఁ నెయ్యురం బ్రియుల బంధుల మ్రందఁగఁ జేయుచో జనుల్
కడువడి నార్తులై పనుపుకాలమునం బడుబాష్పబిందువుల్
వెడవెడఁ గన్న నామనము వ్రీలిపకుం గరుణింపవే ప్రభూ. 245

మ. గురుదోస్సాకరదుర్జనావృతమతిక్రూరవ్యథామూలదు
ర్భరసంఘాతముఖోగ్రనారకభవప్రధ్వానధామంబునై
తరణీఖేయపరీవృతంబు వితతోద్యద్దండభృద్ఘోరకిం
కరవారంబు పరేతరాణ్ణగర మేఁ గానంగఁ బో జంకెదన్. 246

క. చేతులు జోడించుచు నిన్, జేతోవీథిం భజింతు శివతాతి! దయా
న్వితమతిఁ జూచి నన్నీ, పాతకమునయందుఁ గూలఁ బనుపకు మయ్యా. 247

వ. ఇట్లు కాక నాకుఁ దపశ్చరణంబున కనుజ్ఞ యిత్తువేని నేను నీయాజ్ఞ శిరంబునం బూని ధేనుకాశ్రమంబునకుం జని నిన్నారాధించుచుండునట్లు వరం బొసంగ నను గ్రహింపు మనినఁ బంకజాసనుం డిట్లనియె. 248

సీ. నినుఁ బ్రజాసంహారమునకె సృష్టించితిఁ, దప్పు దప్పని నీకుఁ దరళనేత్ర!
యీ వనిందిత వయి యొసక మొసంగెదు, దోషంబు నీవంకఁ దొడరఁ బోదు
నావుకు విని మృత్యుదేవి ప్రజలఁ జంపు, పని కసంగీకారమున నెసంగె
సరసిజాసనుఁడు ప్రసాదంబునం జూచె, నంత నెప్పటి లోక మలరఁ జొచ్చె
ఆ. సంతసించి యిచ్చఁ జనియె భూతేశుఁడు, శాంతుఁడై ననలువచరణములకు
మ్రొక్కి తత్ప్రసాదమును బొంది మృత్యువు, ధేనుకాశ్రమంబు గాన నేగె. 249

వ. ఇట్లు మృత్యుదేవి ధేనుకాశ్రమంబునకుం జని యం దింద్రియంబుల గుదియించి యేకపాదస్థితయై యేకపద్మవర్షంబులు నంత సప్తపుణ్యారణ్యంబులయం దేకపాదంబున నిలిచి చతుర్దశపద్మవత్సరంబులు నవల మృగంబులం గూడి పద్మాయుతపరివత్సరంబులును బిదప నందానదీజలంబుల నెన్మిదివేలసంవత్సరంబులును నవ్వల వాయుజలాహారయై కౌశికీనదియందునుం బదంపడి పంచగంగలయందును నంత మేరుపర్వతంబునందును హిమవచ్ఛిఖరంబునందును బుష్కరంబులందును గోకర్ణంబునందును మలయంబునందును నైమిశంబునందును నంగుష్ఠాగ్రంబున నిల్చి ఖర్వనిఖర్వహాయనంబులును సలిలపవనమాత్ర శరీరయాత్ర నడపుచుఁ బరమనియమవ్రతంబునఁ బితామహుం గూర్చి పరమతపంబు గావించె నంతఁ బరమేష్ఠి దాకనిష్ఠకు మెచ్చి ప్రత్యక్షంబై యి ట్లేల ఘోరతపంబు సేయుచుంటి వనుటయు నద్దేవి బ్రహ్మదేవునకు నమస్కరించి యిట్లనియె. 250

ఉ. కుత్తుక నుల్మి నేఁ బ్రజలఁ గూల్పఁగఁ జాల నధర్మభీతి నా
చిత్తమునందుఁ బొందుపడఁ జేస్పడి నిన్న భయంబు వేఁడికో
నిత్తపముం బొనర్చితిని నేఁడులు పూఁడులు గాఁగ నార్తనై
తత్తఱమందుచున్న దయ దాఁకొనఁ బ్రోవ ననుగ్రహింపవే. 251

వ. అనినం జతురాననుం డాసాధ్వి కిట్లనియె. 252

సీ. నానియోగంబున మానినీ! నీకధర్మము రాదు ప్రజలఁ జంపఁగ నమరిన
నెపుడును నామాట మృష గాదు గానఁ జ, తుర్విధప్రజలను దునుమ నగును
నిను సనాతనధర్మ మొనరఁ జేరు యముండు, వ్యాధులు నీకు సాయం బొనర్చు
నీ కిట్లు వేళ్ళులు నేనును వర మిత్తు, మీఁవు విరజ వయి యెసఁగు మనిన
తే. మృత్యు విట్లను దప్పని దేని నీవు
నాజ్ఞఁ గైకొందుఁ గాని పెం పలర వలయుఁ
గ్రోధలోభేర్ష్యలు నసూయ ద్రోహ మోహ
ములును నహ్రీయు జనులను గలఁచికొనుచు. 253

వ. అనిన హిరణ్యగర్భుండు మృత్యువుదిక్కు మొగం బై మగువా! నేను నీచెప్పిన చొప్పునం జేయువాఁడ మఱియు నానాఁడు నీయశ్రుజలంబులు నాచేతం బట్టి నవి రోగంబు లై లోభాదులకుం దోషపడి ప్రజలం బీడించు నిట్లు హతప్రాయు లై కాలపక్వంబు నొందిన ప్రాణులం గామరోషణంబులు లేనినీవు చంపిన నిన్ను నిందయు నధర్మంబు నొందవు నీవు ధర్మనిత్యవు ధర్మేశ్వరివి నా నొప్పుచుందు వనిన నది శాపభయంబున దాని కియ్యకొనియె నది యె మృత్యువునాఁ బడి రోగోపహతు లగువారిం జంపుచుండు నని వెండియు. 254

ఉ. ప్రాణుల కెల్ల మృత్యు వది ప్రాణము దీసెడునట్టి దాను గీ
ర్వాణులు గూడ మృత్యువును బాయఁగఁ జాలరు వారు సచ్చి యీ
క్షోణిపయిం జనించెదరు కొందఱు మర్త్యు లమర్త్యు లై కడుఁ
రాణ లెసంగుచుందు రిటు గ్రాలుచు నుండుఁ బ్రవాహరూప మై. 255

తే. భీముఁ డుగ్రతేజుండును భీమకర్ముఁ
డైనవాయు వొండొక్క దేహంబు సొచ్చి
యచ్చట వెలింగి కొన్నినాళ్ళవలఁ జేరు
మఱియు నొకదేహమం దిదే మరణ మనఁగ. 256

చ. మరణము దైవనిర్మితము మానవనాయక! ప్రాప్తకాలమం
దరయఁగ వచ్చు నెట్టివిధి నైనఁ దమంతన తాము గూడ నం

హరణము చేసికొందు రిది యంతయు నిట్లని లో నెఱింగి వం
దరు మృతులైనవారికి బుధప్రవరుల్ లవమాత్రమేనియున్. 257

ఆ. దైవసృష్టి యిట్టిదారి నెసఁగెడు, ననుచు నిజ మెఱింగినట్టిదైన
నరుల గెలిచి స్వర్గపురికి నేగిననీదు, తనయుమృతికి వగవ వని తలంతు 258

క. అని నారదుండు సెప్పిన, జనపతి గతశోకమైనస్వాంతముతోడన్
మునినాథ! కృతార్థుఁడనై, తిసి నీకతమున నటంచుఁ దెలిసి భజించెన్. 259

వ. నారదుండు నకంపనుని వీడ్కొని నందనవనంబునకుం జనియె విను మయ్యితిహాసంబు వినినఁ బఠించిన నాయురారోగ్యైశ్వర్యప్రదం బగు నని పారాశర్యుండు సెప్పిన నప్పాండవాగ్రజుండు క్షత్రధర్మస్వరూపం బిట్టిది కదా పథాభ్యుత్థుండు గాక పలువురతోడం బోరి శస్త్రమరణంబు నొందినసౌభద్రుండు వీరస్వర్గంబు నొందు నని యుపశమితశోకుం డై వ్యాసభట్టారకుం జూచి తొల్లింటిరాజర్షు లెట్టిదక్షిణలం బెట్టి యధ్వరంబులు చేసి యెట్టిలోకములం బొందిరెఱిఁగింపు మనిన నతం డతని కిట్లనియె. 260

క. వీరస్వర్గము నొందిన, వారికి సవనములు సేయువారికి నేయే
తీరుల నంతరమో నీ, వారయ నడిగితివి గాన నంతయు వినుమా. 261

తే. శైబ్యనకుఁ బుత్రుఁడై సృంజయుఁడు తొల్లి, యుర్విఁ బాలించుచుండంగ నొక్కనాఁడు
వానిమిత్రులు నారదపర్వతు లట, వచ్చి కొన్నాళ్ళు వసియించి రిచ్చకొలఁది. 262

వ. ఇట్లుండునంత నొక్కసమయంబున సృంజయునికన్యారత్నంబు తండ్రికడకు వచ్చి నమస్కరించి యున్నం గని పర్వతుం డిట్లనియె. 263

ఉ. కన్నియ చంద్రరేఖవలెఁ గ్రాలుచు నున్నది సర్వలక్షణా
భ్యున్నతి నెన్నఁగాఁ బడుచు నుర్విపయిం బొడకట్టు శ్రీ యనన్
జెన్నలరారు నెవ్వతియొ చెప్పుము నావుడు సృంజయుండు సం
పన్నమతిన్ వచించె మునిమాన్య! యెఱుంగుము నాదుకన్యగన్. 264

క. అనునంత నారదుండును, జననాయక దీని నాకు సహధర్మిణిఁ గాఁ
గొన నిత్తువట్టె యనుడున్, మునికిచ్చెద ననుచుఁ దెలిపె భూపతి యంతన్. 265

వ. పర్వతుండును గ్రుద్ధుండై నారదుం గాంచి నేను హృదయపూర్వంబుగ వరించిన మించుఁబోఁడి నీవు వరించితివి గావున నీకు స్వర్గగమనంబు లేకపోవుఁ గాక యని శపించిన నారదుండును గోపించి. 266

తే. మనము వాక్కును బుద్ధియు మాటయొప్పు,దల యుదకపూర్వమ్ము నవలఁ గరగ్ర
హణము సప్తపదియును వరణము లక్షణము లి వన్నియు నైన పై నమరు సతిగ.

వ. ఇట్లు నాకు మనస్సంకల్పం బైనమాత్ర భార్యాత్వంబు సిద్ధింప నేర దిట్లుండంగ నీవు నన్ను శపించితి కావున నేను లేకుండిన నీకును స్వర్గగమనంబు ప్రతిహతం బయ్యెడుం గావుత మని పర్వతునకుం బ్రతిశాపం బిచ్చె నిట్లు వారన్యోన్యంబు శపించుకొనియుం బుత్త్రార్థి యగుసృంజయునింట వేదవేదాంగవిదు లగువిప్రులం గూడి యాచ్ఛాదనభోజనాదులం బరితుష్టిం గాంచుచుండి రట్టియెడ బ్రాహ్మణు లాబ్రహ్మపుత్త్రుం గాంచి యానృపాలున కొక్కపుత్త్రు ననుగ్రహింపు మనిన నతం డట్లగుం గావుత మని సృంజయునిదిక్కు మొగం బై నీ కెట్టిపుత్త్రుండు గావలయునో వరంబు వేఁడు మనినఁ బ్రాంజలి యై యతం డతని కి ట్లనియె. 268

తే. వినయవంతుఁడు గుణగణాన్వితుఁడు హితుఁడు
సుతుఁడు తేజస్వియు యశస్వి క్షితి నెసంగ
దలఁతు వానిమూత్రపురీషములును బుసియు
శ్వేదలాలాశ్రువులు పైఁడిఁ జెంద వలయు. 269

—♦ సువర్ణష్ఠీవిచరిత్రము ♦—

వ. అనిన నట్ల యగుం గావుత మని వరం బొసంగి నారదుండు సపర్వతుం డై చనియె నంతఁ గాలక్రమంబున సృంజయున కట్టికుమారుండు పుట్టిన వానికి సువర్ణష్ఠీవి యనుపేరు పెట్టె నప్పట్టిమూత్రపురీషాదులం బుట్టినసువర్ణసంచయంబున సృంజయుండుగృహప్రాకారగోపురబ్రాహ్మణాయతనశయ్యాసనస్థానస్థాలీపిఠరభాజనాదు లన్నియు సువర్ణమయంబు గావించుకొని సంతసించుచుండె నంతఁ గొంత కాలంబున కొక్కనాఁడు. 270

ఉ. తెక్కలికాండ్రు దాని విని తెంపున రాజగృహంబు సొచ్చి తా
రొక్కనిశీథినిన్ సుతుని నొంటరివాని గ్రసించి కొంచుఁ గా
రెక్కినకాననంబునకు నేగి యటన్ విశసించి పొట్టలో
నొక్కసుమంత యేఁ గనక ముండుట గానక కావరమ్మునన్. 271

తే. నరములుం ద్రేవులుం దీసి నలుగడలను, గలయఁ గాఁ బాపి జల్లించి కాంచనంబు
కానవయుఁ గాంచఁ జాలక రోసి శవము, వైచి పోవుచు వారిలో వారి కచట. 272

క. చేసినకర్మఫలంబునఁ, జేసి పరస్పరము పోరు సెల్లఁగ నగుటన్
నాసిరిలి రెల్ల రొండొరు, రోసమ్మున నేసికొనుచు రూక్షాస్త్రములన్. 273

వ. అట సృంజయుండును గొడుకుం గానక వెదకి తద్వృత్తాంతం బంతయుం దెలిసి వరదత్తుం డగుపుత్త్రునిపోకకు శోకార్తుం డై విలపించుచున్నంత నారదమునీంద్రుం డచ్చోటికి విచ్చేసి యచేతనుం డట్లున్నసృంజయుం గాంచి యి ట్లనియె. 274

మ. తనివిం జెందఁగఁ బోలు గామములచేంతోఁ మర్త్యుఁ డీల్లేడ్చుచుం
డినఁ బారంబును బొందఁ బో దెపుడుఁ గానీ వచ్చునే చచ్చిన
ట్టినరుం డేన్చుట చిత్తతాపమునకై డింకించు నీ విం కిటఁ
వసటం గుందకు మెట్టిదుఁ బ్రతుకఁ బోవం జాలఁ డాలింపుమా. 27

—♦ నారదుండు చెప్పినషోడశరాజచరిత్రము ♦—

సీ. తొలి నవిక్షితునిపుత్త్రుఁడు మరుత్తుం డను, రాజర్షి మిక్కిలి తేజుఁ గాంచి
సంవర్తుఁడనుముని చాలి గీష్పతితోడి, స్పర్థఁ గైకొని తన ప్రార్థనమునఁ
జనుచెంచి బసదనంబు నొసంగి యాజకుం, డయి హిమవత్పాదమందుఁ బొంద
యజ్ఞవాటంబులు యజ్ఞోపకరణంబు, లన్నియు స్వర్ణమయములు గాఁగ
తే. విశ్వస్రష్టలు నింద్రాదివిబుధవరులు, హవ్యముల కై పరిచ్ఛదు లై మరుత్తు
లును సదమున విశ్వేదేవులును దలిర్ప, బహులదక్షిణఁ బెక్కుసవము లొనర్చె.

చ. సవముల భూరిదక్షిణ లొసంగియు దానము లెన్నొ చేసియుఁ
భువిఁ గలయెల్లవారలకు భోజ్యము భక్ష్యము చోష్యలేహ్యముల్
దవులఁగఁ గామితాన్నము సదధ్యమృతాజ్యము గా భుజింపఁ జే
సి వరవిభూషణాంబరవిశేషము లిచ్చె మరుత్తుఁ డాఘ్యుఁ డై. 277

క. దేవర్షిపితృప్రీతిగ, నేవేళఁ బ్రహ్మయజ్ఞ మొనఁగించుచు నా
భూవరుఁడు రాజ్య మేలెన్, దేవేంద్రమహావిభూతి తేజరిలంగన్. 278

తే. రాష్ట్రమునఁ గోరినట్లు వర్షములు గురియ
సస్యసంపద పెంపొంద జను లనామ
యులై నెసంగ వేయం డ్లమాత్యసుతదార
సహితుఁ డై రాజ్యసుఖ మంది చనియె దివికి. 279

తే. నీకొడుకుకన్న నాపృథివీశు పుత్త్రుఁ, డెంత శ్రేష్ఠుఁ డై నవాఁ డెంతలేసిపనులు
సలిపి నలిఁ డట్లు ధర వీడి చనియె నన్నఁ, గన్నుఁ దెలవనికూనకై చన్నె వగవ.

సీ. మఱియు సుహోత్రుఁ డనుమ నుజేశ్వరుఁడుధర్మ, మునఁబొందిరాజ్యంబుఘనులవలన
దాన మిచ్చియు ద్విషద్దళనంబు పాలనం, బును దనధర్మంబు లని యెఱింగి
వేల్పుల సేవించి విమతులఁ దూలించి, భూతక్షేమంబు గా భూమి నేలి
జారచోరఖలప్రసంగతిఁ దొలఁచి నై, చ్ఛాటవికాదుల నడఁచి వైచి
తే. తనకుఁ బర్జన్యుఁ డేఁటేఁట దయదలిర్పఁ, గనకకర్కటమత్స్యాదికములఁగుఱియఁ
గూపవాపీతటాకముల్ గొట్లుబోలెఁ, గాంచనమయంబు లై యొప్పు గాంచెనపుడు.

ఉ. ఆతనిపుణ్యకర్మమున కాపరమేశ్వరుఁ డిచ్చ మెచ్చి య
త్యాతతకీర్తియుఁ జయము నక్షయవిత్త మనుగ్రహించె వి
ఖ్యాతము లైనవానివివిధాధ్వరకోటులఁ బాత్రభాజన
వ్రాతములున్ నగళ్ళఁ గలవస్తులు స్వర్ణమయంబు లారయన్. 291

ఉ. అన్నపురాసు లద్రులుగ నాజ్యపయోదధు లెల్లవేళ న
త్యున్నతరీతి నౌనదులయొప్పున నొప్పఁగ బాడబాస్యమం
దెన్నఁగఁ జేరు నాయొడయునింట నతండును రిత్తవోయె నీ
చిన్నిసుంగు వానికడఁ జెప్పఁగ నొప్పినవాఁడె చెప్పుమా. 292

క. సుగుణగణంబుల ప్రోవై, జగతిం గల ప్రజల నెల్ల స్వప్రజల బలెన్
దగ నేలి చనియె రాముం, డగణితయశుఁ డతని నెఱుఁగ వట్టె మహీశా. 293

సీ. పితృనిదేశమ్మున సతితో ననుజుతో వనములకుఁ జని పదునాలుగేండ్లు
నిలిచి జనస్థాననిలయరాక్షసులను, బదునాల్గువేవుర మద మడంచి
తనసతి నపహరించినరావణుని జగత్కంటకుని సహానుగముగఁ గూల్చి
దేవర్షిసేవితుం డై వసుధం బదునొకండువేలేం డ్లేలి సకలజనుల

తే. నశ్వమేధాదిసవనము లాచరించి, గురుమహత్త్వమునం గీర్తి కొనలుసాఁగ
నిజకులము నెన్మిదిగతుల నిలువఁ బెట్టి, రాముఁ డొప్పెను సుగుణాభిరాముఁ డగుచు.

ఉ. ఆఁకలిదప్పు లాధులును వ్యాధు లనర్థము లగ్నిబాధలున్
లేక యకాలమృత్యుభయలేశ మెఱుంగక సర్వసౌఖ్యముల్
గైకొని లోకు లొప్పి రొకకాలముఁ జేయఁడు పెద్ద పిన్నకున్
శోకముతోఁ బితృక్రియలు శూరుఁడు రాముఁడు రాజ్య మేలఁగన్. 295

ఆ. క్రూరజంతుబాధ కొని యెఱుంగక ప్రజల్, వేదమతమునంద వెలసి హవ్య
కవ్యములను దేల్చి క్రతుభుజులం బోలి, చెలఁగి రపుడు దీర్ఘజీవు లగుచు. 296

క. రాముఁ డెసంగెడునాఁడు, భూమండలమంద దేవపుంగవులు ముని
స్వాములు మర్త్యులు పొదలి ర, సామాన్యగతిం బొనర్చి సహవాసంబున్. 297

తే. ఖలు లధర్మపరుల్ లుబ్ధకులును మూర్ఖు
లును శఠులు క్రూరులు నృశంసులును బిశునులు
జారులును జోరులును లేక సర్వవర్ణ
ములును శిష్టకర్మంబుల వెలసె నపుడు. 298

ఆ. ఈతిబాధ లెఱుఁగ కేతఱి ధర్మంబ, పట్టుకొమ్మ గాఁగ బహులసంత
తులను బడసి కామములపొంతఁ బోవక, ప్రజలు సిరి నెసంగి పరఁగి రపుడు. 299

ఉ. రాముఁడు రాజ్యమేలుతఱి రాముఁడు రాముఁడు రాముఁ డంచు మా
రామునిరాజ్య మంచు రఘురామునివారము మే మటంచు నా
రామకథాసుధాలహరిఁ గ్రాలి ప్రజాలి దలిర్చె నట్టిశ్రీ
రాముఁడు వోయె నన్న నితరంబులకు న్వగవంగ నుండునే. 300

వ. మఱియు నాకర్ణింపుము భగీరథుండు. 301

క. పితరులసద్గతికి సమం,చితగతిఁ దనపేర గంగ క్షితిపైఁ బాఱిం
చి తగఁగ గన కేష్టకలఁ,జితిఁ జయనము చేసె నతనిఁ జెప్పఁగ వినవే. 302

సీ. కన్నియ లొక్కొక్కకనకరథంబును, రథమునకుఁ నాల్గురథ్యములును
బ్రతిరథ్యమునకును బంచవింశతిహస్తు,లును బ్రతిహస్తికిఁ గనకమణులు
రాసుతునకు వేయిభాసురాశ్వంబులుఁ, బ్రత్యశ్వమునకునుఁ బరిఢవిల్లు
నావులు నూఱునూ ఱావునకును నూ ఱ,జావికంబులు గాఁగ సంతరించి
తే. వేయివేలైనకన్యల వేయివేలు,రాజపుత్రుల నా భగీరథుఁ డలంక
రించి విధివిహితముగఁ గావించినట్టి,మఖములఁ దక్షిణగ నిచ్చె మహిసురులకు.

శా. ఆయైక్ష్వాకుఁడు జన్మముల్ సలుపువాఁడై యెందు నెం దేగునో
శ్రేయోదాకముల్ మహీరుహతతుల్ చెల్వార నం దేగు నా
రాయం డొక్కతఱిన్ యజించునపు డర్హాప్రక్రియన్ వచ్చి స
ద్గేయాకారముతోడ గంగ కుఱు వెక్కెన్ వానికిం గూఁతు రై. 304

క. స్థావరజంగమహితుఁ డా,త్మారమణుఁడు సెల్లెఁ దిరుఁడు గాక ధరిత్రిన్
భూరమణ యెఱిఁగి యెఱిఁగియు, వారక యేడ్చెదవు కందు వడినందులకున్. 305

సీ. అతులజలస్తంభనాదివిద్యలు నేర్చి, పగఱ నోర్చి ధరిత్రిఁ దగఁ దలిర్చి
యుపకరణము లన్నియును బైడి నిర్మించి, శతసహస్రములు యజ్ఞములు చేసి
వసుపూర్ణ మైనయీవసుధాతలం బెల్ల,దక్షిణగా విప్రతతికి నిచ్చి
యిష్టమృష్టాన్నసంతృప్తి గావించి వ,చ్చినవేల్పులకుఁ బూజ లొనరఁ జేసి
తే. తనదునింట నెప్పుడును స్వాధ్యాయఘోష,ములును మౌర్వీగుణధ్వానములును దినుఁడు
త్రావు డనుశబ్దములు వినఁ దవులఁ జేసె, నతఁడు సామాన్యుఁడే దిలీపాధిపుండు.

క. ఇలబిలుఁ డాదిలీపుడు, కాలవశంబైనను బడియెఁ గదె నీసుతునిం
బోలింపు మతని కెన్నవ,పాలో నీ యేడ్చు టెంతభావ్యమొ మదిలోన్. 307

మ. పదిరెండేఁడులవాఁడ వై సకలసౌభాగ్యంబులం బర్వి యొ
క్కదినం బంధసుధన్వశూనగయముఖ్యద్వేషులం గెల్చి తా

నుదయం బస్తనగంబు నెల్లలుగ నౌనుర్వీతలం బెల్ల ను
న్మదుఁ డై యేలినవానిని న్వినవొ మాంధాతృభూమావల్లభా. 308

సీ. యువనాశ్వుఁ డనునృపుం డొక్కనాఁ డడవికి, మృగయావిహారార్థ మేగి యచటఁ
దృషితుఁ డై యొకచోట ఋషిసత్రవాటికఁ, గని చొచ్చి పుత్రార్థకల్పిత మగు
పృషదాజ్యమును గ్రోలి వెసఁ జూలు దాలిచె, దత్ప్రభావంబున ధరణిభుజుడు
కనుప్రొద్దు లరుదేరఁ గవ లశ్వినులు వచ్చి, గర్భము వెలలించి రర్భకు నట
తే. నపుడు వేల్పులతో నింద్రుఁ డరుగుదెంచి, జనకునుత్సంగమున నున్నతనయుఁ గాంచి
నన్నుఁ ద్రావుమనుటకుమాంధాతయనుచుఁ,బిలుచుచుఁదదాస్యమునఁదన వ్రేలు పెట్టె.
ఉ. వ్రేళులలోఁ బయోమృతము వెక్కస మై ప్రభవించునట్లుగా,
వేలుపుఱేఁడు చేసి తనవ్రేళ్ళ నొగిం బదిరెండునాళు లా
బాలునినోటఁ బెట్టుటయు బాలుఁడు నయ్యమృతంబు నిచ్చలుం
గ్రోలి ప్రవృద్ధి నొందెఁ దనకుం సురవల్లభుపిల్పె పేరుగన్. 310
ఆ. పదియు రెండునాళ్లు పరఁగినయంతన, పదియురెండునేండ్ల బాలుఁ డగుచు
నెల్లవిద్య లెఱిఁగి ముల్లోకములు గెల్చె, యావనాశ్వుఁ డొక్కయహమునంద.
వ. మఱియు నమ్మాంధాత వాజిమేధశతంబును రాజసూయశతంబునుం జేసి పండిత ప్రకాండు లైన బ్రాహ్మణులకు భూమండలం బంతయు నిచ్చుటయు కాక యేక యోజనోన్నతంబులును దశయోజనాయతంబులు నగుహిరణ్మయమత్స్యంబులం జేయించి యిచ్చి యిష్టాన్నసంతృప్తులం జేసె నాసవనంబులకు భూతలంబునం గల వేదవేదాంగపారగు లగుభూసురులును నింద్రాదిబృందారకబృందంబులును దివ్య ఋషులును విచ్చేసి యర్చితు లయిరి తత్ప్రభావంబునం జేసి మహాప్రభావసం పన్నుం డయినయన్నరేంద్రుండు జగత్ప్రఖ్యాతిం గాంచి కీర్తిశేషుం డయి పోయెఁ గానిభూతలంబునఁ నుండఁ జాలం డయ్యె నింక ముక్కుపచ్చలాఱనినీకొడుకుమాట యేమి చెప్పవచ్చు నాకర్ణింపుము. 312
క. ధరణీమండల మంతయుఁ, బరిపాలించుచును విబుధవర్గంబులకున్
జిరమిత్రుఁ డై మహాత్మ్యగరిమం జనునాహుషుండు గలుగన్ వింటే. 313
సీ. రాజసూయశతంబు వాజిమేధశతంబు, పౌండరీకసహస్ర వాజిపేయ
శతములు నతిరాత్రశతదశకంబు న,గ్నిష్టోమముఖ్యసంకీర్తితాధ్వ
రములు పెక్కులు చేసి బ్రాహ్మణులకు భూరి,దక్షిణ లిచ్చి భూతలమునందుఁ
గామచారము పెంపు గలిగి రెండవయింద్రుఁ, డయి నహుషాత్మజుం డగుయయాతి

తే. దేవయానిని శర్మిష్ఠ దేవులుగను, బడసి పుత్త్రులఁ గని పూరుఁ బుడమి నిలిపి
పరమవైరాగ్యమునఁ దపోగరిమఁ దనరి, పొందె నుత్తమగతు లాతఁ డిందుఁ గలఁడె.
క. ఈలోకమ్ములనుండియు, నాలోకంబునకుఁ బోవ నర్హుం డగునా
భూలోకేంద్రుం డిట్లయి, పో లా వతి చిఱుత కేడ్వఁ బోలునె చెపుమా. 315
సీ. శస్త్రాస్త్రవిద్యావిశారదుం డయి పర్వ, వేయివే లైనభూవిభుల గెలిచి
తనవశంబుగఁ జేసికొని వసుంధర యెల్ల,విధివిధంబుగ యజ్ఞవితతిఁ జేసి
మోదకాపూపముల్ పూరికశష్కులుల్, మైరేయకకరంభ మధుఘృతములు
దధిపయఃఫలములు ధవళాన్నమును బాన,కాదులు తృప్తిగా నవనిసురుల
తే. కనిశమును బెట్టి ఋత్విజు లైనవారి, వశముగాఁ జేసె భూపాలవరుల నెల్ల
శతసహస్రము లగుమణిస్వర్ణకోశ,తతుల నంబరీషుఁడు యజ్ఞదక్షిణలుగ. 316
శా. ఈనాభాగునిఁ బోల ముంగ వెనుక లేపృథ్వీశులున్ దక్షిణా
దానంబుం బొనరించి యుండ రని మోదం బొప్ప దేవర్షు లెం
తేనిన్ స్తోత్రము సేయఁ జొచ్చి రమరుల్ దివ్యప్రభావంబు సం
ధానం బొందగఁ జేసి రాన్నృపతి యీధాత్రిం బెడం బాయఁడే. 317
క. అంతలు న ట్లయి పోవుఁడు, నింతల కీచింత నీకు నేమిటికి మహీ
కాంతుడ! శశిబిందునివృ,త్తాంతము చెప్పెదను వినుము తాత్పర్యమునన్. 318
సీ. శశిబిందుఁ డనురాజు శతసహస్రస్త్రీలఁ, బెండ్లి యై యొక్కొక్క వెలఁదియందు
వేవురు వేవురు గా వేడ్కఁ బదికోట్ల,తనయులఁ గని వారి కనుదినంబు
వేదమ్ములన్ ధనుర్వేదంబున న్నేర్పు, గలిగించి సంతోషకలితుఁ డగుచు
సకలోపకరణముల్ స్వర్ణమయములుగా, నశ్వమేధశతమ్ము లాచరించి
తే. యెల్లపుత్త్రుల ద్విజులకు నిడియె నొక్కొ,కనికి నూఱేసితే ర్లన్నిగజము లంద
ఱేసికన్నియలును గాఁగఁ జేసి యెల్ల, రిట్టిదానము లే దని మెంచి రపుడు. 319
తే. మఱియు నతఁ డిచ్చెఁ గన్యకామణులతోడఁ
గన్నియకు నూఱుగజములు గజమునకును
నన్నిరథములు రథమున కన్నిహరులు
హరికి వేయావు లజములు నన్నిగాఁగ. 320
క. తనసర్వస్వము ఋత్విజనమున కిడి సర్వలోకసన్నుతుఁ డగునా
జననాథుఁ డెల్లకాలము, మన కేగెనే దివికి నింక మాటలు వలెనే. 321
క. హుతసంశిష్టాశనుఁ డై, వ్రతనిష్ఠను గొలిచి నూఱువర్షము లగ్నిన్
క్షితి నేలి సర్వలోక,స్తుతుఁ డయ్యెక గయుఁడు వానిశుభచరితంబుల్. 322

వ. ఆకర్ణింపు మాగయుండు. 323

సీ. బ్రహ్మచర్యంబున వ్రతమునం దపమున, సన్నియమగురుప్రసాదములను
వేదవిజ్ఞత్వము వెలయ ధర్మంబున,ను నహింస నక్షయధనము వడసి.
విప్రుల కిడు నెడ విడని శ్రద్ధయు నన,న్యసతులయం దపత్యంబు గనుట
యన్నదానము నెడ నాసక్తియును ధర్మ,కార్యంబుల నవిఘ్నగతి దగులుట

తే. వరములం బొంది హుతభుజువలన నూఱు,వర్షములు పర్వముల యాగపరతఁ దనరి
యదనువడుఁ జాతుర్మాస్యలాగ్రయణము,విడక వేలిచి పెంపం దెనొడయుడతఁడు

మ. వఱువాతం దగ లేచి ప్రత్యహము భాస్వత్కీర్తి యాతండు మే
ల్వఱలన్ గోవులు లక్ష లక్షకును బైపై స్వర్ణనిష్కంబులన్
నఱయెన్లుం బది వేలు నన్నిహరులుం దానంబు గావించె నే
కొఱయుం గాంచక నూఱువర్షములు నెక్కొ సువ్రతం బిగ్గతిన్. 325

సీ. నక్షత్రముల నిష్టు లక్షయంబుగఁ జేసి, తగ నిచ్చె నక్షత్రదానములను
మహి యంతయును స్వర్ణమయమును మణిశర్క,రాంచితం బగునట్లు లాచరించి
హయమేధమునయందు నవనీసురుల కిచ్చె, స్వర్ణయూపాదుల సత్కరించి
యఖిలభూములయందు నగు నెల్లప్రాణులు,సంతృప్తి నొందెఁ దత్సమయమందు

తే. నతనియజ్ఞవేదిక యిర్వదాఱుయోజ,నమ్ము లాయామమును నాయతమ్ము మూఁడు
పదులయోజనములు గల్గి భర్మనిర్మి,తమ్ము నయి వెన్క నది విప్రధనమ యయ్యె.

చ. నదులను బర్వతంబుల వనంబుల నబ్ధుల న్నభంబు నం
బొంద లెడుభూతజాలమును మూఁడును బ్రొద్దులు మెక్కిపోయినన్
దుద కట నన్నభూధ్రములు దొడ్డవి యిర్వది యైదు నాజ్యపుం
గదులును వస్త్రభూషలును గన్గొన శిష్టము లయ్యె మెండుగన్. 327

ఆ. అతనిపేర నక్షయవటప్రసిద్ధమై, క్షేత్ర మయ్యె జగతిఁ జెప్పనొప్పి
వానిపేరుమాత్ర వసుమతి నగునట్టి,పుణ్యపురుషుఁ డిపుఁడు పొసఁగు నయ్య. 328

చ. ఇరువదివేలసూదు లెపుడేని మహానసము న్విడంగఁ బో
కరుదుగ జేలునుం బవలు నంచిరీత్తుల వండుచుండఁగా
సరసచతుర్విధాన్నములు సంతతమున్ భుయిజింపఁ బెట్టె భూ
సురులకు రంతిదేవుఁడు విశుద్ధచరిత్రుఁడు రాజ్య మేలుచున్. 329

తే. పశుగణంబులు స్వర్గంబుఁ బడయఁ గోరి,తమకుఁ దా వచ్చినన్ వానిఁ దగ నెఱింగి
రంతిదేవుఁడు తనమునత్రంబునందు, వాని విశసించి వేల్చెను బ్రత్యహంబు. 330

తే. అమ్మహీపాలునిమహానసమ్మునందు, విశసనము సేయఁగా నైనపశుగణంబు
చర్మములనుండి పాఱెడుజలములెల్ల, నలరెఁ జర్మణ్వతి యనంగ నాపగ యయి. 331

సీ. వేదవేదాంగవిద్విప్రుల రప్పించి, నీ కొక్కనిష్కంబు నీకు నొక్క
నిష్క మంచును బల్కి నిష్కసహస్రము, లిచ్చి వారల కిచ్చి యిచ్చి మఱియు
నీనాఁట నత్యల్ప మిచ్చితి నని నిష్క,కోటి నిచ్చియుఁ దృప్తిఁ గొనఁ డతండు
ద్విజపాణియం దిట్లు విడకున్నఁ డాతఁ, డస్తమించినయట్లు లడలు గుడుచు

ఆ. స్వర్ణగోశతంబు సౌవర్ణవృషభసహస్రమును శతాష్టహాటకములు
దనరు నొక్కనిష్క మనఁగ సంజ్ఞ గొని, రంతిదేవునింట సంతతంబు. 332

వ. ఇట్లతండు నియమవ్రతంబుగ నూఱేండ్లు సాఁగించుచు ననేకాధ్వరంబులు
గావించి యజ్ఞోపకరణాగ్నిహోత్రోపకరణంబులును గరకకుంభస్థాలీపిఠరశయ
నాసనయానప్రాసాదగృహాదు లన్నియు సువర్ణమయంబులుగాఁ జేయించి బ్రాహ్మ
ణసాత్కృతంబు గావించుచుండు నట్టిరంతిదేవునియింటఁ గలద్రవ్యంబు కుబేరు
నింటను లే దని సువ్యక్తం బయ్యె నమ్మహీపాలుమహానసంబునఁ బ్రతిరాత్రంబు
నందును నతిథిపూజార్థం బిరువదియొక్కవేలుగోవులు విశసింపఁ బడుచుండు దేవత
లును బితృదేవతలును బ్రత్యక్షంబుగ వచ్చి వానియింట హవ్యకవ్యంబులు గొను
చుండు రట్టిమహానుభావుండును మహీతలంబుఁ బెడబాసి చనియె నాతనికన్న
నీకన్నకొడుకు మిన్నయే మిన్నకుండు మని వెండియును. 333

మ. మును దుష్యంతునకున్ శకుంతలకు సంపూర్ణప్రభావంబునం
దనయుం డై ప్రభవించి కణ్వమునిచేతం బెంపఁగా నై వనీ
ఘనసత్త్వంబుల నొంచి సత్త్వదమనాఖ్యం గాంచి యంతన్ ద్విష
జ్జనులం గూలిచి చక్రవర్తి యగుచున్ జానొందె నాలించితే. 334

సీ. యమునానదీతీరమందు నూఱును సరస్వతిచెంత మున్నూఱు జాహ్నవికడ
నమర నన్నూఱు గా నశ్వమేధంబులు, రాజసూయశతంబు వాజపేయ
శతసహస్రంబును సర్వతోముఖవిశ్వజిదతిరాత్రోక్థ్యాదిసదమలాధ్వ
రమ్ములు వేనవే లిమ్మహి నొనరించి, కోటానఁగోటులు మేటిధనము

తే. బ్రాహ్మణుల కిచ్చి నూఱుబారలపొడుగగు, స్వర్ణయూపంబులన్ వేయిపద్మములను
గణ్వముని కర్పణము చేసి క్రతుభుగాళి, ప్రస్తుతింపఁగ భరతుండు ప్రతిభఁ గాంచె.

తే. పసిఁడిగుఱ్ఱము లేనుఁగుల్ పద్మములును
రథము లుష్ట్రములును గూర్చి బ్రాహ్మణులకు

ధనము ధాన్యంబు ధేనువుల్ ఘనగృహములు
గ్రామములు నిచ్చె నూఱుకోట్లామహీపతి. 336

క. దీనత్వ మెఱుఁగ కెప్పుడు, మానితగుణుఁడై సమస్తమహీమండలమున్
బూని ప్రజ నేలి పోయిన,వానికి నీసుతున కెంత వాసియొ కనుమా. 387

క. ప్రథఁ గాంచుటఁ బృథుఁ డనుచున్, బృథివీస్థలిఁ బేరు గాంచి వేనసుతుండు
త్పృథముం జేసెను మున్నా,కథ నీకుం దెలియ దేమొ కైకొని వినుమా. 338

సీ. పృథుచక్రవర్తి మున్ బృథివీపతిత్వముఁ, గొనినకాలమ్మున వనధి కాంచి
సస్యాంకురము లేమి స్వాదుఫలాదులు, దినుచుఁ గోమలదర్భలను శయించి
స్థిరార్థులై సుఖస్థితి నుండి నగరవి,భాగంబు లేక పర్వతములందు
వనములందు వసించి వనచరులట్టులై, ప్రజ లున్నయప్పుడు పరమఋషులు
తే. దేవగంధర్వముఖ్యు లాభూవరుఁ గని, నీవు సమ్రాట్ట వెల్లరఁ బ్రోవుమొక్క
వెఱవుగలిగించియనుడునాపృథువు మీకు, నిలయ దేశముసస్యముల్ వలయుఁజేయ.

సీ. అని ధనుర్బాణముల్ గొని యరదం బెక్కి, స్తంభనవిద్యచే జలధులందు
మెలఁగి సర్వద్వీపముల కేగి భల్లచ,యము నేసి మిట్టుపల్లముల నెల్లఁ
జమునుగా సవరించి జనపదనగరాదు, లొనరించి మనికిపట్లను ఘటించి
శిర మొక్కఁ డరివోసి ధరణి! కోరినరీతిఁ, బాఁడి నిచ్చెదొ లేదొ పలుకు మిపుడ
తే. యనుడు భూదేవినీకోర్కె నొసరుప మదిఁ, దలఁతు వత్సయుదోగ్ధయుఁ గలిగియున్న
నేను గోరూపమును బొంది నిన్ను మిగుల, నలరఁజేయుదు నని పల్కె నవనిపతియు.

వ. సంవిధానం బంతయు సమకూర్చి తద్వృత్తాంతం బంతయుం దన్నర్థించిన దేవర్షిపితృ
గణంబుల కెఱింగించుటయు నందు ముందు గోరూప మందియున్నభూదేవివలన
వనస్పతులు సాలంబు వత్సంబును ప్లక్షంబు దోగ్ధయు నౌదుంబరంబు పాత్రంబుగా
ఛిన్నప్రరోహణం బనుదుగ్ధంబు పిదికెఁ బర్వతంబులు మేరువు దోగ్ధయై యుదయ
పర్వతంబు వత్సమై యుండ నశ్మమయం బగుపాత్రంబున రత్నౌషధీదుగ్ధంబు బిదికె
నసురులు ద్విమూర్థుండు దోగ్ధయు ద్విరోచనుండు వత్సయును గా నామపాత్రం
బున మద్యరూపదుగ్ధంబు పిదికిరి మనుష్యులు స్వాయంభువు వత్సంబును బృథువు
దోగ్ధయును గాఁ బృథివీక్షేత్రపాత్రంబునఁ గృషిసస్యదుగ్ధంబులఁ బిదికిరి సరీసృప
ములు ధృతరాష్ట్రుండు దోగ్ధయుఁ దక్షకుండు వత్సంబును గా నలాబుపాత్రంబున
విషదుగ్ధంబు పిదికె సప్తమహర్షులు బృహస్పతి దోగ్ధగా సోమరాట్టు వత్సంబు
గా ఛందఃపాత్రంబున బ్రహ్మదుగ్ధంబు పిదికిరి పుణ్యజనులు దోగ్ధ వైశ్రవణుం
డును వత్సంబు వృషధ్వజుండును గా సామపాత్రంబున నంతర్ధానదుగ్ధంబు పిదికిరి

గంధర్వాప్సరసలు వత్సంబు చిత్రరథుఁడును దోగ్ధ విశ్వరుచియునుఁ గాఁ బద్మ
పాత్రంబునఁ బుణ్యాగంధదుగ్ధముం బితికిరి పితృదేవతలు వైవస్వతుండు వత్సంబును
యముండు దోగ్ధయును గా రజతపాత్రంబున స్వధాదుగ్ధంబు పితికి రిట్లు వారు
వారు వలసినతీరునఁ గామధేనువ యైనభూదేవివలనం బడయుటం జేసి తత్తత్పదా
ర్థంబులు సమృద్ధంబు లయ్యె నంత నాపృథుండును. 341
ఆ. అర్వదాఱువేలు నపరంజికుంజరం, బులును రత్నసహితభూతలములు
ద్విజుల కొసఁగె నతఁడు వివిధాధ్వరంబుల, నట్టివాఁడు దివికి నరిగె నట్టె. 342
సీ. తనతండ్రి కవమాన మొనరించి మించిన, కార్తవీర్యుని కల్గి ఖడ్గమునను
హైహయులం గూల్చి యంతఁ బోక యిరువది, యొకమాఱు ధరపయి నుండు నెల్ల
క్షత్రియులం జంపి సర్వసర్వంసహ, నిజవశంబునఁ బూని నిఖిలయజ్ఞ
ముల నొనర్చియు ఋత్విజుల కిచ్చి సప్తన, ల్వోత్సేధ మై పైఁడి నొప్పు వేది
తే. దస్యులును క్షత్రియులు లేనిధరణి యెల్లఁ, గశ్యపున కిడి సాగరగర్భమం దె
సఁగుమహేంద్రాద్రిపైఁ దపం బొగిఁ బొనర్చి, నట్టిజమదగ్నిరాముఁడు నరిగె దివికి.
తే. అంతలంతలు నేలపైఁ గొంతకాల, మున్నవా రయి పరలోక మొంది రకట
ముక్కుపచ్చలాఱనికుఱ్ఱఁ డిక్కరణి న, గుటకుఁ జింతింతు వే మనఁ గూడు నిన్ను.
వ. అని షోడశరాజచరిత్రంబు చెప్పిన విని సృంజయుం డేమియు నన కూర కుండు
టయు నారదుండు వెండియును. 345
మ. ఇవు డేఁ జెప్పిన దంతయుఁ మనమునం దీ వెంచి కైకోఁ దలం
చి పరిభ్రాంతిఁ దొలంచికొంటివఁటె నీచిత్తంబుమాలిన్య మి
య్యపురూపంపుకథావిధానమునఁ బాయం జేసితే కాక శూ
ద్రపతిశ్రాద్ధమువోలె రిత్త యయి యేతత్సర్వముం బోయెనే. 346
క. అనుటయు సృంజయుఁ డిట్లను, ననఘా! నీచెప్పినట్టియాఖ్యానములన్
మనమునఁ గలదుఃఖం బది, చనియెన్ రవిదీప్తిఁ దమము చనిన తెఱఁగునన్. 347
వ. నాకలఁత యంతయుం బాసె నేను ధన్యుండ నైతి ననిన దేవమునీంద్రుండు నీవు
న్యాంబునన నీక్యథాభరం బుడిగె మిథ్యావాదులము గానిమావలన వరంబొందు
వడయ నర్హుండ వనినం బ్రాంజలి యై యతం డతని కిట్లనియె. 348
క. మీరు ప్రసన్నుల రై యిటు, కోరుము వర మనుటకంటెఁ గోరికొన నొకం
డారయఁగ నుండునే యన, నారదుఁ డిట్లనియె మెచ్చి నరనాథునకున్. 349
ఉ. వల్లడికాండ్రచే వితగ వాసి చెడంబడి చచ్చి నారకో
త్ఫుల్లమహావ్యథం బడినపుత్త్రుని వెండియుఁ దెచ్చి యిత్తు భూ

వల్లభ ! సంతసింపు మని పల్కుచునుండ నతండు తత్ప్రభా
వోల్లసితస్వరూపమున నొప్పె నృపాలునిమ్రోల లీలమై. 350

వ. అంత సృంజయుండును సంతోషితస్వాంతుండై కుమారుం గూడి సంపూర్ణదక్షిణంబు లగునానావిధాధ్వరంబు లొనరించి పెక్కేండ్లు పూజ్యుండైనరాజ్యంబేలి స్వర్గంబునకు నిర్గమించె సువర్ణష్ఠీవి బాలుండు నకృతార్థుండు ననధీతవిద్యుండు నస్నాతకుండు ననాచరితాధ్వరుండు ననపత్యుండు నగుటం జేసి దేవముని వానిజీవింపంజేసె నభిమన్యుండు శూరుండును వీరుండును ధీరుండును గృతార్థుండును నధీతశాస్త్రుండు నై రణముఖంబున ననపరాఙ్ముఖుండై మరణించి వీరస్వర్గంబు నొందె వానికి శమదమాదినియమంబున నిష్ఠాగరిష్ఠులై నతపస్వులకును నానావిధాధ్వరకర్తలైనభూభర్తలకును గలలోకంబులు గల వతనిసుఖంబునకు విఘాతంబుగ మరల నీదుఃఖలోకంబునకుఁ దెచ్చుట తగవు గాదు గావున దేవలోకంబునకుం బోయినవానికై పరిదేవనంబు పాపం బని నిశ్చయించి మృత్యూద్భవాదికథాశ్రవణకారణంబునం జేసి యైన విగతవికారుండవై నీ వీశోకంబు దిగఁద్రావి శత్రుసంహారంబునకుం గడంగు మే నిదె పోయివచ్చెద నని ముచ్చటించి కృష్ణద్వైపాయనుం డంతర్హితుం డయ్యె నంతఁ గౌంతేయాగ్రజుండును బాశంబైనపుత్రశోకంబు వోకార్చి శాంతాంతరంగుండై యుండియు విజయుండు వచ్చినవాని కేమి చెప్పుదు నని చింతించుచుండె నంత నక్కడ. 351

—♦ ప్రతిజ్ఞా పర్వము ♦—

మ. శితమన్యుప్రభవుండు శస్త్రసముదీర్ణ సంశప్తకవ్రాతముల్
శతధా భిన్నము గా నొనర్చి దివి సంధ్యారాగరక్తంబు గ
మ్ముత్రతిం గయ్యము మాని సేన మరలం బోలించి తా మళ్ళి మా
పతిశో ని ట్లను నస్త్రకంఠమునఁ దోఁపన్ దుర్నిమిత్తావళుల్ 352

చ. దడదడ గుండె గొట్టుకొను దబ్బుబుపాటునఁ జిత్తవిభ్రమం
బడరెడు మాట తొట్రువడు నంగము లన్నియు నంగలార్చెడున్
వెడనెడ వామనేత్రభుజవీథులయుం దదరుం దలంప నా
యెడఁద ననిష్టమున్ విడ దనేకము లయ్యెడు దుర్నిమిత్తముల్. 353

క. దివి భువిఁ గడు నుత్పాతము, లవుదెంచుటఁ బాపశంక యది నాదుమదిన్
దవిలెన్ సేష్టసచివబాంధవునకు మాధర్మరాజునకుఁ గుశల మొకో. 354

ఆ. అనిన వాసుదేవుఁ డనియె సామాత్యుఁడ,జాతశాత్రవుఁడు గుశలియు తలఁప
నించు కెద్దియే ననిష్టము తలసూపి, యుండనోపు వగవ కుండు మనఘ. 355

స్సాంద్రప్రాభవపశ్యతోహరుఁడు విశ్వవ్యాప్తకీర్తిప్రభా
చంద్రుం డయ్యభిమన్యుఁ డెట్లు కలనం జా నయ్యెనో చెప్పఁడా. 362

మ. ఋభురాట్పౌత్రుఁడు నాకుఁ బుత్రుఁడును లక్ష్మీడ్భాగినేయుండు సా
రభుజాటోపవినిర్జితారి వరహార్యత్యుప్రతాపుండు మా
యభిమన్యుం డొకనీచమానవునిచే నాలంబునం గూలె నే
యభయుం డేఖలుఁ డియ్యకార్యమును జేయం జాలి తా నుండెనో. 363

ఉ. పున్నచందురుం దెగడు మోమును గల్వల కెత్తు వచ్చువా
ల్గన్నులు లేడిచూపులును గమ్మని పైఁడికి నీడువచ్చు మే
ను న్నెఱినవ్వులుం గలిగి నోములపంటగ నై సుభద్రకున్
గన్నకుమారు మారసముఁ గన్నులఁ జూడక యెట్లు లుండెదన్. 364

తే. కుంతికిం ద్రోవదికి నాకుఁ గూర్చుకొడుకు, వాసుదేవునకుం దక్కువారలకును
నింపు వెంపంగఁ జాలినయెమ్మెలాఁడు, వాఁడు లేకున్నఁ బోయెడువాఁడ వీఁడు. 365

సీ. మెత్తనిపాన్పుల మెయిఁ జేర్చువాఁ డిప్డు, కటికనేలను బండఁ గలుగు నెట్లు
మలయజం బలఁదంగ నలరెడువాఁ డిప్డు, కడుధూళిలోఁ బ్రుంగఁ గలుగు నెట్లు
వంది స్తవముల నానందించువాఁ డిప్డు, క్రవ్యాదరుతి వినఁ గలుగు నెట్లు
ప్రభువులపొందికం బ్రబలెడువాఁ డిప్డు, కనుదిక్కు లేకుండఁ గలుగు నెట్లు

తే. మొన దిరుగకుండ శత్రుల నని నెదిర్చి, యెల్లచుట్టాల విడనాడి యేగి దివికి
వేల్పుచుట్టఱికంబును వేడ్కఁ గాంచి, ముదముపడు నెట్లొ ననుఁ గన్నముద్దులాఁడు.

చ. కడుపునఁ గన్నవాఁ డని యొకానొకయింతకృపారసంబు లో
నిడికొని పోరుసన్ విడువ నే నని యుండక శత్రులాజి క
య్యెడఁ బిలువంగ నొండుకడ కేగితి వింతలు వచ్చె నందునన్
గొడుకున కిందు సాయపడఁ గూడక పోయె నిఁ కేమి సేయుదున్. 367

వ. అని యనేకప్రకారంబులఁ బలవి పలవి మున్నిటినట్టనడుమ గుట్టం దాఁకి బిట్టవిసిన
యోడ గలబేహారిచందంబునం జదికిలం బడి ధర్మరాజు దిక్కు మొగం బై. 368

మ. జలజవ్యూహము సించి నాతనయుఁ డశ్వత్థామకర్ణాదియో
ధులకెల్లన్ గలగుండుగా సమరమందుం బేర్చి పెక్కండ్రురన్
జాలియం జేసి సహాయశూన్యుఁ డగుటం బోకాడెఁ గాఁబోలు దా
యలు పిండై వడిఁ జుట్టు ముట్టుకొని శస్త్రాస్త్రాదుల న్నొంచుటన్. 369

క. పలువురు ముట్టినయప్పుడు, తలఁకి ననుం దోడుపడఁగ దండ్రీ! రా ర
మ్మలసితి నని పిలువం డే, పలుమాఱు సుభద్రపట్టి పద్మగతుం డై. 370

—♦ అర్జును డభిమన్యునివిధంబు ధర్మరాజు నడుగుట ♦—

కం. నీ నీ తప్పుఁ దలంచితి, నాసన్నపుటాస సేయునట్టె హరి కల్లుం
డై సుత్రామునిపౌత్రుం, డై సనువాఁ డెంతలెంత లాపద లయినన్. 371

కం. పలువురు పలుదెఱఁగుల నవ్విలుకానిం జుట్టుముట్టి వివిధాస్త్రములన్
గలఁగించి నొంచియుండురు, కలరే యొకఁ డొకఁడు వానిఁ గలఁపఁగ సురలున్. 372

ఆ. విల్లు సేతఁ బట్టి వెలసిననాపట్టి, నాలమం దెదుర్ప శూలి చక్రి
వజ్రి దొట్టివేల్పువల్లభు లైనను, జాల రనిన దడవ నేల నొరుల. 373

సీ. అట్టిమహోగ్రశౌర్యాఢ్యుఁడు స్మితపూర్వ,భాషణుం డైనసౌభద్రుఁ డెపుడు
నావచ్చుతఱిఁ జిఱునగవుమొగంబుతో, నెదురేగుదెంచెడుసదయహృదయుఁ
డకట నేఁ డగపడఁ డయ్యె నయ్యనిఁ బడి, నట్టిమాటయె నిక్క మయ్యె నట్టె
నెత్తుటఁ జొత్తిల్లి నేలపైఁ బడియు న,బ్బాలుండు వెలిఁగెడు భానునట్లు

ఆ. కొడుకుమాట నన్ను నడుగ సుభద్రతో, ద్రుపదరాజపుత్త్రితోడ నెట్లు
పలుకఁ గల నవోఢ లలితాంగి యుత్తర,సుందరాస్య మెట్లు సూడఁ గలనొ. 374

చ. పొలికలనన్ శవంబులసమూహమునం బడి యున్నబాలుమైఁ
గలపలలంబు కాకులును గ్రద్దలుఁ గుక్కలు నక్క లీడ్చె నాఁ
దెలిసి సుభద్ర ప్రాణములు దేహమునం గొని యుండఁ జాలునే
పలుకఁగ నేల యింతకు నభాగ్యుఁడు ఫాల్గునుఁ డక్కటక్కటా. 375

ఆ. ముద్దులయ్య యిట్లు పోయిన ట్లగునంత, నొడల నుసురుఁ దాల్చి యుంటి నకట
వ్రయ్య గాదు నాదువడిగలగుండియ, ఱాతఁ జేసెనో విధాత తలఁప. 376

సీ. ఏఁ ద్రిగర్తులతోడ నేటాడుచును వింటి, ధృతరాష్ట్రనందనుల్ దృప్తు లగుచు
సింహనాదంబులు సేయుచుండ యుయుత్సుఁ, డెలుఁగెత్తి వారల కిట్టు లనియె
నరు మాఱుకొనలేక పురుషకారమువోలెఁ, బదుగురు నొకబాలుఁ బట్టి చంపి
త్రుళ్ళిపడెద రేల తులువలు మీ కేడ్వఁ, గాని సంతోషింపఁ గాదు కాల

తే. మప్రియ మధర్మ మగుదీని నరసి కేశ,వార్జునులు మిమ్ము నెట్లు సేయంగఁ గలరొ
చూచుచుండుఁడు మీరు నారాచసమితిఁ, బడి కుడువఁ గల రింత నీపాపఫలము.

వ. అని వైశ్యాపుత్త్రుండు కోపదుఃఖసమన్వితుం డై గర్హించి పలుకుచుండ నించుకిం
చుక వింటిఁ గాని కృష్ణుం డైన నిది యిట్లని తెలియ వినిపింపఁ డయ్యె వినిపిం
చెనే నెప్పు డబ్బాలఘాతుకుల నెట్లు సేయవలయు నట్లు సేయకుందునే యని
కన్నీరు మున్నీ రై పాఱం బలవించుబలభిత్తనూజుం గాంచి కరంబులం బొదివి
యనునయించుచు వాసుదేవుం డి ట్లనియె. 379

శా. శోకింపం దగ దిట్లు నీకు జగతిన్ శూరాగ్రగణ్యుల్ నృపుల్
లోకంబం దిటువంటిపోకడఁ గొనన్ లో నెంత్రు శాస్త్రోక్తమై
నాకావాస మొసంగు క్షత్త్రియున కభ్యామర్దమం దీల్గు టో
పాకారిప్రభవా! యెఱుంగనిగతిన్ వర్తింతు వీ వేటికో. 379

తే. అని మొసం జించి చెండాడి యఖిలరిపుల, నేలకుం గూలకుం దెచ్చి నీసుతుండు
శాశ్వతయశంబు గణియించి చనియె దివికి, వానికై యిట్లు పనవుటల్ వర్తనంబె.

క. నీ వడలు గుడుచుచుండిన, నీవారందఱును గంట నీ రిడుచున్నా
రీవగపు మాని వారల, దేవురుపా టుడుగఁ బలికి తేర్పఁగ వలదే. 381

వ. అని యనునయించుచున్నంతఁ గౌంతేయావరజుం డన్నదమ్ములదిక్కు మొగంబై
వెక్కు మ్రింగుచు నిట్లనియె. 382

—♦అర్జునుండు ధర్మరాజాదుల గర్హించి పలుకుట♦—

ఆ. ఎట్లు మొనలఁ జొచ్చె నెట్లభిమన్యుఁడు, పో రొనర్చె వాని నేరు పంపి
రెఱుఁగఁ జెపుడు వాని నెప్పుడు పట్టి నేఁ, జక్కఁడంచువాఁడ నొక్కత్రుటిన. 383

ఉ. మీరు కృతాస్త్రశస్త్రముల మేకొని యుండిన నింద్రుఁ డెత్తి రాఁ
బోరున నాకుమారుఁ డొకపోటున నోర్చెడు నంచు నెంచితిన్
దూరము సూడఁ జాల రని తోఁచిన మీకడ నిల్పి పోదునే
భారతవంశభూషణుని బాలుని నే ననిఁ నాచుకో నొకో. 384

సీ. మీ రాష్ట్ర మీకింత పౌరుషంబును లేదు, మీపరాక్రమ మూండ్ర మెప్పులకగు
మీ కలంకార్థమే కాని యొండు గా, దస్త్రశస్త్రవిద్యాయుధాళి యెల్ల
నిట్టి తేజోవిహీను లిట్టిమిమ్ముల నమ్మి, కోలుపోయితిఁ జిన్నికొడుకు నకట
మిమ్మున నేటికి నమ్మి మీకడ నుంచు, నుని చిననన్ను నే ననుకొనియెద

తే. ననుచు నేడ్చుచు నశ్రుపూర్ణాస్యుఁడగుచుఁ, బెద్దయుం బ్రొద్దు రోఁజుచుఁ బెదవిఁ గఱచు
కొనిచలించుచు నున్న నాతని నెవరును, గని వచింపఁగ నోడి రక్కాలమందు. 385

తే. అట్టికాలమునందు గదాగ్రజుండు, పాండుపుత్త్రాగ్రజుండును బార్థు మనముఁ
బట్టియుండినవా రౌటఁ బలుకఁ జాలి, రంతఁ గుంతీసుతాగ్రజుం డనియె నిట్లు. 386

సీ. తమ్ముఁడ వినవయ్య తప్పు చేసితి నేన, సంశప్తకులతోడి సమరముఖకు
నీవు పోయినవెన్క నిట నన్నుఁ బట్టఁ జా, పాచార్యుఁడు ప్రయత్నఁ మాచరించి
బలగంబులం బన్ని పయిఁ బడి పీడింప, దొరఁకొని మ మ్మెల్లఁ దూలఁ జేసె
నాయొడ్డు భేదింప నట విక్రమింప మా, కలవి గా కేఁతయు నడలు వడితి

తే. మపుడు సౌభద్రుఁ బిలిచి నే నక్కటికము, లేక కార్యావసర మెద వీఁకఁ జూపఁ

దనయా! చాలము మే మొడ్డు తెఱలఁ జేయ,నీవు సాలుదు వని వానికిలువ సూపి. 388

—♦ ధర్మరా జభిమన్యుఁడు చచ్చినవిధంబు చెప్పుట ♦—

క. మొన స్రింపి దారి సేయుము, వెనుకన్ ని న్నంటి మేము వెస వత్తు మనన్
విని కొడుకు నీవు నేర్పిన,ఘనవిద్యం జేసి గరుడి కంధిం బోలెన్. 389

చ. గురుబలసాగరంబు నొకకుమ్మున నమ్మొనఁ జించి చొచ్చి మం
దరగిరిపోలె నందఱ నుదంచితబాహుబలంబు సొంపునన్.
ద్వారకొని యెంతయుం గలఁచి ద్రోణబృహద్బలకర్ణముఖ్యులన్
శరసమితిం బడల్పడఁగ సల్పె ననల్పపరాక్రమంబునన్. 390

ఆ. అపుడు మేము వాని ననుసరించియు వెంట, నంటి యరుగుచున్నయవసరమున
రుద్రవరమువలన క్షుద్రుఁ డా సైంధవుఁ, డడ్డగించె మమ్ము నబ్రముగను. 391

వ. అట్లరిబలంబు సొచ్చి మనయభిమన్యుం డోహరిసాహరిం బెనంగుచు నెల్లయో
ధుల నేలకుం గోలకుం దెచ్చుచున్నతఱి ద్రోణకృపాశ్వత్థామకర్ణబృహద్బలకృత
వర్మ లార్వురుదార లబ్బాలుం జుట్టుముట్టి బెట్టు వేధించి వంచనం జేసి విలు
ద్రుంచి విరథుం జేసిన నోసరిల్లక యెనిమిదివేలమహారథులను దొమ్మిదివేలవార
ణంబులను లక్ష్మణప్రభృతు లగు రెండువేలరాకుమారులం గోసలేశ్వరాదులం గుప్పఁ
గూల్చి గదాదండమండితకరుం డై దుశ్శాసనసుతుం దెగటార్చి తాను వాని
చేతం దెగటాఱి వీరస్వర్గంబునకు నిర్గమించి మనల నిట్లు శోకసాగరంబున ముంచె
నని యెఱింగించుటయు నర్జునుండును. 392

—♦ అర్జునుఁడు సైంధవుం జంపఁ బ్రతిన వట్టుట ♦—

ఉ. నిక్కముగా సుతుండు తెగి నేలకు వ్రాలినమాట వించు లో
నొక్కమొగిన్ దిగు ల్పొడమ యుల్లము తల్లడ మంద మందుఁ బె
న్సొక్క యనంగ హా యనుచు నూర్చుచు నుర్విపయిన్ బడె న్వడిన్
దిక్కులు మోరియఁ బ్రక్కలను నిల్చినయెల్లరుఁ దల్లడిల్లఁగన్. 393

తే. దీనులు విషణ్ణవదను లై దేవరుపడి, యొప్పవ్రాల్పక చూచుచు నప్పురుషునిఁ
గప్పి శిశిరోపచారము లొప్పఁ జేసి, సేదఁ దేర్చిరి కొండొక సేపులోన. 394

వ. సేద దేఱి కూరుచుండి సవ్యసాచి శోకసమాక్రాంతుం డై. 395

ఆ. కనుల నశ్రు లూరఁ గంపింప మే న్సోల, మాటిమాటి కూర్పు మసలుచుండ
నులుముకొంచు హా స్తుతలము లున్మత్తుని,పగిదిఁ గనుచు నిట్లు పలికె నపుడు. 396

మ. ప్రతినన్ జేసెద నెల్లవారును వినన్ జాటింపుఁ డే నెల్లి భూ
పతు లెల్లన్ గనుచుండ నస్తగిరికిన్ భానుండు పోకుండులోఁ

ప్రతిపక్షుం డగుసింధురాజతనయుఁ బాణాగ్ని నేర్తుఁ రణ
క్షితికిఁ దప్పక ధర్మరాజుపదముఁ జేరంగ రా కుండినన్. 397

ఉ. బాలవధాతిహేతు వగు బాలిశు నాతనిఁ గాచువార లై
వాలికతూపులన్ బఱప వచ్చినద్రోణకృపాదియోధులన్
దోలుచు నా ప్రతిజ్ఞ నొకతూకునఁ దీరుతు నట్లు చేయఁ గాఁ
జాలనినాఁడు పుణ్యగతిచక్కికిఁ దప్పినవాఁడ నయ్యెదన్. 398

తే. మఱి గృతఘ్నులువంచకుల్ మాతృఘాత,కులుగురుద్రోహులునువంచకులునుమద్య
పానరతులును బిశునులు పరధనాప, హర్తలును బొందుగతుల కేనరుగువాఁడ. 399

తే. మఱియు సైంధవుతల త్రెస్సి మహితలమునఁ
బడెడులోఁ బ్రొద్దు గ్రుంకినయెడ వినుండు
పావకుని కిత్తు నామేను పలుకుచుంటి
దేవదానవులును వానిఁ గావ లేరు. 400

వ. అని గాండీవం బెక్కువెట్టి నారి సారించి దేవదత్తంబు పూరించుటయు దేవదేవుండు
పాంచజన్యంబు పూరించెఁ బాండవులును సింహనాదంబు గావించి రంత వాదిత్ర
ఘోషంబులును మిన్ను ముట్టె నట్టియెడ జయద్రథుం డమ్మహాశబ్దంబు విని
చారులవలన నంతయు నెఱింగి శోకసమ్మోహహృదయుం డై నిప్పు ద్రొక్కినట్లు
నిలువం జాలక పెక్కండ్రు రాజులు గొలువం గొలువుండిరి యున్న దుర్యోధనుపాలికిం
జని యుత్తలంపడుచి త్తంబునం దత్తఱంపడి యి ట్లనియె. 401

—♦ సైంధవుఁ డర్జునుప్రతిజ్ఞ విని దుర్యోధనునితో మొఱ్ఱ పెట్టుట ♦—

ఉ. అల్లధనంజయుండు తనయాత్మజుచావున కేన మూల మం
చెల్లి నన్ వధించుటకు ని ట్లొనగూడక యున్న నగ్నిలోఁ
ద్రెళ్లుటకుం బ్రతిజ్ఞ పొసరించుట వింటి నొకండ నట్టియె
గ్గెల్ల నొనర్చినాఁడ నని యేమిటి కాతని కింత వచ్చెనో. 402

క. పదివేలు వచ్చె నింకం, గుదిరి యిట న్నిలువఁ జాలఁ గొని జీవితముల్
బొదలించుకొందుఁ బోయెద, సదనమునకు మీకు స్వస్తి సమకుఱుఁగాతన్. 403

ఆ. కలరు ద్రోణశల్యకర్ణదుశ్శాసన, కృపసుయోధనాదు లిపుడు వీరు
జను నినొటఁ బడినజను నైనఁ దేరంగఁ, జాలువార లిందుఁ జాలరొక్కొ. 404

క. నా కభయ మొసఁగుఁ డిందఱుఁ, గాకుండిన మృత్యుభయము కొలదగుట వడిన్
గైకొని పోయెద నెటకే, నేకంటం బడక యుండ నింతటిలోనన్. 405

శా. శోకింపం దగు నిట్టికాలమున నాశూరాగ్రగణ్యుల్ మహా
ద్రేకం బేర్పడ నుత్సహించుటలు తో తెంచెన్ ననుం జంప నా
పాకారిప్రభవుం డొనర్చెఁ బ్రతినన్ బ్రహ్మాదులున్ దానికిం
బోకం బెట్టఁగ లేనిమాట నిజ మీహాల్లాస లిం కేటికిన్. 406

క. చచ్చెడువాఁడికిఁ బోలెన్, హెచ్చెడు వెత గాత్రమందు నేగెద నాజ్ఞం
బుచ్చుకొని యనుచుఁ గాళులు, గ్రుచ్చుకొనఁగ నొండొకండు కూలం బడియెన్.

వ. అని వ్యాకులచేతస్కుం డై శోకించుచుం గూలఁబడినజయద్రథుం గని దుర్యో
ధనుండు స్వార్థపరుం డై యి ట్లనియె. 408

ఆ. వెఱవకయ్య, బాహువిక్రమార్జితశత్రు,లోకనికర! సకలలోకవినుత!
వీరలోకమధ్యవిశ్రుతుఁ డగునిన్నుఁ, గన్నుఁ దెఱచి యొకఁడు గాంచఁ గలఁడె. 409

తే. నేను వైకర్తనుఁడు చిత్రసేనుఁడు శల, శల్య భూరిశ్రవో వివింశతి వికర్ణు
లును సుబాహుసుదక్షిణులు వృషసేన,దుర్ముఖ కృప దుశ్శాసనాదులును మఱియు.

మ. గురుపుత్రుండు గురుండు సౌబలకళింగుల్ లోనుగా నెందఱో
దొరలుం బెక్కులు సైన్యముల్ పొదివి నీతో నుండ దివ్యాస్త్రవి
ద్వరుఁ డీ వొక్కనరుండు వల్కుటకుఁ జిత్తంబందు బీ తందఁగా
వరమే క్షత్రియపుత్త్రుఁ డి ట్లగుటఁ జెప్పన్ విందుమే యొందునన్. 411

వ. అని యాశ్వాసించిన సైంధవుం డారాత్రి దుర్యోధనసహితుం డై ద్రోణాచార్యుని
పాలికిం జని నమస్కరించి సర్వం బెఱింగించి తనకు నర్జునునకును శస్త్రాస్త్రవిద్యా
ప్రభావంబునం గలతారతమ్యం బెఱింగింపు మనిన నతం డతని కి ట్లనియె. 412

—♦ ద్రోణాచార్యుండు సైంధవునకు హితంబు సెప్పుట ♦—

మ. విను మాచార్యక మెన్న నీ కతనికిన్ వే ర్గాక తుల్యంబ య్యె
న నతం డెంతయుఁ గష్టి కోర్చి తపముం గావించి దివ్యాస్త్రముల్
గొనుటం బెక్కుమడుంగు లెక్క వగు నీకుం గెల్వ సాధ్యంబు గా
దని న ట్లుండఁగనిమ్ము నేఁ గలుగ నేలా నీకు భీతిల్లఁగన్. 413

వ. మద్బాహుబలరక్షితుండ వై ననిన్నుం గన్నెత్తి దేవేంద్రాదు లైనం జూడ లే
రెల్లి పార్థాభేద్యం బైనమహావ్యూహం బొం డమర్చెద నీవు ధర్మముం బురస్కరిం
చుకొని పితృపైతామహ మైనమార్గ మనుసరించి భయంబు దక్కి యుండు మని
పెండియును. 414

ఆ. చదివి తెల్లశ్రుతులు శాస్త్రంబులున్ వింటి, వధ్వరంబు లెల్ల నాచరించి
తెల్లలోకవృత్త మెఱిఁగితి చా వన్న, నిట్లు భయముపడుదు వేటికొక్కొ. 415

సీ. వినుము జయద్రథ వివిధభోగంబులు, ననుభవించితి ప్రాభవాధికముగఁ
దిరము గా దొడ లెన్నిదినములకేనియు, మరణంబు నిక్కము మర్త్యులకును
గురుపాండవులు వృష్ణివరు లీవు నేనును, గర్మవశంబునఁ గాలహతుల
మయి పరలోకంబు నందఁ బోవఁగ నున్న,వారమే యని నీ వవశ్య మెఱుఁగు
తే. మధమగతులకుఁ బోవ కత్యమల మైన,గతికిఁ బోవుట మేల్గాదె క్షత్రియుండు
శస్త్రమరణంబు నొందెనే సత్తపస్వి, పొందునుత్తమలోకంబు లొందు వింటె. 416

వ. అని బోధించిన నూఱడిల్లి జయద్రథుండు రణోత్సాహంబున మనంబు గూర్చి వాదిత్రంబులు మ్రోయుచుండ ననుజ్ఞాతుండై నిజనివాసంబునకుం బోయె నంత నక్కడ వాసుదేవుం డర్జునుఁ గాంచి యి ట్లనియె. 417

—♦ ప్రతిజ్ఞం గూర్చి కృష్ణార్జునులు ప్రసంగించుకొనుట ♦—

ఆ. ఎల్లి ప్రొద్దు గ్రుంకునీలోన సైంధవుఁ, ద్రుంతు నే నటంచు దుష్కరంబుఁ
బ్రతినఁ జేసి తీవు పాండవ! మన కిది, మోవరాని మోపు గా వఱలదె. 418
క. నాతో నొకింతమంతన, మాతఱి గావింప కిట్టు లతిభారం బై
తోఁచుపనికిఁ బూనితి, శ్వేతాశ్వ! తరింతు మెట్లు చెప్పుము దీనిన్. 419

వ. మఱియు నాకర్ణింపు మీవు సైంధవుం జంపఁ బ్రతిన చేసినతఱి నిట నైనసింహనాదంబులు విని ధార్తరాష్ట్రులు పుత్రశోకార్తుండై నగాండీవి యిప్పుడ భండనంబునకు వచ్చు నని భయంపడుచున్నయప్పుడు జయద్రథుండు వచ్చి నీప్రతిజ్ఞ యెల్లం దెలిపి ముక్కంటితో నెక్కటికయ్యంబు సేసి పాశుపతాదిదివ్యాస్త్రంబు లంది కాలకేయాదులం గూలనేసినవాని కడ్డం బేదియు నుండ దని మెండుగ వాపోవుచుండ దుర్యోధనుం డూరార్చి వానితో నాచార్యుపాలికిం జని యెల్లయుం జెప్పిన నతండు నే నెల్లి యభేద్యం బయినవిధంబున శకటవ్యూహంబునఁ బద్మవ్యూహంబును దానికర్ణికామధ్యంబున సూచీవ్యూహంబు నమర్చి మూలస్థానంబున సైంధవు నిలిపి కృపకర్ణశల్యాశ్వత్థామవృషసేనభూరిశ్రవులు నార్వురు వానికిం గావలి యుండ నియమించి తా నగ్రభాగంబున నిలిచి సింధుపతిం గాచువాఁడ నని యభయం బిచ్చె నట్టి వారి నొక్కొక్కరిం గెలుచు టరిది యన నందఱ నొక్కపనికి నెక్కొనినం జెప్పనేల నిట్టిచో సైంధవుం దెగటార్చు టెట్లో యని తలంకెద నిం దాచార్యు లగువారితో నాలోచించుట మే లనినఁ గృష్ణునకు జిష్ణుం డి ట్లనియె. 420

ఉ. ఏల వచింతు వారథికు లేను నెఱుంగనివారు కారు సాఁ
బా లగునాబలంబునకు వారిబలం బది యెల్లఁ జెల్లఁ గాఁ

జాలము వార లార్వురును జాపగురుండును దక్కనందఱు
దూలి కనుంగొనంగ నొకతూఁకునఁ ద్రుంచెను సింధుభూవిభున్. 421

సీ. వసురుద్రముఖ్యదేవవ్రాతములు గూడి, ముల్లోకములఁ గలభూతములును
వచ్చి కాచినఁ గాని వాని నే సత్యము, సాక్షిగా వచియింతు సమరమందు
నీవు సూచుచునుండ నెల్లి చంపుదు గురు,నొద్దనం బంతయు నూఁచి యూఁచి
నాయమ్ము లన్నియు నాయమ్ములం దాఁకఁ, గూలిననరనాగఘోటకముల

తే. నెత్తురెల్లువమైమాంసనిభృతమగుచుఁ,బొలికలనువొల్పుఁగ్రవ్యాదకలితమయి మ
హేంద్రవరుణకుబేరయమేశ్వరాదు, లిడిన నాదునస్త్రములతే జీవ కనెదు. 422

మ. విలు దేవాసురసంగరంబులఁ గడున్ జేకొన్నగాండీవ మ
మ్ములు మంత్రాకలితాశనిప్రతిమముల్ పోలింప దివ్యంబు తే
ర్వెలుకాఁ డింద్రసుతుండు సారథి జగద్విఖ్యాతశౌర్యోజ్జ్వలుం
డలఘుం డచ్యుతుఁ డిట్టిచో నజితకార్యం బుండు నా నొప్పునే. 423.

ఆ. నీప్రసాదమునకు నేఁ బాత్రభూతుఁడఁ, గాన దుష్కరంబు గలుగ దెందు
నైంద్రవారుణాదు లలఁతులు గా రిట్టి,పట్ల శత్రుజయము భార మట్టె. 424

క. సంధ్రంబునందు జలముల్, జం ద్రునిలో లక్ష్మి నిలుచుచందంబున నీ
యింద్రసుతునందుఁ బ్రతినయు, సాంద్రపరాక్రమముకలిమి సత్యం బగుతెఱ.

క. తఱియఁగ వచ్చెం గర్జము, నెఱిమీఱఁగ రేపకడన నీ వుచితగతిన్
వఱలంగఁ జేసి రథముం, బఱపెనుపని గలదు గానఁ బద మిలు సేరన్. 426

వ. అని పలికె నంత వాసుదేవుండును నితాంతకుపితాంతఃకరణు లై నిట్టూర్పు నిగిడిం
చుచున్నంత నంతరిక్షంబున నింద్రాదులు దీన నేమి పుట్టునో యని చింతాక్రాంత
చిత్తు లై రపుడు దారుణవాయువులు వీచె సాగరంబులు గలంగెఁ బృథివి చలించె
నుల్కలు రాలె మఱియు ననేకోత్పాతంబులు చూపట్టె నట్టియెడ నర్జునుండు
సుభద్రోత్తరల నాశ్వాసింప నచ్యుతుం బుచ్చుటయు నతండు నటఁ జని పుత్ర
శోకార్త యగుసుభద్రం గాంచి యూఱడించుచు ని ట్లనియె. 427

చ. చెలియల! చింతిలంగ నిటు చెల్లదు నీకు నృపాలవంశమం
దలరినవారి కెల్ల రణమం దొడలీగుట లుత్తమోత్తమం
బెలమి వహింప కిట్లు పడు టేటివివేకము నీకుమారుఁ డు
జ్జ్వల మగుకీర్తిఁ గాంచి తెగి స్వర్గముఁ జూఱగొనం జనెం జుమీ. 428

తే. శ్రుతము బ్రహ్మచర్యంబును సూనృతంబు
తపముఁ బ్రజ్ఞయుఁ గలమహాతాపసులకుఁ

బొందఁ గాఁ దగులోకముల్ పొలఁతి నీదు
పుత్త్రకుఁడు వొందె వానికై పొక్కఁ దగదు. 429

—♦ శ్రీకృష్ణుండు సుభద్ర నూరార్చుట ♦—

క. వీరునకుం బ్రభవించితి, వీరునకుం బత్ని వైతి వీరునిఁ గం టో
వీర ప్రియబాంధవి! నీ, వీరహిఁ శోకించు టొప్పునే చావునకున్. 430

తే. నీకుమారునిమృతి కైననీచు సింధు,పతినిఁ జంపఁగఁ బార్థుఁడు ప్రతినఁ జేసె
రేపు మునిమాపునన్ వాని గ్రీవ చెగిన,శిరము ద్రెళ్ళి పడ న్వింద గొరిత! నీవు.

వ. వగపు మాని కోడలి నూరార్పు మనిన విని సుభద్ర శోకం బాపుకొనలేక కొడుకు
నుద్దేశించి. 432

ఉ. తాతకుఁ దండ్రికిం దగినధైర్యము శౌర్యముఁ గల్గి లోకవి
ఖ్యాతికి నైనబిడ్డఁ డనఁగా నొడికారముఁ గన్నవాఁడ వో
పూతచరిత్ర! యిట్టిగుణపుంజసమన్వితుఁ డీ వభాగ్య నై
భూతలమందు జన్మమును బొందిననా కెటు దక్కెదక్కెటా. 433

తే. నల్లగలువలఁ బోలిననయనయుగము, దాడిమీబీజములఁ బోలుదంతపంక్తిఁ
గ్రాలునీనగుమొగ మిప్డు ధూళి బ్రుంగి,యును దలిర్పదె జాబిల్లి ననుకరించి. 434

సీ. మృదులతల్పంబునఁ బొరలెడునీమేను, కటికనేలను బండఁ గలిగె నేఁడు
వరవర్ణినులు చుట్టువాఱ నొప్పెడునీవు, నక్కలలో నుంటివొక్క నేఁడు
వందిమాగధనుతుల్ వడయు నోనీకుఁ గ్ర, వ్యాదరుతుల్ విన నయ్యె నేఁడు
చందనాగురులిప్తసర్వాంగసుందరుఁ, డగునీవు బూదెలో నైతి నేఁడు.

తే. కటకటా నిన్నుఁ గడుగారవంబునఁ గను,పాండవేయులు యాదవు లండ నుండ
నీ వనాథునివిధమున నెల్ల విడిచి, యుద్ధభువిఁ బడి శవమ వై యుంటె నేఁడు.

చ. కమలసుగంధబంధురము క్రమ్రకపోలము చూర్ణకుంతల
భ్రమరపరీవృతమ్ము మణిరత్నపరిష్కృతమండలాంచిత
మ్మమలినకూర్చకమ్ము ధవళాయతనేత్రయుగమ్ము చారుహా
సము నగునీముఖమ్ముఁ గనఁ జాలక నేఁ బ్రదుకంగ లేనయో. 436

మ. అని నిన్నొక్కనిఁ గావలే కథము లై రన్నల్పి డాభీమసే
నునిబాహాబల మాకిరీటివిలునంటుల్ నేరు పావృష్ణివీ
రునివీర్యంబును గాల్పనే మఱియు నుగ్రుం బోనిపాంచాలునిన్
ఘనునిన్ మాత్స్యుని జేదిముఖ్యవిభులన్ వాక్రువ్వఁగా నేటికిన్. 437

మ. హరి కల్లుండవు పార్థపుత్త్రుఁడవు నీ వాయింద్రపౌత్త్రుండ వో

ఆ. ఫాల్గునుండు ప్రతినవట్టుట విని నెవ్వఁగ లెద నివ్వటిల్లఁ గాఁ దదీయ
శిబిరముల నొకండుఁ జెలుకూరు కేనియుఁ, బడయఁ డయ్యెఁ గార్యభరముకతన.

చ. అరుణగభస్తి యస్తగిరి నందకమున్న జయద్రథున్ రణాం
తరమునఁ గూల్తు లేనియెడ దావమునం బడి చత్తు నంచు ని
న్నరుఁడు ప్రతిజ్ఞ చేసె నిది నాలిసుయోధనుఁ డడ్డుకొం చనిక
గర మొనరించుఁ బాండవులకార్య మిఁకన్ ఫలియించు టెట్లొకో. 446

ఆ. ఇచ్చి వేల్చి చేసి యే దేనిసుకృతంబు, గలిగి యుంటిమేని తెలియఁ దత్ఫ
లమున నరుని ప్రతిన లలి నెఱవేఱుఁ గా,వ్రత మటంచు నెంచి రతని జనులు. 447

వ. అంత వేఁగుజాము గదియ వచ్చుటయు దామోదరుండు మేలుకాంచి దారుకుం
బిలిచి యిట్లనియె. 448

—♦ శ్రీకృష్ణుండు దారుకునితోఁ బ్రశంసించుట ♦—

మ. హతపుత్రుం డగుటన్ ధనంజయుఁడు లో నార్తిం గడుం బూనుచుం
బ్రతినం బట్టె జయద్రథుం దునుమఁ దద్భంగంబు గా నెంచుచుం
ధృతరాష్ట్రాత్మజుఁడుం జమూచయమునం దెంతే దృఢవ్యూహము
ద్ధతి సంధిల్లఁగఁ జేసి రేపని సమర్థత్వంబునం జేసెడిన్. 449

మ. సహపుత్రుం డగు ద్రోణుఁ డుద్దడగ నై శస్త్రాస్త్రవిద్యాబల
స్పృహ రక్షించినవాని నింద్రుఁ డయినన్ జేరంగఁ జాలండు దు
ర్వహులై తత్ప్రభృతుల్ మహారథులు గావం బూనఁగా నెట్లి వి
గ్రహమందున్ నరుఁ డన్నయట్లుగ నొనర్పం గష్టమం చెంచెదన్. 450

ఉ. ఐనను బ్రొద్దు గ్రుంకువఱ కాతఁడు వాని వధించునట్లు గా
నేన యొనర్తుఁ గార్య మది నేర్పునఁ గూర్పక యున్న నొండురూ
పౌ నపు డర్జునుండు దగు నాతఁడు లేనిసమస్తలోకమున్
గానఁగ లేనియట్ల యయి కౌతుక మీయదు నాకు దారుకా. 451

తే. పుత్రమిత్రకళత్రాదిముఖ్యబంధు, లేరు నర్జునుతో సాటిరారు నాకుఁ
గూర్చునా ప్రాణమిత్రునిఁ గోలుపోయి, నేను మనఁ జాల నీధాత్రి నిమిషమాత్ర.

క. నామేనున సాంబాల్ సుత్రామాత్మోద్భవుఁడు వానిదాయలు నా కీ
భూమిపయి దాయ లాతని, ప్రేమాస్పదు లరయ నాకుఁ బ్రేమాస్పదులున్. 453

సీ. కావున నే వానికై పూని కర్ణసు,యోధనాద్యరుల నాయోధనమున
వసుధకు బలి చేసి వాసవాత్మజుని ప్రతిజ్ఞ సాగించెదఁ బ్రజ్ఞకలిమి

శతసహస్రములుగా క్షితిపుల నేచునా, నిక్రమ మెల్లి భూచక్ర మెఱుఁగు
నేఁటితో నావానినేస్త మ దంతయు, దేవాసురాళికిఁ దెల్ల మగుత
తే. యొక్క పవలింటిలోన నే నుక్కుమిగిలి, మేనయత్తకుమారుల మేటిపగఱ
నోర్చి పగఁదీర్చెదం గ్రీడి పేర్చి ప్రతిన, రేపు నెఱవేర్చుకొనుఁ గాక భూపు లెన్న.

వ. కావున నీవు రేపకడన నారథంబున శైబ్యసుగ్రీవమేఘపుష్పవలాహకంబులం బూన్చి గరుడధ్వజం బెత్తి శరశరాసనచక్రగదాదులం బెట్టి ఛత్త్రచామరాదులం గట్టి సర్వోపకరణసంపన్నంబు గావించి మాతోడన వచ్చి కురంగట నుండుము నే నార్షభస్వరంబునఁ బాంచజన్యం బొత్తినప్పుడు నాకడకుం దోలుకొని ర మ్మని చెప్పిన దారుకుండు మీచెప్పినచొప్పునం జేసెద నని చెప్పి యి ట్లనియె. 455

తే. నీవు సారథికృత్యము నెరపఁ బూని, నపుడె విజయంబు సిద్ధ మయ్యర్జునునకు
ముజ్జగంబులయందు నెప్పురుషునకుఁ బ, రాజయము లేదు నిక్క మోభూజనసుత. 456

వ. ఇట్లిక్కడఁ గృష్ణుండు గార్యచింతాపరుం డై యుండె నక్కడ జిష్ణుండు శోకసంతప్తచిత్తుం డై స్థండిలంబున శయనించి ప్రతిజ్ఞానిర్వాహణంబునకై చింతించుచుండు నంతఁ గొంతవడికిఁ గలలో నక్కమలాక్షుండు ప్రత్యక్షుం బగుటయు నతండు ప్రత్యుత్థానాభివందనంబు లాచరించి సుఖాసీనుం జేసి విషణ్ణవదనుం డై చెంత నిలువంబడి యున్న వానిం గాంచి వాసుదేవుం డి ట్లనియె. 457

— ♦ శ్రీకృష్ణుం డర్జునునకు హితంబు జెప్పుట ♦ —

ఉ. కాలము సర్వభూతములఁ గట్టును గాల మలంఘనీయ మ
క్కాలమ కష్టసౌఖ్యములఁ గల్గఁగఁ జేయును గాన దేహికిం
బోలదు శోకమోహములఁ బొందుట శోకము కార్యనాశనం
బోలలితాంగ! నీవు వగ లొందుట కేమికతంబు చెప్పుమా. 458

తే. వగపు శత్రుల కానందవర్ధనంబు, బంధుమిత్త్రాదులకు మహావ్యసనకరము
వగపునం జేసి కృశియించి వానిఁ గాంచ, లేక చెడు నెట్టివాఁడు నీలోకమందు. 459

వ. అనిన గుడాకేశుండు హృషీకేశున కిట్లనియె. 460

సీ. ప్రతిన వట్టితి గదా బాలఘ్ను నాసింధుపతి నెల్లి చంప నా ప్రదరమందుఁ
దత్ప్రతిహాతకుగా ధార్తరాష్ట్రులు సర్వ, సేనాసమేతులై సింధురాజుఁ
బృష్ఠభాగంబునం బెట్టి బెట్టిదముగా, మోహరంబును బన్ని పోరుదు రట
వివిధసేనాపరివృతు నాతనిం జేర, ముట్టుటయు నసాధ్య మట్టు తోఁచుఁ
తే. బొద్దు గ్రుంకినఁ బ్రతినయుం బద్దు గ్రుంకు, నేను గ్రుంకెద నవ్వల నిట్లు గాక
యుండ నీదుఃఖ మేరికి నొందకుండు, దాని కే నిట్లు చింతింతు దానవారి. 461

వ. అనిన విని వానిశోకస్థానం బెఱింగి వాసుదేవుండు జలోపస్పర్శనంబు చేసి ప్రాఙ్ము
ఖుం డై కూరుచుండి గాండీవిం గాంచి యిట్లనియె. 462

తే. పార్థ ! పాశుపతాస్త్రంబు వడసి యున్న, దాన నొక్కింతలోన సైంధవునిఁ ద్రుంపం
గలవు నీవు తదర్థ మాకాలగళుని, దగ భజింపుము తత్ప్రసాదంబుపొంటె. 463

క. వనరుహనాభుం డట్లని, వినిపించిన సవ్యసాచి వెస నాచమనం
బొనరించి వామదేవుని, మనమున ధ్యానించె భక్తిమహితుం డగుచున్. 464

— ♦ కృష్ణార్జునులు స్వప్నమునఁ గైలాసంబున కరుగుట ♦ —

వ. అంత బ్రాహ్మముహూర్తంబున విజయుండు తన కేలు పట్టుకొని తోయజనాభుండు
తోడ రా గగనమార్గంబున నుత్తరంబు నట్టి వాయువేగగతిం జని హిమవత్పా
దంబును దాఁటి శ్వేతపర్వతంబును గుబేరనలినీవనంబును బహూదకయగు గంగాన
దిని మందరపర్వతంబును గాలపర్వతంబును బ్రహ్మతుంగంబును సుతుంగం బగు
శతశృంగంబును శర్యాతివనంబును నశ్వశిరంబును నథర్వణస్థానంబును బృషదంశ
శైలంబును మహామందరంబును ననేకతాపసాశ్రమంబులును విహారస్థానంబులును
నానానదీనదపర్వతంబులును జూచుచుం బోయిపోయి గ్రహనక్షత్రసోమసూర్యసమ
ప్రభం బైన కైలాసంబునకుం జని దానిశిరోభాగంబున ననేకశతసహస్రసహస్ర
రశ్మిప్రభావిభాసమానుండును జటావల్కలవాసుండును సహస్రనేత్రవిచిత్రగా
త్రుండును పార్వతీసహితుండును భూతసంఘసేవితుండును బుణ్యగంధశోభితుం
డును దివ్యస్తూయమానుండును నగు పరమేశ్వరుం గాంచి సాష్టాంగనమస్కా
రంబు గావించి వినుతించి వినయంబున శరణంబు వేఁడుటయు నమ్మహాదేవుం
డా నరనారాయణులం గాంచి సుప్రసన్నహృదయుం డై మందహాససుందరవదనార
విందుం డై స్వాగతం బడిగి మీవచ్చినపని యేమి యెఱింగింపుఁ డే నిదె మీకుఁ
బ్రసన్నుండ నైతి నన మఱియుం బ్రత్యుత్థానాభివందనంబు లొనరించి కృతాం
జలు లై వాసుదేవార్జును లిట్లని ప్రస్తుతించిరి. 465

సీ. శర్వాయ రుద్రాయ సర్వేశ్వరాయ పశూనామధీశాయ సుస్థిరాయ
దేవాదిదేవాయ దివ్యప్రభావాయ, భక్తజనావనప్రాభవాయ
లోకస్వరూపాయ లోకేశ్వరా యాది,మధ్యాంతశూన్యాయ మహిరథాయ
నిత్యాయ సత్యాయ నిర్గుణాయ గుణస్వ,భావాయ మునిజనప్రస్తుతాయ

తే. లోహితాక్షాయ నిటలవిలోచనాయ, సర్వదేవస్తుతాయ వృషధ్వజాయ
చంద్రశేఖరాయ శివాయ శాశ్వతాయ, దివ్యరూపాయ భవ్యాయ తే నమోస్తు.

కల్పవల్లి. జయ సోమ! నమో జయ రుద్ర! నమో జయ జయ పశుపతిదేవ! నమో
జయ తామ్ర! నమో జయ శంగ! నమో జయజయ ఖలసమిదుగ్ర! నమః
జయ భీమ! నమో జయ శర్వ! నమో జయజయ శివతరశీల! నమో
జయ దేవ! నమో జయ భర్గ! నమో జయజయ మునివరపాల! నమః. 467

వ. అని యనేకవిధంబులం బ్రస్తుతించి రప్పు డప్పాండవమధ్యముండు రేయి వార్ష్ణేయునకుం దా నొనర్చినగంధపుష్పఫలోపహారంబు లాత్ర్యంబకాభ్యాశంబునం జూచి వారియభేదంబున కచ్చెరువడి మెచ్చుచు దేవా! పాశుపతాస్త్రం బర్థించితి ననినం గృత్తివాసుం డావాసుదేవార్జునులం గరుణాపాంగవిలోకనంబుల నాదరించి యి ట్లనియె. 468

—♦ కలలో శివునికడఁ బాశుపతంబు నొందుట ♦—

శా. మీరల్ గోరినదాని నిచ్చెదను మీమీచిత్తముల్ గంటి నో
వీరాగ్రేసరులార తొల్లి సుమనోవిద్వేషులం ద్రుంచి య
న్నారాచంబును గార్ముకంబు నిట పొంతం బొల్చుపియూషకా
సారంబం దిడినాఁడ వానిఁ గొని పెల్చం దెండు నాచెంతకున్. 469

వ. అని యానతిచ్చిన నన్నరనారాయణులు సర్వపార్షదపరివృతు లై చని తత్సరోవరజలంబుల సూర్యమండలసన్నిభంబు లై ఫణాసహస్రంబుల నగ్నిజ్వాలలం గ్రక్కుచున్నపన్నగేంద్రంబుల రెంటిం గాంచి జలోపస్పర్శనంబు చేసి వేదవిదు లగువారు కృతాంజలు లై శతరుద్రీయంబున నుపస్థానంబు సెప్పుటయుఁ దత్ప్రభావంబున నవి సర్పరూపంబు విడిచి ధనుర్బాణంబు లై యున్నం గని వానిం గొనితెచ్చి వామదేవున కిచ్చునంతన పార్శ్వంబునుండి నీలలోహితుఁ డొక్కబ్రహ్మచారి వచ్చి కార్ముకంబు సజ్యంబు గావించి గొనయంబు సారించి శరం బరివోసి చూపినం జూచి పాండవుండు మౌర్వీముష్టిస్థానలక్ష్యంబు లెఱింగి భవప్రోక్తమంత్రంబుతో నావిల్లు గ్రహించి శరసంధానక్రమం బలరించుకొని యీశానశాసనంబున వాని నెప్పటియట్ల సరోవరంబునం బెట్టి ప్రసన్నవదనుం డైనశంకరువలన మున్నరణ్యంబునం బడసినపాశుపతంబు వెండియుం బొంది కృతార్థుం డై సంతసించుచు వాసుదేవుండునుం దానును వామదేవానుజ్ఞం గొని నిజశిబిరంబునకుం జని రి ట్లర్జునుండు కలం గనియె నట నట్లు కృష్ణుండు దారుకునితోడం దగు మాటలాడుచుండఁ బ్రభాతం బయ్యె నని సంజయుండు ధృతరాష్ట్రున కెఱింగించె నని వైశంపాయనుండు జనమేజయునకుఁ జెప్పుటయును. 470

—♦ ఆశ్వాసాంతము. ♦—

ఉ. వైదికధర్మమార్గమున వర్తిలుచుం నిరతంబు నెమ్మదిన్
నీదగుపాదయుగ్మమునె నిల్పి భజించుచు నీపయిం గృతుల్
మోదముతో రచించుచును బ్రొద్దులు పుచ్చుచునున్న నన్నిదన్
. గాదన కిట్లు ప్రాణములు గ్గ్గఁగఁ గాల్చుట లొప్పనే ప్రభూ! 471

మ. పదివర్షంబులవాని వంశమునకుం బ్రఖ్యాతినిం దేర నై
యుదయం బందినవాని సర్వసుగుణస్ఫూర్త్యావతారంబు నై
పొదలం జొచ్చినవాని నాతనయునిం బోకార్చి తేమయ్య! నీ
మది శాంతించెనె మాసుదర్శనబలీ మాయామయప్రాభవా. 472

క. అభిమన్యువధము వ్రాసిన, శుభసందర్భమున నున్నచో నాకంటెన్
ప్రభవింపఁ జేసి యస్త్రులు, ఋభుపతిసుతున ట్లనుగ్రహించితె తండ్రీ. 473

గద్యము.

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందు
ద్రోణపర్వంబున ద్వితీయాశ్వాసము.
శ్రీ శ్రీ శ్రీ



శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

## ద్రోణపర్వము - తృతీయాశ్వాసము.



మీఱువాని నాసుతు
నీమాడ్కిం జేసి నాకు నేమిఫలంబీ
నీమది సంకల్పించితొ
సామాన్యమె నీదుమహిమ సకలగుణాఢ్యా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు ప్రభాతంబైనంత నెట్లు
జరిగె ననిన ధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె. 2

చ. తనదొర లేనిలోపమును ధారుణికిం దొరలంగ నీయ నే
నని నిజకాంతు లెల్లెడల నల్లుకొనం బొనరించి మించి తూ
ర్పున నగుపర్వతంబునఁ బ్రభాతవిహంగమకూజితధ్వనుల్
దనరఁగ వేఁగుజుక్క దగెఁ దారక లన్నియు వన్నె వాయఁగన్. 3

ఉ. చల్లనిపిల్లతెమ్మెరలు సర్వజగజ్జనకోటికిం గడుం
దెల్లముగా సుఖం బొసఁగెఁ దీరి తలిర్చుచు స్తోత్రపాత్రమై
చెల్లియు జారచోరులకుఁ జెప్పఁగ రానివిషాదహేతువై
యెల్లవిధంబులన్ మెయికి నెక్కుడునట్టివి యయ్యె నయ్యెడన్. 4

— ధర్మరాజు కొలువుదీరి యుండఁ గృష్ణాదులు దర్శనం బిచ్చుట —

క. వెలుఁగులదొర తనుఁ దఱిసిన, వెలివిం దగెఁ దూర్పు జగతిఁ దెఱవలు చూడం
గలప్రియులేఁ గని కొనరె కో,క్కలు కన్యావరయుతే సురూపం బనుటన్. 5

తే. తడసినాఁడను బద్మిని విడిచి చాల, వనరుఁ గాంబోలు నట కేగ వలయు ననుచు
నేమొ చక్రము లేలెడునినుఁడుపొడుపుకొండఁబొడిచె ద్విజుల్ మ్రొక్కుచుండనపుడు.

వ. అయ్యవసరంబున నయ్యమనందనుండు వందిమాగధస్తోత్రపాఠంబులును మృదం
గపణవానకభేరీప్రముఖనిస్వనంబులును బోరుకలుగ మేలుకాంచి కాల్యకరణీయం

బులం దీర్చి మజ్జనశాలకుం జని కృతస్నానుం డై శుక్లాంబరంబులు ధరించి చంద
నాగురులిప్తాంగుండును మాల్యాభరణభూషితుండు నై మంత్రపూర్వకం జపించి
సూర్యోపస్థానం బొనరించి యగ్నికార్యంబు నిర్వర్తించి గృహాంతరంబునకుం జని
యట వేదవిదులు నవభృథస్నాతులు నగు నెనిమిదివేల బ్రాహ్మణోత్తముల నర్చించి
వారికి గోభూహిరణ్యాదిమహాదానంబు లొసంగి వారియాశీర్వాదంబులం బొంది
నానావిధమంగళద్రవ్యంబులం దిలకించుచుఁ గొన్నికక్ష్యాంతరంబులు గడచి
పేరోలగంబుఁ జేరం జని భద్రసింహాసనాసీనుం డై కొలువుసేసి వందిమాగధ
వైతాళికస్తుతివచనంబులును గాంధర్వగానప్రసంగంబులుం జిత్తగించుచున్న సమ
యంబున దౌవారికుండు వచ్చి వాసుదేవుండు వచ్చుచున్నాఁ డని చెప్పుటయు
నప్పాండవాగ్రజుండు ప్రత్యుత్థానంబు చేసి తోడితెచ్చి సుఖాసీనుం గావించి
యర్ఘ్యం బొసంగి పూజించి గౌరవించి యి ట్లనియె. 7

క. అన్నియు విజ్ఞాతములు ప్రసన్నము లై యుండ నధికసౌఖ్యోన్నతిమై
నెన్నఁగ నీరేఁ గడపితె, పన్నగమృదుశయన! విమలపంకజనయనా. 8

తే. అనఁగ మధుసూదనుం డను ననఘ! మాకు, నీకటాక్షంబునం జేసి నిరతశోభ
నంబ వచియింప నేటికీనాఁట ననుచు, నుచితసంభాషణము చేయుచున్నయంత.

వ. భీమసేననకులసహదేవులును విరాటద్రుపదులును ధృష్టద్యుమ్నశిఖండిసాత్యకులును
యుధామన్యూత్తమౌజసులును జేకితానకేకయద్రౌపదేయప్రభృతులును వచ్చి
యథోచితస్థానంబు లలంకరించి రప్పుడు కృష్ణుండు తమ్మునిఁ దనగద్దియం గూరు
చుండఁ బెట్టుకొనియె నట్టియెడఁ బాండవాగ్రజుం డెల్లరు వినఁ బుండరీకాక్షుం
గాంచి యి ట్లనియె. 10

మ. సుర లింద్రుంబలె నేము నిన్నొకని నీచూపట్టుసంఖ్యంబునన్
గర మర్థించి జయంబు సౌఖ్యము నొగిం గాంక్షించి యున్నార మో
పురుషాగ్రేసర! నీ వెఱుంగుదువు మాభూరాజ్యవిభ్రంశమున్
బరచక్రాప్తనిరాక్రియాదికము సంప్రాప్తాధికక్లేశమున్. 11

క. మాజయమున్ మాసుఖమున్, మాజీవనయాత్రయున్ రమాధవ నీపై
రాజిలెడు నీవు నీ కగు,నోజన్ మ మ్మెల్ల నోమ నుంటివి తలఁపన్. 12

ఉ. సారథికృత్యమున్ సలుప సమ్మతిఁ జేసినయట్టినీవు మా
కేరథికుండు నేఁ బగఱ నేర్చియుఁ జేయఁగ లేనిలగ్గు లెం
తే రహిఁ జేసి తర్జునుని ప్రజ్ఞయు వమ్మయి పోనియట్లు గాఁ
గూరిచి దుఃఖవారినిధికూలముఁ జేర్చవె మమ్ము తేప వై. 1

క. ఆపదలు మూఁడినప్పుడు, తాపము వో వృష్ణివరుల దయ దైవారన్
రూపించి ప్రోచినట్టులు, మాపట్లం బ్రోవఁ జూడుమా మునిమాన్యా. 14
క. వాకొనియె నిన్ను నారదుఁ, డాకలావిభునిఁ గాఁగ నఖిలేశునిఁ గా
నీ కేటికో ల్లొసంగెద, మాకుం గరుణింపు మీశ! మాధవ కృష్ణా! 15
వ. అని పలికినఁ బురాణపురుషుం డగుపుండరీకాక్షుం డక్షీణకరుణాకటాక్షవీక్షణం
బులం బ్రతీక్షించుచు మేఘగంభీరస్వరంబున ని ట్లనియె. 16
ఉ. క్రీడికిఁ బోల్ధనుర్ధరుఁడు క్రిందును మీఁదును నై తలిర్చు నీ
రేడుజగంబులం గలుగఁ డెవ్వఁడు గాని పరాక్రమంబునన్
బోఁడిమి నస్త్రవిత్త్వమున ఘోరబలంబున నాతఁ డొప్పి నీ
సూడుల నెల్ల వ్రేల్మిడిన చూర్ణము చేయు దవానలం బనన్. 17
తే. అనఘ! సౌభద్రఘాతుకుం డైనవాని, నమరవిభునంతవారలు నడ్డుకొనినఁ
గట్టి తనగాండివాగ్నిని గాల్చిపుచ్చు, వానినంజూడి నక్కల కౌను నేఁడు. 18
క. అప్పాపాత్ముని మిత్తికి, నప్పనముగఁ జేసి శమనునాలయమునకున్
దప్పక నేఁ డంపి నిన్నుఁ, మెప్పించుఁ నరుఁడు నమ్ముమీ నాదునుడిన్. 19

— ♦ అర్జునుండు వచ్చి తనస్వప్నవృత్తాంతం బెఱింగించుట ♦ —

వ. అని పలుకునవసరంబున నర్జునుండు వచ్చి నమస్కరించి నిలువంబడి యున్నం
గాంచి ధర్మనందనుండు లేచి వానిం గౌఁగిలించుకొని శిరం బాఘ్రాణించి దీవించి
తనచెంతం గూరుచుండం బెట్టుకొని నగుమొగంబునం గని యి ట్లనియె. 20
తే. తమ్ముఁడా! నీముఖచ్ఛాయ దనుజవైరి,సుప్రసన్నతయును నేఁడు చూడఁ జూడ
సంగరంబున విజయం బెసంగు ననుచుఁ, జెప్పకయ చెప్పచుండెడి సిద్ధ మట్ల. 21
వ. అని దీవించునంతఁ గౌంతేయావరజుండు తనకు నమ్మహాత్మునను గ్రహంబునం జేసి
స్వప్నంబున నీశ్వరసాక్షాత్కారం బగుట లోనగునంతయు నెఱింగించుటయు
నందుఁ గలవా రందఱు నానందించి మేలు మే లని చంద్రశేఖరుం గీర్తించి
కొండొకవడికి ధర్మరాజానుజ్ఞాతు లై యుద్ధసన్నద్ధు లై చనిరి కృష్ణార్జునసాత్యకు
లేకరథారూఢు లై పార్థశిబిరంబునకుం జని రందుఁ గృష్ణుండు. 22
సీ. అగ్నిదత్తం బగునర్జునరథమును, గపికేతనం బెత్తి కడు నమర్చి
సర్వాయుధంబులు సన్నద్ధముగఁ జేసి, జైత్రమంత్రంబులు చదివి దాని
నాహ్నికం బాతయు ననువొందఁ గావించి, యున్నస్థానకుఁ దా నొప్పఁ జెప్ప
నతఁడు కిరీటవర్మాదులు ధరియించి, శరశరాసనములు సంగ్రహించి

తే. వేదవిప్రు లాశీర్వాదవిధులు దీర్ప, నుదయగిరి నెక్కు భాస్కరునోజ నమ్మ
హారథము నెక్కెఁ గృష్ణసాత్యకులు నంత, నతనితోఁ గూడ నెక్కిరి హర్ష మెసఁగ.

తే. అపుడు స్వర్గాతియజ్ఞము సరయు వేడ్క, నరుగు దేవేంద్రు వెంబడి నంటి పోవు
నశ్వినులఁ బోలి కృష్ణసాత్యకులు పాక, శాసనిం గూడి కదలిరి సమరభువికి. 24

వ. అంత గోవిందుండు గుఱ్ఱంబుల పగ్గంబులం బూని సారథ్యంబు గావింపం దొడంగెనప్పుడు.

క. బుధశుక్రసమన్వితుఁ డగు, విధునివిధంబునను వృష్ణివీరులనడుమన్
బుధనుతుఁడు జిష్ణుఁ డొప్పె వి,బుధనాథునివైభవంబు పొంపిరివోవన్. 26

తే సూతమాగధమంగళస్తోత్రపాఠ, నినదములు విజయాశీర్వచనములు నను
కూలవాయువులుం గని కురుకులజుఁడు, తనరియు యుధానుఁ గనుఁగొని యనియెనిట్లు.

—♦ అర్జునుఁడు సాత్యకిని ధర్మరాజరక్షార్థము నియోగించుట ♦—

చ. మనకు నిమిత్తముల్ గలవు మంగళసూచకముల్ జయద్రథుం
దునిమెద నేఁ డగుం జయము దోర్బలనిర్జితశత్రులోక! నేఁ
జనియెద నా ప్రతిజ్ఞఁ గొనసాఁగ నొనర్ప గురుప్రతిజ్ఞ సాఁ
గనిగతి సేత కీవు జనఁగా మతి సేయుము రెండు ముఖ్యముల్. 28

మ. హరికిం దుల్యుఁడ వెల్లభంగులను నిన్నాలంబునన్ మార్కొనన్
సురలుం జాలరు నీవు చెంతఁ గలుగన్ క్షోణీశ్వరుం డేను లే
మి రహిన్ వీడి దిగుల్ గొనండు గురుఁడున్ మీ అందు నా కిందుఁ గ
ల్గు రమానాథునిరక్షణ మ్మచట నీకుం జెల్లు రక్షింపఁగన్. 29

క. నాదెసఁ జింతన్ విడి నీ, వాదెసఁ జను విక్రమాఢ్యుఁ డగుగురుప్రతినన్
బాదుకొనఁ జేసి మది నా,భూదయితుని నేమఱిలక ప్రోవం జనుమా. 30

వ. అని వీడ్కొలిపిన నతండు వల్లె యని రథంబు డిగి ధర్మరాజుపాలికిం జనియె ననిన
ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 31

—♦ జయద్రథవధపర్వము ♦—

మ. సుతశోకంబునఁ గుంది డెందమున జిష్ణుం డుగ్రుఁడై వ్యగ్రుఁడై
ప్రతినం బూని కపిధ్వజప్రభలు భూభాగంబులం గ్రమ్మ సం
తతగాండీవనినాదముల్ సెలఁగ యుద్ధక్షోణికిం బూని రా
కృతమంతుల్ మనవార లెట్లభయులై కేరించిరో చెప్పవే. 32

ఉ. అక్షయతూణగాండివశరాసనదివ్యశరాంచితుండు ఫా
లాక్షుని నొక్కతూఁకున రణావని నొవ్వఁగ నేసియున్ సహా

ర్వాతిసార దరద పుండ్ర ప్రభృతిగిరిగహ్వరవాసులును వేనవేలు గజనవాన్ర సహితులై తలపడి నానావిధ హేతివ్రాతంబులం గురిసినం గాండీవమధ్యముండును.

క. రథికులు హాస్తిపకుల్ తన,రథమును గప్పంటయు శరపరంపరల మదిన్ ।
గ్రుధ సేసి గాండివాద్రిని, మథియించె దద్బలాబ్ధి మార్గణగుణియై. 117

—♦ అర్జునుండు కురసేనం బీనుంగుపెంట గావించుట ♦—

చ. పగిలినశీర్షముల్ తునియుబాహులు దున్సినభూషణంబులున్ ।
దెగినసిడంబులున్ ముమురుదేఱిన తేరులు రక్తసిక్తమై ।
మొగిం దెగి రాలునాయుధసమూహము గప్ప మహీతలంబు చె ।
ప్పంగ నగునప్పు డెఱ్ఱనయుం బచ్చనయుం గలతాల నొప్పు నాన్. 118

క. శరములం దునిసినకరములు, శిరములు నరదములనుండి క్షితిపైం బడుచున్ ।
బరికింప నొప్పె నప్పుడు, తరుశాఖలనుండి పడుపతగపంక్తు లనన్. 119

సీ. నెత్తురుటేఱులు వాఱ నిలువెల్ల గైరికాం,బుస్రావమున నొప్పుభూధ్రము లన ।
శూలాహతిం దాళం జాలక గీపెట్టు,క్రొంచు నార్తి వెలార్చుక్రౌంచము లన ।
ఛిన్నహస్తంబులై జిఱ్ఱునం దిరుగుచుం, గలశాబ్ధి మథియించుకవ్వము లన ।
గండము త్రెగి నెత్రు గ్రక్కుచు నెక్కటిం,బుడమిపైం బడుమహాభూతము లనం ।
తే. జెప్ప నొప్పె నప్పుడు పార్థశితశరములు, మిడుతలో యన నెల్లెడం గడిమి మెఱసి ।
పడినమావంతులను బాసిబడలుపడియుం,గూలియును వ్రాలియును బెక్కుకుంజరములు

వ. అట్లు షట్సహస్రహయాసీకంబును దశసహస్రవీరవ్రాతంబును నేలపాలు గావించి సంగ్రామరంగంబున నేనుంగు లీఁదం జాలుకీలాలప్రవాహంబు వాఱించి తనకు మాఱు మలయువారు లేక పద్మిని పద్మాకరంబు వీఁక నమ్మూఁకలం గలంచి పరాక్రమంబునం బెంపుగాంచి వాసుదేవమహావాయుసహాయుంబున ధనంజయుం డు ధనంజయుండై మనసేనాకాననంబుం గాల్చిపుచ్చి శకటవ్యూహంబు చించుకొనిపోవుచున్నప్పు డంబష్ఠపతి యగుశ్రుతాయు వనువాం డడ్డు వడి శరాసారంబు గురియుటయు నర్జునుండును. 121

ఉ. గాండివముక్తకాండముల ఖండములై పడం జేసి వానివి ।
ల్లొం డనకుండ నశ్వముల నుర్విఁకిం బెట్టిన నొతఁడుం గదా ।
దండము పూని కేశవునిం దాఁకఁగ నేసెడునంత దాని నా ।
ఖండలసూతి దుత్తుమురు గా నొనరించె వెడందతూపునన్. 122

ఉ. అత్తఱి నాగ్రహంబున శ్రుతాయువు మార్గదం బూని మండుచుం ।
దత్తఱపాటుతో విసరి దానన కృష్ణుల మొత్త నెత్తం బో

నత్తిన చేతు లాడి వడ నేసి నరుండు శిరంబుఁ ద్రుంచె మేల్
కత్తిమొగంబులం దూపుల నిలం బడె వాఁడు ద్రుమంబు నా మహిన్. 123

క. కీ లెడలిన బొమ్మవలెన్, గూలి శ్రుతాయువును బోవఁ గూడిన మూఁకల్
ప్రేలి పెఱచఱచి పఱచెన్, జాలి నరుం డొడ్డు సొచ్చి చనఁ జొచ్చె నొగిన్. 124

వ. ఇట్లు ద్రోణానీకంబు భేదించి భోజుం బెట్టు నొంచి కాంభోజుం గండడంచి శ్రుతా
యుధప్రభృతులం ద్రుంచి యవన దరదాదిబలంబులం దూలించి పరాక్రమించి
వచ్చుచున్నవివ్వచ్చుం గని నీకొడుకు చింతాశోకవ్యాకులచిత్తుండై తత్తఱంపడి
రథోత్తమంబుతో ద్రోణాంతికంబునకుం జని కటకటం బడి యిట్లనియె. 125

చ. కటకట! యేమి చెప్పెద నిఁకన్ ధరణీసుర! సవ్యసాచి ప్ర
స్ఫుటముగ నిన్ను దాఁటి మనమూఁకఁ గలంచి మలంచి పోయెడిన్
దటుకున సింధురాజునకు డగ్గరునట్లుగ నెట్లు చేసి సం
కటములపాలు గా కవలికార్యము దీర్చెద మట్లు చూడుమా. 126

తే. కోప మనుగాలి ప్రేరేపఁ గ్రూరఫల్గు,ణాగ్ని కక్షమునుం బోలె నఖిలసేనఁ
గాల్చుచున్నాఁడు సైంధవుఁ గాఁచుపనికి, దిక్కుమా కీవు గాకొండుదిక్కు గలదె.

చ. బలఁగము మోము చించుకొని పార్థుఁడు లోనికిఁ జొచ్చె నప్పుడే
కలఁగి జయద్రథుం బొదవి కావఁగ నుండినవార లెల్ల లో
పలఁ గడుసందియంబునను బర్విరి నీమెయిఁ బ్రాణవాయువుల్
గలిగిన దాఁటి రా నరుఁడు గాఁడు హరుండు నశక్తుఁ డారయన్. 128

ఆ. ఇట్లు చేసి తింక నే మన నేర్తు, నిను నతిక్రమించి చనియెఁ బార్థుఁ
డకట నాబలంగ మార్తశూన్యప్రాయ, మయ్యె కార్య మెట్టిదగునొ తలఁప. 129

ఉ. పాండవపక్షపాతి వని భావమునందు నెఱింగి యుండియున్
మెం డగుకార్యభారమున మీఁదులు గానక మోసపోయితిన్
నిండుమనంబు నమ్మి నిను నీకిటు భక్తుల మైనమాకుఁ గా
కుండఁగఁ గూర్తు వొండులకు నుల్లములోపల నెల్లకాలమున్. 130

తే. ఇంటఁ దిని యింటివాసము లెల్ల లెక్క,పెట్టిన ట్లీవు మాయొద్దఁ బొట్టఁ బోసి
కొనుచు మా కపకారంబుఁ గూర్తు వకట, తేనె పూసినకత్తివి తెలిసికొనఁగ. 131

మ. అని నేఁ బార్థుల నిగ్రహింతు వెఱ లే దం చీవు వాకీయ నుం
డిన నే సైంధవు నింటి కేగ నిడుదున్ డెందంబు కా దట్లు నీ
ఘనరక్షన్ మది నమ్మి బుద్ధి పెడవంకం బోవుటం జేసి నేఁ
డనికిం దెచ్చితి మిత్త్రి కిచ్చితిని మోహభ్రాంతి నాభావమున్. 132

క. యమదంష్ట్రాంతరవర్తిం, దెమలిచి కొనితేఁగ వచ్చు దేరకుఁ దేరన్
సముచిద్వేషికుమారుని,సముఖంబునఁ బడినవానిఁ జనునే తేఁగన్. 133

—♦ దుర్యోధనుండు ద్రోణునితో మొఱ్ఱ పెట్టుట ♦—

వ. బ్రాహ్మణోత్తమా! నాయార్తప్రలాపంబుల కలుగక జయద్రథుం గాఁచిపుచ్చు
మని ప్రార్థించిన నాచార్యుండు దుర్యోధనున కిట్లనియె. 134

క. నీ వేమన్నం గినియం, బోవన్ను నాసుతుఁడు నీవుఁ బోల్పఁగ నొకరూ
పై వెలయుదార నాకో,భూవర! సత్యంబు వలుకఁ బూనితి వినుమా. 135

ఉ. సారథి దేవదేవుఁ డగుసారసలోచనుఁ డశ్వరాజముల్
మారుతతుల్యవేగము లమానుషవిక్రముఁ డాధనంజయుం
డేరణమం దెఱుంగఁ డొకయింతపరాజయ మట్టివానితో
కేరహిం నాఁగవచ్చు నని యీవు దలంచితివో వచింపుమా. 136

ఆ. ఇంచుకంతయేని కొంచక నాచెంత, మెఱుపుదీఁగవోలె మెఱసి మెఱసి
తెఱపి గాంచి వడిగఁ బఱచె నే వెన్నంటి, కోసువోయి శరము లేసితిఁ గద. 137

క. ఈ వెఱఁగనట్లు పలికెద, వావలఁ గనుచుంటి వెంట నంటి శరంబుల్
నే వేయు టెల్ల తెల్లము, నావలనం దప్పు వలుక నరపతి కగునే. 138

సీ. మఱియు నాకర్ణింపు మెఱుఁగఁ జెప్పెద నేను, గడువృద్ధుఁ జాలను వడిగఁ జనఁగ
సేనాముఖమునఁ బాంచాలాదిసైన్యముల్, మొనకట్టుకొని యుండె మొనసిపడఁగఁ
బాండవాగ్రేసరుఁ బట్టి తెచ్చెద నని, ప్రతిన సేసితి రాజవితతినడుమ
దానిని నెఱవేర్పఁ దఱి యగు నిది ధనం,జయుఁడు కొండొకచోటు జనిన దానఁ

తే. గాన సేనాముఖము విడి కదలి పోయి, పాకశాసనితోఁ బోరు వీఁక సలుప
నాకుఁ దెల్లముగాఁ జెల్లదో కురువర! చెప్పెదను జెప్పిన ట్లీవు చేయుమిపుడు. 139

ఉ. రాజవు రాజపుత్రుఁడవు రాజసలక్షణలక్షితుండవున్
తేజము శౌర్యముం గలవు దివ్యశరంబులు నీవశంబులో
రాజకులైకభూషణ పరాక్రమ మేర్పడ నీవు పోయి స్వా
రాజతనూజుతోఁ బెనఁగి రమ్ము భయమ్మది యేల లెమ్మిఁకన్. 140

వ. అనినఁ గురువిభుండు గురున కిట్లనియె. 141

మ. శతకోటిం గొని హస్తమందు క్షితిభృత్సందోహముం ద్రుంగఁ జే
సి తగన్ వ్రేల్గెడువేల్పుతేని నయినన్ జివ్వం దెరల్పంగ నే
జతనంబుం బొనరింతుఁ గాని విను మాస్వారాట్సుతున్ మార్కొనన్
మతిలోసం బెగ డొందుచుందు ననుచున్ ద్వాక్రుత్తు నేఁ డిత్తఱిన్. 142

వ. మఱియు నమ్మానధనుండు నేఁడు నిన్నుఁ గ్రేడించి కృతవర్మ నోడించి శ్రుతా
యుధ ప్రభృతులం దెగటార్చి ప్రాచ్యదాక్షిణాత్యాదియవనవ్రాతంబు నోర్చి
వేలకొలంది వేదండంబులం బిండివెట్టి మాఱు లేక మాఱి మసంగినట్లు చెలరేఁగి
మనగట్టిమొన నెట్టుకొనిపోవుచున్నవాఁ డట్టిజగజెట్టితో నే నెట్టు పోర నేర్తు నాయ
శంబుఁ గాపాడుచు నీ కుచితం బగునట్టు లానతి మ్మనిన భారద్వాజుండు రారాజు
దిక్కు మొగం బై. 143

చ. నిజము వచించినాఁడ వలనిర్జరనాథకుమారుఁ డావృష
ధ్వజునకునే నజయ్యుఁ డన వచ్చును గాని యుపాయ మొక్కఁ డీ
వజితుఁడ వై యెసంగునటు లానతి యిచ్చెద ని న్ననిం జతు
ర్భుజుఁడును జూచి మెచ్చెడిని పొ మ్మద నచ్చెరుపాటు వాటిలన్. 144

చ. ఇదె కవచంబు స్వర్ణమున నియ్యది యయ్యె సురేంద్రు లోప రే
ప్రదరము లైన దానిపయిఁ బాఱఁగఁ జాలవు మూఁడులోకముల్
కదనముసేయ వచ్చినను గాని భయం బది లేదు క్రీడికిం
బెదరఁగ నేల దీనిఁ దొడి వేచను మర్జునుతోడఁ బోరఁగన్. 145

—♦ ద్రోణాచార్యుండు దుర్యోధనున కభేద్యకవచం బొసంగుట ♦—

వ. అని పలికి జలస్పర్శంబు చేసి యొక్కకాంచనకవచంబు దీసి యభిమంత్రించిమంత్ర
బలం బం దావహిల్లం జేసి యది నీసుతునకుఁ దొడిగి బ్రహ్మేంద్రా దులును
బ్రాహ్మణులు సరీసృపాదులును నహుషంయయాతి దుందుమార ప్రభృతిరాజర్షు
లును లక్ష్మీసరస్వతీపార్వతులును స్వాహాస్వధారుంధతులును నశిత దేవలవిశ్వామి
త్రాంగిరో వసిష్ఠముఖ బ్రహ్మర్షులును ధాతయు విధాతయు దిక్కులు దిక్పాలురును
భూమ్యంతరిక్షంబులును గ్రహంబులును నీకు స్వస్తి గావింతురు గాక యని దీవించి
యి ట్లనియె. 146

సీ. తొల్లి వృత్రునిదాఁడి దురపిల్లి వేల్పులు, హరి కెఱిఁగించిరి శరణు సొచ్చి
విని వారిమొఱ్ఱ లావిష్ణుదేవుఁడు నాకు, రక్ష్యులు మీరు కర్తవ్య మిద్ది
వర్షాయుతశతంబు త్వష్ట తపము సేసి, పడసెఁ బుత్రుని వాని మృదునివలన
వాఁ డజయ్యుఁడు గాన వామదేవుని వేఁడు, డాతఁడు కరుణించు ననుడు సురలు
తే. రజతగిరి కేగి మ్రొక్కి సర్వమును దెలుప, హరుఁ డసాధ్యుఁడు వృత్రుఁ డట్లయిననాదు
గాత్రజం బై నకవచంబు కలదు దాన, నరయ వచ్చును జయము మీ కనుచుఁ బలికి.
తే. అమరున ద్దాని మంత్రపూతముగఁ జేసి, యమరపతి కిచ్చి దీవించి యంపిపుచ్చె
నతఁడు తత్కవచాభిగుప్తాంగుఁ డగుచుఁ, జులక వృత్రాసురుని గెల్చి సురలఁ గాచె.

వ. అభేద్యం బగునక్కవచరాజంబుఁ బురందరుం డంగిరసునకు నంగిరసుండు బృహ
స్పతికి బృహస్పతి యగ్నివేశ్యునకు నగ్నివేశ్యుఁడు నాకును బ్రసాదించి రిమ్మహ
నీయకవచంబు తొల్లి దేవాసురసంగ్రామసమయంబున హిరణ్యగర్భుఁడు విష్ణు
దేవునకును దారకామయంబున మఘవంతునకుం దొడిగినట్లు నీకు నేనిదె బ్రహ్మ
సూత్రంబునం గట్టుచుంటి నని దుర్యోధనున కాచార్యుండు విధిపూర్వకంబుగం
గవచరాజంబు దొడిగి యంపిపుచ్చుటయు నతండును ద్రిగర్తరథసహస్రంబును
మత్తమాతంగసహస్రంబును నాజానేయాశ్వనియుతంబును జెక్కుండ్రు మహారథు
లును దన్నంటి నడువ నర్జునరథంబు దరియ నరిగె నంత నిక్కడ. 149

సీ. పాండవపాంచాలబలము లుప్పొంగి పార్థుని మున్నిడుకొని చాపగురుని
మార్కొనుటయు నట్టిమధ్యాహ్నమునఁ బోరు, ఘోరమై కన్పట్టె వారలకును
గని విని మెఱుఁగ మక్కరణి కయ్యము మున్ను, కలసి వారొండొరుఁ గాండసమితి
నఱుముచుండుఁడు వార్షికాగమంబున జాహ్నవియును గాళిందియు బెరసినట్టు
తే. రెండుసేనలుఁ దగె నప్డు గండుమిగిలి, పార్థుఁడు వహ్నివలె మనబలఁగములను
నీఱు సేయుచుండ గురుండు నెఱి సెసంగ, బాణవర్షమునం దానిపట్టు చెఱిచె. 150

చ. వివిధశరాశుగాత్త మసివిద్యుదలంకృత మాశుగాసవా
సవధనురంచితంబు బహుసాయకవర్షపరీవృతంబు, ద్రో
ణవరవలాహకం బపు డణంచి పరధ్వజనీధనంజయో
ద్భవ మగుతాప మంతయును దప్పు సనం బొనరించె నొచ్చఁగన్. 151

వ. ఇట్లు ద్రోణధృష్టద్యుమ్నాభిరక్షితంబు లై యుభయసైన్యంబులు దైన్యంబు దక్కి
యుక్కుమిగిలి యెక్కుటెక్కుటిం దాఁకి వీఁకం బోరుచున్నంత భారద్వాజుండు
పాండవసైన్యంబుపై నానావిధాస్త్రశస్త్రంబు లేయుచున్నధృష్టద్యుమ్నుండును వాని
నెల్ల వారించి కౌరవసైన్యంబుపై నానావిధాస్త్రశస్త్రంబు లేయుచుండె నట్లిరువా
గును దుల్యపరాక్రమం బై. 152

శా. ద్రోణాచార్యుఁడు వేనివేని నని మార్కొ నేగునో సోమక
క్షోణీశాత్మజుఁ డందు నందును మహాక్రోధంబు దీపింప న
క్షీణక్షిప్రగతిన్ గమించి శరవృష్టిన్ ముంచి చేయాడనీ
కాణిం ఛేదిలఁ జేయుచుండె సుర లాహా యంచు మే లెంచఁగన్. 153

వ. అధృష్టద్యుమ్నునికోల్తల కోహటించి మనమూఁకలు మూఁడుమొత్తంబు లై కృత
వర్మజలసంధగురులపాలనంబునఁ జేరుటయు వారిసైన్యంబును మూఁడుగుంపు లై
మనవారి నఱిమె నందు ధృష్టద్యుమ్నుం డాచార్యునిపాలంగలమూఁకలఁ జీకాకు

వెట్టినం గోపించి చాపగురుండు మండిపడి సాయకజాలంబుల వానిచతురంగబలంబులం గూల్చుచుండె నట్టియెడ వివింశతి చిత్రసేన వికర్ణులు విందానువింద క్షేమధూర్తులతోఁ బ్రహాయుగ భీమసేనుం దాఁకి వీఁకంజూచి బాహ్లికుండు ద్రౌపదేయుల నేపురం దొడరి పోర శైబ్యుండు దశశతావరయోధులం గూడి కాశిరాజుం దాఁకిన వారి పోరు దర్శనీయం బయ్యె శల్యుండు దవ్వులనుండి సేనాముఖంబునకు వచ్చి ధర్మరాజుం దలపడిన నతండు పంచశతిసాయకంబులఁ బరఁగించె దుశ్శాసనుండు శైనేయు మాఱొక్కని తొమ్మిదితూపులం దూల నేయుటయు నతం డింత సోలి తెప్పిఱి పదివాలమ్ములు వానిమేనం గీలించె సౌబలుండు తాను దనసుతశతగాంధారయోధపరివారంబుతోఁ నకులసహదేవులం బొడివి వారిశరపాతంబున కోర్వక కాందిశీకుం డై ద్రోణుమఱువు సొచ్చె విందానువిందులు విరాటుం దలపడ్డి పర్వతగిరి బాహ్లికుండు శిఖండిం దాఁకి ఘోరయుద్ధంబు చేసె నావంత్యుఁడు ప్రభద్రకసౌవీరసహితుం డై ధృష్టద్యుమ్ను నెదిరించి పరాక్రమించె నలాయుధుండు రాక్షసగణపరివృతుం డై ఘటోత్కచు నెదిరించె నలంబుసుండు కుంతిభోజు నెదిరించిన నతం డతని నొవ్వ నేసె సైంధవుండు సర్వసైన్యంబులకుం బృష్ఠభాగంబునఁ గృపప్రభృతిరథికపరిరక్షితుం డై యుండె వానివామదక్షిణపార్శ్వంబులఁ జక్రరక్షకు లై కర్ణాశ్వత్థామలును బృష్ఠగోపు లై సౌమదత్తిపురోగములగు కృప వృషసేన శల శల్య దుర్జయులును నిలిచి రిట్లు సంకులసమరంబు సెల్లుచున్నంతఁ గొంతవడికి భీమసేనుండు జలసంధుని యుధిష్ఠిరుండు కృతవర్మను ధృష్టద్యుమ్నుండు ద్రోణునిం దలపడి తాలమాత్రచాపంబులు గ్రాలఁ బరశు పట్టస ముసల ముద్గర తోమర భిందివాల కరవాలాది సాధనంబులతోఁ బోరుచున్నప్పుడు రుధిరవాఁగునందుం ద్రెళ్లెడుమనుష్యులును దొల్లెడుతలలును రాలెడుభూషణంబులును గూలెడుసిడంబులును దునిసెడునాయుధంబులును జదిసెడుసామజంబులును జెదిసెడుఘోటకంబులును విఱిగెడురథంబులును దొరఁగెడుశోణితంబునుం గలిగి సంగరాంగణంబు భూతభేతాళాదిక్రవ్యాదగణంబులకు మహాసనం బై సంతృప్తిదాయకం బై సకలభూతభయంకరం బయ్యె నయ్యెడ ధృష్టద్యుమ్నుండు. 154

—◆ ద్రోణధృష్టద్యుమ్నులయుద్ధము ◆—

సీ. తన కింతచెంత ద్రోణుని తేరు రాఁ గని, పారావతసవర్ణవాహములను
గురునిశోణాశ్వముల్ గూలెడునట్లు డాయఁగఁ దేరుఁ బోనిచ్చి మగఁటిమి గాని
వాలునుం బలకయు వడిఁ బూని ద్రోణుని, తేరినొగలమీఁదఁ జేర నుఱికి
పలలాశిఁ బైనుండి పడుడేగవలె నొప్పి, వాల్ద్రిప్పుకొనుచు నభ్రముగ నిలిచి

తే. చిత్రగతులను ద్రోణుని శితశరములఁ, బలక జడియుచు నగ్గురుతలను నలక
సంతరం బరయుచు నున్నయపుడు గురుఁడు, తనదుకరలాఘవం బెల్లజనులు మెచ్చ.
చ. శరశతసంతతిం బలక జర్జరితంబుగఁ జేసి ఖడ్గముక
శరదశకంబునం దునిమి సప్తిచతుష్టయముక నియంతతో
నరువదినాల్గుబాణముల నాఱడి వోవఁగఁ జేసి ఛత్రచా
మరములు కేతువున్నఱకి మార్గణయుగ్మమునన్ రయంబునక. 156
ఉ. ఆపడవాలుప్రాణముల నంతటిలోఁ గొనఁ జాలుభల్లముక
గోపతి వజ్రముం బలెను గొబ్బునఁ గైకొని యార్చి వానిపై
నేపున నేసెఁ జచ్చె నని యెల్లరుఁ దల్లడ మంది రప్పు డా
శ్రీపతితమ్ముఁ డాశరము చేద్పఱచెక పదునాల్గుతూపులక. 157
క. సింగమువాతికురంగము, నంగద గాకుండఁ గాచునట్లు గురునిచే
తం గూల నైనపార్థు,నిం గాచెక శినివరుండు నిశితాస్త్రమునక. 158
మ. తన కర్గం బగుదాయ నేయఁ బ్రతిబంధం బైనకృష్ణానుజుక
గినుకం గాంచి ధనుర్గురుం డిరువదా ర్కీలమ్ములక వానిపైఁ
బొనుపక దాపము కోపముం గదుర నాజో దిర్వదాస్త్రాపులక
ధనుతాచార్యునురంబు గాఁడ నినిచెక దర్పస్ఫురన్మూర్తి యై. 159
వ. అంతలోఁ బాంచాలురు పెక్కండ్రు గూడముట్టిరి ధృష్టద్యుమ్నుండు నొండుతే
రెక్కె నప్పుడు ద్రోణాచార్యుండును. 160

—♦ ద్రో ణ సా త్య కు ల యుద్ధము ♦—

మ. గుడుసుల్ వారినవిల్లు నోరు శరముల్ కోఱల్ శితాసిద్వయం
బెడలం గ్రోసెడునట్టినాల్కలు విషాహీనోగ్రకీలమ్ములై
కడిమింగాంచఁగఁ గాలసర్ప మన నుగ్రంపశ్యుఁ డై క్రోధ మక
గడునుగ్రంపువిషమ్ముఁ గ్రక్కుచు వడిక దాఁకెక రమేశానుజుక. 161
వ. ఇట్లాచార్యుం డవార్యశౌర్యంబున రుక్మపుంఖవిశిఖంబులు పుంఖానుపుంఖంబుగా
నేయుచు నింగి నాక్రమింపఁ జాలినశోణాశ్వంబులవేగంబున డాయ వచ్చుటయు
శినివరుండును. 162
మ. శరవర్షంబు రథప్రఘోషబకముక జ్యానాదగర్జంబు భీ
కరశక్త్యస్త్రమహాశనిప్రభము ఖడ్గప్రాదినీకాంత మి
త్వరకోదండపురందరాయుధము క్రోధజ్వాల మశ్వాన్వితో
త్తర మాచార్యఘనంబుఁ గాంచి నగుచుక దా సూతుతో ని ట్లనుక. 163

తే. బ్రాహ్మణుఁ డయ్యు నీతఁడు బ్రహ్మధర్మ,బంధురుఁడు గాక క్షాత్రంబు పట్టువడఁగ
ధార్తరాష్ట్రునికై పోరఁ దలఁచి వచ్చె, శూరమాని గురుం డెల్లకౌరవులకు. 164
క. ఈతని కభిముఖముగఁ దే,రాతతగతిఁ బోవ నిమ్ము హరుల నదుముచున్
భూతలమునఁ గలక్షాత్రం, బేతన్మాత్రంబు గామి నే నెఱిఁగింతున్. 165
వ. అనిన సారథియు రజతసంకాశంబు లగుమాధవాశ్వంబుల నాచార్యాభిముఖంబు
గం బోవనిచ్చుటయు నారథికవరు లిరువురు నితరేతరంబు నాతపాపాయకాలంబునఁ
గాలమేఘంబులు నా నొప్పి శరవర్షంబున నంతరంబు లేకుండ భూమ్యంతరిక్షంబు
లును నిఖలదిక్తటంబులునుం గప్పి వాతాతపంబులకుఁ జోటు లేకుండఁ జీఁకటు
లకుఁ జోటు గలిగించి రప్పుడు. 166
సీ. ఇషువు లొండొంటితోఁ నెసఁగ ధారాభిఘా,తజశబ్ద మశని నాఁ దనరుచుండ
నొకనియు గ్గొకనిమై నొగి నాటఁ ద్రాఁచు క,ఱచుకొని యున్నట్లు ప్రచురపడఁగ
నితరేతరజ్యాతలోద్ధారవము కొండ, పిడుగుపాటునఁ గూలుకడిమిఁ దెలుప
నొండొరు రుక్మపుంఖోన్నతశరపంక్తి, మునిఁగి చిత్రాకృతిన్ మొనసి తనరఁ
తే. బోరు చెక్కునతక్కువల్ పొసఁగకుండ,వారు ధనువులు ఛత్రముల్ ధ్వజములు దెగ
నిరువురున్ నెత్రు వెల్లుల నీఁతలాడి, వెఱయు నచ్చెరుపాటు గావించి రపుడు. 167
చ. గురుఁడును సాత్యకేయుఁడును ఘోరగతిన్ రణముం బొనర్చుచోఁ
గరితురగాధిరోహకులుఁ గాల్వురుఁ దేరులవార లొండొరుల్
దుర మొనరింప మాని తమితోఁ గనుచుండిరి తెప్ప వాల్ప కం
బరమున వేల్పులున్ బలె సెబా సని మెచ్చుచు నిచ్చ పెంపునన్. 168
తే. గతము ప్రత్యాగతాక్షేపకములు చిత్ర, మండలాదికములు గతుల్ మెండుకొనఁగ
నస్త్రముల హస్తలాఘవ మతిశయిల్ల, విడువ కని సేసి రా శినివీరగురులు. 169
వ. అట్టిసమయంబున. 170
చ. శినివరుఁ డుక్కుమీఱి గురుచేతులఁ దాండవమాడుచాపమున్
దునిమిన నాతఁ డొండువిలు తోడన సజ్యము సేయ దానినిం
దునియలు గాఁగ నేయుటయు ద్రోణుఁడు వేఱొకకార్ముకంబు గై
కొనియె యుద్ధాద్వహుం డదియుఁ గొండొకయింతన త్రుంచె నెంచఁగన్. 171
తే. అట్లు లెత్తినధను వెల్ల నట్టె నఱకఁ, గురుఁడు పదియాఱువిండులఁ గోలుపోయి
యొండు దోఁపక యుయుధాను నుగ్రశక్తి, కచ్చెరువు నొంది తనమది నభినుతించె.
తే. అర్జునుండును గార్తవీర్యార్జునుండు, భార్గవుండును భీష్ముండుఁ బడసి రిట్టి
శస్త్రబల మెన్న నీతనిశౌర్య మెన్న, మిన్న యని చెప్ప నొప్పెడుఁ బిన్న యైన. 173

వ. అనినంతసించి ప్రశంసించె దేవగంధర్వులునువానినగ్గించి రంతఁ జాపాచార్యుండును.

ఉ. చాప మొకండు పూని బహుసాయకపంక్తుల సాత్వతేయునిన్
గోప మెసంగ నేయుటయుఁ గో యని యార్చుచు నాతఁ డట్టివాల్
తూపుల వాని నెల్ల వడిఁ దూలఁగఁ జేయుచు వెండి యేయుచున్
జూపినవిక్రమంబునకుఁ జూపఱు మెచ్చిరి నీబలంబులన్. 175

క. ఏయస్త్రంబున ద్రోణుం, డేయునొ సాత్యకియు నట్టిదే యస్త్రముఁ దా
నేయుఁడు సంభ్రాంతుం డై, పాయని క్రోధంబు లోనఁ బట్టువడంగన్. 176

శా. ఇట్లం జేయుదు సాత్వతేయు నని యాగ్నేయాస్త్రమున్ ప్రేయుఁడున్
వెట్టల్ గ్రక్కుచు నర్థి మీఁది కరుదే వీక్షించి శైనేయుఁడున్
దిట్టం డై వడి వారుణాస్త్రమునఁ దద్దివ్యాస్త్రము న్మాపుచున్
బుట్టెన్ హాలహలారవంబు వడకెన్ భూతంబులున్ భీతిన్మై. 177

వ. కొంతవడి కయ్యస్త్రంబులు రెండును శాంతంబు నొందె నప్పటికి మధ్యాహ్నంబు దిరుగుటయు నట్టియెడ యుధిష్ఠిరభీమసేననకులసహదేవధృష్టద్యుమ్నవిరాటకేకయులు మత్స్యసాల్వసైన్యంబులతో సాత్యకికిం దోడుపడి ద్రోణుం దొడరుటయును దుశ్శాసనప్రభృతు లగురాజకుమారులు పెక్కం డ్రుక్కుమిగిలి భారద్వాజునకుం బాసట యైనం బోరు ఘోరాభిరామం బయ్యె నట్టియపరాహ్ణసమయంబున నక్కడ. 178

— అర్జునుండు కురుసేనఁ జిందువందు చేయుట —

సీ. సైంధవుఁ డాయంగఁ జనువార లై వాసు,దేవార్జునులు వెసఁ బోవుచుండ
సునిశితాస్త్రంబుల స్రుక్కించి సేనల, రథమార్గ మొనరించెఁ బృథసుతుండు
సకలశతాంగశిక్షావిదుం డగుశౌరి, తిరిగి చిత్రగతులఁ దేరు నడిపె
విహగపానిలమనోవేగంబు లగుజిష్ణు,హయములగమన మత్యద్భుత మగు
తే. రవిరథం బింద్రుతేరు వైశ్రవణునరద, మీశ్వరునిస్యందనంబు నయ్యింద్రసుతుశ
తాంగమున కింతరయమునయందు సాటి, రానివిధమునఁ గృష్ణసారథ్య మొప్పె.

చ. నరుఁ డొకకోసుదూరమున నల్వగుచుండినదాయపై వడిన్
శర మరివోసి యేసి యటుచక్కన దా నటకోసు దాఁటి ముం,
దరఁ జని నంత నాశరముఁ దాఁకెడు నాతని నేమి చెప్ప నా
హరులజవంబు సారథిమహానిపుణత్వముఁ గాక యుండునే. 180

మత్త. ఆయసంబులు వైణవంబులు నర్జునాస్త్రము లారయన్
స్నాయునద్ధము లై కడుంగడు నల్ల తెల్లఁగఁ గ్రోలి యు

అచి పఱచియుం గొంతలోఁ గాంతేయునిఁ బరిశ్రాంతునిఁగా నెఱింగి సైంధవుఁడు సమీపగతుండు గామికిని దివాకరుం డస్తగిరిసమీపగతుం డగుటకును సంతసించుచు సింహనాదంబు గావించి మించి పరాక్రమించి కిరీటిం దాఁకుదెంచి రప్పు డప్పాండురాజనందనుండు వారి నుపలక్షించి కించిద్ధాసభాసురవదనారవిందుం డై గోవిందుం జూచి యి ట్లనియె. 191

—♦ కృష్ణార్జునులు తమరథ్యంబులసేదఁ దేర్చుట ♦—

చ. అలుగులు మేనఁ గ్రుచ్చుకొనునట్టివ యై కడు నొప్పి పుట్టఁగా
సలిపెడునట్లు తోఁచెడిసి సంతతధారగ స్వేద మూరెను
ర్వాలు నిలువెల్లఁ గ్రమ్ముకొనె రోఁజుచు నున్నవి తేరివార్వముల్
నిలుపుడమే యొకింత గమనింపు జయద్రథుఁ డుండె దవ్వులన్. 192

క. తెలుపు మనంతరకార్యము, తెలిసినవాఁడవును మాకు దేవుఁడ వనఘా
కలిపి తురంగంబుల క, ళ్ళులు విడ నలుఁగెత్తి మైమఱువు దొడ నగునో. 193

వ. అనినఁ బురుషోత్తముండు నీచెప్పినచొప్పునం జేయుటయు పరమోత్తమంబు నాకు నిదియ మతం బనుటయుం బార్థుం డట్ల యగుం గావున నే నీసర్వసైన్యంబుల నిలువరించెద నీవు నీకార్యంబు సక్కఁబెట్టు మని గాండీవంబు వట్టుకొని రథంబు డిగ్గి ధనుష్టంకారంబు సేయుచు ససంభ్రాంతుం డై మహాచలంబుచందంబునఁ బొందునడి యున్నంత దటి యని తెఱియ వచ్చి జయాకాంక్షు లగునీవారెల్లఁ బెల్లు రేఁగి మదేభంబులు సింహరాజంబునుం బోలె ధరణీస్థితుం డగుధనంజయుం జుట్టుముట్టి నానావిధాస్త్రశస్త్రంబులం దెట్టలు గట్టునట్టు కొట్టి వారివాహంబు దివాకరుం బోలె ముసుంగు వెట్టుటయు వృద్ధశ్రవునిపట్టి నెట్టనం గ్రుద్ధుం డై సర్వతోముఖంబు లైనవారియస్త్రంబుల నెల్లఁ బ్రత్యస్త్రంబుల నుపసంహరించి బహుళాస్త్రశస్త్రంబులు వారిపైఁ బ్రయోగించి యంతరిక్షం బంతయు నిజబాణసంతతుల నిండించి మించిన ధరణీపరాగంబు పెల్లున నల్లుకొనినఁ జిమ్మచీఁకట్ల నెల్ల శరసంఘర్షణసంజాతానలంబున విరియం జేయుచుండె నప్పుడు. 194

సీ. ప్రత్యవయవమును బాణవిద్ధం బౌటఁ, గుప్పఁ గూలినయట్టిఘోటకములు
నంగసంధుల నెల్ల నాశుగంబులు దూరఁ, గీల్గాల మొలుకుచుఁ గ్రాలుకరులుఁ
గీలుకీలున భల్లజాలంబు దాఁకినఁ, దుత్తుము లైనరథోత్తమములుఁ
దిలమాత్రముగ నొడళులు తెగుటన్ నెత్రు, కండలు నా నొప్పుకాలు బంట్లు
తే. పొడిపొడిగ నయి రాలెడుభూషణములు
తునియ లయి నేలఁ బడెడు కేతురథధనువు

లగుచు రౌద్రభీభత్సరసాకర మయి
సంగరాంగణ మొప్పె నాసమయమందు. 195

మ. శరభంశంబు గజేంద్రనక్రము మనుష్యవ్రాతమత్స్యంబు ది
వ్యరథావర్తము దుందుభిస్వనము ఛత్రానంతఫేనౌఘమున్
ద్విరదాంగోపల మున్నతోన్నతము నై దీవ్యత్ప్రభం బొంగుచ
న్కురుసైన్యాబ్ధి నడంచె వేలవలె నక్కుంతీసుతుం డాఘ్యుఁ డై. 196

వ. ఇట్లు కురుబలంబులం గనుపుగొట్టుచున్న ధనంజయుం గాంచి జనార్దనుం డిట్లనియె.

క. దప్పిగొనె వారువంబులు, తెప్పిలు వెను మునుఁగ నీళ్ళు తేలే కున్నన్
దెప్పునఁ ద్రావఁగఁ జాలిన, విప్పుడ తెచ్చితిమ యేని యిద్ధవిచారా. 198

— ♦ అర్జునుండు గుఱ్ఱంబులదప్పిఁ దీర్పఁ దటాకంబు పుట్టించుట ♦ —

చ. అనుటయు నర్జునుం డనియె నచ్యుత! నీదుకటాక్షవీక్షణం
బెనయుచు నుండ లే వనుచు నేటికిఁ బల్కఁగఁ జాలినన్నినీ
శ్శను గొను మింద యున్న వని లాగి ధనుర్గుణ మొక్కటొప్పునన్
గొనకొని గహ్వరిం బగులఁ గొట్టను గొట్టినయట్టిపట్టునన్. 199

వ. హంసకారండవాకీర్ణంబును జక్రవాకోపశోభితంబును బ్రఫుల్లపంకజంబును బ్రసన్నాంభఃపరిపూర్ణంబును గూర్మమత్స్యగణాకీర్ణంబును వాజిపానోపయోగంబును ఋషిజనసేవితంబును నగాధంబు నగునొక్కసరోవరం బుత్పన్నం బగుటయు నర్జునుం డారెండవవిశ్వకర్మ యనం దండికెక్కి దానికి శరవంశంబును శరస్థూణంబును శరాచ్ఛాదనంబును శరవేశ్మంబును నత్యద్భుతప్రకారంబున వినిర్మించె నదృష్టపూర్వం బగునక్కార్యంబునకు దేవగంధర్వులు సాధువాదంబు గావించిరి నారదుండు దానిం జూడవచ్చె గోవిందుండు పరమానందభరితాంతరంగుం డై మేలు మే లని మెచ్చుచు రథంబు డిగ్గి రథ్యంబులం గొలనికిం దోలుకొనిపోయె నంత నర్జునుండును. 200

తే. తాను భూమిస్థుఁ డయ్యు రథస్థు లైన, పెక్కుయోధులతోఁ బోరె నొక్కరుండ
బహులశరపరంపరలను బత్తిహస్తి, రథతురంగములన్ జెంత రాఁగ నీక. 201

తే. పరశుపట్టసముసలముద్గరగదాసి, తోమరాద్యాయుధంబులు తొడిఁబడ వడిఁ
బయిఁ బడుచునున్న నూనినపాద మూని, నట్ల యుండఁగ నని చేసె నర్జునుండు. 202

వ. అంతలోన శ్రీకృష్ణుండును. 203

తే. అలుగులం దీసి హయములయంగకములు, తడవి నీళులు ద్రాపించి తడిపి వాని
మేను లట నున్న ఖాణము మేపిమరలఁ, దెచ్చియరదమ్మునకుఁ బూన్చె మెచ్చనరుడు.

క. మానససరోవరమ్మున, మానుగ జలమాడియాడి మహితగుణాఢ్యుల్
గానఁ బడు నంచలో యన, నానరునశ్వములు వొలిచె నానమయమునన్. 205

తే. అట్లు కట్టాయితము చేసినట్టి తేరు, కృష్ణుఁ డర్జునుతో నెక్కి కేళ్లువాఱు.
కుతుకమున నొప్ప నీసైనికులు గనుఁగొని, భగ్నదంష్ట్రోరగములట్లు బలుపడిరి.

మ. బళిరే! మాధవుఁ డెంతవాఁ డయిన నా బాహాబలం బెంతయేఁ
గలవాఁ డన్న నగుర్ నెలంతలకడన్ గౌతూహలం బేర్పడన్
మెలఁగం జొచ్చినకోడెకానివలెఁ బేర్మిన్ సైన్యమధ్యంబునన్
గలఁగం బోకిటు కత్తలానులకు వేడ్కం గూర్చె నిర్భీకుఁడై. 207

తే. మృత్యుసంబాధమైనయీమృధమునందు, వెఱ యెఱుంగనిప్రోడయై వెలయుచున్నఁ
దురగముల విచ్చి మేనెల్లఁ దోమి కడుపు, నిండ నీళ్లును మేత యీ నేర్పు గలఁడె.

మ. విడుఁ డీమాధవుమాట మేటి యగునీవివ్వచ్చు నే మందురో
వెడ గండ్రో మఱి వెఱ్ఱి యందురొ ధనుర్విద్యాలసన్మార్గు లి
క్కడఁ బెక్కండ్రు రథస్థులై పొదువ నక్కంతేని లేకార్తి యొ
క్కఁడ భూమిస్థితుఁ డయ్యెఁ దోడు తనకున్ గాండీవ మొక్కండుగన్. 209

చ. ఉరదము వీడెఁ గృష్ణుఁ డెడ యయ్యె నొకండ ధరాతలంబునన్
బరఁగె నిదంతరం బనుచుఁ బార్థుని ముట్టితి మొక్కపెట్ట నె
ల్లరము మహాశరంబులఁ గలంచుమఱి న్మన మేమి చెప్ప మ
ప్పురుషుఁడు బాలుఁ డాడుకొనుపోలికఁ గూలిచె నందఱం గటా. 210

క. కోఱలు వెఱికినపాముల, మై ఱవఱవఁ జూపుచుంటి మందఱ మొకఁడై
పేఱియును జాల మైత్రిమి, తీఱెను మనశస్త్రమెల్లఁ దెలుపఁగ వలెనే. 211

క. తా నొకరుఁడయి నవ్వెను, వానితెఱంగునను దోఁచి వరశస్త్రములన్
బీనుఁగుపెంటలు నిండఁగ, నీనేలం జేసె జగతి నిట్టిఁడు గలఁడే. 212

ఉ. కన్నులఁ జూచుచుండఁగ నొకానొకయింతటిలో జగజ్జనుల్
దన్ను నుతింపఁగా నిచటఁ దాను సరోవర మొండుఁ జేసె నా
పన్నశరణ్యుఁడైనహరి ప్రాపుగ నర్జునుఁ డిట్టియబ్బురం
బెన్నఁడుఁ జూడరున్ వినరు నెవ్వరు నివ్వసుధాతలంబులన్. 213

సీ. తన్నుఁ గానట్లుగాఁ దలఁచుచు జిష్ణుండు, కృష్ణునితో రథ మెక్కె మఱియు
మన కెల్లఁ దనశౌర్యమును జూపుచు నొకింత, సరకు సేయక సింధునరపతి దెస
నరుగు నీతని నాఁగ హరునకుఁ గా దిప్డు, సైంధవునకు నేఁడు చావు మూడు
దుర్యోధనుం డెంతదుర్బుద్ధియో కాని, యఫలంబు లతనికృత్యంబు లెల్ల

తే. వానికతమున క్షత్రియవంశ మెల్ల, నమ్ము గా నయ్యె నయ్యయో వానవి యదె
మృగములం దోలుమృగరాజుపగిదిని మన, మూఁక చీకాకుపడఁ జేసి వీఁకఁ జేసి.

వ. అని పలువురు పలుదెఱంగులం బ్రశంసించుచు మనజోదులు మగఁటిమిం బొటించి మేల్ములం గీటడంచుచు వాయువేగంబునం బోవుకృష్ణార్జునులరథంబున కడ్డుపడి దొడ్డనారసంబులు పఱపియు నిలువరింప నేరక కిరీటిమేటిశరంబుల కోహటిల్లి లేట మోము వడి పలాయనపరు లైనం గని పురుషోత్తముండు పాంచజన్యం బొత్తునంతఁ గ్రత్తలాను లమ్మొత్తంబున మున్న య్యె య్యెడఁ గృష్ణార్జునులు రాహుముక్తు లగుపుష్పవంతులవిధంబున వెలుంగుచుండ వారిం గాంచి యప్రతిహతం బగువారిరథగమనంబున కచ్చెరుపడి మెచ్చుచు మహాసముద్రం బెల్లఁ జేయీఁత నీఁది వచ్చినవారుం బోలె ద్రోణాదులం దాఁటి వచ్చినవీరి కసాధ్యం బెద్దియు లేకుండెడి నని తమలోఁ దారు తలంచుచు క్షత్త్రధర్మంబునం జేసి హ్రీమంతు లగువారు వారిం దాఁకియు వీఁక చెడి మరల వెఱచఱచి పఱచుచుండి రట్లు సూర్యానలప్రకాశు లగునరనారాయణు లెల్లర విఫలీకృతమనోరథులం జేసి చూపుమేరదూరంబున షడ్రథాభిరక్షితుండగు సింధురాజు మొగంబు లెత్తి చూచి యామిషంబు గన్నడేగలచందంబునఁ బరమానందంబు నొందుచుండి రప్పుడు జిష్ణుండు కృష్ణునిదిక్కు మొగం బై యి ట్లనియె.

ఉ. చూడుము సైంధవుండు తనచుట్లను గర్ణకృపాదు లార్వురుం
బోఁడిమిఁ గాచిపట్టుకొని భీతి పయి యుండఁగఁ దా నొకండు గా
వేడుకఁ జూచుచుండె నదె వీఁ డెటఁ బోయెడు నింక వేల్పులుం
దోడయి వచ్చిరేనియుఁ ద్రుంచెద వీనిని నేఁడు మాధవా. 216

క. నావుడుఁ గృష్ణుం డిట్లను, నీవచనము రిత్త వోవ నేరదు పార్థా
నీవలన దైవ ముండెం, గావున వచియింతు నిట్లు కలరూపంబుల్. 217

—• కురుబలంబు కృష్ణార్జునులఁ బ్రశంసించుట •—

వ. ఇ ట్లాసింధురాజుపై దృష్టి నిలిపి కృష్ణార్జును లన్యోన్యంబు ప్రసంగించుకొనువాక్యంబులు నీవారెల్ల విని భయవిస్మయాదులు మనంబునం బెనంగొనఁ దమలో నిట్లనిరి.

సీ. దగఁ గొని మరుభూమి దాఁటి తనివి దీఱ, నీ రాని తేఱినగారు లనఁగ
వ్యాఘ్రసింహాక్రాంతపర్వతావళిఁ దాఁటి, నరపట్టణముఁ జేరువణిజు లనఁగ
రాహుకేతుగ్రహగ్రహణముక్తిం గని, వాసికెక్కినపుష్పవంతు లనఁగఁ
గార్చిచ్చు పొదివినకాననంబుననుండి, కంటకుండఁగ వచ్చుఖచరు లనఁగ

తే. ద్రోణపరిరక్షితం బయి రాణ లెసఁగు, భూరిసేనాసముద్రము పార మొంది
నీఁది వచ్చినయాకృష్ణు లిద్దఱు నిటఁ, గాలసూర్యులవలెఁ జూడఁ గ్రాలి రిపుడు. 219

తే. ద్రోణముఖయోధశరపాతరూక్షుసిద్ధ, గాత్రులై నెత్తురువఱ్ఱులు గారుచున్న
వీరు సుమితపరివ్యాధభూరుహముల, పగిది నొప్పి రేనొప్పియుఁ దగులకుండ. 220

తే. శక్తిఖడ్గాదివిషధరసంకటంబు, మార్గణక్రూరమకరంబు మహిభృదంబు
సంభృతము ద్రోణహ్రదము నీశౌర్యనిధులు, కడచి వచ్చిరి వీరికిఁ గలదె యడ్డు. 221

క. కరవాలవిద్యుతంబును, వరచాపజ్యానినాదబహుళస్తనితం
బురుశరవర్షము ద్రోణాంబుధరమును సూర్యేందు లనఁగ దాఁటిరి వీరల్. 222

— దుర్యోధనుండు కవచబలంబున నర్జును నెదిరించి పోగుట —

వ. అని నీవాళ్ల వారిం బ్రశంసించుచు జయద్రథుండు చచ్చెనకా నిశ్చయించుకొను చుండి రంతలో నీకొడుకు సింధురాజరక్షాపరత్వంబునం జేసి ద్రోణబద్ధకవచప్రభావ కలితుండై భయంబు దక్కి బలంగంబుల తలకడచి కృష్ణార్జునుల కడ్డంబు సొచ్చినం జూచి బలంబుల నానావిధవాదిత్రంబులతో సింహనాదంబులును శంఖనాదంబులును జెలంగె రాజరక్షకులును సంతసించి రంతఁ గుంతీనందనునకు దేవకీనందనుం డి ట్లనియె.

ఉ. చూడుము మేలు మీఱి మనసూరెల వచ్చుసుయోధనుండు నీ
తోడ సమీకమున్ సలుపఁ దోఁచినచిత్తముతోడ సబ్రహ్మ మా
నేఁడును దన్నుఁ బోలఁడని యీతనికిం గరువంబు మెండగుం
బ్రోడ ధనుర్బలంబున సమున్నతుఁ డాజుల దుర్మదుండునున్. 224

తే. దూరపాతిమహేష్వాసుఁ డారయంగ, దాస్త్రవిదుండు చిత్రయోధి మహారథుండు
బాహుబలశాలి మీద్వేషి భండనంబుఁ, గోరి వచ్చెడు రారాజు చేర నిన్ను. 225

చ. చిరకాలంబుగఁ బూఁచి పట్టితివి నీచిత్తంబునం గోర్కికిం
దొరయన్ భాగ్యవశంబునం గలిగె నీదుర్యోధనుం బోరుకో
సరుదై జూడము నాఁగ నొప్పి విజయం బర్థింపనై నీమదిన్
జిరసంవర్ధిత మైనక్రోధవిషమున్ శీఘ్రంబునం గ్రక్కుమా. 226

సీ. కోలుపులిం గన్నకొదమలేడిం బోలి, వీఁడు నిన్ గనుఁగొన్న వెఱచుచుండు
రాజ్యార్థి యగురాజు రాఁ డిట్లు నీతోడఁ, బోరొనరించెదు బుద్ధిఁ జేసి
లోభియై వచ్చె నేఁ డీభీరుకునికిఁ గాలము మూడె వీఁ డనర్థముల కెల్ల
మూలకందం బదృష్టమునఁ జేసి నీపాలి, బడియె నీనీచుని బాణసమితి

తే. నేసి కూల్పుము వేల్పులు నేసి నిన్ను, మాఱుకొని గెల్వఁ జాలరు మాట కనుట
గాదు వీఁ డన నెంత యీఖలునిపట్లఁ, గనికరము చూప దోషంబు గలుగుఁ జువ్వె.

మ. నికృతిన్ జూద మొనర్చి ధర్మసుతునిన్ నిక్కంబు వంచించి కొం
చక రాజ్యంబు హరించి కానలఁ బడన్ శాసించి పాంచాలి క

ట్లు కడున్ భంగముగా సభన్ సలిపి తోడ్తోఁ బెక్కు లెగ్గుల్ నృశం
సకుఁడై చేసినవీని నోర్చి పగయుం జల్లార్చుటల్ పోలదో. 228

తే. వీఁడు తెగనేని వీనితో వేర మెల్ల, మూలముట్టుగఁ దెగు వీనిమూఁక లెల్ల
విటుగు జంభు నింద్రుఁడుబలె వీనిఁ జంపి, యాజియజ్ఞంబునఁ జేయు మవభృథంబు.

వ. అనిన యక్కిరీటి యమ్మేటి కి ట్లనియె. 230

శా. మా రాజ్యంబు హరించి మావనితకున్ మాకుం గడుం బన్నముల్
క్రూరుండై పొనరించి గర్వమునఁ గన్గోఁ జాల కున్నట్టి యీ
కౌరవ్యాధముఁ ద్రెళ్ళ నేసెదను మాకష్టంబు గట్టెక్కఁ గం
సారీ! తే రటు వోనని మ్మితరముం జర్చింప కావంతయున్. 231

తరువోజ. అనినంత మేలు మే లని వాసుదేవుఁ, డరదంబు దుర్యోధనాంతికంబునకుఁ
జనఁ దోలె నతఁ డెడ సాధ్వసంబునకు, సందీక యెదిరించి చక్కటి నిలిచెఁ
గని సైనికులు వానికడిమి కుప్పొంగి, ఘననినాదంబునఁ గవియ రా వారిఁ
గనుసన్న వారించి ఘనుఁడు నీసుతుఁడు, కలనికి ర మ్మని కౌంతేయుఁ బిలిచె. 232

వ. దానికి సంతసించుచు నరనారాయణులు దేవదత్తపాంచజన్యంబు లొత్తి రత్తఱి
మనవా రెల్ల నొల్లంబోయి కౌరవేశ్వరుని వైశ్వానరముఖగతునిఁ గా నిశ్చయించి
శోకించుచు. 233

తే. చచ్చు దుర్యోధనుఁడు నేఁడె చచ్చు ననుచు, నార్తనాదము లెసఁగించునంత నీదు
సుతుఁ డెలుంగెత్తి వెఱకుఁ డోసూతులార, నాఁగ నంపెదఁ గృష్ణుల సంయమనికి.

వ. అని యార్చడం బలికి సంరంభంబున సవ్యసాచి కి ట్లనియె. 235

మ. విలువిద్యం గలవాఁడ నంచు నదయో వీర్యంబునం జేసి తం
చు లలిం జెప్పుదు రేను సేనియెడ నేసాం పైన నోఁ గాక నో
దలితారీ! యిదె వచ్చినాఁడ నిచటన్ దర్శింపుమా పాండుపు
త్త్రీలలో వాఁడవయేని నీమగఁటిమిన్ దూలింతు లీలాగతిన్. 236

వ. అని యధిక్షేపించుచు. 237

సీ. మర్మాతిగము లైనమార్గణంబులు మూఁడు, నిసిచి వివ్వచ్చునితనువునందు
నాల్గింట ఘాయముల నవియంగ నొనరించి, పదిశరంబులఁ గృష్ణువక్షమేసి
మునికోల నొకకోల ముక్కలై యిలఁ బడఁ, జేసి యీసునఁ జేసి సింహరవము
దిక్కులు మ్రోయంగ నొక్క మొగిం జేసి, యెడలోని గర్వంబు వెడలఁ గ్రక్కఁ

గీ. గనలి పార్థుఁడు పదునాల్గుకాండములను, పిడుగులం బోలఁ దోఁపఁగ వడిగ నేసె
ధార్తరాష్ట్రునిపై నిశితమ్ము లయ్యు, మిట్టిపడె నవ్వి కత్తళ మట్టి నగుట. 238

ఉ. పొందకమందు వ్యర్థ మయి పోయినతూపులఁ జూచి కోపముం
బొందినడెందమున్ గలిగి పూరుషసింహుఁ డతండు వెండియున్
మందము గానిచందమున మార్గణముల్ పదునాలు గేసినన్
ముందటియట్ల నవ్వియును బొల్లయి పోయిన నాగ్రహంబునన్. 239

క. ఇరువదియొనిమిదితూపులు, బరువడి సరుఁ డతనిమేనఁ బరఁగించె వడిన్
వరవర్మగుప్తి నవియున్, ధరఁ బడె నవ్వగుచు నపుడు దాశార్హుండున్. 240

వ. ధనంజయుం గాంచి యి ట్లనియె. 241

చ. కని విని నే నెఱుంగ నిటు కవ్వడి యెవ్వఁడు నీ నడిం బడం
దను విడ నుండు నచ్చెరు వెదం బొడకట్టెడి నీశరాళి తా
తెను బడినట్లు మిట్టిపడు దాయపయిం బడి యేమి హేతువో
ధనువునకుం బలం బఱెనో తావకబాహుబలంబు తూలెనో. 242

క. పిడుగుల కె త్తిగునీ నగు, బెడిదపుమార్గణము లిట్లు బెం డ్లయి విఱు వో
నెడ వెఱఁగు వెఱయుఁ దోఁచెడిఁ, జెడు గీతనిస్రా ప్తకాలశేషమొ చెప్పుమా. 243

— అర్జునుండు దుర్యోధనుని కవచప్రభావ మెఱింగించుట —

ఉ. నావుడు నప్పురందరునినందనుఁ డి ట్లను నీ వెఱింగియున్
నావలనన్ వినం దలఁతె నందకపాణి యి దొక్కవర్మపుం
జేవ గురుం డెఱుంగు నను జెందఁగఁ జేసెను మున్న వీఁడు నేఁ
డేవగనో గ్రహించికొనియెన్ గురునక్కటికంబు నంపునన్. 244

ఆ. దీని వజ్రపాణియేని భేదింపఁగా, లేఁడు తత్ప్రభావ మీఁడఁ జూప
వీఁడు భయము సకిల్ల నెలుఁగుచు నున్నాఁడు, నే నొకండ ననుచుఁ బూని పలికె.

ఉ. ఆఁడుదవోలె నీకవచ మంగమునం దగిలించుకొంచుఁ దా
నిడకు వచ్చెఁ గాని యొకయింత యెఱుంగఁడు తత్ప్రభావమున్
నీఁ డెఱుఁ డేను నాబలము నేర్పున నేర్పెద వీని నొంచెదన్
జూడుము నాకడం గలదు సూర్యశుచిప్రభ మస్త్రరాజమున్. 246

వ. ఇది తొల్లి లోకేశ్వరుండు నిర్మించి యంగిరసున కిచ్చె నతండు బృహస్పతి కిచ్చె బృహస్పతి పురందరున కొసంగె పురందరుండు నా కనుగ్రహించె నని సర్వకవచభేదనదక్షుం బై మంత్రరక్షితం బగుదాని సరివోసి యేయుటయు నుపలక్షించి దూరగతుం డగునశ్వత్థామ సర్వాస్త్రఘాతి యగునొక్క మహాస్త్రంబున దానిం ద్రుంగించిన నెఱింగి వెఱఁగంది కుంతీనందనుండు గోవిందునకు వెండియును. 247

తే. అడఁగె నాయస్త్ర మాబ్రాహ్మీయస్త్రమునను, వెండియుం దీన వ్రేసిన వేసినట్టి
వానినే త్రుంచుఁ గావున మాని నాదు, వింటిబలిమిన సాధింతు వీనిఁ గనుమ. 248

వ. అయ్యవసరంబున దుర్యోధనుండు. 249

ఉ. తొమ్మిదితొమ్మిదమ్ములను దోయరుహాక్షులఁ గృష్ణజిష్ణులన్
ముమ్మర మైనసత్త్వమున ముట్టఁగ నేసియు నట్టి బాణవ
ర్షమ్మున ముంచి మించె మనసైనికు లెల్లరు సంతస మ్మెదన్
గ్రమ్మఁగ సింహనాదములు గ్రాలఁగఁ జేసిరి తూర్యనాదముల్. 250

సీ. అంతఁ గ్రుద్ధుం డయి కౌంతేయుఁ డూర్చుచు, నతనిమ్మెఁ గవచరక్షితము గాని
చోటు గానక కొంత చూచి హయంబులఁ, జా నేసి చక్రరక్షకులఁ దునిమి
సారథి నురుమాడి చాపంబు ఖండించి, యరదంబుఁ దెగనేసి విరథుఁ జేసి
హస్తతలంబుల నశేవికల్పము లైన, వాఁడినారసములు వడిగ నేసెఁ

తే. దానఁ గడు నొచ్చి చిత్తసమ్మానసుఁ డయి, నెగడుగుడుచును యోధనుఁ డగ నెత్తెంగి
కవిసి చతురంగసేనలు కవ్వడిపయి, బాణవర్షంబు పరఁగించె బహుళముగను. 251

చ. అరదము కేశవార్జునుల నాశరవర్షముఁ గ్నవినింగి
ట్లరనిమిసంబు సెల్ల నపు డర్జునుఁ డూర్జితబాహువిక్రమ
స్ఫురణము మీఱఁ దచ్ఛరసమూహము నంతయుఁ ద్రెళ్ళ నేయుచున్
గర మలుకం బరంపరలు గా బడలించె బలాళి నంపఱన్. 252

వ. ఆగాండీవ నిర్ముక్తశరపాతంబునం జేసి. 253

ఉ. తేరులు ద్రెళ్లె వార్వములు గ్రమ్మనడం బడి చచ్చె నేన్గులున్
బోరునఁ గూలెఁ గాల్వురను భూశయనంబు లలంకరించి ని
న్నో రమణీయభూషలు మహోన్నతశస్త్రములున్ బతాకలున్
ధారుణి రాలె భీమ మయి తద్రణరంగ మెసంగె నత్తఱిన్. 254

తే. విజయునిం గాంచి యిట్లను వృష్ణివీరుఁ, డనఘ యెడ లేగకుండ నీధనువు మొఱయు
చుండఁ దగు నేను నాశంఖ మొత్తుచుందు, ననుడు శరవర్షమున సగుఁ జట్ల చేసె.

క. పూరించె,వాసుదేవుఁడు, ఘోరారావంబు దెసలకుం బ్రాఁకి భయా
కారం బై శరపాత,స్ఫారధ్వని కనుగుణమ్ము సంధిల్లంగన్. 256

వ. ఇట్లు గాండీవపాంచజన్యారవంబులు హృదయనిర్భేదకంబు లైన భవదీయసైన్యంబు
పటాపంచ లయ్యె నయ్యెడ మాధవుండు రథంబు సైంధవుని దెసం బరువం జేయు
టయు నట సింధురాజరక్షణతత్పరు లై యున్నయోధు లెల్లభూమి యద్రువనోహాగ

సాహరి సింహనాదంబులు శంఖనాదంబులు సేయుచు నెదుర్కొనినం గని కృష్ణా
ర్జునులు పాంచజన్యదేవదత్తంబు లొత్తుటయును. 257

ఆ. ధరణి వడంకె ధరణిధరము లుఱ్ఱూఁతల, నూఁగె సాగరములు వీఁగి పడుచు
ఘూర్ణిలంగఁ జొచ్చె ఘోరశంఖారవ, మెల్లకడల నిండి పెల్లు రేఁగ. 258

—♦ శల్యప్రభృతు లొక్కపెట్ట యర్జునునిపైఁ గవియుట ♦—

వ. ఇట్లు శంఖంబు లొత్తుచుఁ గృష్ణార్జును లురవడించి సైంధవుదిక్కు మొగం బై
వచ్చుచున్నం గని సంభ్రమించుచు జయద్రథుం గావ నున్న భూరిశ్రవశ్శల్యకర్ణకృ
పాశ్వత్థామవృషసేనులు దుర్యోధనుం బురస్కరించుకొని వ్యాఘ్రచర్మపరివృతంబు
లును సువర్ణచిత్రంబులు నగుమహారథంబులతో సేనాసమూహంబుతో నొండొరుఁ
బిలుచుకొనుచు సింహనాదశంఖనాదంబు లెసంగ వచ్చి విన్వచ్చుం దాఁకుదెంచి
శరవర్షంబు నిగిడించి రాసమయంబున. 259

సీ. గురుపుత్రుఁ డుబ్బునం బరఁగి డెబ్బదిమూఁట, వాసుదేవుని మూఁట వాసవసుతు
నో నేసి యొకతూపు వానిరథ్వజముపై, నాలుగుఱ్ఱములపై నలియ నేసె
నేసిన నిసుసం జేసి వానివి వాని, నాహ్నా ... ... ఁ జేసి
పదితూపులం గర్ణుహృదయంబు గొగిలించి, మూఁడింట వృషసేను నోడఁ జేసి

తే. మద్రరాజశరాసనముష్టి యొక్క, కత్తివాఁడిశరంబున నుత్తరించి
శంఖనాదంబు చేసిన శల్యుఁ డొండు, విల్లు గొని పదితూపుల విజయు నేసె. 260

తే. మూఁడుభూరిశ్రవుఁడు రెండుముప్పదియును, గర్ణుఁడును మూఁడునాలుగుకర్ణసుతుఁడు
పది కృపుం డంతలోన డెబ్బదియుమూఁడు, సైంధవుఁడు నేసి రర్జునస్యందనమున.

వ. అంత నాచార్యనందనుండు. 262

చ. అఱువది శాతసాయకము లర్జునుపై నిగిడించి వింశతిన్
బిఱుసున వాసుదేవుమెయిఁ బిట్టడరించియు వెండియు న్వడిన్
దొఱయఁగ నేనిటన్ నరునిత్రుళ్లడఁగం బొసరింప నర్జునుం
డఱవఱ ... ... ... నన్నియు నన్నిట నవ్వుమోమునన్. 263

శా. అంతం బోనక మోఁదెఁ గర్ణుఁ బదిరెండస్త్రంబులన్ మద్రభూ
కాంతుర్ ... దొకండు నమ్ములవడిన్ గర్ణాత్మజున్ మూఁట ద్ను
ద్రాంతౌజున్ ... సూతి నన్మదిట సంతస్ డెబ్బదింటఁ గృపున్.
బొంగర్ ... గని నిర్వదేనిట ఘనున్ భూరిశ్రవున్ మూఁడిటన్. 264

తే. మఱియు మద్రేశ్వరునివిల్లు మధ్యమునకు, రెండు గాఁ ద్రుంచి సైంధవుఁ డొండుకేలనఁ
దోఁప నూఱమ్ములన్ వానిఁ దొడరనేసి, తనదుకరలాఘవముఁ జూపెఘనుఁడు నరుఁడు.

క. వీతులపైఁ గేతువుపై, నాతఁడు పక్కమ్ము లేయ నాతఁడు వానిన్
జేతివడి నడిపె గురుఁడున్, జేతమునన్ మెచ్చి వానిచేవిలుఁ దునిమెన్. 275

ఉ. ఛిన్నధనుర్ధరుం డగుచుఁ జేయి తునింగినవాఁడువోలె నై
యున్న పృథాతనూజుపయి నుగ్రశరంబులు వేనవేలు గ
ర్వోన్నతి నేసి కప్పె గురుఁ డొత్తుగ నత్తఱి భూతసంచయం
బిన్నరనాథుఁ డీల్గెడినొ యే మగునో యిపు డంచు నెంచఁగన్. 276

వ. ఇట్లు కృచ్ఛగతుం డగుధర్మజుం డొండొక్క విల్లుఁ గొని ద్రోణముక్తనారాచంబు
లెల్ల నద్భుతం బౌనట్లుం దునిమి క్రోధసంరక్తలోచనుం డై. 277

మ. గిరి నైనం బగులింపఁ జాలినమహాకీర్తిం బ్రవర్తించుచున్
వరఘంటాష్టకరాజితంబు మణిభాస్వత్స్వర్ణదండంబు నై
గరిమం గాంచినశక్తి ద్రోణుపయి నుగ్రప్రక్రియన్ వేసి గ
ర్వారి భేదిల్లఁగ నార్చె మార్తులు భయత్రాసంబునం గుందఁగన్. 278

క. భూతంబు లెల్ల ద్రోణున, కాతఱి వచియించె స్వస్తి నాశక్తియు ఖ
ద్యోతమువగిది స్మండుచు, నాతత తేజమున వచ్చె నార్యునిఁ దాఁకన్. 279

ఆ. కుబుస మెడలఁ బాము క్రోయుచు నాల్కలు, నోరు తెఱచి మ్రింగునో యనంగ
భయము నూర్చుదానిఁ బరికించి ద్రోణుఁడు, బ్రాహ్మ మస్త్ర మపుడు ప్రస్తుతింప.

మ. అభిమంత్రించి శరంబునన్ విడువ నయ్యస్త్రంబు తచ్ఛక్తినిన్
రభసం బేర్పడ భస్మసాత్కృతముగా రాపాడుచున్ రాల్చె భూ
విభునిం దాఁకఁగ వచ్చుచున్నతఱి నవ్వీరుండు బ్రహ్మాస్త్రఘం
బ్రభ సద్దాని నడంచెఁ జూపఱు గనన్ ప్రస్తోత్రముల్ సేయఁగన్. 281

సీ. అంత యుధిష్ఠిరుం డాచార్యుపై నేను, తూపు లేసియు విల్లుఁ దునిమె నొకటఁ
గనలి గురుం డొక్కగదఁ గొని యేసిన, నతఁడును గద నేసె నవియు రెండు
నొం డొంటిఁ దాఁకుచు నుమిసి మిడుంగురు, లవనిపయిం బడె నపుడు ద్రోణుఁ
డవనీశ్వరుని నాలుగశ్వంబులన్ నాల్గు, భల్లంబులం జేసి త్రెళ్ళ నేసి

తే. యొంట ధనువున [illegible]మింట నాడు, ధ్వజమునుం ద్రుంచి మూఁడింట ధర్మసుతుని
నేయఁగ [illegible]డగునతం[illegible] డగ్గి, యూర్ధ్వభుజుఁడయి చూచుచు నూరకుండె

వ. ద్రోణుండును విరథుండు నాయుధవిహీనుం డగువాని నేయ నొల్లక నూరెలం గ
వారిం గనుపుగొట్టుచు ధర్మరాజుం బట్టుకొన దరిఁ జేరుచున్నంత. 28

ఆ. అకట! పట్టువడియె నాచార్యునకు రాజు, పట్టువడియె ననుచు బహులరవము
మిన్నుముట్టె నపుడు దన్నుఁ జేరినసహా, దేవునరద మెక్కి తెరలె నృపుఁడు. 28

తే. కైకయుం డగునబ్బృహత్క్షత్త్రు క్షేమ,ధూర్తి నో నేయఁ దొంబదితూపు లతఁడు
బరపి గురుసేనపైఁ బడఁ బఱచుచుండ, నతఁడు విలు ద్రుంచి కైకయు నలుకనొంచె.

మ. నగుచుం గైకయుఁ డొండువిల్లు గొని కిన్కం క్షేమధూర్తిం బృష
త్కగణంబు న్నిగిడించి నొంచి రథరథ్యవ్రాతముం సూతునిం
మొగి ఖండించి శితాశుగం బొకఁడు పెంపుంజేసి సంధించి తాఁ
దెగ నేసెం వడి వానిశీర్ష మిలపైఁ దింద్రింప భూపాద్యుతిం. 286

మత్త. వీరధన్వుఁడు ధృష్టకేతుఁడు వీరవిక్రమ నేర్పడం
బోరుచుండఁగ ధృష్టకేతునిభూరిచాపము ద్రుంచె నా
వీరధన్వుఁడు దాన నాతఁడు నెచ్చి వానిపయిన్ మహో
గ్రారశక్తిని వ్రేయ నందునఁ గూలె నాతఁడు నేలకున్. 28

వ. ఇట్లు త్రిగర్తేశ్వరుం డగువీరధన్వుండు వడినం గని మూఁకలు చీకాకుపడియె నంత
దుర్ముఖుండు సహదేవునిపై నలువదినారసంబు లడరించి సింహనాదంబు గావించిన
నతండు క్రుద్ధుండై తొమ్మిదిబాణంబు లాతనిపై బరఁగించి. 288

ఉ. నాలుగువారువంబులను నాలుగుతూపులఁ ద్రుంచి కేతువున్
గూలిచి యొంట సూతుతలఁ గోసి యొకంట నొకంటఁ జాపముం
ద్రీలఁగఁ జేయ నీకొడుకు వీఁగి వడి న్నిరమిత్రు తేరిపై
కాలము మాని పోయె నట ఘంద అమందగతిం హసింపఁగన్. 289

తే. నిలక సహదేవుఁ డాగ్రహమెలమిఁ దోఁప,నడరుచుఁ ద్రిగర్తనాథున కనుఁగుపుత్త్రుఁ
డైననిరమిత్త్రుపైఁ బడి వానితలను, మేనితో వేఱుగాఁ జేసె మిడుక వాసు. 290

క. నకులుండు వికర్ణుండును, సకలజనుల్ సూచుచుండ సలిపిరి రణ మం
దొకయింతలోన నకులుఁడు, మొకమోడక యేసి నీదుపుత్త్రుం గెలిచెం. 291

తరలము. సినివరుండును మాగధుండును జివ్వకుం గడగట్టుచో
సినివరుం మగధేశపుత్త్రుఁడు చేసె నమ్ముల ముగ్గఁగా
గనలి సాత్యకి సాశ్వసారథి కమ్ముగా నతఁ డీల్గి భూ
మిని బడం బొనరించె నెల్లరు మేలు మే లని యొచఁగం. 292

తే. వ్యాఘ్రదత్తుండు వడినంత వానిప్రజలు, శినివరునిమీఁదఁ గవిసిన సింహరాజ
మలఁతిమెకములబలె వారిఁ బలుకులోన,నఱిమి పోఁదోలె గుసుఁడప్పు డాఁగెనతని.

సీ.*ద్రౌపదేయుల సోమదత్తసుతుఁడు దాఁకి, యైదేసితూపుల నైదుగురను

---

*ఈసోమదత్తసుతుఁడు భూరిశ్రవసుఁడు గాక మఱియొక్కఁడై యున్నాఁడు. తిక్కనసోమ
యాజి భారతములో నితఁడు శల్యుఁ డని యర్థము తోపించుచున్నది. అది చింత్యము.

నోనేసి వెండియుఁ బూనిక నేఁజేసి, వాలమ్ములఁ నేర్పుంప వాఁడు కనలి
రండు శతానీకుఁ డడరించె నేఁ డమ్ము, లితరులు మూఁడేసిశితశరముల
నడరించి రప్పు డతం డందఱయెడల నొ, క్కొక్కటూ వేయుచు నుక్కుమీఱి

తే. ప్రబలు నార్జునితురగముల్ భైమసేని,ధనువు యాధిష్ఠిరుమహోన్నతధ్వజంబు
నాకులినియంతఁ గూల్చిన వీఁకఁ గాంచి, సాహదేవి తదీయశీర్షంబు ద్రుంచె. 294

పంచ. అలంబుసుండు భీమసేను నాఁగ నాతఁ డుగ్రుఁడై
చలంబు మీఱ నాలుగైదునాయకంబు లేయఁగాఁ
గలంగ కార్ష్యశృంగి పొంగి గాలిపట్టి నెట్టనన్
బలంబు పెంపునన్ నొగిల్చెఁ బంచమార్గణంబులన్. 295

సీ. అంతఁ బోవక భీమునను చరులం గూల్చి, నన్నాటముప్పదుం డ్రను రయమున
వాలికతూ పొందు గాలిపట్టిభుజాంతరం బాడఁగా నేసె రాక్షసుండు
దాన నొక్కింత రథంబుపై వ్రాలి మూర్ఛ మునింగియుం దేఱి శ్వసనసుతుఁడు
భారసాధన మైనఘోరకార్ముకమునఁ, గూర్చి క్రూరాస్త్రముల్ పేర్చి యార్చి

తే. రాక్షసుని వ్రేయ నాతండు రక్తసిక్త, గాత్రుఁడై కుసుమితకింశుకంబురీతిఁ
దనరి భ్రాతృవధంబును దలఁచుకొనుచు, ఘోరరూపంబుఁగొని యిట్లు చేరి యనియె.

శా. నాయన్నన్ బకుఁ జంపితే నెడఁగనై నల్వొందు చున్నంతటన్
నీయందుం గలసత్త్వ మే నరసెదన్ నేఁ డెందుఁ బోవచ్చు నీ
కాయగ్రాక్షసజువీఁడు దక్క నిలు భీమా చూఁడు నాబీరమున్
నాయుక్కున్ మఱి నాబలంబు మఱియున్ నాధైర్యమున్ స్థైర్యమున్. 297

వ. అని పలుకుచు నంతర్ధానం బై శరవర్షంబున భీమసేను ముసుంగు వెట్టుటయు నతండును ద్యావాపృథ్వ్యవకాశంబున సన్నతపర్వంబు లగుతనబాణంబు లెసంగించుటయు నలంబుసుండును భీమసేనశరార్దితుండై నిలువఁ జోటు లేక మగుడ రథంబుపై నిలిచియు నింగి కెగసియు నేలకుం దిగియు మరల నింగి కెగిరియు స్థూలసూక్ష్మాద్యుచ్చావచరూపంబులం బొందుచు వివిధవిధంబుల నారవంబు గావించుచు నట్టహాసంబు సేయుచు గగనగతుండై పరశుపట్టసముసలముద్గరతోమరపరిఘభిందివాలకరవాలశూలశక్తిప్రాసకుంతశతఘ్నిప్రముఖమహాయుధంబులం బయిపయిం బరవఁ జేయుటయు రథహస్తిపత్తితురంగాదులకుం దాఁకిరక్తంబు ప్రవహించుచుండఁ బాండవసైన్యంబు దైన్యంబునం బొందియు మ్రందియు నొచ్చియు విచ్చియు వెఱచియుం బఱచియు బహువిధంబులం బడలువడె నప్పుడు నీబలగంబు లుబ్బి సింహ

నాదంబులును శంఖభేరీనినాదంబులును గావించె నంతలోఁ గాంతేయుఁడును దానికి సైరింపనోపక క్రోధతామ్రాక్షుం డై త్వాష్ట్రాస్త్రంబు సంధించి యేయుటయు నయ్యస్త్రప్రభావంబున ననేకశతసహస్రాస్త్రశస్త్రంబు లుత్పన్నంబు లై రాక్షసాస్త్రంబుల నెల్ల మాయించి వానిని వానిమూఁకనుం జీకాకు గావించిన వాఁడు భీమసేను నెదుట నిలువ నోడి ద్రోణునిపిఱిందికిం బఱచెఁ బాండవులును సంతసించుచు సింహనాదంబు గావించుచుఁ బావనిం బూజించి రంత ఘటోత్కచుండును. 298

—: అలంబుసుఁడు ఘటోత్కచునితోఁ బోరి చచ్చుట :—

శా. కిమ్మీరానుజు నయ్యలంబుసుని శక్తింజేసి రక్తింబలేన్
రమ్మంచున్ జెయి వీచి యేచిన ధనూరావంబు నల్దిక్కులన్
గ్రమ్మన్ డాఁకి మహోగ్రసాయకములన్ గాఢమ్ముగా నేసి భూ
ధ్రమ్ముల్ బీటలువాఱ నార్చెఁ జనవారల్ మే లటం చార్వఁగన్. 299

క. వాఁడును నతిరభసంబున, వాఁడిశరంబులను దిగిచి వడముడికొడుకుం
గాఁడగ నేయుఁడు వారికి, వీడనిసమరంబు సెల్లె విశ్రుతరీతిన్. 300

క. హైడింబుఁ డిర్వదమ్ముల, నాడఁగ నుర మేసె బకునియనుజన్మునిపై
నోడ కలంబుసుఁ డటు లాగాడుపుమనుమునికిఁ జూపెఁ గరలాఘవమున్. 301

వ. ఇట్లిరువురు నితరేతర ప్రహారంబుల నంబరము నిండున ట్లంబకంబులంబఱపిపఱపికొంత వడికి మాయాయుద్ధంబునకుం దొరఁకొని యొకఁడు నూపినమాయ నొక్కండు దుప సంహరించుకొనుచు పెక్కుమాయలం జేసి యెక్కువతక్కువలు లేకుండం బోరు చుండునంత నంతకోపము లగుకొంతేయులు ద్రౌపదేయులు నలంబుసుం జుట్టుముట్టి బిట్టేయుటయు నతండు నిజమాయాప్రభావంబున నయ్యస్త్రవేగం బెల్ల నల్లన మాయించి తద్రథబృందంబునుండి వనదాహంబునుండి వెడలి వచ్చినవారణరాజంబు చందంబునం బొందుపడి యింద్రాశనిసమప్రభం బగునిజకార్ముకంబు మ్రోఁగించుచుఁ బంచవింశత్యాశుగంబుల నాశుగాత్మజునిఁ బంచాంబకంబుల హైడింబుని శరత్రయంబున నజాతశత్రుని సాయకసప్తకంబున సహదేవునిఁ దినప్తతినారాచంబుల నకులుని మూఁడేసివాఁడికోలల ద్రౌపదేయులను నొప్పించిన వాని నప్పవమాన సూనుండు తొమ్మిదితూపులను సహదేవుండుం బంచసాయకంబులను యుధిష్ఠిరుండు శరశతంబునను నకులుండు చతుష్షష్టిసాయకంబులను ద్రౌపదేయులు మూఁడేసి సాయకంబులను గుప్పి రప్పుడు ఘటోత్కచుండు పంచవింశతివిశిఖంబు లడరించి మించినపరాక్రమంబున వెండియు డెబ్బదియమ్ముల వానియు బ్బడంచి సింహనాదంబుఁ గావించుటయును. 302

ఆ. ఉర్వి వడఁకెఁ గొండ లుఱ్ఱూఁత లూఁగె ఘూ, ర్ణిల్లె నర్ణవములు పెల్లు గలఁగి
దిక్కు లొక్క మొగిన పిక్కటిలెన్ ఘటో, త్కచుఁడు సింహనాదకలన నొప్ప. 303

సీ. అందులకుం గ్రుద్ధుఁడై బకానుజుఁ డెల్ల, వారల నైదేసినారసముల
నొనేయుటయు హిడింబానందనుం డేడు, వాఁడితూపుల వాని గాఁడ నేసె
నేసిన రోసంబుతో సాయకశతంబు, నినిచె ఘటోత్కచుతనువునందు
నపుడు పాండవు లంద ఱయ్యలంబుసునిపై, నిశితాస్త్రశస్త్రముల్ నిగుడఁ జేసి

తే. నొంచుటయుఁ గాంచి హైడింబుఁ డించుకవడిఁ, దరలి నొగనొగఁ దాఁకంగఁ దనదు తేరు
వాని తేరును డాయంగఁ బఱపి పఱపు, గా శరావళిఁ గుప్పించి కప్పె వానిఁ. 304

వ. వాఁడును వీడక పోరుచున్నంత నంతకాకారుండై ఘటోత్కచుండు గాఁడికి లంఘించి గరుత్మంతుండు వ్యాలంబును బట్టుచందంబున వానిభుజంబు పట్టి క్రిందికిం దిగ్గ నఱుకుటయు నగ్గలం బగుచలంబున నలంబుసుండు గదాపాణి యగుభీమునంద నునితోఁ గొంతవడి గదాయుద్ధంబు సేసె విగతగదులై యిద్దఱును కృపాణపాణులై గగనంబున కెగసి చిత్రగతులం బోరి పోరి ధారుణికిం దిగి తెగనివైరంబున శార్దూలంబులు నాఁ బెనంగి సర్వాంగంబులు నెత్తుటం జొత్తిల్ల మల్లయుద్ధంబునకు సన్నద్ధులై మొట్టుచుఁ బట్టుచు డాయుచుఁ బాయుచుఁ బొడుచుచు విడుచుచు ననేకప్రకారంబులఁ బోరుచుండ నలంబుసుండు మర్త్యభావంబు నొందినచందంబు నం డస్సి కర్తవ్యం బెఱుంగకున్నఁ గని సమరశౌండుం డగుఘటోత్కచుండు వానిం బట్టి పడవైచి నిర్ఘాతపాతంబులం బోనిజానుముష్టిఘాతంబుల సర్వాంగంబులును బిండీకృతంబు గావించి క్రిందికి మీఁదికి నెగయించుచు మీఁది కెత్తి నేలం బెట్టి బిట్టు గిట్టుటయు నెమ్ములెల్ల నొక్కుమ్మడిం బిండిపిండియైన వానిం గాలం జమరి చంపి పొంపిరివోవుపరాక్రమంబునఁ బేర్చి యార్చెఁ బాండవులును సింహనాదంబు గావించి వాని నభినందించి రంత మనసైన్యంబున దైన్యస్వనంబులును హాహాకారంబు లెసంగె ననిన విని ధృతరాష్ట్రుండు సంజయుదిక్కు మొగంబై భారద్వాజుం డట్లు గండుమీఱినసాత్యకి నాఁగె నంటి వాయుద్ధంబు తెఱం గెఱింగింపు మనిన నతం డతని కిట్లనియె. 305

— ద్రోణసాత్యకులయుద్ధము. —

మ. యుయుధానుం డటు వీఁకమించఁ గని కోపోద్రేక మేపాఱఁ గా
రయముం గైకొని ద్రోణుఁ డాశినిసరుఁ గ్రమ్మించు మార్కొ నెదన్
భయ మింతేనియు లేనిమానధనుఁ డావార్ష్ణేయుఁ డాచార్యుపై
నయుతైదుల్ నిగిడించె ఘోరక్రమ మాహా యంచు నెంచన్ జనుల్. 306

క. కనలి ధనుర్గురుఁ డాళిని, మునిమనుమని నైదుబాణముల నేయుఁడు నా
ఘనశరము లతనిమైమఱు, వున వ్రచ్చి ధరిత్రిఁ జొచ్చె భుజగంబు లనన్. 307

సీ. సిడులు సూపినగంధసింధురంబును బోలి, శైనేయుఁ డలుక నాచార్యుమీఁద
నగ్నిసన్నిభము లై యలరారు నేఁబది, ప్రక్ష్వేడనంబులు పఱపుటయును
జతనించి బాణవర్షము గురియుచు గురుం, డల్క నొక్కమ్మున నతని నేసె
దాన విషణ్ణవదనుఁ డయి దనుజారి,యనుఁజుఁ డేమియు నేరనట్టిఁ డయ్యె

తే. నరసి నీవారు సంతోషభరితు లగుచు, సింహనాదము లొనరించి చెలఁగుచుండి
రింతయును జూచి ధర్మజుం డఖిలసైని, కులకుఁ జెయి వీచి యి ట్లని పలికె నధిప.

ఆ. గురునిచేతఁ జిక్కి వెరవు గానక వృష్ణి,వరుఁడు రాహునోటితరణివోలె
వెగడు గడుచుచుండె పేఁడె చూడుఁడు తోడు,పడుఁడు తడయ కిపుడ వడిగ వడిగ.

వ. ధృష్టద్యుమ్నుం బిలిచి యి ట్లనియె. 310

ఉ. చూచుచు నూరకుండు దిది చోద్యము గాఁ గన నయ్యె పార్షతా
రాచరికంపుఁదేవ లివి రమ్యము లే యుయుధానుఁ బట్టె సం
కోచము లేక త్రాటఁ బులుఁగుం గొని శౌలకుఁ డాడునట్లు నా
రాచగురుండు వేఁచు నదె రంహగతిం జన నిచ్చగింపుమా. 311

వ. భీమసేనపురోగము లైనయెల్లసైనికులు నెయిది మృత్యుహాతం బడిన సాత్యకిం
గాచుట కర్తవ్యంబు నేనున్న మీవెనువెంట నంటి వచ్చెద నని తానును సనపరివా
రంబుతోడం జని ద్రోణుం దాఁకి నానావిధాస్త్రంబులు నిగిడించుటయు నతండు.

చ. అతిథుల కర్ఘ్యపాద్యశయనాసనముఖ్యవరాతిథేయ మం
చితగతిఁ జేసినట్లు తనచేఁ గలశక్తికొలంది నెంత కా
గతు లగునెల్లవారలకుఁ గాండచయంబునఁ దృప్తి గల్గున
ట్లుతులితరీతిఁ జేసి తగ నారసె నంటఁ బేరు పేరుగన్. 313

తే. మింటిమధ్యమునం దున్నమిహిరునట్లు, వెలుఁగునాచార్యుఁ గన నోడి వీరు లెల్ల
నొల్లఁబోయిరి తన్మార్గణోగ్రతాప,మునకుఁ దాళనివార లై జనవరేణ్య. 314

వ. అప్పు డాచార్యుండు నోరు తెఱచుకొని యున్నయముం డనం జెప్ప నొప్పి పాండవ
బలంబులం బెక్కువేల నుక్కడంచుటయు గాక మహారథు లగుపాంచాలుర
నిరువదియేడుగురం గైకయుల నూర్వురం గడతేర్చి బరవసంబు చేసిన వాని పయిం
బెట్టఁ జాలక పాండవయోధు లలసి సొలసి సొమ్మసిల్లి యున్నసమయంబునఁ బాం
డవాగ్రజుండు పాంచజన్యనిస్వనంబు విని చింతాకులస్వాంతుం డై. 315

ఉ. మాటికిఁ బాంచజన్యపరమస్వన మొక్కఁడ యాలకించి నా
నేటికొ దేవదత్తరవ మించవి సోఁకదు గాండివధ్వనుల్
లోటు వడెన్ బ్రహర్షమును లోఁ గొని కౌరవు లార్చుచుండుటల్
పాటిలుఁ గీడదేనియును బార్థున కైనది యేమొ చూడఁగన్. 316

వ. అని చింతించుచుం బాష్పగద్గదకంఠుం డై సాత్యకిం బిలిచి యి ట్లనియె. 317

—ధర్మరాజు సాత్యకి నర్జునునకుం దోడ్పడఁ బుచ్చుట—

చ. తఱి వడినప్పు డాలముల ధర్మముగా వచియింత్రు దేని న
త్తెఱఁ గగుకార్య మొక్కఁ డరుదెంచెను నా కది తీర్చిపుచ్చ నిం
దఱు గల రిందు నీ వొక్కఁడ నామది కెక్కినవాఁడ వారయన్
నెఱయుఁ బ్రియంబును గలుగు నెయ్యుఁడ సేయఁగఁ జెల్లు నెద్దియున్. 318

ఉ. మాపయిఁ బ్రేముడిం గలఁడు మాధవుఁ డెప్పుడు నీకు వానితో
నోపినవిక్రమంబు గల దోయి యదూద్వహ నీవుఁ బ్రేముడిన్
జూపుదు మాపయిన్ దెలియుఁ జుమ్మది కావున నొక్కభారమున్
నీపయి మోపఁ బెట్టెదను నీ వది కాదన కాదరింపవే. 319

క. గురుఁడున్ భ్రాతయు మిత్రుఁడు, నరుఁ డాతఁడు నీకుఁ గావునం గృచ్ఛ్రముల్న్
బరికించి తోడుపడు టది, పరమం బగుధర్మ మనుచుఁ బలుకఁగ వలెనే. 320

తే. నీవు సత్యవ్రతుండవు నిఖిలధర్మ, వేత్తవును శూరుఁడవు నిన్ను వేఱ పొగడ
నలయునే మిత్రకార్యము తెలిసి సేయ, నదను వచ్చెను గాన నే నర్థి నైతి. 321

చ. అనిమొన మిత్రరక్షణమునందు మనంబిడి శత్రుకోటిచేఁ
దునిగినయట్టివాఁడును బ్రతుష్టమతిన్ ధరణీప్రదానముల్
ఘనులకుఁ జేసినట్టిఁడు జగంబునఁ దుల్యఫలంబు నొందువా
రని వచియింతు రార్యు లిట నట్టిఫలం బగు నీకు సాత్యకీ. 322

ఆ. వీరకార్యమందు వీరునకే గాక, సాయపడెడుశక్తి జతను పడదు
ప్రాకృతునకు నీవు ప్రాణ మాసింపని, వీరవరుఁడ వగుట వేఁడుచుంటి. 323

మ. ప్రతినం చేసి కిరీటి సైంధవుని జంపం బోయె నేఁ డొక్కరుం
డతఁడుం గానిమహారథుల్ గల రటన్ వ్యాపించెఁ బెందూళి సం
తతముల్ సింహరవంబు లేచెఁ గురుసైన్యంబందు రారాజు నేఁ
డతిశక్తిం బోలుపొందు నర్మమహిమావాప్తిన్ యదూత్తంసమా. 324

క. విను బుట్టిపట్టు నరునకు, నినుఁ బోలినవాఁడు లేడు నెగు లిది తీర్పన్
ఘనభుజ నీవతనికిఁ బె, ట్టనికోటవు గావఁ బొగడఁగ వలెనె నినున్. 325

మ. వరుఁ డిచ్చు న్వినిపించె ద్వైతవని నే నల్పొందుచున్నప్డు నం
గరశౌండుండు మహాస్త్రవిద్వరుఁడు లోకఖ్యాతవీరుండు నా
కు రహిం గూర్చుప్రియుండు శిష్యుఁ డగువైకుంఠానుజుం డండ యై
కురుసైన్యంబులఁ గుప్పఁగూల్చు నని నీకుం జెప్పఁగా నేటికిన్. 326

వ. అతనిసంకల్ప మన్యథా సేయకుము మఱియును. 327

క. నాచెప్పినపని చేయుము, నీచైదము మెచ్చువచ్చు నిఖిలజగమునన్
రాచూలి వీవు నీకుం, దోఁచినగతి గాఁగ గురునితోడగు మాజిన్. 328

క. వడివడిఁ జను మాచార్యుం, డడఁచిన భీముండు నేను నందఱు నతనిన్
వెడలంగ నడచి నీపో,యెడుమార్గము సక్క సేయ నెంచెద మనఘా. 329

వ. అని యర్జునుండు సన్నదిక్కు కన్నునుం జెవియు నిగిడించి నెంజియు ని ట్లనియె.

సీ. చతురంగబలములచరణపాతధ్వని, పర్వసాగరమట్లు పర్వఁ జొచ్చె
విజయునితాఁకున విత్రస్త మై పాఱు, బలఁగంబులం ధూళి బ్రబలెఁ గనుము
సింధుసౌవీరాదిసేన లోమఁగ నొంటి, సైంధవు నేయ నశక్య మగును
నందఱు వానికై ప్రాణంబు లర్పింప, నైనఁ దలంకనియట్టివారు

తే. వినుము సింహనినాదముల్ వినఁగవచ్చు, నవల సైంధవానీకము లివల ద్రోణ
బలఁగములు రెంటినడుమనై ఫాల్గునుండు,బడలువడియెడునో యని భ్రమయుచుంటి.

క. ఆకురుబలముల కిందుని, పోకార్పఁగ శక్తి గలదు పోఁ బరికింపన్
మాకట్టి యొకటి యైనన్, మాకర్మం బెట్టి దగునొ మాధవ చెప్పుమా. 332

ఉ. చామనచాయమేనిరుచి సంతతముం గడ లరేఁచుచుండఁగా
నీముని ప్రొద్దుటం జనియె నెక్కటికయ్యము సేయ నజ్జునుం
డేమి వచింతు వ్రాలె రవి యింతకు నాదునునుంగుఁదమ్ముఁ డా
కోమలమూర్తి ప్రాణములకు వ్వోలి గాక మెలఁగుచుండునే. 333

క. అది యొక్కడిమాట మహా,పద వాటిల కుండునోటు బలభేదికి నే
నుదధివలె నైనకురుబల, మిది చొచ్చినమాత్ర యదుకులేశ్వర వింటే. 334

క. నీయట్టిశిష్యవర్యుఁడు, పాయక ప్రాణములతోడఁ బరఁగుచు నుండన్
మాయర్జునుండు మే మీ,చాయన్ నెగు లొందుచుంట సంభావ్యమొకో. 335

ఆ. గురునిభయము నాకు గురుతరం బది గాన, నిటన నీ కెసంగు టెసకమెసఁగు
నైన నరసి చూడ నజ్జునరక్ష యే, పనులయందు మొకటి యనుచుఁ దోఁచె. 336

చ. త్రిజగము లొక్కటైన హరి తెన్నునఁ బోవఁగలేవు గావునన్
నిజముగ వానికై వగవ నే నొకయింత సరుండునన్ మహా

భుజుఁ డగుఁ గాని నేఁడు గడు పొంపిరివోయిననంగరంబునన్
గజిబిజి యయ్యెఁ గాన నెటు గాఁగలఁడో యని సంశయించెదన్. 337

మ. మనప్రద్యుమ్నుఁడు నీవు నొక్కగరిమన్ మాన్నొందుచుం డీవు కృ
ష్ణుని నస్త్రంబున రామునిన్ బలిమి జిష్ణున్ వీరతం బోలి తెం
దును భీష్మ్మందును ద్రోణుఁడున్ సమరమందున్ నిన్ను మీఱంగ లే
రని లోకంబు నుతించు నీ కిల నసాధ్యం బొక్కఁడుం గల్గునే. 338

క. అననస్థాన మయుద్ధము, ఘనసమరపలాయనంబు గా వృత్తము లోం
దినధర్మంబులు దాశాస్త్రోన కివి గర్వ్యములు చెప్ప నుండునె నీకున్. 339

ఉ. నీకుఁ గురుండు ఫాల్గుణుఁడు నీరజనాభుఁడు నీకు వానికిన్
వాకొనఁగా గురుం డగును వారల కేను గురుండఁ గావునన్
వాకొనుచుంటి నానుడు గవశ్యము నీకు నలంఘ్య మొండు వ్యా
కీక ధనంజయుం గలియ నేగుము శాసటగా మహాభుజా. 340

వ. అని యనేకవిధంబులఁ బ్రీతియుక్తంబుగను హృద్యంబుగను న్యాయ్యంబుగను బలికిన
పలుకులు విని శైనేయుండు పాండవేయున కిట్లనియె. 341

ఉ. నీవొడు లాలకించితి ననింద్యము లుత్తమధర్మయుక్తముల్
నేను గిరీటికిం బలెను నీకును శిష్యుఁడ నెట్టిశాసనం
బైనను గైకొనం దగినయట్టిఁడ నిట్టియెడ న్వచించిన
ట్లేను బొనర్తుఁ బ్రాణముల నింతయు దాఁప నరార్థ మియ్యెనిన్. 342

తే. నీనియోగమునం జేసి నేను దేవ, దానవులతోడ జగత్త్రయ మైనఁ బోరి
గెలుతుఁ గురుబల మన నెంత గెలిచినరునిఁ,దవిలి కుశలినై వత్తు సైంధవుఁడుగూల.

వ. అయిన నొక్కవిన్నపంబు గల దాకృష్ణార్జునులు నేఁ డాహవంబునకుఁ జనునప్పు
డర్జునుండు సర్వసేనామధ్యంబున వాసుదేవుండు వినుచుండ నన్నుఁ బిలిచి నాతో
నన్నవాక్యంబులు కొన్ని గల వవధరింపుము. 344

చ. మనకు నిమిత్తముల్ గలవు మంగళసూచకముల్ జయద్రథుం
దునిమెద నేఁ డగున్ జనుము దోర్బల నిర్జితశత్రులోక ! నేఁ
జనియెద నాప్రతిజ్ఞఁ గొనసాఁగ నొనర్ప గురుప్రతిజ్ఞ సాఁ
గనిగతినేఁత నీవు చనఁగా మతి నేయుము రెండు ముఖ్యముల్. 345

మ. హరికిన్ దుల్యుఁడ వెల్లభంగులను ని న్నాలంబునన్ మార్కొనన్
సురలుం జాలరు నీవు చెంతఁ గలుగన్ క్షోణీశ్వరుం డేను లే

చ. అగు నగు నీవు సెప్పినది యంతయు నిక్కువ మట్టులైన నా
దగుమది ఫాల్గునవ్యసనమందుఁ దగుల్కొనియుండె నొడ్లు లోఁ
దగులవు స్వాత్మరక్షణవిధం బది యెట్లొ పొనర్చుకొందు నోం
డుగఁ దలపోయ కీ వట కడుంగడు వేగమ పొమ్ము లె మ్మికన్. 355

వ. మఱియుం జెప్పెద నాకర్ణింపుము. 356

సీ. కొండఁ బిండిగఁ జేయుదండిసామర్థ్యంబు, గలఁడు భీముండు నాకెలన నుండ
నాచార్యు వధియింప నగ్నిసంభవుఁ డయి, తనరుపార్షతుఁడు నాదండనుండ
నేలయు నింగియుఁ దాళముల్ వేయఁ జా, లినఘటోత్కచుఁడు నావెనుక నుండఁ
బ్రాణ మాసింపనిబల్లిదు లగువారు, కైకేయు లెపుడు నాకడన యుండఁ

తే. జిచ్చుఱుక నైన జంకనిజెట్టిబిరుదు, మగలు పాంచాల సృంజయ మాత్స్య సోమ
కాదులు శిఖండి ధృష్టకేత్వాదు లుండ, నాదురక్షణమున కింత వాద మేల. 357

వ. కావున నీ వింక నాయనుమానంబు మాని సవ్యసాచికిం బాసట గమ్మనిన
నమ్మురాంతకానుజుం డంతరంగంబున నంతకాత్మజపరిత్యాగంబునం జేసి భీభత్సునివ
లనిభయంబు శంకించుచు నట్లు పోవకున్న బంటుతనంబున కూనం బనునపవాదంబు
నకుఁ దలంకుచుఁ గొండొక చింతించి పోవుటక నిశ్చయించి యి ట్లనియె. 358

—సాత్యకి యర్జునునికడకుం బో నంగీకరించుట—

చ. నరవర నీదురక్షణము నల్వగుచుండున యేని నీనుడుల్
శిరమునఁ దాల్చి నే నరునిచెంతకుఁ బోయెద సంతసించుచున్
బరమగురుండ పీ విటులు పల్కితి వాతనికన్న నాకు ని
ద్ధరణిఁ బ్రియుండు లేఁ డగుట ధన్యుఁడ నిప్పని నిర్వహించుటన్. 359

క. నరనారాయణు లిరువురు, గురుభక్తి భజింత్రు నిన్నుఁ గురువర నాకున్
గురువులు వారలు వారికిఁ, బరిచర్య యొనర్చుపనికిఁ బంపుదు వహహా. 360

శా. నీయాజ్ఞం దలఁ దాల్చి శాత్రవమహానీకార్ణవం బిప్డు నేఁ
బాయం జేయుమహోగ్రుపం బనఁగ నై బాహాబలస్ఫూర్తితో
డాయం జొచ్చి త్రియోజనాధ్వమున వేడ్కన్ సైంధవుం దాఁకి సు
స్థాయత్తేజ మెసంగఁ బోరు నరుతో సంధింతు సంబంధినై. 361

క. గురుబలరక్షిత మగుచున్, గురువులువాఱెడు నమేయకురుసైన్యము నేఁ
దిరుగుడు పఱచెద నన్నుం, బరికింపు మొకింతలోనఁ బాండవముఖ్యా. 362

సీ. అదిగొ చూడుము మహాహలశక్తిఖడ్గర్ష్టి, భల్లకుంతాదులఁ బ్రతిభ మీఱి
రుక్మరథులు నాఁగ రూఢి కెక్కినరాజపుత్రు లుప్పొంగుచుఁ బొదలుచుండి

రెల్లరు శిక్షితు లిభరథాశ్వాదుల, విలువిద్యఁ జేరినఁ వీరవరులు.
ముష్టిగదాయుద్ధములయందు నసియుద్ధముల నారితేఱిన ప్రోఢ లరయ
తే. నీర్థథోదారులం గృష్ణుఁ డెపుడు చెప్పచుండుఁ గర్ణునిపక్షము నొంది దుస్స
సేనుతోఁ గూడి యుండి రీజెట్టిమగలఁ, బట్టి వధియించి పోయెదఁ బార్థుకడకు. 363
సీ. అంజనకాఖ్యవిఖ్యాత మై మ్లేచ్ఛపీరాధిష్ఠితేభసహస్రబలము
కవచదీపితములు ఘనకిరాతాంచితములు సప్తశతసంఖ్యఁ బొలుచుకరులు
నైరావణసమంబు లంజనోద్భవములు, పర్వతోన్నతములు వారణములు
ధూమ్రవర్ణంబులై ధూర్తజనప్రేరితంబులై పెక్కువే ల్దంతిగములు
తే. నగ్నియోనులు గోయోను లైనమ్లేచ్ఛజనులతో నొప్పి ధర యీనె ననఁగ నెందుఁ
గనిన నవి యయి కడుఁ గ్రాలుఁ గనుము వాని, నెల్ల మర్దించి మీఁద నే నేగువాఁడ.
మ. అదె కన్పట్టుచునుండి రార్యునకుఁ జాయం బాయ కక్షీణసం
పదఁ బెంపొందినబాహుగర్వమున దుర్వారాభిధేయంబునన్
గదనం బన్నను బబ్బ మం చలరుచున్ గాంభోజముఖ్యు ల్మహో
ప్రదరాగ్నిన్ దహియించి యేగెద వడిం బార్థున్ సమీపింపఁగన్.
ఉ. ఎక్కటిపోరు నాకు నొకయింతటిలో నగుఁ గానఁ దేర్పైఁ
జక్క నమర్పఁగా వలయు సాధనసంచయ మెల్ల నేనురె
ట్లక్కిలి వో హయంబులకు నొదగఁ దీఱిచి యల్గు లూడ్చి పెం
పెక్కఁగ ఖాణ మెత్తి యెలయించుచు నేర్పునఁ గూర్పఁ గా నగున్. 366

—సాత్యకి తనజెట్టు పద్ఘ్మీమని రాసల దని వారించుట—

వ. అనిన ధర్మజుం డట్ల యగుం గావుత మని తగువారి నప్పనికిం బుచ్చుటయు వారు సర్వోపసంగంబులును సర్వోపకరణంబులును సర్వాయుధంబులును రథంబున నమరించి రథ్యంబులశల్యంబు లపనయించి మదనమీరణం బగురసవత్పానంబున దప్పి దీర్చి తేర్చి రథంబునకుం బూన్చి హేమకేసరభాసురం బగుసింహధ్వజం బెత్తి సర్వంబు సన్నద్ధంబు గావించుటయు దారుకానుజుం డగుసూతుండును బిపాసం దీర్చుకొని నొగ లెక్కి యుగ్యంబుల పగ్గంబులఁ గొని నివేదించిన శైనేయుండు గృతస్నానుండును గృతస్వస్త్యయనుండు నై కైలాతకం బనుమధువుం ద్రావి మదవిహ్వాలలోచనుండును లోహితాక్షుండు నై కవచోష్ణీషాదులు ధరించి శుభశకునంబు లవలోకించుచు యుధిష్ఠిరచరణారవిందంబుల కభివందనంబు గావించి తదాశీర్వాదంబు లంగీకరించి రథం బధిష్ఠించి విల్లునమ్ములుఁ దొడలపై నిడుకొని వాయువేగంబునన్ జనుచున్న సమయంబున, 367

ఆ. అపుడు భీమసేనుఁ డన్న పాదములకు, మ్రొక్కి తనదురథము నెక్కి వాని
వెంట నంటి రాఁగ వీక్షించి శైనేయుఁ, డిట్లు లనియె వాని కినక మనఁగ. 368

చ. మరలుము రాజరక్షణము మానసమం దిడికొంచు నాప్రియం
బరయుదు వేని నే నరిబలావళిఁ జించి గమించెద న్వడిన్
నరునెడ కీవు నామగతనంబు నెఱుంగుదు సంశయింప కా
గురుని ప్రతిజ్ఞయుం దలఁచు కొంచిట నుండుము పోయివచ్చెదన్. 369

క. నాపుడు భీముం డిట్లను, నీవలన న్మెచ్చు వచ్చె నే నిలిచెద నీ
భూనరునిరక్షఁ గోరుచు, నీ వరుగుము కార్యసిద్ధినిం గోరుమతిన్. 370

తే. అనిన సాత్యకి యనియె నోయన్న నాకు, విజయ మగుట ధృవం బిట్లు వింటి నీవు
నానుడి హితంబుగా నెంచి నడుము మరలి, శుభనిమిత్తంబులుం జూడఁ జొప్పడియె.

వ. పోయివచ్చెద సైంధవవధానంతరంబున వచ్చి నిన్నుఁ గ్రుచ్చి కౌఁగిలించుకొనియెద
నని భీమసేను నంపిపుచ్చి తా నతివేగంబున మనసైన్యసమూహంబునఁ ద్రోల్చులి
లేళ్లగుంపునందుం బలెఁ జొచ్చె నని చెప్పిన న్విని నైమిశారణ్యవాసు లవ్వలివృ
త్తాంతంబు చెప్పు మని సూతు నడుగుటయును. 372

ఆశ్వాసాంతము.

చ. వెడఁగయి నేను నీవు కలవే యని నీకృతి గాఁగ భారతం
బుడుగక తెల్గు సేయుటకు నూనియు నీదయఁ గోరి కోరి నా
కొడుకును జేతులారఁ గయికొమ్మని నీకు నుపాయనమ్ముగా
నిడితి గ్రహించి తొండన వి దేమికటాక్షము లోకరక్షకా. 373

క. భారతము నీదునాదగు,సారస్వప మీవు గొంటి సర్వేశ్వర! వాః
పూరమున మునిఁగి పారం, బేరీతిం జేరఁ గలనో యెఱిఁగింపఁ గదే. 374

గద్యము.

ఇది శ్రీ సదధునాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందు
ద్రోణపర్వంబునఁ దృతీయాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

## ద్రోణపర్వము-చతుర్థాశ్వాసము.

---



మంతుఁ గూటిపేదం
గా మహి నకూ్కటిపేదఁ గ్రతుభుగధీశుం
గా మాఱ నాచరింతువు
నీమహిమం బెన్న నేరు నేర్తురు తండ్రీ. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కి ట్లనియె నట్లు మనమూఁకం జొచ్చినసాత్యకి యెట్లు ప్రవర్తించెం జెప్పు మనిన ధృతరాష్ట్రునకు సంజయుం డి ట్లనియె. 2

—సాత్యకి మొగ్గరంబుఁ జొరన్ దొడంగుట—

మ. యుయుధానుం డటు ద్రోణసైన్యముపై నుద్రేకముం జూపుచున్
రయ మేపాఱఁగ నేగుచున్నతఱి సేనావార మేతేర ము
న్నయి శైనేయునివెన్క ధర్మజుఁడు శౌర్యస్ఫూర్తిఁ బోఁ జొచ్చినన్
నియమం బేర్పడ దండనాయకుఁ డనున్ జే పీచి యోధాళికిన్. 3

ఆ. గురునిబారినుండి సరయుంబునన్ శినివరుఁడు కడచి చనెడు కరణి మీరుఁ
దద్బలంబు నదిమి తగఁ బ్రహరింపుఁడు, రండు పోరుకొనుఁడు రాజులార. 4

వ. అని యెలుం గేర్పడ సర్వసైన్యంబులును ద్రోణానీకంబుపైఁ బడ సాత్యకిం గూడ ముట్టుటయు మనబలంగంబులును గోలాహలం బెసంగ బాణవర్షంబు గురియుచు యుయుధాను రథంబు నడ్డగించె నంత నంతకాకారుం డై శినివీరుండు. 5

శా. సేనాగ్రంబున నుగ్రమూర్తి యగుచుం జీకాకునం జేస్పడం
గా నారాచపరంపరం బొదువుచున్ గారించుచుం జించుచున్
నానాయోధులఁ గాలువీటికిఁ జనం గాఁ జేయుచున్ జేవమై
రా నాలోఁ దునుమాడె నేడ్వుర జగత్ప్రఖ్యాతశౌర్యాఢ్యులన్. 6

వ. అట్టిసమయంబున నతండు. 7

సీ. ఒకబాణమున సూర్యలోకనూతను నొకండు, గాఁగఁ జక్కాడె భానువము బోవ
నారోహకులతోడ హయరథద్విపములు, నేలపా లయ్యె నయ్యాలమందు
నతనికోల్త్రల కోడి పృతన యంతయుఁ జెల్లఁ, జెద రయ్యెఁ బసి వారిచేతఁ జోర
నకట నీసైన్యమునం దపు డొకఁ డైనఁ, గూడఁ జాలినవాఁడు లేఁడు వాని
తే. నేమిచెప్పుదు నావీరునేత్తుఱుకును, దెగినతేరులు కూలినద్విరదములును
బడినహరులును నుఱుమైన పడగగములుఁ, గప్పఁ బాలికల నొప్పె భీకరవిధమున. 8

వ. ఇట్లు నీమూఁకలఁ జీకాకుపుచ్చి విప్వచ్చుండు పోయిన దారి వట్టి దాశార్హుండును
దఱిమికొని పోవుచున్నంత నాచార్యుండు. 9

చ. శినివరు నబ్ధి వేలవలెఁ జెచ్చెర నాఁగి పృషత్కపంచకం
బున నొగిలింప నాతఁడును బూనిక నాతని నేడుతూపులన్
గొనకొని యేసె ద్రోణుఁడును గోపము మీఱఁగ నాఱుకోలలన్
ఘనగతి వాని వానితురగంబుల సూతుని నేసె నొవ్వఁగన్. 10

తే. కనలి సింహనాదము చేసి శినివరుండు, పదియు నెన్మిది యాఱును బదిశరముల
నొగి గురుని నేసి యొకఁడు నాల్గొకఁడు తీసి, సూతహయకేతువుల నేసి సోలఁజేసె.

వ. ద్రోణాచార్యుండు నక్షీణశౌర్యంబున వానిరథరథ్య సారథిధ్వజంబుల శలభవ్రజంబు
లం బోనినిజశరచయంబులం గప్పపడంజేయుటయు నతం డతని నట్ల కావించె నట్టి
యెడ ధనురాచార్యుండు శినివర్యున కి ట్లనియె. 12

—సాత్యకి ద్రోణాచార్యుం గ్రేడించి పోవుట—

శా. నీయాచార్యుం డవార్యమై చను నని న్వెన్నిచ్చి కాపూరుషుం
డో యన్నట్లు ప్రదక్షిణించుచుఁ జనెం బో నీవు న ట్లేగి పో
నై యుల్లం బానరింపవే నోడలిలోఁ బ్రాణంబుతోఁ బోవ లే
వీయర్థమ్ము నిజమ్ము నమ్ము మిఁక నీ యిష్టమ్ము వాక్రుచ్చితిన్. 13

చ. అనవుడు మాధవుం డనియె నార్య ధనంజయుఁ జేర ధర్మశా
సనమునఁ బోవుచుంటి నిట సల్పఁగ రానిద కాలయాపనం
బనుమతి సేయు మయ్య గురుఁ డాసురుఁ డేగినదారి శిష్యుఁడుం
జన మతి సేసె నొండుగతి సాగునె సాగిన శాస్త్రసిద్ధమే. 14

వ. అని పలికి భారద్వాజుం గ్రేడించి పో నెంచి దారుకానుజుం గాంచి యి ట్లనియె. 15

సీ. తడసినఁ గార్యంబు దప్పు నిటం బట్టు, వఱచుఁ గాని యితండు తఱల నీడుఁ
మన కోసరిల్లుట యనువు వో నిమ్ము తే, రదె యవంతీబల మల్లదె యట

దాక్షిణాత్యబలంబు దాని పై బాహ్లిక, బలము చెంగటఁ గర్ణబలము నలరు
బొరసి యొండొకఁ డవి భేదింప రాకుండ, నేతదంతరమున నేగ నొప్ప
తే. మధ్యమం బగుజవమున మనహయాళి, నడపు మనుటయు సూతుండు నడపె నట్లు
గురుని బెన్నఁబాసి చని శినివరుఁడు కర్ణు,మూఁకలం జించుకొని ముందుఁ బోవఁజొచ్చె.
వ. అట్లు తన్నుఁ గ్రేడించి క్రీడిశిష్యుండు వోవుచున్నాం గని భారద్వాజుండు వెన్నా
దన్ని శరమ్ములం జిమ్ముచుం జనియె నంతఁ గర్ణబలంబు వ్రచ్చి వచ్చుచున్న వాసు
దేవానుజుం గాంచి కృతవర్మ క్రుద్ధుండై మార్కొనుటయు నతండును. 17

—సాత్యకి శల్యుని విరథుం జేయుట—

తే. ఆఱుతూపులు భోజేంద్రునంగమందుఁ, బఱపి నాల్గింట వాజులఁ బడలుపఱచి
మఱియుఁ బదునాఱుకోల లామాన వేశ్వ,రునియురం బాడ నేయుడుం గనలియతఁడు.
శా. క్రూరాశీవిషతుల్య మైనశరమున్ గోదండసంధానస
త్వారూఢంబుగఁ జేసి వష్ణివరుఱొ మ్మార్దక్ష వడిన్ ద్రేయ న
న్నారాచంబు తదీయమర్మమును మేన్ వ్రయ్యంగ లోఁ జొచ్చి వి
స్తారాసృక్చ్యుతసిక్తమై పడె నిలన్ శశ్వద్రవం బేర్పడన్. 19
చ. తొలఁగనికిన్కఁ బెక్కు లగు తూపుల నే పెడలంగఁ జేయుచున్
విలుఁ దెగ నేసి ఱొమ్ముఁపయి వేఁడి వెలార్చుదశాంబకంబులన్
బెలుచన నాటి యార్వ శినివీరుఁ డొగిక్ష గృతవర్మదక్షిణో
జ్జ్వలభుజమందు శక్తిఁ గొని బాధతరంబుగ నొవ్వ నేసియున్. 20
తే. మఱియు నొకవిల్లు సరిచేసి మాధవుండు, వేన వేలుశరంబులు విసరి భోజ
విభుని తేర్చుంచి యొకశితవిశిఖమునను, వానిసారథితల డొల్లి పడఁగ నేసె. 21
వ. నియంతృరహితంబు లైనరథ్యంబులు రథం బొండుకడకుంగొనిపోవం దాన సంభ్ర
మింపక హార్దిక్యుండు తాన సూతకృత్యంబు నిర్వర్తించుచుం బోరుచుండె శైనే
యుండును వానిఁ జుట్టి బెట్టువఱచి కదిసి కాంభోజసైన్యంబు దఱిసె భోజనాథుండును
మరలి భీమసేనుం దలఁపడం జనుచుండ నాచార్యుండు నారాజునకు సారథిం గల్పించి
సేనాముఖంబునం బ్రతిష్ఠించి తాను నాయుయుధాను నడ్డగింపసరుగుచుండఁ బాండవ
యోధులు త్తనిం బోనీక పేనంగి,రప్పు డిరువాఁగువీరులకును బోరు ఘోరం బయ్యె
ననిన ధృతరాష్ట్రుండు సంజయున కి ట్లనియె. 22
చ. గురుకృపకర్ణబాహ్లికముఖుల్ ఘనవిక్రము లొక్కఁ డొక్కఁ డీ
ధరణికిఁ జాలునట్టిరు ప్రధానులు పెక్కురు విక్రమాంచితుల్

పరులకు నాస సేయకయుఁ బందలు గాకయుఁ గేవలార్థమే
సరకుగ నెంచుచుండకయు సాఁగినవారలు సైనికోత్తముల్. 23

క. పరపై సేనాసాగర, మరుదారగ జగము లెల్ల నదుమగఁ దగి నా
కరమంద యుండి శస్త్రాల, పరిసరమున కరుగ జంకి బడలెడు నకటా. 24

ఉ. ఇందఱు నిట్లు పొందుపడి యోద్ధలు సూపఁగ లేనివార లై
రందఱ నొక్క ప్రేల్మిడి సురాధిపనందనుఁ డుక్కడంచి పెం
పొందినపేర్మి సైంధవునియొద్దకుఁ బోయె శినిప్రవీరుఁడుం
గొందల మందఁ జేసి వెనుకొంచుఁ జనెన్ విధి కేమనం దగున్. 25

సీ. మనమోహారం బిట్లు మగఁటిమిఁ గురుశిష్యు, లిద్దఱు సించి పోయిర యటంచు
నీచెప్పటంజేసి నాచిత్త ముత్తల,పాటుసం బొందు నిం కేటి కడల
నింతకంటె నభాగ్య మే ముందు కౌరవుల్, వ్యాత్తాననం బగుభిత్తి కైరి
యోద్ధలఱ యగుటట్లో యేలుకో వీ రింకఁ, జేయఁ దలంచినచెయువు లెవియొ.

తే. నరుఁడు శినివరుఁ డట్లు సేనలను నడిగఁ,జేసి సైంధవుచెంతకుం జేరఁ గనియు
బలఁగములు వాఱఁ గనియు నాకులతనొంది,కుందుచుందు రటంచు నే నందుసూత.

వ. కృష్ణార్జునసాత్యకు లిట్లు నాబలంబుల భేదించి రని విన్న నాయుల్లంబు డిల్లఁ బోయి తల్లడిల్లెడిం గాని సాత్యకి భోజానీకం బతిక్రమించి కాంభోజబలంబుపైఁ గవిసినపదం పడి ప్రధనం బెట్లు ప్రవర్తించెఁ గృతాస్త్రుం డయినద్రోణునకుం బాంచాలురపైఁ గొంచెంబు గానిపగ యని యెఱుంగుదు సతంపు వారి నేమిసేయం గలిగెనో సింధురాజవధోద్యోగి యగునాసవ్యసాచియేమి చేసెనో చెప్పు మనిన సూతసూనుండు వాని కి ట్లనియె. 27

ఉ. నీయపరాధమూలముననే వ్యసనం బిటు సంభవించె నీ
కీయెడఁ బ్రాకృతుండపు బలెనేటికి మాటికిఁ జింతిలంగ ధ
ర్మాయితమూర్తు లై తెలియుమాడ్కిఁ దగన్ విదురాదు లెంతయే
నాయెడఁ జెప్పినన్ విననియట్టిఁడ వైతివి నీవ చెట్టవై. 28

తే. పెద్ద లగునట్టివారలు పేర్మితోడఁ, దగ నచించినబుద్ధులు దగిలి వినని
మందభాగ్యులు నీవలెమహితలమున, వ్యసనములఁ బొందు టదినిక్కువమ్ము మహీశ.

ఉ. పొందు పొసంగఁ జేయుటకుఁ బూని యదూద్వహుఁ డేగుదెంచి నీ
యందలిదుష్టబుద్ధి యిది యంతయు వింతగ లో గ్రహించి యే
చందమునన్ శమం బగుట సాఁగని దాచు నెదం దలంచి తా
నందుల కేగి చేసె నిటు లంతకు మూలము నీవ కావొకో. 30

క. నీవలన నైన తప్పున్, గావరుఁడవు నీవు గానఁ గన్నకొడుకుపైఁ
బోవం బెట్టఁ దలంచెద, వేవంవిధ మర్హ మందు రే తత్త్వజ్ఞుల్. 31

క. పదుగురు మెచ్చెడుమచ్చున, మొదటన్ దుది నసువు నొక్కపోఁదలెడు కార్యం
బొదవించి యెఱుఁగ వీ విఁక, నిది యేటికిఁ బోల్లయేఁడు పెల్లరు విసఁగన్. 32

వ. దీని కంతకును నీవ మూలంబు గావున నీవ యనుభవింతువు గాని చింతింపక యన
హితుండవై దేవాసురోపమంబయిన సంగ్రామంబు తెఱంగు చెప్పెద నవధరింపు మట్లు
శైనేయుండు మనసైన్యంబునం బ్రవేశించినంత సేనాముఖమ్మున భీమసేనప్రభృతు
లెల్లరు నీసైనికుల నతిమి తఱుముచున్నం గని కృతవర్మ మహార్ణవంబుం జెలియలి
కట్టపోలె నప్పాండవబలంబు నిలువరించె నప్పుడు. 33

క. భీముఁడు భీమబలుం డగు, భూమీశ్వరు నతనిఁ దాకి మూఁడమ్ములు న
త్త్రోమధ్యమునన్ నడఁ బడ, డీమసమున నేసి యొత్తె దివ్యజలజమున్. 34

వ. అయ్యవసరంబున సహదేవుం డిర్వదియు నజాతశత్రుం డైదును నకులుండు నూఱును
ద్రౌపదేయులు డెబ్బదిమూఁడును ఘటోత్కచుం డేడును ధృష్టద్యుమ్నుండు
మూఁడును విరాటద్రుపదు లైదైదును శిఖండి యిరువదియైదును నారసంబు లాసుక
ర్మపై నేయుటయు నతండు నొక్కొకని నైదేసి బాణంబులం జేసి నొవ్వ నేసె. 35

సీ. వడముడి నేడింట నడి వాసి నడమును, విల్లును దునుమాడి వెసఁ దీవయు
పతకుస్థలమున డెబ్బదితూపు లడరింపఁ, గపించె రథమునం గాలినట్టె
గని యుధిష్ఠిరపురోగము లెల్ల నొకపెట్ట, శరవర్ష ముల్కి రాఘృనతిసయి
విడి మూర్ఛ భీమసేనుఁడు శక్తి నొకఁ డెత్తి, కృతవర్మపై నేసె నితతశక్తి

తే. ముందుచును వచ్చుదాని నమ్మార్గమధ్య,మంద రెండుశరంబుల నతఁడు తునిమె
నలిగి వేఱొకవిల్లెత్తి యనిలసుతుఁడు, శరము లేడ నేసె హార్దిక్యునురమునందు. 36

మ. ఉతసర్వాంగుఁడు భోజుఁ డప్పుడు పలాశం బామనిం బూచి న
ట్లతిరక్తప్లుతుఁడై కడుం గనలి నేత్రాంతంబు లోల్కఁగా స్ఫులిం
గతతిన్ భీముని మూఁడుబాణములచే గాఢంబుగా నేసియుం
బ్రతిపక్షావలి మూఁడు మూఁడు శరముల్ నాడించి నొంచెన్ వడిన్. 37

క. ఎల్లరు నేడేసిమహా,భల్లంబుల భోజపతినిఁ బ్రహరించుఁడు నా
బల్లిదుఁడు వారి నాఁగుచు, విల్లు విఱిచియున్ శిఖండి వెస నొప్పించెన్. 38

సీ. శాంతనవాంతకుం డంత వాలుం బల్కయును గొని హార్దికాత్మజుని నెదిర్చి
పోరుచుఁ గరవాలమున వ్రేసి వానిచే,విలు దున్మి వైచె దోర్వీర్య మెసఁగఁ

బాండవరథికు లప్పట్లు బెట్టేయుఁడు, సాత్వతుం డొండొక్కచాప మూని
యందఱ మూఁడేసియాశుగంబుల నొంచి, యెనిమిదింట శిఖండి నెగిచి యేసె
తే. నతఁడు వేఱొక్కవి ల్లెత్తి శితశరములఁ, హార్దికసూనుని నొనేయ నీసుఁజేసి
వాని నెనుబదితూపులం బూని యేసె, నతఁడు మూర్ఛిల్లెఁ దేరిపై నాశిఖండి. 39

వ. అట్లు మూర్ఛిల్లిన శిఖండిం గని మనవారు సంతసించుచుఁ గృతవర్మం బ్రశంసించి రంతలో సూతుండు శిఖండిరథంబు దొలఁగించుకొని పోయె నిట్లు పాంచాలకేకయ సృంజయుసైన్యంబుల నొంచి విధూమపావకంబు వోలె మండుహార్దిక్యుం గాంచి వానికోల్తల కోహటించి పాండవసైన్యంబు దైన్యంబు నొంది ధృతి దూలి పఱచు చున్నం గని దవ్వులనుండి మరలి యవ్వేళ వచ్చి శైనేయుండు హార్దిక్యుం దాఁకె. 40

—సాత్యకి కృతవర్మ నోడించుట—

మ. ఒకవాల్గాఁపునఁ జాపముం దునిమి వేఱొక్కమ్మునం బృష్ఠర
క్షకునిం గూల్చి మఱొంట సూతుశిరముం ఖండించి రథ్యంబు లిం
కొకనాల్గింటఁ బడంగ నేసి తదురం బూటాడఁగా నొక్కసా
యకముం జొన్పి తదీయసైనికుల నల్లాడించె భల్లంబులన్. 41

వ. ఇట్లు కృతవర్మ నోడించి ద్రోణానీకంబునకు దాపల రథాశ్వద్విపసంకులంబును బదాతిజనసంపూర్ణంబు నగుత్రిగర్తబలంబులం గాంచి సూతుం బిలిచి యిట్లనియె. 42

తే. వీరె దుర్యోధనప్రీతికై రణంబు, సలుపువారు నోలగ బడి సరకుగొనక
నన్ను మార్కొనునిచ్ఛమైనున్నవారు, పోటుమానుసు లటు తేరు వోవ నిమ్ము. 43

వ. అనిన నతం డట్లుచేయుటయు నంత నాత్రిగర్తసైనికులు గజానీకంబుతో నాతనిం దాఁకిన నతం డంపతుంపరం బరఁగించిన నక్కరిఘట లన్నియు భిన్నకుంభంబులును భిన్నహస్తంబులును శీర్ణదంతంబులు నై పడి చచ్చియు నొచ్చియు విచ్చియు నార్తస్వరంబున హెచ్చి మూత్రపురీషంబులును రక్తంబునుం గార్చుచు వెఱచఱచి పఱచె నట్టియెడ మాగధుం డైనజలసంధుండు రుక్మవర్మధరుండై మార్కొని మదాంధుండై మాధవానుజునిపైఁ దనమత్తమాతంగంబు గొలిపి. 44

చ. ఉరమున భారసాధనమహోగ్రశరంబుల నొవ్వఁ జేయుచున్
గర మలుకన్ శరం బొకఁడు కైకొని కార్ముక మ్మట్టె త్రుంచి స
త్వరుఁ డయి యైదుబాణముల వర్మము వ్రీలఁగ నేయ నాశినీ
శ్వరుఁడు చలింప కొండొకఁడు చాపము చేకొని వీఁకఁ జూపుచున్. 45

చ. నిలు నిలు మెందుఁ బోయెదవు నీ వని వానిభుజాంతరంబునన్
బెలుచన షష్టిబాణములఁ బిమ్మట వుట్టఁగ నేసి నవ్వుచున్

క. అంతఁ గొంతవడికి. 52

ఉ. సాత్వతుఁ జేచి రాజకరచాపముఁ గోపముతోడ నవ్వునన్
సత్వరుఁడై దెగ న్నఱకి సర్వశరీరము నిండ వజ్రసా
రత్వరసాయకౌఘముల నేయుఁడు నల్క నతండు నొండువిల్
సత్వసమన్వితుం డయి వెసం గొని కాండశతంబు వేయుచున్. 58

వ. సాత్యకి నొప్పించుటయు నతండు పీడితుండై నీకొడుకుం బీడించె నంతం దక్షిణనీవా
రెల్లరుం గ్రూరనారాచనికరంబులఁ గృష్ణానుజుం గప్పుటయు నప్పురుషోత్తముండును.

—సాత్యకి దుర్యోధనుని విరథుం జేసి శల్యు నోడించుట—

సీ. అయిదేసితూఁపుల సందఱఁ బీడించి, తోడన యేడేసి వాఁడికోల
లడరించి వడిఁ బేర్చి కడిమిమై నెన్మిది, వెడఁదవాయమ్ముల విభుని నేసి
నవ్వుచుఁ జాపంబు నాగధ్వజంబును, ద్రుంచి సూతుని తలఁ ద్రుళ్ళ నేసి
నాల్గుగుఱ్ఱంబుల నీల్గించి పెక్కు లౌ, మార్గణంబుల నొంచె మర్మములను

తే. అంత నరనాథు వచ్చిన యట్టిఁ డగుచు, మట్టిఁ గలియంగ మాన మామహీవిభుండు
రథము డిగి పాఱె విముఖుఁడై రభసమునను, జిత్రసేనుని తేరెక్కెఁ జివ్వఁ దొలఁగి.

క. పులినోటికండ పోలెన్, గలనన్ సాత్యకికిఁ జిక్కి కడతేఱ నవన్
బలుపాటు వడిన నరపతి, నలనన్ హాహారవంబు ప్రబలం బయ్యెన్. 56

మ. కృతవర్ముం డది యంతయుం గని మదిన్ గేరించి గుఱ్ఱంబులన్
గృతహస్తుం డగుసారథిం దఱుముచున్, గృష్ణానుజుం డున్నచో
టతివేగంబున ముట్ట వచ్చుటయు శౌర్యప్రస్ఫురద్విక్రముం
డతఁ డాభోజునిఁ గాంచి సారథి కనెన్ హర్షప్రకర్షంబునన్. 57

తే. వ్యాదితాస్యాంతకుఁడు పోలె నదిగొ సూత!, నాపయిం గడుంగడుకోప మేపుమీఱ
నేగుదెంచెడి హార్దిక్యుఁ డీవు వాని, కభిముఖంబుగ మనరథం బరుగ నిమ్ము. 58

వ. అనుచున్నంత నతం డట్లు చేయుటయు వా రిరువురు నొక ళ్ళొకళ్ళం దాఁకి రప్పుడు
హార్దిక్యుండు. 59

చ. ఇరువదియాఱునారసము లేనుశరంబులు నాల్గుతూఁపులుం
బరువడి వృష్ణివీరునకు వానినియంతకు నాతురంగమో
త్కరమునకుం నిగిడ్చి నిజకార్ముకమున్ మెఱయించు నంత నా
హరియనుజుం డతీవనిశితాశుగసంఘముల వాని నేయుచున్. 60

సీ. అఱువదియు మూఁడు తూపుల నశ్వములను, సప్తసాయకముల సూతుఁ జదియ నేసి
స్వర్ణపుంఖను యమదండ సమ్మితముగు, ప్రదర మరివోసి కృతవర్మపై నిగిడ్చె. 61

మ. అది వజ్రాయుధ మద్రినిం బలెఁ దదీయాష్టాపదోరచ్ఛదం
బదనుం బుచ్చక చీల్చి త్రావి రుధిరం బంతన్ ధరం జేరుడున్
వద్మలై పాఱఁగ మేన నెత్తు ధనువున్ నారాచముం జాఱ న
ప్పదమందున్ వడిమోఁకజిల్లఁబడె సాబాల్పచ్చిన ట్లొప్పచున్. 62

వ. ఇట్లు కృతవర్మ రథోపస్థంబుపయిం బడం గాంచి చచ్చెనకా తలంచి దనుజాంతకా
నుజుండు ధనంజయదర్శనేచ్ఛాత్వరమాణుండై మనముఁగం జికాకు సేయుచు
నటం జనియె నప్పుడు కృతవర్మయుం దెప్పిఱి యెప్పటియట్ల సేనాముఖంబున కరిగి
పాండవుల నిలువరించుచుండె నంతలో నాచార్యుండు శినివర్యునిచేఁతకు సైరింపఁ
జాలక సత్వరంబునం జని సాత్యకిం దాఁకి. 63

తే. మూఁడునారాచములు శినిమునిమనుమని, ఫాలమున నాటుదు నతండు లీల నొప్పి
మూఁడుశృంగములం బొల్చుభూధరంబు, పోల్కి నెల్లరకును మెప్పుపొసఁగఁ జేసె.

ఉ. అంతరమున్ గ్రహించి గురుఁ డాతనిపై శితసాయకంబులన్
సంతతవృష్టి నా గుఱియ సాత్యకి యొక్కొకదాని రెండురెం
డింతలుగానికాండములనింతలుగాఁ బొనరించుచుండుడున్
స్వాంతమునందు మెచ్చి గురుఁ డాతనిలాఘవలక్ష్యశక్తికిన్. 65

ఆ. ముప్పదింట వాని ము న్నేసి వెంబడి, నేఁబదమ్ము లేయ నెల్లవాని
నడుమఁ దునుఁగ నేసి వడి మాధవుఁడు వాని, నంప వెల్లి ముంచె నమరులెంచ. 66

వ. అంత. 67

—సాత్యకి గురునితోడం బోరి మోడించుట—

సీ. సాత్యకి తొమ్మిదిసాయకమ్ముల ద్రోణు, నోనేసి సారథి నూట నడఁచి
పడగ దోఁగాడఁగా బహుళశరంబులు, పరఁగించె నంతట గురువరుండు
సారథి డెబ్బది నారసంబుల నొంచి, హరులపై మూఁడుమూఁడంబకములు
విసరి మాధవుచేతివిల్లుఁ డెక్కియమును, దునిఁగించె నొక్కొక్కఘనశరమున

తే. సాత్వతుండును గద గొని చాపగురుని, వ్రేయ దాని నతఁడు ద్రుంచె సాయకముల
నంతలోఁ గృష్ణసోదరుఁ డన్యధనువు, నెత్తి గురునిపై గదుతూపు లేసి యార్చె. 68

క. సైరింపక క్రుద్ధుండై, భారద్వాజుండు వానిపై నడరించెన్
ఘోరం బయస్మయం బగు,దారుణశక్తిన్ జగంబు దద్దఱిలంగన్. 69

తే. కాలసన్నిభ మగునది కాండసమితి, కాఁగఁ జాలక శైనేయు నంట కతని
రథముపైఁ బడి భీషణారవ మెసంగ, ధరణిఁ గైసేసె నాశ్చర్యకరము గాఁగ. 70

మ. ప్రణుతింపం దగునొక్కయమ్మున యదుప్రాజ్ఞుండు నాచార్యుద
క్షీణబాహార్గళమందు గాఁడి సన నేసెన్ దానఁ గిన్కన్ ధను
ర్గుణమున్ మ్రోయఁగఁ జేయుచున్ గురుఁడు తత్కోదండ మర్ధేందుమా,
ర్గణధారం దెగ నేసి సూతునిపయిన్ గ్రాలించె శక్త్యస్త్రముల్. 71

క. దానఁ గడుసొమ్మసిల్లెన్, శైనేయునిసూతుఁ డపుడు సారథ్యంబుం
బూనుకొని చేసె సమరం, బానరశిష్యుండు శరసహస్రము లడరన్. 72

మ. గురువర్యుం డపు డైదుమార్గణములన్ గోపాలకృష్ణానుజున్
గురుకోపంబున నేసి యార్చుటయు నానూత్నాశుగంబుల్ శినీ
శ్వరుమైమ ర్వగిలించి పో రుధిర మెచ్చం గాల్వలై పాఱె భూ
ధరశృంగంబుననుండి వర్షజలముల్ ధాత్రిం దిగంబాఱు నాన్. 73

చ. అలుక శినిప్రవీరుఁ డపు డాగురుసూతునిఁ ద్రుంచి తేజులన్
బెలుచన నొంచుడున్ హరులు వీక్వడి స్యందన మీడ్చుకొంచు న
క్కలనికి దవ్వుగాఁ బఱచెఁ గౌరవరాజును రాజుతమ్ములున్
వెలలఁగ నీకుఁ డాగురుని వీతుల నాఁగుఁ డటంచు నార్చుచున్. 74

వ. చెయి వీచి చెప్పుచున్న నెల్లసైన్యంబును ద్రోణునిరథంబు వెంబడించి వికలంబై పోయినది పోకగాఁ బోయె నాచార్యుండును శినివర్యు నెదిరింప మాని సేనాముఖం బునకుం బోయె నట్లు విజయంబు గాంచినదామోదరానుజుండు దారకానుజుం గాంచి యి ట్లనియె. 75

చ. మనము నిమిత్తమాత్రులము మాధవఫాల్గుణవహ్నిదగ్ధు లీ
కనఁబడు నెల్లసైనికులు కంటివె చచ్చినవీరిఁ జంపుచున్
జనియెద మర్జునుం గనఁగఁ జయ్యనఁ దె రటు పోవ ని మ్మనన్
మనమున మెచ్చి సూతుఁడును మావులఁ దోలె మహారయంబునన్. 76

ఆ. శ్యేన మామిషంబుఁ జేకొనఁ బోవున, ట్లరుగుకృష్ణునను జు నాఁగ నోపఁ
డెవ్వ డెవఁడు గాని యంత సుదర్శనుఁ, డనెడురాజపుత్త్రుఁ డడ్డగించె. 77

—సాత్యకి సుదర్శనుం డనురాజుం జంపుట—

వ. నిశాతసాయకసహస్రంబు లాసాత్యకిపై నిగిడించినఁ నతండు వానినెల్ల నడుమన ఖండించి సుదర్శనునిపైఁ గొన్ని బాణంబులు పఱపిన నతండు వానినెల్ల రెండు మూఁడుగ ఖండించి. 78

చ. పిడుగుల కెత్తు వచ్చి కడు వేఁడి వెలారుచుమూఁడుతూపు ల
ప్పుడు కొని భూవరుండు శినిపుంగవు నేయఁగ మర్మభేదు లై

కడుకొని తచ్ఛరంబు లధికత్వర నాతనిమేనఁ జొచ్చి న
య్యెడరున నాల్గువార్వముల నేసె నృపుం డొకనాల్గుకోలలన్. 79

మత్త. నొచ్చి సాత్యకి నవ్వుమోమున నూత్నకాంతు లెసంగఁ గాఁ
జిచ్చుటంపఱ వానివాజులఁ జెండి సూతునిఁ ద్రుంచి పై
పెచ్చు పోవఁగఁ బుచ్చి చెక్కఁయు విస్మయంబుగఁ ద్రెంచె నా
హెచ్చి యాడెడువానిశీర్షమహీనశబ్దముతోఁ బడన్. 80

వ. ఇట్లు సుదర్శనుం బొలివుచ్చి యదువృషభుండు పురందరునిచందంబునం దేజ
రిల్లుచు గహనంబునం దరికొనుదావానలంబుతీరున మనసేనల నీఱు సేయుచు
సూతుం జూచి. 81

శా. నానాశస్త్రరథాశ్వనాగచయసంధానాతిభీమంబు ద్రో
ణానీకార్ణవ మీఁడి వచ్చితిమి, శేషానీక మల్పాల్పమై
కాన న్వచ్చెదుఁ గుల్యఁ బోలె నిది వేడ్కం దాఁటఁగా వచ్చు నా
జానేయాశ్వములన్ మరల్చి రథముం జాగేఁగ జాగింపుమా. 82

సీ. ద్రోణహార్దిక్యులతోఁ బోరి గెలిచినంతన నరుం డెరిఁగి మని తలఁపుము
శ్రమ లేక శుష్కతృణమును దావము పోలె, నిక్కురుసేన నేర్చి పుత్తు
నిది విజయుఁడు సన్నపద మని తోఁచెడి, వారణాశ్వాదిశవముల వలన
విఱిగి పఱచుమూఁక తెలివునఁ గెందూళి, యిదె మిన్ను ముట్టఁగ నెగయుచుండె

తే. గాండివజ్యానినాద మిక్కడనె క్రీడి, క్రీడ సల్పుచునుండె నన్ జాడ దెలుపు
శుభనిమిత్తము లగునాకుఁ జూడ నేఁడు, సైంధవుఁడు ప్రొద్దు గ్రుంకులోఁ జచ్చు నిజము.

వ. వారె యుద్ధదుర్మదు లగుకాంభోజులును శక కిరాత దరద బర్బర తామ్రలిప్తకు
లనుమ్లేచ్ఛయవనాదులును దుర్యోధనపురస్సరులై నాకై ప్రతీక్షించుచున్నవారు
మనకుఁ దత్తఱంపడఁ బని లేదు గావున మనరథం బల్లనం బోవ నిమ్మనిన నతం
డతని కిట్లనియె. 84

మ. జమదగ్నిప్రభవుండు ద్రోణకృపులుఁ శల్యుండునుం బోటివా
రమితానీకినితో నెదిర్చినను నీయండం బ్రవర్తిల్లి సం
భ్రమముం బొందుదునే యెఱుంగవొకొ నా ప్రజ్ఞావిశేషంబు వృ
ష్ణిమణీ! ముక్కడిమూఁకఁ దోలు మిదె నేఁ జెల్వారఁ గావించెదన్. 85

వ. అనిన సాత్యకి వెండియును. 86

క. ముందులఁ గాంభోజుల నే, భండనమునఁ గూలఁ ద్రోసి పార్థునికడకున్
జండగతి నరుగుచోఁ గని, రెండవనరుఁ డనుచుఁ దలఁకరే పగ ఱనఘా. 87

వ. అని పలుకుచున్నంత దారుకాజుండు తేరు కాంభోజయవనబర్బరాది బలంబులం
జేరం దోలుటయు నయ్యుయుధానుండు నానావిధనారాచశతసహస్రంబులు గురిసి
శిరంబులు నుఱుము చేసియుఁ గాలు సేతులు ఖండించియుఁ దొక్కులుచెక్కియుఁ బ్రక్క
లుముక్కలుచేసియు నొక్కుమ్మున నలురవుర నేవుర నార్వుర నేడ్వుర నెనమండ్ర
రను గా నేటాడి నెత్తురేఱు వాఱించి సిద్ధచారణప్రస్తూయమానుం డయ్యె నయ్యాడ
హతశేషులు యథాయథలై పాఱి రిట్లు ద్రోణానీకంబు వీఁకం దాఁటి కృతవర్మ
నోడించి జలసంధుం దెగటార్చి సుదర్శనుం బరిమార్చి కాంభోజమ్లేచ్ఛాదిబలంబుల
చలం బుడిపి మనమూఁకలమధ్యమున గోగణంబులమధ్యంబున నాఁబోఁతు రీతిం
జూడ నొప్పి తేళ్ళపయిం గవియుకోల్పులి చందంబున మనజోదులపయిం గవిసి చించి
చెండాడుచుం బోవుచున్న సాత్యకిం గని దుర్యోధన దుశ్శాసన చిత్రసేన వివింశతి
శకుని దుస్సహ దుర్ధర్షణ క్రథ ప్రభృతులు మహారథు లనేకు లాసాత్యకి వెన్న
దన్ని పోకు పోకు మని యెలుంగులతో ముట్ట వచ్చిన నక్కోలాహలం బాకర్ణించి
శైనేయుండు సూతుం గాంచి యి ట్లనియె. 88

ఉ. పున్నమనాఁటిసాగరము పోలికఁ గైకొని పొంగి ధార్తరా
ట్రోన్నతసైన్య మట్లు నను నొర్వగ వచ్చుచు చుండె దిక్కులం
గ్రన్నన ఘోష మల్లుకొనఁ గన్గొను మింతటిలోన దీని నే
భిన్నము చేసి యాఁగెదను వేలవలెన్ భుజశక్తి పెంపునన్. 89

క. అని పలుకుచు మందగతిం, జనుచుండినయంతలోన సైన్యాబ్ధి వడిన్
వెనుకొని దరియఁగ వచ్చెన్, గనుఁ డెయిదుఁడు పొదువుఁ డనుచుఁ గడునులి వడరన్.

సీ. తనమీఁదఁ గవిసినం గని శినిప్రవరుఁ డా, బలగంబుల నెదిర్చి బహుశరాళి
నిగిడించి మున్నూఱి కగుతురంగంబుల, నన్నూటికైనదంతావళములఁ
బెక్కునూర్లకు నైనమొక్కలీండ్రను గూల్చి, చిక్కువడం జేసె సేనయెల్ల
శైనేయుఁ డేసినసాయకమునకుఁ గా, కొకవస్తువే నట నుండ దపుడు

తే. అతనియొకబాణ మేగుర నాఱుగురను, గూల్చు నొకపరి వృథవోక కురుమహీశ!
యేమి చెప్పుదు నర్జునుం డితనికన్న మిన్న గాఁ డని పేర్కొనె మింటివెంట. 91

క. అప్పుడు దుర్యోధనుఁ డెద, ముప్పిఱియై శౌర్య మెసఁగ మురరిపునసఖున్
గప్పి శరంబుల హరులన్, రొప్పెడునరు నొంచెఁ బెక్కురోషముల వడిన్. 92

సీ. ప్రోడయై యువరాజు షోడశాశుగములు, శకుని యిర్వదియైదుసాయకములు
చిత్రసేనుం డేనుశితశరంబులు దుస్సహుండు పదునేనమ్ము లడరఁ జేయఁ

బదతాడితోరగప్రక్రియ సాత్యకి, యలిగి మూఁడేసిసాయకము లేసి
యందఱ నొంచి యొక్కమ్మున శకునివిల్, ద్రుంచి తేనియురంబు నొంచి మూఁట

తే. దుస్సహుని దశశరముల దుస్సేను, నిర్వదిటఁ జిత్రసేను నూ ఱేసి నొంచె
నంత సౌబలుఁ డొండువి ల్లంది వాని, నెన్మిదింట నేనింట నోనేసె నధిప. 93

—సాత్యకి దుశ్శాసనునితోఁ బోరి పాఱించుట—

వ. అంతదుశ్శాసనుండు పదియును దుస్సహుండు మూఁడును దుర్ముఖుండు పండ్రెండును
బ్రదరంబు లాశైనేయుపై నిగిడించిరి దుర్యోధనుండును వాని డెబ్బదిమూఁడింటను
సారథి మూఁడింటను నొనేయుటయు సమ్మోసధనుండును. 94

శా. ఐ దైదమ్ముల సమ్మహారథుల నుగ్రాకారుఁ డై నొంచియుఁ
మీఁదుర్యోధనుసారథిన్ నిశితమై మే ల్వాఁపువాల్గాపునన్
దాఁ దున్మ న్వాఁడిఁ బాఱె నారువము లంతం బాజికిన్ దూరమై
పోఁ దేరుం గొని మూఁకలుం బెఱిలి పెంపుం దక్క పోయె న్వడిన్. 95

వ. ఇట్లు పలాయనపరాయణం బైనసేనబలంగంబులు వెన్నంటి మంట లీనుమార్గణంబు
లేయుచుం గొంత తఱిమి చని మరలి మాధవానుజుండు తలపున వాడకుండఁ
గ్రీడిత్రోవం బట్టి పోవుచుండె ననిన విని ధృతరాష్ట్రుండు సంజయుదిక్కు మొగంబై
యి ట్లనియె. 96

మ. ఇటు పెక్కంపుర నొంచి యొక్కరుఁడు దా నేగెన్ శినీశుండు నా
దిట వారోమెన్ మది సిగ్గుమాలిన ప్రజల్ ది క్కెదియున్ లేక పో
వుటయో వెండియు క్షత్రధర్మమున నేపుం జూపరో కాని యి
ప్పటిసందర్భము భాగ్యహీను మనిమే భావింపఁ గా నయ్యెనన్. 97

తే. అర్జునుఁడు పాలఁ దమ్మొ నిల్వ చరింప, ద్రోణహార్దిక్యులన్ గెల్చి రాణ లెసఁగి
శినివరుం డొక్కరుఁడ మసనేన నెల్లఁ, దోలె సింగము పశుతతిఁ దోలినట్లు. 98

తే. అనిన సంజయుఁ డి ట్లను నధిప నీదు, చేత నైనట్టిదాని కీచింత యేల
వినుము వగ పేదఁ గయ్యంబువిధ మ ట్లెల్లఁ, దేట తెల్లముగా నీకుఁ దెలియ వినుతు.

వ. అంతసుయోధనునిపంపున నంశప్తకులు మూఁడువేలరథంబులవారును శక కాంభోజ
బాహ్లీక యవన పారద కుళింగ తంగ ణాంబష్ఠ పైశాచ బర్బర పార్వతీయులు
పాషాణపాణులై మూఁడువేలును వేయిరథంబులును రెండువేలద్విరదంబులును
మూఁడువేలతురంగంబులును దోడ రాఁ గ దుశ్శాసనపురస్సరులై నానావిధాస్త్ర
శస్త్రంబులు వఱపుచుఁ బావకంబుపయిం బొఱిమిసుతులబాఱు తీరున నాశినివీరు
పయిం గవిసిన నతం డవక్రపరాక్రమంబున నాక్రమించుటయు. 100

—సాత్యకి పార్వతీయయోధులం బొరివుచ్చుట—

మ. పొడిమై రాలె రథంబు లశ్వములు పెంపుం దక్కి కూలెం గడుం
గడు శైథిల్యము నొంది త్రెళ్లె గజముల్ కాల్బంట్లు సర్వాంగముల్
చెడ నేలం బడి త్రుళ్లి రెల్లరథులుం జేడ్పాటునం జెల్లి ర
ప్పుడు వాతెన్ రుధిరస్రవంతులు భయోద్భూతంబులై భూస్థలిన్. 101

వ. ఇట్లు కాంభోజబాహ్లికాదిబలంబు లాసాత్యకికోల్తల కోహటించి యోహారిసాహసిం బోవుచున్నం గని దుశ్శాసనుం డశ్మయుద్ధకుశలులును బాషాణయోధులు నగుపార్వతీయసైనికులం బురికొల్పుటయు వా రశ్మయుద్ధనిపుణుండు గానిసాత్యకిం జుట్టుముట్టి శిలావర్షంబు గురియుటయు నావృష్ణివీరుండును. 102

చ. రవికిరణాళికిం బొరయఁగ రానిశిలాంగుస నొండొకంటితోఁ
దవుల నిశాతబాణములఁ దచ్ఛిల లన్నియు నుగ్గునూఁచమై
భువిఁ బడునట్లు చేసి తనపోడిమి పెంపున వాఁడితూపులన్
యవనబలావళిం దునిమె నచ్చెరు వందె సురల్ నుతింపఁగన్. 103

తే. వేనవేలు శిలాహస్తులైనవారి, హస్తములతోడఁ దల లూడి యవనితలముఁ
గప్పెఁ గుప్పలుగూరగా నుప్పరంబు, ప్రారటిల్ల మహాధ్వని పుట్టె నపుడు. 104

వ. ఇట్లు దరద తంగణ లంపక పులింద్రాదియోధుల నొక్కవ్రేల్మిడిఁ బ్రేతరాజపురంబునకుం బుచ్చిన హతశేషులు యథాయథలై విఱిగి పఱచి రట్టియెడఁ బర్వాదినంబులఁ బారావారంబునందుం బలెం దనసైన్యంబునం బడినశబ్దంబు విని ద్రోణాచార్యుండు దక్షిణస్థుం గాంచి యి ట్లనియె. 105

ఉ. చూచితె సూత వృష్ణికులసోముఁడు మ్లేచ్ఛబలంబు నుగ్గునున్
నూఁచముసై చనం జఱిపెనో యన నయ్యెడి నారవంబు వే
వే చన నిమ్ము తే రటకు వీరవరేణ్యుని వాని నాఁగు వాఁ
డాచతురంగసైన్యమునయందు నొకండును లేఁడు నాపుడున్. 106

క. సూతుఁ డను నిచటఁ బాంచాలాంతకసైన్యంబు మీఱి యఱిమెదు నిట నా
పీతాంబరానుజుండు న,కాతరుఁడై దవ్వు సనియెఁ గర్జమరయుమా. 107

వ. అనినంత నాచార్యుం డటు వాసి పోవు టుఱవు' గా దని సేనాముఖరతాపరుండై యుండె నంతలో దుశ్శాసనుండు శినివీరుబాఱి నిలువ నోడి చమూసమూహంబుతోఁ దనమఱువు సేర వచ్చినం గని గురుండు వాని కి ట్లనియె. 108

క. అరదములు విఱిగి పఱచెడు, గురుశబ్ద మ్మోసఁగె నేమొకో యువరాజా
కురురాజు కుశలియే సిం,ధురసేనుఁడు బ్రదికియుండె నో చెప్పఁ గదే. 109

వ. అని యంత నిలువక. 110

—ద్రోణాచార్యుండు దుశ్శాసనుం బరిహసించుట—

ఉ. రాజకులంబునం బొడమి రాజున కగ్రసహోదరుండ వై
రాజులు గొల్చుచుండ యువరాజపదంబు నలంకరించి వి
భ్రాజితకీర్తి వై వెలయుబాహుబలాఢ్యుఁడ వీవె యిట్లు పే
రోజ సెడన్ రణంబునకు నోసరిలం బడి పాఱు టొప్పునే. 111

ఉ. జూదమునాఁడు నీ వెదియుఁ జూడక పాండవధర్మపత్నిని
గా దన కొలగంబునకుఁ గైకొని వచ్చి పరాభవించి నీ
కేదియు దిక్కు లేదు మగ లెల్లరు షండతిలోకముల్ సవం
తీ! దిట దప్పి రంటి విపుఁ డిట్లు మగంటిమిఁ దూల పుచ్చెదే. 112

ఆ. నాఁటియడ్డసాళ్ళు నారాచములు గాఁగ, మాఁటి నేఁటి కిట్లు మోఁదఁ బిలిచి
నిలిచి కలనుపేర నెగడుజూదం బాడి, గెలువు మనువు లొడ్డి తొలఁగ నేల. 113

క. క్రొవ్వున బాండవులకు నటు, నొవ్వ ఘటించితివి నీవు నోఁగు లింతకు నిం
కెవ్వలనికి నేగం గల, వవ్వాడి మానమును దర్ప మరిగెనె చెపుమా. 114

సీ. నీమూలమున గదా నెగు లిట్లు గా నయ్యె, నీకులంబున కెల్ల నోకులీస
నీబాహుబలమున నే నిల్వరింప నౌ, వికీగినమూఁకలు వెఱుఁగు వోవ
నోల మాసించి నీ వాలము విడి పోవఁ, బగఱు నవ్వదటు నీ బ్రదుకుఁ దెగడి
సేనాధిపతి వీవ పో నని మొన నిల్చి, పోటువా రెవ్వరు వైరి నాఁగ
తే. మాధవునినులివెచ్చని మార్గణముల, కిట్లు తలఁకినవాఁడ వై తేని సరుని
వేఁడిపిడుగుల కెత్తైనవాఁడితూపు, గములు కెట్లు తాళెదునో చెప్పు మమలచరిత.

ఉ. పోరికిఁ జాల వేని తగఁ బాం దొడగూడఁగఁ జెప్పి యున్నతో
వారికి వారిరాజ్య మిడి వాసి నెసంగెడునట్లు సేయు మా
మారుతి మి మ్మశేషముగ మార్కొని త్రుంపక మున్నె యిట్లు కా
దే రహి వీడి పాఱు టిది హీనము గావున నమ్ము పోరఁగన్. 116

వ. అని గర్హించి పలికినపలుకు లెల్ల వినియు విననిచందంబున నేమియు బలుక కలుక
మొగంబునం దళుకు లీన నీనందనుండు మ్లేచ్ఛసేనాసందోహంబు వెంట నంట శిని
వీరుఁ డున్నచోటికిం జనియె నాచార్యుండును బాంచాలపాండవమాత్స్యసైన్యం
బులం జొచ్చి విచ్చలవిడి విహరించుచు నాయోధనంబు గావించుచుండె నంత వీర
కేతుం డనుపాంచాలపుత్రుండు గండుమిగిలి. 117

—ద్రోణుండు పాంచాలపుత్త్రులఁ బంచత్వంబు నొందించుట—

మ. ధనురాచార్యుని దాఁకి వీఁకమెయి దోర్దర్పంబు పేర్పొందున
ట్లు నిశాతాంబకపంచకంబున నొడల్ దూఁగాడఁ గాఁ నేసి సూ
తుని నేడమ్ముల నొవ్వఁ జేసి పడగం దూలించి యొక్కమ్మున
స్జన మగ్గింపఁగ ద్రోణుతే ర్మెలఁగకుండం బోరె ఘోరంబుగన్. 118

తే. అప్పుడు పాంచాలు రెల్లరు నస్త్రశస్త్ర, సమితి నొలుకుచు నాచార్యస్యందనంబు
సుట్టి ముట్టిరి యమరాజసుతునిజయముఁ, గోరుకొనునట్టివా రయి కొంతలోన. 119

శా. ఆచార్యుండును గోపఘూర్ణితదృశుం డై యెల్లవారిన్ బల
ప్రాచుర్యంబునఁ బర్వ మబ్బుల మహావాతంబు నాఁ ద్రోచి నా
రాచం బొక్కఁడు నారివోసి కడిమిం బ్రత్యర్థి యై యున్నయు
గ్రాచారాంచితు వీరకేతు నడఁచెన్ హాహారవం బేర్పడన్. 120

తే. అగ్నిసన్నిభ మైనయయ్యాశుగంబు, వీరకేతునిమే న్నించి విపులఁ బడియె
నసృగభివ్యాప్త మైమండునట్లు దోఁచి, వాఁడునుం బడె ధర రథవరమునుండి. 121

వ. ఇట్లు పాంచాలరాజపుత్త్రుండు పడినంత వ్యసనకర్శితులువానిసోదర్యులు చిత్రకేతుం
డును సుధన్వుండును జిత్రవర్మయుఁ జిత్రరథుండు ననువారు ద్రోణుం జుట్టుముట్టి
తపాంతంబున జలదంబులుం బోలె శరవర్షంబు గురిసినం గినిసి గురుండు శరపరం
పరలం జేసి వారి నో నేసి చే యాడకుండం జేసి. 122

ఉ. నవ్వుచు నవ్యసవ్యములు నారసముల్ వఱిగించి సూతులన్
ద్రెవ్వఁగ నేసి వార్వములఁ ద్రెంచి రథంబులఁ ద్రుంచి పిమ్మటం
బువ్వులు వోలె వారిశిరముల్ దెగి నేలకు రాలఁ జేసి మేల్
నివ్వటిలంగఁ గార్ముకము లీలఁ గదల్చుచు నుండె నంతటన్. 123

సీ. పాంచాలవీరులపంచత్వమునకు సంక్రుద్ధుఁ డై కన్నీరు గుమ్మరించి
పార్షతుం డెంతయుఁ బ్రతిభమై ద్రోణుని,రథ మడ్డగించి వర్షంబు వోలె
వాలమ్ము లడరించి వడి సూపయును వాని,కడిమి కెంతయు లోనఁ గనలు వొడమ
నడరి హాహాకార మరుదేరఁ దొంబది, తూపు లొక్కమ్మడిఁ దొడిగి వింట.

తే. గురునిఱొమ్మాడఁగా బెట్టు కొట్టె దాన, వివశుఁడై సోలి తేరిపై ద్విజవరుండు
చదికిలం బడె నట్లైన చాపగురుని,జాడఁ గాంచి పాంచాల్యుండు సంభ్రమించి. 124

ఉ. చాపము వీడి వాలుఁ గొని సాహస మేర్పడఁ జెంగలించుచున్
గోపముతోడ లంగ గొని గొబ్బున నబ్బలభిత్సమానునిం

శా. క్రుద్ధుండై యదువంశభూషణుఁడు పెక్కుల్ తూపు లొక్కుమ్మడిన్
బద్ధస్పర్ధ నిగిడ్చి సారథి రథాశ్వవ్రాతము న్నొంచి దు
ర్బద్ధి న్నీసుతు నూర్ణనాభి మశకంబుం బట్టి యూర్ణం బలెన్
బద్ధుం జేసె నొకింతలోన దివిషద్వ్రాతముల్ ప్రశంసింపఁగన్. 135

వ. అట్లు చిక్కువడినదుశ్శాసనుం జూచి దుర్యోధనుండు త్వరితుండై యుయుధాను నెదిరింపఁ ద్రిగర్తులం బురికొల్పినయు వారు మూఁడువేలరథంబులవా రాతనిం జుట్టుముట్టి తెట్టలు గట్టునట్లు పిట్టకోలలంబెట్టి నొప్పించిన నప్పురుషోత్తమానుజుండు గండుమిగిలి వారిలో నేనూఱురథ[illegible]ంగోల్తలం జేసి యేసి నంత దిష్టాంతంబు నొంది వా రింతలోన మహామారుతరయంబున మహీరుహంబులు మహీధ్రంబునుండి క్రిందికిం బడునట్లు క్రిందికిం బడి రంత మాతంగంబులును దురంగంబులును గుప్పలు తిప్పలై యప్పుడమిం గైసేసె నట్టియెడ హతశేషులు శోణితౌఘపరిప్లుతులై పూచినకింశుకంబులపోలుపునం బోలుపొంది కాందిశీకులై పంకమగ్నద్విపంబులుఁబోలెఁ బరిరక్షణంబు గానక భయభ్రాంతులై లాంగలం దూరు మహోరగంబులతీరున భారద్వాజపరిసరంబునకుం బాఱఁ జొచ్చి రచ్యుతానరజుండు నుం దనకు మాఱుమలయువారు లేమిం జేసి ధనంజయరథంబుదిక్కు మొగంబై మందగమనం బవధరించె నంతలో దుశ్శాసనుండు వెన్నుదన్ని. 136

—దుశ్శాసనుండు సాత్యకివెన్నుదన్ని పోరి యోడుట—

ఉ. తొమ్మిదియమ్ము లేసి తనదోర్బలమంతయుఁ జూపి నవ్వుమో
మమ్మెయిఁ జూపి సాత్యకియు నాతని నేనుశితాశుగమ్ములన్
దిమ్మ వడంగఁ జేయుటయుఁ దెప్పిఱి ముప్పిఱి నుండి వెండి వే
గమ్మున నీసుతుం డతనిఁ గప్పెను మూఁడును నైదు తూపులన్. 137

సీ. శినివరుండును వాని ధనువుఁ బంచాశుగమ్ములఁ జించి నరుఁ డున్నవలకు వట్టి
దుస్సేనుం డల్లి దొడ్డశక్తిం గొని, యరి నేసె నేసిన నతఁడు దాని
గడికండలుగఁ జేసె వెడఁదవాయమ్ముల, నదరించి నడుమ నీయాత్మజుండు
గొని యొండుకోదండమును ఘనాశుగముల, నరివ్రేసి సింగమ ట్లార్చి వ్రేసె

తే. సాత్యకియు దాని కింతయు సైఁప కతని, పేరురంబునఁ గడుతూపు లార నేసి
పిదప సర్వాయసంబు లెన్నిదిమహోగ్ర,శరములం జేసి నొనేసెఁ గరము గినిసి. 138

వ. అంత దుశ్శాసనుండు నిరువది సాయకంబులంజేసి నొవ్వఁ జేయుటయు నయ్యుధా మన్యుండును. 139

మ. కనుఁగల్ల నిప్పుక లొల్క నల్కమెయి నుగ్రంపుశ్యూఁడై దుస్ససే
నునివక్షంబున మూఁడువాఁడిశరముల్ నొవ్వేర్పడ నేచి సూ
తుని వార్వంబుల నుర్వరం బడఁ గడుం దూపుల్ ప్రయోగించి త
ద్ధను వొంటం దెగ నేసి యైదిటఁ దలత్రాణంబు ఖండించియున్. 140

తే. ధ్వజము రథశక్తి రెండింటఁ దఱిగి వైచి, పార్ష్ణిసారథులను బాణపంక్తిఁ గూల్చి
పెల్చ నార్చిన విరథుండు వీతధన్వుఁ, డగుచు దుశ్శాసనుఁడు బెగ డంది నరిగె. 141

వ. ఇట్లున్నవాని త్రిగర్తసేనాపతి [illegible] దెక్కించుకొని చనియె నంత
మురాంతకానుజుం డొక్కముహూర్తమాత్రంబు వాని [illegible] గౌరవ
సభామధ్యంబున నెల్లకౌరవుల నేన చంపుదు నని చేసినపాండవముఖ్యునిప్రతి
జ్ఞం దలంచి చేఁ జిక్కినదుస్ససేను నుక్కడంపం దలంపక విజయోత్సాహం బిను
మడింప విజయుండు చనినమార్గంబు పట్టి చనియె ననిన ధృతరాష్ట్రుండు సంజయు
దిక్కు మొగం బై యి ట్లనియె. 142

ఉ. శక్రసమానవిక్రముఁడు సాత్యకి యొక్కఁడు నిట్లు చేయ నా
చక్రమునం దెవం డయిన శౌర్యముఁ జూపఁగ లేక పోయె నా
నీక్రమ మంత నారయఁగ నెంతయు వింతగఁ దోఁచె సంజయా
వక్రపరాక్రమంబునను వర్తిలుచుండిరె వార లందఱున్. 143

వ. అనిన సంజయుం డి ట్లనియె. 144

సీ. కాదు నీ వనినట్లు నీదుసైన్యము యుగాంతము వోలెఁ దుములమై తనరుచుండ
రథహస్తిపత్తితురగములన్ గురుఁడు నిత్యము వన్ను వ్యూహము లసదృశములు
సింధుపతిం గావఁ జేసిన నాఁటియుగ్రమునకున్ సాటి గలుగ దనుచు
దివినుండి కనుచున్న దేవగంధర్వులు, పలికిరి కడుఁ దెఱంగులను దెలియఁ

తే. చండవాతాహతిన్ మ్రోయు సాగరమ్ము, లనఁగ నిరువాఁగుసేన లయ్యవసరమునఁ
గలియఁ బడె సద్దు తుములమై గలుగ నయ్యె, లోమహర్షణశబ్దంబు లోక మవియ.

వ. అప్పు డప్పాండవాగ్రజుండు భీమసేననకులసాత్యకులం బురికొల్పుకొని సర్వసైని
కులం [illegible] పిలిచి ధనంజయసాత్యకు లిద్దఱును జయద్రథవధార్థం బరిసైన్యార్ణవం
బునం జొచ్చి యున్నవారు వా రొండు తెఱం గైన మన కొండుగతి యుండదు
లాతివార లాఁగకుండ వారికి సుఖగమనంబు గలుగఁ గార్యనిర్వాహణంబు గా మీ
రెల్లరుం బాసట గండు మహావాతంబు పారావారంబుం బలెఁ బరసేనాసమూహం
బల్లతల్లడం బంద నఱుముఁడు తఱుముఁడు మెట్టుఁడు కొట్టుఁడు డని మాటికిం బురి

కొల్పుటం జేసి పాండవపాంచాలసైన్యంబు లెల్ల నోలం బాస గొనక శస్త్రనిధనం బున వీరస్వర్గంబు నొంద నభిలషించి మహోగ్ర ప్రకారంబునం బొదివి పోరుచున్న వారు నీవారును సైంధవరక్షణార్థనిర్వహణతత్పరులై నదుర్యోధనుని ప్రేరణంబునం బెంపు చేసి నేసలం జించుకొని పోవుచున్న భీభత్సునకుం దోడుపడం బోవుశినిప్ర వీరు నడ్డగించుచునుత్సాహంబున సాహసోపేతులై ప్రతిఘటించి పోరుచున్నవా రప్పుడు దుర్యోధనుండు సూర్యప్రభాభాసమానంబు లగుకవచకాంతులు కన్నులకు మిఱుమిట్లు గొలుప సజ్జనసాత్యకు లున్నచట్ల మహాసమ్మర్దం బగుచుంట నిశ్చయించి మించినపరాక్రమంబునం దాను పాండవసైన్యంబుం దాఁకి వీఁకం జూపుచుండె ననిన నాంబికేయుం డబ్బురంపడి సంజయా నాకొడుకు చిన్ననాఁట నుండియు నత్యంతసుఖంబునం బెరిగి లోకేశ్వరుండై యున్నవాఁ డొక్కరుం డెక్కరణం బెక్కం త్రిత్రోఁ బోరుకొనం జాలెనో చెప్పు మనిన సంజయుండు రాజేంద్రా సుయోధనాయోధనంబు పరమాశ్చర్యకరం బాకర్ణింపుము. 146

క. తల కడచి సుయోధనుఁ డ,న్వల నమ్మొన వనజవనము వారణము పలెన్
గలఁచి కడు వికలమై చనఁ, జలిపెన్ నలుగడల బాహుశౌర్యం బెసఁగన్. 147

వ. ఇట్లు కలంచి మండలీకృతకార్ముకుం డగుచుఁ దండు నిజాస్త్రశిక్షాబలంబున నమ్మరి వోయుటయు నేయుటయు నెరికింగాన రాకుండ నెల్లబలంగముఁ ముసుంగు వెట్టుచుఁ దన్నలుమ నున్న భీమసేనుని బదింటను నకుల వేఱువేఱ మూఁడింటను ధర్మరాజు నేడింటను విరాటద్రుపదుల నాఱింటను శిఖండిని మూఁడింటను ధృష్టద్యుమ్ను నిఱువదింటను ద్రౌపదేయుల మూఁడింట మూఁడింటను దక్కునుంగల మొక్కలీండ్ర నూఱింటను నొవ్వనేసి పరమాద్భుతప్రకారంబునం బోరుచున్నంత నంతకాత్మజుండు గండు మిగిలి. 148

సీ. భల్లద్వయమునఁ జాపము ద్రుంచి రారాజు, నెదఁ బదితూపుల నేసె నవియు
నతనిమైమఱుపున కంటి యట్టిట్టలై, మిట్టిపడెఁ నేల మిసిమి ప్రేలఁ
బాండవవీరు లాపార్థివుపిల్లుఁ ద్రుంచుటకు మెచ్చిరి ధర్మసుతుని మిగుల
నంత నేఱొకచాప మంది సుయోధనుం, డుద్ధండు మని రాజునండ కరిగె

తే. నపుడు పాంచాలవీరు లయ్యెడకు గాంచి, తలకడచి నీదుసుతుఁ దాఁక దలఁచుతఱిని
గురుఁడు వారి నెదిర్చె న ద్దురరణంబు, నడచె నిరువాఁగు యోధుల కెడరు దోఁప.

క. ఇట భారద్వాజుం డచ్చట భీభత్సుండు నడుమ సాత్యకియు మహో
త్కటశక్తిఁ బాఱిసమరుట, కట కట వడి బహుజనంబు కడ తేఱె నృపా. 150

మ. అపరాహ్ణంబగువేళ సంగరము ఘోరాకార మై క్రాలె న
ప్డు పరాక్రాంతి దిగంతవిశ్రుతుఁడు పెంపుం గాంచి చాపేజ్యుఁ డా
జ్యాపరిశ్లిష్టహుతాశనుం డనఁగఁ బాంచాలాటవిం గాల్చుచున్
నృపులం బెక్కుర నేఁటియేఁటి తునిమెన్ నీకుం బ్రియం బేర్పడన్. 151
తే. అపుడు కైకయపంచకమందుఁ బెద్ద,యగుబృహత్క్షత్త్రుఁ డెంతయు నతిశయించి
గురుని మార్కొని శరపరంపరల ముంచె, మొయిలు గిరిపయి వర్షించి ముంచునట్లు.
వ. అంత. 153

—ద్రోణుఁడు విజృంభించి ఘోరయుద్ధము చేయుట—

సీ. గురుఁడు శిలాశితక్రూరనారాచముల్, పదియేను పఱపె నాపార్థివుపయి
నతఁ డగ్గలించి యయ్యమ్ము లొక్కొకదాని, నైదేసితూపుల నడఁచివైచె
నృపతిలాఘవమున కెద మెచ్చి ఘటజుండు, నగుచు నెన్మిదిమార్గణములు విసరె
విసరినంతన వాని వెస వాయ నన్నింట, నడుమ నడంచె నన్నరవరుండు
తే. దాని కచ్చెరుపడియె నీదడ మదెల్ల, నలిగి బ్రహ్మాస్త్ర మపరించె నస్త్రగురుఁడు
గాంచి బ్రహ్మాస్త్రమున దాని గం డడంచి, నృవరుఁ డర్వదియమ్ముల నేసె గురుని.
మ. కనుఁదమ్ముల్ గడుఁ జేవుఱింప గురుఁ డాకైకేయు నొక్కమ్మునం
గొని యేయన్ వడి నమ్మహాప్రదర మాక్షోణీశుమైమర్వ సిం
చి నెత్తిం గ్రాలుచు నెత్రువట్టు వఱలం జెల్లాట మాడంగ నై
చని చొచ్చెన్ భువి వామలూరుముఖమున్ సర్పంబుచందంబునన్. 155
సీ. ద్రోణాతివిద్ధుఁడై క్షోణీశ్వరుఁడు గిన్క, వ్యావృత్తనయనుఁడై వడిగ వడిగ
గురుని సప్తతిశితశరముల నొంచి సారథి నొక్కకోల మర్మముఖ నేసెఁ
గనలి విప్రుఁడు బృహత్క్షత్త్రునిపైఁ బెక్కు, విశిఖంబు లడరించి వెసఁ దదీయ
రథ్యముల న్నాల్గుప్రదరంబులం జించి, సూతు నొక్కటఁ ద్రుంచి కేతనంబు
తే. ఛత్రమును రెండుతూపుల జగతిఁ గూల్చి, వడిగ నొకనారసం బేర్చి వక్షమందు
గాఁడిపో నేయుటయుబృహత్క్షత్త్రుఁడవనిఁ,బడియెఁదన్నుఁ గొనుచుఁజచ్చెఁబగిలిఱొమ్ము.
వ. ఇట్లు కైకేయాగ్రజుండు హతుం డైనం గాంచి శిశుపాలపుత్త్రుం డైనధృష్టకేతుండు
సూతుం బిలిచి పాంచాలురం గైకయులం బొలివుచ్చుచున్న చాపాచార్యున కభిము
ఖంబుగఁ దేరు వోని మ్మనిన నతం డట్ల కావించుటయు నచ్చేదీశ్వరుండు పతం
గంబు పావకంబుమీఁదికిం జనునట్లు గురుం దఱియం జని. 157
చ. అఱువదివాఁడితూపులను సాశ్వరథధ్వజుఁ గుంభసంభవు
న్మఱకువ నేసి కందరమున న్నిదురించెడుబెబ్బులిం బలెం

దళిమిన నగ్గి ద్రోణుఁడును దద్ధనువుం గడికండ లై పడఁగ
దళిగ శితక్షురప్రమునఁ దద్దయు నుద్దవడిం దలిర్చుచుఁగ. 158

తే. శైశుపాలియు వేఱొక్కచాప మూని, కంకబర్హిణరాజితకాండసమితి
గురుని నొప్పించె నతఁడును శరచతుష్టయమున నాతనివాజులయడ రడంచి. 159

మ. నగుచున్ సారథిశీర్షముఁగ నఱకి మేనం బంచవింశత్యతి
ప్రగుణాజిహ్మగముల్ నిగిడ్చుటయు నారాజేంద్రుఁడుం గ్రిందికిఁగ
డిగి యుద్దండగదఁగ గురూత్తమునిపై డీకొంచు నేసెఁగ గురుం
డు గదం దుత్తుమురై పడం బొనరిచెన్ నూత్నాశుగౌఘంబునన్. 160

క. వినిహతమై గద వోయినఁ, గినుకం జేదీశుఁ డపుడు గిరిశునిశక్తిం
గొని వేసి యంతఁ దోమర,మును ద్రిప్పుచు వ్రేసె విప్రముఖ్యునిమీఁదన్. 161

సీ. ఆరెంటి నైదేసియాశుగంబుల గురుం, డల్లంతదవ్వులఁ ద్రెళ్ళ నేసి
నిశితాశుగం బొండు నిగిడించె నదివాని, మఱువుతో నెద నుచ్చి మడియఁ జేసెఁ
దండ్రిఁ జంపుట కగ్గి తత్సుతుం డడరిన, గురుఁడు కోల్చులి లేటికొదమఁ బోలె
నవలీలఁ బొలివుచ్చె నతని నంతఁగ జరాసంధాత్మజుఁడు వడిఁ జాపగురునిఁ

తే. గవిసి కాలమేఘమ్ము భాస్కరునికరణిఁ, గప్పె శరధారలం జేసి కని గురుండు
సైనికులు గనుఁగొనుచుండ శాతశరశ,తమున నాసహదేవునిఁ దఱిగి వైచె. 162

వ. ఇట్లప్రతిహతరథుం డై యాచార్యుండు గండుమిగిలి త న్నెదుర్కొన్న వారి నెల్లం బేరు సెప్పి చంపుచున్నంతఁ బాండవసైనికులు శీతార్దితంబు లగుగోగణంబుల మాడ్కి హె చ్చుడిగి తెచ్చనడియున్నం దత్సైన్యంబున హాహాకారం బెసంగె నప్పు డప్పాంచాలచేదిసృంజయకాశికోసలవీరులు దురంబున కోసరిల్లక యఱుముఁడు తఱుముఁడు నొంపుఁడు చంపుఁ డని పలుకుచు నాచార్యుం బొదివి పొదివినంతన వింతగ వేలకొలంది విగతప్రాణులై రట్టియెడ హతశేషు లీబ్రాహ్మణుం డెంత యొప్పు నితండు తనతపఃప్రభావంబునం జేసి యి ట్లిల్ల క్షత్రియుల నీక్షణమాత్ర యమక్షయంబున కంపుచున్నవాఁ, డితనిసమక్షంబున నిలువ నోప కున్నవార మని మెలుంగెత్తి భీమసేనధృష్టద్యుమ్నులం బిలుచుచున్నంత ధృష్టద్యుమ్నపుత్రుం డైనక్షత్రధర్ముం డాచార్యుం దాఁకి తదీయశరశరాసనంబుల నర్ధచంద్రాశుగంబునం దెగ నేయుటయు నతండు నన్యకార్ముకంబుఁ గొని యొక్కక్రూరనారాచం బరి వోసి వేసి క్షత్రధర్ముం ధర్మరాజాతిథిం గావించిన సైన్యంబు సంచలించె నయ్యవసరంబునం జేకితానుం డనూనదర్పోద్ధతుం డై ద్రోణుం దాఁకి. 163

తే. పదిశరంబు లురంబునం బడఁగ నేసి, నాల్గువిశిఖంబులన్ సూతు నవయఁ జేసి
మఱియు నాల్గమ్ములఁ దురంగమముల బడలు,పడ నొనర్చె జనుల్ మెచ్చ వడి గడించి.
మ. అలుకం ద్రోణుఁడు వాని దక్షిణభుజం బాడం బదాఱమ్ము లు
జ్జ్వలశక్తిం బరఁగించియుం మఱి పదార్వాలమ్ములం డెక్కెమున్
నలి గావించి నియంత నేడిషువులన్ జా నేయుఁడున్ వాహనం
బులు మార్మోమయి క్రేళ్లువాఱ సరదంబున్ బొప్పకొంచున్ వడిన్. 165
వ. ఇట్లు చేకితానునోడించి చేదిపాంచాలసృంజయసేనలం గనుపుగొట్టుచు నాచార్యుం డెనుబదియేనేఁడులవాఁ డయ్యుఁ బదియాఱేఁడుల బాలునిలీల రణకేళిం దేలుచున్నంత నెల్లసైన్యంబులును వజ్రహస్తుం డనుభయంబునం బాఱం జొచ్చి రప్పు డప్పాంచాలుం డక్కటా యిక్కఠినాత్ముండు శార్దూలంబు క్షుద్రమృగంబులంబోలె ని ట్లిందఱ రాజుల ప్రమందించుచున్నవాఁ డింతకును దుష్టాత్ముం డగుదుర్యోధనుండ మూలంబు వానికి నధోగతులు సిద్ధం బని పలుకుచుం బార్థివులం బురస్కరించుకొని భారద్వాజుం దాఁకి పీఁకమెయిం బోరుచుండె నంత నట్లు తమసైన్యం బంతయు దైన్యంబు నొందుటయు సంగ్రామంబు రౌద్రం బగుటయుం గాంచి కౌంతేయాగ్రజుం డెంతయుం జింతించి శరణంబుఁ గోరి నలుగడం బరికించి యర్జునసాత్యకులం గాంచక గాండీవనిర్ఘోషం బాలకింపక లోకాపవాదభయంబున నయంబు పీడ వ్యధితచిత్తుండై తత్తఱం పడి తనమనంబున. 166

—ధర్మరాజు భీముని నర్జునునకుఁ దోడ్పడం బుచ్చుట—

చ. నరునకుఁ దోడ్పడం దెలిపి నా కభయం బిడఁ జాలుసాత్యకిన్
ద్వరపడి పుచ్చితిం బగఱవాహినిలోఁ జొఱ వానిజాడయుం
గర మరయంగరా దిపుడు నాయొకబెంగయ రెండుబెంగలై
నిరతము నెమ్మదిం గలఁచు నే నిఁక నెట్లు మెలంగువాఁడనో. 167
క. నరు నరయ వచ్చి శినివరు, నరయం గా నొరునిఁ బుచ్చఁ దది న్యాయమొకో
వరమతియే ధర్మజుఁ డని, ధరణీజనుల్ నన్ను దూఱఁ దలఁపక యుండ్రే. 168
తే. అర్జునుం డెట్టిఁడో నాకు నాతఁ డట్టిఁ, డరయ నేఁ బెద్దమో పెత్తి యనుప నతఁడు
త్రోచిపుచ్చక నాపంపు ద్రోణుసేనఁ, జొచ్చె వారాన్నిధిం జొఱ నొచ్చునట్లు. 169
ఉ. అల్లదె పీనులం బడు మహారవ మచ్చొట నాహవం బగుం
దెల్లము ప్రాప్తకాల మగుదెంచె వృకోదరు నందుఁ బుచ్చి నా
యుల్లమునందు శాంతిఁ గొని యుండెద నాజగజెట్టి యెంతయుం
జెల్లినవాఁ డసాధ్యములు చెప్పఁగ నెప్పుడు లేవు వానికిన్. 170

మత్త. వానిబాహుబలంబునన్ వనవాసముం దొకసేగియున్
గాన క్షేము సుఖంబు గంటిమి కౌరవాళికిఁ గాక బా
హానిరస్తవిపత్పయోనిధి యైనభీముఁడు తోడ్పడన్
మానరుండును సాత్వతుం డని మల్లడింత్రు సనాథు లై. 171

ఆ. విజయునకును వృష్ణివీరునకుం గృష్ణు ప్రాపు గలదు దానఁ బోఁడిమి చెడ
[illegible] గలదు [illegible] నాతిగుల్, [illegible] భీము వారకడకు. 172

క. అా [illegible] భీమసేనుఁ [illegible]
డిగి [illegible] విధ్యులయు [illegible]
దు గc [illegible] విష్ణు [illegible] వానిం [illegible] యిట్ల
క. వినిహాత ఆ. తనకుఁ దోడు లేక [illegible] ము [illegible]
గొని యే నట్టి వాఁడు నీదు [illegible], [illegible] బసిదు నాఁగఁ [illegible]

సీ. ఆరెంటి [illegible]
నినీ [illegible] యుంట విచిత్ర మ [illegible]
[illegible] దేత్తు [illegible] లుం
డిన నినుఁ దేర్తు రెవ్వరు కడింద విచార మి దేల చెప్పుమా. 175

మ. నను శాసింపుము లెమ్ము నే నిపు డిటన్ గావింపఁ గా నొప్పిన
ప్పని దా నెట్టిది యైనఁ జేయుటకు నీభర్తృం డితం డుండఁ జెం
త నసాధ్యం బయి కార్య మేదియును నుండం బోవ దీవీనికిన్
వనఁటన్ వీఁగి యనుజ్ఞ నిమ్మన ననెన్ సర్వంబు నా నూర్చుచున్. 166

మత్త. వాసుదేవునిపాంచజన్యరవంబు వచ్చెదు హెచ్చి యే
దోస మయ్యెనొ నీదుతమ్ముఁడు దుంగసంగరరంగమం
దోసరిల్లక వాసుదేవుఁడె యోపి పోరెదు నాఁగ నై
గాసి నొందెదునాదుడెందము కాదు నాక భయంబునన్. 177

తరళము. సురల కింద్రుఁడువోలె నారణశూరుఁ డేడ్గడ పాండుభూ
వరకుమారుల కెల్ల రాతనివాసినే మనుచుండి రో
పరభయంకర వాఁడు నేఁ డనిఁ బట్టి సైంధవుఁ గొట్ట ము
ష్కరబలంబునఁ జొచ్చె వింటిమి గాని వచ్చుట వింటిమే. 178

మత్త. శ్యామసుందరగాత్రుఁ డాతఁడు సర్వశాత్రవ కోటికిన్
భీమవిక్రముఁ డున్న తాంసుఁడు వీరలోకసువిశ్రుతుం

డామనోహర తామ్రనేత్రుఁ డనంతకీర్తియు శేగుశే
నామదిం బెగడొందఁ జేయుచు నాటి కారణ మయ్యెఁ బో. 179

ఆ. అతనిగుఱుతు తెలియంగ నంచితి సాత్యకి, వానిగుఱుతు తెలియరాని దయ్యె
వారికుశల మెఱుఁగఁ గోరినసే నెడ,రెంచి యింత చింత కిట్టు లైతి. 180

తే. ఆజ్యమున వేల్వ మండెడునగ్ని వోలె, బగ్గు మని మండుచుండె నాభావ మిపుడు
నరునికంటెను మునుమున్న హరియనుంగు,ననుజుకుశలం బెఱుంగ నేనభిలషింతు.

ఉ. అన్ననుడిం బ్రవర్తిలెడునట్టిఁడ వేనియు సత్యవాదివే
నన్నది కాదు నాక యిపు డానరసాత్యకు లున్నచోటికిం
న్నన నేగి నీవు కుతుకంబునఁ దత్కుశలం బెఱింగి య
న్నతసింహనాదమున నొప్పఁగఁ జెప్పవె నాకుఁ దమ్ముఁడా. 182

వ. భీమసేనుం డన్న కి ట్లనియె. 183

ఉ. మును బ్రహ్మాదులకుం జయం బొసఁగ నై పొల్పొందునాస్యందనం
బున దీపించెడుకృష్ణపార్థులకు నెప్డుం నేగి రాఁ బోవ దై
నను నీయానతి నాదలం గొని చనన్ నాచిత్త మాయత్త మ
య్యె నిమేషాంతరమంద వారికుశలం బే నీకు నర్పించెదన్. 184

క. అని ధృష్టద్యుమ్నుం బిలిచి నృపాజ్ఞం దెలిపి వీరశేఖర రాజుం
గొనఁ జేసినగురుప్రతిన, విని యెఱుఁగుదు వీవు మరల వినఁ బని గలదే. 185

ఆ. నాకు రాజరక్షణముకంటె నటఁ బోక, 'సముచితంబు గా దసంశయంబ
యయిన నన్నమాట క డ్డాడ నోపక, యియ్యకొంటి దాని కెట్టకేని. 186

తే. పోయి వచ్చెద విభునిచ్చపొంటె సైంధవుని వధించెడుచోటి కీమనుజవిభునిఁ
గాచుపని యెల్ల నీమీఁదఁ గలదు మనకుఁ,బరమ మన్నిటికంటె నప్పనియ సూవె.

వ. అనిన ధృష్టద్యుమ్నుండు వృకోదరుం దిలకించి యి ట్లనియె. 188

క. నీకోరికి నేఁ దీర్చెద, నీ కిక్కడిచింత వలదు నెఱి నరుగుము నీ
వాకడకు గురుఁడు మనదొరఁ, గైకొనునట్టి ముక్కు నావి గలవీఁ దుండన్. 189

—భీమసేనుం డన్నపంపున నర్జునునికడకుం బోవఁ బయనం బగుట—

వ. అనిన నాఁగాఁత మని ప్రీతుం డై వాతాత్మజుండు ధృష్టద్యుమ్నుని కగ్రజు నిల్లడ
వెట్టి తా నాతనిపాదారవిందంబుల కభివందనంబు గావించి తదాలింగనాశీర్వాదం
బులు వడసి వేదవిప్రులకుం బ్రదక్షిణనమస్కారంబు లర్పించి తత్కృతస్వస్త్యయనుం
డై యష్టమంగళంబులం బరిగ్రహించి కైలాతకమధుపానంబున రక్తాంతలోచనుం

డును ద్విగుణీకృతసత్వుండును నై యనుకూలశీతవాతంబుల కలరుచుఁ గటకకుం డలకేయూరాదిభూషణభూషితుం డై యుత్తమతనుత్రాణతలత్రాణకంఠత్రాణశిరస్త్రాణంబులం ధరించి సితాసితపీతరక్తోత్తమవస్త్రధారణంబు గావించి ప్రయాణోన్ముఖుం డై నంత మరల మురాంతకునిపాంచజన్యరవంబు నాలించి పాండవాగ్రజుండు భీమ సేనుం బిలిచి యి ట్లనియె. 190

చ. పృథివియు నంతరిక్షమును బీటలువాఱఁగఁ జేయుచుండె నీ
పృథులవిరావ మారయఁగ వృష్ణివరేణ్యునిపాంచజన్య మో
పృథుబల ఫాల్గునుం డెడయఁ గృష్ణుఁడె చక్రము పూని పోరునో
పృథయు సుభద్రయుం బ్రజలు నెట్టిమహాపద విందురో కదా. 191

తే. తడయ కో భీమ! భీమ! నీ వెడ రెఱింగి, యొయుదు మొద్దుము భీభత్సునియు శినిప్ర
వీరునియు కుశలంబును వినినదాఁక, నంధ మైనట్టు లుండె నా కఖిలజగము. 192

వ. అని వేగిరించినన్ భ్రాతృప్రియకరుం డైనభీమసేనుండు బద్ధగోధాంగుళిత్రాణుండును బ్రగృహీతశరాసనుండు నై విశోకానీతంబును వాతవేగతురంగోహ్యంబు నయినమహారథం బధిష్ఠించి సింహనాదంబు చేసి శంఖంబు పూరించి నారి సారించి మనవారి గుండియ లవియించి ఘోరాకారుం డై సేనాగ్రంబు సేరునంత సోమకపాంచాల సైనికులు పెక్కం డ్రతని కనుయాయు లై రప్పుడు నీకొడుకులు దుశ్శలుండును జిత్రసేనుండును గుండభేదియు వివింశతియు దుర్ముఖుండును దుస్సహుండును వికర్ణుండును శలుండును విందానువిందులును సుముఖుండును దీర్ఘబాహుండును సుదర్శనుండును బృందారకుండును సుహస్తుండును సుషేణుండును దీర్ఘలోచనుండును నభయుండును రౌద్రకర్ముండును సువర్ముండునుదుర్విమోచనుండును ననువారు భూరిసేనావారంబుతో భీమసేను నడ్డగించి ప్రభానూలి మేఘజాలంబునుంబోలె నానావిధాస్త్రశస్త్రంబులు నిగిడించి ముంచుటయు నతండు మృగేంద్రుండుక్షుద్రమృగంబులంబోలె వారి శరంబుల వారించిన వా రాచార్యునిమఱువు సేరి రంత నంతకాకారుం డై మారుతి మాతంగానీకంబుల పయిం బడి మడియించుచు ద్రోణానీకంబు సొచ్చి నీరువామిం జొఱ సించుకొనిపోవునట్లు పోవం జొచ్చె నట్టియెడఁ గుంభసంభవుండు మహాసంరంభంబున వేల కల్లోలినీనాథునింబోలె శరజాలంబున వాతూలనందను నాఁగె. 193

—భీముఁడు ద్రోణాదుల ధిక్కరించి యతిక్రమించుట—

ఉ. వాసి లలాటదేశమున వాలికతూ పొకఁ డూని నాటఁ గా
నేసినదాన నూర్ధ్వవిశిఖేద్ధదివాకరుఁ డో యనంగ నై

తే. తెగువమెయిఁ గుండభేదిని దీర్ఘనేత్రు,నభయునిసుషేణు బృందారకాఖ్యు దుర్వి
మోచనుని రౌద్రకర్ముని మూఁడు మూఁడు, వాఁడితూపులఁ జానేసి వరుస వెట్టి.

మ. అనుజన్ముల్ వడఁ జూచి యేచి వడి దివ్యాస్త్రంబులన్ వీఁడు ద
య్యనువిందుండు సుదర్శనుండును సువర్మాభిఖ్యుఁడుం భీమసే
నుని నోనేసిన నవ్వుచుం బవనసూనుం డుద్ధతి న్నల్వురం
గనుచుండం గడతేర్చి యార్చి తఱివెన్ గౌరవ్యసైన్యావళిన్. 205

ఆ. పులికి లేళ్లు వాఱుపోలిక చీలిక, లగుచు భీముబాఱి కగడు గుడిచి
సీకుమారు లెల్ల నిలువ నోపక పాఱి, రనికిఁ గాక యోల మానఁ జేసి. 206

—భీమసేనుండు సేనలం జించుకొని పోయి యర్జునుం గలియుట—

వ. ఇట్లు నీవారిం గెలిచి సమీరసూనుండు సింహనాదంబును శంఖనాదంబును గావించి బాహుశబ్దంబును దలశబ్దంబును జేయుచు రథానీకంబు వెన్నంటి తఱుముచు ద్రోణానీకంబుఁ జొరఁ బాఱుటయు నాచార్యుండు శౌర్యంబునం జేసి యేయుశరపరం పరలకుం దెరలకకురుకుమారులం బాఱిసమరుచున్నంత సుయోధనచోదితులై తల పడిమహాయోధు లెల్లరు నవ్వడముడిం జుట్టుముట్టి బిట్టేయుటయు గండరగండం డాతండు గండుమిగిలి గదాదండంబున వారి నెల్లరఁ గాలదండంబున దండధరుండునుం బోలెఁ గాలధర్మంబు నొందించుచు విక్రమించి గరుడవేగంబునఁ గౌరవసేనం గడచి పోవుచున్నం గని భారద్వాజుండు. 207

చ. తలపడి బాణవర్షమునఁ దద్రభసం బుడిగించి పాండవే
యులకు భయంకరంబుగ మహోగ్రరవం బొనరించి మున్మనం
బిలుకురఁ జేయుచుండెఁ బెరవీరుల వేలకొలందిగా రణం
బలఁతి యనంగ రా దతిభయానకమై తగె నంత భీముఁడున్. 208

చ. అలఁతులఁ బోలితండు పరమాస్త్రవిదుం డని తేరు డిగ్గి య
గ్గల మగు వేగముం గలిగి కైకొనియుం గద బాణవృష్టికిం
దలఁకక కన్ను మూసికొని దర్ప మెలర్పఁగ మోము వంచి ని
శ్చలముగఁ బోవుగోవృషముచాడ్పునఁ బోయెను ద్రోణుఁ డాయఁగన్. 209

ఉ. పోయినపోకనే రథము ముంగొన పట్టి భయంబు పుట్టఁగాఁ
జేయుచు వీచి వైచె నది చేడ్పడిఁ బోయెఁ దదంతరంబునన్
బ్రాయమువాఁడు నా నుఱికి పాఱి గురుండు మఱొక్కతేరిపై
కాయెడ నెక్కి పోయె సరయంబుగ సేనమొగంబు సేరఁగన్. 210

వ. భీమసేనుండును భీమపరాక్రమంబు ప్రవర్తిల్లం జేసి నిజరథం బధిష్ఠించి తన్ను మార్కొన్నవారి నెల్ల నొల్లఁ బోఁ జేయుచు నీబలంగంబు సొచ్చి మహామారుతంబు మ్రాఁకులం బోలె శరజాలంబులం బేరు గలవారిం గూలఁ ద్రోయుచుఁ గృతవర్మగుప్తం బగు భోజబలంబు మర్దించి దాఁటి కాంభోజసైన్యంబు గం డడంచి యవల శార్దూలంబు గోవులం బోలె మ్లేచ్ఛగణంబులం దోలి లీలం జని సాత్యకిం జూచి పటురయంబునం గదలి జయద్రథరక్షకులతో నక్షీణప్రధనంబు గావించుచు ధనంజయుం గాంచి సంతసించుచుఁ బ్రావృట్కాలమేఘగర్జాస్ఫూర్జద్రవంబున సింహనాదంబు గావించిన విని వానిం గాంచి కృష్ణార్జునులును రోదోంతరాళంబు నిండ సింహనాదంబులు గావించి రట ధర్మనందనుండు నానాదంబు లాలించి సాత్యకియు నర్జునుండును గుశలం బున్నవా రని విశోకుం డై భీమసేనుసంజ్ఞాపనంబునకు సంతసించుచుఁ దనమనంబున. 211

—ధర్మరాజు భీమునిసంజ్ఞాపనంబునకు సంతసించుట—

చ. గురువచనం బమోఘ మయి కూడఁగఁ జేసితి భీమసేన నీ
సరి యగుయోధు లీధర నెసంగరు నిన్నాదరించువారు నే
రరు గెలుపొంది నీకతనఁ బ్రాణము స్వాస్థ్యము నొందెఁ గృష్ణసో
దరుఁడును జిష్ణుఁడున్ సుఖపథంబున నుండుట వింటిఁ దద్రుతిన్. 212

వ. అని మఱియును. 213

సీ. శతమన్యుముఖులతోఁ సమరంబు గావించి ఖాండవం బేర్చినఘనభుజుండు
కాలకేయనివాతకవచులఁ బరిమార్చి సురల మెప్పించినవరయశుండు
గోగ్రహణంబునఁ గురువీరులం గెల్చి, విరటునిఁ గాచినవిజయశాలి
దుర్యోధనునకుఁగాఁ దొడరి గంధర్వుల, ననిలోనఁ గెలిచినయట్టి జెట్టి.
తే. కుశలి యై యుండె నాతమ్ముకుఱ్ఱ వాని, బాహుబలమున మే మెల్లఁ బ్రబలి యుంటి
మతఁడు సుతశోకసంతప్తుఁ డై సలిపిన, ప్రతిన నెఱవేర్చి రాఁగ నే మతి యొనర్తు.

క. హరిరక్షితుఁ డగునరుఁ డయ్యరి సైంధవుఁ బ్రొద్దు గ్రుంకునాలో మడియిం
చి రహిం జనువెంచి కదర్, హరుసము నా కొసఁగుఁ గాత మని యర్థింతున్. 215

తే. సైంధవుండును దమ్ములు హతులును, 'జచ్చుటన్ విని శమ మొంచి సంధి చేసి
కొని సుయోధనుఁ డున్నయిజ్జనుల నైనఁ, గాచి బ్రతికించుకొన నెంచఁగలుగునొక్కొ.

వ. అని కరుణాతరంగితాంతరంగుం డగుకౌంతేయాగ్రజుం డెంతయుం జింతించుచున్నంత సంగ్రామంబు భీమం బయ్యె ననినన్ ధృతరాష్ట్రుం డట్లు మాఱు మలయువారు లేకవక్రవిక్రమంబున సింహనాదంబు సేయుభీమసేను నాఁగి మార్కొనఁ గల

మగలు మనబలగంబులం గలిగిరే యని మఱియును. 217

చ. పడముడిబాఁతి సేరుటకు వాసవుఁ డైనను నోపరిల్లు వాఁ
డడరెడు దండపాణి కెన యై మృధమందుఁ బ్రజాక్షయంబు పే
ర్పడ నొనరించు వార్వమును వార్వమునన్ గజమున్ గజంబునన్
వడి గలతేరుఁ దేరునను బత్తిని బత్తినిఁ జేసి మొత్తుచున్. 218

క. మండెడుచిచ్చున కెత్తయి, భండనమున నడరి పూరివలె నాసుతులన్
గం డడఁగఁ గాల్చి నీ ఱయి, పిండువడం జేయువాఁడు భీముం డకటా. 219

తే. గాడ్పుచూలికి వెఱచినకరణి నేను, గృష్ణునకుఁ గాని జిష్ణున కేని గాని
యగ్నిభవునకుఁ గాని సాత్యకికిఁ గాని, వెఱవ నటు లుండని మ్మనివిధము సెపుమ.

వ. అనిన సంజయుం డతని కిట్లనియె నట్లు సింహగర్జనంబు గావించుచున్న భీమసేను
నడ్డగించి కర్ణుం డాకర్ణాకృష్టచాపుం డై పుంఖానుపుంఖంబుగా శిలాశితాశుగశత
సహస్రంబు లడరించినం గని కనలి కౌంతేయమధ్యముం డసాధ్యపరాక్రమంబున
నతిక్రమించి ప్రతిశరంబు లేయుచు నజేయుం డై పోరుచుండె నప్పుడు. 221

మ. పవమానాత్మభవోగ్రహస్తతలశబ్దంబుల్ ధనుశ్శబ్దముల్
శ్రవణద్వారవిదారణంబు లగుచున్ సంధించినన్ సర్వయో
ధవరేణ్యుల్ తనుకంపముం గలుగఁ గోదండంబు లుర్విం బడన్
జవసత్త్వంబులు వీడ నైరి విమనస్కత్వంబునం దద్దయున్. 222

క. ఱిచ్చపడి వాహనావళిఁ, గ్రచ్చఱ మూత్రంబు జార్చెఁ గంకాదిగరు
త్మచ్చయము మింటఁ బర్వెం, జొచ్చె మహోత్పాతగతులు చూడఁగ నయ్యెన్. 223

సీ. అంత వైకర్తనుం డడరి యిర్వదిమార్గణములు మారుతిమేన నాట నేసి
వానిసారథి నైదు వాలికతూపుల, నోనేసినం బవమానసుతుఁడు
నొవ్వక నవ్వుచుం ద్రెవ్వనిపగఁ గర్ణు, నరువదినాల్గింట నఱిమి యేసె
నేసినఁ గర్ణుండు నీసున న్నాల్గు ని,శాతసాయకముల సరగ విసరె

తే. వాని భీముఁడుఁ నదుద్రోవలోనఁ దుమురు,గా నొనర్చెను బాణలాఘవము మెఱసి
దానఁ గడు నల్గి కర్ణుండు వానిరథము, ముసుఁగు వెట్టె శరవ్రాతమునఁ గడంక. 224

ఉ. తూపులవెల్లి మున్గియును దొట్రిల కాపవమాననందనుం
డేపున నంగభూవిభున కేడ్తెఱఁ జూపుచు వానిచాపమున్
గోపముతోడ ముష్టికడఁ గొంచక త్రుంచి దశాంబకంబులం
జూపఱు మెచ్చ వానిమెయిఁ జుట్టఱికంబును బొందఁ జేయుడున్. 225

ఆ. ఒండువిల్లు సజ్య మొనరించి సూతజుం, డనిలతనయు నడఁచె నాశుగముల

నతఁడు గినిసి మూఁడుశితశరమ్ములు వాని, యురమునందు నినిచె నుగ్రభంగి. 226

ఉ. భూరితరత్రిశృంగయుతభూధ్రము గైరికధాతురంజితం
బై రహిఁ గాంచున ట్లపు డహస్కరపుత్త్రుఁడు రక్తసిక్తుఁ డై
తేరి చలించి యించుక ధృతిం గొని వింట నొకమ్ముఁ గూర్చి య
మ్మారుతి నేసి తోన బహుమార్గణపంక్తుల ముంచె నెంచఁగన్. 227

మ. అలుక న్నవ్వుచు నవ్వృకోదరుఁడు ధైర్యస్థైర్యమంథాద్రి యై
విలసచ్ఛాతశరమ్ములన్ రవిజుమౌర్విం ద్రుంచి తత్సారథిన్
జులకం గూల్చి తురంగమంబుల నిలన్ జోతాము వెట్టించినన్
గలఁకం దేర్దిగి కర్ణుఁ డెక్కె వృషసేనస్యందనం బందఁగన్. 228

వ. ఇట్లర్జునాగ్రజుండు దుర్జయుం డై కర్ణు నిర్జించి పర్జన్యనినదోపమం బగుమహానా
దం బెల్లనాదంబుల మించఁ గావించిన నాఖండలనందనుండు గాండీవంబు సారించె సార
సాక్షుండు పాంచజన్యంబు పూరించె నానినాదంబు విని యుధిష్ఠిరుండు సంతసించెఁ
బాండవసైనికులును దమతమచిందంబులు మ్రోయించిరి నీసైనికులు నార్తస్వరంబునఁ
దత్తఱించి రత్తఱి నర్జునుండు సైంధవుం జేర నరిగి మూఁకలఁ గనుపుఁగొట్టుచుండ
భీమసాత్యకు లాతనికిం బాసట యై బాణవర్షంబు గురియుచుండ నిజసైన్యం బం
తయు దైన్యంబునుం బొంద నీనందనుండు సందడించుచు మనోమారుతవేగంబున
రథంబు దోలుకొని ద్రోణాచార్యునిపాలికిం జని సంరంభోద్రిక్తరక్తలోచనుం డై
యడిచిపడుచు ని ట్లనియె. 229

—దుర్యోధనుఁడు ద్రోణుని దూల నాడుట—

మ. నరుఁడున్ భీముఁడు సాత్వతేయుఁడును సైన్యవ్రాతముం దోలి సం
త్వరు లై సైంధవుఁ జేరఁ బాఱి మిగులం దర్పించి నీయోధులం
బరిమర్దించుచు నున్న వార లకటా ప్రాల్మాలి నీ వాహినీ
శ్వరునిం బావని ఫాల్గునుం గలియఁ బోవం జూచుటల్ భావ్యమే. 230

ఉ. ఆదటఁ గాక యోడి తన నొ నొకొ నీ కొరు లొక్క లెక్కయే
కా దన కింద్రుఁ డెత్తిన నొకానొకయింత చలింతు వోటు నీ
వీదళ నోడుటల్ జలధి యింకుట గాదొ జగమ్ములో ధను
ర్వేదవిదగ్రగణ్యునకు వెంగలిమాట వడంగ నేటియే. 231

తే. అలఁతు లగుభీమపార్థసాత్యకులు నిన్ను, నోర్చి రనునాలివచన మీయుర్వి నీకు
నపయశంబున కగుఁ గాదె యకట నిన్ను, నే మనం గల నాభాగ్య మిట్టు లుండె. 232

తే. అకట నా నేగికే యిట్టు లయ్యె నైన,దాని కేమన్న నే మగుఁ దద్విచార

ముడిఁగి సైంధవు రక్షించునుపము వెదకి, చెప్పి చేయుఁడవు మనద్విజశ్రేష్ఠుఁ డనియె. 233

చ. వినుము నరేంద్ర చెప్పెదను వృద్ధుఁడ నోపినయంత పోరుదుఁ
దనువున గాన సేయను వృథావృథగా నను నొవ్వ నాడ నో
ప్పని బలవంతు లాముగురు పూరుషసింహులు సింహవిక్రముల్
నను గణియింప కంపఱఁ గలంచి గమించిరి మించి లోనికిన్. 234

ఆ. అఱిమఁ దఱుమ మూవు రట నిట వేనవ్వే, లేను వారి నంటి యోగుద్దైర
వీరుఁ గూడ వారిఁ జేరిన మొనలకు, నెడరు గూర్తు రగుట నిచట నుంటి. 235

క. మునువెనుకల వీరులతోఁ, డను ఘోరసమీక మిపుడు డాపుర మయ్యెన్
మన కెన్ని గతుల నేనియుఁ, గొనకొని సైంధవునిఁ గాఁచికో లుచిత మగున్. 236

క. శినివరుఁడును భీముండును, జని నరునకు బాసటైరి సైంధవుఁ డెడరు
గొనకుండఁ గాచుకొనుపని, యనుచుండఁగ జూదమట్టు లై కన నయ్యెన్. 237

ఉ. జూదపుఁగెల్పు గెల్పనఁగఁ జూడకు సౌబలునడ్డసాళు లీ
జూదమునం గిరీటికరశోభితశాతశరంబు లై భవ
న్మేదురసేన సింధుధరణీధవుఁ డొడ్డన మై మహోన్నతిం
బాదుకొనెన్ ద్వదీయులను బాయక నీ విపు డాడి గెల్వుమా. 238

ఆ. సింధురాజుదెసకుఁ జేరి మీ రెల్లరు, నోల మూస గొనక లీల నరున
కెదిరి పోరుఁ డిచట నే నుండి మిగిలిన, వారి నిలువరింతు వడిగఁ జనుమ. 239

వ. అనిన దుర్యోధనుం డనుచరసహితుం డై తన్నుఁ దాన పురికొల్పుకొని మహాసా
హసంబున జయద్రథుఁ డున్నచోటికిం బోవుచు నమ్మార్గమధ్యంబున నంతకుమున్న
కృతవర్మచే నివారితు లై మొనకెలని కుఱికి పోరుచున్న సవ్యసాచిచక్రరక్షకు లగు
యుధామన్యూత్తమౌజు లవ్వివ్వచ్చుం డున్నచో టుపలక్షించి సత్వరంబుగఁ దామును
నీసైన్యంబు పాయవడం జేసి పోవుచున్నం గని వారి నెదిరించి ప్రదరంబులం బఱపు
టయు నందు యుధామన్యుండు. 240

ఆ. మూఁడుపదులబాణములు సుయోధనునిమైఁ, జొనిపి రెండుపదుల సూతు నొంచి
వారువముల నాల్గునారసంబుల నేసి, కైవడిం దలిర్చెఁ జేవ మెఱసి. 241

వ. ఇట్లు చేసినదుర్యోధనుండు దురహంకారపరీవృతాంతరంగుం డై. 242

మత్త. ఒక్కతూపున డెక్కియంబు మఱొక్కతూపునఁ జాప మొ
క్కొక్కతూపున వారువంబుల నొక్కతూపున సారథిన్
మొక్కవోవఁగఁ జేసి త్రుంచిన మొక్కలుం డగునాతఁ డొం
డొక్కతే రపు డెక్కి యుక్కున నొప్పి ముప్పదితూపులన్. 243

తే. వెరు రెండవది సేసి నీపుత్రులకుమారు, నొవ్వఁ జేసినయంతలో నవ్విధంబె
చెంగి యుత్తమౌజుఁడు గదఁ బొంగి వాని, సారథిం జంపె బెనువాఁడినారసమున.

సీ. రాజరాజయ్యుత్తమౌజస్సుపై నల్గి, చతురశ్వముల సూతుఁ జదియ సేసె
నతఁడు హార్దిక్యుఁడు హతసూతుఁడై యుధామన్యునితేరెక్కి మానవేంద్రు
రథరథ్యములఁ గూల్చి బ్రదరంబుల న్వ్రాల్చి,గండ్రించుడు నతండు దీండ్ర మెఱయ
రథము డిగ్గన డిగ్గి ప్రథితగదాదండ,మండితహస్తుఁడై దండ కరిగి

తే. యేయ నుంకించునంత నయ్యిరువు రవని,కుఱికి పఱచిరి గుదెవ్రేటు కొఱతపడక
వారిసహావాహసారథిధ్వజరథంబు, నుగ్గునూఁచము గావించె నూలుకొనుచు. 245

వ. అట్లు చేసి నీసుతుండు మద్రరాజుతేరెక్కెఁ బాంచాలరాజపుత్రులును జైత్రంబు
లగునన్యరథంబు లెక్కి భీభత్సుం జేర నరిగి రాసంకులసమరంబునఁ గర్ణభీము
లొండొరుం దలఁపడి మత్తమాతంగంబులతెఱంగునం బోరి రనిన ధృతరాష్ట్రుండు
సంజయా!యట్లు వృకోదరున కోడి పాఱినరాధేయుండు మున్న మార్కొనియెనో
వృకోదరుండుమార్కొనెనో వారిపో రెబ్బంగిఁ బ్రవర్తిల్లెనో చెప్పు మప్పాండవా
గ్రజుం డెప్పుడును భీష్మద్రోణులం జెప్పినపిదప మహాధనుర్ధరుండు కర్ణుం డని
చెప్పుచు నబ్బయంబున రేలుం బవలు వగలం బొగలుచుండుఁ గర్ణుండు
గుంతీవాక్యంబులను స్మరించుచు భ్రాతృవాత్సల్యంబునం ఘృణి యై భీమసేనుం
జంప నొల్లండు భీముండును సూతపుత్రసముద్భవంబు లగువిప్రకారంబులఁ
బూర్వవైరము దలంచుకొనుచు నతనిం జంప నోంప నుండు మాదుర్యో
ధనుండు మందాత్ముండై పాండవుల నెల్ల నతండ జయించు నని నమ్మి వాని నాశ్ర
యించి మహారథు లగువారితోడం బోరు వెట్టుకొనియున్నవాఁడుం దనిమ్ము సహజ
కవచకుండలమండితుం డగురాధేయుం డేకరథుండై తొల్లి పృథివీతలం బెల్లఁ
దల్లడిల్లంజేసి దిగ్విజయంబు నొందినవాఁ డట్టిజగజ్జెట్టికిం గాలిపట్టికి నెట్టిచెట్టిదం
బగుపోరయ్యెనో వినవలతుం జెప్పు మనిన సంజయుం డతని కి ట్లనియె. 246

—భీమసేనుండు కర్ణాదుల నోడించుట.—

మ. విరథుండై వృషసేనుతేరిపయికిన్ విత్రస్తుఁడై సూతజుం
డరుగన్ భీముఁడు క్రీడి యున్నదెస మోమై పోవుచో వెండి స
త్వరుఁడై కర్ణుఁడు వెన్నుదన్ని శరముల్ వర్షించుచుం దాఁకి ని
ష్ఠురశబ్దం బడరంగఁ బిల్చి పలికెం జూపెట్టుడాల్ గ్రక్కఁగన్. 247

క. అనిఁ దగదు నీకు స్వర్గం,బున నైనను బార్థుఁ జూడఁ బోయెద విటు శ
త్రునకు న్వెన్నిచ్చితి విది, యనురూపమె కుంతిపుత్రు లగువారి కయో. 248

తే. బిరుదుమానిసివే నిల్లు పిఱుతివియక, నాయెదురఁ జిక్కి నిలిచి బాణములఁ బఱప
మనుఁడు విని కన్ను లెఱ్ఱసేసి యనిలతనయుఁ, డర్ధమండలగతి మల్లి యలుకఁ ద్రుళ్లి.

ఉ. కయ్యము నేఁటితో ముగియఁ గా నొనరించెద నంచు నుగ్రుఁ డై
చయ్యనఁ దీక్ష్ణశస్త్రముల శస్త్రవిదుం డగుకర్ణు నేసినన్
డయ్యక తం డవన్నియు నడంగ వడిం బ్రతి యేసి నవ్వుచున్
జెయ్యి విదుర్చుచుం బరిహసించె మహారథు లెల్లఁ జూడఁగన్. 250

క. సైఁపక భీముఁడు కోపం,బే పందఁగ వత్సదంతపృథు లాస్త్రములన్
చూపఱు మెచ్చఁగఁ గ్రుచ్చెం, దీపెత్తఁగఁ గర్ణువత్సదేశమునందున్. 251

క. తోత్రములకు ద్విపముం బలె, గాత్రము గంపిపకున్నఁ గని కర్ణునిపై
స్తోత్రాస్త్రములు త్రిసప్తతి, పత్త్రంబులు మఱియు వైచెఁ బగఱు దలంకన్. 252

సీ. వసుషేణుఁ డంతట వానివాపురముల, నైదేసితూపుల నడఁగ నేసి
యంపతుంపర భీమునరదంబునకు జాల, మమరించి ముంచి తూణార్ధమునను
మర్మభేదు లయినమార్గణంబులు చతు,ష్షష్టిసంఖ్యన్ గవచంబు వ్రచ్చి
వడముడి నొప్పించెఁ గడిమిఁ దప్ప కతండు, కడఁగి ముప్పదిరెండుకాండములను
తే. సూతపుత్రునిపై నేయఁ జూచి యాతఁ, డప్రయత్నముగా వాని నవఘళించి
పోయి పావనిపైఁ బడ సాయకప్ర,చార మొనరించె నెంతయు సమరకేళి. 253

వ. ఇట్లు రాధేయుండు మృదుపూర్వంబుగం బోరుచుండ మారుతాత్మజుండు పూర్వవైరంబు స్మరించుచుఁ గ్రోధపూర్వంబుగ శరవర్షంబు గురియుటయు నాశరంబులు పేరెలుం గిచ్చుచు నలుగడం బాఱుపక్షులకై వడిం బాఱి పావకునిఁ జేరుశలభంబుల చందంబున నాధిరథిం గప్పుటయు నప్పురుషసింహుండు రంహఃప్రచారంబున వాని నెల్ల నడంచి మఱియుం బిడుగులకుం బోనికాండజాలంబు గురిసిన నతం డాసూతసుతశరసంఘాతపూరితుం డై శలలసమూహంబునం ద్రిమ్మరునేదుమాదిరిం జూపట్టి రుధిరోక్షితసర్వాంగుండు గావున వసంతకుసుమితాశోకంబువోలెఁ జూడ నొప్పియు నొప్పి గణింపక ముప్పిఱిఁ గొని కోపోద్వృత్తలోచనుం డై. 254

మత్త. పంచవింశతిసాయకమ్ములఁ బర్వఁ జేసియు వెండి కీ
లించి యూఱును నాఱురెండు శిలీముఖంబుల మర్మముల్
నొంచి కార్ముక మొక్కతూపున నుగ్గుగా నొనరించి మే
లెంచి నాల్గిట మావులం బడ నేసి సారథిఁ గూల్చియున్. 255

ఉ. వేఁడివెలుంగురశ్ములకు వీసరవోవనివాఁడికోలలన్
వీడనివైరము దలఁచి వ్రేసె భుజాంతరమందుఁ గర్ణునిన్

గూడఁగ వ్రాలె యమ్ము లవి క్రొవ్వినతత్తనువుం బగిల్చి కీ
లూడినబొమ్మలట్లు పడె నుర్వికి నార్వఁగ సర్వసైనికుల్. 256

క. అరసాఱ వచ్చి దానఁ, విరథుం డై వికలుఁ డగుచు వెఱచఱచి వెసన్
బురుషాభిమాని కర్ణుఁడు, పరువము సెడఁ బఱచె నొందుకలనికి నధిపా. 257

చ. అనవుడు వాంబికేయుఁ డను నక్కట నమ్మినబంటు కర్ణుఁ డి
య్యనువున నైన నాతనయుఁ డారసి యుండియు నేమిగాఁ దలం
చెనొ ఖలుఁ డుండ ని మ్మనఁ జెప్పము మండెడునిప్పవోలె నుం
డినబకవైరినిం జెనయఁ డే కద సూతజుఁ డక్క టక్కటా. 258

వ. అని యడిగిన సంజయుండును. 259

—కర్ణుండు విజృంభించి భీమసేనుం దాఁకి ఘోరయుద్ధంబు సేయుట—

మ. విరథుం డై వసుషేణుఁ డ ట్లరిగియుఁ వేఱొండుతే రెక్కి స
త్వరుఁ డై వచ్చి సమీరనందనునిపై వాలమ్ములం గుప్పినం
బరమానందము నొంది నీతనయు లావాతాత్మజు న్వహ్నికిన్
బర మైనట్లుగ నెంచి యార్చిరి తలధ్వానం బనూనంబుగన్. 260

వ. అయ్యవసరంబున సూతపుత్త్రానిలపుత్త్రు లిరువురునుం బోదివి పరస్పరజయంబుఁ గోరుచుం గ్రోధరక్తేక్షణు లై మహోరగంబులమాడ్కి నిడూర్చియు శార్దూలంబుల లీల సంరంభించియు శ్యేనంబులచాడ్పున శీఘ్రగాము లయ్యును శరభంబులతెఱఁగున గ్రోధించియు నెక్కువతక్కువలు లేక వీఁకమెయి నే ట్లాడుచున్నంత హిడింబాంతకుండు నీవు లక్కయింటం బెట్టి చిచ్చు వెట్టించుటయు సభామధ్యంబున దుశ్శాసనుండు ద్రోవదిం గొప్పు వట్టి తిగిచి చీఱ లొలిచి పరాభవించుటయుఁ గర్ణుండు నప్పరమపతివ్రతం జూచి నీపతులు గొడ్డుపోయి నరకంబునం బడిరి నీ వొండొక్కపతిం బరిగ్రహింపు మని పరుషంబు లాడుటయుఁ దా మరణ్యంబునకుం దరలునెడ నీకొడుకులు నీసమక్షంబునఁ బ్రల్లదంబులు నలుకుటయు దుర్యోధనుండు కృష్ణాజినపరిధాను లైనవారిం దృణీకరించుటయు మున్నగునెగ్గులం దలంచి తాము దురోదరంబునందును వనంబులందును విరాటనగరంబునందును బొందిన దుఃఖంబుల స్మరియించియు నాఁటితో దురంబునకుఁ గథావశేషంబు గలుగఁ జేయ నెంచి శంఖంబు పూరించి చాపంబు సారించి యోలం బాసింపక భాస్కరకిరణంబుల కెడ గలుగకుండఁ గాండజాలంబులఁ గర్ణునరదంబు ముసుంగు వెట్టిన నతండు శిలాశితంబు లగు సాయకంబుల వాని నెల్లం ద్రెళ్ళ నేసి భీమసేనుం దొమ్మిదివాలమ్ముల నొవ్వ నేసిన నవ్విలుకాడు సిళ్ళు సూపినమదేభంబురీతి నై సూతపుత్త్రునిశతాంగంబుపై బడం

బెన్వడిం బఱతెంచె నంత నాధిరథియును గ్రోధించి వారణంబు వారణంబునుంబోలె మారుతి న్నార్కొని మహావాతోద్ధూతమహార్ణవంబుభంగి సేనాంగంబు సంచలింప భేరీశతసహస్రసమస్వనం బగుశంఖంబు పూరించుటయుం గాంచి భీముండు భీమపరాక్రమంబున నాక్రమించి శరాసారంబు సంతతప్రసారంబుగఁ బఱఁగించిన మించి వైకర్తనుం డార్తిం బడక ప్రతిశరంబుల నరిశరంబుల వారించి వడముడిగుఱ్ఱంబులతోఁ దనగుఱ్ఱంబులు దాపింపఁజేసి హాహాకారం బెసంగఁ గసిమసంగి పుంఖానుపుంఖంబుగ సువర్ణపుంఖితనిశాతసాయకంబుల సామీరిం గప్పి దెప్పరంబుగఁ బోరఁ దొడంగ నప్పుడు వా రన్యోన్యప్రయోగోపసంహారంబులంజేసి యేసినశరపరంపరల నభంబు మహోల్కాజాలసంభృతం బయినట్లు గప్పవడియె నప్పట్ల యమరాష్ట్రోపమం బగు నాఘోరాయోధనంబు కృష్ణార్జునులు సూచి కర్ణునితోడిపోరు భీమున కతిభరం బగు నని తలంచిరి సైనికులును దచ్ఛరపాతంబుల కోర్వఁ జాలక దవ్వుదవ్వులం జని చూచుచుండిరి రణరంగం బంతయు శతాంగమాతంగతురంగమనుష్యాంగసంఘసంభరితం బయ్యె ననిన వైచిత్రవీర్యుండు సూతపుత్త్రుం గాంచి యి ట్లనియె. 261

మ. సురలందొట్టి నరాసురేంద్రుల ననిం జూచాయ గెల్వంగఁ జా
ల్వరశస్త్రాస్త్రవిదుండు కర్ణుఁ డిటు లావాతాత్మజుం దాఁకి సం
గరమం దోడుటవిస్మయంబునకు నై కన్పట్టు నాచిత్తమం
దు రహిం బీడఁగ నయ్యె నే మనఁగ నేతుం దయ్యపుం జెయ్దికిన్. 262

ఉ. పోటుమగండు కర్ణుఁ డని బుద్ధిఁ దలంచి సుయోధనుం డనిన్
మేటులఁ బాండవేయులను మించి జయించెద నంచు నెంచె నే
నేటికి మాటలాడ నిపు డి ట్లగుప్రాణదురోదరంబు నాఁ
బాటిలుకయ్యమందుఁ గురువంశము నష్టము గాఁ దలంచెదన్. 263

మ. కలనం బాండవులన్ జయించుటకు నాకర్ణుండు సాలండు నీ
పలు కెన్నేపరు లీతఁ డోడుటయు నాపాండుకుమారాలపు
త్రుల గెల్పొందుటయు న్వచించెడిని వారో యింద్రముఖ్యామరా
వలికే నోడరు మందబుద్ధి యగుమావాఁ డే మెఱుంగం డహో. 264

తే. తేనెపెఱ నాసచేసినతెరువరి భృగుపాత మెఱుఁగనియట్టు లప్రాజ్ఞుఁ డైన
నాసుతుండు పార్థివార్థముల్ మోసఁజేసి,కొని జయించితి ననుఁ జేటు గనక మదిని.

శా. నేనున్ ధర్మమెఱింగియుండియు సుతస్నేహాభిజాతుండ నై
సూనుం డాడిన దాటగా నడిచి సంశుద్ధాత్ము లావారికిం
గానం జాలక చేసితి న్నికృతి నాకౌంతేయుఁ డెంతే వడిం

గదిసి నవాంబకంబులను గాడుపుపట్టిమొయిక్ నిగిడ్చి యె
న్మిదివిశిఖంబు లశ్వములమీఁదఁ బడ న్వడి నేసి సూతు నా
ర్పిదరముల న్నొగిల్చి తిగభల్లములన్ సిడ మేసె నీసునన్. 276

క. వడముడి క్రుద్ధుండై వ్రేల్మిడి నొకపాటునన వానిమిత్తి మొగమునం
బడఁ జేసె సూతహారు ల,య్యెడలో నడినంజు డగుచు సంగిట్టి కొమరన్. 277

వ. ఇట్లిలం బడి విలవిలం దన్నుకొనుచుం జచ్చిన దుర్జయుం దిలకించి కర్ణుండార్తరవం
బున నేడ్చుచు వాని వలగొని వచ్చుచున్నం గని భీమసేనుండు వాని విరథుం
జేసిన నతం డొండొక్కతే రెక్కి పాండవుం దాఁకుదెంచుటయు వారిపోరు
విషాణాగ్రంబుల వేదండంబులకుం బోలె విస్తరిల్లె నప్పుడు కర్ణుండు. 278

ఉ. అమ్ములవెల్లి ముంచి పవనాత్మజుపేరుర మూరియాడఁ గా
న మ్మొనకఁ జేసి యార్చుటయు నార్చినఁ గోపపరీవృతాంతర
గమ్మునఁ బేర్చి భీముఁడును గర్ణునిపై వడిఁ దూపు లేసియున్
గొమ్మనఁ గ్రుచ్చె నెండియు నెఱు గలయిర్వదినారసమ్ములన్. 279

సీ. కర్ణుండు తొమ్మిదికాండంబులన్ వాయుతనయునురంబాడఁ జన గ నేసి
యొకతూపునన్ ధ్వజ మూఁగించి యర్వది,యమ్ము లాతనితేరునందు విసరి
స్వాశ్వముల్ నాకుచుఁ జేవురింపఁగఁ గనుల్,శతకోటి కేనవచ్చు శితశరంబు
దిగిచి యేయుడు నది తీవ్రపాతంబునఁ, బావనివేఁ ద్రెచ్చి పడియెఁ బుడమి
తే. నంతటన్ గ్రోధతామ్రాక్షుఁ డగుచు గాడ్పుకొడుకు నాలుగుమూర్ధలపొడుగు గలిగి
కాలదండోపమం బగుగదను వైచి, యాధిరథిగుఱ్ఱములఁ జదియంగఁ జేసి. 280

క. తడయక తోడ్తో వడముడి, గడకం గొని కత్తివాతికాండంబులు రెం
డిడి సిడము దునిమి సూతుం, బడ నేసెన్ శితశరాళిఁ బరఁగించి వడిన్. 281

వ. హతాశ్వసూతంబును బతితకేతనంబు నైనశతాంగంబు విడిచి రాధేయుండు పుడ
మికిం డిగ్గి కోదండజ్యాఘోషంబు గావించి ప్రజ లచ్చెరువడి మెచ్చుచుండ విచ్చ
లవిడి శరవర్షంబు గురియుచు నరి వారించె నపుడు దుర్యోధనుండు దుర్ముఖుం జీరి
రాధేయునకుఁ దోడ్పడం బంపుటయు నక్కుమారుండు త్వరమాణుం డై కర్ణునకుం
దలకడచి భీమసేను సాయకాసారంబున నావరించుటయు నాతండు సూతపుత్రపద
నుగుం డగువానిం జూచి యేచినక్రోధంబున హర్షించి ధర్షించు మఁ గర్ణునకు మా
ర్చేసి వారించుచు సుముఖమ్ము లయినతొమ్మిదిశిలీముఖమ్ముల దుర్ముఖుం గిట్టించి
యమక్షయంబునం బట్టంబు గట్టుకొనం బుచ్చె నంత గర్ణుండును. 282

ఉ. నెత్తురువఱ్ఱునన్ మునిఁగి నేలపయిం బొరలాడుచీనుఁగుల్

జిత్తము తత్తఱింపఁ గని చేయున దెద్దియు లేక కన్గవన్
మొత్తము లశ్రుబిందువులు ముంప ముహూర్తము మాత్ర ముండి యు
ద్వృత్తుఁగ వానితేరిపయి కెక్కి చలించెఁ బ్రదక్షిణించుచున్ 28

క. దుర్ముఖునిరథం బెక్కియుఁ, గర్మఠుఁ డగునతఁడు చేతఁ గలకృత్యంబున్
నిర్మలమతిఁ గనఁ జాలక, మార్గణయుఁడు శత్రు వేచి మార్కొనుచున్నన్. 28

మ. బకవిధ్వంసియు సం దెఱింగి యశనిప్రాయంబు లై మంటసా
యకముల్ విష్టసంఖ్య నేసె నవి యుగ్రాకార మేపారఁ బా
యక రాధేయునిమేన్ వగిల్చి చని నిండారంగ నెత్రాసు కొం
డొకలోనన్ వెలివచ్చి చొచ్చె భువి సర్పౌఘంబు పుట్టం బలెన్ 28

ఆ. తలఁక కంగవిభుఁడు దాను జతుర్దశ, శరము లనిలసుతునిసవ్యభుజము
వ్రయ్య నేసె. దాన రక్తసిక్తాంగుఁ డై, కన్ను లెఱ్ఱఁ జేసి గాసు పట్టి. 28

క. వాఁడి గలమూఁడుతూపుల, గాఁడంగా గర్ణు నేసి కని సూతుపను
నేడింటఁ బొడిచెఁ గర్ణుఁడు, పోఁడిమి చెడి విహ్వలించి పోయెం దొలఁగన్. 28

చ. అనవుడు నాంబికేయుఁ డను నయ్యొ తలంపఁగ దైవమే పరం
బనియును బౌరుష మ్మది నిరర్థకమే యనియు న్మనంబు సం
కనుఁగొన వచ్చెఁ బాండవులఁ గర్ణుఁడు గెల్చుట కల్ల మాసుయో
ధనుఁడు జయంబు మాకు యగుఁ దప్పదను న్మదిఁ గర్ణు నెంచుచున్. 28

క. బలవంతుఁ డతఁడు వానికిఁ, దుల వచ్చినజోదొకండు [illegible] ఘనఁ బా
గుల గెలుచు టెంతపని యని, పలుమాఱు వచించు నాదుఃఖసరమందున్. 2

తే. బవరమం దోడి పాఱినవాని సరసి, మఱఁదుఁ డాకొడు కిపు డేమి యనునొ మిడు
నగ్గిలో వేసినట్టు లయ్యానిలసుతుని, కగ్గముగఁ జేసె దుర్ముఖు నక్కటకట. 29

వ. కృపాశ్వత్థామశల్యాదులు నాగాయుతబలుం డగునాభీమసేనునపరాక్రమం బెఱింగి వారు గావున నోల మాసించి వానిమునుముసం బడ భయంపడుచుఁ దొలం యుందురు గాని చలంబున బాహ నొల్లరు కర్ణుఁ డొక్కరుం డొడయుం బోక పెన గుచున్నవాఁడ కాని వాని జయింపఁ జాలండు చాలినవాఁ డొక్క లేఁ డాకర్ణింపుము. 2

సీ. ఆచార్యు మర్దించి యరిసేనఁ జొచ్చిన, బకవైరి నెదిరించి బ్రదుకు నెవఁడు
జముపీటి కేగినజనుఁడు మరలి వచ్చెఁ, బావనిమొనఁ బడి బ్రదికి రాఁడు.
పావనిముసుముసం బడిన వా రందఱు, మడిసి రగ్గిం బుడుముడుత లట్లు
కురుకుమారుల నెల్ల గూలుతు నని సభం, బలికినభీమునిపలుకు సెల్లెఁ

తే. కర్ణు నోడించుభీమునిఁ గాంచి దుస్ససేనుఁ డనుజులతో మర్లెఁ గాని యనికి
మొనయఁ డిట్టిర నమ్మి నాతనయుఁ డేమ, పాండవుల గెల్తు మని పల్కుచుండు నకట.

చ. అని మొన నట్లు భీమునకు నాఱడిపోయినకర్ణుఁ జూచి నా
తనయుఁడు నాఁడు కృష్ణునుడిఁ దా వినకుండుట నిట్లు వచ్చె నం
చను వఱి క్రాఁగకుండునె కటా తనతప్పన నిట్లు ముప్పు వ
చ్చెన యని దుఃఖితాత్ముఁడయి చేష్టపడి పోవకయుండఁ డిత్తఱిన్. 293

వ. మఱియు నిప్పు డప్పాండవపాంచాలకేకయసాత్యకులు తమప్రాణంబులకుం దెగించి పోరుదు రింక నాకొడుకులజీవితంబు సెల్లినట్ల కదా యనుచున్న వైచిత్రవీర్యుం గాంచి సంజయుం డిట్లనియె. 294

చ. వగచెద విప్పు డిప్పగిది వందుర నేమి ప్రయోజనం బొకో
తగిలినదీని కంతకు నెదం దలపోయఁగ నీవ మూల మై
తగితివి పుత్రు లాడినవిధంబున నై పగ దెచ్చుకొంటి వే
వగ నెవ రెంత చెప్పిన రవంత చెవిం గొన వైతి వక్కటా. 295

ఉ. తా నదనంత నే విషము త్రావి వికారము రాఁగ నేడ్చినన్
దానఁ బ్రయోజనం బగునె తప్పుల మిప్పుడు పక్వ మై నినుం
బూనును గాదె కాదనినఁ బోవునె చేవకొలంది పోర్కానం
గా నగు జోదులం దెగడఁ గైకొనుచొప్పది నీకు నొప్పునే. 296

—భీమసేనుఁడు దుర్మర్షణప్రభృతులఁ బిలుకుమార్చుట—

వ. రిత్త వాపోక ప్రథనప్రకారంబు సెప్పెద నాలకింపు మట్లయిన సూతపుత్రునోటమి సైరింపం జాలక నీకొడుకులు దుర్మర్షణుండును దుస్సహుండును దుర్మదుండును దుర్ధరుండును జయుండును నను వారు కర్ణునకుం బాసట లై భీమసేనుం జుట్టుముట్టి బిట్టేయుచున్నం గని కర్ణుండును వారిం దలకడచి శిలాశితంబు లగువిశిఖంబుల వర్షించుచున్నంత వారును వాసవప్రాపునం బ్రబలి వాయునందనునిపైఁ దీవ్రనారాచంబులం బ్రయోగించి రంత బకాంతకుండును. 297

క. ఏపుర నేనే నమ్ములఁ, బోవంగానీక పెనఁగి పొరిపుచ్చిన వా
రావగ నేలం ద్రెళ్లిరి, వాపురములతోడ సూతవర్గముతోడన్. 298

ఆ. కర్ణుఁ డేయుతూపుగముల ఖడించి తద్రథము మునుఁగు వెట్టి ప్రదరసమితి
నీయనుంగుసుతుల నేయుభీమునిపరాక్రమము మెచ్చఁ జేసె ఖచరవరుల. 299

క. తనకన్నులయెదుర న్మేదినిఁ గూలిననీదుసుతులఁ దిలకించి కడున్
వనరెన్ వసుషేణుం డదె, తనచేసినతప్పు గాఁగఁ దలఁచుచు నెడఁదన్. 300

క. తఱి వేచి భీముఁ డెంతయుఁ, గఱ కగునమ్ములను దిగిచి కర్ణుపయిఁ బడం
బఱపుటయు నాతఁ డలుకన్, మఱి కాజగజెట్టిఁ బట్టి మార్కొని యంతన్. 301

ఉ. ఏనుశ్శరమ్ము లేసి కడు నేడ్తెఱ నూపుచు నేచి వెండియుం
బూనిక డెబ్బదమ్ము లరివోసి యురం బడలింప నమ్మరు
త్సూనుఁడు నూఱుబాణముల సూతసుతు న్నొగిలించి త్రోపుతో
నేనిట మర్మముల్ చిదియ నేసి యొకంటన త్రుంచెఁ జాపమున్. 302

తే. ఒండుధను వెత్తి రాధేయుఁ డుగ్రసాయకముల మే న్గప్ప భీముఁడు కనలి గుఱ్ఱ
ములను బడ నేసి సూతునిఁ బిలుకుమార్చి, యార్చె నప్పుచుమఱియు విల్లవియఁ జేసి.

వ. అంత సూతపుత్రుండు. 304

చ. అరదము డిగ్గి పెన్గద రయమ్మునఁ గైకొని గాడ్పుపట్టిపై
కరుగఁగ వైచె నైమటయు నందఱు సూడఁగ నాతఁ డగ్గదన్.
శరములఁ ద్రుంచి నూఱయిన శాతశరంబులఁ బైనిగుడ్ప స
త్వరుఁ డయి కర్ణుఁ డావిశిఖవారముఁ ద్రెళ్ళఁగ నేసి యూసునన్. 305

క. మైమఱు వఱువు లైపడ, నామరుదాత్మజుని నిర్వ్వెదింట వడిన్
గోము చెడ నేసె నబ్బర, మాయెయిఁ జూపఱకుఁ దోఁప నయ్యో నరేంద్రా. 306

వ. అంతఁ గిమ్మీరాంతకుండును. 307

క. నతపర్వము లగుతొమ్మిది, శితశరములఁ గర్ణుమఱవు సించి భుజంబుల్
జితికింపఁగ రాధాసుతుఁ, డతగుం డై పాఱె మఱియు ననికి న్గొలిగన్. 308

వ. ఇట్లు పరాఙ్ముఖుం డయినసూతనందనుం దలకించి నీనందనుండు సందడించుచుం బిలిచి పనిచిన నీకొడుకులు చిత్రోపచిత్ర చిత్రాక్ష చారుచిత్ర చిత్రధ్వజ చిత్రాయుధ చిత్రవర్మలు చిత్రయోధులై ధర్మపుత్రానుజుం దాఁకి చిత్రయుద్ధంబు గావించు నంత బకాంతకుండు వారి నెల్ల నొక్కొక్కనారసంబున ద్రెళ్ళనేసినం గని కర్ణుండు కన్నీరు మున్నీరై పాఱ మున్ను మనవిదురుం డన్నమాటం దలంచుకొనుచు విషాదంబు నొందియుఁ దలంకక విధివత్కల్పితం బయినదియొండొక్కటే లెక్క యొక్కవోనిపరాక్రమంబున నప్పాండునందనునిపై నురవడించుటయు నతండును. 309

తే. ముప్పదియునాఱుములుకుల నప్పు డీడ్చి, వైచి రాధాతనూజుకవచ మఱనఱ
లుగ నొనర్చిన నాతండు తెగువ వాని,మేన నేఁబదిశరములు పూని యేసె. 310

వ. అప్పు డప్పురుషసింహు లిద్దఱు నెత్తుటం జొత్తిల్లి రక్తచందనం బలందుకొనినచందం బునం బొంది బొందళంబులు లేమిం జేసి నిర్ముక్తోరగంబుల తెఱంగునం జెప్ప నొప్పి

వ్యాఘ్రంబులభంగిని సింహంబులమాడ్కిని మత్తమాతంగంబులవిధంబున వృషభంబులచందంబున నానావిధచిత్రమండలప్రచారంబులం దేలుచుం ద్రోలంగుచు మలంగుచుం దాయుచు సేయుచు శక్రవైరోచనులక్రమంబున నెక్కువతక్కువలు లేక పోరుచుండి రయ్యవసరంబున. 311

తే. జ్యారవము లుర్ములుగఁ గార్ముకాతికాంతు, లలరుమెర్ములుగాఁ బ్రవృద్ధాంబుదమున
నగుచు భీముఁడు శరధార లడరఁ జేసి, కర్ణకులశైలమును ముంచెఁ గడఁకమెఱసి.

వ. అప్పు డయ్యనిలతనయునిపరాక్రమంబునకుఁ గృష్ణార్జునసాత్యకులును యుధామన్యూత్తమౌజసులును సంతసించిరి నీతనయు లెల్లరు నొల్లఁబోయి విమనస్కు లైరి రాధాసుతుండును దానికి సైఁపఁ జాలక క్రోధతామ్రాక్షుం డై క్రూరాశీవిషంబునోజ రోఁజుచు భీమసేనుం దలంపడి యనేకశతసహస్రజాలంబు బఱపించుటయు నవి యెల్లనాకంబు నిండి బాలులుతీఁచినహంసనమూహంబుచందంబున భీమరథంబునం జొచ్చె నంతఁ గర్ణుండును. 313

క. తొమ్మిదిశరములు భీముని, యమ్ముగ నేయ నతఁడు రోఁజుచు నతిశా
తమ్ము లగునిరువదమ్ములఁ, గ్రమ్మియు మఱి వేవేలు గ్రుచ్చెఁ గర్ణుని మేనన్. 314

వ. అవక్రపరాక్రముం డగునాభీమసేనునిపరాక్రమంబునకుఁ గృపాశ్వత్థామశల్యజయద్రథభూరిశ్రవులును ధనంజయాచ్యుతయుధామన్యూత్తమౌజస్సాత్యకులును సింహనాదంబు లెసఁగ మేలు మే లని మెచ్చిరి వియచ్చరులు పిచ్చలించి రయ్యంతరంబున దుర్యోధనసమాదిష్టు లగునిపుత్రులు శత్రుంజయ శత్రుసహ చిత్ర చిత్రాయుధ దృఢ చిత్రసేన వికర్ణులు వృకోదరునిపై నడరి సంవర్తసమయంబున గ్రహంబులు చంద్రునిం బిడించినచందంబునం బిడించుచు వారిధరంబులు భూధరంబునుం బోలె శరాసారంబున ముంచుటయు భీమసేనుండు నించుక కోపించి చాపంబు సారించుచు నేడు వాఁడిశరంబులన్ వారి నేడ్వురం గూల నేసి పాండవప్రియుం డైనవికర్ణుం దిలకించి.

తే. అకట తమ్ముఁడ నిన్ను నాయమ్ము వాతఁ, బెట్టితిని నీకు మాపయిఁ బ్రీతి గలదు
కాని క్షాత్రమున న్వచ్చి కలనఁ బడితి, ప్రతినఁ దీర్ప నే నిట్లు చంపితిని నిన్ను. 316

వ. అని వానికై వగచి సింహనాదంబు గావించె నారవంబు వృకోదరునివిజయంబు గా విని ధర్మనందనుండు పరమానందకరదలితహృదయారవిందుం డై గురునిపైఁ గయ్యంబునకుం గాలు ద్రవ్వె ని ట్లాకిమ్మీరవైరిచే దనతమ్ము లప్పటికి ముప్పదొక్కండ్రు పడుటకును మిగుల వగలం బొగిలి విదురునిహితవచనంబు విన నైతి నతం డన్నట్ల యగుచున్న దని విన్నఁబోయి యుండె నని సూతుండు మఱియును. 317

సీ. వినుము నరేంద్ర నీతనయుండు ద్రౌపది, నన రానిమాటల నాడె సభను

దుశ్శాసనుండును ద్రౌపదిముందల వట్టి యీడిచి యొల్చెఁ బుట్టములును
గర్ణుఁ డప్పాంచాలిఁ గడఁ జేరి యుగ్గడింపఁగ రానిపరుషముల్ పలికెఁ బెక్కు
నీవు ఖలపాపస్వభావంబునఁ గాని, సింపుమై నిట్టి వారింపవైతి
తే. పట్టిమొగ్గుల నన్నియు నెంచి యెంచి, వనులఁ బదుమూఁడువర్షముల్ పడినపాట్లు
తలఁచి తలఁచి వృకోదరుం డలుక నీదు, తనయులం గాల్చి పుచ్చెడు దహనునట్లు. 318
చ. హిత మొద నెంచుచుండె విదురుఁ డెన్ని తెఱంగుల నైనఁ జెప్పె స
మ్మత మది యొట్టిదో వినవు మార్గము వట్టవు వృద్ధుఁ డయ్యు నం
చితమతి వయ్యు నీ విటులఁ జేసిన నొద్దుల నేల చెప్పఁ గో
క్షితివర దానికిం ఫలము చేకుఱఁ జేసెను దైవ మిగ్గతిన్. 319
ఆ. ఏమి నేల నిట్లు హేతువు వైతివి, సుతులమృతికిఁ గటకటను మతిఁ దలంతుఁ
బెక్కు రిపుల చచ్చె రక్కసుఁ డిట భీముని, బారిఁ బడినవారు బ్రదుకు టరిది. 320
ఆ. వేలకొలఁదిమూఁక నేలపా లగుచుండ, నీవు మూలముగను నేను గన్ను
ల్లారఁ జూడ వలసినట్టి దయ్యెను గటా, దైవఘటన మెవఁడు దాటఁ గలఁడు. 321
వ. అనిన ధృతరాష్ట్రుండు. 322
చ. ఇపు డగునంత చేటునకు నేన తలంపఁగ మూల మైతి నా
యనయ మింత తెచ్చె నిఁక నాడిన నేమిఫలంబు సంజయా
యెఱుఁగుదు ద్రోణరింప నైనయది యింతయు లేదు గతంబు యయ్యె నిం
దపయశ మే లభించెడి నికంతయుఁ బెట్టుము చెప్పు మన్వాక్. 323
వ. అనిన సంజయుం డట్లయినఁ స్థిరీభూతుండ వై సమరప్రకారం బాకర్ణింపు మని
యిట్లనియె. 324
సీ. రాధేయభీము లాయోధనంబునఁ గూడి, వాఁడిబాణముల నేర్లాడుచుండ
వార లొండొరులఁ జేయునారాచములపాటు, నంగన సైన్యాప్తి చలన మందె
వాయుపుత్రాంకితసాయకంబుల నెగి, చతురంగసేనలు క్షితిని గప్పె
మన కిది యేటికర్మము వచ్చె నని పోదు, లంపపెట్టునకుఁ బై నవలఁ జనిరి
ఆ. నెత్తుపట్టు వాఁతె మొత్త మై నొప్పఁ గన్నడఁ గరితురంగయోధకాయములును
దెగినబాణములును ద్రెళ్ళినరథములు, నాయుధములు ధ్వజము లరయ నయ్యె.
క. ఆమారుతికిం గర్ణునకున్, దారుణసమరంబు సల్లెఁ దత్కాలమునన్
దారులు దిలకించి దివిపై. నారయు సురచారణాలి మెచ్చెను నమ్మెన్. 326
తే. కర్ణుఁ డొకమూఁడుబాణముల్ గాఁడనాటి, నేసియును శరవర్షంబు నెసఁగఁ జేసెఁ
గర్ణినారాచమునఁ గర్ణుకర్ణకుండలమ్ము దెగి పడ భీముఁ డొక్కమ్ము వైచి. 327

చ. మఱియొకభల్లముం దొడిగి మానవనాథునిమిత్త్రువక్షమున్
బఱియలువాఱ నేసి పది వాలికతూపులఁ దల్లలాటమున్
జొఱఁ జొఱ నెత్తురుల్ వడియఁ జొన్పిన నాతఁడు నల్లకల్వపేర్
నెఱి ధరియించిన ట్లగుచు నేత్రములన్ ముకుళించి యంతలోన్. 328

తే. మోహవశమున నొగలున దేహ మూని, తెలిసి కొండొకవడికి నెత్తు రొలయుచుండ
శరశతము భీమసేనుపైఁ బఱపుటయును, నతఁడు మాఱు జేసి శరవర్షమవలఁ గురిసె.

క. అలుకం గర్ణుఁడు తొమ్మిది, ములుకులు కౌంతేయువక్షమున నాటుడు న
వ్విలుకాఁడు కర్ణుచాపము, నలఁగక యొకకత్తివాతియమ్మున నఱకెన్. 330

ఉ. కన్నుల నిప్పుకల్ సెదర గర్ణుఁడు వేఱొకవిల్లు పూని కో
పోన్నతిమై విదిర్చుచు సముద్ధతిఁ జూపుచుఁ జూచి భీమునిన్
విన్నను వొప్పఁ దీయుటయు వ్రేయుటయుం గనరానియట్టు ల
త్యున్నతసాయకౌఘముల నొయ్యనఁ గప్పె నభంబు దిక్కులున్. 331

వ. ఇట్లు శరవర్షంబునం దనరథంబు ముంచుచున్న కర్ణుం గని కోపంబు రూపంబు గైకొన్నచందంబునం బొంది వాయునందనుండు శక్రచాపోపమం బైనతనచాపంబు మండలీకృతం బై దీపింప వాయుప్రచారంబునకుం జోటు లేనియట్లు నానావిధశరాసారంబు గురియుచున్ దనబాణంబులం గగనలక్ష్మిం గాంచనాభరణభూషితం జేసె నంత రాధేయుం డంతరిక్షంబున సూర్యకిరణంబుల కెడమీఁక చీఁకట్లు గ్రమ్ముచున్న వృకోదరుని ప్రదరంబు లన్నెల్ల మూఁడుమూఁడు తునియలు గావించె నంతఁ గిమ్మీరాంతకుండు నిలు నిలు మని వాని నదల్చుచు మఱియున్ శరశతసహస్రాయుతనియుతంబు నిగిడించె నట్లు వారు రథనేమిస్వనంబులును జ్యాశబ్దంబులును బాణపాతధ్వానంబులును దలశబ్దంబులును శంఖనాదంబులును సింహరవంబులునుం గావించుచుఁ బోరినపోరు ఘోరం బయ్యె నయ్యెడ సురసిద్ధసాధ్యవిద్యాధరులు పొగడుచు వారిపైఁ బుష్పవర్షంబు గురిసి రంత. 332

చ. వడముడి బాణవర్షమును బర్వఁగఁ జేయుచుఁ గాలదండపుం
గడిమిఁ దలిర్చున మ్మొకఁడు కర్ణునిపై నిగిడింప నాతఁ డ
క్కడిఁదిశరంబు మూఁడయినకాండములన్ విదళించి వెండియుం
బదేడుతదంబకంబులను వ్రక్కలు చేసి జవంబు పెంపునన్. 333

వ. అస్త్రమాయం గల్పించి మారుతిం దారసించి. 334

చ. పొదులను ద్రుల్చి నారి తెగిపోవ నగల్చి శరాసనంబు వల్
చిదురులు చేసి రశ్ములను ద్రెవ్వి హయంబుల నుఱ్ఱఁ గూల్చి పైఁ

బొదలుసిడంబు గొట్టి వెత వుట్ట విశోకుని నేనుతూపులన్
విదిలిచి భీమసేనుపయి వేడిశరంబులు ఱువ్వె నవ్వుచున్. 335

వ. వృకోదరసారథి యగువిశోకుండు హతాశ్వం బైనతనరథంబు డిగ్గ నుఱికి యుధామన్యునితే రెక్కె నంత వృకోదరుండును. 336

మ. రథశక్తిం గొని కర్ణుతేరిపయిఁ జేరన్ వైచుటుం గాంచి య
మ్మథితారాతి మిడుంగురుల్ గలయఁ గ్రమ్మన్ వచ్చు నాశక్తి న
త్పథమందుం బడి తూపులం బడియు నై ధాత్రిం బడం జేసినన్
రథమం దుండి వృకోదరుండు పలుకం గైకొంచు వాల్గాంచులోన్. 337

తే. పలుక బలుతూపులం జేసి పగుల నేసెఁ, గర్ణుఁ డాలోన వాల్గొని గాలిపట్టి
విసరి వైచిననది వానివిల్లు ద్రుంచి, నేలపైఁ బడె దివినుండి నిమపఁ డట్లు. 338

—భీమసేనుండు కర్ణురథంబుపై కుఱుకుట—

ఉ. ఒండొకకార్ముకంబు గొని యుద్ధతిఁ జూపుచుఁ గర్ణుఁ డెంతయే
మండెడుమార్గణంబులను మారుతిపైఁ నిగిడించుచుండ నా
తండు మహోగ్రవేగమున దాఁటుచు మిన్నులు ముట్టి నెట్టనన్
బిండిగఁ జేయఁ గర్ణురథవీథిఁ బడెన్ విబుధాళి మెచ్చఁగన్. 339

వ. భండనభీముం డగుభీముని బలపరాక్రమోద్యమంబు లెఱింగి వెఱం గొని వైకర్తనుండు వ్యథితమనస్కుం డై తా నచ్చోటన యున్న భంగపాటు వాటిల్లు నని తలంచి వాని వంచింప నెంచి రథోపస్థంబున నిలీనుం డయ్యె వృకోదరుండును వాని నటం గానక రథంబుక్రిందం దాఁగె నని వానిం బట్టి గిట్టించుపూఁ డై కేతనదండంబు విడిచి ధరణికిం డిగ్గ నుఱికె నట్లు విరథుండు విచ్ఛిన్నచాపుండు నగుభీమసేనుండు కర్ణుం బట్ట నెంచి చేసినచేతకు వియచ్చరులును మెచ్చి రంతఁ గర్ణుం డట్లు భూగతుం డయినభీముం దెలిసి తొంటియట్లు రథంబుపై నధిష్ఠించి నిరాయుధుం డగు వాని నవ్వుచు నొవ్వ నేయం దొడంగుటయును. 340

మ. గదయుం గత్తియు లేనివాఁ డయిన నక్కౌంతేయుఁ డొక్కింతయే
మదిఁ జింతింపక తన్ను మార్కొనఁగ భీమప్రక్రియన్ మీఁదికిన్
గదియన్ వచ్చెడుసూతపుత్త్రురథమార్గంబందు నడ్డంబుగాఁ
బొదలన్ వైచె నరాహతేభనికరంబుం గుప్పలై యొప్పఁగన్. 341

ఆ. తొలఁగఁ ద్రోచి రథముఁ దోలుకొంచుం దన్నుఁ, గదిసి తఱుముకర్ణు నెదుర లేక
గాలిసుతుఁడు శత్రుగమనావరోధార్థ, మిడిసి పడినకరుల నడుమఁ జొచ్చె. 342

ఆ. గజకళేబరంబు కడకేల డాలుగా, నడ్డు పెట్టుకొంచు నౌషధాద్రి
నెత్తికొనినహనుమ కెత్తు వచ్చి వృకోదరుండు తొలఁగు చుండె రోషహతికి. 343

చ. కరగత మర్కటకళేబరము గండ్రికలై పడఁ గర్ణుఁ డేసినం
గరులు శతాంగసంతతులు కాల్వురు పీతులు దొట్టిచేతికిం
దొరికిన వెల్ల యెత్తికొని దొప్పలుదోరలు గాఁగ ఱువ్వుచున్
శరముల వాని నన్నిటిని జర్జరితంబుగఁ జేసెఁ గర్ణుఁడున్. 344

ఆ. పిడుగుపాటువోలెఁ బిడికిట నొకగ్రుద్దు, గ్రుద్ది కర్ణుఁ జంప బుద్ధి నెంచి
పవనతనయుఁ డనుజు ప్రతిన లోఁ దలఁపోసి, శక్తిఁ గలిగియుండి చంపఁ డయ్యె. 345

క. ఆలోన నంగమహీపతి, వాలారుం దూపుగములు పఱఁగించి వడిన్
వ్యాలోలమనస్కుని వాతూలాత్మప్రభవు మూర్ఛఁ దోఁగం జేసెన్. 346

తే. అట్లు మూర్ఛాపరీతాంగుఁ డైనవానిఁ, గుంతి కిచ్చినబాస లోఁ గొంచు నపుడు
చంప నొంపఁ దలంపక సరస కరిగి, పొట్టపై వింటికొప్పునఁ బొడిచి పుచ్చె. 347

తే. విల్లు మై సోఁకినంత దర్వీకరంబు, నోజ రోఁజుచు నాచాప మూడఁ ద్రోచి
భీమసేనుం డడిచిపడి పిడికిట వడి, నంగపతిమస్తకంబునయందు గ్రుద్దె. 348

—కర్ణుఁడు భీము నవమానించి పలుకుట—

వ. అవ్వడికి నొవ్వక నవ్వుచు నవ్వైకర్తనుండు వాని కి ట్లనియె. 349

ఆ. ఓరి తిండిబోత! యోరి తూబరక యో, రోరి పిఱికిపంద యోరి మూఢ
కడుపునిండఁ దిండి గలచోటికే నీవు, తగుదు గాని యనికిఁ దగవు పోర. 350

క. వంటకము గామి సూదుల, వెంటం బడి వేగిరించి వేధించుటకుం
దంటవు నీక్రోధమునకు, నింటం గలయన్నరాసులే యివి వత్సా. 351

వ. అని మఱియును. 352

మ. ఫలమూలాశనతత్పరుండ వగుచున్ వాసించి ఘోరాటవిన్
ఫల మర్థించి యతివ్రతంబున మునిత్వంబుం దగం బొంది య
ఫలఁ బూజించుచు నుంట కోపుదువు పోరుల్ ఘోరముల్ వానిమా
టలు నీ కేటికి మేటిశస్త్రముల జాడల్ సూడఁగా నోపుదే. 353

క. కొండిక వకృతాస్త్రుండవుఁ భండన మది యేడ బాలభావుఁడ వీ విం
దుండు టది యేడ నానుడి, కొం డాడక వనుల కరిగి యుండుము శాంతిన్. 354

మ. అనుచుం గొండిక నాడుచందమున యుక్తాయుక్తముల్ సూడ కా
ఘనబాహాబలునిన్ మహాబలసుతుం గారించి ఘోరంబు గా

తే. నరుఁడు గాండీవఘోషము నలుగడలను, గ్రమ్మ గురుపుత్త్రు పెన్నంటి కాండసమితి
నొలుకుచుం గొంతచని యేనుఁగులను గుఱ్ఱములను నరులను రథములఁ బిలుకుమార్చె.

వ. అంత భీమసేనుండు సాత్యకితోఁ జిక్కియు నంతలో విశోకుం డొండొకతేరు గాయి
తంబు చేసి తెచ్చిన దానిపై నధిష్ఠించి ధనంజయుం డున్నదిక్కునకుం బోయె ననిన
ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 365

చ. అన మెడలంగ నాబల మహమ్ము నహమ్ము సహించు నెందఱేఁ
బన గలయోధు లీల్గి రొకఫల్గునుఁ డాగురుకర్ణరక్షితం
బసదృశమైన సైన్యమున నడ్డొకయింతయు లేక సొచ్చెఁ బెఁ
వెసఁ గొని వానికిన్ హరియు భీముఁడు సాత్యకి బాసటైరయో. 366

తే. అట్లు వినినంతనుండియు నకట నాదు, చిత్తమార్తివశంబునఁ జేయి వెట్టి
కలఁచినట్లయ్యె భూపాలతిలకు లెల్ల, మిత్తిమొగమునఁ బడినట్ల యెత్తె భయము.

చ. జగ మెఱుఁగన్ మహాప్రియము సల్పె జయద్రథుఁ డక్కిరీటికిన్
బగఁ గొనియున్నవాఁ డతఁడు బాహుబలాఢ్యుఁడు సూడ వాని ము
జ్జగము జయింపఁ జాల దిఁక సైంధవుఁ గాచెడుమాట నీటిమూ
ట గదె యతండు లేఁడని యెడందఁ దలంపఁగ నొప్పు సంజయా. 368

వ. అది యట్లయుండె నట్లు విప్వచ్చుం జూడ వచ్చిన శినివరుండు నలినీవనం బేన్గు సొచ్చిన
యచ్చున మనసైన్యం బంతయుం గలంచి వైచె నంటి కద వాని ప్రధన ప్రకారం
బంతయు యథాతథంబుగం జెప్పు మనిన నతం డతని కిట్లనియె. 369

ఆ. భీమసేను నట్లు పీడించి పోయెడు, రాధకొడుకు నరసి క్రోధఘూర్ణి
తాత్ముఁ డగుచుఁ గృష్ణునను జుండు మేఘమ, ట్లుఱిమి శస్త్రధార నఱిమె వాని. 370

—సాత్యకి యలంబుసుం దెగ నేసి విజృంభించుట—

చ. పయిఁ బడఁ బొఱుసాత్యకినిఁ బార్థివు లెవ్వరు నాఁగ నోడి ర
ణ్ణయనమునం దలంబుసుఁ డహంకృతి మీఱఁగ దాఁకు దెంచి రెం
డయిదులతూపులన్ మురహరానుజు నేసిన నాతఁ డాశరో
చ్ఛ్రయ ముడిగించెఁ దాఁ బ్రతిశరమ్ముల నమ్మొనలోన నుండఁగన్. 371

తే. అంత నాకర్ణపూర్ణము లైనమూఁడు, మార్గణమ్ముల నాతఁడు మాధవాను
జన్మువర్మంబు వగిలించి సైంధవముల, నాలుగింట బడల్పడ నోలి నేసె. 372

ఉ. నొచ్చి శినిప్రవీరుఁడు కనుంగవ నగ్నికణంబు లొల్కఁగన్
హెచ్చి చతుశ్శరంబులను హేతుల నాల్గిటిఁ ద్రుంచి సూతునిం

బచ్చడి చేసి యొక్క-శితభల్లమునఁ సహాకుండలమ్ము సం
పచ్చరితం బలంబునునిమస్త మిలం బడ జేసె నీసునన్. 373

వ. ఇ ట్లయ్యదువృషభుండు వృషభంబుం బోనియలంబునుం బడనేసి నానావిధమండల ప్రచారంబుల రంథబు వోవనిచ్చుచు వాతూలంబు తూలంబునుంబోలె కనుపుగొట్టి మనమూఁశలం జీకాకుపఱచుచున్నంత దుశ్శాసనపురస్సరు లైనకుమారులునుం దక్కినయోధులును నాశైనేయుం దాఁకిన నాకృష్ణసోదరుండు శరవారంబున వారి నెల్ల వారించి దుశ్శాసను నఱిమినం జూచి త్రిగర్తసైన్యంబు పారావారంబుపోలె శినివీరుం జుట్టుముట్టుటయు నవ్వీరుండు వారిలోనం బ్రధాను లగువారి నేనూఱు రథంబులవారి నింతలోనం బ్రేతరాజపురాతిథులం గావించి దశదక్కులం దాన యై రథశతంబు సుట్టుముట్టిన నిట్టలంబు సూపుచు సింహవిక్రాంతగామి యై వీరనృత్యంబు గావించినం గాంచి త్రిగర్తవీరులు వెఱచఱచి పఱచి రంత శూరసేనశూరవర్యుఁ లడ్డగించిన వారి నెల్ల నల్లనం బిలుకుమార్చి పేర్చి కాళింగులం గదిసినమాత్ర గూలనేసి స్వల్పజలంబు దాఁటి స్థలంబుఁ జేరినట్లు నీసైన్యం బంతయుం దాఁటి మేటి యగునయ్యుయుధానుండు కృష్ణార్జునులకడం జేరినంత వారు వానిం గాంచి సంత సించి రప్పు డప్పురుషోత్తముం డర్జునుం గాంచి యి ట్లనియె. 374

మ. ఇదె నీశిష్యుఁడు నిష్ఠుఁడున్ సఖుఁడు నై యింపొందు శైనేయుఁ డ
ప్పదమందుం గలద్రోణభోజముఖులన్ భర్జించి భల్లంబులన్
గదనంబందుఁ ద్రణీకరించి రిపులన్ గైవాఁడి ఖండించి దు
ర్మదుఁ డై రక్తనదీప్రవాహములు పర్వం జేసి వచ్చెం జుమీ. 375

మ. జలసంధాదులు వీనిబాణశిఖిఁకిన్ స్వాహాకృతిం గాంచి రీ
బలభిత్తుల్యపరాక్రముండు రిపురాడ్వక్త్రంబులం గప్పి భూ
తలమున్ గౌరవనాథునిం దెగడి తత్సైన్యాటవిన్ సింహము
ట్లు లలిన్ మెట్టుచు వచ్చె ధర్మజునిమేలుం గోరి నిన్ జూడఁగన్. 376

వ. అనిన జిష్ణుండు కృష్ణున కి ట్లనియె. 377

ఉ. నాకుఁ బ్రియంబు గా దితఁడు నాకడ వచ్చుట వీనిలేమి నా
లోకనుతుండు ధర్మజుఁడు లోఁబడె నో ఘటసూతి కాతఁ డి
ప్డేకరణి న్మలంగెడినొ యే మయి పోయెనొ వానిఁ గాచికో
లాకడ వీనిపైఁ బడిన దై పొలుపొందును గాదె మాధవా. 378

ఆ. పరమగురునిపంపె పయిఁబడినను వాని, గురునివాల వైచి గురునిఁజూడ
వచ్చు టుచిత మనఁగ నిచ్చ పుట్టదు నాకు, నేమి చెప్పవాఁడ నోమహాత్మ. 379

తే. గురున కప్పన వెట్టితి నరవరేణ్యుఁ, గూలఁ డీసైంధవుండును గ్రుంకు ప్రొద్దు
కనుము భూరిశ్రవుం డదె కవియ వచ్చు, శినివరుని నూఱుకొనుబుద్ధిఁ జేసి కృష్ణ.

చ. గురుతరభార మిట్లు సమకూడె జయద్రథుకారణంబునన్
గురునకుఁ జిక్కకుండునటు కుంతికుమారునిఁ జూచుకొంటయున్
శరములపాలు గా నటులు సత్యకసూనునిఁ గాచుకొంటయున్
ధరణిఁ గనంగ సైంధవవధం బొనరించుట నేఁటికార్యముల్. 381

వ. అని పరికించి మఱియును. 382

—సాత్యకిభూరిశ్రవులు ఘోరయుద్ధంబు సేయుట—

తరువోజ. అతఁడె భూరిశ్రవుం డరుదెంచు సత్యకాత్మజుపైఁ గవియఁగ, నాగ్రహమున
నతఁ డింతయే నని నలయనివాఁడు, నస్త్రాదిసాహాయ్య మతనికి హెచ్చు
నితఁ డింతలో నెంతయేఁ బోరి యలసి, యేతెంచినట్టేఁడు నిన్నయేఁ దూపు
లితనికి శేషించె నీసూతవీతు, లెంతయు డస్సిన ట్లీక్షింప వచ్చె. 383

క. సాగర మీఁదినసాత్యకి, యీగోష్పదమందుఁ జిక్కు నేమో యని నా
లోఁ గడుఁ జింతిల నయ్యెను, మాగాదిలితోడు స్వస్తిమంతుం డగుతన్. 384

తే. ఇంత వచ్చెను ధర్మరా జిట్లు చేసె, నాత్మసంరక్షణము రోయ కార్యభయము
మీఱ నీతనిఁ బుచ్చె నామిషము డేగ,పగిది నాచార్యుఁ డారాజుఁ బట్టకున్నె. 385

వ. అని పలుకం బొగులుచున్న సమయంబున భూరిశ్రవసుండు భూరిపరివారపరివృతుం
డై సాత్యకి కడ్డంబు వచ్చి నిలు మని యదలించుచు ని ట్లనియె. 386

చ. దొరకితి నేఁడు భాగ్యమునఁ ద్రుళ్ళకు మిం కిట నెందుఁ బోదు నా
చిరతరవాంఛితార్థ మది చేకుఱఁ జేసికొనంగ నైతి నే
దురమున నుండఁ బ్రాణములతో విడువాఁడను గాను నిన్నికన్
శరమునఁ గూల్చి కౌరవులు సంతసిలం బొనరింతు సాత్వతా. 387

సీ. నేఁడు నాబాణాగ్ని నిర్దగ్ధుఁ డై పడ, నినుఁ గేశవార్జునుల్ గనఁ గలారు
తెలియక నిన్నుఁ బుత్తెంచినధర్మజుం, డిది విని సిగ్గున నేడ్వఁ గలఁడు
నాపరాక్రమ మిప్డు నారాయణునితోడ, నరుఁడు మెచ్చం గలతరుణ మొదవు
నిన్ను మార్కొని పోర నిధనంబుఁ గొన్నవా,రలబోంట్ల కిపు డింపు సలుపఁ గలను

తే. ద్రోల్లి రామానుజునిచేతఁ ద్రెళ్ళి యింద్ర,జిత్తు చచ్చినగతి నీవు సత్తు విపుడ
తెలియఁ గల వీవు నాలావు కలన నిలుము, సంయమని కేను జూపెదఁ జక్క దారి.

క. మృగరాజుబాఱి కగ్గం, బగుమృగముంబోలె నాకు నగపడి తిపు డో
మగవాఁడ నిన్ను విడువను, దెగ నేయక కాని యనుఁడు తెగి సాత్యకియున్. 389

వ. మందహాససుందరవదనారవిందుం డై వాని కి ట్లనియె. 390

మ. కల దాస్యం బని ప్రేలఁ జొచ్చితివి మేఘంబట్లు గర్జించుచుం
దులువల్ సేసెడు సేఁత లిట్టివియ నీకూలాటలం బాలకుం
బలె నన్నుం బెదరింప రాకు మిటు నీపల్కుల్ నగించుం జనా
వళి చేహాఁడియ యున్నఁ జూపుము వృథా వావాడి యి ట్లేటికిన్. 391

క. నాకైఁ గైదువు గలిగిన,దాఁక న్న న్నొరుఁడు దాఁకి తరలఁగఁ జాలం
డీకాఱు లేల నాతో, డీకొని నీలావు సూపు టేతగుఁ జూవే. 392

మ. చిరకాలేప్సిత మైనపో రిపుడు నాచేఁ జిక్కె నిం క్రేక్కొనం
ద్వర నాచిత్తము తత్తఱించెడిని బర్వంబట్లు హర్షోన్ముఖుం
బరు నై నీ వసఁ గూలునంతకును నే నన్యార్థముం గోరుచున్
మరలన్ బోటరి నేని ర మ్మెదిరి నీమండాటముం జూపుచున్. 393

వ. ఇ ట్లయ్యిరువురుం బరస్పరంబు వాగాయుధంబుల నొవ్వ నేసికొనుచు మదోత్కటంబు లగుమాతంగంబుల తెఱంగునను శార్దూలంబులలీలను మృగేంద్రంబులచందంబునను వీఁక మెఱసి తాఁకి లోకు లెల్లం బ్రశంసింపఁ బ్రావృట్పయోధరంబుల విధంబున నొండొరులపై శరవర్షంబు వర్షించుకొనుచు వివిధాస్త్రశస్త్రంబులం బ్రయోగించుకొనుచు రథశక్తుల సువ్యక్తంబుగఁ జేసికొనుచుఁ గాలదండోపమంబు లగు గదాదండంబుల విసరికొనుచుఁ బరస్పరశరశరాసనవిదారణంబుల నితరేతరతనుత్రాణభేదనంబులును నన్యోన్యరథరథ్యసూతకేతుసంహారంబులును గావించుకొనుచు విరథులును హీతసారథులు విక్షతగాత్రులు నై నెత్తుటం జొత్తిల్లి ఖడ్గఖేటకధారు లై ధారుణీతలంబునకుం డిగ్గన డిగ్గ నుఱికి నానావిధమండలగతిప్రచారంబులును భ్రాంతోద్భ్రాంతావిద్ధాప్లుతవిప్లుతసృతసంపాతసముదీర్ణాదులం జూపుచు నేపు మీఱి లాఘవంబు మెఱయ నంతరంబు లన్వేషించుచు శిక్షాసౌష్ఠవంబు మెఱయఁ జిత్రవల్గనంబులఁ గృపాణవిహారణంబు లొనరించుచు నొక్కముహూర్తమాత్రం బసియుద్ధకౌశలంబునం బ్రసిద్ధి కెక్కి యుక్కింతనే పూర్చుచు నేద దీర్చికొనుచు డాయుచు నేయుచుం బాయుచుం బోరిపోరి పలుకలు పఱియ లైనం బరిఘోపమంబు లగుభుజంబుల పెంపు సొంపార నిగ్రహప్రగ్రహాదులం జేసి విషాణాగ్రంబుల వేదండంబుల తెఱంగునను శృంగాగ్రంబుల మహోక్షంబులమచ్చునను వజ్రనిర్ఘాతాతిభీతం బగుమహాశబ్దంబు రోదసీకుహరంబు నిండి మెండుకొన నయ్యుద్ధంబునకు సన్నద్ధు లై రని మఱియును. 394

సీ. భుజయోక్త్రబంధనంబు లొనర్చి ముష్టిఘా,తమ్ముల శిరములు ఠమ్ము వెట్టి
తోమరాంకుశపాశతుల్యముల్ పాదావ,కర్ష సంధానముల్ గలుగఁ జేసి

పాదోదరనిబంధపద్ధతుల్ పఱఁగించి, యున్నతోద్భ్రమణము లర్థి నడపి
సమగతప్రత్యాగతములు క్షేపోత్థాన,పాతనాప్లుతములు పరఁగఁ జేసి
గీ. కుత్తుకలు వట్టి తలలు డీకొల్పి మొట్టి,తాఁకి తప్పించుకొని పోటు సోఁకఁ బొడిచి
విడిచి ముప్పదిరెం డయి వెలయుమల్ల,యుద్ధకరణముల న్వార లొప్పి రపుడు. 395
వ. కొంతవడికి బలమఱి పరిశ్రాంతుం డైనతమ్ముని జూచి హృషీకేశుండు గుడాకేశు
నకు వానిం జూపుచు ని ట్లనియె.. 396
చ. రవియుదయంబుదొట్టియు నరాతులతో నని చేసి చేసి కౌ
రవబలవార్ధి మందరము త్రచ్చినయట్టులు ద్రచ్చి త్రచ్చి నీ
సవిధముఁ జేర వచ్చె నదె సాత్యకి డస్సినవాఁడు చూడు కౌ
రవుఁ డురఁ డై యెదుర్కొనె దురం బసమం బగు నంచు నెంచెదన్. 397
తే. అనెడునెడ సోమదత్తునితనయుఁ డుగ్ర,మూర్తి యై సాత్యకినిఁ బట్టి పుడమిమీఁది
కెత్తి పడ వైచి మర్దించె మత్తకరిని, మత్తకరిపోలెఁ గృష్ణు ల ట్లెత్తి చూడ. 398
మ. జలజాక్షుం డను నర్జునిం గని భవచ్ఛాత్రుం బరిశ్రాంతునిన్
ఖలుఁ డాకౌరవవంశజుండు కడిమిం గర్వించి యుర్వీస్థలిం
గలియ న్వైచి మథించు నీ విటు లుపేక్షాభావ మూహించుటల్
గలదే తోడ్పడ వచ్చె సత్వరగతిం గావం గదే వానినిన్. 399
క. నావుడు నర్జునుఁ డను నో,దేవా మదగజములట్లు తెగువ రణంబున్
గావించుచుండి రామగ, లీ వేటికి నింత యనఁగ నీక్షింపఁ గదే. 400

—అర్జునుఁడు భూరిశ్రవునిచేయిఁ దెగ నేయుట—

తరువోజ. అని ఫాల్గునుఁడు పల్కునంత నాసైన్య,మందు హాహాకార మరుదెంచె నపుడు
శినివరునిం బట్టి క్షితిఁ బడ వైచి, సింగ మేనికను నీడ్చినరీతి నీడ్చి
ఘనుఁ డతం డతనివక్షము కాల నాఁచి, కడకేల సిగ వట్టి ఖడ్గంబు వెఱికి
కొని వలకేలునం గొంతుఁ గోయంగఁ,గొనకొని పై కెత్తుకొనియుండెఁ బూఁచి. 401
తే. శినివరుం డప్డు తనశీర్షమును గులాల,చక్రమట్లు ద్రిప్పుచును గేశముల వ్రేలు
సోమదత్తికరం బది చాటు గాఁగఁ, గత్తి మెడమీఁదఁ బడకుండఁ గాచికొనియె.
వ. ఆసమయంబున వాసుదేవుండు వెండియు వేగిరించుచు నోవాసవీ! సోమదత్తాఖ్యు
నకుని జిక్కి యుక్కుదక్కినసీశిష్యునిం జూడు మాతనిమెడరు దీర్పు మింత తడసినఁ
గార్యంబు దప్పు ననిన నతండు తనమనంబున నాభూరిశ్రవునిపరాక్రమంబునకు
హర్షించి గౌరవించుచు నారాయణునిదిక్కు మొగం బై సైంధవాసక్తదృష్టి

నగుటం జేసిసాత్యకిం జూడ కోపనైతిం జూడు మని యొక్కఁ వెడందవాతియమ్ము గాండీవమ్మునసరివోసి తిగిచి యేయుటయు నయ్యమ్ము రయమ్మున నభశ్చ్యుతం బైనకొఱవితె అంగునం బొఱి సఖడ్గంబును సాంగదంబును నగుభూరిశ్రవునిదక్షిణభుజంబు దెగ నఱికి క్షారశావావళి కాఱునిదుఃఖం బాపాదించి పంచాస్యం బైనపన్నగంబుచందంబున భూమిం బడియె నంత సోమదత్తపుత్రుండు తన్ను విఫలప్రయత్నుం జేసినవాఁడు క్రీడి యని యెఱింగి డెందంబు కొందలం బంద సాత్యకిఁ విడనాడి గర్హించుచుఁ గ్రీడిదిక్కు మొగం బై యి ట్లనియె. 403

చ. కటకట నీచకర్మ మిటు కట్టిఁడి వై పొనరించి తట్టె నే
నటఁ గన కొండ్లతోఁ బెనఁగునప్పుడు తప్పన కీవు నాభుజ
స్ఫుటనము చేసి తెట్టితఱి భూరిభుజుం డెగనేసి తంచు ని
న్నట భవదగ్రజుం డడుగ నాతని కే మని నీవు సెప్పెదో. 404

ఉ. ఈవు దొడంగినట్టిపని యింద్రునిచెంగట నేర్చితో మహా
దేవునిచెంత నేర్చితివొ దేశికుఁడా గురుచెంత నేర్చితో
కావలెనంచుఁ బిన్న వగుకాలమునం గృపునొద్ద నేర్చితో
యీవిలుకాండ్రలో వినుతి కెక్కినని కిటు నేత లొప్పునే. 405

తే. ధరఁ బ్రమత్తుఁ భీతుని విరథు వేఁడు, వాని వ్యసనార్తు లాతితోఁ బూని పోరు
వాని నేయుట ధర్మంబు గాని దనుచు, నేయ రుత్తము లీవింత యెఱుఁగ వొక్కొ. 406

ఉ. రాచకొలంబు మెచ్చుకొన రమ్యతరం బగునార్యకార్యముం
జూచి యొనర్తు రార్యు లెటు సొచ్చి యొనర్ప రనార్యకార్యమున్
నీచులు సేయునట్టిదియు నీచులు మెచ్చునట్టికార్యముం
నీచెయిసేతఁ జేసితివి నీచుఁడ వైతివి నీవు ఫాల్గునా. 407

క. ఎందెందు నరుఁడు మెలఁగెడు, నందందలిగుణము లబ్బున ట్లగుఁ గద నీ
విందుండుకుఁ దారకాణ, మ్మిందుకులంబందుఁ బుట్టి యి ట్లగుకతనన్. 408

ఉ. ఈవు సువంశమందు జనియించినవాఁడవ వృష్ణివంశమం
దై హరి మైనకృష్ణుఁడు సహాయుఁడ వై కడనుంటఁ దన్మతం
బీవగొని న్నకార్యమున కీడ్చెను గాని త్వదన్యు లెవ్వరుం
నీపలె నొం డెఱుంగ రొకనిం గొని పోరెడువాని నొంతురే. 409

తే. అర్జునా! యదువృష్ణిభోజాంధకు లిల, వ్రాత్యులును నీచకర్ములు ప్రకృతిగర్హి
తు లని నీ వెఱుంగవొ జగంబులు నెఱుంగ, నట్టి వార్ష్ణేయుఁడె ప్రమాణ మయ్యె నీకు.

వ. అని గర్జించి పలికినభూరిశ్రవున కర్జునుం డిట్లనియె. 411

తే. జనుఁడు జీర్ణింప బుద్ధియుం జనును జీర్ణ, మగుచు నీమాట లెల్ల నిరర్థకముల
యెఱిఁగియుండియు నన్ను నీకృష్ణు నిట్లు, చెందనాడెద వేటికిఁ జెప్పు మయ్య. 412

మ. రణధర్మంబు లెఱింగి శాస్త్రపులయర్థం బెల్ల శోధించి నే
ననుమాత్రంబు నధర్మమార్గమునఁ బో నర్థింతునే సంగరాం
గణమందుం బితృపుత్రమిత్రసహజజ్ఞాతిష్టముఖ్యుల్ మహా
గణ మై తోడ్పడఁ గాదె రాజు లరులం గారించి పేరందుటల్. 413

క. అనిఁ దనకుఁ దోడు సూపెడు, జనులం గాచుటయు వారిసాహాయ్యంబుం
గొని తాను జయము నొందుట,యును నృపధర్మంబు గాకయుండునె తెలియన్. 414

మ. నను గావం జనుదెంచినట్టిఁడును బ్రాణం బెన్న కాలంబు నే
యన యున్నట్టిఁడు నాకు దక్షిణభుజం బైనట్టిఁడున్ శిష్యుఁడున్
శినిముఖ్యుం డరిచేతఁ జిక్కినపుడే జీవించియుం జూచు చుం
డినఁ బాపం బగుఁ జెంచు నం చిటులు వానిం గావ ని ట్లేసితిన్. 415

ఆ. దానఁ గినిసి నీవు దామోదరుని నన్నుఁ, దూలనాడుచుంటి వోల దిట్టు
నిన్నుఁ గావ లేనినీవారిఁ దిట్టుము, తిట్టఁ గలిగితేని యిట్టియెడల. 416

సీ. ఒకనితో నొక్కని కొనఁగ సంగర మంటి, వెట్టది సమ్మకుఱు నెఱుఁగవొక్కొ
నేను శైనేయుఁ డసేనాముఖంబును, గాంచి వచ్చెడునప్పు సేన లెల్ల
వివిధాస్త్రశస్త్రముల్ విసరి నన్నున్న వాని, నేకాకు లగుమమ్ముఁ దాఁక లేదె
వారువంబుల దప్పి నిమిష నరదంబు, దగిన నెల్లరుఁ నన్నుఁదగులఁ గనవె

తే. చక్కటులు సెప్ప వచ్చితి చాలు నింక, క్రౌంతుఁడును శ్రాంతవాహుఁడు శస్త్రపీడి
తుం డయినసాత్యకిం గెల్చియుండినంత,నూత్ర మగబంటు ననుకొనుమాట తగునె.

క. అని నీవు గొంతు గోయం, గనిమనఁగినఁ జూచుచుండఁ గలనే శిష్యున్
బానఁగిన నీవానికి న,డ్డెనఁ గని నీ వూరకుండుదే కురుముఖ్యా. 418

వ. అని మఱియును. 419

తే. విరథుఁడు విదీర్ణకవచుండు విగతశస్త్రుఁ, డైనబాలకు ననహాయు నస్మదీయుఁ
దరిమి పెక్కండ్రు సంపుట ధర్మ మనుచు, నీకు నీవారికినిఁ దోఁచెఁ గాక యేమి.

క. భూనాథు లెఱుఁగఁ బట్టితి, నేను వ్రతం బస్మదీయు నెవ్వఁడు గానీ
చానేయఁ బాలఁ జనుచుఁ, దీనికి నను నెట్టఁ బోలునే కురుముఖ్యా. 421

వ. అని ... కేతుండును యుయుధానుఁ విడనాడి నవ్యహస్తంబున నట

శరంబులు విడిచికొని ప్రాయోపవేశంబు చేసి బ్రహ్మలోకావాప్తికై ప్రాణాయామంబు గావించి ప్రభాకరమండలంబుపై దృష్టి సగిడించి నిశ్చలమనస్కుండై మౌనవ్రతంబున మహోపనిషద్ధ్యానంబు చేయుచు యోగంబు ననుసంధించె నయ్యెడ నీవా రయ్యర్జునుం దూషించి భూరిశ్రవుం భూషించుచున్నంతఁ గౌంతేయావర జుండు తొల్లి వాఁడు చేసిన చేఁతలన్ గర్హించి పలుకుచు భూరిశ్రవోంతికంబునకుం జని.

క. సైదోడుపుటకు నా కేమోదము నీమీఁద నట్టిమోదము కల దో
భూదయిత! నీకు నృపధర్మాదరమున నిట్లు సేఁత వైతిం గట్టా. 423

—సాత్యకి ప్రాయోపవిష్టుం డైన భూరిశ్రవుని తల నఱకుట—

వ. నీ కాశీనరుం డగు శిబికిం బోలెఁ బుణ్యలోకంబు లగు నని పలుకుచున్నంత మురాంతకుం డోసంతతాగ్నిహోత్రయాజీ! నీవు నుత్తములు వ్యాప్తిపై గమనోత్తమాంగయానంబున బ్రహ్మాదిసురగణసేవ్యమానంబు లైన నాలోకంబుల కరిగి సుఖింపుము మనియె నాసమయంబున సాత్యకి తెప్పిఱిల్లి లేచి కృపాణపాణియై వచ్చి వాసుదేవార్జునభీమసేనయుధామన్యూత్తమౌజసులును గృపాశ్వత్థామకర్ణవృషసేనసైంధవులును సకలసైనికులును వలదు వల దుడుగు ముడుగు మని పేర్వెలుంగునం జెప్పి వారించినను వినక విజయకృత్తదక్షిణహస్తుం డై తొండంబు తెగిన వేదండంబు చందంబునం బొందుపడి ప్రాయోపవిష్టుం డైన కౌరవోత్తముని యుత్తమాంగంబు తత్తఱంబున నుత్తరించె నిష్ఠాగరిష్ఠుం డైన సహస్రాక్షసముం డయిన శలాగ్రజుండు దేహంబు విడిచి పుణ్యలోకంబున కేగుచుండం జూచి ఖేచరు లబ్బురంపడుచు నభినందించి పూజించి రంత మనసైన్యంబున శైనేయుండు మహాపరాధంబు గావించె నని గర్హించువారును క్రోధం బెంతపని యైనం జేయించు ననువారును బడినవాఁ డూరకయుండునే యనువారును విధివిధానం బిట్టులుండె ననువారు నై నానాప్రకారంబులం బలుకుచున్నంత యుయుధానుం డెలుంగెత్తి యిత్తఱి మీ రెల్ల ధర్మసూచనంబులు చెప్పుచు నన్ను వల దని వారింపఁ జొచ్చితి రచ్యుతునల్లునిం ద్రెవ్వనేయునాఁడు మీ ధర్మం బెందుఁ బోయె ప్రతికి యుండం బడవైచి నన్నుఁ దన్నినవాని నెట్టి దైన నన్న గొందు నన్ని ముందు నేఁ జేసిన ప్రతిన నిర్వహించి యుక్తంబ చేసితి నింక మీ రూరకుండుఁ డనిన వా రెవ్వరు నేమియుం బలుక కుండియు మహాత్మ్యానవధ్యపూతశరీరుం డగుభూరిశ్రవు నట్లు వధించుట తగ దని లోలోనం గర్హించి రనిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 424

తే. ద్రోణకర్ణాదిముఖ్యయోధులను జీరి,కిం గొనక సైన్యసాగరముం గలంచి
మించిన శినిప్రవీరుఁ డేమికత మకట, యొక్క భూరిశ్రవుస కట్లు చిక్కెఁ గొంట. 425

—సాత్యకిపరాభవకారణము—

క. నావుడు సంజయుఁ డను నో, భూవర శైనేయుఁ డట్లు భూరిశ్రవుచేఁ
బోవుటకుఁ గారణం బగు, నే వివరించెదను వినుము నిలిపి మనంబున్. 426

సీ. అత్రిమహామునిపుత్త్రుఁ డై వెలసె సో, ముఁడు వానికి బుధుండు పుత్త్రుఁ డయ్యె
బుధునకును బురూరవుఁడు సుతుం డతనికి, నాయు వాయువుకొడుకు నహుషుఁడు
నహుషునకు యయాతి నందనుం డయ్యె నా, తఁడు దేవయానియన్ తరుణియందుఁ
గనియె యదుం డనుతనయు నాతనివంశ, మున దేవమీఢుఁ డాతనిసుతుండు

తే. శూరుఁ డనువాఁడు వానికుమారుఁడు వసు, దేవుఁ డాతఁడు గుణరూపదీప్యమానుఁ
డయ్యె నయ్యన్వయంబునయందు నుదయ, మయ్యె శినియను రాజేంద్రుఁ డాఢ్యుఁ డగుచు.

క. ఆకాలంబున దేవక, భూకాంతుఁడు తనదుసుతకుఁ బుడమిని జాటెన్
గైకొని స్వయంవరోత్సవ, మే కడఁ గలనృపులు వచ్చి రీమహము గనన్. 428

సీ. శిని యందుఁ గలరాజశేఖరుల జయించి, దేవకిం గొని వసుదేవుని కిడఁ
దనరథం బెక్కించుకొని వచ్చుచుండ మీ, సోమదత్తుం డడ్డు సొచ్చి పోరె
శిని సోమదత్తులచివ్వ దినార్ధము, చిత్రమద్భుతము నై చెల్లె నందు
శిని సోమదత్తుని క్షితిఁ ద్రోచి కడకాలఁ, దాఁచి కుత్తుకఁ గోయఁ దలఁపు చేసి

తే. కొప్పువట్టి తిగిచి కోయ కప్పుడు కృపఁ, బుచ్చి దేవకిఁ గొని తాను బోయెఁ బురికి
నట్టు లయి సోమదత్తుఁడు నాగ్రహమున, నడవికిం జని తపియించె హరునిగూర్చి.

వ. పెద్దకాలంబున కమ్మహాదేవుండు ప్రత్యక్షం బై వరంబు వేఁడుకొమ్మనిన నమ్మను జేంద్రుండు సంతసించుచు నాఁటికిం దనదాయయు వానిదాయాదియు లేకునికిం జేసి రోసంబు ప్రేరేప నాపరమేశ్వరునిపాదపద్మంబులం బ్రణమిల్లి శినిపౌత్త్రు నాహవంబున నెల్లరుం జూడ బదతాడితుం జేసి చంపఁ గలపుత్త్రు నిమ్మని ప్రార్థించుటయు నతం డట్ల యగుం గావుత మని యనుగ్రహించి తిరోహితుం డయ్యె నయ్యరుప్రభావం బునం బుట్టినభూరిశ్రవుండు శినిపౌత్త్రు నట్లు చేయఁ గలిగెం గాని నాఁడు సాత్వతుం డొరులకు నేయ సాధ్యుండు గాఁడు వినుము. 430

సీ. అక్కృష్ణసోదరుం డొక్కఁడే కాఁ డెల్ల, వృష్ణివీరులు జగద్విదితయశులు
సంగ్రామకోవిదుల్ సంలబ్ధలక్ష్యులు, చిత్రయోధులు స్వతస్సిద్ధబలులు
నిజపరాక్రమజితనిఖిలలోకులు నిర్జ, రాజయ్యు సమరవిహారపరులు
వృద్ధానుశాసనబద్ధులు ననహాయ, శూరులు ధర్మార్థశుద్ధమతులు
తే. విప్రగురువిత్తవిముఖులు విహితకార్య, కరణదీక్షాధురీణులు కలితగుణులు

చెంత కరుదెంచి యంతయుఁ జెప్పి నాకు, వధ్యుఁ డాతఁడు నీ వేమి వలుకు దిపుడు.

క. నీ వేయఁ బ్రతిన వట్టితి, కావే నా కేయి నయ్యెఁ గర్ణుం డిపు డో
దేవనుత! యుక్త మెట్లో, భావించి నచింపు ముభయపక్షంబులకున్. 502

వ. అని పలికినఁ బార్థుం డలుక గదురఁ గర్ణరథాభిముఖుండై కొంత చని వానిం జూచి
యి ట్లనియె. 503

—అర్జునుండు కర్ణునిం దిరస్కరించి పలుకుట—

చ. తులువ! కులానుసారముగఁ దుర్బలుచు బల్లిదుఁడైనభీమునిన్
బలుకు నొవ్వ నేసితఁట బాలిశ! యేమతిపాటఁ దే ర్చితం
బలిమి యెటూత నీ కగునె శత్రుని కైన జయాజయంబులుం
గలిగెడుఁ గాదె యె ట్లని మొగంబున గెల్ప దరంబె యేరికిన్. 504

క. కులమునకుఁ దగిన తెలఁగునఁ, బలికితి గా కొరులు శూరవర్యులు, లాఁతిం
బలుకరు నిన్నుంబలె నో, పలువా! గెలిచినను నోటు వడినను గలనన్. 505

ఉ. మాయయుధానఁ దిప్ప నిను మార్కొని కార్కొని మూర్ఛ ముంచియున్
మాయెడ భక్తి సేయుటను మాని వధింపక మత్ప్రతిజ్ఞకై
మాయురె భీమసేనుఁడును మాద్రిశు లెల్లరుఁ జూడ నెన్నియో
పాయలు సేసి నీరథము పల్మఱు గెల్వఁడె నిన్ను దూఁటనే. 506

శా. నే లేనప్పుడు నాకుమారకు ననిన్ మీ రెల్లరుం బట్టి మే
లాలోచింపక కూలనేసితిరి నీ వామేటివిల్ ద్రుంచి తో
కూళా! తత్ఫల మందఁగాఁ గలరు మాకున్ దాయ లౌ నందఱున్
నేలం గల్పెద నీసమక్షమున నే నీపుత్త్రు నీక్షింపుమా. 507

క. నీవు న్నీనందనుఁడున్, నీవారును వారివారు నెఱి చెడి పడ నా
కావరుఁడు ధార్తరాష్ట్రుఁడు, వా విడి దుఃఖింప కున్నె వగ దగులంగన్. 508

వ. అని దుర్జయుం డగునర్జునుండు పలుకుచున్నంత హాహాకారంబు సంగ్రామరంగం బెల్లఁ
గ్రమ్ముకొనియె నప్పుడు సహస్రాంశుండు మందరశ్మి యై యస్తమించె నట్టియెడ
జనార్దనుండు తీర్ణప్రతిజ్ఞుం డగుపార్థుం గౌఁగిలించుకొని యి ట్లనియె. 509

మ. తవరం దీర్చితి వుగ్రపుంబ్రతిన వృద్ధక్షత్త్రుఁడుం బుత్త్రుఁడున్
భువభాగ్యంబునఁ జేసి త్రెళ్లిరి సురల్ మా యోడ్డియున్ ధార్తరా
ష్ట్రునిసేనం దరలింప లేరు నిను బోల్ శూరాగ్రగణ్యుండు గ
ల్గిన ముల్లోకములందునున్ విజయముల్ సేకూఱవే యేరికిన్. 510

క. కాలాంతకుఁ డొకఁడే నిను, బోలుపఁ దగినట్టివాఁడు పురుషవరేణ్యా

యాలోకమె మెఱుఁగి మెచ్చెడు, నీలీలం గర్ణుఁ గూల నేసినయంతన్. 511

ఉ. నావుడు నర్జునుం డను జనార్దన! యంతయు నీప్రసాదమే
కావున దుస్తరం బయినఁ గాని తరించితి నీప్రతిజ్ఞ నో
దేవ! భవద్బలంబు గలదే బెలునుం జయసిద్ధిఁ గాంతు రిం
దే విశదమైనవిస్మయ మొకింతయు లేదు నిజంబు సెప్పితిన్. 512

క. ఈవిజయ మెల్ల నీదియ, నే వేఁడు తలంప మేము నీదాసుల మో
దేవేశ! యెడుగడ వై, నీ వమరిననాఁడె మాకు నేలయు నమరెన్. 513

—శ్రీకృష్ణుండు మరలి వచ్చుచు నర్జునునకు రణరంగం బభివర్ణించి చెప్పుట—

వ. అనిన మందస్మితసుందరవదనారవిందుం డై గోవిందుండు మందగమనంబున మాపులం బోవఁ దోలుచు సంగ్రామరంగం బెల్లఁ గలయం జూపుచు ధనంజయా! నీశరపరంపరం దెగినయీపార్థివోత్తములం జూడుము వీరు వికీర్ణశస్త్రాభరణులు విభిన్నవర్ములును విపన్నులు నై నేలం బడి చచ్చియుం జీవనివారిచందంబునం జానొందుచుం బృథివీకాంత నాలింగనము చేసికొని నిద్రించుచున్న వారిం బోలి పోలఁ దోఁచుచున్నవారు వీరిస్వర్ణపుంఖశస్త్రాస్త్రంబులును వాహనంబులును వర్మంబులును మణిహారంబులును సకుండలశీర్షంబులు నుష్ణీషమకుటంబులును హారంబులును జూడామణులును గంఠసూత్రంబులు నంగదంబులును నిష్కంబులును ధ్వజంబులును బతాకలు నుపాసంగంబులును నుపస్కరంబులును నధిష్ఠానంబులును నీషాదండంబులును యోక్త్రంబులును శరంబులును శరాసనంబులును బరిస్తోమంబులును బరిఘంబులు నంకుశంబులును శక్తులును భిందిపాలంబులును శూలంబులును బరశువులును బట్టిసంబులును బరశ్వథంబులును బ్రాసంబులును దోమరంబులును గుంతంబులును యష్టులును శతఘ్నులును భుసుండులును ఖడ్గంబులును ముసలంబులును ముద్గరంబులును గదలును గుణపంబులును గ్రిందంబడి కుప్పతిప్పలై యొప్పమీఱె నైరావణోపమంబు లగునీవారణంబులు శస్త్రచ్ఛేదదరీముఖంబులనుండి శోణితంబు ప్రసవింప దరీముఖంబులం గైరికాంబుపుల స్రవించుమహామహీధరంబుల తెఱంగున నొప్పె నీబాణంబులం దెగి పడినయీయాకంఖాణంబులును నిహతేశ్వరంబులును నికృత్తధ్వజపతాకాక్షచక్రంబులును గంధర్వనగరాకారంబు లైనరథంబులును గాలిపసందు లేనట్లు కూలియున్నవి మఱియు నీగాండీవంబునం బడినధనుర్ధరులు శిరోజంబులు బూడిదం బ్రుంగుడుపడ నెత్తుట నత్తమిల్లినమేనుల నెట్టున్నవారో చూడుము నిపాతితద్విపరథవాజిసంకులంబును నసృగ్వసాపిశితసమృద్ధకర్దమంబును

నిశాచరశ్వవృకపిశాచమోదనంబు నగునీమేదినిం జూడుము తొల్లి దేవదానవులకును సంగ్రామంబులుం దీనిం బోల విది యంతయు భవదీయపరాక్రమంబున బొగడి చెప్పుచు వయ్యరాతిరణభూమి నంతయుం దాటి యజాతశత్రునిసేనావారంబు దరియ వచ్చి యెల్లవారికిం దెలియ సైంధవుండు నచ్చుట సూచించి పార్థా! యిదె మనరణరంగంబు రథాశ్వపదాతిద్విపంబులను వివిధపతాకంబులను వివిధాయుధంబులను దీపించుచుఁ జిత్రపట్టాంచితం బైనభూభాగంబు చెలువున నొప్పుచున్నయది చూడు మని చెప్పుచు స్వజనపహితుం డై పాంచజన్యంబు పూరించుచు ధర్మరాజుం దరియ నరిగి వరునితో నరదంబు డిగ్గి యతనికిం బ్రణమిల్లి నీభాగ్యవశంబున నీతమ్ముఁడు జయద్రథుం జంపి కృతప్రతిజ్ఞుం డయ్యె నీవు ధన్యుండ వైతి వనిన నతండు ప్రహృష్టాంతరంగుం డై శతాంగంబు డిగి బాష్పపరిప్లుతాననుం డై కృష్ణార్జునుల నొక్కసందిటం గదియించికొని యి ట్లనియె. 514

కృష్ణార్జునులు ధర్మరాజుం దరియ వచ్చి సంభాషించుట—

క. నాభాగ్యంబునఁ గంటి మ,హాభారము గడపి వచ్చినట్టిర మిమ్ముఁగా
నాభవము మేల సైంధవుఁ, డీభూమిన్ విడిచె రిపులయేడ్పులు చెడఁగా. 515

వ. అని వాసుదేవునిదిక్కు మొగం బై. 516

ఉ. ఈవు సమస్తలోకముల కీశుఁడ వై పరిరక్ష సేయు దో
దేవ! భవత్కటాక్షమునఁ దేలినవారికి దుష్కృతం బొకిం
తే వఱలంగఁ బోద నిన నేడ్గడ వై మము నెప్డుఁ గావఁ గాఁ
బ్రోవఁగ నుంటి మాకు శుభముల్ లభియించుట లెన్నఁ బ్రాఁతియే. 517

సీ. నీప్రసాదంబుననే కదా పాకశా,సనుఁడు త్రిలోకవిజయముఁ గాంచె
నీతుష్టి కైనవానికిఁ బాపమును జన్య,మునఁ బరాజయమును దనరఁ బోవు
నీయనుగ్రహపాత్రు లై యమరత్వముం, గొని త్రిదశులు సుఖంబునను నైరి
నీకృపం జేసియే నిఖిలప్రపంచముల్, కదలక సుస్థితిఁ గాంచుచుండు

తే. దొల్లి యేకార్ణవం బయి పెల్లు రేఁగి, చిమ్మచీకటు లెల్లెడఁ గ్రమ్మునట్టి
జగము నీప్రభావముననె తగ వెలింగె, నీవు స్రష్టవు పరమాత్మ వీవ హరివి. 518

ఉ. నిన్నుఁ బురాణపూరుషుని నిత్యుని సత్యుని నిర్మలాత్మునిన్
సన్నుతమూర్తి నిం దెలిసి సంతతముం భజియించుచుండువా
రెన్నఁడు మోహపాశముల కింతయుఁ జిక్కక సౌఖ్యదక్ష యు
త్యున్నతభూతి నొందఁ గల రుత్తమలోకము లంది పొందుగన్. 519

ఉ. వేదము లేయుపాయములని చేయి తెఱంగుల విన్నవించుచున్
గా వన కావి దేవుఁడు జగత్త్రయవల్లభుఁ డంచుఁ దెల్పుచున్
బాదము సేయుపట్టినను వాసవవందితు వాసుదేవునిన్
నా దిగుమానసాంబుజమునం బొదలించి నమస్కరించెదన్. 520

వ. అని యనేకవిధంబులం బ్రస్తుతించినం బ్రసన్నుం డై పుండరీకాక్షుండు పాండవా
గ్రజుం బ్రతికించి యిట్లనియె. 521

—శ్రీకృష్ణుండు ధర్మరాజుం బ్రశంసించుట—

శా. వాకో నేటికి మమ్ము మా ప్రతినయున్ వ్యర్థంబ మాపూన్కియున్
నీకోపాగ్నియ కాల్చివైచె బలమున్ సింధుక్ష్మావల్లభున్
నీకై మేము నిమిత్తమాత్రుల మనిన్ నిక్కంబు ని న్నిట్టు లా
లోకింపం గల దెల్లలోకము శుభశ్లోకుండ వీ వన్నిటన్. 522

తే. నిన్నుఁ గోపింపఁ జేసిననీచు ధార్తరాష్ట్రుఁడు సబంధుమిత్త్రుఁ డై రాలఁ గలఁడు
కురుపితామహు నీక్రుధాభరమ కాదె, చేసె శరతల్పగతునిఁ గా క్షితితలేశ. 523

ఉ. పాండవవిద్విషుం డయినవాఁ డెటువంటిపరాక్రమంబునన్
నిండినవాఁడ యైన ధరణిన్ మరణించినయట్టివాఁడ యాఁ
బండితలోకసన్నుత! ధ్రువంబుగ ని న్నదిరించె ధార్తరా
ష్ట్రుండు సబాంధవంబుగ వసుంధర వీడెడువాఁడ కావునన్. 524

వ. అని సంభాషించుచున్నసమయంబున భీమసాత్యకులును యుధామన్యూత్తమౌజ
సులును వచ్చి యభివాదనంబు సేయుటయు నమ్మహీవల్లభుండు వారలం గ్రుచ్చి
కౌఁగిలించుకొని హర్షాశ్రుమోచనంబు సేయుచు మీరు నామాటం బాటించి
ద్రోణగ్రాహదురాధర్షంబును హార్దిక్యమకరాలయంబును ఘోరంబు నైనకౌరవసాగ
రంబు సొచ్చి ద్రోణహార్దిక్యులం దూలించి కర్ణాదులం బరాభూతులం గావించి
మద్రపతి విముఖుం జేసి తక్కినవారి నుక్కడంచి యుత్తీర్ణు లై వచ్చి నాభాగధేయం
బునం జేసి నాకంటం బడియున్నవారు నాపుణ్యాం బగణ్యాంబని వారి ననేకవిధం
బుల నభినందించి సంతసించె నంతఁ గౌంతేయబలంబు నత్యంతక్రోధంబునం జేసి
కయ్యంబునకుం గాలు ద్రవ్వుచుండె నాఁటిరాత్త్రియును మహాప్రధనం బుభయపక్ష
ములవారికిం బ్రవర్తిల్లె నని చెప్పిన శౌనకాదిమహర్షు లాయుద్ధప్రకారంబు సెప్పు
మని సూతు నడుగుటయును. 525

ఆశ్వాసాంతము.

మ. ఒకజన్మంబది మూఁడుజన్మములచెయ్వుల్ సెప్ప నే నామనః
ప్రకృతింబట్టి వచింతు నెప్పుడును ఘోరం బైనపాపంబునం
బ్రకటింపం బడి యుండఁ గా నెఱుఁగ నేపాపంబు పైఁ బెట్టి పు
త్రకునిం గూల్చితొ నాకు నేద గతియో త్రైలోక్యరక్షామణీ. 526

క. పాపికిఁ బ్రాయశ్చిత్తము, రూపింపం బడుట లేదొ రూఢిగఁ జెపు మే
నీపాదార్చకుఁడను నా, కేపాపము మిగిలి యుండు నెది గతి తండ్రీ. 527

గద్యము.

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్ర వేంకటయ్యజ్వాగ్రపుత్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందు
ద్రోణపర్వంబునఁ జతుర్థాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.

---



శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

## ద్రోణపర్వము-పంచమాశ్వాసము.



క. శ్రీవత్సాంకితు నాఘుతు
సేవకుఁ గాఁ గొంటి వాఁడు ఏలితేఁడు నన్నున్
సేవార్థము గాఁ గొనిపో
మ్మీవర మర్థించినాఁడ నిమ్ము మహాత్మా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కి ట్లనియె నట్లు కృష్ణార్జునాదులు ధర్మరాజుం గలసినపిదప నైన యుద్ధప్రకారంబు సెప్పు మనిన ధృతరాష్ట్రునకు సంజయుం డి ట్లనియె. 2

తే. వినుము రాజేంద్ర సింధుభూవిభుఁడు దెగిన,యంత దుర్యోధనుఁడు దీనుఁ డస్రుపూర్ణ
ముఖుఁడు దుర్మనుం డయి లోకమునకు నెగ్గు,సలిపిన ట్లెంచుచు నిరుత్సాహుఁ డయ్యె.

వ. వివర్ణుం డై భగ్నదంష్ట్రోరగంబుభంగి వేఁడినిట్టూర్పు నిగిడించుచుఁ గడుంగడు నార్తిం బడి తనమనంబున. 4

సీ. అక్కట భీమసేనార్జునసాత్యకుల్, నాకృతఘ్నేఁడు రూపు మాపి
రర్జునునకు సాటి యగుజోదు భూతలం,బున నొకండుఁ డేనియుఁ బుట్టఁబోడు
గురుకృపకర్ణులుం గురుపుత్త్రుఁడుం గ్రుద్ధుఁ, డగువాఁడుమునుమున నలరఁ జాల
రతఁడు మహారథుఁ లగునందఱుఁ ద్రుణీక,రించి సైంధవుతలఁ ద్రుంచి పుచ్చె

తే. నెటులు చూచిన నాబల మెల్లఁ బాండు,సుతులచేఁ దెగుఁ దప్పదు సురవిభుండు
తాన చనుదెంచి కావంగఁ బూనుకొనినఁ, గాని నాబలంబుఁ బదుకవాసిఁ గావ లేఁడు.

ఉ. ఏనిబలంబు నమ్ముకొని యీ ససికిం గడకట్టి యుంటి నో
యేని సమాశ్రయించి శమ మొంచినకృష్ణుఁ దృణీకరింతు నో
తా నలకర్ణుఁ డిప్పుడు మృధంబునఁ గ్రీడికి నోడెఁ బెక్కు మా
ర్లానగ లేక సైంధవుఁడు న ట్లయి పోయె నిఁ కేమి సేయుదుఁ గా. 6

వ. అని పలుదెఱంగులం బలవించి పలవించి ధనురాచార్యునిచెంతకుం జని యిట్లనియె.

—దుర్యోధనుఁడు గురునికడకుం జని పరిపరివిధంబులఁ బరితపించుట—

తరువోజ. కటకటా గురువరా! కంటివే కాను, ఘనుఁడు గాంగేయుండు కడతేఱె నొక్క
కుటిలుచేఁ దెగి కొనకొని [illegible], ద్రోణిశిష్యులు గాచుకొనియున్న సింధు
కటకేశ్వరుని కూల్చెఁ గవ్వ్రి [illegible], కనుమి నీ కనుఁగొనయ [illegible] భాని
పటుశస్త్రహతి ద్రెళ్లి పడెను నాకొఱకు, పలువురు రాజులు బలి యైరి తలఁప. 8

ఉ. వారిఋణంబు దీర్చుకొనువాఁడను గా నిఁక వారి మిత్తి కేఁ
గారణభూతుఁ డైతిఁ గద కాపురుషుండను వాజిమేధముల్
వారక వేయి చేసినను బావనతం గలిగింప లేవు నా
కీరహి పాపికిన్ వివర మీయదు భూమి యి దేమి చోద్యమో. 9

క. నాచేసినతప్పునకుఁ, రాచకొలం బరయ రుధిరరక్తాక్షుం డై
చూచుచు గాంగేయుఁడు న, న్నేచక్కిం గఱకు లాడ నెంచెడి నొక్కో. 10

సీ. జలసంధుఁ డల్లదె సాత్యకిచేఁ దెగి పొలికలనం బడె బిలుకుమాలి
వీరె కాంభోజాదివీరు లలంబున,ప్రభృతులు మిత్రులు రణముఖమున
నాకుఁ గాఁ బ్రాణముల్ పోకార్చుకొనిరి నే, నిపుడు జీవింపంగ నేలొ కొఱఁగ
వారియప్పం దీర్చువాఁడ నైతిన యేని, తత్ప్రీతికొఱకు శాత్రవుల నెల్ల
తే. నుగ్గునూఁచంబు గావించి లోగ్గడిలక, నర్మదానది వారి కంజలుకుఁ దృప్తి
గా నివాపాంజలు లొసంగఁ గలను గాని,నాఁడు నేఁ జచ్చి వారితో గూడఁ గలను.

ఉ. నిన్నన నేల పాండవుల నీవు గడుంగడు గారవంబునన్
గన్నులఁ గప్పుకొందు వొకకాలమునాఁటికి మమ్ము నూఁప్రజన్
మన్నన సేయ వర్జునుఁడు నమ్మిన శిష్యుఁడు గాన వానిపైఁ
గ్రొన్నన లెత్తుప్రేముడిని గ్రోధము సూపవు నెమ్మనమ్మునన్. 12

ఆ. నీయుపేక్షవలన నే యింతపని పుట్టె, నీ వొకింత యలిగితేని పగఱు
మిత్తివాతఁ బడినయొత్తొరవున కయి, పోరె వేఱ యిట్లు పొల్లలేల. 13

క. నేన జయింప వలయు నని, మానసమున నభిలపించు మాన్యచరిత్రుం
డైనట్టిఁడు కర్ణుఁ డొకం,డే నామది కర్యో నన్యుఁ డేడీ చెపుమా. 14

మత్త. మిత్రుఁ డెవ్వఁ డమిత్రుఁ డెవ్వఁడు మీఁదెఱుంగక మందుఁ డై
మిత్రకార్యమునం దమిత్రుని మేళగించినవాని కే
మాత్ర మైనసుఖంబు గల్గదు మన్నగుఁ గద కార్య మీ
ధాత్రి దానికిఁ దారకాణకు దప్పు వోవఁగ నేటికిన్. 15

వ. అక్కటకటా! జయద్రథభూరిశ్రవులును శిబివసాతిశూరసేనాభీషాదులును నాకుం గాం బోరి పోరి ప్రాణంబులు విడిచిరి వారు లేకున్న నే నుండి ప్రయోజనమ్ము లేదు గావున నేనును వారిమార్గం బనుసరింపం బోవువాఁడ బాంధుపుత్త్రాచార్యుండవైననీవు నా కనుజ్ఞ నొసంగు మనిన దుర్యోధనుని దురాలాపంబులు విని విన్నఁ బోయినమనంబుతో నొక్కముహూర్తమాత్త్రం బూరకుండి కటకటం బడుచు గురుం డిట్లనియె. 16

—గురుండు దుర్యోధనుని జెంప నాడుట—

ఉ. ఏటికిఁ దూటు వోవ మది నిట్టులు చిట్టలు గాఁగ మాట లి
మ్మేటిశరంబులన్ వడిగ మీటి నొగుల్తువు నీకు నింత నో
నాటకుఁ గారణంబు గను నెయ్యెనె యయ్యమరేంద్రసూతి నే
నాట జయింప రామి మును నాటఁగఁ జెప్పితిఁ గాదె మాటికిన్. 17

ఉత్సాహము. విజయుప్రాపు కలిమిఁ జేసి వీరుఁ డాశిఖండి దా
త్రిజగదీశితప్రభావు దేవవాహినీసుతున్
ధ్వజినిఁ జెదర జేసినపుడె తావకీను లెల్లరున్
నిజము గా నశించి రంచు నేఁ దలంచితిం జుమీ. 18

ఆ. వత్స! నాఁడు శకుని వైచినయడ్డసా, ళ్లిపుడు విజయుచేత నెనకమెనఁగు
మహితశస్త్రములుగ మాఱి నొప్పించెదు, మనల నెల్ల నిట్లు మాట లేల. 19

చ. విదురుఁడు సెప్పెఁ దొల్లి యవివేకమనస్కుఁడ వౌట నాశుభా
స్పదవచనంబు లీవు వినఁ జాలక బుద్ధి మదగ్రగణ్యులన్
వదరి నిరాకరించితి వవశ్యము గా ఫల మందు నాస్పదా
క్పదమునఁ బోవనట్టిపలుగాకి మహాపద లంది కుందుచున్. 20

అలసవృత్తము. అలసభకుఁ బుణ్యవతి నందఱును జూడ గో
దులువ పంబు దెచ్చి తది దుష్కృతము గాదొ
ఫల మనుభవింతు విటు బాయ కట మీరఁగా
దలములుగ నై మఱియుఁ దన్ను గొని వచ్చున్. 21

మ. వినుమద్యూతము వన్ని గెల్చెఁ గొని తద్విఖ్యాతరాజ్యంబు పె
మిష గల్పించి హరించి తో ల్లొడిగి పో నిర్మించి తేమందు దు
ర్విషహం బైనవనంబునం బడలి రా వీరోత్తముల్ వారి ని
ట్టిషుపాతంబునఁ గూల్ప నెంచితివి పాపీ పాప మల్పం బొకో. 22

మత్త. అట్టిధర్మపరుల్ పరాత్మకు లాపృథాసుతు లెన్న నీ
యట్టిచెట్ట సమాశ్రయించుట కైరి చేకొన కీవు మా
పెట్టి తంత్రము వారిపై నిది పెర్మిగా దన కేను నా
పట్టిఁ బోలినవారిఁ బోరెద బ్రహ్మజాతికి రాతుఁడన్. 23

సీ. ధృతరాష్ట్రననుమతి నీవు దుశ్శాసనుఁ గూడి సౌబలునిచేఁ గోప మిట్లు
పుట్టించితివి పాండుపుత్రుల కది కర్ణుఁ, డుద్దించి పెఱిగించి పెద్దఁ జేసె
విదురుండు హితమెంచి వేగతుల వచించె, విన వైతి వానిని వీనులఁ బడ
నీవుఁ గర్ణుండును గృపుఁడు నశ్వత్థామ,యును బూఁచిపట్టియుఁ బెనఁగి రీరు

తే. బ్రదికి యుండియు నమ్మినబంధు వాజ,యద్రథుఁడు వాని బ్రదికింప నైతి రొకని
నాఁగ నోపక నే నొక్కఁడయ్యె నిచట, నెంతమందిని మాఱ్కొంటి నెఱుఁగ వొక్కొ.

మ. ఒకసింధుక్షితినాథుఁ గాచుకొనఁగా నొక్కింతయుం జాల కీ
వొకమర్త్యుండ నటంచుఁ జెప్పుకొనుచున్ హారొరాట మాఁబోటివాం
డ్రకు వాగాయుధ మీయఁ జాలితివి మూఁఢా! భీష్ముఁ డేనాఁడు క్షో
ణికి నై పోయెనొ నాఁడె క్షోణియు ఖలుఁడ నిన్బాసెనం చెంచితిన్." 25

తే. సింధురాజాదులును జలసంఘసోమ,దత్తపుత్రాదులును రణధాత్రిఁ బడిన
మీఁద నీ కిపు డేమియు మిగులఁ బోదు,జయముఁ గోరెద వీ వెంతజడుఁడ వొక్కొ.

వ. అని పలికి మఱియును 27

—కర్ణుండు పాంచాలురం జంపక గవచంబు విడ నని ప్రతిజ్ఞ చేయుట—

క. పాండవసృంజయబలములు, నిండి ననుం దాఁక వచ్చె నే నిదె నీతో
నుండఁ జనదు పో వలయున్, భండన మొనరింప భూమిపతిహితమతి నై. 28

క. ఈకూడినపాంచాలుర, వీఁకం దునుమాడ కేను విడువను గవచం
బో కురువర నీకోపినఁ, జేకూర్పుము రేయిఁ బోరు చెల్లెడు భర మై. 29

తే. నాకొడుకుఁ బిల్చి పితృభక్తి నీకుఁ గలుగ... చాకున్న పాంచాలసైనికులను
మిగుల కుంపఁగఁ జేయుము తగిలి ధర్మ,శత్ప... ర్మించి దమము శమము. 30

ఆ. అగ్నిశిఖకుఁ బోని యట్టిరు విప్రులు, వారి కె... వలవ దెపుడు
పూజ సేయ వలయు భూరిదక్షిణ లిచ్చి, వారిఁ బలుక యొంకపనికిఁ గాదు. 31

వ. అని బోధించి ధనుర్బాణపాణి యై పాండవపాంచాలబలంబులం జొచ్చె దుర్యోధ
నుండు నట్లాచార్యవచనప్రబోధితుం డై క్రోధించుచు రాధానందనుం జేర నరిగి
యి ట్లనియె. 32

మది నరయ నింతయేనియు, నోదవదు దోషంబు గురుని నొప్పన తెగడన్. 43

ఆ. అట్లు సవ్యసాచి యాచార్యుఁ జీటికిం, గొనక మోహరమునఁ జనియె నవఁగ
నస్త్రవేత్త మైననాచార్యుఁ డప్పాండ,వులను గెలువ లేమి తెలియ వచ్చు. 44

వ. అదియునుం గాక. 45

ఉ. దైవము లోఁ దలంచినది తప్పదొకప్పుడు దాని కన్యథా
భావము గల్గ నేర దని పల్కెద 'నీవును నేను నీదొరల్
గావఁగ నున్న సైంధవునిఁ గవ్వడి యొక్కఁడ త్రెవ్వ నేసె నిం
కే వివరింప నేమిటికి నెప్పుడుఁ బౌరుషముల్ వృథా వృథల్. 46

ఆ. కృతము ననుసరించి కృత్యముల్ నడచెడుఁ, బౌరుషంబు దానఁ బల్కుక నగునె
సఫల మైనదాన స్వప్రయోజకతయుఁ, గాక యున్న దైవఘటన మండ్రు. 47

క. దైవానుగృహీతునకుం, గావలయు నన్న ఫలించుఁ గార్యము లెల్లన్
దైవోపహతునకార్యము, వోవును విఫలంబ యగుచుఁ బురుషవరేణ్యా. 48

క. సర్వము దైవాధీనము, నిర్వచనము సేయ నేల నిజ మరి నోర్వన్
గర్వించి మనము చేసిన, సర్వంబును విఫల మగుచుఁ జనియెం గాదే. 49

సీ. పవఁ బూని మనము పాండవులను వంచించి, విషయోగ మొనరించి వేర మెంచి
జతుగృహంబునఁ గాల్చి శకునిమాయం జూద,మున గెల్చి వనులకుఁ జన నొనర్చి
పలుదెఱంగుల నిక్కృతులు వన్ని వారికిఁ, జేటొనర్పఁగ లేని చెనఁటు లైతి
మరయ వారలు దైవపరిరక్షితు లన్ని తా,ర్క్ష్యాణ యగుచు నుండఁ గలదె పలుక

ఆ. నింత కైనవెనుక నిపు డిట్లు తలఁకుచు, దూఱి పెరల మనల దూఱుకొనుట
తగవు గాదు గాన దైవము నటు వెట్టి, పోరుకొనుము యత్నపూర్వముగను. 50

తే. వారియందును మీయందు నారయంగ, మంచిచెడ్డలు దోషని మార్గ మైన
దైవబలముననే వారు దనరుచుండ్రు, సుప్తుని లేపి దైవంబ చొరఁగఁ జేయు. 51

ఆ. అల్పబలులు వార లధికబలులు మీరు, పడియెఁ బోరు మీకుఁ బవరమందు
వారె మిమ్ము గెలుచువా రైరి నా దైవ,బలము ప్రబలి పురుషబలము నడఁచు. 52

—ఘటోత్కచవధపర్వము.—

వ. ఇట్లు వా రిద్దఱును సంభాషించుకొనుచున్న సమయంబున నుభయసైన్యంబులును సన్నద్ధంబులై యమరాష్ట్రవర్ధనంబుగా మహాయుద్ధంబు గావించె నప్పుడు తేరు తేరు వారువము వారువము వారణము వారణము, బత్తిఁ బత్తియుం దాఁకి వీఁకం జూపుచున్నంతఁ గురుపాంచాలయోధులుతమతమగోత్రనామధేయంబులుచ్చరించుచు నొకళ్లొకళ్లు శరశక్తిపరశ్వథతోమరభిందివాలపరశుపట్టసాదినానావిధాయుధంబులం

ప్రయోగించుకొనిన నయ్యాయుధంబులు దశదిశలం గ్రమ్ముకొని మిడుంగురుల
తెఱంగున సమ్మునిమాపు చూపట్టె నట్టిసమ్మర్దసమయంబున దుర్యోధనుండు సైంధవ
వధాభితప్తచిత్తుం డై తత్తఱంపడి తానునుం దనతనువుపై నాస విడిచి రోషరూ
షితుం డై రథఘోషంబున నవనీతలం బెల్ల నద్రువఁ బాండవానీకినిం జొచ్చి విచ్చ
లవిడి విహరించుచుఁ బట్టపవలింటిసూర్యునిపగిదిఁ బ్రజ్వరిల్లుచు నానావిధాస్త్రశస్త్రం
బుల నిగిడించుచుండునంతఁ బాండవబలంబు లుద్దండపరాక్రముం డగునాతనిం
గన్నెత్తి చూడఁ జాలక పలాయనకృతోత్సాహు లై రంత దంతావళాలోడిత
మైననళినీవనంబువలెఁ దమసైన్యంబు దైన్యంబు నొందుటం గని భీమసేనపురోగు లై
పాండవపాంచాలవీరు లొక్కపెట్టఁ జుట్టుముట్టి తెట్టలు గట్టునట్లు బిట్టేయుచున్న
నక్కురుక్ష్మావల్లభుం డుక్కుమిగిలి. 53

సీ. భీమసేనునిఁ బదివిశిఖంబులన్ మాద్రిపుత్రుల నిర్వుర మూఁట మూఁట
ద్రుపదవిరాటులం దొడరి యాఱింట ధృష్టద్యుమ్ను నెబ్బదిసాయకముల
ధర్మపుత్రుని నే డుదగ్రభల్లముల శిఖండి నూఱింటను దండిమగల
ద్రౌపదేయుల నేవురను మూఁడు మూఁడింట, శినిమనుమని నైదుశితశరముల
తే. నలఘుటోత్కచు నర్వదియంబకములఁ, జేదికైకయమత్స్యాది భూదయితుల
వేనవేలు శరంబుల విసరి వ్రేసి, నూఱులకొలంది జోదుల నుఱిమి యార్చె. 54

చ. అదరి యుధిష్ఠిరుం డపు డహంకృతి మీఱి శరద్వయంబునన్
నడిమికి మూఁడు ముక్క లయి నారియు విల్లును ద్రెళ్ళ నేసి నీ
కొడుకుశరీరమందుఁ బదిక్రూరశరంబులు గ్రుచ్చి యార్చుడున్
వడి వడిఁ దచ్చమూపతులు వానికి బాసటలై రతఁ డంత నుగ్రుఁ డై. 55

క. బెడిదపుట మ్మొక్కఁడుసు వడి, వడి వింటం గూర్చి తిగిచి భవదాత్మభవున్
గడ తేఱు మనుచు నేసెన్, జడుఁ డాతఁడు తేరిమీఁదఁ జదికిలఁ బడియెన్. 56

వ. అట్లు పడి మూర్ఛాన్వితుం డయినం గని వారిసైనికులు దుర్యోధనుండు సచ్చె నని
విచ్చలవిడి నఱచుచుం దూర్యంబులు మొఱయించి రత్తఱి గురుం డతిత్వరితగతిం
బఱతెంచి పాండవాగ్రజుపయిం గవిసె నంతన తెలివొంది నీనందనుం డగ్గురునిరాక
కానందించుచుఁ గోదండం బొండు పూని కవలుచు. 57

చ. నిలు నిలు మెందుఁ బోయెదవు నేఁ గల నింద మదస్త్రశస్త్రముల్
నిలువున నిన్నుఁ జీల్చుకొని, నీదుకవోష్ణపు నెత్తు రానఁ గాఁ
గల వివె నాల్క లార్చెడిని గాచుకొనం గలవాఁడవో యటం
బలుక యుధిష్ఠిరుం గలిసె నంగబలంబును నంగవింపఁగన్. 58

తే. శమనసుతుఁ గావ నపుడు పాంచాలయోధు,లతని రాచార్యుఁడును భవదగ్రజన్ము
రక్షణముఁ గోరి వారిపై నాక్షణమున,గలియఁ బడుటయు ఘోరసంగ్రామ మయ్యె

క. అన విని ధృతరాష్ట్రుఁడు న,త్తనయునితో నట్లు పలికి ధనురాచార్యుం
డని బాంచాలుర నందఱఁ, దునిమెన యని తోఁచె వానిదోర్బలము వినన్. 60

వ. మనం బయ్యె నెఱింగింపు మనిన సూతనందనుం డిట్లనియె నట్లు పాంచాలబలంబు లపైఁ బడి భారద్వాజుండు ఘోరంబుగం బోరుచుండ మత్స్యసాళ్వపాంచాలాది సేనాసమేతులై శ్వేతవాహనసాత్యకులును యుధిష్ఠిరభీమమాద్రేయద్రౌపదేయులును విరాటద్రుపదులును ధృష్టద్యుమ్నఘటోత్కచకైకయులును, నాల్గువేల ప్రభద్రకసైన్యంబుతో శిఖండియుం దక్కనుం గలరాజలోకంబు నొక్కమొగిఁ జెక్కుచెదరక నానావిధప్రదరంబులం బ్రయోగించుచు భారద్వాజుపై నడరి రప్పుడు సంజకెంజాయ లడంగం బెనంగిన సంతమసంబునకుం దోడునీడయై ధరణీపరాగంబు పిల్లుకేఁగి యెల్లెడలం గ్రమ్ముకొనియె నట్టిరజనీసమయంబున శివారావంబులును ఘూకనిస్వనంబులును భూతప్రేతపిశాచనిధ్వానంబులును మనసేనలకు భయంబు సూచించుచుండ నిరువాఁగునందును భేరీభాంకారంబులును మృదంగానకనినాదంబులును గజబృంహితంబులును హయహేషితంబులును ఖురనేమినిస్వనంబులును బోరుకలుగఁ గన్నును మిన్నును గాన రాకున్న నుభయసైనికులును దావానలదందహ్యమానానూనవంశవనంబునుం బోలె నందితరేతరప్రయుక్తప్రదరసంఘట్టనధ్వానంబు మిన్నంట నంటి పోరుచుఁ గశ్మలంబు నొందినడెందంబుతో నెదిరిఁ దమ్మెఱుంగక యిచ్చవడి యుండునంతఁ గొంత వడికి వరనాగాశ్వగాత్రనిస్సరద్రుధిరప్రవాహంబునం బరాగావరణం బడంగ మకుటాంగదాదిభూషణంబులయు మణీగణఖచితకవచాదులయు శకలీకృతాసిశక్తిగదాఖడ్గముసలప్రాసపట్టసహేతివ్రాతంబులయు ప్రకాశంబున రణరంగంబు నాతితమంబై తారాగణపరివృతంబైనగగనంబు తెఱంగునం దురంగలింప నారాత్రి యుద్ధంబునఁ గ్రుద్ధుండును వయోగుణవృద్ధుండు నగునాచార్యుం డవార్యశౌర్యధుర్యుండై నారాచపరంపరలం జేసి తన్నెదుర్కొనినపాంచాలపాండుసైన్యంబులఁ బాఱఁదోలి నాగసహస్రంబులును స్యందనాయుతంబుల్లును బదాదిప్రయుతంబులును హయార్బుదంబులును గుప్పకూల్చి కైకయులం గండడంగించి ధృష్టద్యుమ్నపుత్రులం ద్రుంచి శత్రుసైన్యంబ్బులం గనుపుగొట్టుచుండె నట్టియెడ శిబి యనురాజేంద్రుండు ధైర్యసాహసోద్దీపితుండై తన్నుమార్కొనుటయును. 61

ఉ. పారశవాశుగమ్ములను బాణగురుండు పదింటి నారిపైఁ
గూరిచి యేసె నాశిబియుఁ గోలలు మూఁడుపదుల్ నిగిడ్చి యా

ధారుణిదేవు దేహమునఁ దద్రథసారథి నొక్కతూపునన్
దేరిపయిన్ యమాలయముతెర్వుఁ గనుంగొనఁ జేసెఁ జేసినన్. 62

వనమయూరము. ఈసునను జాపగురుఁ డేచి శిబిబాబా
నాసిరిలి చేసి వెస నవ్వుచు నియంతన్
వ్రేసి కుశలేశుతల త్రెస్సి యిలఁ గూలం,
జేసె రిపుకోటి వెఱఁ జెంది మదిఁ గుందన్. 63

క. సీతనయుఁ డప్పు డొండొక,సూతుని నియమింప నశ్వచోదకుఁడై రా
నాతఁడు మెచ్చుచు గురుఁడుం, బ్రీతిమెయిన్ రథము నెక్కి రిపులం దోలెన్. 64

వ. అప్పుడు కళింగేశ్వరునినందనుండు తనతండ్రిం జంపినపగ మనంబునం దిడుకొని కడు
వడిం జని వడ్ముడిం దొడరి. 65

—భీమసేనుఁడు విజృంభించి దుర్మదాదులం దునుముట—

మత్త. వాఁడిభల్లము లేను నేడును వానిమీఁద విశోకుమై
మూఁడు టెక్కెముఁ దాఁక నొక్కఁడు మొక్కలీఁ డయి యేసినన్
గ్రీడియన్న మహోద్ధతుం డయి క్రిందు మీఁదును జూడ కూఁ
గాడి వానిరథంబుమీఁదికి నట్టె దాఁటి జవంబునన్. 66

క. పిడుగునకు దీటువచ్చెడు,పిడికిటిపోటునఁ గళింగపృథివీశసుతున్
బొడిచెం బొడిచిన నెమ్ములు, పొడిపొడిగై రాల వాఁడు పుడమిం బడియెన్. 67

వ. ఇట్లు కళింగ పుత్రునిం జంపిన సైరింపక కర్ణుండును వానితమ్ములును నొక్కుమ్మడి
భీమసేనునిపై నాశీవిషోపమమ్ము లగుబహునారాచమ్ములు ఝిగిడించు చున్నంతఁ
గిమ్మీరాంతకుండును. 68

సీ. కాళింగరథమును గేలఁ గూలం ద్రోచి, ధ్రువునిరథంబుపై దుమికి వాని
వానివలెం జేసి వడి జయరాతుని,యరదంబు మీఁదికి నరుగుదెంచి
సింహధ్వనిఁ బొనర్చి చెచ్చెఱఁ గడకేల, నమయించె నొక్కొక్కచఱపు చఱచి
కని కర్ణుఁ డెంతయుం గనలి యంత మహోగ్ర, మగుశక్తిఁ గొని యేసె ననిలతనయు

తే. నతఁడు దాని నొడిసి పట్టి యతనిమీఁద,విసరెఁ బైఁ బడునాశక్తి వెస నడుమన
తునియలుగఁ జేసె గాంధారజనవిభుండు, సూతనందనుపైఁ గల ప్రీతిఁ జేసి. 69

వ. ఇట్లు మహాద్భుతకార్యంబు గావించి వృకోదరుండు నిజస్యందనం బెక్కి సేనల భ్రమం
దించుచుండె నంత నంతకాకారుం డగువాని మార్గాని నీకుమారుం డగుదుర్మ
దుండు శరవర్షంబు గురియించుటయు నవ్వుచు నతండును. 70

తే. సారథిం జంపి హయములఁ జక్కడంచి,దుర్మదుని నొవ్వనేయుఁడుఁ దొట్రు గుడిచి

యతఁడు దుష్కర్ణుతేరిపై కరిగె నన్న,దమ్ము లిద్దఱు యేకరథస్థులగుచు. 71

క. అతిమి మరుత్తనయునిఁ గడు,మెఱుంగుటమ్ములను నేయ మీఱి యతం డరి
దఱు సూడఁ గాలితాఁపున, నెఱి చెడఁ దద్రథముఁ గూల్చి నేలకు నంతన్. 72

ఉ. వారలఁ బట్టి ముష్టిహతి పర్వఁగ మర్దన మాచరించి సం
హార మొనర్చి యుగ్రగతి నార్చి తనర్చె నరేంద్రు లెల్ల హా
హారవ ముప్పతిల్ల మరుదాత్మజుఁ గన్గొని రుద్రుఁ డిట్టు లా
కారముఁ బూని వచ్చె నని కాతరులై విడి పాఱి రూర్చుచున్. 73

వ. ఇవ్విధంబున నవ్వాడముడి విచిత్రవధప్రకారంబు విస్తరిల్లం జేసి యుధిష్ఠిరునికడకుం
జని నకులసహదేవవిరాటద్రుపదకేకయాదులు వినఁ దనవిజయం బన్న కెఱింగించు
టయు నతండును వారును వాని నభినందించి రప్పుడు. 74

చ. తిమిరఘనావృతం బగుచు దిక్కు లెఱుంగఁగ రాక యుండునా
సమయమునందు నీసుతులు శల్యముఖప్రభువర్యులున్ గురూ
త్తమునిఁ బురస్కరించుకొని దారుణ మాపవిదారణంబు వి
క్రమ మెసఁగం బొనర్చి రట గాడ్పుతనూజుఁడు దొట్టె వారితోన్. 75

వ. అయ్యవసరంబున 76

—సాత్యకి సోమదత్తునితోఁ బోరి విరథుం జేయుట—

క. పుత్త్రునిఁ జంపినసత్యక,పుత్త్రుఁ డనిం దారసింపఁ బూర్ణస్పర్ధన్
బ్రాత్రుఁ డగుసోమదత్తుఁ డ,మిత్త్రుం డగువాని నరసి మిడుకుచుఁ బలికెన్. 77

ఉ. తూత్రము గల్గుప్రాజ్ఞుఁడు దగన్ శరణంబు జనువానిన్ సమి
ద్ధాత్రికిఁ గానివానిఁ భుజదర్పము సూపక న్యస్తశస్త్రుఁడై
యాత్రము నొందువానిఁ దెగటార్పరు నీ వొకక్షత్రియుండ వై
క్షత్రియధర్మమున్ విడువఁ జాలి గ్రహించితి దస్యుధర్మమున్. 78

ఆ. వృష్ణివరులలోన నీవు ప్రద్యుమ్నుఁడు, మేటిమగ లటంచు మెచ్చు లోక
మిట్టినీవు గత్తిఁ బట్టక ప్రాయోప, విష్టుఁ డైనవాని వ్రేసి తెట్లు. 79

మ. ఇది క్రూరంబును బాతకంబు నగుఁ గాదే దీనికిం బోల నీ
విదె తత్కర్మఫలంబుఁ బొందెదవు నే నీకేయి పోకుండ దు
ర్మదమత్తుం డగునీశిరంబు శతధా వ్రయ్యంగఁ గావింతుఁ ద
ప్పదు నాపుత్త్రులమీఁది బాస యిది తప్పం బోదు నేఁ బాపినై. 80

క. అని పలికి రోషరూషిత,మనస్కుఁ డయి సోమదత్తమనుజేంద్రుఁడు సం
కును బూరించియు సింగం, బన నాఱిచె దిక్కు లెల్ల నవిసి యద్రువఁగన్. 81

ఉ. నావుడుఁ గోపఘూర్ణితమనస్కుఁడు సాత్వతుఁ డిట్లు వల్కెఁ డున్
నీవును నిన్నుఁ బోల ధరణిం గల రెండవ నంద అర్మినర్
న్నే పెఱవంగఁ బో నిటులు నీబెదరించుట చాలుఁ జాలితేఁ
జేవ గలట్టిశస్త్రములు చేకొని పోరుము నిర్ఘృణుండ వై. 82

సీ. సేమీక్షత్రియధర్మనిరతుండ నై నీదు,తనయు భూరిశ్రవుం దఱిగినాఁడ
శలవృష సేనులన్ శరపరంపర నొంచి, పాఱిరిచినాఁడ నాప్రతిభ వింటె
యీవు వె స్నీకున్నఁ గృష్ణునాన వచింతు, సహపుత్త్రు ని న్నిపు డ్డు చంపిపుత్త్రుఁ
గురువంశజుఁడ వైనఁ గుదిరి ని ల్మని మొన, మడమఁ ద్రిప్పుట జోదుమాటగాదు

తే. శమదమాదిగుణంబుల సౌరు మీఱు,శమనసుతు తేజమునఁ జేసి చచ్చియుంటి
వెన్నఁడో నీవు కర్ణాదు లెల్లకౌర,వులును నానశ మందంగఁ గలరు తెలియ. 83

వ. అని వా రొండొరు లుద్దండగతి నాడుకొనుచు మేటిబాణంబుల నేటులాడం దొడంగి రంత రథసహస్రంబును హయనాగాయుతంబుం గూడ దుర్యోధనుండును బుత్త్రపౌత్త్రభ్రాతృపరివారపరివృతుం డై శతసహస్రహయంబులతో సౌబలుండును సోమదత్తునకు బాసట యై నిలిచినం బెలుచ నేచి బాహ్లీకాత్మజుండు సత్యకాత్మజు నఱిముఱిపడ నఱిమి బాణపరంపరలం గప్పి నప్పుడు ధృష్టద్యుమ్నుం డుద్యద్భానుప్రభాభాసమానం బగుమహాసేనాసమూహంబుతో వచ్చి సాత్యకికిం దోడుసూపి నిట్లుభయబలంబులు నభయప్రకారంబునం దాఁకినంత జంఝూవాతోద్ధూతమహార్ణవారవంబువలెఁ గర్ణవిషాయనం బై, దారుణధ్వానంబు ద్యావాపృథ్వ్యవకాశంబున నిండుకొనియె నట్టిసమయంబున. 84

మత్త. సోమదత్తుఁడు తొమ్మిదమ్ములు చుట్టు వుట్టగ నా శిని
స్వామి నేసిన నాతఁ డన్నినిశాతసాయకముల్ మహో
ద్దాముఁ డై కురువీరు మేనునఁ దాఁక నేయ విసంజ్ఞుఁ డై
దీమసం బఱి సోల సారథి తేరు దోలెఁ దొలంగఁగన్. 85

తే. అపుడుద్రోణుఁడు క్రోధతామ్రాక్షుఁడగుచు,సాత్వతునిమీఁదికరుదెంచుసమయమెంచి
గురుని క డ్డయి శరవృష్టిఁ గురిసి రెల్ల, పోటరులు పాండవాగ్రజు మున్ను గొనుచు.

వ. అంతఁ జాపాచార్యుం డవార్యశౌర్యంబున నేచి యుధిష్ఠిరాధిష్ఠితం బయిన సేనావారంబుపై నవారిగా సాయకాసారంబు వాఱించుచు శూరాగ్రగణ్యుం డగుసాత్యకిం బదింటను బార్షతు నిర్వదింటను భీమసేనుం దొమ్మిదింటను నకులు నైదింటను సహదేవు నెన్మిదింటను శిఖండి నూఱింటను ద్రౌపదేయుల నై దై దింటను విరాటు నిరువాలుగింటను ద్రుపదు నీరైదింటను యుధామన్యు మూఁడింటను నుత్తమౌజసు

నాఱింటను నొంచి మఱియుం గలయోధుల నొప్పించి మండలీకృతకోదండుం డై మధ్యందినమార్తాండునిచందంబున మండుచు నప్రతిహతరథుం డై యుగపడినవారి నెల్ల నుఱుము సేయుచుండ వానికోల్తల కోహటించి పాండవబలంబు ఫాల్గునుండు పుఱికొల్పుచున్నను వానిమాట సరకుగొనక వెఱచి పఱచినం గని పాండవమధ్యముండు మురమర్దనునిదిక్కు మొగం బై మనరథంబు ద్రోణునిమీఁదికిం బోవం దోలు మనిన నతం డట్లు సేయుటయు భీమసేనుండు నట్లు విశోకునకుం జెప్పి సవ్యసాచి వెన్నంటి నడచె వారిం జూచి నకులసహదేవులును బాంచాలమాత్స్యచేదికారూశ కోసలకైకయాదులును వారి వెంబడించుటయు భీమార్జును లాదళంబునకు సవ్యదక్షిణ పార్శ్వంబులం బొలిచి ధనురాచార్యుం దాఁకిన నత్తాఁకు నత్యంతదారుణం బయ్యె నయ్యెడ ధృష్టద్యుమ్నసాత్యకులును వారికిం దోడుపడ వచ్చుచుండ నశ్వత్థామ భూరిశ్రవుం జంపుట కలుగుచు సాత్యకి నాఁగుటం గని భైమసేని ఋక్షచర్మావృతంబును విక్షిప్తయంత్రసన్నాహంబును మహామేఘౌఘనిస్వనంబును గజనిభవాహయోజితంబును ద్రింశన్నల్వాంతరంబును నాంత్రమాలావిభూషితంబును లోహితార్ద్రపతాకంబును గృధ్రరాజోత్థితధ్వజంబును నష్టచక్రసమాయుక్తంబును నగుమహారథం బధిష్ఠించి శూలముద్గరశైలపాదపధారు లగుఘోరరాక్షసు లక్షౌహిణీసంఖ్యాకులు తన్నుఁ బరివేష్టింప నవష్టంభంబు చేయుచు నశ్వత్థామపైఁ గవియుదెంచె నప్పుడు.

—ఘటోత్కచుం డశ్వత్థామతోఁ బోరుట—

సీ. కులశైలశృంగాభ ఘోరరూపుఁడు విరూపాక్షుఁడు ప్రజ్వలదాస్యకుహరుఁ
డూర్ధ్వకేశుఁడు నిర్ణతోదరుండు భయావహోపదంష్ట్రాకరాళోగ్రముఖుఁడు
శంకుకర్ణుఁడు మహోజ్జ్వలజిహ్వాకాంచలుం డున్నతభుజహంసుఁ డుద్ధతుండు
తాళోచ్ఛ్రితోదగ్రధన్వహస్తుఁడు సస్తులోరస్కుఁ డధికదర్పోన్నతుండు
తే. కల్పమేఘోపమస్వనకల్పితుండు, వివిధశస్త్రాస్త్రసంభృతవీరరాక్ష
సావృతరథుండు సింహనాదాంచితుఁడు రణోత్కలిక నప్పు డొప్పె ఘటోత్కచుండు
సీ. దండహస్తుం డయి దర్పించుకాలాంతకునిరీతి నున్న రక్షోవిభుఁ గని
భయసమర్దిత మయి భవదీయవాహిని, వాయుసంక్షోభితావర్తములును
రంగదుత్తుంగతరంగంబులుం గల్గు గంగ తెఱంగునం గలఁగి పాఱె
నాహిడింబాసుతునార్పులకుఁ గజఘటలు మూత్రపురీషకములు విడిచె
తే. డిల్లపడి తల్లభూపతుల్ పెల్లు రేఁగె, నశ్మవర్షము తత్సమయాధికబలు
లైనతత్కింకరులు వైవ నశను లట్లు, పడియె నానావిధాయుధప్రతతు లవని. 80
క. అతిరౌద్రం బత్యుగ్రం, బతిభయం బైనరాక్షసాయోధనముల్

మితి మీఱఁ గాంచి రాక్షసుతుఁడును నీసుతులు వెఱచుచుం బఱచి రొగిఁ. 90
తే. అస్త్రబలశాలి మాని ద్రోణాత్మజన్ముఁ, డొక్కఁ డింతయుఁ జలియింప కోహటింప
కస్త్రమాయ నదంతయు నపహరించెఁ, దనదువిద్యాప్రభావము దనరఁ జేసి. 91
వ. అట్లు రాక్షసమాయ మాయించినంత. 92
శా. జాల్ముం డాబకవైరినందనుఁడు సంజాతక్రుధాక్రాంతుఁ డై
కల్మాషోగ్రశరంబు లాగురుసుతున్ గాఢంబు గా నేయుఁడున్
వల్మీకంబునఁ జొచ్చుపాము లన నవ్వాలమ్ము లవ్వానిమైఁ
దో ల్మాయించుచుఁ జొచ్చి వచ్చె వెలికిన్ దో నెత్రు రా మొత్తమై. 93
ఉ. గౌతమినందనుం డపుడు క్రౌర్యము సూపుచుఁ గన్ను గెంపు గా
శాతశరంబు లొక్కపదిఁ చాపమునం బొదలించి వాతజో
ద్భూతునిమేన నాఁటుటయు దుష్టుఁడు వాఁ డతికష్టుఁ డై మహో
గ్రాతతదృష్టిఁ జూచుచు సహస్రఘనారము చక్రరాజమున్. 94
క. చేకొని సూర్యాభం బై, వాకొనఁ దగుదాని నెత్తి వడి వానిమెయిం
దాఁకఁగ విసరిన గురుసుతుఁ, డాఁకపడం దాని నఱకె నాశుగసమితిన్. 95
వ. అంత నభాగ్యునిసంకల్పంబు వోలెఁ దనచక్రరాజం బట్లు నిరర్థకం బై నేలఁ గూలినం
గని ఘటోత్కచుం డాక్రోశించుచు నాశరద్వతీసూనుసాయకాసారంబున స్వర్భా
నుండు భానుమంతునిం బోలెఁ గప్పుచుండె నప్పుడు ఘటోత్కచసుతుం డంజన
పర్వుం డనువాఁడు ప్రభంజనునిఁ బర్వతశ్రేష్ఠంబు వోలె నాఁగి బాణవర్షంబు వఱ
గించుచుండ నింద్రోపేంద్రవిక్రముం డగునశ్వత్థామ సంక్రుద్ధుం డై. 96

—అశ్వత్థామ యంజనపర్వాదులం జంపి విజృంభించుట—

సీ. వానిపెక్కియ మొక్కవాలమ్ములం ద్రుంచి, రెండింట సూతునిఁ జెండివైచి
మూఁటఁ ద్రివేణుకమును గూల్చి ధను వొక్క,తూపునఁ దూలించి తురగములను
నాల్గింటి నాల్గింట నల్గించి విరథుఁ జేసిన వాఁడు కరవాలమును గ్రహింప
దాని నొక్కట రెండు, గా నేసి గుదె నేయఁ, జిద్రుపలై ధరఁ గూలఁ జేసె నపుడు
తే. భీమపౌత్త్రుండు దా నంత బెండువడక, మింటిమీఁది కెగిరి కాలమేఘు మట్లు
కడిమి గర్జించి ద్రుమవర్ష మడరఁ జేసె, నాసురం బగుమాయ లో నావహిల్ల. 97
శా. ఆమాయామయ మైనమ్రాఁకుగమి నయ్యాచార్యపుత్త్రుండు తీ
వ్రామోఘాశుగసంతతిన్ విరియఁ జేయం జాలి వాలమ్ములన్
భీమప్రోద్భవసూతి నేయ నతఁ డాభీలమ్ము గా నార్చుచున్
భూమిష్ఠుం డయి పోల్చినం దునిమె శంభుం డంధకాఖ్యుం బలెన్. 98

వ. అ ట్లంజనపర్వుండు పడుటం గని రోషప్రజ్వలితేక్షణుం డై రాక్షసేశ్వరుం డగు హైడింబుండు కార్చిచ్చువలెం జెర్చి పాండవబలార్ణవం బేర్చుచున్న శారద్వతీసుతుం జేర నరిగి. 99

క. నిలు నిలు మే నుండఁగఁ బోఁ, గలవే యిఁక నొండుకడకుఁ గ్రౌంచాచలమున్
జ్వలనసుతు నట్లు నే నిను, బాలికలనికి బలివిధానముగఁ జేయ నోకో. 100

వ. అనిన నశ్వత్థామ యతని కిట్లనియె. 101

క. పో పొమ్ము వత్స! పెరతోఁ, నోపినగతిఁ బెనఁగఁ దనయుఁ డుండఁడు తండ్రిం
గోపింప నాకు నీపైఁ, గోపము రా దాత్మహత్యకును గోపి దగున్. 102

వ. అనిన ఘటోత్కచుండు క్రోధతామ్రాక్షుం డై యి ట్లనియె. 103

ఉ. బెదరెద నోటు నీనుడులవేటున కేను వృకోదరాత్మకుం
బోదలితిఁ బాండవేయులకుఁ బుత్త్రుఁడ నైతిఁ గుహూద్వహుండ నై,
విదితయశుండ నైతి బలవిక్రమముల్ గల నై దశాస్యుతో
బదు లన నైతి నస్త్రపులవల్లభుఁడన్ నను నీ వెఱుంగవో. 104

ఆ. చక్క నిలుము నిన్ను నుక్కడంచి నీ,పోరుకొనెదునాస పొల్ల నేసి
పుత్త్రు ననుచు ద్రోణపుత్త్రునిపై నేసె, నిరుసు లంత లేసి యిషుచయములు. 105

చ. జలదము వర్షముం గురియుచాడ్పున వచ్చెదునాసురాశుగం
బుల నడుచక్కి వ్రక్కలయి పోవ గురుప్రభవుం డొనర్చెన
మ్ములుకుల బల్మిడుంగురులు పుట్టి మెఱుంగుడుపుర్వులో యనన్
వెలిఁగె నభస్థలంబునను విశ్రుత మై మునిమాపునం దటన్. 106

సీ. ఆసురమాయ నాహైడింబుఁ డత్యుచ్ఛ్రయంబును బహుశిఖరాంచితంబు
నగునంజనాచలం బై ముందు పొడకట్టె, శరజాల మడరించె గురుసుతుపయిఁ
గని చలింపక ద్రోణతనయుండు నవ్వుచు, వజ్రాస్త్రమున దానివాసి నడఁచె
నసురయుఁ దోయదం బై ఱాలు కురిసి గౌతమిసుతు నరదంబుదారిఁ గప్పె
తే. నంత నాతఁడు వాయవ్య మస్త్రమేసి, నీలమేఘము గీలించి వాలుమెఱుఁగు
టమ్ము లడరించి శతసహస్రమ్ము లైన,తద్బలమ్ముల మాయించెఁ దత్క్షణమున. 107

వ. ఘటోత్కచుండును సంభ్రమింపక సింహశార్దూలసంకాశులును మత్తద్విరదవిక్రము లును వికృతాస్యశిరోగ్రీవులును సంరంభోద్వృత్తలోచనులును నానాశస్త్రాస్త్రధారు లును వివిధకవచవిరాజితులును భయంకరాకారులును మహోద్ధతులును నగుపె క్కండ్రు రాక్షసవీరులు తోఁచి గజహయరథస్థు లై తన్నుఁ బరివేష్టింపఁ గయ్యంబు నకుఁ గట్టాయితం బైనం గని గురుపుత్త్రుండు విషణ్ణహృదయుం డై యున్నరారా

దోలుకొని ద్రోణనందనునిముందటికిం జని నిఖిలభూభృద్భయోదయంబుగా సింహనా దంబు సేయుచుం గవియుదెంచి. 112

తే. అష్టఘంటోజ్జ్వలము ఘోర మష్టమూర్తి, నిర్మిత మిరమ్మదాభ మై నెగడుదివ్య శక్తి నొకఁ డెత్తి భుజయుగ్మసార మెసఁక,మెసఁగ నాచార్యసుతునిపై నేసె. నంత

చ. అతఁడును వచ్చుశక్తిఁ గని హస్తమునం గలవిల్లు తేరిపై నతిరభసంబునన్ విడిచి యల్లన దానిఁ బరిగ్రహించి యం చితగతి భీమసూతిరథశీర్షముపైఁ బడఁ ద్రిప్పి వైచె న ప్పతఁడు తొలంగ దూఁకెఁ దమ రమ్యో రథంబు సహాశ్వసూత మై. 114

క. అగ్గతి హైడింబునితే, రగ్గిం గలియంగఁ జేసి యయ్యశని వడిం దగ్గక చొఱఁ బాఱెన్ ధర, నగ్గించిరి ద్రోణతనయు నఖిలసురల్! 115

వ. అంత. 116

సీ. నల్లఁద్రావుడు దారసిల్లినపడవాలు,తే రెక్కి వి ల్లొండు తివిరి పూని కటుకుటమ్ములఁ ద్రోణికాయమ్మున నిగిడ్చెఁ, బార్షతుండును బాణపంక్తిఁ బఱపె గురుసుతుండును వారి శరములఁ గప్పుచు, దారుణసమరంబు దనరఁ జేసె నపుఁడు భీముఁడు వేయి యరదముల్ మున్నూరు,కరు లఱువదినూర్లుతురగములును

తే. దోడు రా నట వారికిఁ దోడుపడగ, వచ్చి విచ్చలవిడి బాణవర్ష మొలికె ద్రోణియును వారితోఁ గడు ద్రాణ మెసఁగ, నాల మొనరించె నద్భుత మావహిల్ల.

మ. నరదామోదరధర్మజాదు లెదుటన్ గన్నెత్తిఁ యుండంగ న ద్గురుపుత్త్రుండు నిమేషమాత్రమున నగ్గో ల్వెట్టి యక్షౌహిణీ వరరక్షోబలముల్ హరించి తురగవ్రాతాంగఖండంబులన్ గరిగాత్రంబుల భూమిఁ గప్పె నృపతుల్ హాహాకారముల్ సేయఁగన్. 118

వ. అప్పు డప్పరమదారుణాయోధనంబున ధ్వజమండూకంబును భేరీకచ్ఛపంబును ఛత్త్ర హంసంబును జామరఫేనంబును గంకగృధ్రమహాగ్రాహంబును వివిధాయుధఝషం బును విస్తీర్ణగజపాషాణంబును హయమకరంబును రథవప్రంబును బతాకాద్రు మంబును శరమీనంబును బ్రాసశక్తిడుండుభంబును మజ్జామాంసమహాపంకంబును గబంధోడుపంబును కేశశైవాలంబును యోధార్తరవనిర్ఘోషంబును శోణితజోర్మిసమా కులంబును నగురక్తప్రవాహంబు సువ్యక్తం బై పాఱం జేసి శారద్వతీసుతుండు ఘటోత్కచప్రభృతుల మార్కొని పోరుచుం దనమునుమునం బడినసురథ శత్రుం జయ జయ బలానీక జయానీకు లనుపాంచాలకుమారుల నేపురను బృహద్ధ్రు చంద్రసేన శ్రుతాయు శ్శత్రుంజయ బలు లనుకుంతిభోజాత్మజుల నేపురను జావ

నేసి సింహనాదంబు చేసి యంతఁ బోక. 119

మ. యమదండప్రతిమాన మైనశర మొం డాకర్ణపూర్ణంబు గా
సమరం గైకొని భైమసేని భుజమధ్యం బాఁడఁ గా నేయ ను
గ్రముగా నయ్యది యుయ్యెడం బగిలి పోఁ గావించి నేలం బడెన్
గ్రమముం దప్పి సురారి తేరిపయి మూర్ఛన్ సోలి వ్రాలెన్ వడిన్. 120

ఆ. వివశుఁ డగుచుఁ బడినపవమానపౌత్రుని, ద్రుపదపుత్రుఁ డవలఁ దొలఁగఁ జేయ
రథముఁ ద్రిప్పికొనుఁడుఁ రహిఁ జెడి తత్సేన, పఱచె ద్రోణపుత్రుఁ డఱవ నఱవ. 121

క. గురుసుతువిక్రమమునకుం, గర మచ్చెరువందుచు దేవగణములు పొగడెన్
గురుముఖ్యు లెల్ల నాతని, బరమానందమును బొంద బ్రణుతించిరి రటన్. 122

వ. అట్లు విజృంభించినఘటోత్కచసైన్యం బెల్ల వైన్యంబు నొందఁ జేసినచాపాచార్య సుతునిపరాక్రమంబునకు సైరింపఁ జాలక యుధిష్ఠిరభీమసేనధృష్టద్యుమ్నసాత్యకు లుక్కుమెఱసి యుద్ధసన్నద్ధు లై కవియుచుండ సోమదత్తుండు తత్తడుం దోలుకొని వచ్చి సత్వరుం డై సాత్యకిం దాఁకి శరవర్షంబు గుఱియుటయు భీమసేనుండు బాసట యై. 123

—భీమసేనునిచేత బాహ్లికుండు చచ్చుట—

చ. దశవిశిఖంబు లొక్కపరి తద్రిపుపయి న్నిగిడింప నాతఁడున్
దశదశకంబు లాతనియెదం బడ నేసెఁ దదంతరంబునన్
దశశరముల్ నిగిడ్చి వితతం బగుశక్తిని వైచి సాత్యకిం
డశనిసమంబు లేడునిశితాశుగముల్ పఱగించె వానిపైన్. 124

క. మరుదాత్మజుండు పరిఘము, త్వరితగతిన్ సోమదత్తుతలపై వేయన్
హరియనుజుఁ డగ్నిసదృశము, శరమొక్కఁడు వానిఱొమ్ము చదియఁగ నేసెన్. 125

క. ఆరెండు నొక్కతూఁకునఁ, గౌరవునకుఁ దాఁక నతఁడు గతసంజ్ఞుం డై
తేరిపయి సోలి వ్రాలెన్, బోరన నసు రేగ ననుచుఁ బాలయుక వృట్టెన్. 126

చ. ఎదురున కయ్యెఁ బుత్త్రుఁ డని యెత్తిఱఁ జూపుచు బాహ్లికుండు పెన్
వడి యుయుధానుపై నదరి వాలుమెకం బన వచ్చుచుండ న
వ్వడమ్ముడి వాని కడ్డపడి వాఁడిశరంబులతో మ్మిడుటు నే
యుడు నతఁ డగ్గి శక్తిఁ గొని యుక్కఱ వైచెను భీమునకుమున్. 127

ఆ. సొమ్మసిల్లి తేఱి చుఱచుఱ మసఁ జూచి, భీమసేనుఁ డప్పు భీమగద న
మర్చికొంచు వానిమస్తక మవియంగ, నేసె నీసు కసురు కెక్కసముగ. 128

క, కులిశాహతభూధ్రము వలెఁ, దల వ్రయ్యలు వాఱ రక్తధారలు తఱచై

నిలువెల్లఁ గలయఁ బర్వఁగ, నిలఁ గూలెన్ బాహ్లికుండు పృతన దలంకన్. 129

వ. అంత నీకొడుకులు నాగదత్త దృఢరథ వీరబాహ్వయోభుజ దృఢ సుహస్త విర జోప్రమాథోగ్రయాయు లనుపదుగురు భీమసేనుం దలపడం దల లెత్తుటయుం గ న్నత్తి చూచి యత్తాపత్యుం డప్పదుండ్ర నొక్కొకని నొక్కొక్కతూపునం జక్కాడి వృషసేనుఁ డెదిరించిన వాని నోడించి కర్ణానుజుం డగువృకరథుం గూల నేసి నీశ్యాలకులు శతచంద్రప్రభృతులేడ్వు రడిమిన వారి నుఱిచిపుచ్చి వీర గవాక్ష శరభాదు లేగురు రాజన్యు లేగుదేర వారి నాశుగపంచకంబునఁ బంచ త్వంబు నొందించి వీరవిహారంబు గావించుచుండె నంత యుధిష్ఠిరుండును నీయనీ కినిపైఁ గవిసి. 130

సీ. శూరత్రిగర్తకశూరసేనాంబష్ఠ,లను మిత్తికుత్తుక క్కొనరఁ బెట్టి
బాహ్లికాభీషాహపతుల గణాళితో, సంయమనికిఁ బోవఁ జక్కఁ జేసి
మద్రకయౌధేయమాలవసేనల, మలఁచి శోణితకర్దమం బానర్చి
శిబివసాతిప్రముఖబహుదేశాధీశ,బలముల నుఱుమాడి బయలు చేసి
తే. నలుగడన్ ముట్టి మనమూఁక నలిపి కనుపు,గొట్టుచుండఁగఁ బట్టుఁడు కొట్టుఁడనుచు
నులివు మి న్నంటెఁ గాని యొండొక్కఁడైన,వాని మొన నిల్వఁ జాలక పాఱె రథిప.

వ. ఇట్లుక్కు మిగులునక్కౌంతేయాగ్రజుకోల్తల కోహటించి మనమూఁకలు చీకాకు పడి పాఱుచున్నం గని నీకొడుకు కాచార్యుం బురికొల్పుటయు నతండును బరవ సంబు చేసి కవియుదెంచి. 132

శా. వాయవ్యాస్త్రము నారిఁ బోసి బలవద్వ్యాపార మేపారఁ గా
స్ఫాయత్తేజముతోడఁ గూడికొనఁ గా సంధించి గర్వాంధుఁడై
యాయమ్మంటఁగఁ బాండవాగ్రజునిపై నల్కం బ్రయోగించె న
త్యాయామమ్మున నాతఁ డుక్కుడఁచె నయ్యస్త్రంబునన్ దానినిన్. 133

వ. కుంభసంభవుండును గ్రోధసంభరితుం డై తోడన వారుణ యా మ్యాగ్నేయ త్వాష్ట్ర సావిత్రాస్త్రంబులు సమంత్రకంబుగాఁ బ్రయోగించినఁ బార్థుండును వానిఁ బ్రత్యస్త్రంబులఁ బ్రతిహతంబులు గావించె బ్రాహ్మణుండును దనప్రతిజ్ఞం దీర్పం గొనువాఁడై. 134

మ. జ్వలదైంద్రాస్త్రము నారిఁ బోసియును బ్రాజాపత్యముం గూర్చి య
త్యలఘుప్రక్రియ నేయ ధర్మజుఁడు ప్రత్యస్త్రంబులన్ వానినిన్
బొలియించెం గురుఁ డంత పోవక కడుం బోటొగ్గి బ్రహ్మాస్త్రమున్
జల మెచ్చం గొని యేసెఁ బాండవుని దిష్టాంతంబు నర్థించుచున్. 135

క. తనపైఁ బాఱఁగ మందుచుఁ, జనుదెంచెడుదాని నరసి సత్వరుఁ డగుచున్
గొనకొని బ్రహ్మాస్త్రంబునఁ, గనుచుండఁగ నడఁచె యోధగణము నుతింపన్. 136

వ. అంత భారద్వాజుం డాధర్మరాజుం గ్రేడించి ద్రుపదవాహినిదిక్కు మొగం బై వాయవ్యాస్త్రంబు ప్రయోగించుటయుఁ దదస్త్రప్రభూతమహావాతూలంబునఁ బాంచాలసైన్యంబు తూలంబు పోలెం దూలిపోయినం గని భీమార్జును లబ్బలంబుల నెల్ల నల్లనం గుదుర్చుకొని దక్షిణోత్తరపక్షంబుల రక్షకులై నిలిచి ధనురాచార్యుని దాఁకి సాయకాసారంబు నిగిడించుచున్నంతఁ గైకయ సృంజయ మత్స్య పాంచాల పరివృతుం డై జనార్దనానుజుండును వచ్చి వారికిం దోడు సూపె నాపోరునం గడు నొచ్చియు నిద్రాభరంబునం జొచ్చియు విచ్చియు నీసైన్యంబు దైన్యంబు నొందియు గురుప్రభృతులు నలదని వారించినను వినక విఱిగి పఱవం జొచ్చె నప్పుడు గాంధారేయుండు రాధేయుం బిలిచి యి ట్లనియె. 137

ఉ. పాండవయోధు లెంతయును బాహుబలంబునఁ దేజరిల్లుచున్
దంష్ట్రధరుల్ బలెన్ మిగుల దంటికి నెక్కి భవద్బలంబులన్
జిండి యొనర్చుచుండి రదె పిమ్మట పుట్టఁగఁ జెట్టొకండు గా
కుండఁగ జోదులన్ గరుణ నోమెడు కాలము వచ్చె నీ కిటన్. 138

వ. అనిన నతం డతని కి ట్లనియె. 139

—కర్ణుండు దుర్యోధనునితో గర్వోక్తు లాడుట—

మ. విజయుం జంపెద నింద్రుఁ డడ్డపడినన్ వేట్లాడి పోట్లాడియున్
విజయం బిచ్చెద నీకు వేల్పుపడవాల్ వేగంటికిం బోలె నే
నిజమే పల్కెద నాఁడిల్లు మెడఁద న్మిత్రుండు మిత్రప్రియం
బు జిగీషం బొనరించి నప్పుడు కదా పొల్పారు మిత్త్రుం డనన్. 140

ఉ. పార్థులలోన మేటి యగుఫాల్గునుఁ డొక్కఁడు పోవ నున్నవార్
వ్యర్థులు నీకు జెప్పెనటు వత్తురు రా రసఁ గానఁ జొత్తు రీ
యర్థము శక్రశక్తి కగు నయ్యది నాకడ నుండెఁ గా దె నే
నర్థి నొకండ పాండవుల నాజి వధించెద నెల్లవారితోన్. 141

ఆ. నేను బ్రదికియుండ నీ విట్లు ముదమఱి, వగలఁ బొగల వలదు వసుధ యెల్ల
నీదు బాహుపీఠి నిలువంగఁ జేసెద, విశ్వసింపు మెడఁద వీనిమాట. 142

వ. అని పలుకుచున్న కర్ణుం జూచి నవ్వుచు శారద్వతుం డి ట్లనియె. 143

ఉ. బళిబళి కర్ణ! మాటలన పాటిలు నేని పనుల్ సుయోధనుం
డిల నలరున్ సనాథుఁ డయి యీ పోరఁ దుండిన దానఁ జాలు చాల్

కొలఁదికి మీఱె నీపొగడుకొంటలు మాటల కేమి వచ్చె నీ
పోలిచినవిక్రమంబు ఫలముం గని యొక్కరుఁ డున్నఁ జెప్పుమా. 144

—కృపాచార్యుండు కర్ణు నుపాలంభించుట—

చ. పలుకడవల్ తొడింబడుచుఁ బార్థులతో నని కీవు పూనుటల్
తెలియును గాని నీగెలుపు లేశము నేని యొకానొకప్పుడున్
దెలిసినవారు లేరు నినుఁ ద్రెళ్ళఁగ నేసిరి వారె యెప్పుడున్
దలఁపవె ఘోషయాత్రతతిఁ దొప్పగ నీ వని కేగి పాఱుటల్. 145

సీ. పసులఁ బెట్టించెడుపదనున విరటువీటను నిన్నుఁ దమ్ముల మనుజపతుల
నొక్కపార్థుఁడ కాదె యుక్కుమడంచె నెల్లరుపార్థులును గృష్ణు నరిత్తి నుండ
వాని నిప్పుడు గెల్చువాఁడ నే నందువు, మాటలమాటి పీవోటిచేఁద
వృఱుముదు వానకా రతినపై నగుమబ్బు వలె విఫలం బని తెలియఁ డితఁడు
తే. వెరనరు లోకందు పలుకరు విక్రమింత్రు, ఫలము గాంతురు నీ విట్టిపలుకు లుడుగు
మనిన నుడుగ విప్పుడు పార్థమునుమున వడి,యుడిగిన ప్డివ యుడుగుదు వోరికర్ణ. 146

క. ఎక్కటికయ్యమునం దా, ముక్కంటిని మెచ్చఁ జేసె మును విన్వాచ్చుం
డక్కట వాని నెదుర్పఁగ, మ్రుక్కడి వగునీకు నగునె ముజ్జగ మణఁగన్. 147

వ. అనినం గర్వించి కర్ణుండు గౌతముదిక్కు మొగం బై. 148

శా. ప్రావృణ్ణీరద మట్లు గర్జిలుచు శూరశ్రేష్ఠుఁ డెల్లప్పుడున్
జేవం జూపును వానికార్యములు సుక్షేత్రంబునం దైన బీ
జావాపంబును బోలె సత్ఫలమునన్ హత్తున్ రణాగ్రమ్మునన్
బ్రావీణ్యం బెసఁగన్ వచించుకొనుటల్ పాపంబులే ప్రోడకున్. 149

క. శారదనీరదముం బలె, వీరులు గర్జింప రెపుడు వృథగా నే నీ
వైరులఁ గూల్పం జాలిన, ధీరుఁడ నై తెలిసి యిట్లు తెగి గర్జింతున్. 150

ఆ. మోయ లేనిమోపు మోయుదు నని మోయఁ, బూన కున్న దోష మౌను గాని
మోయఁ గలుగుమోపుమోయుదు నంటి నే, నిందు దోష మనుట యెట్టిమాట. 151

క. ఇం దేమి నీకుఁ బోయెను, మందుఁడ! నే నెల్లపగఱ మ్రందించినపైఁ
గందువు నాగర్జాఫల, మిందుల కేమిటికి నీకు నిట్లుడుకంగన్. 152

చ. వడిఁ వడి కేను బాండవుల వారిజలోచనసాత్వతాదులన్
గడిమి రణాంగణంబునను గాలునిప్రోలికిఁ బుచ్చి హెచ్చి యీ
పుడమి సమస్తమున్ గతరిపుండు సుయోధనచక్రవర్తికిన్
మొడఁ గదలించినప్డు నను మెత్తువు చిత్తమునం ద్విజోత్తమా. 153

వ. అనినం గృపాచార్యుండు గ్రొంజియును. 154

సీ. నీమదికిం దగునేర్పునం బ్రేలెదు, కృష్ణుఁ బాండవులను గెల దెవ్వఁడు
నాకృష్ణు లమరుల కైన నజేయులు, వా రున్నకడ జయం బారయ నగు
ధర్మపుత్త్రుఁడు సత్యధర్మరతుండు కృ,తాస్త్రుఁడును గృతజ్ఞుఁ డమలకీర్తి
వానితమ్ములు మహాప్రాజ్ఞులు సర్వాస్త్ర,విద్వదగ్రేసరుల్ విదితబలులు

తే. ముజ్జగంబులు నొకటియై ముట్టి నేని, భీమముఖ్యుల వారి సంగ్రామమందు
గెలువఁ జాలవు ధర్మజుం డలిగె నేని, సర్వలోకంబు లొకపరి సమయు వింటె. 155

వ. మఱియు ధృష్టద్యుమ్న శిఖండి దౌర్ముఖి జనమేజయ చంద్రసేన రుద్రసేన కీర్తివర్మ ధ్రువ ధర వసుచంద్ర దామచంద్ర సింహచంద్ర సుతేజు లనుపుత్త్రులతో ద్రుపదుండును గజానీక శ్రుతానీక వీరభద్ర సుదర్శన శ్రుతధ్వజ బలానీక జయానీక జయప్రియ విజయలబ్ధలక్ష జయాశ్వ రథవాహన చంద్రోదయ కామరథు లనుతమ్ములతోఁ బుత్త్రులతో విరాటుండును నానావిధసేనావారంబులతో ఘటోత్కచాదులును కైకయప్రభృతిమహారాజులును బాండవులకు విజయం బాపాదింపఁ గోరి పోరుచున్నవా రట్టి వారి నే నొక్కండ నుక్కడంతు ననుట నీయనయంబ కాని యొండొక్కండు కా దనిన నట్టహాసంబు సేయుచు నతం డతని కిట్లనియె. 156

మ. నిజమే పల్కితి వీవు నీ వనినకంటెన్ బెక్కు లాడింపరా
ద్విజకుం గల్గు నటంచు నెంచెదను వృత్రఘ్నాదులున్ వారిచే
విజితుల్ సెప్పఁగ నేటి కట్లయిన నే విద్విట్చ్చునిం ద్రుంచెదన్
ద్విజ! నాచెంత మహేంద్రశక్తి కలిమిన్ నీచిత్త మూహింపవో. 157

ఆ. దాన నొండు నిహతుఁ డైనఁ దక్కినవారు, భోగపరులు గాక పుడమి విడిచి
తార వోదు రంత ధరణీతలం బెల్లఁ, దనకుఁ దాన వచ్చు మనవిభునకు. 158

ఆ. వెరవుకలిమి నెట్టిభర మైనఁ బని యైన, నఱుఁ జేసికొనఁగ వచ్చు దీని
నెఱిఁగి కాదె విజయు నిలుఁ గూల్తు ననుచు గ,ర్జిల్లినాఁడ నిండుఁ బల్లు లేవి. 159

చ. ముదుకఁడ వీవు విప్రుఁడవు ముందు నెఱుంగక పాండుపుత్త్రులం
దదికినప్రేముడిన్ నను సహంకృతి మీఱఁగ దూఱితి వింతవ
ట్టది సయిరించితిన్ మరల నట్లనఁ జూచుద వేని నొకింతయు
న్మది గరుణింప నీదయిననాలుకఁ గోయుదు నూరకుండుమా. 160

వ. నీవు పాండవపక్షపాతివి వారిని వారిబలంబును బట్టుపోలెం బొగడం జొచ్చి మమ్ము మాసైన్యంబును వెఱపింప వచ్చితి విచ్చటను ద్రోణుండును దుర్యోధనుండును దుర్ముఖుండును దుశ్శాసనుండును సౌబలుండును వృషసేనుండును మద్రేశుండును

నీవును సోమదత్తుండును భూరియు ద్రౌణియు వివింశతియు లోనగువారు పోరులం దారితేఱినవారు పెక్కండ్రుక్కుమిగిలి శత్రుపరాజయంబు గోరుచు నున్నవారు జయంబు దైవాయత్తంబ కావునన శాంతనవుండు శరతల్పగతుండగుటయు వికర్ణ చిత్రసేన బాహ్లీక జయద్రథ భూరిశ్రవో జలసంధ సుదక్షిణ భగదత్త ప్రభృతి మహారథులు దెగుటయుం గలిగె మఱియు నక్కడివారును బెక్కండ్రు చక్కుమకంగి రుభయసేనలును క్షీణించుచున్న యిప్పుడు పాండవ ప్రభావం బభివర్ణించుట సమం జసంబు గాదు నేనును జయంబు దైవంబుమీఁదఁ బెట్టి దుర్యోధనహితార్థినై పోర నుంటి నని పలుకుచున్నంత మాతులపరాభవంబునకు నైఁప నోప కశ్వత్థామ వాలు వెఱుకుకొని మత్తమాతంగంబు మీఁదికి సింగంబు లంగించు చందంబున లంగించి కోపఘూర్ణితనయనుం డై దుర్యోధనుఁడు వినుచుండ ని ట్లనియె. 161

—అశ్వత్థామ కర్ణునిపై నలిగి తిరస్కరించుట—

ఉ. ఓరి నరాధమా! నరుమహోత్తరసత్యగుణంబు లెన్ననీ
శూరుని నాకు మామ యని చూడక యోడక దూఱె దేల నీ
క్రూరత కే మనం దగు నకుంఠితతేజుని సవ్యసాచినిం
జీరికి నైనఁ గైకొనవు చెట్టవు చెట్ట దలంతు వెంతయున్. 162

తే. నిన్ను నిర్జించి నీవారు నీవుఁ జూచుచుండ గాండీవి సైంధవుం జెండివైచె
నపుడు నీవీర్యమును నీదునస్త్రశస్త్రములును నెం దేగెఁ జెప్పు మోపలువ! నాకు.

ఉ. చిచ్చఱకంటివేల్పుఁ దనచేవ నెదిర్చి జయంబుఁ గొన్నవి
వ్వచ్చుని గెల్వఁ జూతు వది వట్టితలంపగుఁ గాని సాఁగునే
యెచ్చటిమాట లచ్యుతు నహీనసహాయత కైనవాని పై
వచ్చిన వాసవాదులును బాటున కయ్యెద రీవు లెక్కయే. 164

వ. అని మఱియును. 165

క. నిలు మోప్రేలరి నిన్నుర్, జ్వలదనలశిఖానఖంబు సదమల మగునా
వలుదకృపాణంబునకుం, బలి చేసెద ననుచుఁ గర్ణుపయి కుఱికె వడిన్. 166

వ. అ ట్లుద్యతుం డయినవాని కెడ సొచ్చి దుర్యోధనుండు వానిని వానిమాతులునిం బట్టువఱచి వారించుచున్నంతఁ గర్ణుం డి ట్లనియె. 167

శా. వీరంమన్యుఁ డమాన్యవిప్రుఁడు ననున్ వీఁ డేమి చేయున్ సునా
సీరప్రాభవ వీనినిన్ విడుము నాచేవాఁడిఁ జూపింతు నాఁ
గారవ్యాఘ్రసముండు గౌరవుఁడుతుం గైనేసె కోపంబు చే
కూరం జేయక వీని నైఁపు మెకఁదన్ గోల్కొమ్ము ప్రార్థించెదన్. 168

మ. కృపునందున్ గురునందు మద్రపతియం దియ్యంగభూనాథునం
దిపు డెంతేనియుఁ గార్యభార మిడి నే నిట్లున్నవాఁడం జుమీ
రిపుచక్రం బదె వీనిపైఁ గవియఁగా రెక్కొంచు నేతెంచెదన్
గృపఁ దద్గోత్రత ననుగ్రహింపు మనుచున్ గేల్మోడ్చినన్ శాంతుఁ డై. 169

వ. అశ్వత్థామ కర్ణునిదిక్కు మొగం బై. 170

ఆ. నృపతిమాటబడిన నీయపరాధంబు, సైఁచినాఁడ నింకఁ జాలుఁ బొమ్ము
కర్ణ! నీదుమదము కవ్వడి యుడిగించు, ననుచు శాంతుఁ డగుచు నపసరిల్లె. 171

వ. శారద్వతుండును సౌమ్యస్వభావుండు గావున నొక్కింతన సమాగతమార్దవుం డై తనయల్లుండు పలికినట్లు కర్ణుం బలికె నంతఁ బాండవపాంచాలసైన్యంబు లొక్కపెట్టఁ జుట్టుముట్టినం గన్ని కర్ణుండు నుదీర్ణకోపుం డై ధనుష్టంకారంబు సేసి సింహనాదంబు గావించుచు నిజపరివారపరివృతుం డై శరంబుల నఱుముటయు నాతనిం గని తత్సైనికు లెల్లఁ బెల్లున నార్చుచుం బేర్చి. 172

—కర్ణుండు విజృంభించి పాండవబలంబుపైఁ గవియుట—

సీ. నిలు నిలు మోకర్ణ! నీవు కర్ణుండవే, నని సేయు నూత్కోడ ననెడువారు
పాండవులకుఁ గీఁడు వాటిల్లఁ జేసిన, యధముఁ డీతనిఁ బట్టుఁ డనెడువారు
కలుషాత్ముఁ డగువీఁడు కడతేరినన్ లోక,మునకుఁ గొఱంత లే దనెడువారు
సలలితాత్ములకు నెగ్గులు సేయువీనికి, నొసరు నధోగతు లనెడువారు
తే. నగుచు నరిభూమిపతు లెల్ల నఱిమి తఱిమి, యంపవెల్లి మునిఁగింప నంగవిభుఁడు
నింతయుఁ జలింప కమ్మొఁక నింతలోన, నాఁగ నెంతయు శరవర్ష మడరఁ జేసి. 173

మ. అతిఘోరం బగునాసమీకమునయం దయ్యంగరా జేచి త.
తత్పృనం దా నొకఁ డాఁగి పేరు గలవై పెంపొందు శాతాశుగ
ప్రతతుల్ దంతులపై రథాంగములపై వాహాళిపై నిండున
ట్లతిశక్తిన్ నిగిడింపఁ బెం పఱిరి తేం డ్లత్యాకులీభూతు లై. 174

క. నరకరితురగరథధ్వజ, పరికరములు కర్ణబాణపరికృత్తము లై
ధరఁ గప్పిన వైవస్వత,పుర మట్లపు డరయ నయ్యెఁ బాలికల నెల్లన్. 175

వ. అట్లు పాండవబలం బెల్ల శీతార్దితం బైనగోవ్రాతంబు రీతిఁ గంపితం బై వెఱచఱచి పఱచినం గని దుర్యోధనుం డశ్వత్థామం జేర నరిగి యి ట్లనియె. 176

శా. కంటే కర్ణునివిక్రమక్రమము తత్కాండప్రభిన్నాంగ మై
కంటం గాఁఱగ నశ్రుబిందువు లొగిన్ గౌంతేయసైన్యంబు వీ
తంటం బాఱెడిఁ గార్తికేయునకు దైత్యవ్రాతముం బోలె న

ద్వెంటం గవ్వడి గర్ణు నోర్చెదుమతిన్ వే వచ్చెడిం జొచ్చెనన్. 177

క. దండిమగఁ డాతఁ డితనికి, నొం డొక్కఁడు సేయకుండ నుచితవిధానం
బొం దరసి కావఁ గా దగు, నుండినమన మెల్లఁ గూడియును బోడిమెయిన్. 178

వ. అనునంత ద్రౌణి కృపహార్దిక్యు లక్కర్ణునకుం గావలి యై నడచి రర్జునుండును పాంచాలపరివృతుం డై కర్ణుం దలపడి కాండజాలం బడరించినం గన్నియతండు గజంబుఁ బ్రతిగజంబునుం బోలె వాని నెదిరించి ప్రదరపరంపరలఁ దద్రథంబు ముసుంగు వెట్టె. 179

ఉ. మూఁడు శితాస్త్రముల్ దిగిచి ముష్వరుసన్ మెయి నొవ్వ నేయుడుం
గ్రీడియుఁ గెంపుఁగ న్నడరఁ గేరి శిలాశితసుప్రదీప్తముల్
మూఁడుపదుల్ కలంబములు ముప్పిరి చొప్పడ నేసి పెంపిరియున్
వాఁడిపృషత్క మొం డతని వామభుజంబున నాఁటె నాటినన్.. 180

తే. ప్రదరపాతంబునం జేయి వడఁకి విల్లు, జారినంతన దానిని సరగఁ బూని
శరసముత్కరమున సూరవరసుతుండు, సరథసూతుని నరుఁ గప్పెసరభసమున. 181

ఉ. వాశితకారణంబుగను వారణరాజము లొక్కటం గ్రుధా
వేశమునం బరస్పరము వీఁగక పోరెడునట్టు లాదితే
యేశసుతుండు సూతజుఁడు నిద్దఱు నెచ్చి యొక ళ్ళొకళ్ళపై
నాశముఁ గోరుచుం దొడరి నారసపుంగుమి గుప్పి రుద్ధతిన్. 182

వ. అప్పుడు. 183

మ. నరుఁ డుగ్రుం డయి కంట మంట లురలన్ గన్గొంచు నక్కర్ణువి
ల్లైరలం ద్రెంచి తురంగమంబుల ధరిత్రిం ద్రెళ్ళఁ గాఁ జేసి కూ
బరమం దున్ననియంతఁ ద్రుంచి మఱియున్ వాలమ్ముల వ్వానిపైఁ
బరఁగింపం గృపుతేరిమీఁది కరిగెన్ వాఁ డోడి జీవార్థి యై. 184

చ. [illegible]ఱియలు వాసి నీబలము వాఱఁ దొడంగినఁ గాంచి నీసుతుం
డఱిముఱి నొందియున్ బఱచునందఱ కిట్లను జేయి వీచుచుమ
బఱచెద రేటి కేఁ గలను బార్థునిఁ బట్టి వధింతు మళ్ళుఁడీ
వెఱవకుఁడీ నరుండు నను వీసము మీఱఁగ లేఁడు నమ్ముఁడీ. 185

వ. అని తా నన్నరునిపై కరుగుచున్నంత శారద్వతుం డల్లునిం బిలిచి యి ట్లనియె. 186

తే. క్రోధమూర్ఛితుఁ డైనదుర్యోధనుండు, శలభ మనలంబుపైఁ బడఁ జనెడునట్లు
నరుని మార్కొన నరుగుచున్నాఁడు వీఁడు, ప్రాణములతోడ మెండియు రాఁడు నిజము.

తే. కుబుస మూడ్చినపాములకుం దొర లగు, వానివాలంపగములు దుర్మాని వీని

సుకృతానిష్ఠుఁడవున్ సులుబ్ధకుఁడవున్, దుష్టుండవున్ గాన నీ
వికృతిం జూపుచు మమ్ము నన్యుల బలెన్ విశ్వాసహీనుండ వై
ప్రకృతిం జేసి వచింతు శంకితమతిన్ భావించుచున్ దుర్మతీ. 199

ఆ. ఎట్టు లన్న నేమి యీవు నీకై ప్రాణ, మేను విడువ నుంటి నిపుడు పోయి
పాండవేయబలము పఱియలు గావించి,వత్తుఁ జూడు మెల్లవారు మెచ్చ. 200

వ. అని పలికి గౌతమీసుతుండు నీసుతుం దలకడచి చని పాంచాలసోమకాదిబలంబుల
నెలుం గెత్తి పిలిచి వివిధవిధశరపరంపరలం బఱపిన వారును వానిం జుట్టి ప్రావృట్ప
యోధరంబు లట్లు శస్త్రవర్షంబు గుఱిసినం గినిసి యతండు పాండవులయు ధృష్టద్యు
మ్నునియు ప్రముఖంబున నవక్రవిక్రమంబునం బదుగుర,విలుకాండ్రం బిలుకుమా
ర్చి పాంచాలసోమకప్రముఖులఁ బరాఙ్ముఖులం జేయుచున్నంత ద్రుపదపుత్త్రుండు
ద్రోణపుత్త్రుం ద్రుతగతిం దాఁకి వీఁకం జూపుచు. 201

—అశ్వత్థామ ధృష్టద్యుమ్నుల యుద్ధము—

ఉ. లాఁతులఁ గొందఱం జిదిమి లావు గలాఁడ నటంచు నెంచుకో
నీతల కొప్ప దట్టిమతి నీ కగునే నిదె వచ్చితిం దిరం
బై తగి పోరుకొమ్ము తెగటాఱిచి పుచ్చెద నంచు వర్మభి
చ్ఛాతశరంబు లాతనిభుజంబులు దాఁకఁగ నేసె నీసునన్. 202

క. బారులు దీఱి శరంబులు, బోరునఁ బూఁదేనె లాన మూసరుచుఁ దేటుల్
భూరుహమునఁ బడుతెఱఁగున, నారవ మెసఁగంగఁ బడియె నాద్విజుమీఁదన్. 203

ఉ. దానఁ జలింప కింతయు నతండు పదాహతపన్నగంబు నాఁ
గానఁగ వచ్చి కార్ముకముఁ గైకొని వీఁక నెదిర్చి పేర్చి యో
రీ! నిమిషంబు సైఁపు మిపుడే నినుఁ బుత్తును గాని మిత్తికిన్
నానిశితాస్త్రశస్త్రరుచి నాఁటఁగఁ జూడు మొకింతమాత్రమున్. 204

వ. అని శరవర్షం బొలుకుచున్నంత ద్రుపదపుత్త్రుండు నాచార్యపుత్త్రునకు మఱియు ని
ట్లనియె. 205

శా. నాజన్మంబును నాప్రతిజ్ఞయును నానారాచసామర్థ్యమున్
యోజింపం దెలియంగఁ బోవ దఁటె.నీ కో బ్రహ్మబంధూ! భుజ
భ్రాజత్తేజము మీఱ నీజనకుఁ జావం జేసి కా కేను ని
న్నాజిం జావఁగ జేయ నెంచ మనము దామాత్రకున్ సైఁపుమా. 206

చ. తెలతెల వేఁగునంతకును ద్రెళ్ళఁగ నేసెద నీదుతండ్రి న
వ్వల నినుఁ బ్రేతలోకమున వాసము సేయఁగఁ బుత్తు నిష్టు లోఁ

గలఁగక పార్థులందుఁ బగ కౌరవులందును భక్తి సూపుచున్
గల నొనరింపు మెందుఁ జనఁ గాఁ గల వింకిట నాకు నగ్గమై. 207

క. బ్రాహ్మణధర్మము విడి యబ్రాహ్మణ మగుక్షత్త్రధర్మరతుఁ డగునేనిన్
బ్రాహ్మణుఁడు వానిఁ ద్రుంచిన, బ్రహ్మము దోషంబు లేమిఁ బలికెదు వినవే. 208

వ. అనవుడు నశ్వత్థామ వానిసాక్షేపణంబుల నిరీక్షించి యక్షయంబు లగునశనిసదృశబాణంబు లాపార్షతునిపైఁ బాతించిన నతండును గండుమిగిలి సర్వపాంచాలసేనాపరివృతుం డై వివిధవిధవిశిఖంబుల విసరె నంత వా రిర్వురును బరస్పరవధాభికాంక్షులై శరవృష్టి నిగిడించియు మగిడించియు మండలీకృతకార్ముకు లై మత్తగజంబుల చందంబున నెక్కువ తక్కువలు లేక సర్వభూతభయంకరంబుగా నేట్లాడుచుండ నుభయసైన్యంబులందును సింహనాదంబులును శంఖారవంబులును నానావిధవాదిత్రశబ్దంబులును మిన్నుముట్టె నట్టియెడ నాచార్యపుత్త్రుం డతిశయించి. 209

శా. ధృష్టద్యుమ్నునిఛత్త్రముం ధ్వజముఁ బృథ్విం గూల్చి కోదండమున్
ముష్టిప్రాంతమునందుఁ ద్రుంచి రథముం బోకార్చి రథ్యంబులన్
నష్టిం బొందఁగఁ జేసి సూతునితలం ఖండించి పార్శ్వస్థులం
బిష్టం బై పడఁ జేసి వాని నరసంపెం దెంపు పెంపొందఁగన్. 210

తే. ద్రుపదపుత్త్రులు మూవురు త్రుళ్లిపడఁగ, వారిఁ దునుమాడి ఫాల్గున ప్రభృతు లరయు
చుండఁ బాంచాలశతములఁ బిండివెట్టె, నెట్టనం సింహనాదము నెఱపె నపుడు. 211

వ. ఇట్లు పాంచాలసృంజయబలంబులం జంపియు గనుపుగొట్టియు యుగాంతకాలాంతకునిలీలం గ్రాలుచుండ యుధిష్ఠిరుండును భీమసేనుండును వానిం దాఁకుదెంచినం గని దుర్యోధనుండును ద్రోణుండును వానికిం దోడుసూపి రప్పుడు కయ్యంబు ముప్పిరియయ్యె నయ్యవసరంబునఁ గ్రుద్ధుం డై గుణవృద్ధుం డగుయుధిష్ఠిరుం డంబష్ఠ మాలవ వంగ శిబి త్రిగర్త బలంబులను భీమసేనుం డభీషాహ శూరసేనసైన్యంబులను ధనంజయుండు యౌధేయాద్రిజమద్రకానీకంబులను మృత్యులోకంబునకుం బుచ్చిన నచ్చటినేల యంతయు శోణితకర్దమం బై నిహతాశ్వగజనరాదులం జేసి పీనుంగుపెంట యయ్యె నయ్యెడఁ బాంచాలు రుక్కుమిగిలి ద్రోణుం బట్టుఁడు కొట్టుఁడు పొడువుఁడు పోరుఁ డనునెలుంగు లెసంగ శోణాశ్వరథుం దాఁకిన నతండు వాయవ్యాస్త్రం బరిపోసి యేసిన మహావాతంబు మేఘపటలంబుం బోలెఁ దెఱలించినం గాంచి యమ్మహారథవంశంబునకు దక్షిణోత్తరపార్శ్వంబుల భీమసేనార్జునులు కుదుర్కొని గుప్పేసిన్ శరంబుల నఱిమునంతఁ బాంచాలాదిసైన్యంబులునుం బఱతెంచి కవిసె మనసైన్యంబులును ద్రోణాశ్వత్థామలకుఁ దోడుపడిన పదంపడివిక్రమాటోపదీపితు లై యేటులాడు

చుండ మనమూఁకలు పార్థశరప్రహారంబుల నొచ్చిటు నిద్రాభరంబున సొచ్చియుఁ జిమ్మచీఁకట్ల విచ్చియు సుయోధనాచార్యులు వారించుచున్నను ఱిచ్చవడి విచ్చి పఱవం జొచ్చె నయ్యవసరంబున సాత్యకి సోమదత్తునిమీఁదికి రథంబు దోలించుకొని చని శరచయంబునం గప్పుటయు నతండు ససంభ్రాంతుం డై వాని నట్ల నేసె. 212

—సోమదత్తుఁడు సాత్యకితోఁ బోరి చచ్చుట—

చ. అఱువదినారసంబుల నహంకృతి మీఱఁగ సత్యకాత్మజున్
దఱుముచు నేయ నాతఁడును దచ్ఛరసంహతి సంహరించి పై
నఱువదిసాయకంబుల నుదగ్రగతిం బొదలించె వానిపై
నఱుముచు నొప్పి రిద్దఱు సునూత్నపలాశమహీరుహాక్రియన్. 214

మత్త. అంత బాహ్లికనందనుండు రయంబు పెంపునఁ బూర్వదే
వాంతకానుజుకార్ముకం బొకయర్ధచంద్రశరంబునన్
బంత మాఁడుచుఁ దున్మి పైపయిఁ బంచవింశతిభల్లముల్
కొంతలోఁ బదివాలుకోలలు గప్పె నాతని నొప్పుచున్. 214

ఉ. కొండొకవిల్లు చేకొని యకుంఠితవిక్రముఁ డాశినిప్రవీ
రుండు కురుప్రవీరుని నరుంతుదసాయకపంచకంబునన్
జంచల నేసి వేఱొకనిశాతశరంబున స్వర్ణకేతువున్
జెండిన నేచి యేసెఁ గురుశేఖరుఁ డిర్వదిమైదు తూపులన్. 215

సీ. శినివరుం డంతయుఁ గినిసి కొరవుచేతి,కోదండ మొకకుప్పకోల నఱికి
కోలలు పెఱికినకోదత్రాచన నున్న,వానిపై నూఱమ్ము లానఁ జేసె
నతఁడు వేఱొకచాప మంది మాధవు ముంచ, శరవృష్టిలాఘవస్ఫురణ నెరపి
యదువరుండును వానిఁ బ్రదరసహస్రసం,తతు లడరించి యంతటను గప్పె.
తే. నపుడు వడముడి తోడ్పడి యద నెఱింగి, దశశరము లేయ నాసోమదత్తుఁ డతని
శరశతంబున నొ నేసె సాత్వతుండుఁ, దలకడచి ఘోరపరిఘుంబు నలుక విసరె. 216

చ. కడువడిఁ దాఁక వచ్చుపరిఘుంబుఁ గనుంగొని సోమదత్తుఁడున్
నడిమికి రెండు గా నఱక నవ్వుమొగంబున సాత్వతుండు పెం
పడరి తదీయకార్ముకము నత్తెముఁ దుత్తుము లై వసుంధరం
బడ నొనరించి సారథిని వార్వములన్ జముఁ బోలి కంచియున్. 217

మ. జ్వలదగ్నిప్రతిమాన ముగ్రము శిలాశాతంబు పూతాశుగం
బలఘుప్రక్రియ నీస్చి నైచె నది శ్యేనాకారముం దాల్చి పే
రులి వెల్గం గలయంగఁ బర్వ గురువంశోదారువక్షంబున

బలభిచ్ఛస్త్రమువోలెఁ దాఁకుడుఁ బఱ్ఱె బాహ్లీకపుత్త్రుం డిలన్. 218

తే. విలవిలం దన్నుకొనుచును బిలుకుమాలు,సోమదత్తుని గని నీమసుతుని వారు
సాత్త్వతునిమీఁదఁ గవిసిరి సర్వపాండ,వబల మొకపెట్టి ద్రోణునిబలము నతిమె. 219

వ. అంత, 220

—కౌరవపాండవవీరులద్వంద్వయుద్ధము—

శా. కౌంతేయాగ్రజుఁ డుగ్రమూర్తి యగుచుం గౌరవ్యసైన్యావళిం
గొంత ల్గానిని శాతసాయకములం గ్రుద్ధుండ పై త్రోలువో
నంతంతం గని కుంభసంభవుఁడు క్రోధావిష్టుఁ డై కొంతలో
వింత ల్వుట్టఁగ నట్టివాయి కవిసెన్ విల్లల్ల మ్రోఁగించుచున్. 221

ఆ. కవిసి యేడువాఁడికాండంబులం బొంచు,తనయు నేయ నతఁడు కనలు గుడిచి
వాని నేనువాఁడివాలమ్ముల నొంచి, మించి యార్చెఁ బ్రజలు మెచ్చుకొనఁగ.

చ. సెలవులు నాకికొం చవుడు చేరి ఘనుఁగ్గుగుఁ డయ్యునిష్ఠరో
జ్జ్వలధనువుం సిడం బిలకు ద్రుంపఁగ నేసిన ఱప్పపాటులో
పల మఱియొండు విల్లు గొని పాండవుఁ డాతనితేరు ముంచె న
మ్ములశతముల్ సహస్రములు ముక్కొని యొక్కమొగిం నిగిడ్చుచుం. 223

క. శరఘాతవ్యథితుం డై, గురువరుఁ డొక్కింతమాత్ర కొని మూర్ఛ రథాం
తరమంద చదికిలంబడి, త్వరితగతిం దెలిసి పాముపలె రోఁజ కడుం. 224

శా. వాయవ్యాస్త్రము నారిఁ బోసి వదలన్ వాయుప్రభూతాగ్రజుం
డాయస్త్రంబున దాని మాన్చి గురుపైఁ బల్లిదుతలోఁ ద్రుంచెఁ గ్రో
ధాయత్తుం డగు బ్రాహ్మణుండు మఱియుం దాసంగ నద్దానినిం
బాయం జేసె గురూద్వహుండు నిశితప్రక్ష్వేడనాత్యుగ్రతన్. 225

వ. ఆసమయంబున వాసుదేవుండు దాసి భీమసేనాగ్రజుం బిలిచి యి ట్లనియె. 226

మ. నినుఁ బట్టంగఁ బ్రయత్నమున్ విడువఁ డీనిర్నిద్రతేజుండు కా
వున నీ వీతనితోడఁ బోర ముడయం బో రాదు చర్చింప నీ
కనుమానంబును గాదు దేశికునితో నాస్కందనం బీతని
దునుమం బుట్టినవాఁడె బిట్టడరు నీద్రోణుపై బగం దీర్పఁగన్. 227

ఆ. రాజు రాజుతోడ రణము సేయఁగ నొప్పు, సేరణంబు మాని యేగు మవల
రాజరాజుతోడ నాజి యొనర్పుము, భీమసేను ప్రాపు వెలయు నచట. 228

వ. అని నియోగించినఁ గుంతీపుత్త్రుం డొక్కముహూర్తమాత్త్రం బంతరంగంబునం
జింతించి ఘర్మాంతంబునం గాలమేఘంబువలె గర్జిల్లుచు నిబలంబులం గనుపుగొట్టుచు

గాడ్పుపట్టి యున్నపట్టునకుం జనియె ద్రోణుండును మఱియుఁ బాంచాలబలంబుల మా
ర్కొనియెఁ గృపాశ్వత్థామాదులు భీమసేనపార్షతసాత్వతాదులును సహామహామికల
తోడం గూడి మహాయుద్ధంబు గావించుచుండి రట్టియెడఁ బుట్టినధరణీపరాగంబు
మిన్ను ముట్టి చిమ్మచీఁకట్లకుం దోడునీడ యై కన్నులకుం దిరోధానంబు గావించు
చుండ నుభయసైన్యంబులవారును గోత్రనామోచ్చారణంబులం జేసియుఁ గంఠ
స్వరంబులం దిలకించియుం దెలిసికొని యొండొరుం గలసి యనఁగి పెనఁగి యలసి
సొలసి దండిచెడి బెండువడి తఱిగి విఱిగి రపుడు నీసుతుండు హతశిష్టులం గూర్చఁ
బడవాళ్ళ నియమించి వ్యూహంబు గల్పించె దానిపురోభాగమ్మున గురుండును
బశ్చాద్భాగంబున శల్యుండును సవ్యదక్షిణపార్శ్వంబుల సౌబలాశ్వత్థామలును
మధ్యభాగంబున సానుజుం డై తానునుం గుదురుకొని పదాతిసముదయంబులఁ
బిలిచి సాంత్వనవచనంబు లాడుచు వారిచే నాయుధంబులు వెట్టించి సుగంధతైలా
భిషిక్తంబు లగుకరదీపికాసహస్రంబులు వట్టించె నపుడు రథంబునకు నైదేసి విదీపిక
లును గజంబునకు మూఁడేసి ప్రదీపికలును హయంబున కొక్కొకమహాప్రదీపికయును
గా సమరించి మఱియు బలంగంబులందును బహగలముందఱను బిఱుందివెనలను బ్రక్క
లను దక్కనుం గలతాసకంబులను లెక్కకు మిక్కిలి యగునట్లు దివియలు వెలుం
గం జేసినం బాండవులును నట నేనుంగునకు నేఁడేసియు రథంబునకుఁ బదేసియు
గుఱ్ఱంబునకు రెండేసియును గా నెల్లకడలం బ్రదీపికలదీపనం జేసి నంత సంగ్రామరం
గంబంతయుఁ బట్టపగ లట్టులు ప్రకాశమానం బయ్యె నంతరిక్షంబున మెఱుంగుదీఁ
గలుం బోలెఁ గరదీపికాప్రతిజ్వలితంబు లై నానావిధయోధాభరణంబులప్రభలు
ప్రతిఫలించి దవానలప్రదీప్తం బయినదారువనంబు చందంబునం జూపట్టుటయు నాప్ర
కాశంబున సర్వసైన్యంబులకునుం గాక ద్యావాపృథ్వ్యవకాశంబునకుఁ బ్రకాశంబు
కలిగె గరుడగంధర్వయక్షరాక్షసాదిదేవయోనిగణంబులును బ్రమోదించుచుం బ్రస్తు
తించెఁ బర్వతనారదబోధితు లై నాగాదిలోకంబులవారును జనువెంచి కాంచి సంతసించి
రాసమయంబున నిరువాఁగునుం గయ్యంబు సేయ సమకట్టినంత నగ్నికల్పుం డగు
నాచార్యుండు మధ్యందినమార్తాండునివడువున విడంబించుచు నరిబలంబుపై నడరం
గవ్వడి వడిం గలిగింపఁ బాండవపాంచాలయోధులును మనబలంబుపైఁ గవియు
దెంచి రప్పుడు శతాంగంబు శతాంగంబును హయంబు హయంబును నాగంబు
నాగంబును రథికుండు రథికుండును గాలుమానిసి గాలుమానిసియుం గాఁ గలియం
బడి బెనంగుచుండి రనిన ధృతరాష్ట్రుండు సంజయా! సవ్యసాచి సమరోన్ముఖుం
డైనం గని నాకొడు కేమి చేసె నాచార్యపరిరక్షణంబున కెట్టికట్టుదిట్టంబు గావించెం

చెప్పు మనిన సంజయుం డట్లు సంగ్రామకుతూహలాయత్తచిత్తుం డయినగురూత్త మునిచిత్తం బెఱింగి దుర్యోధనుండు వికర్ణ చిత్రసేన సుపార్శ్వ దుర్ధర్ష దీర్ఘబాహు ప్రభృతిభ్రాతృవర్గముం బిలిచి మీ రెల్ల మీమీమూఁకలతో గురునిపిఱిందిదెసం గాచి యుండుఁడు హార్దిక్యమద్రేశ్వరులు దక్షిణోత్తరపక్షంబులందును హతశేషు లగునత్రిగర్తశూరులు పురోభాగంబునను నిలిచి యాచార్యుం బరిరక్షించుచుం దురు గాక యతండు బలవంతుండు క్షిప్రహస్తుండు త్రిదశు లెత్తినను జీరికిం గొనండు పాండవబలంబుతోఁ బెద్ద ధృష్టద్యుమ్నుం డొక్కరుండు వారిలోనం బేరు గన్నవాఁడు వానిబాఱిం బడకుండ భారద్వాజుం గాచుట కర్తవ్య మట్లయిన నతండు గండుమిగిలి సోమకసృంజయనాయకుల నెల్లం ద్రెళ్లనేయు సర్వాల నెవ్విధంబున నైన నాచార్యపుత్త్రుండు ద్రుపదపుత్త్రుం బొలియించుఁ గర్ణుం డర్జును నిర్జించు నేను భీమసేనుం బడ నేయుదుఁ దక్కినవారి నుక్కడంచి జయంబు గొంట మనకు సుసాధ్యంబు గావున నీసంగరంబునం గురునిం గాచుట కర్తవ్యం బని నిర్దేశించుటయు నెల్లవా రట్లు సన్నద్ధులై యుద్ధోన్ముఖు లయి రంతఁ గౌరవసైన్యంబులం గవ్వడియుఁ గవ్వడిం గౌరవసైన్యంబులును దాఁకె ద్రౌణి పాంచాలబలంబును ద్రోణుఁడు సృంజయబలంబును మార్కొని పోర్కొని రిట్లు కురుపాండవవాహినులకుఁ బోరు ఘోరంబై ప్రవర్తిల్లుచున్నంతఁ గొంతే యాగ్రజప్రేరితము లై పాండవపాంచాలసోమకబలంబు లొక్కపెట్ట ద్రోణుఁ జుట్టు ముట్టుచున్నం గని కృతవర్మ యుధిష్ఠిరుం దాఁకెఁ గౌరవ్యుం డగుభూరి శైనేయుం బొదివె సూతపుత్త్రుండు సహదేవు నెదిరించె సుయోధనుండు భీమసేను మార్కొనియె శకుని నకులు సఱిమె శారద్వతుండు శిఖండిం దఱిమె దుశ్శాసనుండు ప్రతివింధ్యుం బ్రతిఘటించె నశ్వత్థామ ఘటోత్కచుం దోలె వృషసేనుండు ద్రుపదుం బొదివె మద్రేశ్వరుండు మత్స్యేశ్వరు నడ్డగించెఁ జిత్రసేనుండు నాకులి యగుశతానీకుం దాఁకె నలంబుసుం డర్జునుం దఱిసెఁ దక్కినం గలయోధులు దక్కినం గలవారి నాఁగిరి ధృష్టద్యుమ్నుం డొంటిం జూడ కాచార్యు సఱిమె గజారోహకులు గజారోహకులను రాహుతులు రాహుతులను మార్కొని రిట్లు ద్వంద్వయుద్ధంబు సిద్ధం బయ్యె నయ్యెడ. 229

సీ. కృతవర్మ ధర్మజు నెదిరించి నిలిపిన, నతఁ డల్గి యేనిట నతని నొంచి
మఱి తోన యిర్వదిమార్గణంబులు వేసి, నిలిచి నిల్వుము పోకు మనుఁడు నతఁడు
కినిసి పాండవువిల్లు దునిమి యేడిట నా, తని నేయ నతఁడు డాంపుధనువు పూని
పదిబాణములు కృతవర్మవక్షమ్మునను, బాహువుల్ వగులంగఁ బఱపుటయును

తే. మాధవుఁడు కోపఘూర్ణితమానసుఁ డయి,ధర్మపుత్రుని నేడింట మర్మ మాడఁ
దిగిచి యేయుఁడు నాతఁ డత్తైమును విల్లుఁ,జిద్రుపలుగఁ జేసి యేనింటఁ జెరివె నతని.

క. కృతవర్మ తెప్ప ఱ్ఱాల్చెడు,మితిలో నొండొక్కవిల్లు మేకొని పాండు
క్షితినాథసుతుని డెబ్బది,శితశరముల నొంచి మించె శీఘ్రస్ఫురణన్. 231

ఉ. నొచ్చి యుధిష్ఠిరుం డపుడు నూల్కొని చాపను వెట్టి తేర్మిపైఁ
గ్రచ్చర వానిబాహువున గాఢతరం బగుశక్తి వైచి పై
పెచ్చు శరంబులన్ ముసుఁగు వెట్టి శరాసనహస్తుఁ డై నృపుల్
మెచ్చఁగ హస్తలాఘవ మమేయముగాఁ గనిపింపఁ బెంపునన్. 232

తే. అలిగి హార్దిక్యుఁడును నిమేషార్ధమునను, ధర్మసుతుసూతు రథము రథ్యములఁ గూల్ప
నతఁడు వాలును బలకయు నందునంత,హృదికసూనుఁడు,గావించెఁ జిదురుపలుగ.

ఉ. తోమర మెత్తి తత్తఱముతో యమనందనుఁ డందఱుం గనన్
భీమపరాక్రముండు యదువీరునిపైఁ బడ నేయ నంత ను
ద్దామజవంబుమై నతఁడు దానిని రెండుగఁ జెండి వెండియున్
మైమఱు వ్రాడఁ బెక్కు లగుమార్గణముల్ నిగిడించె వానిపైన్. 234

క. విరథుండు విగతవర్ముఁడు, శరబాధితుఁ డగునజాతశత్రుం డనికిన్
మరలి చనె హృదికపుత్త్రుఁడు, గురునకుఁ దోడ్పడఁగ నడచె గురుబలవృతుఁ డై.235

—సాత్యకి శక్తిచే భూరిం జంపుట—

ఉ. భూరియు నాశినీశ్వరుఁడు పోరునెడన్ శినివీరుఁ డుగ్రుఁ డై
భూరిభుజాంతరంబునను బోరన నెత్తురు లూఱ నేనుమేల్
నారసముల్ కడు న్వడిగ నాఁటుఁడు నోటమిఁ గాంచ కంత న
క్కౌరవుఁ డైదురెండ్లువరకాండముల న్నిగిలించె నాతనిన్. 236

క. శినివరుఁడు నగుమొగంబున, ధనువుం దెగ నేసి వానితనువుఁ జొఱం గా
సునిశితశరములు తొమ్మిది, కనుచుండెడునంతలోనఁ గడువడి నేసెన్. 237

తే. తాడితుం డయి ధనువొండు దాల్చి యతఁడు, మూఁడుతూపుల సత్యకపుత్త్రు నొంచి
విల్లు దునుమాడె నొండొక్కభల్లమునను, దానఁ గన్నెఱ్ఱఁ జేసి సత్యకసుతుండు.238

క. సుమహావేగం బగుశక్తి,మహాస్త్రము పూని పూన్కిం దగఁ గురువం
శమహితు నెద నేసిన నం,గము వగిలి యతండు వడియెఁ గడతేరి ధరన్. 239

వ. అట్లు హతుం డైనభూరిం జూచి శారద్వతీసుతుం డతిరయంబున శరపరంపరలం బరఁ
గించుచు సత్యకసుతుం దఱిమి వచ్చునంత ఘటోత్కచుం డడ్డంబు సొచ్చి రథా
క్షమాత్రంబు లగుపత్త్రంబులఁ గుఱియుచుండ నతండు మర్మభేదు లగుదివ్యశరం

బుల నతనిపయిం గుప్పి కప్పుటయు నప్పవనపౌత్రుం డేదు వెఱిగిన తెఱంగునం బఱఁగి వజ్రాశనిసమంబు లగుక్షురప్రార్ధచంద్ర వరాహకర్ణ వికర్ణ నాళీక నారాచశతసహస్రంబు లాగురుసుతునిపై నేయ నమ్మహారథుం డవ్యథితేంద్రియుం డై దివ్యాస్త్రపరిమంత్రితంబు లగు ఘోరశరంబులు వాఱ నేయ నాశరంబు లొండొంటిం దాఁకి దిక్కులు పిక్కటిల్ల విస్ఫులింగంబులు వెడలం గ్రక్కు నక్కాలంబున హిడింబానందనుండు కోపోద్దీపితుం డై. 240

చ. పదివిశిఖంబు లాద్విజునివక్షము దూఁకము గాఁగ నేయుఁడున్
హృదయము గాఁడి పోవ నొకయించుక సంచలితాంగయష్టి యై
యెదిరి నెఱుంగ కాతఁడు సహింపఁగ రానివ్యథాభరంబునన్
నిదురకు నైనయట్లొఱిగె నీబల మెల్లను దల్లడిల్లఁగన్. 241

క. కని సృంజయపాంచాలురు, మనమున హర్షించి వేసలు మ్రోయంగాఁ
బొనరించి సింహనాదము, లనూనగతి సంకులోత్తి రాసమయమునన్. 242

చ. తెలిసి యొకింతలోన రణధీరుఁడు విల్గొని నారి మ్రోయఁగాఁ
జలుపుచుఁ గాలదండసదృశ మ్మగున మ్మొకఁ డీడ్చి వేయ స
గ్గలికమెయిన్ గలంబ మది గాట మురమ్మున నుచ్చి పోయె సో
కులదొర సోలె నాలమునకుం దొలఁగించె నియంత దేరినిన్. 243

పంచచామరము. సుయోధనుండు మాతరిశ్వసూతి కోపి తూపులన్
రయంబు మీఱఁ బాఱఁ జేసి రాయిడింప నాహవ
ప్రియుండు భీమసేనుఁ డార్చి త్రేసెఁ దొమ్మిదమ్ములన్
భయంబు దక్కి నీసుతుండు బాదె నిర్వదమ్ములన్. 244

క. వారలు శరసంఛన్నులు, పోరుమఁ జూపట్టి రపుడు [illegible]రమంతన్
వారిదజాలసమావృతు, లై రాజిలుపుష్పవంతు లనఁ [illegible]రున్. 245

వ. అంత దుర్యోధనుండు. 246

చ. నిలు నిలు మం చదల్చుచు సునీతము లై తగునేనునారసం
బులు పవమానసూనుపయిఁ బుచ్చుడు నచ్యుతుగుం డుదగ్రుఁ డై
విలు సిడమున్ దెగన్ సలిపి నేవ్వడిఁ దొంబదియంబకంబులన్
నిలువున నాఁట నేయుటయు నీసుతుఁ డింత చలించి యంతటన్. 247

సీ. మఱియొండు విలుపూని మారుతి నో నేయఁ, బ్రతిశరంబుల వానిఁ జిదుక నేసి
వాసిమై నాతఁ డిర్వదిక్షుద్రకంబుల, నలయించె రారాజునంగకముల
నతఁడు నాతనిధను వగిలించె నొకక్షురప్రమునఁ బై నిడెఁ బదబాణములను

గడు నల్గి వడముడి కడిఁదివిల్లొకఁ డూని, నృపతి నేడమ్ముల నేయ నతఁడు
తే. నాథనువుఁ ద్రుంచి మఱి భీముఁ డందు నట్టి,వింటు లెల్ల నొకండును రెండు మూఁడు
నాలు గైదును గా లీల నఱకి మఱియు, మఱియు నెత్తిన వాని నమ్మాడ్కిఁ జేసె.
మ.స్ర. తనవిండ్లమ్మాడ్కి వమ్మైనఁ దొఱఁగుడుఁ గ్రోధమ్ము చిత్తమ్ము హొత్త్రన్
గని భీముం దుగ్రదీప్తిం గనలుచు లయకృత్కాలదండోపమం బై
చనుశక్తిం బూని వైచెన్ సరగున నృపు డాశక్తి పై రాక మున్నే
జను లెల్లం జూడ మూఁడై చనఁ దునిమె వడిన్ శాతనారాచపంక్తిన్. 249
వ. అప్పుడు. 250
శా. కంటన్ నిప్పులు రాల భీముఁడు గదం గైకొంచు నంచద్గతిన్
మంట ల్వాఱఁగ నీకుమారునిపయిన్ మాఱొడ్డి వేఁ ద్రేయ న
గ్గొం టానందున దాఁటెఁ బాటునను నుగ్గు న్నాచమై తేరు మ
న్నంటన్ బోయె నహాశ్వసూత మయి హాహాకార మేపారఁగన్. 251
క. నందకునిస్యందనం బపు, డందిక గా నెక్కి నృపతి యది గనక మరు
న్నందనుఁడు వాని చచ్చిన,చందము డెందమున నెంచి చయ్యన నార్చెన్. 252
వ. మనసైనికులును సుయోధనుఁడు నిధనంబు నొందె నని డెందంబులం దలంచి హాహా
కారంబు లొనరించి రయ్యార్తరవంబును భీమసేనునిసింహనాదంబును విని యుధిష్ఠి
రుండు నట్లకా శంకించి వృకోదరుం డున్నచోటికిం జనియె నట్టియెడఁ జేదిమత్స్య
పాంచాలసృంజయకేకయాదు లొక్కుట్టెట్ట భారద్వాజుం జుట్టుముట్టి రప్పట్టున వైక
ర్తనుండు సహదేవు నడ్డగించుటయు నతండును. 253

—కర్ణుండు సహదేవు నోడించి వింటికొపునం బొడుచుచు నవమానించుట—

సీ. రెండుతొమ్మిదులు ప్రచండకాండంబులు, వైకర్తనుని వైచె వీకఁ జేసి
కర్ణుండును న్నాలుకఱకుటమ్ములు రువ్వి, సహదేవుచాపంబు సరగ విఱిచె
మాద్రేయుఁ డంతన మాఱువి ల్గొని వాని, వింశతిశరముల వివశుఁ జేసె
రాధేయుఁడును వానిరథ్యంబులం గూల్చి, సారథి నొకకోలఁ జావ నేసె
తే. విరథుఁ డై సహదేవుఁడు కరయుగమున, వాలుఁ బలకయుఁ గొనునంత వాని వింతె
నఱకె గద వ్రేయఁ బడ నేసె నడుమ దాని, శక్తి వైచినఁ దునిమె వృషలసుతుండు.
చ. అరదము డిగ్గి డిగ్గునను నాసహదేవుఁడు తేరిచక్రమున్
సరగున నెత్తి కర్ణుపయిఁ జావఁగ నేయుఁడుఁ గాలచక్ర మ
ట్లురుదుగ వచ్చుదానిఁ గని యాతఁ డనేకసహస్రసాయకో
త్కరముల నూచ నేయుటయుఁ గన్గొని సంభ్రమితాంతరంగుఁడై. 255

ఉ. వైచి పడంబకంబులను వానిపయిం బదియమ్ములన్ శరం
ద్రోచి సిడంబు మూఁడిటను ద్రుంచి నియంత శరస్త్రయమ్మునన్
బాచి త్రివేణుకమ్ము నొకవాలికతూపునఁ దాఁచి విల్లు పె
ల్లేచిన నాల్గుబాణముల నీచపడం దురగాళి రాచియున్. 262

తే. అసుర మఱియొక్క చాపంబు నందునంత, దాని నొక్కట రెండుగాఁ దత్తిగి నాల్గు
వానిపై నేయ వెఱగంది వాఁడు పఱచెఁ, గ్రీడియును ద్రోణురథమును గూడ నరిగె.

క. నరుఁ డరుగునపుడు చిమ్మిన, శరములవేడిమికి సకలసైనికవర్యుల్
మరుదున్నతిఁ దరువులుబలె, ధరఁ ద్రెళ్ళిరి పాఱి రల్ల తల్లడపడుచున్. 264

సీ. నీనందనుఁడు చిత్రసేనుఁడు నకులనం, దనుని శతానీకుఁ దాఁకె వీఁక
నాకులియును బంచనారాచముల నొంచి, పై నేసె మఱిపదిబాణములను
జిత్రసేనుండును శితశరనవకంబు,నను వాని వక్షము నాఁట మీఁటెఁ
బాండుపౌత్రుఁడు దండికాండంబులన్ నీదు, పుత్రుని మైమఱ్వు వోవఁ జేసి

తే. పడగయున్ విల్లు దునుమ నీకొడుకు మఱు,విల్లుఁ గొని ద్రౌపదీసుతు విశిఖపంక్తి
విసరుటయు నాతఁ డాతనివీతుల ర,థసూతునిం ద్రెళ్ళఁగా నేసెఁ జూపఱెన్న. 265

చ. అరదము డిగ్గి నీకొడు కహంకృతి మీఱఁగఁ బాండవేయుపై
నిరువది యైదునారసము లేడ్తెఱఁ జూపుచు నేయ నాతఁడున్
గరకరి నర్ధచంద్రవిశిఖంబున నాతనివిల్లు ద్రుంపఁ గా
విరథుఁడు వీతధన్వుఁ డయి వేఁ జనియెం గృతవర్మతేరికిన్. 266

చ. ద్రుపదుఁడు సేనతో నడరి ద్రోణునిపైఁ బడ నేగుచున్నచో
నపు డెదు రేగి కర్ణసుతుఁ, డాతనిపై నిశితాశుగంబులన్
వ్యపగతభీతి నేయ నతఁ డాతనిబాహుభుజాంతరంబులన్
సుపరిచయంబు సేయ వెసఁ జొన్పె శరంబులు షష్టిసంఖ్యగన్. 267

క. ఇరువురు శలలములగతిన్, శరసంవిద్ధాంగు లగుచు క్షతజాప్లుతు లై
విరిసినమోదుగుమ్రాఁకుల, కరణిం బొల్పొంది రపుడు కౌరవనాథా. 268

తరువోజ. కురురాజమిత్రునికొడు కేచి ద్రుపదు, గుఱిసేసి తొమ్మిది కోలలు మఱియు
శరసప్తతియు మూఁడుసాయకములును, జయ్యన నిగిడించి శరసహస్రములఁ
బరఁగించుటయు నల్గి పాంచాలవిభుఁడు, వసుషేణసుతువిల్లు వడిఁ ద్రుంచె నంతఁ
గర ముల్గి యతఁ డొండుకార్ముక మంది, కడిఁదితూపున వానిఘనవక్ష మేసె. 269

క. అది యొమ్మువచ్చి పోవుడు, మది చెడి గుఱివోయె ద్రుపదమహిపతివానిన్
గదనమున కేడ్గఁ బాపెన్, బదనునఁ దత్సూతుఁ డెల్లబందులు దలఁకన్. 270

తే. ద్రుపదుఁ డక్లైన దివియుల నపుడు విడిచి, కాలుమానుసు లెల్లరుఁ గాండిశీకు
లైరి వృషసేనుఁ డుష్ణాంశుఁ డట్లు వెలిఁగి, మూఁకలం జించి ధర్మజు మొనకు నరిగె.

క. ప్రతివింధ్యుని దుశ్శాసనుఁ, డతులితగతి నాఁగి ఫాలమం దొగి నాఁటన్
శితశరములు మూఁడేసిన, నతఁ డొప్పెఁ ద్రిశృంగసన్నుతాచలము వలెన్. 272

ఉ. తొమ్మిదిసాయకంబులను దోడన యేడుశితాశుగమ్ములన్
బిమ్మట వుట్ట నేసెఁ బ్రతివింధ్యుఁడు నీసుతు నంతఁ నాతఁ డు
గ్రమ్ముగ నేచి వానితురగమ్ములఁ ద్రుంచి నియంతఁ గూల్చి కె
క్కొమ్ము వగిల్చి తేర్విఱిచెఁ గేరుచు నింతలు నింత లై చెడన్. 273

మ. విరథుం డై ధర నిల్చి కేల ధనువున్ వేమాఱు మ్రోఁగించుచున్
గరిమన్ బ్రతివింధ్యుఁ డాశుగము లాకర్షించి వర్షించుచున్
శరధిం బొల్చువరక్షురప్రమునఁ దచ్చాపంబు ఖండించి నీ
వరపుత్త్రుం బదివాలుతూపులను నొవ్వం జేసె నవ్వేర్పడన్. 274

వ. అట్లు విక్రమించుచున్నంతనత్యంతత్వరితమ్ముగ నతనితమ్ములు వచ్చి తోడుపడుటయు నాయుధిష్ఠిరతనయుండు శ్రుతసోమునిశతాంగం బెక్కి మొక్కవోక పరాక్రమింపం గని తావకులు నాదుస్ససేనునకుం దోడుసూపి రప్పుడు యమరాష్ట్రవివర్ధనం బగు మహాయుద్ధంబు ప్రవృద్ధం బయ్యెఁ బదంపడి. 275

క. నకులుఁడు శకునియుఁ బ్రదర, ప్రకరంబులఁ బోరుచున్నపదనున గుసుమ
ప్రకటితపలాశభూజము, లొకొ నాఁ బొంగడొందిరి క్షతజోక్షితతను లై. 276

శా. గాంధారేశ్వరుఁ డేచి యప్డు నకులున్ గాఢప్రకారంబునన్
సంధానించినకర్ణికాండమున వక్షం బాడఁగా నేయఁ బ్ర
జ్ఞాంధుం డై గొఱవోయి తేరిపయి మే నానించె నయ్యెంతలో
గంధోద్రిక్తుఁడు నీమఱంది యఱచెం గాలాంబుభృద్వైఖరిన్. 277

ఉ. అత్తఱియందు పాండవుఁ డహంకృతిమై స్మృతి గల్గ నల్గుచున్
వ్యాత్తముఖాంతకుం డనఁగ వానిపయిం బడి వాలుతూపులన్
గ్రొత్తల నేరి యార్పదులు నూర్పదు లాతనిఱొమ్ము గాఁడ గాఁ
మొత్తియు విల్లు ద్రుంచి ధ్వజమున్ విదళించియు నొంచె నొంచఁగన్. 278

తే. బాణపాతమ్మునం జేసి ప్రాణ చెడ వి, సంజ్ఞుఁ డై సౌబలుం డప్డు స్యందనమున
వ్రాలె నరసావుచచ్చినవానిఁ బోలి, రథముఁ దొలఁగించె సారథి, రభసముగను. 279

వ. అట్లు విజయంబు గాంచి నకులుండు తన్నడ్డగించినవారి నెల్ల దొడ్డనారసంబులఁ ద్రుంచి మించి తనవా రగ్గించుచుండ ద్రోణానీకంబుపయిం గవిసె నంత శిఖండి

తన్నెఱిమినగౌతముం గని కనలుచు. 280

సీ. నవశరంబులఁ గృపు, నగుచు నేసిన నీసుఁ, జేసి యేనమ్ముల నేసి మఱియు
నిరువది ప్రదరముల్ పఱగించె నతఁడు శిఖండిపై వారిపోల్కెండుకొనియె
నప్పు డప్పాంచాల్యుఁ డర్ధచంద్రశరంబు,నను దెగనేసి యయ్యనఘువిల్లు
నిశితసాయకముల నిగిడించినం గ్రుద్ధుఁడై శక్తి నడరించె నాద్విజుండు.
తే. ద్రుపదపుత్త్రుఁడు దానినిఁ దునుఁగఁ జేసె, దశశరంబులఁ గృపుఁడును ధనువు పూని
మేలువాలికకోలల మేను గప్ప, సోలుచు శిఖండి తేరిపై వ్రాలె ననిప. 281

ఉ. వ్రాలిన వానిపై మఱియు వాలికతూపులు విప్రుఁ డేసెఁ బాం
చాలురు సోమకుల్ గవిసి సాయకముల్ సిగిడించుచుండ నా
వ్వాలికి నీకుమారులును వాహినితోఁ జనుదెంచి రంతలో
నాలము భీకరం బగుచు నారయ వచ్చె బలద్వయంబునన్. 282

క. చతురంగబలసమృద్ధతి, నతులితమై రజము రేఁగి యట దివియలపైఁ
బ్రతిరోధించుచుఁ దపమునఁ, బ్రతిభటునిం గాక భటుఁడు బంధునిఁ బెనఁగెన్. 283

వ. అట్టి తుములసమరంబున బహువిధబలసమేతుండై ధృష్టద్యుమ్నుండు గురు నఱుముటయు నీసుతులును జతురంగబలసమన్వితులై గురునకుం బాసటయై రంత నుభయబలంబులును మహార్ణవంబులమాడ్కిం బెల్లు ఘూర్ణిల్లె నయ్యవసరంబునఁ బాంచాల్యుండు. 284

—ధృష్టద్యుమ్నుఁడు ద్రోణునిపైఁ గవిసి ఘోరసాయకంబులు ప్రయోగించుట—

మత్త. పంచపత్త్రములన్ ఘటోద్భవుబాహుమధ్యము నొంచినన్
బంచవింశతిసాయకమ్ములఁ బర్వఁ జేసి యతండు మే
లెంచి యొక్కశితాశుగంబున నేసి పార్షతుచాపమున్
ద్రుంచె నంత నతండు కోపము తోడుసూపఁగ నేపునన్. 285

శా. దష్టోష్ఠుం డయి జేవురింప నయనద్వంద్వం బసాధారణా
వష్టంభం బొనరించి ద్రోణవధమున్ వాంఛించి వేఱొండువి
ల్లిష్టావాప్తిగఁ బూని పూర్వి మొఱయన్ హెచ్చిల్లి చిచ్చట్లు వి
స్పష్టంబై వెలుఁగొందుఘోరశరమున్ సంధించి యేసెన్ వడిన్. 286

తరళము. అది దివాకరునట్లు దీప్తుల నాకసంబున నింపుచున్
బొదివి ద్రోణునిప్రాణముం గొనఁ బోవునప్పుడు వేల్పులున్
మదిఁ దలంకుచు స్వస్తి మాటికి మాటికిం బచరించి ర
య్యదనునన్ గురుఁ డీల్గునో యని యారటించిరి కౌరవుల్. 287

క. అది నెఱిఁగి కర్ణుఁ డయ్యది, పదిరెండై పడఁగ నేసి బహుబాణతతిన్
బదపడి పార్షతుమీఁదన్, బొదలించెం గౌరవాళి ముదమునఁ బొదలన్. 288

వ. అట్టియెడఁ గృపాచార్యుండు నాచార్యనందనుండును శకునియు నైదేసిబాణంబులును
శల్యుండు తొమ్మిదియమ్ములును దుస్ససేనుండు మూఁడుప్రదరంబులును దుర్యో
ధనుం డిరువదిశరంబులును బాంచాల్యుమీఁదం బఱపిన నతం డయ్యేవ్వ రమూఁడే
సినారసంబుల నొవ్వ నేసిన వా రందఱుం జుట్టి మఱియుం బెట్టేయుచున్నంత.

తే. తలకడచి వచ్చి ద్రుమసేనుఁ డలుక నెల్లఁ, జోదుల నిశాతశరములు మోదుచుండఁ
గర్ణుఁ డాతని మూఁడింట గండడంచి, శిర మొకంటను ధరఁ గూల్చె సరభసమున.

ఉ. తమ్మునిచావు నెమ్మదికిఁ దాపముఁ గూర్పఁగఁ బార్షతుండు కో
పమ్మున నెల్లవారిపయి బాణపరంపరలన్ నిగిడ్చి వా
లమ్మునఁ గర్ణువి ల్విఱిచె నాతఁడు గన్నులఁ గ్రోధరక్తముం
గ్రమ్మఁగ నొండువిల్లు గొని గాఢముగా నొగిలించె నాతనిన్. 291

తే. అట్లు సంరబ్ధుఁ డగుకర్ణు నరసి వీరు, లార్గురును బార్షతునిఁ జుట్టి యఱుముచుండ
నతని మృత్యుముఖంబున నైనవానిఁ, గాఁ దలంచిరి సైనికాగ్రసరు లపుడు. 292

వ. అయ్యెడ నెడరు వేచి సత్యవసుం డైన సాత్వతుం డరుదెంచి పెంపరం బగునంపతుంపరం
బరఁగించుచున్నంత రాధేయుండు పదిప్రదరంబుల నాశినివరు నొప్పించుటయు నతండు
నన్నిబాణంబుల వాని నొప్పించె ని ట్లన్యోన్యంబు వత్సదంత క్షురప్ర విపాఠ కర్ణిప్ర
ముఖనానావిధప్రచండకాండంబులం గప్పుకొనుచుండ నీకొడుకులుం గర్ణుమఱువు
సేరి శినివరు నేయం దొడంగి రతండు నస్త్రంబులకుఁ బ్రత్యస్త్రంబు లేయుచు
నేచినఁ గర్ణపుత్త్రుండగు వృషసేను నొక్కతీక్ష్ణశరంబున నురం బుచ్చిపో నేయ నతండు
సొమ్మసిల్లి విల్లు విడిచి తేరిపయిం జదికిలం బడియె నది గని రాధాసుతుండు
సుతుండు హతుండ కా వగచి వాసుదేవానుజుం బొదివి. 293

చ. వివిధశరంబులం దొడిగి వేయుచు నుండఁగ వానిపుత్త్రుఁడున్
జవమున వచ్చి చిచ్చునకుఁ జాలినవాలికతూపు లేసె యా
దవుఁడును గర్ణునిం బదిటఁ దత్సుతు నేనిట నేసి మేనులం
జివ చెడఁ జేసి యత్తెమ్మునఁ జించి ధనుస్సులు ద్రుంచె నెంచఁగన్. 294

వ. అట్టియవసరంబున గాండీవనిస్వనంబును రథనిర్ఘోషంబును విని రాధేయుండు గాంధా
రేయుం బిలిచి యి ట్లనియె. 295

మ. అదె వీతెంచిడి వింటివే నరునిఘోరాకారగాండీవదు
ర్హ్రాదనిర్హ్రాదము మేదురాంబుదభవాహీనోగ్రగర్జాసదృ

తుద్ధృతస్యందననిస్వనంబు కురురాట్చంద్రా! భుజాటోప మ
ప్పదమం దాతఁడు చూపుచుండె నని తోఁప న్వచ్చె నాలించితే. 296

—కర్ణదుర్యోధనులు దురాలోచన చేసి సాత్యకిం దలపడుట—

క. వాతోద్ధూతతటిత్వ, ద్వ్రాతము వలె విచ్చి పఱచు బల మెల్ల నటన్
స్ఫీత మయి దుందుభిస్వన, మేతెంచెడు నాతఁ డున్న యెడ నరనాథా. 297

ఆ. నాకుఁ జూడ నరుఁడు వీఁకమై మనమూఁక,లోనివీరవరులఁ బూని చంపు
చుండునట్లు తోఁచె నోలి హాహాకార,మతిశయిల్లుచుండె నరయ మచోటు. 298

ఉ. ఇచ్చట వృష్ణిపార్షతులు నెల్లధనుర్ధరులందుఁ జిక్కి రి
ష్టిచ్ఛకొలంది నిందఱము నేకముఖం బయి ముట్టి వీరి వి
వ్వచ్చునిపట్టినిం బలెను బట్టి వధింతము వీరుచచ్చినన్
వచ్చును జేతికిన్ జయ మవశ్యము గా నటు సేయుఁగో ప్పగుణ్. 299

తే. వీరి నిటు ముట్టడించుట వినియె నేని, క్రీడి యుద్వృత్తిగా వచ్చి తోడు సూపు
నపుడు మనతలంచినపని వ్యర్థ మగును, గాన నరుఁ డింద రాకుండఁ గడఁగ వలయు.

ఉ. వీరినిఁ జంపునంతకును వీఁక నటన్ నరు నిల్వరింపఁ గా
భూరిబలంబుతో రథసమూహముఁ బుచ్చుట లొప్పఁ గావునన్
వారక వేగిరింపు మని పల్కినయంత నరేశ్వరుండు గాం
ధారమహీశునిం బిలిచి తద్విధ మంతయుఁ జెప్పి యి ట్లనున్. 301

సీ. పదివేలయేన్గులుం బదివేలరథములు, గొని నీవు చని నరుం బెనఁగికొమ్ము
దుశ్శానుండును దుష్ప్రధర్షణ దుర్వి,షహ సుబాహులు నీకు సాయ మగుదు
రీవు పాండవులను జీవమై గెలువుము, దేవేంద్రునం దెల్లదేవతలకు
నట్లు జయాశ నీయందు మాకుఁ బ్రతిష్ఠి,తం బయి యుండుట తథ్యమ కద

తే. యనిన నౌఁ గాక యని సుబలాత్ముఁ జన్ముఁ, డఖిలసేనాసమేతుఁ డై యపుడు నీదు
సుతులు వెన్నంటి రా నట కతులితగతి, నరిగి పోరాడె నందఱ నదిమి యాఁగి. 302

వ. ఇక్కడ భారద్వాజుండు ధృష్టద్యుమ్ను ముట్టడించినం గని సూతపుత్రుండు చతురంగ బలంబులతో సాత్యకిం జుట్టుముట్టి సింహనాదంబు గావించుచు ననేకశతసహస్రశరంబులఁ బరఁగించుటయు నతండును గోపాటోపంబున నేపుమీఱి నారాచపరంపరలఁ బరఁగించుచు నెల్లవారి మార్కొని. 303

చ. నరులశిరంబులన్ నఱకి నాగకరంబులు కత్తిరించి మేల్
తురగగళంబులం దునిమి తోరఁపుఁదేరులు గుప్పగూల్చి నె
త్తురు ప్రవహింపఁ జేసి యటఁ దుత్తుమురై ధ్వజచామరాంగదో

త్కారములు నాతపత్త్రములు కార్ముకముల్ వడ నేసె నీసునన్. 304

క. నీమూఁక లార్తనాదము, వేమాఱుకి నింగి ముట్ట వెఱచఱచి కడున్
భీమ మగుపోరు విడి వడి, సామాన్యము లగుచుఁ బఱచె క్షణమాత్రములోన్. 305

క. ఆతనికోల్తల కోర్వక, నీతనయుఁడు పీతనయుఁడు నిలు నిలు మనుచున్
భూతలి మిగ్రువఁగ నార్చుచు, సూతునిపై బఱరి వచ్చి శూరునిఁ దాఁకెన్. 306

వ. అంత మురాంతకానుజుం డత్యంతశౌర్యధైర్యధుర్యుం డై. 307

చ. పొలసు మెసంగునిచ్చమెయిఁ బొల్పెసలారుచు నుండువాలుఁదూ
పులు పదిరెండు నీసుతుని మోయఁగ నేయుఁడు దాన నొచ్చి యుం
గలఁగ్గి యతండు వానిఁ బదికాండములన్ నొగిలించె నాతఁడున్
జలమున రాజువక్షమున సంధిలఁ జేసె యనేకరోపముల్. 308

క. జమువీటి కనిచి రథవాహములను సారథినిఁ గూల నడఁచి యుఱచుచున్
గ్రమ మతి నీసుతుఁ డేఁబది, సముచితసాయకము లేసె శైనేయుపయిన్. 309

తే. వాని నన్నింటి నడుమన వ్రక్కలించి, తోసపెక్కమ్ము లడరించి దోర్బలంబు
పొసఁగ శినివరుఁ డొకభల్లమునను వాని,ధనువు మస్తకము దక్కఁ దునిమి వైచె. 310

వ. విరథుండును విధనుష్కుండు నగుసుయోధనుండు కాందిశీకుం డై కృతవర్మరథం బె
క్కె వాహినియును వార్ష్ణేయునిపెక్కువం జేసి యుక్కు దక్కి పిక్కబలంబు చూపె
నక్కడ నీమఱందియు సురేంద్రసూనుం దాఁకి. 311

చ. ఇరువదిరోపముల్ మఱియు నిర్వదిమేదులు తూపులున్ వడిం
బరపుచుఁ బాండుపుత్త్రుపయిఁ బాఱఁగ నేయుఁడు నాతఁ డుగ్రుఁ డై
యిరువదికోల లాశకుని యొడ్డెఱ వాయఁగ నేసె మెల్లగన్
వరుసగ మూఁడుమూఁడు శితభల్లములన్ నొగిలించి పంపియున్. 312

సీ. చండకాండంబులఁ జెండి తద్బాహుముల, శిరములన్ భుజములు ధరణిఁ గప్పి
పంచాశుగమ్ముల నొంచి సౌబలు వాని,సుతు నులూకుని నొక్కశితశరమున
నుడిగించి యార్చుచు నడుగక గాంధార,పతివిల్లు త్రుంచి వార్వములఁ ద్రుంచె
హాహాహాయుం డగుసుబలాత్మజుం డాత్మజు,రథ మెక్కె వా రేకరథగతు లయి

తే. గిరిని మేఘంబులుం బోలె నరుని బాణ,వర్షమున ముంప నాతఁడు వారి నాఁగి
కఱకుటమ్ములు వఱపినఁ దెఱలె మొనలు, విన్నుచూలికి మొయి తెల్ల విఱియునట్లు.

క. వెఱచఱచి పఱచుమూఁకల, యఱిముఱిఁ గని కృష్ణపార్థు లలరుచు సంకుల్
నెఱి పూరిం మొఱయఁ జేసిరి, చిఱునగవు మొగంబులందుఁ జిందులు ద్రొక్కన్.

వ. అంత నిక్కడ ధృష్టద్యుమ్నుండును. 315

ఉ. మూఁడు శరంబులన్ గురుని మోడి సడల్చియు వింటినారి పే
డూడఁగఁ జేయ నాతఁడు మఱొక్క శరాసన మూని వానిమే
నాడఁగ నేడుబాణముల నట్టె విదిర్చి తదీయసారథిన్
మూఁడును రెండు తూపులను ముప్పిరి వోనొనరించె నార్పుచున్. 316

వ. పార్థుండు నమర్షంబున శరవర్షం బవ్వారిగా నివ్వటిల్లం జేయుచు నవ్వసురిభరామ
రోత్తము తత్తరం బుడిగించి దైత్యసంహారోద్యతుం డైన దేవేంద్రుండు వోలె గండు
మిగిలి గురుసేనం జించి చెండాడి శోణితౌఘపరిప్లుతం బయిన వైతరణీనది నటం
బాఱించి ద్రోణాశ్వత్థామకర్ణాదులు సూచుచుండఁ గౌరవానీకినిం దఱిమి శంఖంబు
పూరించినంత శిఖండియు భీమసేననకులసహదేవులును ధర్మతనయుచందంబు నొత్తి
సింహనాదంబు గావించి రట్లు నిజబలం బెల్ల నల్లతల్లడంపడం గన్ని డిల్లపడి సుయో
ధనుఁ డాచార్యకర్ణులపాలికిం జని యిట్లనియె. 317

చ. కటకట మీరు సైంధవనికారణముం గని కోపఘూర్ణితో
త్కటమతులై గదా యిపుడు కయ్యము గట్టిరి కట్టి యిట్టిచో
నిటులు బలంబు లెల్ల నశియించుచునుండ నశక్తులట్లు చూ
చుట తగునోటు మీరె ననుఁ జుల్కనఁ జూచినఁ జెప్ప నేటికిన్. 318

శా. ఏమే పాండవులన్ జయింతు మనుమి మ్మే నమ్మి యమ్మేటితో
నీమైఁ బోరు పొసంగఁ జేసితిని మీ రీకున్న వా కిట్లు సం
గ్రామంబుం దలపెట్టియుండను జితారాతిక్షమానాథులా
రా! మన్నింపుఁడు నేను మీకు నపరిత్యాజ్యుండఁ జుం డారయన్. 319

క. మొనసి యిఁకైనన్ విక్రమ, మున కనురూపముగఁ బోరు పొనరించి నరున్
మనుజునిఁగ జేసి విజయం, బానఁగూర్పఁ దలంపుఁ డనుచు నొరిమం జూపెన్. 320

వ. అట్లు నోనాడినచందంబున నాడిన వారొం డాడనిడెందంబుల సందడించుచు
సాత్యకిప్రభృతిమహారథులం దాఁకి పీఁకం జూపుచుండ నుభయబలంబులును సన్న
ద్ధంబు లయ్యె నయ్యెడ నయ్యచ్యుతానుజన్ము ముట్టడించి వానిపై ద్రోణకర్ణవృష
సేనులు పదేశి నారసంబులును సుయోధనసౌబలు లేడేసి వాఁడికోలలు నేయుచు
న్నంత సోమకులు శరవృష్టిం బఱపుచు గురుని నఱిమిన నతండు మధ్యందినమా
ర్తాండునివడ్కి మండుచు నేర్లాడుచున్నంత నార్తారవంబులు మిన్నుముట్ట
దండ్రి కొడుకన్న తమ్ముఁడు లోనగుసంబంధిబాంధవుల నైనం జూడక ప్రాణ
త్రాణపరాయణులై పఱచువారును మోహితులై వానిమోమునన పడువారును

గం దీపికలు పాఱవైచి పాఱువారును నై పాండవబలంబులు పఱుగు లిడుచుండం
బో నీక ద్రోణకర్ణులు వెన్నుదన్ని శరంబులం జా నేయుచుం దఱుముచున్నం గని
దీనమనస్కుం డై హృషీకేశుండు గుడాకేశుం బిలిచి యి ట్లనియె. 321

మ. గురుఁడుం గర్ణుఁడు నుక్కునం బెఱసి కో కో యంచుఁ బెల్లార్చుచున్
శరధారంబులఁ జేర్చి నీయనుఁగుసేనానాథునిన్ శిష్యునిన్
బరివేష్టించి యలంచుచున్ బలఁగమున్ భగ్నంబు గావించి రె
వ్వరు వారించిన నిల్వ కుండిరి భటుల్ వారిం బ్రదర్శింపుమా. 322

వ. అని పలికినంత నర్జునుండు నచ్యుతుండును వా యెత్తి యోధులం బిలుచుచు. 323

ఉ. పాఱకుఁడీ భయంపడుచుఁ బార్థివతల్లజులార! మే మిదే
తీఱిచి పుచ్చ వచ్చెదము దివ్యశరంబుల ద్రోణకర్ణులన్
గాఱియ వెట్టి యుగ్గరము గట్టుఁడు దిట్టపడుండు తెంపునన్
దేఱుకొనుండు ప్రాణములతీపి నసం బఱ నొప్ప దెప్పుడున్. 324

వ. అని పురికొల్పుచున్నంత నంతికగతుం డైనబకాంతకుం గని వాని కుత్తేజంబు గలుగ
మురాంతకుండు బలాంతకి వరసుదిక్కు మొగం బై. 325

మ. ఇదిగో భీముఁడు సోమకాన్వితుఁడు తా నేతెంచె ద్రోణాదులం
దుదిముట్టింపఁగ నీవు నీతఁడును శత్రువ్రాతముం దాఁకుఁ డె
ల్లదడంబుం గొని నాఁగ వారలు సముల్లాసించి తాస్యాబ్జు లై
గదనంపుండల ద్రోణకర్ణులను దాఁకం బోయి రాఁకట్టుచున్. 326

క. విఱిగినమూఁకలు మరలం, బఱతెంచి నిశీథమందు మనమూఁకలఁ బె
ల్లఱిమె నిరువాఁగుఁ గవిసిన,తఱిఁ బరఁగెన్ జంపు పొడుచుతఱిఁ గడలు లనన్.327

తే. అపుడు మనజోదులున్ దివ్వె లవలఁబెట్టి,చిమ్మచీఁకటిఁ దమపేళ్ళు చెప్పుకొనుచు
నీడఁబోక పెనంగి వెల్గింత గలుగు,కడలఁ దోఁచి రగ్గిం బడుమిడుత లట్లు. 328

వ. అంతఁ గర్ణుం డుదీర్ణకోపుం డై పార్షతుం దాఁకి. 329

మ. దశమర్మచ్ఛిదమార్గణంబులు భుజాంతర్భాగ మాఁడంగ నే
సిశరవ్యాళము [illegible] నిస్సీమంబుగా వానిపై
[illegible] సాయకములన్ వేసెన్ వెసన్ బిమ్మటన్
[illegible]స్త్రంబుల వార లొండురులు పూన్కిం జేసి రామర్దమున్. 330

వ. అయ్యవసరంబున రాధేయుండు. 331

ఉ. పీతులఁ ద్రుంచి సూతుతల ప్రీలఁగఁ జేసి శరాసనంబు రెం
డై తెగ నేసినం గినిసి యాద్రుపదప్రభవుండు పెన్గదం

జేతులఁ బూని తేరు డిగి చెచ్చెరఁ గర్ణునివాహనంబులన్
భూతలముందుఁ బెట్టి వడిఁ బోయె ధనంజయుతేరిమీఁదికిన్. 332

ఆ. అంతలోన మఱియు నతఁడు కర్ణుని దాఁక, సమగ నున్న మాన్చి యమసుతుండు
కర్ణుఁ దదియ గెల్వుగాఁ గొని యార్చుచుఁ,జాప మార్వఁ జేసి శంఖ మొత్తె. 333

వ. దాని కోర్వక పాంచాలసోమకులు శస్త్రాస్త్రపాణు లై సూతపుత్త్రు నెఱుఁగ వచ్చు టయు నతండు నన్యాసైంధవయోజితం బగునిజరథం బెక్కి లబ్ధలక్ష్యుం డై వారి పయిం గవిసి పటుశరంబులం బరఁగించుచు రథహయగజాదులనుండి యారోహ కులం ద్రొల్లించుచు శిరంబులు దెగ నేసియు నురంబులు వగిలించియుఁ గరంబులు నఱకియుఁ గాళ్లు ఖండించియు డొక్కలు ముక్కలు చేసియుఁ గుత్తుక లుత్తరించి యుం గడింది మగంటిమిం బేర్చి యార్చిన నబ్బలంబు లన్నియు నన్నెఱకానిమెదుర నిలువఁ జాలక జాలిం బడియు సోలియు సొక్కియుఁ జిక్కియు బిక్కచఱచియు దిక్కులు చూచియు దద్దఱిల్లియుఁ ద్రెళ్లియు ఱిచ్చపడియుఁ దలంకియు డొంకియు వెగడు గుడిచియు నడచియు వేగిరంపడియు వెఱచియు నఱచియు బెదఱియుఁ జెదరియు పఱియపఱియ లై నలువలంకులకుం బఱచియుం జెడినం గని పాండవా గ్రజుండు గాండీవిం బిలిచి యి ట్లనియె. 334

—శ్రీకృష్ణునిపంపున నర్జునుండు ఘటోత్కచునిఁ గర్ణు నెదిరింపఁ బంపుట—

శా. కంటే తమ్ముఁడ కర్ణుఁ డిన్నిశ మహోగ్రక్రూరబాణార్చులన్
మింటం దోఁపఁగఁ జేయుచున్ రవి యనన్ దీపించుచున్నాఁడు గో
డంట న్నీ స్వజనం బనాథ మయి యార్తాలాపముం జేయుచుం
బెంటం జేరెడు వాఁడు వెంటఁ బడుటన్ విత్రస్త మై ధ్వస్త మై. 335

క. శర మరి వోయుట యేయుట, పరికింపఁగ రానియట్లు బహువిధగతులన్
దుర మొనరించెడుఁ గర్ణుం, డరిభీకరుఁ డగుచు నిట్టు లగునే చూడన్. 336

వ. నాకుం జూడ నిప్పుడు వీనివధంబు కర్తవ్యం బని తోఁచెడిని గాని నీకుం బోలినట్లు కార్యంబు నిర్ణయింపు మనిన జిష్ణుండు కృష్ణుం దిలకించి. 337

ఆ. రాజు బీతువడియె రాధేయుకడిమికి, గురునిసాయకములఁ గుతిలఁగుడుచు
మనబలంబు వెంటఁ జని తఱిమెడు వాని, కెదుర నిలువ నోడి రెల్లవారు. 338

మత్త. తోఁకఁ ద్రొక్కినత్రాఁచు వోలెను ద్రుళ్ళిపాటున మేటి యై
వీఁకఁ జూపెడు సూతపుత్త్రుఁడు వీని నోర్చుట యెరికిం
గాక యుండె నిఁ కిట్టు లుండినఁ గాదు పాకము దప్ప నే
వీఁక మాన్చెదఁ దేరు తోలుము వేగ నావుడు నాతఁడున్. 339

గావున నీవు చేవమెయిఁ గర్ణునిఁ దాఁకి జయంబు గొమ్ము నీ
క్రేవలఁ దోడునీడ యయి కృష్ణసహోదరుఁడు న్మెలంగెడిన్. 350

వ. అనిన ఘటోత్కచుం డి ట్లనియె. 351

మ. అని నే నొక్కఁడ చాలుదుం దెలియ ద్రోణాద్యన్యయోధాళికిన్
జనుఁ డీకర్ణుఁ డనంగ నెంత యగు నీసంగ్రామరంగంబునన్
వినుతిం గాంచినయెల్లవారును నను న్మెలంచుఁ గీర్తింపఁ గాఁ
జని నాకీరితి యెల్లకాల మెసఁగన్ జా నేతు నాసూతజున్. 352

క. శర ణన్నవారి నైనం, గర మడలెడువారి నైనఁ గనికర మింతే
దొరలంగ నీక రక్షిం,వరధర్మముఁ బూని యెల్లవారి మెసవుదున్. 353

వ. అని తదనుజ్ఞాతుండై ఘటోత్కచుండు నీవారిగుండె లవియ నట్టహాసంబు సేయుచు క్రోధము మూర్తీభవించినచందంబున భీషణవేషభూషితుండై చ్చని సూతసూతి నెదిరించుటయు నతండు వాని కభిముఖుండై ప్రతిఘటించె నట్టియెడ దుర్యోధనుండు దుశ్శాసనుం గాంచి. 354

ఉ. రక్కసి యుక్కునం బ్రబలి రాధకుమారుని మాఱుకో మదం
బెక్కఁగ నేగుచుండెడిని నీవు మహాప్పృతనాంచితుండ వై
ప్రక్కకుఁ జేరి కర్ణునకు బాసట గమ్మతఁ డానరాశికిం
జిక్కక యుండఁ జూడు మని చెప్పుచు నుండెడునంతలోపలన్. 355

—ఘటోత్కచుం డలంబుసునిశిరంబు దెగ సేయుట—

వ. జటాసురసుతుం డలంబుసుం డనువాఁడు వచ్చి దుర్యోధనుం గాంచి. 356

క. నరవర నీయాజ్ఞం గొని, దురమున నేయుద్ధదుర్మదులు నీ కరయన్
బరిపంథు లైనపార్థులఁ, బరిమార్పం దలఁపు నేసి వచ్చితి నిటకున్. 357

క. నాతండ్రి యగుజటాసురు, నీతులువలు ద్రెళ్ళ నేసి రే జనకునకున్
బ్రీతిగ నరిశోణితపల,లాతతపూజం బొనర్ప నాసింతు మదిన్. 358

వ. అనుజ్ఞ యొసంగు మని ప్రార్థించిన సంతసించుచు నతండును. 359

తే. ద్రోణకర్ణాదులం గూడి తొడరి నేను,శత్రుసంహార మొనరింపఁ జాలి యుంటి
నాజ్ఞ యిచ్చితి నీ వోపు దైన వాఁడె,క్రూరుఁడు ఘటోత్కచుఁడు వానిఁగూల్పు మేగి.

వ. అనవుడు వాఁ డట్లు కాక యని వానియనుమతిం గొని చని భైమసేని నెదిరించి వాలం పసంచులు మెయి నించుటయు నతండు మహావాతంబు మేఘ పటలంబులం బోలె నయ్యమ్ములముమ్మరం బుడిగించి జటాసురునిం గర్ణునిన్ గురుసైన్యంబులన్ నొగిలిం చినం గోపించి యలంబుసుండు నానాలింగంబు లగునంగారబాణంబులవానిని వాని

సైన్యంబును దైన్యంబు నొందించినం దిలకించి హైడింబుం డలంబుసుని రథరథ్యసా
రథులఁ దిలమాత్ర ఖండంబులు గావించి కర్ణాదుల నొంచి నీబలంబులం దెఱలించె
నంత జటాసురాత్మజుండును. 361

మ. వితథుం డై యరదంబు డిగ్గి నిజదోర్వీర్యం బవార్యంబు గా
నరసింహాకృతిఁ దాల్చి పెల్చఁ గనుచున్ హైడింబునిన్ డాసి పే
రురమున్ వ్రేసెను ముష్టిఘాతమున నాయుష్మంతుఁ డాతండు మే
నరియాడన్ ధర కంపమందు గిరి నా నొప్పారె నప్పట్టునన్. 362

వ. అంతం గ్రోధమూర్ఛితుం డై. 363

మ. పరిఘాభం బగుబాహు వెత్తి యసురున్ బాధంబుగా మొత్తి స
త్వరుఁ డై పట్టి భుజద్వయంబున భువిన్ దాటించి మీటించి పో
టరి యై రుద్దుచు ముద్ద సేయుచును నుండం బెండు వో కజ్జటా
సురసూనుం డట నేర్పునం దెరలి రక్షోనాథు నీక్షించుచున్. 364

క. త న్నెట్లు చేసె నట్లధి,కౌన్నత్యము పేర్మి నతఁడు హైడింబునిఁ దా
మన్ను, దినిపించి యెమ్ములు, నున్నము గావించి నొంచెఁ జూపఱు వొగడన్. 365

వ. ఇట్లియ్యిద్దఱు నుద్దవిడిం దనరి నైజప్రభావంబున నింద్రవైరోచనులచందంబునం
బొంది పోరుచుం బావకాంబునిధులవిధంబును గరుడతక్షకులతెఱంగును మేఘమా
రుతంబులచాడ్పును వజ్రాచలంబులరూపంబును గుంజరశార్దూలంబులలీలయును స్వ
ర్భానుభానులభాతియును గల్పించుకొనుచుం దోఁచి యేఁచి మాయాశతసహ
స్రంబుల మఱియు నొఱయుచు నన్యోన్యవధాభికాంక్షు లై పరిఘగదాస్త్రప్రాసముస
లముద్గరపట్టసాదిసాధనంబులను వృక్షపర్వతాగ్రంబులను బ్రహరించుకొనుచు
హయారోహకులున్ గజారోహకులును రథికులుం బత్తులును నై నానాప్రకారంబు
లం బోయి పోరుచుండి రట్టియెడ ఘటోత్కచుం డురవడించి. 366

ఉ. మింటికి లేచి డేగవలె మీఁదికి వ్రాలి జటాసురాత్మజున్
గొంటుతనంబునం బెనఁచికొంచు మలంగఁగ నీయ కానికం
బంటవలంతి కంటువడఁ బట్టుచు మాధవుఁ డమ్మయుం బలెన్
గెంటువడంగ నీక తఱిగెం దలఁ గ్రొంగలిరాకు బాకునన్. 367

క. తెగి వికృతదర్శనం బయి, బుగబుగమని మొఱయుమస్తమును గేశములం
దగఁ బూని నెత్రు స్రగ్గొన, నగధరుఁ డన బ్రమరిదిరుగు నడ లడరంగన్. 368

వ. అతిరయంబున దుర్యోధనరథంబునకుం జని వికృతాననమూర్ధజం బగునలంబుసునిశిరం
బారథంబుపైఁ బాఱ విసరి ప్రావృట్పయోధరంబు వలె గర్జిల్లుచువానికి ట్లనియె. 369

క. ఇదె నీచుట్టము తల నేఁ, బద నగునసిధార నేసి పనివడి నిన్నుం
ముదలించి పోవ వచ్చితిఁ, గదనమునకుఁ గర్ణ నిట్లు కడ తేర్చుమతిన్. 370

తే. ధర్మ మర్థంబు కామంబుఁ దలఁచువాఁడు, రిక్తహస్తంబునన్ రాజుఁ బ్రభువిప్రులఁ
స్త్రీని గనరా దనుచు నిట్లు శిరము నీకుఁ, గాన్క వట్టితిఁ బట్టెదఁ గర్ణశిరము. 371

క. అని పలికి కర్ణు నఱుమఁగఁ, జనె ననుడుం గురువిభుండు సంజయ! వాఁ డె
ట్లని నేసి రెట్టిఁ డా భీ, ముని తనయుఁడు తద్విశేషమును దెలుపఁ గదే. 372

—ఘటోత్కచుండు కర్ణునిపైఁ గవిసి ఘోరయుద్ధము చేయుట—

వ. అనిన నతం డతని కిట్లనియె న ట్లలంబుసుం జంపినఘటోత్కచుండు లోహితా క్షుండు తామ్రాస్యుండు నిర్మతోదరుం డూర్ధ్వరోముండు హరిశ్మశ్రుండు శంకుకర్ణుండు మహాహనుండు తీక్ష్ణదంష్ట్రుండు కరాళవంతుండు దీర్ఘతామ్రజిహ్వోష్ఠుండు లంబ భ్రువు దీర్ఘనాశికుండు నీలాంగుండు లోహితగ్రీవుండు గిరివర్ష్ముండు భయంకరుండు మహాకాయుండు మహాబాహుండు మహాశీర్షుండు మహాబలుండు వికృతుండు వికటుండు పరుషస్పర్శుండు బద్ధపిండకుండు స్థూలస్ఫిక్కు గూఢనాభి శిథిలోపచయుండు వాఁడు హస్తంబులఁ గటకకేయూరాదిభూషణంబులు నురంబున నగ్నిమాలోపమం బగురత్నహారంబు నుత్తమాంగంబున హేమమయంబును దోరణప్రతిమానంబు నగుకిరీటంబును గర్ణంబుల బాలసూర్యప్రభాభాసమానంబు లగుకుండలంబులును దాల్చి కాంస్యకవచంబు దొడిగి కింకిణీశతనిర్ఘోషంబును రక్తధ్వజపతాకంబును ఋక్షచర్మావనద్ధాంగంబును సర్వాయుధవరోపేతంబును నష్టచక్రసమాయుక్తంబును మేఘగంభీరనిస్వనంబును నల్వామాత్రప్రమాణంబును నగుమహారథంబును మత్తమాతంగసంకాశంబులును లోహితాక్షంబులును గామవర్ణజవోపేతంబులును బలవంతంబులును విపులసటాభిరామంబులును భీషణహేషాభూషణంబులును సూర్యరశ్మిప్రభాభాసమానంబులు నగువాహంబులు వహింప దీప్తాలనకుండలుం డై విరూపాక్షుం డను రాక్షసుండు దక్షిణహస్తుం డై మార్తాండమయూఖసన్నిభంబు లగుపగ్గంబులం బూని ప్రభాకరురథంబున గరుడాగ్రజుండు పోలె నొగలం గూరుచుండ మహోన్నతరక్తధ్వజంబుపై లోహితశీర్షం బైనగృధ్రంబు ఘూర్ణిల్లుచుండఁ దాను మహారథికుం డై కూరుచుండి యేకకిష్కుపరిణాహంబును ద్వాదశారత్నిప్రమాణంబు నగుకార్ముకంబు కేలం బూని వాసవాశనినిర్ఘోషతుల్యంబుగ జ్యావల్లి మ్రోయించుచు గథాక్షమాత్రంబు లగుమార్గణంబులం బ్రయోగించి పగఱం గీటడంచుచుండునట్లు సర్వసన్నద్ధుం డై వాఁ డన్నిశాసమయంబున స్యందననేమిస్వనంబున సర్వగహ్వారియుం గ్రక్కదలం గదలి సకలభూతభయంకరంబు గా జ్యానినాదంబున జగం బెల్ల బెదరింపుచు

చేయుచు మత్తమాతంగంబుపైఁ గవియుమదపు టేనికచందంబునఁ గర్ణుపయిం గవియు
దెంచిన వానిం గాంచి రాధేయుండు క్రోధవిధేయుం డై శరంబు లింపునం బొంపిరి
వోవ నేయుటయుం దలపడిన వారిపోరు శక్రశంబరులకుం బోలె ఘోరం బయ్యె నయ్యెడ
న య్యాతుధానవరు లొకళ్లొకళ్లు నో నేసికొనుచు వర్మంబులు సించుకొనుచు నఖంబుల
శార్దూలంబులును విషాణంబుల శుండాలంబులునుం బోలె రథశక్తులను గదాతోమ
రాదులను వివిధవిధవిశిఖంబులను బఱపుకొన్నుచు రక్తసిక్తాంగు లై జేవురుకొండ ల
నం జెప్ప నొప్పుచు నెవ్వని నెవ్వఁడు రవ్వంతయుం గదుపఁ జాలక ప్రాణంబులొడ్డి
పోరుచుండ నెల్లసైనికులు నాథనుర్ఘోషంబులకును బాణపాతధ్వనులకును దాళఁ జా
లక విత్రస్తు లయి రంతఁ గర్ణుండు దివ్యాస్త్రం బొండు సంధించి ప్రయోగించుటయు
రాక్షసేశ్వరుండును రాక్షసమాయం బ్రయోగించి సింహనాదంబు గావించినంత దం
తావళంబులు మూత్రంబు విడిచెఁ దత్ప్రభావంబున శూలముద్గరశైలవృక్షపాణులు
పెక్కండ్రు రాక్షసు లావిర్భవించి శిలావర్షంబు గురియుచుఁ జక్రభుసుండితోమరశ
క్తిశతఘ్నిపట్టసప్రాసాదులం దెట్టలు గట్టునట్టు వైచి శిలావర్షంబు కురిసినం గని నీపు
త్రులును దక్కిన యోధులును నాయోధనంబు విడిచి వెఱచఱచి పఱచి రయ్యెడ
నయ్యంగనాథుండు విక్రమైకసనాథుం డై. 373

ఉ. రాక్షసమాయ నంతయు శరమ్ములఁ గ్రుమ్ముచు మాయఁ జేయుచున్
రాక్షసుఁ డల్గి ఘోరశరరాజము లాజగజెట్టి నేసి ర
క్తోక్షితగాత్రుఁ జేయుటయు నోడ కతండును వేఁడితూపులన్
వక్షము గాఁడ నీ అయిదు వాఱగఁ జేసె సురాపిమేనిపైన్. 374

ఉ. ఆ జరనీచరుం డపు డహంకృతి మీఱఁగ సూర్యసన్నిభం
బై రమణీయరత్నయుతమై క్షురకాంతము లై మహాసహ
స్రారము లైనచక్రము రయంబునఁ గైకొని యేయ నద్దిత
త్సారశరంబులం దెగి వితావిత లయ్యె నభాగ్యుకోర్కెనాన్. 375

సీ. తనచక్రము బ్లైనఁ గనలి ఘటోత్కచుం, డరిరథంబును గప్పెఁ శరచయమునఁ
బ్రతిశరంబుల సూతసుతుఁడును నరమాంస,భోజిరథంబును ముసుఁగువెట్టె
నతఁడు గదాదండ మడరించి వైచిన, దాని ముత్తునియఁ గాఁ దఱిగె నతఁడు
మొగులట్లు దివి కేగి మొఱయుచు ద్రుమవర్ష, మొలికె రక్కసి కర్ణుఁ డిలుకుమాల్ప
తే. నతఁడు వాహరథ్యంబుల నడఁచి రథము,నుముసు గాఁ జేసి బహుబాణసమితి మేన
సేయ ద్వ్యంగుళాంతర మెడ మేని లేక,శలలమ్మగ మల్లు చూపట్టెఁ బలలభోజి. 376

వ. ఇట్లు కర్ణశరజాలచ్ఛన్నరథధ్వజఘోటకుం డై ఘటోత్కచుండు ప్రత్యస్త్రంబుల

వానిఁ బ్రశాంతంబు గావించి మాయాప్రభావంబున నదృశ్యుఁడై లాఘవంబునఁ బ్రదరౌఘంబులం గిప్పచు వివిధవికృతరూపంబులం గైకొని ప్రత్యర్థిప్రదరంబుల నెల్లఁ దిగఁద్రావుచుఁ గొండొక వడికి మహాకాయుం డై శరపాతంబున హతసత్త్వుం డై నేలం గూలి కాలచోదితుం డయ్యె నని కురు వీరులార్చుచుండ వెండియు మహాకాయుం డై శతశీర్షంబులు శతోదరంబులుఁ గలిగి మైనాకంబు నా నెక్కుడం గన్పం,దాన నై దిక్కు లవియ నార్చుచుం బేర్చి యంతలోన నంగుష్ఠమాత్రుం డై పొడకట్టి సముద్ర తరంగంబువలె మిన్నుముట్టి యుట్టట్టు మెట్టుచు భూగర్భంబు భేదించుకొని పోయి వచ్చి జలపూరంబునం జొచ్చి యెచ్చోటనుం గాన రాక నాకంబునుండి వెండియుం దిగి రథస్థుం డై వెసలావరించి సూతసూతిశతాంగాభ్యాశరంబున కేగి నిలు నిలు మే నుండ నీ వెందుఁ బోయెదు నీయుద్ధశ్రద్ధ వ్యర్థంబు గావించెద నని పలుకుచు నంతరిక్షంబున కెగసి పెద్దపెట్టున నవ్వి మాతంగంబుపయిం గవియు సింగంబు తెఱంగున నంగరాజుపయిం గవిసి యిరుసు లంతలేసి గఱుసు తూపుగముల నేసి యేసినవాని నెల్ల నతండు కాండంబులం జెండి వేయుచుండ నంతర్హితుం డై యంతలోన శూలప్రాసాసిముసలప్రముఖసాధనప్రస్రవణంబును దరుగిరిశిఖరంబులునుం గలిగి యంజనచయప్రఖ్యం బగుమహామహీంధ్రం బై మహోగ్రాయుధంబులం గ్రక్కుచు నుక్కుమిగిలి వసుషేణవజ్రసాయకపాతంబున నాపాతంబుగ భూతలం బంటి వెంటన గంటుకొని యభ్రంబున నదభ్రంబుగ నైంద్రాయుధాభ్రం బై కాఱుగ్రమ్మి జోరున భూరివృషద్వర్షంబు గుఱిసి వానివాయవ్యాస్త్రంబునం దెఱలి మరల సింహశార్దూలసదృశాకారులును మత్తమాతంగవిక్రములును నానాకవచభూషణులును నానాశస్త్రాస్త్రపాణులు నగుపెక్కండ్రు రక్కసు లుక్కుమిగిలి సింధురంబుల నెక్కియు సైంధవంబుల నారోహించియు రథంబుల నధిష్ఠించియుం దన్నుఁ బరివేష్టింపఁ బరమేష్ఠుం డై తొంటియట్ల తాను రథస్థుం డై తోఁచి రభసంబున నాధిరథిరథంబుపై నవితథప్రచారంబునం బ్రతిఘటించి ప్రళయగర్జాసదృశంబుగ నార్చుచు. 377

చ. అరపదితూపు లేపుమెయి నావసుషేణునిమే నిగిడ్చి చె
చ్చెర విలు చెక్కలై పడఁగఁ జేసి భయంకరనిస్స్వనంబునన్
గిరిగుహాలం బ్రతిధ్వనులు గీల్కొన నార్చినఁ బేర్చి కర్ణుఁ డై
శ్వరవరచాపరూప మగుచాపము చేతులఁ బట్టి నెట్టనన్. 378

తే. త్రిపురహరుఁ డైనస్మరహరు తెఱఁగు దోఁప,రోపము లపారముగఁ బొఱరువ్వె నపుడు
సాశ్వసూతగజం బగునసురబలము,వడఁకె సింగమునకు నేన్గుదడము నట్లు. 379

క. యుగసంక్షయాగ్ని వోలెం, దగి రాక్షససేన నేర్చుతతబలు నతనిన్

బగ ఱరయ నైన నోపక, క్రాగి పాఱిరి వెగడు గుడిచి దెస లంటంగన్. 380

వ. అప్పుడు. 381

ఉ. కన్నుల నిప్పుకల్ గురియఁ గాంచి కరంబుల నప్పళించుచున్
గ్రన్నన శైతాంగ మెక్కి యలయకాలునిలీలఁ గరంబు వెల్గు చ
త్యున్నత మష్టచక్రయుత ముగ్రకృతం బగుశక్తి నెత్తి స
త్త్వోన్నతి హుంకరించుచు ననూనగతిం బడ వైచెఁ గర్ణుపైన్. 382

తే. మండుచున్ వచ్చుశక్తిఁ గర్ణుండు గాంచి,యుఱికి నేలకుఁ బట్టి యయ్యుగ్రశక్తి
త్రిప్పి సురవైరితేరిపైఁ బెరల నేసె,నసుర వడిఁ దాఁటె రథము నుగ్గయ్యె నంత. 383

క. అచ్చెరుపడి భూతము లా, హెచ్చినపని కంగరాజు నెంతయుఁ బొగడన్
వచ్చి తనతేరిపై కతఁ, డచ్చమెయిన్ మఱియు నసుర నేసె శరములన్. 384

సీ. జేవురుకొండ నాఁ జేవ్పడియుఁ జలింప, కసుర గంధర్వపురాకృతిఁ గొని
మాయ మై యెక్కింతమాత్రలో నానాస్త్ర,శస్త్రముల్ పరఁగింపఁ జదిపె నతఁడు
కినుకఁ గ్రవ్యాదుఁడు గనునంత సింహశార్దూలతరక్షువుల్ కీలిజిహ్వ
లగుపాములు నయోముఖాండజంబులు వృక,సాలావృకములు రక్షఃపిశాచ

తే. ములును బరతెంచి నలుగడ నలుముకొనుచుఁ, గర్ణు భక్షింపఁగా నెంచి కఱవఁ బూనఁ
దలఁక కింతయు నాతంపు ములికిగములఁ, జించిచెండాడిమాయయుఁ జేసె మాయ.385

క. మేటిశరంబుల నస్త్రపు, ఘోటకములఁ దునిమి మఱియుఁ గోకొమ్మనుఁడున్
దీటుకొని వాఁడు నిన్నిఁటె, తేటపడం గూల్తు నని యదృశ్యుం డయ్యెన్. 386

—ఘటోత్కచుం డలాయుధుం జంపివానిశిరంబు దుర్యోధను నెదుటఁ బడవైచుట.—

వ. అట్లు మనుజదనుజులప్రవిదారణంబు దారుణం బై ప్రవర్తిల్లుచున్న సమయంబున బకానుజుం డైనయలాయుధుం డసురాధిపుండు బకకిమ్మీరహిడింబాదిబంధువులం జంపినభీమసేనునిపైఁ గలపూర్వవైరముం దలపోసి యీనుసంజేసి యన్నిశాసమరం బెఱింగిబహుసహస్రరాక్షససేనాసమేతుం డై భీమసేనుం జంప నెంచి వచ్చుసుయోధనుం గాంచి త న్నెఱింగించి యిట్లనియె. 387

మ. బకకిమ్మీరహిడింబముఖ్యు మగునాబంధువ్రజంబుం దురం
తకుఁ డై చంపి హిడింబకన్నెఱికముం దబ్బిబ్బు గావించి మా
మకవశంబున వ్రేళ్ళు పాదుకొనునామర్యాద నోఁ గొట్టె ఘా
తుకుఁ డాభీముఁడు నీ వెఱుంగుదు క దే దోషంబు సామాన్యమే. 388

క. మా కింతకన్నఁ బరిభవ, మేకతమున నుండఁ బోవ దది హేతువుగా
నీకడకు వచ్చినాఁడను, వాకొను మీ రేయిఁ బగఱఁ బట్టి భుజింతున్. 389

ఉ. కోపము దాపముల్ మిగిలెఁ గో యని యార్చుచుఁ బాండుపుత్రులన్
భూపతులం గొమాళ్ళ యదుముఖ్యు ఘటోత్కచు నెల్లసైన్యమున్
రాపులఁ బెట్టి నేనొకఁడ రాల్చి మెసంగెద సంగరంబునన్
నాపగఁ దీర్చుకొందు నరనాథ బలంగము నివ్వారింపుమా. 390
వ. అనినం బ్రహృష్టమనస్కుండై మనసుయోధనుం డతని కిట్లనియె. 391
ఆ. నీవు తోడుపడుము నీబలంబులతోడఁ,బగ యడంగువఱకు మగలునాదు
సైనికోత్తము లని మానుఁ డన్నను మాను,వారు గారు గాన వలవ దట్లు. 392
వ. అనిన నతం డట్లుకాక యని హైడింబున కీడు వచ్చునాకారంబు దాల్చి యట్టిరథం
బెక్కి యట్టిచాపంబును బాణంబులు నాయుధంబులును బట్టి·యట్టి సైన్యంబుతోఁ
జలపట్టి పరబలంబులం దఱుముచు భీమసేను నఱుముట్యయుం గని నీకొమాళ్ళు
మున్నీటమునుంగువానికి మహాప్లవంబు లభించినచందంబున నెంచుచు నలాయుధుని
కారణంబునం దా మెల్ల మరలఁ బుట్టినట్లు తలంచుచు వాని నగ్గించి రంతలోన. 393
తే. భీమనందనుఁ డెంతయు భీమరూపుఁ, డగుచుఁ గర్ణునిపైఁ బడి యతిశయింప
వానికోల్తల కాతని సేనలెల్ల, నోహటించి రణంబున కోసరిల్లె. 394
క. కృపుఁడుం జాపాచార్యుఁడు, కృపతనయుఁడు భీమతనయు నేడ్తెఱఁ గని తా
రపు డేమిఁ జేయఁ జాలమి, నృపబలము నిరాశ నయ్యె నెదఁ గర్ణుదెసన్. 395
ఆ. కడిమిఁ దొలఁగ నార్తిఁ బడుకర్ణునిం గని, తత్తఱించి నీదుతనయుఁడు బకు
ననుజుఁ బిలిచి కర్ణు నరసితె హైడింబు,బాఱిఁ జిక్కె నింక బ్రదుకు టెట్లొ. 396
క. మత్తేభ మలఁతిమ్రాఁకులఁ, దుత్తుమురొగఁ జేయునట్లు తోరఁపుశక్తిన్
మొత్తెడి నద్దెసజోదుల, నత్తులువ హిడింబికొడుకు నరసితివె సఖా. 397
క. మాయాబలమున సఖున క,పాయము గలిగింపకుండఁ బనివడి నీ వా
మాయావి నణిమి మాయం, జేయుము మా కెల్ల ముదము చెప్పితిఁ బనిగన్. 398
వ. అనుడు నతం డట్ల యని ఘటోత్కచుం దలఁపడియె నతండును గర్ణుఁ గ్రేడించి వాని
మాఱుకొనియె నంత వారిపోరు వాసితాకారణంబున నైనమత్తవారణంబులపోరుం
బోలె ఘోరం బయ్యె నయ్యెడఁ గర్ణుండును ననురక్తుండై భీమసేనుం డాఁకె నతండు
ను వానిదెసం జూడక యలాయుధగ్రస్తుం డగునిజపుత్త్రుం గావ నెంచి శరజాలంబు గీ
లించుచు నలాయుధుం బ్రతిఘటించెఁ దనపైఁ బడ వచ్చువడముడిం గని యలాయు
ధుండును బ్రతిశరంబు లేయుచు వాని నెదిరించె నంత భీమసేనుండును. 399
శా. ఏ దైదమ్ములు నయ్యలాయుధునిసేనాధీశులన్ మోదఁ గా
నా దేవాసులు చె[illegible]కం డయిరి దీనాలాపముల్ సేయుచుం

బ్రాదుర్భూతరుడంచితుం డగుచు నారక్షోవిభుం జేచి నా
నాదివ్యాస్త్రము లేసి యార్చెఁ బవమానప్రోద్భవుం దాఁకఁగన్. 400

ఆ. వానిఁ దునిమి భీమసేనుఁడు వెండియుఁ, గాఁడ నేసెఁ జండకాండసమితిఁ
గశిపుసంగి యసుర గైకొని కొన్నియుఁ, గోల లేసి వానిఁ గూల్చె నెల్ల 401

వ. అంత బకాంతకుండును. 402

శా. దంభోళిప్రతిమాన మైనగద దోర్దర్పంబునం ద్రిప్పి సం
రంభం బేర్పడ నబ్బకానుజునిఁ జేరన్ వైవ నాతండు దో
స్తంభద్వంద్వమునం దమర్చినగదం దానిం బ్రహారించుడున్
జృంభింపన్ భయదధ్వనుల్ గుదె వడిన్ భీమోపకంఠమ్మునన్. 403

క. శరములకుఁ బ్రతిశరంబులు, పరఁగెడునస్త్రమ్ములకును బ్రత్యస్త్రమ్ముల్
బరఁగించి యతఁడు నప్పుడు, సురవైరి సురల్ నుతింప సుడిగొట్టుసుతున్. 404

శా. రక్షోనాథునిశాసనమ్మునను ధైర్యస్థైర్యమంథాంధ్రు లా
రక్షశ్శ్రేష్ఠులు సృంజయాదిబలగర్వం బెల్లఁ బోకారఁ గా
నక్షీణప్రతిభావిశేషమున రథ్యస్యందనేభాదులన్
సాక్షాన్మృత్యువులై హరించిరి మహాసంరంభశుంభద్ధృతిన్. 405

వ. అట్లు రాక్షసుని హెచ్చునకు జిచ్చవడియున్న పాంచాలసృంజయాదిబలంబులం గాంచి
కృష్ణుండు జిష్ణునిదిక్కు మొగం బై యి ట్లనియె. 406

తే. చిక్కె రక్కసునకు భీమసేనుఁ డిపుడు,తడయ కాతనికిం దోడుపడుము నీవు
మఱియు ద్రోణపురస్కృతమహితసైన్య,మాఁగు మీనమహాభయ మావహిల్లె. 407

వ. మఱియు నీశాసనంబున ధృష్టద్యుమ్న శిఖండి యుధామన్యూత్తమౌజో ద్రౌపదే
యులు రాధేయుని మాద్రేయసాత్యకు లితరరాక్షసులను మార్కొందురు గాక
యని నియోగించిన నందఱు నట్ల కావించి రంత. 408

పంచ. అలాయుధుండు భీమసేనుహస్తగుప్తచాపమున్
జ్వలన్నిశాతసాయకప్రజంబునన్ మలంచి వా
జులన్ హరించి సూతుఁ నొంచెఁ జూచి తేరు డిగ్గి య
గ్గలించి భీమసేనుఁ డేసెఁ గ్రవ్యభక్షకుం గదన్. 409

స్రగ్ధర. కొండంతం బిండిసేయం గుదురుగుదెగు వేన్ గొట్టి యార్చెన్ సురారుం
డొండొంటిన్ దాఁకి శబ్దం బురుతర మయి యుట్టూఁత లూఁచెన్ ధరిత్రిన్
గొండల్ సంద్రంబులున్ మిక్కుటముగ నదలెన్ గ్రోల్చె నయ్యాకసం బు

ద్దండంబై పూరటిల్లెఁ దశదిశల భయోద్వృద్ధ మయ్యెఁ జగంబున్. 410

ఆ. అట్లు గదలు పిండి యగునంతకును వారు,పోరి ముష్టియుద్ధమును బొనర్చి
యందినట్టిస్యందనాక్షచక్రాదులఁ, బెనఁగి రక్తసిక్తతనువు లైరి. 411

వ. అట్లు పెద్దయుఁ బ్రొద్దుద్దవడిం బోరుచున్నంత మురాంతకుండు బకాంతకాత్మజుం
బిలిచి యిట్లనియె. 412

శా. రక్షోగ్రస్తుని నీదుతండ్రిఁ గనులారం గాంచుచు న్నీవు నీ
రక్షస్సైన్యము నన్యముల్ పలుప మేరల్ గా విటం గర్ణుపై
వీక్షన్ మాని యలాయుధుం బొదువు మావెన్క న్మనఃకాంక్షితం
బక్షీణప్రతిభన్ ఫలించునటు చేయన్ వచ్చు నక్తంచరా. 413

క. నావుడు నతఁ డక్కర్ణునిఁ, బో విడిచి యలాయుధుండు పోరెడుకడకున్
బోవుటయుఁ గవలు సాత్యకి, చేవమెయిం దాఁకి రసురసేనల నెల్లన్. 414

తే. అఱిమి నరుఁ డెల్లరాజుల నాఁగెఁ గర్ణుఁ, డఖిలపాంచాలపుత్రుల నది యెఱింగి
భీముఁ డక్కర్ణుపైఁ బడె నటకుఁ గవలు,నరిగి రిట ద్రోణుఁ బాంచాలు రఱిమి రధిప. 416

వ. అంత నక్కడ.

సీ. అట్లహంకృతి మీఱ నడర నలాయుధుం, డనిలనందనుసూతి నఱిమి తఱిమి
పరిఘంబు వడిఁ ద్రిప్పి పయి వైచె వైచిన, నించు కించుక సోలి పెంచి రొదలు
ఘనగదాదండంబుఁ గొని బకానుజుమీఁద వేయ సాంగంబు గా విఱిగెఁ దేరు
విఱిగినం దఱుగక విన్నంటి బకుత్రోడు, కురిసె నెత్తురువాన ఘోరముగను

తే. జిమ్మచీఁకట్లు నెల్లెడఁ గ్రమ్ముకొనియెఁ, బిడుగులుం బలె నయ్యెడ భీమసుతుఁడు
మాయచే మాయ మాయించి మఱియు ఱాలు,గురియ నడఁగించె శరపరంపరలఁ జేసి.

వ. ఇట్లురాక్షసేశ్వరు లిద్దఱు గదా పరిఘ శూల ముసల ముద్గర కరవాల భిందివాల
పినాక తోమర ప్రాస చక్ర పరశ్వధాయోగుడ గోశీర్షోలూఖల ప్రముఖనానావిధా
యుధంబులు శమీ పీలు కరీర చంప కేంగుద బదరీ కోవిదార పలాశారిమేద
ప్లక్ష న్యగ్రోధ పిప్పలాదివృక్షంబులను నానాధాతురంజితభూధరోత్తుంగశృంగంబులను
వజ్రనిర్ఘోషభీషణశబ్దంబు లబ్దంబు నిండుకొన నొండొరులపయిం బడవైచికొనుచు
వాలిసుగ్రీవులు వోలె నాభీలంబుగం బోరి పోరి కృపాణంబులు గొని విస్తరుకొని
ప్రభిన్నగాత్రు లై ప్రస్వేదమిశ్రితాసృక్ప్రవాహంబు ప్రవహింపం జేసికొని రంతఁ
గొంతవడికి హైడింబుండు విజృంభించి. 418

చ. ఎగిచి బకానుజన్మశిఖ నేడ్తెఱఁ గైకొని మీఁది కెత్తియుం
దిగిచి విశృంఖలంబుగను ద్రిప్పి యిలం బడ వైచి కుత్తుకం

దురుతరసాయకజాలము, పఱఁగించి తమంబు చిక్కఁ బడ దివిఁ గప్పెన్. 427

సీ. అపు డసురేశ్వరుం డాకసంబునఁ గాఱు,మబ్బులు గల్పించె మంట లెగయఁ
గొఱవులు నుల్కలు మెఱుములు నుఱుములు,మిక్కుటం బయితోఁచెఁ నొక్క మొగిని
ముసలముద్గరగదాముఖ్యనానావిధా,యుధవర్ష మెంతయు నుర్విఁ గురిసె
ఱాలునుం బిడుగులు రాలె మొత్తంబుగా, వజ్రపాతధ్వనుల్ ప్రబల మయ్యె
తే. నఖిలభూతములకు భయం బావహిల్లె, నసురమాయాసముద్భవం బైనయెడరు
మాన్పఁ జాలక కర్ణుండు మ్రాన్పడియె,వినుము నీబల మంతయు విహ్వాలించె. 428

శా. మాయావర్షసముద్భవుల్ ఘనులు భీమప్రోద్భవేష్టుల్గిరి
ప్రాయప్రోన్నతదేహయష్టులును దంష్ట్రాభీషణాస్యు ల్మహో
గ్రాయస్తాయుధహస్తు లస్తమితనానారుల్ మహాకర్బురుల్
వేయాఱుల్ భవదీయసైనికుల నుర్విం జేర్చి రడ్డార్చుచున్. 429

చ. కరులు దెగెన్ హయంబులును గంద్రికలై పడెఁ దేర్లు తెర్లెఁ గా
ల్వురు గడతేరి రాయుధములున్ ధ్వజముల్ ధనువుల్ దనుత్రముల్
పారి పారి నుగ్గునూచ మయి పోయె భవద్బలమంతు డిందియున్
దెరలియు దేవురించియును దీనత నొందియు స్రుంది రందఱున్. 430

క. వెఱచఱచి పఱచువారిని, నెఱి చెడి పడువారిఁ జూచి నీకొడుకు లెదన్
వెఱఁ బడుచు మేనియాసలఁ, దొఱఁగిరి తమ కెట్టిదిక్కుఁ దోఁపనికతనన్. 431

ఉ. పాండవపక్షపాతు లయి పర్వ సుపర్వులు వచ్చి యిట్టు లు
ద్దండతఁ బోరి కౌరవుల దంచుచు నుండిరి కానినాఁడు నీ
చండిమ సోఁకుమూఁకల కెసంగెడు నే యని సైనికుల్ వెఱన్
భండనభూమికిం దొలఁగి పాఱిరి ధీరతఁ గర్ణుఁ డుండినన్. 432

మానిని. రక్కసు లుక్కున రాణ లెసంగుచు రాపులు చూపుల రాయునెడన్
మిక్కిలిచిక్కఁగ మిన్నున మన్నున మించినతూపులు మేలిమికిన్
జిక్కియుఁ జిక్కక చిట్టున నట్టులు చీల్చుచుఁ బెల్చన జివ్వను బెం
పెక్కినకర్ణునిమెక్కువఁ గన్గొని యెంచి నుతించిరి యెల్లదొరల్. 433

ఉ. అత్తఱిఁ జక్రయుక్త మగునట్టిశతఘ్నిని రాక్షసేశ్వరుం
డెత్తి వియత్తలం బారయ నేసిన నయ్యది కర్ణుతేరి కొ
నుత్తమవాహనంబుల సమిద్ధతి నద్ధరఁ గూల్చెఁ గూల్చినన్
దత్తఱఁ గర్ణుఁ డుర్వికయి తత్తబడల్ పడుపాటు సూచుచున్. 434

క. తనదివ్యాస్త్రము లన్నియుఁ, గనుచుండఁగ నసురమాయఁ గడతేరుటయున్

మొన లెల్లఁ దఱిఁగి విఱుగుట, గని లోనం దలఁచెఁ బ్రాప్తకాలము గాఁగన్. 435

—కర్ణుం డింద్రదత్తశక్తిచే ఘటోత్కచుం జంపుట—

వ. అయ్యోడరు గాంచి కౌరవు లెల్లరు గర్ణుం దరియ వచ్చి సంబోధించుచు. 436

ఉ. ఆసురమాయ ఘోరతర మయ్యె నలంతులఁ దీఱ దట్టులై
వాసవశక్తి నీకడ సపర్యల నందుచుఁ బ్రజ్వరిల్లుచున్
భాసిలు దాన నియ్యోడరు పాయఁగఁ జేయుము చేయకున్న నీ
దోసి సమస్తసైన్యమును ద్రుంపక పోఁ డొకయింతమాత్రలోన్. 437

ఉ. వీఁ డొకఁ డిట్లు పోయినను భీముఁడు పార్థుఁడుఁ దొట్టిశాత్రవుల్
గూడియు నస్మదాదులఁ దగుల్కొని యేమి యొనర్తు రందఱున్
మాడియు నగ్గి చచ్చెదరు మామకశస్త్రమహాగ్నికీలలన్
జూడు ముపాయ మిప్పటికిఁ జూతము చావకయున్న నాఁటికిన్ 438

క. ఒండు దలంపక నీవా, ఖండలవరదత్తశక్తిఁ గ్రవ్యాదుతలం
ఖండింపు మీనిశీథిని, నుండిన మే మెల్లకాల ముండెదము లగున్. 439

వ. అని యనేకవిధంబులం జెప్పిన విని యప్పురుషసింహుం డప్పటి కదియ కర్తవ్యం బని
నిశ్చయించి. 440

సీ. కుండలంబుల నందుకొని యింద్రుఁ డిచ్చిన, నేఁడువ్యూహంబుగఁ గ్రీడి నేయుటకును
దాఁచి యుంచినదానిఁ దన్నదైవ మగుదాని, బాణసంయుక్తమై పరఁగుదాని
నాలుకల్ గ్రోయుచు నాఁక వచ్చెడుదాని, మిత్తికిఁ జెలులై మెఱయుదానిఁ
గాలాంతకునిజిహ్వకం బోలి వెలిఁగెడు,దాని నజయ్యమై తనరుదాని

తే. వైజయంతి యనం బేర వఱలుదాని,ఘోరశక్తినిఁ గర్ణుండు గొని భుజాంత
రమునఁ బూనిక నమరించి రాక్షసేంద్ర,వక్షమును గుఱిసూచుచు వైచె నేచి. 441

క. భుజముల నుండినయప్పుడె, గజిబిజిపడి భీమసుతుఁడు గనుకొని శక్తిన్
నిజమాయ వింజ మట్లయి, ప్రజ లెఱుఁగం దోఁచి పాఱె భయవిహ్వలుఁడై. 442

తే. అంతరిక్షంబునన్ భూతసంతతి కదు, నఱచెఁ దుములవాతము వీచె నవనిఁ బడియెఁ
బిడుగు లుల్కలు భూమి గంపించెఁ గర్ణుఁ,డసురకై శక్తిఁ బూఁచిన యంతలోన.443

మ. వసుషేణప్రతిపాదితం బయి మహాజ్వాలాకులం బైనశ
క్తి సురారాతిని వెంట నంటి తొలుతం ద్రుంగించి తన్మాయ న
ర్వసమర్థం బయి వజ్రమట్లు పడి తద్వక్షంబు భేదించి పై
దెసకున్ మండుచు నేగి రిక్కలగుమిన్ దీపించె మేల్గాంచుచున్. 444

క. వక్షము భేదిల్లఁగ నా,రాక్షసుఁ డార్చుచును భూధరం బన ధరయం

దాక్షిణము కూలి చచ్చెఁ, రూక్షారావంబు హెచ్చి రోదసి నిండఁ. 445

తే. అసురమానుషచిత్రము లతిశయిల్లు,నట్లు పోరాడి మనసేన హతము చేసి
శక్తిఁ దెగి వాఁడు మనసైన్యసమితిఁ గూలె, దాన నొక్కయక్షౌహిణి దండు సమసె.

క. బ్రతికియుఁ జచ్చియుఁ బాండవ,హిత మొనరింపంగఁ బూని యిందఱిబలమున్
హత మొనరించిన వీరుని, స్తుతియింపఁగ వలదె యెట్టిశూరుల కైనన్. 447

వ. ఇట్లు ఘటోత్కచుండు చచ్చినంత యచ్చటివారు సింహనాదంబులును శంఖారవంబులు
ను భేరీముఖనినాదంబులుం బోరుకలుగఁ జేసి సంతసించి కర్ణు నగ్గించి పూజించి తతం
డును నిజనందనునిస్యందనం బెక్కి నిజసైన్యంబునకుం జనియెఁ బాండవులును బెను
గొండవలెం గూలినవానిం గాంచి శోకవ్యాకులితాంతరంగు లై కన్నీరు మున్నీ రై
పాఱఁ బొరంబు గాననియట్లు వగలం బొగలుచుండఁ బుండరీకాక్షుండు దక్షిణప్రహ
ర్షంబునం బొంది పాండవేయులకు వ్యథాకరంబు గాఁ గరంబు సింహనాదంబు గావించి
శంఖంబు పూరించి యుగ్యంబులపగ్గంబులు నొగడ ముడిచి వచ్చి కిరీటిం గౌఁగిలిం
చుకొని వానివీఁపుపై నప్పళించి మందమారుతోద్ధూతమందారంబుచందంబునం బొం
దుపడ నర్తించుచు మఱియు సింహనాదంబు గావించినం గాంచి నాతిసంతుష్టహృ
దయుం డై చింతించుచు నర్జునుం డతని కిట్లనియె. 448

—ఘటోత్కచుండు చచ్చుటకుం దనకుఁ గలసంతోషమును గృష్ణుం డెఱింగించుట—

మ. అకటా యేమనువాఁడ నిన్ను జగదీశా! చచ్చె హైడింబుఁ డి
ట్లు కలంగంబడి యెల్లమూఁకలును వాటుం బొంది వెన్నిచ్చె మే
ము కడుం గుందున వందుచుండు మిపు డీమోదంబు నిన్నొందె దీ
నికి లేకుండ దనల్పహేతు వనుచుఁ నే నెంతు స్వాంతంబునన్. 449

తే. అది రహస్యము గాకుండ నట్టిదైనఁ, జెప్పఁ దగు నేని చెప్పంగఁ జిత్తగింపు
మెపుడు నీగురుచరితకు నింతలఘుత,గా దిది సముద్ర మింకుట గాఁ దలంతు. 450

వ. అనిన వాసుదేవుం డతని కిట్లనియె. 451

సీ. ఇది హర్షకాల మై యెసఁగు నామదిఁ గల,కలఁత యంతయుఁ దీఱెఁ గర్ణునొద్ద
నాశక్తి యుండినయంతకాలము నాకు, గునుకు పట్టదు నిన్ను మనుచుబుద్ధి
శక్తిహస్తుని వాని శక్రాదు లైనను, గెలువఁ జాలరు నేఁడు తొలఁగె నద్ది
కవచకుండలములు గలవాఁడు ముల్లోక,ములకు నసాధ్యుఁడు పోయె నవియు

తే. నీదుదిష్టము మంచిది నీవయిఁ గల,కూర్మి నింద్రుఁడు కవచంబుఁ గుండలములు
నడిగి కొనిపోయెను వికర్త మాచరించి,యవి యొసంగి వైకర్తనుఁ డయ్యె నతఁడు.

మ. ఘనుఁ డాకర్ణున కిన్నియుం గలిగినన్ గాండీవి వై నీవు చ

క్రీని నై నేనును గూడి గెల్వ మనునుక్తిం జెప్ప నేలా యముం
డును నింద్రుండుఁ గుబేరుఁడుఁ జలవిభుండుం జాల రన్నన్ మహా
మునిమంత్రంబునఁ గట్టువడ్డభుజగమ్ముం బోలె ని ష్ఠ్యెడ్డెన్. 453

తే. శక్తి గ్రాగకొన్న మొదలు నిన్ జంపఁ జాలె,దనని యాతండు పూఁచియుండె నది యిట్లు
పోయె నిప్పటి కైన నప్పురుషవరుని,నీవు గా కేరు నోర్వ లే రిది నిజంబు. 454

సీ. అకర్ణుం డరయ బ్రహ్మణ్యుఁడు సత్యవా,దనరతుండును నియతవ్రతుండు
దపసియు రిపుల నే దయఁ జూచువాఁడును,నై వృషుం డనఁగ బే రంది పొందెఁ
బ్రథనశౌండుఁడు మహాబాహుఁడు విలు పూని, హరి కరులం బోలె నరుల నడఁచు
మధ్యంగతాదిత్యు మ్మాడ్కి మండెడువాని, మన యోధు లత్తెత్తి కనఁగ లేరు
తే. కాలమేఘము వర్షించుకరణి శరము,లొలుకు చుండిన నమ్మేటికెలన వేల్పు
లే నిలువ నోప రిప్పటి కైనఁ గవచ,కుండలాదులు లో మనుష్యుండ యైన. 455

క. అరద మిలఁ గ్రుంకి కృచ్ఛ్రము, భర మైనపు డీవు వేచి పడవేయుదు వ
య్యరిసూదనుండు రణమున, శర మూనినతఱిని గెల్వఁ జాలవు వింటే. 456

వ. మఱియు నేను మున్న నీహితార్థంబ జరాసంధశిశుపాలాదులం గూల నేసితి వారొక్కఁ
డొక్కఁడె ముజ్జగంబులకుం జాలినవారు వా రిప్పు డుండిరేని మనపైఁ బగ పాటించి
దుర్యోధనునకుం బాసటయై వత్తు రందఱు నొక్కటి యైన మనకు గెలు పసాధ్యం
బగు నాకర్ణింపుము. 457

సీ. తొల్లి జరాసంధునిల్లడ యై గద, యొం డగు దాని వాఁ డొక్కనాఁడు
బలభద్రుపై నల్గి పఱపిన నతఁడు స్థూ,ణాకర్ణమనియెడునారసమునఁ
బ్రతిహతం బొనరింప నతిరయంబున నది, యట నున్న జరఁ జంపి యద్రు లదర
ధరణిఁ బెకల్చి పాతాళంబునం జొచ్చె, నద లేమి భీముఁ డయ్యధికుఁ జంపె
తే. నేకలవ్యున కంగుష్ఠమే పొసఁగిన, భార్గవున కెత్తువచ్చెడు వాఁడు వాని
వ్రేలు త్రుంగించితిని నేన వెఱవు వన్ని,దాన నదదు కయ్యెఁ దత్ప్రతిభ మెల్ల. 458

ఆ. వేనిఁ జంప నేను వెలసితి నాశిశు,పాలు దుష్టశీలుఁ గూల నేసి
నాఁడ నేన వాఁడు నేఁ డున్న మన కెట్టి,యిక్కి మయిన వచ్చు నిది నిజంబ. 459

వ. మఱియు నుపాయంబు వన్ని బకహిడింబకిర్మీరాదుల మారుతిచేఁ జా నేయించితి
బ్రహ్మయజ్ఞవినాశకుం డై రావణసముం డైనయలాయుధుని హైడింబునిచేఁ జంపిం
చితి హైడింబుఁ డాకర్ణశక్తిచేఁ గూలఁ బన్నితి వీఁడు మీ కుపకరించువాఁ డగుటం
జేసి యింతదనుక నుపేక్షించితి నిట్లు చావకున్న బ్రహ్మద్వేషియుయజ్ఞద్వేషియునగు
రాక్షసాధముని నేన సంహరింప వలసి వచ్చును గావున నిట్లు చంపించితి ననిమఱియు.

తే. ధర్మలోపం బొనర్చెడుదుర్మతులను, గూల నేయుటయే నాకుఁ గూడినపని
ధర్మసంస్థాపనార్థమ ధరణి నాదు,సంభవం బని యెఱుఁగవో సవ్యసాచి. 461
చ. దమము శమంబు దానమును ధర్మము వేదము హ్రీయు శ్రీయునున్
క్షమయును నార్జవంబు ధృతి సత్యము శౌచము నెందు నుండు నే
నమరఁగ నందు నుందు ఖలు లైచను వారలు నాదు శత్రులు
త్తము లగువారు మిత్రు లని తావకచిత్త మెఱుంగఁ బోలెడిన్. 462
తే. కర్ణునెడ నేమరిల్లుట కాదు సేయ,వెరవుతఱి వేఁచి చెప్పెద వీనిఁ జంప
వడముడి సుయోధనునిఁ జంప వలయువాని,కే నుపాయము గల్పించి యెఱుకపఱతు.
ఉ. అల్లదె కౌరవధ్వజిని యంతయు ద్రోణపురస్సరంబుగాఁ
బెల్లుఱుమంగ వచ్చెడిని భీషణశబ్దము మిన్ను ముట్టెడిన్
డ్రెల్లియు నోసరిల్లియును దిక్కులు వట్టెడు నీదుసైన్య మో
సల్లలితప్రభావ! యిటఁ జూ గొనరింపక యేపు చూపుమా. 464
చ. అనవుడు నాంబికేయుఁ డను నట్లొకవీరుని మాత్రేఁ జంపఁగాఁ
దన రెడుశక్తి గల్గియును దాని వృషుండు గిరీటిమీఁద నే
యను దలపోయఁ డేమిటికి నాతఁ డొకం డనిఁ డ్రెళ్లెనే నొకిం
తన తెగుఁ గాదె యెల్లయును దానిటు తెల్లము గా నెఱుంగఁడో. 465
క. ఎఱిఁగినఁ దానై పోరికిఁ, దెఱలక యుండినను నరుని దెస రమ్మని తా
నఱిమి విడ రాదె శక్తిన్, నెఱి గలవృషుఁ డనికి రమ్మనిన నతఁ డుఱఁడే. 466
క. పిలిచినఁ బోరికి రా నని, పలుకనివ్రతే మక్కిరీటివలనం గల దీ
బలుమానిసి తా నిట్టులు, తెలిసియు నలుపండు కతము దెలుపం గదవే. 467
వ. అని మఱియును. 468
సీ. బుద్ధిహీనుఁడు నాదుపుత్రుఁ డేమియుఁ నెఱుఁ,గఁడు పగఱజయింపఁ గలుగు టెట్లొ
కుణిచే ఫలము లాగుకొనినబలాఢ్యుని,బలెఁ గర్ణుశక్తిని సలిపె శౌరి
శునకవరాహముల్ పెనఁగుదు నేది చ,చ్చిన శ్వపచునకు మే లొనరునట్లు
కర్ణహైడింబులకలన నెవ్వఁడు వడి,నను లాభమే కదా నరసఖునకు
తే. భీమతనయుండు గర్ణునిఁ బిలుకుమార్చ్ప, నొకఁడు హైడింబుపైఁ గర్ణునుగ్రశక్తి
పొలియ నొకఁడును ఫల మని తలఁచి శౌరి,తెలివిఁ బాండవహిత మెంచి సలిపె నిట్లు.
క. మాపెఱగులకున్ మతివో, నీ వైనం దేర్చి కర్ణునిన్ వరశక్తిన్
దేవేంద్రసుతునిమీఁదను, వే విఘవం జేయ వైతి వే కద సూతా. 470
వ. అనిన సంజయుం డతని కిట్లనియె. 471

ఆ. ఇంత తెలిసి కాదె యిట్లు చేసె నుపేంద్రుఁ, డితము నెంచి పాండుసుతుల కెపుడుఁ
గాక యున్న మేలు గాకుండు వారికిఁ, గృష్ణుసాయమునన క్రీడి బ్రతుకు. 472

క. హరిప్రాపు లేక యుండిన నరుఁడును బాండవులు నొక్కనాఁట సమరోత్కర్షుల్
త్కోత్కటులై సమరంబునఁ దెగు, టరుదే మనవారు తక్కువగుదురె కర్షణ. 473

సీ. దుర్యోధనుండును దుశ్శాసనుఁడు నేను, శకునియు రేల్ కర్ణునరస కరిగి
యెల్లివారలఁ బెట్టి యింద్రనందనునిపై, శక్తి వైవ మని మను చచ్చె నేని
తక్కినవా రేమిలెక్క వత్తు రటంచుఁ, జెప్పియు మఱియును జెప్పుచుండు
మఱఁదు పోయినఁ గృష్ణుఁ డన్నిఁటికిని మూల, మున్న వానిక క్కట్టు నుర్వి యెల్ల

తే. మూల ముండగఁ గొమ్మలు గూల నేయ, మరలఁ జివురించున్నటుమునూడ్కి నగును
గాన నరు నేయుటయు మాని కంసవైరి, నేయు మని ప్పగు నంచు మే మెంచి యెంచి.

క. మూలం బాతఁడు గూలిన, నేల సమస్తంబు మనకు నిలుచుం గర్ణా
పోలించి చేయు మనుటయు, నాలించి యతండు నట్ల యగు నను మాతోఁ. 475

వ. అట్లు చెప్పినఁ గర్ణుండును మేమును మఱునాఁడు పోలికలనికిం బోయి యప్రమేయ ప్రభావుం డగువ్యాపి కేశునిమహత్వంబున శక్తిమాటయ మఱచి పోవుచుండుము కృష్ణుండును శక్తికిం దలంకి కర్ణుం బోర లాఁతులం బుచ్చుఁగాని విజ్వచ్చుం దఱిమి కొని రాఁడు వాని కోపువాఁ డెజగంబునను జూడఁ గలుగం డట్లు కర్ణుశక్తిచే ఘటోత్కచుండు చచ్చినపదంపడి సాత్యకి కృష్ణునికడకు వచ్చి కర్ణుఁ డింతకాలు మిట్టిశక్తి నర్జునునిపై నేయమికిం గారణం బేమి యని యడిగిన నతం డతని కన్నచందం బాకర్ణింపుము. 476

మ. కురురాజాదులు రేలు కర్ణునకుఁ బెక్కుల్ సెప్పి యొప్పించు న
వ్వరబాహాబలశాలి వచ్చి యనికిన్ వా రన్న వాక్యంబులన్
స్మరియింపం గలశక్తి లేనియతఁ డై ప్రమా నొంద నేఁ జేయదుర్
గర మల్కం గొని యైన నేయుటకుఁ బూనం డాతఁ డియ్యర్జనున్ 477

ఉ. అల్లమహోగ్రశక్తి చెలువారుచుఁ గర్ణునిచెంత నుండిన
న్నాళ్ళను గుండె తల్లడముసం బచరించితి నిప్డు హర్షముఁ
దల్లియుఁ దండ్రి యన్నలును దమ్ములుఁ బ్రాణసఖుండుఁ గ్రీడియు
ట్లుల్లము పల్లవించుటకు శోకమువాసియు నుప్పతిల్. 478

తే. అతఁడు లేమిఁ బ్రితొంకకాదమున, నేనియును నాకుఁ బ్రియము గా దిట్లు కాన
మృతుఁడు ప్రత్యాకము భీమసేనమి దోఁపనర్జునుం గాంచి సంతోష మందుచుంటి.

వ. అని కృష్ణుండు సాత్యకికిం జెప్పె ననిన ధృతరాష్ట్రుం డక్కటా! మనవారు దైవోప

హతులు గావునఁ గాళరాత్రిం బోనియమ్మహాశక్తి కృష్ణార్జునులపయిం గాక తృణ
ప్రాయుం డైనఘటోత్కచుపయిం బోయె నే. మనంబున గల దింక వైకర్తనాదులును
వైవస్వతునిలయంబునకుం బోయినవారయని నిశ్చయింపు మది యుండె ననంతరసంగ్రామ
ప్రకారంబు సెప్పు మనిన సంజయుం డతని కి ట్లనియె నట్లు ఘటోత్కచుండు పడిన
పదంపడి నీమూఁకలు హర్షోత్కర్షంబున నార్చుచు నొక్కపెట్ట పరిబలంబు ముట్ట
డించి యఱుముటయు వారిమూఁకలు చీకాకుపడుటయుం గని యుధిష్ఠిరుండు
చింతాశోకవిమూఢచేతస్కుండయి భీమసేనుం బిలిచి హైడింబమరణంబున నామ
నంబు మోహావిష్టం బయ్యె నియ్యెడఁ గయ్యంబునకుఁ గాలు ద్రవ్వ నివ్వైరిబలంబు
నీ వాఁగు మని తాను రథంబునం జదికిలం బడి యశ్రుపూర్ణముఖుం డై నిట్టూర్పు
నిగిడించుచుఁ గశ్మలంబు నొందె నానందున గోవిందుండు గదియవచ్చి వానిఁ దన
కరంబులం బాదివి యి ట్లనియె. 480

—శ్రీకృష్ణుండు ధర్మరాజుం బ్రబోధించి తీర్చుట—

ఉ. ప్రాకృతపూరుషుండు బలెఁ బ్రజ్ఞ చెడం బడి యిట్లు వ్రేవ్రుటల్
నీ కనురూపమే యిటులు నీవు వగం బొగులంగ సందియం
బే కద గెల్పు లేమ్మనికి నేగుము పెద్దభరంబు మోయఁగా
నీ కగు నన్న నాతఁడును నేత్రజలంబులు గేలఁ ద్రొముచున్. 481

వ. కృష్ణుం గాంచి యి ట్లనియె. 482

క. ఏనెఱిఁగి ధర్మతత్త్వము, మానుగ వచియించుచుంటి మాధవ కృతముల్
మానసమున మఱచినయ,మ్మానవునకు బ్రహ్మహత్య మసలక వచ్చున్. 483

సీ. అజ్ఞునఁ డస్త్రార్థ మరిగినప్పుడు మాకుఁ, గామ్యకవనమునఁ గాచియుండె
గంధమాదనయాత్ర గలిగినప్పుడు మమ్ము, దాఁటించె దుర్గమస్థలము లెల్లఁ
గడు పథిశ్రమమున బడలినపాంచాలి, నరకడ నిడికొని యరిగి వచ్చె
నోల మాసింప కియ్యాలంబునన్ నాకుగా నెంత లెంతలు కడఁగి తీర్చె

తే. నట్టియాభీమసేనునిపట్టియందుఁ,బరఁగు ద్రేముడి సహదేవుపయి నెసంగు
ప్రీతికన్న నిమ్మడి యయి పెఱిగెఁ గాన,నిట్లు వందుచు నుంటి నోయిందిరేశ. 484

వ. అని వానిం జంపినవానిపై గోపంబు దెచ్చికొని. 485

ఉ. ద్రోణుఁడుఁ గర్ణుఁడుం గదిసి రోషచయంబున నేపు చూపుచున్
రాణువ నంతయుం గలఁచి రాచుచు నేఁచుచు నున్నవారు కం
ఖాణము లేన్నలున్ భటులు గండ్రిక లై పడెఁ గుప్ప తిప్పలై
స్థాణుని బోలుభీమనరసాత్యకులుం గయికో రొకింతయున్. 486

తే. మనము జీవించియుండ నమ్మారుతిసుతు, నెల్లరసమక్షమునఁ గర్ణుఁ డిట్లు కూల్చె
నీవుఁ గ్రీడియు లేనప్డు చావ నేసె, వీఁడు సౌభద్రు దాని కీనేఁడు పెద్ద. 487

చ. నరుఁడు నలంతికారణమునం బడ నేసె జయద్రథుఁ గ్రూరు రణాం
తరమున గర్భశత్రు వని నా కది యంతప్రియంబు గాదు మా
ర్తురఁ బరిమార్చు టొప్ప నని తోఁచినఁ గర్ణునిఁ ద్రోణుఁ ద్రుంచుటల్
పరమహితంబు ఘోరగొదకు వారలు మూలము గాదె మాధవా. 488

క. కావున నే నాసూతజుఁ, జావఁగ నొనరింతు నిపుడ సంగ్రామమునం
జేవ మెయి భీమసేనుఁడు, కేవలుఁడై ద్రోణుసేనఁ గెడపుచు నుండెన్. 489

వ. అని పలికి వేగిరించుచు రథంబు దోలుకొని కర్ణరథంబుమీఁదికిం జని శంఖంబు పూరించి
ధనుష్టంకారంబు గావించె నంతలో శిఖండి త్వరితుండై వేయిరథంబులును మున్నూ
ఱేనుంగులును నేనువేలగుఱ్ఱంబులును మూఁడువేల ప్రభద్రకులును [illegible] యుధి
ష్ఠిరునకుం బాసట యై శంఖం బొత్తి భేరులు మొత్తించె [illegible] నిజస్థా
నంబు నలంకరించి కవ్వడిం గాంచి యి ట్లనియె. 490

క. అలుకయు నొందు గానక, చులుకం జనెఁ గర్ణుఁ గదియ [illegible]శ్వరుఁ డో
విలుకాఁడ! మనము చూచుచు, నిలుచుట సరి కాదు నడునప్పు నచటికిన్. 491

వ. అని పలికి యతిత్వరితగతిం గుఱ్ఱంబులం దోలుకొని దూరంగతుఁ డైన ధారుణీశ్వరు
ననుసరించె నంతలో శోకోపహతసంకల్పుం డై కర్ణు [illegible] నరుగు ధర్మరాజునకు
సాత్యవతేయుఁ డెదుర సాక్షాత్కరించి మ్రొక్కినం దీవించి యి ట్లనియె. 492

—వ్యాసుండు దర్శన మిచ్చి ధర్మరాజు నూఱడించుట—

శా. నీపుణ్యంబునఁ జేసి ఫాల్గునుఁ డనిన్ జీవించె నాకర్ణుతో
రాపుల్ సూపియు వాఁడు వీనిఁ దునుమన్ రక్షించె మృత్యుస్వరూ
పాపారప్రతిభాంచితం బగుసురేంద్రాస్త్రశక్తిన్ శర
వ్యాపారంబున నోడిన ట్లది విడన్ వాటిల్లెడిం గష్టముల్. 493

క. నీదిష్టంబునఁ గర్ణుం, డాదివ్యాస్త్రంబు రాక్షసాధిపునిపయిన్
బోఁ దివిచి యేసె నది మిన్, గాఁ దెగి పోయెన్ సురారి కాయం బగుటన్. 494

క. శోకము క్రోధము నొందఁగ, నీకుం దగ దేపుడు నైపుణ్యగతిన్
లోక మెసంగుచు నుండెడు, నేకాలము దానిఁ ద్రిప్ప నెవ్వఁడు నేర్చున్. 495

ఉ. తమ్ములు నెల్లపార్థివులుఁ దక్కినవారును దోడు సూప సం
ఖ్య మొనరించి కౌరవుల గండడఁగింపుము నిన్నుఁ బాసమా
హాత్మ్యునఁ బొందు రాజ్యరమ స్వాంతమునన్ దమకుం [illegible]

ర్మమ్మును గొమ్ము ధర్మ మెటఁ గ్రాలు నట్ల విజయంబు వ్రాలెడున్. 496

వ. అని బోధించి బాదరాయణుం డంతర్ధానంబు నొందె నంతఁ గౌంతేయాగ్రజుండును దాను రాధేయు నెదిరించు టుడిగి భీమసేనుం డరిబలంబు దోలుటం గాంచి ధృష్టద్యుమ్నుం బిలిచి నీవు గురువధార్థం బగ్నికుండంబునం బుట్టినవాఁడ వౌదక• వేఁటపు దక్కి మొక్కలీఁ డగునాచార్యుం డాఁతుము జనమేజయశిఖండిదౌర్ముఖప్రముఖులును మాద్రేయద్రౌపదేయప్రభద్రకేకయులును బుత్రభ్రాతృసమన్వితు లగుద్రుపదవిరాటసాత్యకులును గాండీవియుఁ జతురంగబలసముద్ధతు లగుతక్కినధరణీపతులును నిన్ను వెన్నుఁ దన్ని వచ్చువా రనినంత వా రందఱు నొక్కపెట్ట భారద్వాజుం జుట్టుముట్టుటయు నగ్గురుండు బెగ్గలింప కగ్గమించి ప్రతిఘటించినం గని దుర్యోధనుండును బరివారపరివృతుం డై గురునకుం బాసట యై పాండవబలంబులం జెండుచుండం బోరు ఘోరం బయ్యె నయ్యర్ధరాత్రంబున నయ్యిరువాఁగునందునుంగల యోధులు నిద్రాంధులును బరిశ్రాంతులు నై పెనంగుచుండ వారి కాత్రియామ సహస్రయామ ప్రతిమ యై భయరూపం బయ్యె నట్లయినను నిజధర్మంబు పాలించుచు నొండు గానక గజంబులపై రథంబులపయి వాహనంబులపై నున్న ట్లుండియు నవి పోయినట్లు పోయియు నాయుధంబులు జాఱ నెఱుంగక పట్టిచేతుల విసరియుఁ గూర్కునం దూఁగియు నిద్రారక్తలోచను లై త్రిప్పడియు విచ్చియు నాయుధంబులును గరదీపికలును బాఱవైచి కూరుకుకాలుమానుసులు నై యేమియుం జేయఁ జాలక బహుప్రకారంబులఁ గలవిలంపడుటయు జీఁకట్లు మీఁదుమిక్కిలి యగుటయుం జూచి ఫల్గునుండు పేరెలుంగెత్తి శూరులార! మీరు నిద్రాభరంబునఁ గడుంగడుఁ జిక్కియున్నవారు చిమ్మచీఁకట్లును గ్రమ్ముగఁ గ్రమ్ముకొనియున్న యవి గావున నొక్కముహూర్తమాత్రం బీరణభూమియందు నిద్రింపుఁ డింతలోనం జంద్రోదయం బయిన పదంపడి స్వర్గసాధనోద్యమం బయినబవరంబునకుం గడంగుదురు గాక యనిన నాసి వాక్యంబున కెల్లసైనికులుం గాక మింట దేవర్షిగణంబులును మేలు మే లని మెచ్చుకొని రచ్చోట మనవారును గర్ణదుర్యోధనులయనుమతిం బడసి ప్రధనోద్యమంబు చాలించి యొం దున్నవా రంద ఱయనించి యర్జునుం దలంచి మహాత్మా! సకలవేదంబులును సర్వాస్త్రశస్త్రంబులును బుద్ధిపరాక్రమంబులును భూతదయయును నీయందే సుస్థిరం బై యున్నయవి నీకు సుఖం బయ్యెడు నీకు సర్వార్థంబులును సిద్ధించెడు నని ప్రశంసించుచుం దీవించి సుఖనిద్రం గావించి రాసమయంబున. 497

తే. భోగిభోగాభములు తొండములు రజమున, బ్రుంగుడువడఁగ నూర్చుచు భూతలంబు
శీతలాంచితముగఁ జేసి సింధురములు, కొండలో యనఁ బడి యుండఁ గూర్కఁ జెంచె.

శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

## ద్రోణపర్వము.-షష్ఠాశ్వాసము.


దము నీపాదాబ్జము
నాదగుహృత్పీఠమందు నాటఁ నిలిపి లోఁ
బాదుకొని యున్న మోహము
పోఁ దోల ననుగ్రహించి ప్రోవుము దేవా. 1

### ద్రోణవధపర్వము

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె.

క. విని ధృతరాష్ట్రుఁడు సంజయుఁ, గని యిట్లను సూతపుత్త్ర ఘనతరనిద్రం
గొని యుభయబలంబులు మఱపున మరలన్ మేలు కాంచి పోరెనె చెపుమా. 3

వ. అనిన సంజయుం డిట్లనియె నట్లు కురుపాండవులు సర్వదుఃఖోపశమనం బగునిద్రా
సుఖం బనుభవించుచున్నంతఁ గొంతవడికి. 4

క. కళలకు నెల వగుజాబిలి, పొలుపునఁ దనబొజ్జలోనఁ బొదలుచునుంటన్
గలకలలాడు మొగంబునఁ, దొలఁకు ననం ధవళిమంబు తూర్పునఁ దోచెన్. 5

క. ప్రాచీదిగంగనామణి, ప్రాచీనాచార మెసఁగ ఫాలతలమునన్
రాచుకొని భూతి నునుమడుఁ, గౌచితిఁ గొనె ననఁగఁ బ్రబలె నట ధవళరుచుల్. 6

క. ఉదయాచలకేసరి పూ,ర్వదశాదరినుండి తిమిరవారణచయమున్
సదమదము సేయ వెడలు న,గిది జాబిలి పొడిచెఁ బాండుకిరణస్ఫురణన్. 7

సీ. వినుసిగదేవర వెలియాలఁ బోఁతుమే,నికి నెత్తు వచ్చెడునిగ్గు లెసఁగ
వెడవింటిదొరజోదు వెడఁదవింటికి నెన, వచ్చి మెచ్చగుతేజు పిచ్చిలంగ
సరిక్రొత్తపెండ్లికూఁతురిమోవిఁ దొలఁకాడు,నవ్వుల కగుజిగి నివ్వటిల్లఁ
బాలవెల్లిం ద్రచ్చుపదనునం బొదవిన, వెన్నముద్ద మెఱుంగువన్నె పొదలఁ

తే. కుముదబాంధవుఁ డుదయాద్రికోణమందుఁ,దోఁచి చూచుచు నుండంగ నేచి మింటి
నెగయుఁ బ్రాఁకుచు నిజకాంతి యొల్లకడలఁ,గలయఁ జిమ్ముచు నిరు లెల్ల మలఁచి తోఁచె.

చ. నెల తల సూప సంపదలు నిండె నసన్ జగమందు నెల్లెడన్
గలుగుపదార్థముల్ తనచొకాటపుఁ దేజుల వెల్లిఁ దేల్చుచున్
మొలవఁగఁ జేసి సంతసము మోహనరూపముతోడఁ బండు వె
న్నెల యలు దేచి కాచె నిం నిండుగఁ బిండి వెలార్చి నట్లుగన్. 9

వ. అట్లు వెన్నెల కన్నుపండువై కాయుచున్న సమయంబున. 10

చ. కొడుకు శిగుచందమామ తనకుం బొడసూపఁగఁ బాలవెల్లి యె
వ్వడువున నార్చుచున్ నభము వంకకు లేచుచుఁ బొంగి పొర్లు న
వ్వడువున మేలు కాంచి యురువాఁగు బలంబు లవెల్ల చోటులన్
గడువడిఁ గమ్మఁ గ్రమ్ముకొని కయ్యము నొనర్పఁగఁ జొచ్చె నచ్చటన్. 11

వ. అట్టియెడఁ గురువర్యుండు గురువర్యుని చెంతకుం జని క్రోధపరవశుం డై కొంత
ప్రసంగించి. 12

మ. అహహా నీకు వశంబు లై కలవు బ్రహ్మాద్యస్త్రముల్ పెక్కు ని
న్నహరుం డైన నెదుర్పఁ జాలఁ డనినన్ నో రెత్తనే లొండ్ల నా
గ్రహమే కల్గిన నొక్కపెట్ట జగముల్ గాల్పంగ నీ వౌదను
గ్రహముం జూపుట కాదె పాండవబలోత్కర్షంబు సూపట్టుటల్. 13

మ. అరులన్ సైరణ సేయుచుంటి విది శిష్యప్రేమయో లేక నా
దురదృష్టం బగు నో యెఱుంగ మని శత్రుల్ నీదు సంరక్షణ
స్ఫురణన్ బెచ్చిలి యున్నవా రరయ నేమో నాఁడు నాఁటన్ బలో
త్కరముల్ గోల్పడి తగ్గుచుంటి మని నీకై చెప్పఁగా నొప్పనే. 14

ఆ. ఇపుడు డస్సి యుండి రెల్లరు నీయస్త్రబలము సూపి నాదుపగఱ నడఁచి
దురము సేయ వలయుఁ గురురాజుపై నీకుఁ గొంతయేని కరుణ కుదిరెనేని. 15

వ. అనిన నాచార్యుండు లోన గర్హించుచుం గ్రుద్ధుం డై కుబుద్ధి యగునీకొడుకుం జూచి
యి ట్లనియె. 16

—ద్రోణాచార్యుఁ డర్జునుని ప్రశస్తి యొనరించుట—

చ. ముదుసలివాఁడ నయ్యు బలముం జవముం గొని మేనియూసయున్
వదలి రణం బొనర్చుచుఁ బ్రవర్తిలుచుంటిని నన్ను నింత గా
వదరుట కేమొకో కతము వారక చెప్పు మశస్త్రవేత్తలన్
జిదుమఁగ నస్త్రరాజముల జిమ్మనిమాటయ లెస్స మాట యే. 17

క. పిచ్చుకపై బ్రహ్మాస్త్రము, మచ్చున నే నలిగి మూఁక నార్కొని యస్త్రం
బచ్చుపడ సేయ వలయునొ, వచ్చెడు సామ్రాజ్య మల్లి పైచెదఁ దండ్రీ. 18

క. తప్పే నొప్పెనియు నీ చెప్పినగతిఁ జేయ నుంటిఁ జేయ నొకం డేఁ
జెప్పితిఁ బాంచాలుర నేఁ, దక్షక వధియింతు మఱువు దటలింప కిఁకన్. 19

వ. నే నర్జునునిపై శిష్యవాత్సల్యంబు సూపుదు ననియు లేకున్నఁ బరిశ్రాంతు లైనవాని నప్పు డేయుట సుకరం బనియుఁ దలంచితివి దేవదానవగంధర్వాదు లైన నెవ్వరును వాని నోర్వఁ జాలరు చెప్పెద వినుము. 20

సీ. ఎఱుఁగవో నీ వింద్రుఁ డెదిరించి యోడుట, ఖాండవవన మెల్లఁ గాల్చునెడను
తలఁపవో నీవు గంధర్వులకుం జిక్క, నతనిచేతలు ఘోషయాత్ర నాఁడు
వినవో నీవు హిరణ్యవిషయవాసుల నేసి, యలరుట స్వర్గప్రయాణ మప్పుడు
కనవో నీవు విరాటకటకమ్మున న్నిమ్ముఁ, జించుటఁ బసులఁ బెట్టించు తఱిని

తే. తెలియవో నీవు పరమేశుఁ గలనఁ గెలిచి, పాశుపతమును బడయుట పార్థుఁ డనఁగ
మనుజమాత్రుఁడు గా నీవు మదిఁ దలంచి, యెఱుఁగనట్టేడ వైతి వి దేమి వత్స. 21

ఉ. నావుడుఁ గోపఘూర్ణితమనస్కుఁడు నీసుతుఁ డిట్లు పల్కె నో
దేవసమప్రభావ! వినుదే యది యట్టిద యే నటుండ్లవిూ
వీవసుషేణుడున్ శకుని యేనును నాదుసహోదరుండునున్
జేవ నెదిర్చి యార్చెదము సేనల రెండుగఁ జేసి వాసవిన్. 22

వ. అనిన నవ్వెంగిలిమాటకు మాటికిని నవ్వుచు నవ్వసుంధరామరుం డతనిమనం బను వర్తించి నీకు స్వస్తి యగుం గాతమని మఱియు నిట్లనియె. 23

సీ. కార్చిచ్చువలె నుండుకవ్వడి నెవ్వండు, మార్కొని బ్రదికెనో మహి నెఱుంగ
దిక్పాలురును వానిదెస గెల్వలే రని, మున్మాటికిని జెప్ప మొనసియుండుఁ
వెడఁగులు నీవలె నడివీరపుంబల్కు, లుడుగక పల్కుట లొప్పఁ జూవె
నీవు నీచుండవు నిశ్శంకివి మేలు, గోరినవారి నే దూరుచుందు

తే. వేరమున కీవ మూలము భూరమణుల, నిందఱం జంపఁగా నేల యీవ పోయి
తీట వాయంగ నరునితో నేటులాడు, మేల శంకింతు వంతయు నింతఁ దీఱు. 24

మ. నికృతిప్రజ్ఞుఁడు నీఁడె మాతులుఁ డెదన్ నీ కెంతయుం గూర్చు నీ
తకశాకాశలభాసురాత్మకుఁడు క్షత్రప్రోక్తధర్మజ్ఞుఁడున్
నికృతుండున్ ఖలుఁడున్ నృశంసుఁడును నీనిం బుద్ధి వీనాతం డీఁకన్
సుకృతాస్త్రం డగునర్జునుం బొదివి గెల్పుం బెల్చ నిం తేటికిన్. 25

మ. తొలి నీ వెప్పుడుఁ జెప్పుచుండువృషుఁడున్ దుశ్శాసనుం డేనుఁయుం
గలనం బాండుకుమారులం గెలిచి లోకఖ్యాతినిం బొందఁగాఁ
గల మంచున్ మదిసంతసించెడిని నీకన్నయ్య నీ విప్పుడ

ప్పలుకుదు సత్యముగా నొనర్చుకొనుమా బాహాబలం బేర్పడన్. 26

క. అదె నీకోరిన శాత్రవుఁ డెదుటం జను దెంచుచుండె నేడ్తెఱఁ జూపం
బొదలుము యిట క్షత్త్రధర్మము, వదలకు మని వీఁగుకంటె వర మగుఁ జావే. 27

చ. చదివితి వెల్లవిద్యలును సంతత మర్థుల కిచ్చి తర్థముల్
పొదల మొదవంగ భోగములఁ బొంపిరిపోయితి వెంత యేనియుం
బదిఁ గృతకృత్యుఁ డైతి ఋణభారము దీర్చితి నేర్చి పార్థుఁ డోఁ
గదనము సేయు మేమిటికిఁ గాని భయంపడఁ బోకు మిఁక కిటన్. 28

వ. అని గెంటువడం బలికి భారద్వాజుం డయ్యాజి కింత యోసరిల్లె సైన్యంబును రెండు
పాయలై పాయనిపరాక్రమంబునం జేసి యశ్వోపజామున వీఁకమెయిం దాఁకి
పోరం జొచ్చె నన్నవసరంబ. 29

ఉ. వెన్నెలతేనికాంతులను వేత్రకటీలుగఁ జేసి ప్రాగ్దిశా
గ్రొన్నసహోలె లీలమెయిఁ గొంచెము కొంచెము దోఁచి కెంపుడాల్
మిన్నును మన్ను నేకమయి మించఁగ నేచి ఖగేశ్వరాగ్రజుం
డున్నతిఁ గాంచెఁ బగ్గముల నూని దివాకరుకన్న మున్న యై. 30

తే. లోకబాంధవుఁ డినుఁడు భూలోకమెల్ల, నరసి తనును వాఁగ వచ్చునపుడు మునుదు
దనర సుమనసు లిడుమహాతా బసంగ, వేల్పుదొరచక్కి నుదయించె వేగుఁజుక్క.

క. నందితమహీబృందారక, బృందకిరీటార్ఘ్యతోయవిశిఖదితమహా
మందేహా దేహపురుని, బృందారకవృధ్గారసఁగఁ జను సమాజాంశుల్. 32

వ. అయ్యవసరంబున. 33

తే. రథగజాశ్వాదులం దిగి కలనఁ గలుగు, యోధు లందఱు వారిచి యోత లిడుచు
నరుణసారథి కభిముఖుఁ లగుచుఁ గేలు, మొగిచి సేవించి రానంజప్రోద్ధసంధు. 34

తే. రెండుతెగ లైనమూఁకలో నొండు గొంచుఁ, జాగురుఁ డేగె నఖుమఁ బాంచాలసేనఁ
గర్ణదుర్యోధనాదులు గలసి రొండు, మూఁకతోఁ బాండవబలంబు ముట్టడింప. 35

వ. అప్పుడు జనార్దనుండు కాలకేయమర్దనుం గాంచి యి ట్లనియె. 36

ఆ. అరుల డాసలించి యుఱుమంగవలయును, వెలుపలించి నీదుబలము లెల్ల
ననుడు నాతఁ డట్ల యూ నని ద్రోణకర్ణులకు ననల యగుచు నిలువఁ బుచ్చె. 37

వ. అట్టియెడ గాడ్పుపట్టి ఫాల్గునుం గాంచి మనము క్షత్త్రియులమై పుట్టినందులకుం దగు
కాలం బిప్పుడు సంప్రాప్తం బయ్యె నిక్కాలంబునం బగఱం బోరి నీ వుపేక్షింపకుండు నేని
మనకు శ్రేయం బగు సత్యధర్మయశోవీర్యంబులు నాశ్వ్యంబు నొందు మని బరవసం
బుమాటలం బురికొల్పిన నతం డట్లు భ్రాతృచోదితుండై కర్ణద్రోణుల నతిక్రమించి

యంతటఁ దళమి యఱుము నెరగలి కెత్తువచ్చి పరాక్రమించునవ్విధ్వచ్చునాఁగఁ జాలక భూపాలు రెల్లరును జిల్లపడి రప్పుడు దుర్యోధన కర్ణ సౌబలు లాగాండీవి బాఁకి కాండజాలంబుల నోనేసిన నుత్తమాస్త్రవిదుం డగునతండు నస్త్రంబులకుఁ బ్రత్యస్త్రంబు లేసి రూపు మాపి వారి నందఱం బదేసితూపుల నే పడంచి వేసిలం గలంచి యేట్లాడం దొడంగె నబ్బెడంగు సంగరంబునం బహులపరాగం బెగసి కన్నులఁగప్పి దిక్కులు విదిక్కులు నెఱుంగ నీయన్నితెఱంగునం బొంగి చిమ్మచీఁకట్లం గ్రమ్మఁ జేసె నపుడు రథులు విరథులై రావుతులు హతాశ్వులై యొండొరుం గట్టికొన్ని పోరి పోరి గతసత్త్వులై జీవంబులం బాసి రాసమయంబున నాచార్యుం డుత్తరంబు నకుం జని విధూమపావకుని తేవం జేవ మెఱసినం గని పాండవపాంచాలసైన్యంబు దైన్యంబు నొందియు నివ్వెఱపడియు విన్నఁబోయియుఁ గలకఁబడియు వెగడుపడియుఁ గైదువులు విదిర్చుచు నెదిర్చియు నచ్చెరువడియుఁ బిచ్చలించియుఁ గోపించియుఁ నొంచియు నొచ్చియు విచ్చియు వెఱచఱచియుఁ బఱచుచున్నం గని విరాటద్రుపదు లిర్వురును ద్రుపదపౌత్రులు మువ్వురును మత్స్యచేదిపాంచాలాదిపరివృతులై కవిసి కుంభసంభవుం జుట్టుముట్టిన నజగజెట్టి బిట్టేసి మూఁకలం జీకాఁకుపుచ్చుచు. 38

—ద్రోణుండు విరాటద్రుపదులం జంపుట.—

ఉ. మూఁడుశరంబులన్ ద్రుపదపుత్రునిపుత్రులయుత్తమాంగముల్
మూఁడు నిలాతలంబునను మువ్వురునం బడనేసి యాసునం
గ్రీడ యొనర్చునట్లు విలు కేల్గవ నర్తకిపోలె నర్తనం
బాడగఁ జేయుచుం దునిమె నా మొన నిల్చిన కేకయాదులన్. 39

చ. అదలిచి మాత్స్యుఁడున్ ద్రుపదుఁ డార్చి శరంబులు చిత్తజల్లుగాఁ
బదులును నూర్లు వేలు తనపై నిగిడించిన వాని నన్నిటిన్
జిదురుపలై పడన్ నలిపి సింహకిశోరముమాడ్కి వేడ్కమైఁ
గదిసి గురుండు వారిశిత కాండపరంపర ముంచె నెంతగన్ 40

తే. ముంచినన్ వారునుం గ్రోధమూర్ఛితులయి, మునుఁగు వెట్టిరి తూపులఁ గొసరికొసరి
కన్ను లంగారకణములు గ్రాయ గురుఁడు, వారివింటులు రెండును వడిగఁ జెండె. 41

వ. అంత. 42

చ. విరటుఁడు నొండువిల్లుఁ గొని వేగగతిన్ దశతోమరంబులన్
శరదశకంబునుం బఱపె శక్తి విడెం ద్రుపదుండు ద్రోణుఁడున్
శరములు దోమరంబులను శక్తిని నుక్కడఁగించి మించి త
చ్ఛిరములు రెండుభల్లములఁ జెక్కి యమునకియ నిచ్చె వారికిన్. 43

వ. ఇట్లు చేది మత్స్య పాంచాల కైకయవీరులం బాంచాలపౌత్రులను విరాటద్రుపదులనుం ద్రుంచి విజృంభించిన ద్రోణుం గాంచి ధృష్టద్యుమ్నుండు క్రోధదుఃఖసమన్వితుండై యెల్లధనుర్ధరులును వినుచుండఁగ నే నాచార్యుం బరాభవించి యిప్పుడ చంపకున్న క్షాత్త్రధర్మంబునకుం దప్పి యిష్టాపూర్తంబులకు వెలియైన వాఁడ నగుదు నని శపథంబు చేసి బహులపాంచాలసేనాపరివృతుండై ధనుర్ధరుం డాఁక దుర్యోధన కర్ణశకునులునుం దక్కునకౌరవులు నాభారద్వాజునకుఁ బాసటలై రంత నంతవడికి నవ్వీరోత్తముం గన్గొని చూడ నైన శక్యంబు గాకున్నం గని భీమసేనుండు పాంచాల్యుం బరిహాసించుచుం బరుషాక్షరంబుగా ని ట్లనియె. 44

చ. ద్రుపదకులంబునం బొడమి దొడ్డశరంబు లెఱింగి క్షత్త్రియో
గ్రపదము సందనాఁడ వని గర్వము నొందుచుఁ దండ్రి బిడ్డలుం
స్వపులును ద్రుళ్ళఁ జూడ్కు విను నీ పటు బాస యొనంగి వగలం
గ్రపఁ డుసుమంత లేక తగ నేయునె యింక నిఁకం జనుంటొకో. 45

క. గురుఁ డిదె పైశ్వాసముఁ డన, శరచాపోంకన చయ్యప్రసక్తి వారుఁ గనుఁడా
సరిపత్తుల వ్రేల్చుచుండెఁ, బరికించుచు నుండు నేను బ్రతికి యనాలా. 46

క. అని పలికి క్రుద్ధుఁ డగుచున్, జని మారుతి ద్రోణుపైన్ విమునసమునం
సునిశితసాయకసంచయ,మును జొనుపుచు నతివిను తతివు మునుము గిరింగాఁ. 47

తే. పార్థతుండును భారతవాహినిఁ జొచ్చి,బడి శరాసనగుణనిర్ఘోష ప్రతిసరించు
నుభయబలముల కత్తఱి నుగ్రసమర, మొప్పె దేవతలకు నద మొప్ప విచ్చు. 48

క. అత్తఱిఁ దొలఁగెడువారుం, జిత్తముల్ఁ గలంగువారుఁ జేష్టుడువారున్
మొత్తెడువారుం బగఱకు, నొత్తి గిలెడువారు నైరి యోధులు వింటే. 49

వ. ఇట్లుభయబలంబులుం దలపడి సంకులసమరంబు సేయుచున్నంతఁ గొంతవడికి రథంబులు హయంబులును, హయంబులు హస్తులును, హస్తులును బత్తులును, బత్తులను బత్తులును దురంగంబులు దురంగబులును, గజంబులు గజంబులును, నరదంబులు నరదంబులును, గాఁ దోఁచినట్లుగ్లఁ దలపడి పోరుచుండ శంఖభేరీమృదంగాదివాద్యత్త్ర నిస్వనంబులును గరిబృంహితంబులును, హయహేషితంబులును రథనేమిధ్వానంబులును, శింజినీనినదంబులును, బాణపాతధ్వనులును బదాతిపాదఘట్టనశబ్దంబులును,సింహనాదంబులును నిక్కృత్తజనాక్రోశస్వనంబులును నొక్కటిగం బిక్కటిల్లి యెల్లయెడలం బుట్టినపరాగంబుతోడం జుట్టుకొనంబు చేసి బిట్టుగసు మున్నుముట్టి నట్టియెడ మాంటికి బడలికలు రేపటియుండ తాఁకున నెచ్చెల్లం జొచ్చినయొక్కభాధరంబుస పోలియుఁ బిపాసాతిశయంబునం దేలియుఁ జాలింబడక మగఁటిమిం బాటించి పెనంగం దొడంగియు

నిదురతూఁగునట్లొడ లెఱుంగక రజంబు ప్రేఁగున నయనంబులం గానక స్వీయపరజ్ఞానంబు లేక చేతి కందినవారి నెల్లఁ బరశ్వధంబులం బరియలు నేసియుఁ గత్తుల మొత్తియు భిందివాలంబులఁ బిండిగావించియు గదల సదమదం బొనర్చియు నడిదంబులం బొడిచియు ననేకప్రకారంబులం బోరుచున్నంత విఱిగినకాళులును దెగినతలలును ముక్క లైనటెక్కెయంబులును నఱవఱ లైనపయిమఱువులును బఱియ లైనచామరంబులును దునియ లైనఛత్రంబులును దెస్సిపడినమాల్యాంబరాభరణాదులును దుత్తుము లైనహేతివ్రాతంబును బీనుంగు లగునేనుంగులును విఱిగినయరదంబులును • తెగినహయంబులును గూలినమానుసులునుం గలిగి ఘోరరూపం బయినరణరంగంబున మాతంగతురంగనరాంగసముద్భవంబును మాంసశోణితకర్దమంబును నార్తనాదస్వనంబును బతాకావస్త్రఫేనిలంబును బరలోకప్రవాహినియు నగురక్తప్రవాహంబు సువ్యక్తంబై సకలలోకభయావహంబై ప్రవర్తిల్లె నాసంకులసమరంబున ధుర్యోధనదుశ్శాసనకర్ణాచార్యులు క్రమంబున నకులసహదేవవృకోదరార్జునుల మార్కొని మదమాతంగంబులట్లు పోట్లాడం దొడంగి రట్టియెడ. 50

చ. నకులుఁడు రాజుపై నడరినం గని యాతఁడు డాపలించి కొం
చక బహుసాయకంబులు వెసం బరఁగించుఁడు నాతఁ డన్నిటిన్
దుకతుకఁ ద్రుంచి మించినను దోర్బలదుర్దముఁ డైననీసుతుం
డకట యనంగ నన్నకులు నార్చుచు నొర్చెఁ బరాఙ్ముఖుండు గన్. 51

ఆ. ఉలివు నాకసంబు నలరింప నీసూతి, చేత కెల్ల ప్రజలు ప్రీతి నొంది
మెచ్చి రిచ్చ నకులుఁ డెచ్చి వెండియు నిలు,నిలు మటంచు గవిసి కల నొనర్చె. 52

తే. దుస్ససేనుఁడు సహదేవుఁ దొడరి వడిన్ఁ,జూప నతఁ డొక్కశరమున సూతుశిరముఁ
దునిమెఁ దునిమినఁ దానె సూతుండు నగుచుఁ, జిత్రలాఘవసౌష్ఠవస్థితులఁ బెనఁగె. 53

క. మాద్రేయుఁడు రౌద్రమ్మున, క్షుద్రకము లసంఖ్యములుగఁ గొని యేయుఁడు నీ
భద్రాశ్వంబులు నొవ్వన, విద్రావము నొందె ప్రజలు వెఱఁగై కనం గన్. 54

వ. అప్పుడు మీదుశ్శాసనుండు. 55

ఉ. ఏతుల నాఁగఁ బట్టుటకు వేగతులన్ జతనించి రశ్ములన్
జేతుల నూని వి ల్లెడలి చిందిలిపాటున కోర్మ్యె దానికై
సీతుల కైనఁ బగ్గములు నిం కెటుఁ గింకిరి జాఱ నయ్యో నా
రీతిగ నున్న వానిఁ బయి రెచ్చి యరాతి నిగిడ్చెఁ దూపులన్. 56

ఆ. అతనిఁ గానఁ గర్ణుఁ డరుదెంచునంతలో, భీమసేనుఁ డతని బిట్టు దాఁకి

మూఁడువాఁడిభల్లముల నీడ్చి భుజములు,ఱొమ్ము గాఁడ నేసె దిమ్మదిరుగ. 57

మత్త. తోఁకఁ ద్రొక్కినత్రాఁచుపోలెను ద్రుళ్లి కర్ణుఁ డుదీర్ణుఁడై
పీఁక జూపుచు భీమసేనుని వేఁడివేఁడిశరంబులన్
గాక పుట్టఁగఁ బెట్టు మోదెను గాండ్రుకొం డ్రని తీండ్రమై
ద్రాఁకుకోల్పులు లట్లు వారలు దాఁకి పోరిరి భోరనన్. 58

సీ. పదపడి భీముండు గద పూని కర్ణుని,వేయుటయు నతండు పేరువాఁక
గద వేసి దానిని గడికండలుగఁ జేసెఁ,జేసినం బాండవుఁ డసుఁ జేసి
మరల గుదెం ద్రిప్పి పరఁగింప నాతండు,మరలించె శరపరంపరలఁ దాని
నది రయంబున భీమునరదంబుపైఁ బడఁ,బడగ గూలె నియంత బడలుపడియెఁ

తే. గనలి సాయకాష్టకమున గాఢ్పపట్టి,నిట్టఁబొడిచి కర్ణుని నగు చట్ట వాని
ధ్వజశరాసనములు శరావాపము నొగి, నింతలింతలు గావించె నింతలోన. 59

వ. అంతఁ గర్ణుండును వేఱొండువిల్లు గొని ఋక్షవర్ణవాహనంబులను బార్ష్ణిసారథులం
జక్కాడె నంత నక్కౌంతేయుండు విపన్నరథుండై పోయి నకులునితే రెక్కె నక్కా-
లంబున. 60

— ద్రోణార్జునుల ద్వంద్వయుద్ధము —

సీ. గురుశిష్యు లగుద్రోణనరు లిర్వురును దాఁకి,రథచిత్రగమనముల్ రమణ కెక్క-
శరయోగసంధానపరిమోక్షణాదులఁ, దెఱఁ గొండొరులకు నేఁ దెలియకుండఁ
జూచుఖేచరులకుం జోద్యంబు గలిగించి,హో వృత్తి పొగడెడునట్లు లేచి
కలయోధు లెల్లరుం గనుకలి వినుకలిం, దెలియమి నల్లొరుపొలుపు లూని

తే. తిరిగి సవ్యాపసవ్యముల్ తేజు మీఱఁ, యామిపార్థమహాస్పర్థ నిఱిమితిఱుము
శ్యేనములరీతి హెచ్చుకుం దెఱుకపడని, పగిదిఁ బ్రతిఘటించిరి శరప్రతిశరముల. 61

క. గురుఁ డేయ నరుఁడు దానిన్,నరుఁ డేయన్ గురుఁడు దాని నఱకుచు నరునిన్
గురుఁడును గురునిన్ నరుఁడును, శరమున మించంగ లేక చని రవ్వేళన్. 62

వ. అస్త్రమార్గవిశారదుం డగునాచార్యుండు వీఁ డెలంతులం దెఱువాఁడు గాఁ డని నిశ్చ
యించి యైంద్ర రౌద్ర త్వాష్ట్ర వాయవ్య వారుణాదిదివ్యాస్త్రంబులు సమంత్రకం
బులుగఁ బ్రయోగించిన యోగవిద్వరిష్ఠుం డగుయునిష్ఠితానుజుండు వానిం బ్రత్య
స్త్రంబుల వారించుటయుం గాంచి గురుండు సంభ్రమంబున. 63

ఉ. అద్దిర శస్త్రవిద్యపుల కందఱుకున్ మునిగాఁడు పేఁడు న
న్నుద్దవడిన్ వడిన్ మిగులునో యన నొప్పెనె యప్పనాకితో
నుద్దగఁ బోరి పేటుఁ గొనె నుద్ధర పనికి నె గురుండు నా

సుద్ది వచింప నేటికిఁ ద్రిశుద్ధిగ నెంచెద నేను ధన్యుఁడన్. 64

క. అని శిష్యమహోన్నతికిన్, మనమున నుప్పొంగి గురుఁడు మార్గణచయమున్.
పనితముగఁ జేసి నేయుచుఁ, బెనఁగెన్ బెఱువోక కవిసి భీభత్సునితోన్. 65

వ. అంత నంతరిక్షంబున దేవర్షి గంధర్వ సిద్ధ సాధ్య విద్యాధర యక్ష రాక్షససంఘంబు
లాగురుశిష్యులసాంపరాయికంబున కచ్చెరువడి మెచ్చుచుఁ దమలోన. 66

ఉ. ఈతఁడు మేలుచేయి యని యొంచఁగ వచ్చెడు నంతలోననే
యాతఁడు మేలుచేయి యగు నయ్యరె యియ్యనిఁ బోలునాల మీ
భూతలమంద కాదు సురభూములయందును మున్నెసంగి వి
ఖ్యాతి వహించియుండుటలు గిన్నది విన్నది కాదు లేదు ఛీ. 67

మత్త. వీరియిద్దఱతారతమ్యము వ్రేలువంచి వచింపఁగా
నేరి కయ్యెడిఁ జంద్రశేఖరుఁ డిట్టు రంపు తెఱంగులై
పోరు నాఁ దగుఁ గాని యొండులపోరు ముజ్జగమందు నీ
శౌరవర్యులపోరుతో సరిమూంచి పోల్పఁగ వచ్చునే. 68

తే. జ్ఞాన ముక్కండు గురునోద్దఁ గానవచ్చు, ననిన జ్ఞానము యోగము నర్జునునెడఁ
గానవచ్చును శౌర్య ముక్కండుగురున, కు నగు నన శౌర్యబలము లర్జునున కగును.

మ. పరు లెవ్వారలు గాన్రఁ జాలరు ధనుష్పాండిత్యమం దీమహా
పురుషాగ్రేసరులన్ మనం బగున యో మూర్తిద్వయం బిద్ద సా
మరలోకత్రితయంబు నొక్కత్రుటిలో మాయంబు గావింప నే
ర్చు రణాగ్రంబున నుగ్రబాణసమితిన్ జూపట్టె యిప్పట్టునన్. 70

వ. అని దేవగణంబులు ప్రస్తుతించుచున్న సమయంబున. 71

మ. ధనురాచార్యుఁ డసత్ప్రవిక్రమమున నవ్వేళ్ద్రి బ్రహ్మాస్త్రమున్
వినియోగింపఁ దలంచి పార్థునిపయిన్ వేరమ్మున న్వేయుఁడున్
వసుధల్ ఘూర్ణిలె మ్రోకు లెల్ల విఱిగెన్ గ్రావంబు లూఁగాడెఁ గుం
భిని గంపించె విహారిలంబు విసరెన్ బెల్లార్చ భూతంబులున్. 72

క. నరుఁ డంతన్ బ్రహ్మాస్త్రము,పరునడి సంధించి గురుని బ్రహ్మాస్త్రమునున్
మరలించె నిమిషలోనన్,బరిజన మంతయును బెలివిఁ బరఁగి రిలేశా. 73

వ. ఇట్లు పోరంబు గానక గురుశిష్యులు ఘోరయుద్ధంబు సేయుచున్నంత దుశ్శాసనుం
డాచార్యాసక్తుండై చనుధృష్టద్యుమ్ను నాఁగ శరాసారంబు వరఁగించుటయు మరలి
పాంచాలపుత్త్రుండు నీపుత్త్రుం దాఁకి వీఁక ననేకశతసహస్రసాయకంబుల సూతకే
తువీతినమేతుం బగువానినతాంగంబు మునుంగు నొట్టిన దిట్ట చెడి యతం డతనిన్ప్రము

టయు నతండును వానిపైఁ బ్రతిఘటించి. 83

చ. ఎనిమిదియమ్ము లాశినికులేశుని మేన నిగుడ్చఁగా నతం
డెనుబదితూపు లేసి దొర కేడ్గుఱ సూపె నతండు వెండియున్
గనలుచు ముప్పదింట మెయి గాఁడఁగఁ జేసి శినీశుచాపమున్
సునిశిత హాస్తుర ప్రమునఁ జూచుచు నుండగఁ జెండె రెండుగన్. 84

తరువోజ. అతఁడొండువిలుపూని హస్తలాఘవము,నరయఁ జేయుచుఁ బ్రదరాసార మొలికె
నతికుపితుండు నీయాత్మోద్భవుండు, నాశరజాలంబు నడఁగించి యాద
వతిలకమును ద్రిసప్తతిసాయకముల, బఱలించుటయుఁ గోపపరివృతుఁ డగుచు
నతఁడు నీసుతువింటి నట్టి ఖండించి, యంపఱఁ బరఁగించె నతిరభసమున. 85

వ. నీసుతుండు గాఢవిద్ధుండును వ్యథితుండునై కొంతవోక తొలంగి తెప్పిఱిల్లి వెండియుం దలపడినంత వారిపరస్పరబాణపరంపరలం జేసి రోదోంతరం బగమ్యం బయ్యె నయ్యెడఁ గ్రమక్రమప్రవర్ధమానబలుం డగుబలదేవానుజుం దిలకించి కర్ణుం దప్పతిదెప్పరంబు దప్పింపఁ దెప్పునం దఱిమి వచ్చునెడ వృకోదరుండు వాని నిలువరించి వాలంపగములు వఱగించినం గోపించి నవ్వుచు నవ్వసుషేణుండు. 86

చ. వడముడివిల్లు ద్రుంచి వడి వానినియంత దలంక నొంచుచున్
గడువడి నల్గుచున్ గదను గైకొని క్రిందికి వచ్చి గ్రచ్చుఱన్
సిడమును ద్రెంచి చేతివిలు చించి నియంత నడంగ నొంచి పె
ల్లడరి శతాంగచక్ర మడియాలము లో నొనరించి మించినన్. 87

తే. రాధకొడుకు కేకచక్రపురథమునంద,ద్వాదశాత్మునివలెఁ దేజు దనర నుండి
సప్తతురగోపమార్గసంచార మడర,బాణవృష్టిసహస్రముం బరఁగఁ జేసె. 88

వ. అట్టిసమయంబున ధర్మరాజు మహారథు లగుమత్స్యపాంచాలయోధుల నెలుంగెత్తి పిలిచి పురికొలుపుచు ని ట్లనియె. 89

మ. మనకుం బ్రాణము లుత్తమాంగములుగా మన్నింపనై యున్న యో
ధనికాయం బిటు లోల మానగొన కాదస్యువ్రజం బంటి రా
ఘనసంస్ఫోట మొనర్చుచుండఁ గనుచుం గానట్లు మీ రిట్లు జీ
వనముం గోరి విమూఢులై మెలఁగుటల్ భావ్యంబె భావింపఁగన్. 90

తే. క్షత్రధర్మంబునం బోరి చచ్చెనేని, భూరియజ్ఞంబు లొనరించి పోయినట్టి
వారు వొందెడులోకముల్ వీరు వొందఁ, గంరు గాన మీరలు లెండు కల నొనర్ప.

వ. అనిన రాజచోదితు లగువా రెల్ల రెండు మొత్తంబులై ద్రోణుం గదియఁ గొందఱును భీమసేనుం గవియ గొందఱు నమంద గతిం జని రంత నంతకంత కాచార్యునిబలుపు

రెట్టించినం గని భీమసేన నకుల సహదేవు లర్జునుం జీరి భారద్వాజుండు పాంచాలసేనల నెల్ల నేలకుం గోలకుం దెచ్చి పాఱఁ దోలుచున్నవాఁడు వానిబాఱిం బడిన నీవారిం గాచువాఁడన నైనఁ గొఱవులం బోయవలయు నట్లయిన వా రాగురుం బరిమార్పఁ గల రని యెలుంగు రాలుపడం బలికిన నతం డట్ల కావించె నాచార్యుండును గోలు ముసంగి పాంచాలసేనలం గనుపుగొట్టుచునుండె నట్టియెడ ధర్మరాజ భీమసేన నకుల సహదేవులు వెఱచి వానియవక్రపరాక్రమంబునకు విహ్వాలించుచుఁ గార్చిచ్చు శుష్క-తృణపుంజం బేర్చునట్లు మనమూఁకల నేర్చుచున్నవాఁ డీతనిలోఁతు లెవ్వరును నాఁగఁ జాల రర్జునుండును ధర్మపరుండై పగువకుం జొరఁ డూరకున్నవాఁ డని తలఁకి పలుకుకొనుచున్నంత మురాంతకుండు వారిచింతకుం జని నివాతకవచాంతకుం గని మెల్లన విన ని ట్లనియె. 92

—కృష్ణుండు ద్రో[illegible] చెప్పుట—

ఉ. ఆయుధపాణియై గురుఁ డహంకృతి సూపుచునున్న యంతకుం
డాయతతేజుఁడై భిదురహస్తుఁడు తాను సమస్తశక్తులుం
బాయక వచ్చినన్ దురమునట్లు జయింపఁగ లేఁడు శస్త్రవి
జ్జేయుని నిమ్మహామహుని దీనికి నే నొకమందు సెప్పెదన్. 93

ఆ. న్యస్తశస్త్రుఁ డైనయపుడ యాచార్యుఁడ,తని జయింపఁ గలుగుఁ దనయుఁ డీల్గె
ననఁగ విననమాత్ర నాయుధంబు దిగవిడ్చు నీతఁ డట్లు తగును సేయ. 94

మ. ఇది గా కొక్కయుపాయ మేదియును లే దిదాని ధర్మంబునం
బొందలం బోదని యున్న నెల్లబలమున్ బోకార్చు నొక్కింతలోఁ
బదయుం దగ్గరఁ జింతయుం దెలిసి యిట్లు విప్రుతో నాడఁగా
వద నన్న న్నరుఁ జెయ్యకోలు సలుపం దాపార్థయుష్మాకులై. 95

క. పెర తెల్ల నిదయ పోలుం, బరమాపద్ధర్మ మయ్యెఁ బరిహరిగతులన్
బరికించి యొట్టకేలకు, సరి యని యంగీకరించు శమనసుతుండున్. 96

శా. శశ్వద్రిక్రముఁ డైనభీముఁ డపు డశ్వత్థామ యన్ పేరునన్
విశ్వవ్యాపక మైనమాలవమహీశోద్యద్వేదండముం ద్రున్ని స
త్త్వైశ్వర్యమ్మును వెచ్చఁబెట్టి చని తద్వ్యాజమ్మునన్ ద్రోణుతో
నశ్వత్థామ గతించె నం చెలుఁగ రేఁయం బల్కె నుద్వృత్తగతిన్. 97

సీ. పరమాప్తి యం బైనపవమానసూనుని,పలుకు లాలించి చాపగురుఁ డేఁడఁద
జలియింప నొక్కింత ,కలఁగియుఁ గొడుకుతే,జంబు చావమి నిశ్చయించి తేఁట
తనకు మృత్యువు గాఁగ నొనరినపార్షతుఁ, గంకపత్త్రసహస్రకమున నొంచి

పాంచాలవీరునిర్వదినేలరథికులు, తనచుట్టుముట్టినఁ గినుకఁ జేసి
తే. తెలిచి బ్రహ్మాస్త్రమును సముద్దీపితముగ, సలిపి చేతులుఁ గాళ్ళును దలలు నులిమి
గుజ్జములఁ గూల్చి యేన్గులఁ గూలఁద్రోచి,వారి నందఱ ధరణికి బలి యొనర్చె. 98
క. వసుదానుండను సోమక,వసుధాధిపుఁ డెదిరి గురుని వాలంపగుమిన్.
బస దూల నేయ నాతని, వెస జమునికి నతిథి గాఁగ వెడలించె నృపా. 99
వ. మఱియుం గురుండు గండుమిగిలి మైదునూఱులమాత్స్యులను, నాఱువేలస్సృంజయు
లును బదివేలయేనుంగులను బదివేలగుఱ్ఱంబులను గూలనేసి విధూమపావకునివిధం
బున వెలుంగుచుఁ బాంచాలాంభావంబుం బరికించుచున్నంత హవ్యవాహపురస్సరు
లగువిశ్వామి త్రాత్రి గౌతమ వసిష్ఠ జమదగ్ని భారద్వాజ సికతపృశ్ని గర్గ వాల
ఖిల్య భృ గ్వంగిరః ప్రముఖు లగుమహర్షు లాభూదేవునికట్టెదుటం బొడకట్టి
యి ట్లనిరి. 100

—మహర్షులు ద్రోణునకుం బోడకట్టి యుద్ధంబు చాలింపు మని చెప్పుట—

ఉ. వేదము లెల్ల నేర్చితివి విప్రుఁడ వైతివి సత్యధర్మసం
వేదివి నీ వధర్మముగ వేరము సూపుచుఁ బో రొనర్చుటల్
మీఁదికిఁ జేటు దెచ్చెడిని మించినదానికి నేమి యింకిటన్
మాదగునానతిన్ గొనుము మానుము కత్తిని ముట్టి పోరుటల్. 101
మత్త. భూసురోత్తమ క్రూరకర్మము పోల దెప్పుడు గావునన్
మానమఱిమునందు నాయుధమార్గము న్విడి శాశ్వతం
బై సుఖం బిడుమార్గముం గను మయ్యెఁ గాలము నీ కిఁకన్
మోసపోకుము మోహపాశము ముట్టఁ బోకుము వెండియున్. 102
తే. బ్రాహ్మణుఁడ వయ్యు బ్రహ్మాస్త్రపాటవమున,నస్త్రవేత్తలు గానట్టియలంతిజనులఁ
గార్చి పాపిష్ఠతర మైనకర్మ మీవు,చేసి తిఁకఁ జేయకుండుట వాసి గాదె. 103
వ. అని యంతర్ధానంబు నొంది రంతలో నగ్గురుండు వారిపలుకు లెంచుచు భీమసేనుని
వాక్యంబుం దలంచి తనదండ ధృష్టద్యుమ్నుండు గండుమిగిలి యుంటం గాంచి విమ
నస్కుండై తల పంకించి కొండొకవడి విచారించి ధర్మనందనుం డసత్యంబాడఁ డని
నిశ్చయించి వానిం దిలకించి యశ్వత్థామ సచ్చెనో బ్రదికెనో చెప్పు మనుచున్నంత
సర్వలోకవిధ్వంసనంబు సేయునాచార్యుచిత్తంబునకు వ్యథితచిత్తుండై తత్తఱంపడి గదా
గ్రజుండు, పాండవాగ్రజుం గాంచి యి ట్లనియె. 104
చ. తెలియఁగ నాలకింపు జగతీవర నే నిజ మాడుచుంటి నా •
పలికినయట్లు చేయు మిఁక బ్రాహ్మణుఁ డిట్టులు మన్యుమూర్తియై

వెలుఁగుచు నొక్కపూఁట యని వీఁగకయుండిన నీదునెల్లమూఁ
కలు నశియించు నెట్లయినఁ గావఁగదే మము నెల్లవారలన్. 105

క. ఇట్టఖిలవినాశం బగు,పట్టున సత్యంబుకంటెఁ బరికింప వరం
బెట్టిది యైన నసత్యము,పుట్టదు పాపంబు దానఁ బురుషవరేణ్యా. 106

ఆ. అఖిల జీవితార్థమందుఁ గామినులందుఁ, బరిణయంబులందుఁ బ్రాహ్మణులకు
గోవులకును రక్ష గావించుపనులందు, బొంకు పాపమునకుఁ బోవ దనఘ. 107

వ. అంత వృకోదరుం డన్న కిట్లనియె. 108

సీ. ఏ మాలవుం డనుసింద్రవర్మనరేంద్రు,హస్తి నశ్వత్థామ యనెడుదానిఁ
జంపి యన్నెపమునఁ జచ్చె నశ్వత్థామ, యని గురునకుఁ జెప్పితిని నతండు
నామాట నమ్మక నీమీఁదినమ్మిక, నిట్లు నిన్నడిగె నోయిభపురీశ
నీవు గోవిందునీతి సంభావించి, చదువు మశ్వత్థామ సచ్చె ననుచు

తే. దానఁ బోరిఁగిపోవు నమ్మానధనుఁడు,నాఁవుడును ధర్మనందనుఁ డేవిధమున
నట్టు గాఁగలయది కాన నట్టకేని, వారు చెప్పినచొప్పునం బలుకఁ దలఁచె. 109

—ధర్మరాజు ద్రోణునితో నశ్వత్థామ చచ్చె నని యేనుఁగు నెపంబునఁ జెప్పుట—

క. అనృతభయంబు జయాశయు,మనమునఁ బెనఁగొనఁగఁ దెగువమై యమనం
దనుఁ డశ్వత్థామ మడిసె, నని యేర్పడఁ బలికి హస్తియని యల్లనన్. 110

వ. అని పాండవాగ్రజుండు, పలికినంత. 111

క. చతురంగుళోన్నతంబై, క్షితిమీఁదం దేలియాడుక్షితిసురునరదం
బతనికి నపజయ మతికెడు, గతిఁ గ్రిందికి నంటసిల్లెఁ గనుఁగొనుచుండన్. 112

వ. అప్పు డక్కుంభసంభవుండు. 113

ఉ. బొంకి యెఱుంగనట్టిగుణభూషణుఁ డట్టులు చెప్ప వించు లో
నంకిలిపాటు వాటిలఁగ నాత్మజుఁ డీల్గుట నిశ్చయించి మే
నింకిట నుండ నొప్ప దని యెంచుచు మానులమాటఁ జేసి తాఁ
గొంకక పాండుపుత్త్రకులకున్ జెడుగుం బొనరించినట్టిఁడన్. 114

క. అని పరమోద్విగ్నమనం,బున నై కట్టెదుర ద్రుపదపుత్త్రునిఁ గని తొం
టి నైజమార్గాన నోపమి, ననదవ్వలెం జూచుచుండె నాసమయమునన్. 115

శా. ఇష్టిం దుష్టి నెసంగునాద్రుపదువహ్నిజ్వాలకుండంబునన్
బుట్టిం ద్రోణవినాశనార్థ ముదయంబుం గొన్నవాఁ డౌట నా
ధృష్టద్యుమ్నుఁడు శాతసాయకము సంధింపంగ విల్వంచి ద
ట్టోష్ఠుండై కన నొప్పె నప్డు పరివేషోద్ధార్కబింబం బనన్. 116

ఉ. సంధితమై జ్వలజ్జ్వాలనుచందమునం దగునమ్ము చూచి యా
య్యంధకవృష్ణిముఖ్యులును నక్కురుముఖ్యులయున్ బాంగముల్
సంధిలు నంతకాల మని స్వాంతమునం దలపోసె ద్రోణుఁడున్
బంధము వోవు దీన నని బమ్మరిలెన్ దననెమ్మనమ్మునన్. 117

క. తనపైఁ బోఱగ వచ్చెడు,సునిశిత మగునస్త్ర మారఁగఁ జూచియు ఘటసం
జనితుఁడు ప్రత్యస్త్రముతో,పనిదానన్ ఆిచ్చవడియె వ్యసగతబలుఁడై. 118

ఉ. అరిదగ నార్జునా ళ్వోకత్రియామయు నొక్కదినార్ధ మర్ధమున్
పురి మొనరించియుం బగఱ దొప్పలుదోరలు గుప్పఁగూల్చియున్
శరధులు వట్టిపోవ నిజశస్త్రము లస్త్రములున్ స్ఫురింపమిన్
వరసుతశోక మెచ్చ మునివాక్యములం దలపోసియు స్మదిన్. 119

—ద్రోణుండు చావనెంచియుఁ బాంచాలురపైఁ గోపంబున మఱియుంబోరుట—

వ. అనికానొల్లనివాఁ డయ్యు నతం డరిప్రభావంబున కోరుపం జాలక సహజతేజంబునం జేసి పురికొని యాంగిరసంబగుచాపం బొందు గొని బ్రహ్మదండాభంబు లగుశరంబుల ధృష్టద్యుమ్నునిప్రదరంబులం బ్రతిహతంబులు గావించి వానిసూతకేతుకార్ముకంబుల గండరించిన నతం డొండొక్కచాపంబు పుచ్చుకొని చాపాచార్యుని పేరురం బాడనేయుటయు నతండును. 120

శితభల్లమునను బార్షతునివి ల్లమ్ములు, విఱిచి ముక్కలు చేసి వెండియు నతఁ
డూనుచాపంబు లాయుధములు ఖండించి, వానిపైఁ దొమ్మిదివాఁడిములుకు
లడరించి బ్రహ్మాస్త్ర మరివోసి నొగనొగ, నఱుమంగఁ దనతేరు నరుగఁ జేసి
పాంచాలసుతుతేరు భగ్నంబు గావించి, గద యెత్తినం దాని గండరించె
ఖడ్గఖేటంబులం గొని గండుమెఱసి,ప్రాప్తకాలము గురుఁ జంప ననుచు నెంచి
పార్షతుఁడు చాపగురుతేరిపైకి నేగి,యురము భేదింప నుంకించుతరుణమందు. 121

ఎర కడరుడేగ తెఱగునఁ,బరిపరిగతుల న్మెలంగుపార్షతు నాఁగం
గురునకు నుష్కర మయ్యెన్,బరమాద్భుత మగుచుఁ బెక్కుపరవ ల్లోప్పన్. 122

. రథశక్తిం గొని విప్రుఁ డాతనిహయవ్రాతంబులం ద్రుంచి సా
రథి నొప్పించిన వాలునుం బలకయుం గ్రాలంగ నాచార్యునిం
గ్రుధ పెంపొందఁగ వైనతేయుఁడు భుజంగుం బోలె బన్ధించుచున్
స్యథలం బెట్టఁగ నట్టు నచ్చి పడియెన్ హాహాయనన్ సైన్యముల్. 123

ఇట్లోతంచి యాజ్ఞసేని ద్రోణాంతంబు చింతించుచు భ్రాంత ముద్భ్రాంత మావిద్ధ
మాప్లుతము ప్రసృతము సృతము పరినృత్తము నివృత్తము కౌశికము సాత్వతము

మున్నగు నేకవింశతిఖడ్గమార్గంబులం బ్రచరించుచు నద్భుతప్రకారంబునం జరించినం జలింపక గురువరుండు వైతస్తికశరశతంబునం గరవాలశరవాణంబులు నఱికి మఱి యొక్క తీవ్రశరం బరివోసి యంతేవాసి నేయుటయు దాని నాసుయోధనకర్ణాదులు సూచుచుండ శినిపుంగవుండు సునిశిత ప్రదరంబులం జెగ నేసి పడవాలు నెడరు దప్పించి తనపై నడరినద్రోణకర్ణకృపుల మార్కొని వివిధాస్త్రప్రకారంబులం జేసి చూపఱు ప్రసంగింప నానావిధప్రకారంబుల విక్రమక్రీడలం దేలుచుండుటయుం గని శ్వేతవాహనుండు గరుడవాహనుదిక్కు మొగంబై యి ట్లనియె. 124

మ. మనశైనేయునిఁ జూచితే గురుముఖుల్ మాఱొడ్డి గోష్ఠంబుగా
సునిశాతాస్త్రపరంపరాప్రహతులన్ శోధించి నేధించినం
దనబాహాబల మామరస్తుతికిఁ జెందం జేయుచున్నాఁడు నా
కును నావారికిఁ గల్గు సంతసము వాకో నొప్పెడిం గేశవా. 125

వ. పదంపడి. 126

మ. కృపకర్ణాదులతో భవత్సుతు లొగిం గృష్ణానుజుం దాఁకి ప
ల్లుపరోధించి మహాస్త్రశస్త్రముల నెంతో వింత సాఁగించుచున్
విపరీతార్థ మెదం దలంచి నృపుఁడున్ భీముండు మాద్రేయులున్
సహదాతుల్ సని తోడుసూపుటయు నా శైనేయుఁ డత్యున్నతిన్. 127

క. అవ్వారిగాఁగ వచ్చెదు, నవ్వారలశరము లెల్ల నర్థాధ్వమునం
దెవ్వొంగఁ జేసి పశుపతి, నవ్విష్ణుశరుండు వోలె నంచల్లెఁ దోలెన్. 128

చ. తలలును గాళ్ళు సేతులు రథంబులు ఖడ్గంబులు నాతపత్రముల్
పలకలు వాలుఁగుం గదలు పత్రులు నుత్తమవాహనంబులున్
విలవిలఁ దన్నుకొంచుఁ బహువీరులు బోరునఁ దుక్కుతుక్కులై
పాలికల నెల్ల నల్లఁ బడి ప్రోవులతావుల కయ్యె నయ్యెడన్. 129

తే. అపుడు ధర్మజుఁ డఖిలయోధాగ్రసరులఁ, బిలిచి యిట్లను ద్రోణుఁ బిలుకుమార్వ
నేపు సూపెడుఁ బార్షతుం డర లెల్ల, వానికిం దోడుపడుఁ డొప్పు మిగుల నడగ. 130

చ. అనవుడు వారలెల్లరు రయంబునఁ గుంభజుఁ జుట్టుముట్ట న
య్యనఘుఁడు వారి మాఱుకొనె నప్డు చలించె ధరిత్రి వాయువుల్
మునువడి వీచె నుల్కలవి ఘోరసరాల వెలింగె శస్త్రముల్
ఘనముగ మ్రోసెఁ దేరులును గన్నుల నశ్రులు రాల్చె గుఱ్ఱముల్. 131

మ. కృతహస్తుం డగుకుంభసంభవుఁడు మున్ దీక్షించి పాంచాల్యునిన్
హతశేషుం డయి నట్టులై యదర వామాక్షిప్రనేత్రంబులు

స్నతి పేఁశ స్మృతి బ్రహ్మవాదుల నుడిఁ సంధించి ప్రాణంబులఁ
నుతిపాత్రుం బగునాహవంబున విడఁ యోజించె స్వర్గార్థియై. 132
తే. సలుగడం జుట్టుముట్టిన బలము సఱిమి, యిరువదిసహస్రముల క్షత్రివరుల మఱియు
లక్ష కాలుమానిసులను లలిగఁ దునిమి,ధూమరహితాగ్ని వలె నొప్పె భూమిసురుఁడు.
వ. మఱియు సర్వక్షత్రియవినాశనార్థము బ్రహ్మాస్త్రము సముద్దీపితంబు సేయుచున్న స
మయంబున భీమసేనుండు విరథుండును పీతాయుధుండు నగుధృష్టద్యుమ్నుం దనర
థంబునం దిడుకొని భార మంతయు నీతలం బడియున్నయది నీవు దక్క నాచార్యు
నుక్కడంచు వాఁ డొక్కఁడును లే డురవడింపు మనిన నతం డొక్కకార్ముకంబు
గొని దివ్యాస్త్రంబు లడరించి బ్రహ్మాస్త్రంబు వారించి బ్రాహ్మణోత్తము నుత్తమ
శరంబులం గప్పి వాని సర్వాస్త్రంబులును వమ్ము గావించి శిబి వసాతి బాహ్లీక కౌర
వాదిబలంబులం బ్రెల్లి సేయుచున్నంత ద్రోణుండు వానివిల్లు విఱిచి వర్మంబు వగి
లించి మర్మంబులు గాఁడ నేసిన నతండు సొమ్మసిల్లుటయుం గని వృకోదరుం డాచా
ర్యుం డాయం జని మందస్వరంబున నిట్లనియె. 134
సీ. నిజధర్మనిరతులై నిలువక బ్రహ్మబం, ధులు పోరి రే క్షత్రమిల నశించు
నన్నిట సర్వభూతాహింస పరమధ, ర్మం బయి యొప్ప నీమహితలమున
మూల మట్టిసుధర్మమునకు బ్రాహ్మణు లీవు, బ్రహ్మవిద్వరుఁడవు బ్రాహ్మణుఁడవు
నట్టినీవు శ్వపాకునట్లు నిర్దయుఁడవై, యీమణత్రయము నిచ్చఁ జేసి
తే. ప్రాణిహింస పౌనర్భంగఁ బరఁగి యెంటివి, కొడుకుఁ బ్రోవ స్వకర్మమం దడరు పెక్క
రను నకర్మమునం దగుజనుఁడ వీవు, నొందుగుంటివి సిగ్గు లేకుండ నకట. 135
తే. ఎవనిఁ గనుఁగొని భ్రదుకుదో యెవనికొఱకు,శస్త్రమును ముట్టితో వాఁడు సచ్చె నిట్లు
నీ వడుగ ధర్మతనయుండ నిజము సెప్పె, నేఁటికో సందియంపడ నిపుడు చెపుమ.
వ. అని భీమసేనుం డనిన నప్పురుషవరేణ్యుండు శరశరాసనంబులు విడిచి యెలుం గెత్తి.
క. ఓకృప! యోదుర్యోధన!, యోకర్ణ! శరంబు విడుతు నుగ్రావహమం
దేకరణిఁ గడంగెదరో, వాకొంటిఁ మీకు మేలు వర్తిలుత మనిఁ. 138
వ. అని శస్త్రంబులు విసర్జించి కొడుకుచావునకుఁ గొంతవగచి రథంబుపయిం గూరు
చుండి సర్వభూతంబులకు నభయం బొసఁగి యోగం బనుసంధించె నంతలో ధృష్ట
ద్యుమ్నుం డుద్ధతుండై లేచి శరశరాసనంబులు రథంబుపయిం బెట్టి కరవాలంబు
గొని లాఘవంబున లంఘించి గురునిపయిం గవిసిన నెల్లభూతంబులును హాహాకా
రంబు గావించి వాని నిందించె నాచార్యుండును బరమం బయినసాంఖ్యయోగధార
ణంబు గావించి కించిదున్నమితాననుండై యురమ్ము విఱుఁగ నిగిడి పరమాసనోప

విష్టుండును నిమీలితనయనుండు నై యేకాక్షరం బగునోంకారం బుచ్చరించుచు నక్షరంబును బరమంబు నగుపరబ్రహ్మంబు హృదయపద్మంబున నిలుపుకొని తదేక ధ్యానంబు సేయుచు మేను విడిచి జ్యోతిర్భూతుండై యనన్యదురాక్రమం బగుదివం బునకుం జనియె నాకర్ణింపుము. 139

—ధృష్టద్యుమ్నుఁడు మృతుఁడైన ద్రోణునికంఠముఁ దునుముట—

సీ. కురురాజ యప్పుణ్యపురుషునితేజంబు, హరిదశ్వమండల మంటెనప్పు
డిద్దఱ సూర్యులక్ బుద్ధి మా కుదయించె, నవల నేకాకృతి నధిగమించె
జ్యోతిర్మయం బయ్యె వ్యోమ మంతయు నంత, నింతలోఁ దేజ మదృశ్య మయ్యెఁ
గిలకిలాశబ్దంబు లెలిసెఁ బ్రహ్మోత్సాత్ము, లగువేలుపుల మూఁకలందుఁ బొంద

తే. నట్లు తను వీఁగి గురుఁ డేగునవసరమున, మానవులయందు నేనును మాధవుండు
శ్వేతవాహనధర్మజుల్ గౌతముండు, నెవ్వరము కంటి మొగలెవ్వ రెఱుఁగ రిట్లు.

వ. నేను కృష్ణద్వైపాయనానుగ్రహంబున నది యంతయుం గనుంగొంటి నిట్లాచార్యుం డాకర్ణపలితుండును నెనుబదియేండ్లవాఁడు నయ్యుం బదియేనేండ్లవాని తెఱంగున సంగ్రామంబు గావించి పరమపదం బలంకరించినపదంపడి ధృష్టద్యుమ్నుండు నిష్ఠురుండై మృతుం డైనగురుం దఱియ వచ్చి. 141

చ. పలితము లైనకేశములఁ బట్టి యసిం దెగ నేసెఁ గంఠమున్
వలవదు చంపఁగా వలదు వాలు మరల్పుము ప్రాణవాయువుల్
గలుగఁగఁ బట్టి తె మ్మనుచుఁ గవ్వడియుం బెరవారు చక్కన
ప్పలుకుల నాలకింపక కృపారహితుండును గ్రూరచిత్తుఁడై. 142

ఆ. కుతుకఁ గోసి యట్లు క్షితి కట్టెఁ బడఁ ద్రోచి, శిరము నీదునూతునికరిసరమునఁ
బడఁగ విసరి నెత్తురువఱ్ఱునఁ బడి బాల, భానుఁ డట్లు దోఁచెఁ బార్థివుండ. 143

ఆ. గురునిశిరముఁ గాంచి కురుసైనికులు భీత, చిత్తు లగుచు మిగులఁ దల్లడించి
యుసురు లెడలినట్టు లుత్సాహ మెడ పీఁక, విఱిగి పఱచి రపుడు వెచ్చనూర్చి. 144

తే. పాండవబలంబు జయమును బడసి యట్లు, బహులశంఖాదరవములు పర్వఁ జేసె
భీమపార్థులు లానంద మాముకొనఁగ, గాఢపరిరంభణంబులఁ గట్టుకొనిరి. 145

వ. అంత వృకోదరుం డాధృష్టద్యుమ్ను మోముపైఁ జూడ్కి నిలిపి యి ట్లనియె. 146

చ. ఉరియుచు సూతపుత్త్రుఁడు సుయోధనుఁడుం దెగినప్డు పెండి యి
క్కరణి జయంబు గొన్న నినుఁ గౌఁగిటఁ జేర్చెద నంచు నెంత యే
నురవగుబాహుశబ్దమున నుర్వి వడంకగఁ జేసెఁ దద్రవ
స్ఫురణమునన్ భవజ్జనులు పోయినపోకన పోయి రెల్లరున్. 147

— నారాయణాస్త్రమోక్షపర్వము —

వ. మఱియు నట్టియెడం గౌరవసైనికులు హతప్రవీరులై కన్నీరునించుచు లేటమొగంబులు వెట్టి పైకొని తఱిమి వచ్చు నరులు పెచ్చుం గని ఱిచ్చపడి వెచ్చనూర్చుచు నుత్సాహంబు దక్కి చచ్చినవారింబోలెఁ గళ్వలంబు నొందియుఁ గుందియు డిందియు వెఱచఱచియు వెగడుగుడిచియు డగ్గుత్తిక వెట్టియు నఱచియు నలుగడఁ బఱచియు హిరణ్యాక్షునధానంతర మసురుల ట్లసురుసురు మనియు నత్యంతక్షుత్పిపాసాతపంబులం ద్రొక్కియు నాయుధంబులపాటున కాటుపోటులం జిక్కియుఁ జెయ్వులం దక్కియు నుక్కు చెడియు నక్కటంబడియు నక్కుంభసంభవహతసంబు సముద్రంబు లింకుట మేరువు చలించుట యని సంభ్రమించుచు నెట్లోర్వ వచ్చునని సంబంధిబాంధవుల వితర్కించుచుఁ దుదియు మొదలుం గానక మాఱుమొగంబు వెట్టి మరలి మరలి చూచుచు నిలు నిలు మేను వచ్చెద నని తమవారిం జీరుచు వెలవెలంబాఱుచు దారివట్టి కనుకనిం బాఱి రట్టిపరమసంమర్దంబున. 148

సీ. కాలూఁదఁగా లేక గాంధారపతి త్రస్తుఁడై రథంబులతోడ నవలఁ జనియె
బలము నవహానిం బరికించి సూతపుత్త్రుఁడు భీతుఁడై పోరు విడిచి నడచె
చతురంగవాహినీసహితుఁడై శల్యుండు, వెగడు గుడుచుచు మాఱు మొగము వెట్టె
హతసైన్యములఁ గాంచి హా కష్ట మనుచు శా, రద్వతుం డూర్చుచు రణము విడిచె
తే. మిగులు కాంభోజబలములం దగిలి వెంట, నంట నారట్టబాహ్లీకు లఱిముఱి గొని
వెఱచి వెన్నిచ్చెఁ గృతవర్మ యవఁజొచ్చె, వడకుచును లూఁకుఁడు గుఱుఁడు వడఁగఁ జూచి.

చ. పసుచుతసంబునం దనయువాఁడును వీడని శౌర్యసంపదం
బఱిమెడువాఁడు నీకొడుకు ప్రాణము లట్టెఁడు దుస్ససేనుఁడున్
వడకుచు నోల మానపడి వాసి దొలంగఁ గలంగి యేనుఁగుం
దడములఁ జేరి పాఱె రణధారణికి న్వెసి కాందిశీకుఁడై. 150

క. ఈరైదువేలు రథములు, వారణములు మూఁడువేలు వడి వెంబడి రాఁ
బో రీఁగి కర్ణపుత్త్రుం, డారటపడి పాఱె ద్రోణుఁ డట్లు పడంగన్. 151

క. కసు లశ్వంబులు గాల్వురు, నరదంబులు వేనవేల కయి చుట్టుకొనం
గురురాజు బ్రదికియుండెనుఁ, బరికింత మటంచుఁ బఱచె భయమున నధిపా. 152

తే. శేషసంశప్తకగణంబు చెట్టఁబట్టి, వెట్ట నూర్చుచు నాచార్యువిధ మెఱింగి
వెగడుగుడిచి సుశర్మ పెల్లగడుఁగాఁ బ, లాయనము చేసెఁ బెరవారలం దలఁపక.

వ. మఱియుం గలపోటుమానిసు లెల్లరును నల్లంత దవ్వులనుండియు రుక్మరథుండు ఖండితుం డగుటఁ గని యొండొరులం బిలుచుకొనుచు నుండినచోట నుండక గజాశ్వ

మహో॥. వల దని సేయ నావలఁ బోవు టొప్పు, వడివడిఁ బార్థ తవాసుదేవాను
జులు తమతమవారి సుగ మెంచుకొనుచుఁ, జుట్టువాతెడునగ్నిసుడులు దప్పంగఁ
గలవారలును మాకుఁ గాఁ గీలిఁ బడక, కనుకనిం దొలఁగుట కడులెస్సమాట
వలమురిదాలుపు వలయుచందమున, వర్తించు నతని కేఁ బలుకంగఁ గలనె. 243
లోకములకు నుపదేశము, చేకొని చేయంగఁ జాలు శ్రీకృష్ణునకున్
వాకొనఁగ నేల తనర, తూకార్యము తాన చూడఁ జాలుఁ దలంపన్. 244
తమ్ములును నేను నియ్యనలమ్ము సొచ్చి, చచ్చెదము భీష్మకుంభజసాగరంబు
దాఁటితిమి ద్రోణిగోష్పదోదకము దాఁట, లేక పోతిమి ప్రీతుఁడౌఁ గాక దాయ. 245
ఆరితేఱినిసుభద్రాత్మజుం బదుగుర, చేఁ జెప్పి చంపించెఁ జివ్వ నెవ్వఁ
డలసభం ద్రోవది యడిగినధర్మసం, దేహముం దీర్చక తెఱలె నెవ్వఁ
డాడితప్పిన నగ్ని కగునరుఁ డనునప్పు, డినునకు మై మఱు విచ్చె నెవ్వఁ
డని నాకుఁ దోడ్పడునాసత్యజిన్ముఖ్యు, లను జంపె బ్రహ్మాస్త్రమునను నెవ్వఁ
డపపులకు మ మ్మనుచు నప్పు డట్లు తగదు, నాక యూరక యుండె నాలోకవిదితుఁ
డస్త్రగురుఁ డట్టివిమలసౌహార్దహృదయుఁ, జంపితిమి గాన మే మెల్లఁ జచ్చు టొప్పు.

—. శ్రీకృష్ణుండు శస్త్రాస్త్రంబులు విడిచి పోరు మానుఁ డని సైనికుల కాజ్ఞ యిచ్చుట .—

అనుచున్నంత మురాంతకుండు త్వరితుం డై మీఁదికిం జేతు లె
త్తి నెఱిం బెద్దయెలుంగునన్ మనుప నుద్దేశించి యోధాళి నో
జనులారా! విడుఁ డస్త్రముల్ డిగుఁడు శశ్వద్వాహనాళి న్వడిన్
మన మ ట్లుండినఁ గాక చంపు నిది సామాన్యంబు గా దారయన్. 247
కత్తి పట్టి పోరఁ గా నున్న వాని ని,య్యస్త్రరాజ మెట్టు లైనఁ గాని
నెందుఁ జొచ్చె నేని యెంత లెంతల నైనఁ, ద్రెంచు నెదుర రాదు దీని కెవఁడు. 248
అని నారాయణుండు నారాయణాస్త్రప్రభావం బానతిచ్చిన విని సైనికు లెల్లరు
నాయుధంబులు పెట్టి గజతురంగస్యందనాదులు దిగ నున్నసమయంబున సమీరకు
మారుండు వారిం జీరి యి ట్లనియె. 249
సైనికులార మీ రిపుడు శస్త్రములన్ విడనాడి పోరుకో
మానకుఁ డే భయం బరుగ మార్కొని నాదుగదాశనిప్రభన్
మానిచి పుత్తు నియ్యెడరు నాకెనవచ్చుబలాఢ్యుఁ డెవ్వఁడున్
గానఁగ రాఁడు నాభుజయుగంబును జూడుఁడు కూల్చుఁ గొండలన్. 250
నాగాయుతసత్త్వుండను, నేఁ గల నొక్కండ నాకు నింద్రుఁడు పురుడే
హీఁగకుఁడు ద్రోణి నస్త్రము, నేగతికిం దెత్తునో యొకింతన కనుఁడీ. 251

వ. అని పలికి గాండీవంబు డిగ విడువ నున్న గాండీవిం గాంచి. 252

ఆ. విజయ! విజయ! విడకు విడకుము గాండివ,మది శశాంకునందు నంక మట్లు
నీకు నంక మగుచు నీకీర్తి మాయించు, ననుడు నన్న కనియె నర్జునుండు. 253

ఆ. నాకు వ్రతము గలదు నారాయణాస్త్రము,నందు భూమిసురునియందు గోవు
నందు భయము భక్తి యగుఁ గాన గాండివ,మెత్త కుండువాఁడ నెప్పుడేని. 254

సీ. అని ప్రతికూలోక్తు లాడిన గాడుపుఁ,గొడుకు కడరి మహోగ్రకోపుఁ డగుచు
నతిరయంబున ద్రౌణి నతిమి శరాసార, మడరించె నెంతయు నతిశయిల్ల
నవ్వేళ నాచార్యనందనుం డతిముత్తె,పడ కస్త్ర మెంతయుఁ బ్రబలఁ జేయఁ
గ్రక్కుచు విస్ఫులింగము లగ్గిములుక్కలు,వెడలి వ్రేల్మిడి వడముడినిఁ గప్పె

తే. నప్పు డనిలోద్ధతం బగునసలమట్లు,మంట లెగయ నస్త్రము భీము నంటఁ గాంచి
పార్థసైనికు లస్త్రముల్ పట్టమాని, ధరకు లంఘించి రెల్లరుఁ దత్తఱిల్లి. 255

క. జ్వాలామాలాకులుఁడై, జాలిం గొని గాలికొడుకు సంభ్రమముపడన్
గోలం గని హాహాకృతు, లాలింపఁగఁ జేసి రెల్ల రందు నరేంద్రా. 256

క. నారాయణాస్త్రబర్హిః, పూరమునం బడినవాయుపుత్రునిపైఁ దే
జోరక్షార్థము పార్థుఁడు, వారుణ మస్త్రంబు వైచె వడి యుడుగంగన్. 257

క. అది యించుకించు కుష్ణత, నదలించుచు నుండ ద్రౌణి యస్త్రము ప్రబలం
బొందవించెఁ బ్రలయవహ్నికి, బదులై యది భీముఁ బొదివె భయదం బగుచున్. 258

శా. జ్వాలాభీలమహాస్త్రసంవృతనిజాశ్వస్యందనస్ఫూర్తి యై
జాలిం బొందెడువాయునందనునిపైఁ జేల్వారి జ్యోతిస్సులం
బోలింపం దగుచిచ్చుటంపఱలు పెంపుం జూపుచున్ బై పయిన్
వ్రాలం జొచ్చె రణోర్వి సర్వ మనలప్రాయంబమై తోఁపఁగన్. 259

క. ఉరుతరకల్పమునఁ జరా, చర జగముం గాల్చి వహ్ని శర్వునివదనాం
తరమందుఁ జొచ్చుకరణిన్, భరమై శరవహ్ని భీముపయిఁ జొచ్చె వడిన్. 260

తే. సమయమున నగ్ని రవిఁ జొచ్చుచందమునను,రవియు నగ్నిలోఁ జొరఁ బాఱుక్రమమునను మ
హోత్కరం బగు తేజ మత్యుగ్ర మగుచు,నావరించె వృకోదరు నగణితముగ. 261

—. నారాయణాస్త్ర ప్రపీడితుం డగుభీముఁ గృష్ణార్జునులు రక్షించుట .—

వ. ఇట్లు భీమసేనుండు నారాయణాస్త్రంబునకుఁ జిక్కుకొని దిక్కుగాన కుంటయు
నక్కుంభసంభవసంభవునకు మాఱు మలయువారు లేకుంటయు యుధిష్ఠిరాదులు
సమస్తసైన్యంబులతో విముఖు లగుటయుం గని వాసుదేవార్జునులు త్వరమాణులై

రథంబు డిగ్గి రయంబున భీమసేను రథంబు డాయం బఱచి గురుసంభవసంభవం బగు తేజంబున మునింగియు నరవారుణాస్త్రబలంబున వినాశనంబు నొంద కప్పటి కొప్పు చున్న వృకోదరుని గని నారాయణాస్త్రశాంతిం గోరి సాయుధుండవై రథంబు డిగు మని చేయి పట్టుకొని లాగుచుండ నతండు రాక బిగువుం జూపుచు న్నార్చుచున్నంత నయ్యస్త్ర మంతకంత కతిశయించుచుండ వాసుదేవుండు. 262

ఉ. ఏమిది యెంత చెప్పిన నొకించుక కొంచవు పోరు మాన వే
మేమెయినే జయింపఁ గలమే నిటు లూరక చూచుచుండుమే
భూమికి డిగ్గి పొమ్ముదుమె పూరుషసింహమ! మమ్ముఁ జూచి నీ
వేమియు నాక తే డ్డిగఁగ నిచ్చ యొనర్పుము నేర్పు పెంపునన్. 263

క. అని పలికి వారు పన్నఁగ, మును బోలెన్ రోఁజుభీమభుజములు గొని భూ
మిని ముట్ట నీడ్చి శస్త్రములు నవలఁ బఱఁ ద్రోచి రింతలో నస్త్రంబున్. 264

ఉ. శాంతి వహించె దిక్కులు ప్రశాంతము లయ్యెఁ బ్రసన్నవాతముల్
సంతత మయ్యె యోధులును సంతస మందిరి వాహనంబులున్
గొంతటిలోనఁ దేఱుకొనెఁ గ్రూరతరం బగునగ్నిమంటయున్
వింతగ నాఱెఁ దేజరిలె భీముఁడు రేపటిభానుఁడో యనన్. 265

వ. అట్లు నారాయణాస్త్రంబు ప్రశాంతిఁ బొందిన నందలియోధు లాయోధనంబునకుం గడంగిన నీపుత్త్రుం డాచార్యపుత్త్రుం గాంచి మఱియు నమ్మహాస్త్రంబు ప్రయోగింపు మనిన నతండు దీనుండై నిట్టూర్పు నిగిడించుచు నతని కిట్లనియె. 266

మ. ఒకవారంబ ప్రయోగయోగ్యమగు నియ్యుగ్రాస్త్ర మేయుంగ నిం
కొకమా ఱేసినవానిఁ జంపెడిన యీయుక్తిం బ్రతీఘాత మా
నకలేశుండు పొనర్చె శాత్రవులు నాశం బంద రద్దాన నా
జికిఁ గా కీగుట కన్నఁ జచ్చుటయు మే లేనూరఁగాఁ జేసెడిన్. 267

క. కావున వారు మృతోపము, లేవంవిధి జయము మనకు నేర్పడె ననుడున్
భూవిభుఁ డట్లగు నేనిన్, జేవ మెయిం బోర నీక చెల్లుం జుమ్మా. 268

క. శర్వునకుం బోలె నీకున్, సర్వాస్త్రంబులును గలవు సంగ్రామమునన్
గీర్వాణపతియు నెదుర వి, గుర్వింతువు శత్రుసమితిఁ గూల్పఁ గడుగునూ. 269

వ. అని చెప్పినఁ బిత్త్రవధాభిమప్తి తస్వాంతుం డగునశ్వత్థామ సింహలాంగూలకేతనంబు గ్రాలఁ బాంచాలనందను నక్కజంబుగఁ దాఁకి యిరువదియునైదు కుప్పెకోలలం గు ప్పాటయు నతండును. 270

—అశ్వత్థామ పాండవవీరులతో మహాయుద్ధంబు సేయుట—

చ. అఱువది నాల్గు బాణముల నారథి సారథి నిర్వదమ్ములన్
మఱియును నాల్గుతూపులను నాల్గుతురంగములన్ నొగిల్చి పె
ల్లఱచిన నొర్వ కాద్విజుఁడు నాతని కేతనకార్ముకంబులన్
బఱియలు చేసి సూతరథవాజులఁ వ్రాలఁగ నేసె నుగ్రసన్. 271

తే. పదిశరంబులు వెండియుఁ బార్షతునకుఁ, బఱపి శత్రుసైన్యమును బాణపంక్తిఁ గప్పెఁ.
గప్పినఁ గుప్పగూలియు ముప్ప గనియు, వెఱచి వెన్నిచ్చియు బలంబు విఱిగి పఱచెఁ.

వ. ధృష్టద్యుమ్నుండు పీడితుం డగుటయు మూఁకలు చీకాకు పడుటయుం గని శైనే
యుండు తఱిమి వచ్చి యశ్వత్థామం దాఁకి. 273

సీ. ఇరువదెన్మిదితూపు లేసఁగించి యతనిపై, నాల్గింట హయములఁ నాఁట నేసి
సూతు నొక్కట నొంచి కేతువుం ధనువును, ద్రుంచి రథంబును దూఁగఁ జేసి
మఱియు ముప్పదివాఁడిమార్గణంబులు ఱొమ్ము, నను గ్రుచ్చినన్ గురుతనయుఁ డలసి
సొలయుటయును నీనుసుతుఁడు శారద్వత, కర్ణాదులం గూడి కనలి వచ్చి

తే. శినివరుని నేసె నపుడు నీతనయుఁ డిర్వ, దిటఁ గృపుడు మూఁటఁ గృతవర్మ తెగి పదింటఁ
గర్ణుఁ డేఁబదింటను వడిఁ గర్ణసుతుఁడు, నేఁడిటను దుస్ససేనుఁడు నేచి నూట. 174

ఉ. అందఱ కన్నిరూపు లయి యయ్యదువీరుఁడు నాశనంబులన్
స్యందనముల్ వగిల్చియును సారథులన్ వధియించి రథ్యముల్
ద్రుంగఁగఁ జేసి వ్రేల్మిడిని మ్రాన్పడఁ జేయుఁడు నంతఁ జేతనన్
బొంది యమర్చుచున్ గురునిపుత్త్రుఁడు వేరొకఁ డెక్కి యుక్కునన్. 275

తే. ఆఁగి సాత్యకిపై నిశితాశుగములు, గములు నిగిడించుటయుఁ గాంచి కసలువోడము
శినివరుఁడు పొడిచియున్ వాని శితశరములు, విరథుఁడున్ విముఖుఁడు నై వెలఁగఁ జేసె.

వ. ఇట్లవక్రవిక్రమంబు మెఱయఁ జక్రధరానుజుం డాక్రమించి నిజబలంబులు శంఖనాద
సింహనాదంబులు పెల్లడరుచుండం బయికొని. 277

సీ. వృషసేను త్రిసహస్రవీరులఁ జా నేసి, కృపునిగజాయుతం బపుడు కూల్చి
శకునిపంచాయుతాశ్వపములను సమయించి, విక్రమాటోపంబు వెలయఁ జేసి
క్రమ్మఱ వేఱొక్కకనకరథం బెక్కి, గురుపుత్త్రుఁ డతిమినం గొసరి కొసరి
శరపరంపరలను బరఁగించి నొంచిన, గురుసూతి సాత్యకిం దఱిసి యనియె

తే. యాదవా! నీకు గురుఘాతి యైనవాని, మీఁదిప్రేముడి తెలిసె నే మీఁదఁ గవియఁ
వానిఁ గావఁ జాలరు నీవు గాని నీగు, నన్నయును గాని భీభత్సుఁ డైనఁ గాని. 278

ఉ. బాస యొనర్చి చెప్పెదను బాహుబలంబున సోమకాన్వయం

బీసమరంబునందు నశియింపఁగఁ జేయక పొంద శాంతిని
వీసర వోనిశౌర్యమునఁ గృష్ణులుఁ బాండవులున్ స్వశక్తికిం
జేసి ప్రతిక్రియం గలుగఁ జేసికొనుం డిదె చూడ నుండెదన్. 279

క. అని పలికి సూర్యరశ్మికి, నెనవచ్చెడుతీవ్రశరము నేడ్తెఱ నేయం
జని శరము కవచభేదం, బొనరించి ధరిత్రిఁ జొచ్చె నురగోపమమై. 280

తే. సాత్యకి విదీర్ణకవచుఁడై సాలువాఱు, నెత్తుటం జొత్తిలుచు సోలినెఱి సెడంగ
రథముపైఁగూలఁబడియెసారథియురథము, తొలఁగఁదోల్కొనిచనెఁబెద్దదూరమునకును.

వ. అంత నశ్వత్థామయు నతిరయంబునం బఱచి ధృష్టద్యుమ్ను నఱిమి వానిభ్రూమధ్యం
బున నసాధ్యం బగునొక్కదివ్యశరంబు నాఁటిన నతం డంతకు మున్న నొచ్చి యున్న
వాఁడు గావున నయ్యమ్ము తాఁకునం బెద్దయు నొచ్చి కేతుదండ మూఁత గొనియె
నయ్యెడరు సూచి భీభత్సుండును భీముండును బౌరవుం డైనబృహత్క్షత్రుండును
మాలవుం డైనసుదర్శనుండును జేదియువరాజు ననునేవురు దొరలు ద్రోణాయనిం
జుట్టుముట్టి యెదేసి శరంబుల నొవ్వ నేయుటయు నతఁ డన్నితూపుల వాని నన్నిం
టినిం దునిమి యేడువాఁడినారసంబులఁ బౌరవుని మూఁడువాఁడికోలల మాలవుని
నొక్క మొక్కవోనిసాయకమ్మున నక్కిరీటిని నాఱునారాచంబుల వృకోదరుని
నొంచుటయు మించి శిశుపాలపౌత్రుండు వింశతివిశిఖంబులును విజయుం డెనిమిది శ్రద
రంబులును దక్కనుం గలవారు మూఁడేసికాండంబులును నశ్వత్థామపై నక్కురించిన
నతండు గండుమీఱి గాండీవిం బదికాండంబులను వాసుదేవుం బంచాంశుగంబులను
భీమసేను నేనమ్ములను యువరాజు నాలుగు నారసంబులను మాలవపౌరవుల
రెండేసి తూపులను నేపుడిసి వడముడిసారథి నాఱింట నొప్పించి రెంటఁ గార్ముకం
బును సిడంబును ద్రుంచి క్రచ్చఱ వివ్వచ్చునిపై శరాసారంబు గురిసి సింహనాదంబుఁ
జేసి దరియ వచ్చిన సుదర్శనునిభుజంబులును శిరంబును శరత్రయంబునం ద్రుంగించి
రథశక్తిం జేసి పౌరవునిరథంబు తిలమాత్రశకలంబులు గావించి వడివానిచేతులుం దలయుం
దఱిగి చేదియువరాజు రథరథ్యసహితం బుగ మిత్తికస్పర్శనంబు చేసినం గని భీమ
సేనుండు క్రోధమూర్ఛితుండై. 282

చ. శరముల ద్రౌణిఁ గప్పుటయుఁ జయ్యన నాతఁడు వాని నన్నిటిన్
బెరలఁగఁ జేసి వాయుసుతు దీవ్రశరంబుల నొవ్వఁ జేసినం
గర మలుకన్ వృకోదరుఁడు కార్ముక మొక్కటఁ ద్రుంచి నొంచినన్
మరల నొకండు విల్లు గొని మానధనుఁ డతఁ డాగ్రహంబునన్. 283

తే. బాణవర్షము గురిసినఁ బాండుతనయుఁ, డాత్మనామాంకితము లగునాశుగముల

గముల నాతనిఁ గప్పినఁ గలశభవుని,సుతుఁడు నటు కప్పె నాతనిఁ బ్రతిశరముల. 284

మత్త. భీముఁ డంత దశాంబకంబుల బిట్టడంచుఁడు నాశర
స్తోమ మాతనిజత్రుదేశముఁ జొచ్చి వచ్చినదాన నా
భూమిదేవుఁడు కేతుదండముఁ బూని మూసె కనుంగనన్
సోమ సోలి యొకింతలోనన సొక్కు దేఱె రయంబునన్. 285

సీ. ఆకర్ణపూర్ణము లాశీవిషోపము, లగునారసశరములు తిగిచి వైచ
నగ్గించి భీముఁ డయ్యనఘునిమైఁ బెక్కు; నిశితాశుగంబుల నిలిచె నంత
ద్రౌణి భీమునివిల్లు దఱిగి ఆఱు మ్మోపడంగి, బహులసాయకములు పఱపుటయును
భీమసేనుం డొండువి ల్లెత్తి మొత్తె నా, తని సేనుతూపులఁ గనలువొడమ

తే. గురుసుతుఁడు విల్లు మ్రోఁగించి గుణమువంచ, కొఱవిద్రిప్పిన చందానఁ గొమరుమిగుల
మండలీకృతచాపుఁడై మార్గణముల,శతసహస్రము లడరించె సంతతగతి. 286

మ. విలు మ్రోయించుచు వాయునందనుఁడు దోర్వీర్యం బవార్యంబుగా
నలుకం గైకొని యొక్కఁ డొక్కఁడును మూఁడై వ్రాలు నవ్వాలుఁ గో
లల నల్లన్ నభమంద త్రుంచి విలు మేలంబో వ నంచు న్వడిన్
విలసత్కాంచనకంకరం గురిసె విస్ఫోటిత్సురగల్ మేలనన్. 287

శా. ఆలో వాలికతూపులన్ విసరి ద్రోణాచార్యపుత్రుండు పై
వ్రాల న్వచ్చెడువాని నెల్ల నడుమన్ వ్రయ్యంగఁ గావించి యు
గ్గాలిం బుట్టినవానివిల్లు విఱుఁగన్ గా నేసియుం బెక్కులం
భీలాస్త్రంబులవాని తేరు మునుఁగన్ నేసె న్వెస న్వేసరన్. 288

మ. రథశక్తిం గొని భీముఁ డాతనిపయిన్ వ్రాల్పం గడుం గ్రొవ్వుచుం
బృథివీదేవుఁడు దాని లాఘవమునం బిట్టేసి ఖండించినం
గ్రథఁ గుంతీసుతుఁ డొండువిల్లు గొని కోకో మ్మంచు నొక్కుమ్మడిన్
బృథులాస్త్రంబుల గుప్పి రోదసినిఁ గప్పెం గుప్పలై యొప్పఁగన్. 289

తే. ద్రౌణి యొకతూపునన్ భీము దక్షిణాస్థి, నలికమున నాటుటయు మూర్ఛ నందెనతఁడు
ఘోటకము లిచ్చఁ దేరీడ్చుకొనుచుఁ దొలఁగి,పోయినన్ సైన్య మాతయుఁబోయవిఱిగె.

వ. అశ్వత్థామయు నిజవిజయసూచకంబుగా శంఖంబు పూరించి సింహనాదంబు గావించి కాందిశీకు లైన వారి వెంట్ల నంటి తఱుముటయుం గని గాండీవి మత్స్యపాంచాలసైన్యంబులం గూర్చుకొని సింహలాంగూలకేతనుం డాఁకు దెంచి యి ట్లనియె. 291

ఉ. నీదగుశక్తి వీర్యమును నీదగుజ్ఞానము పౌరుషంబునున్
బ్రోదిగ ధార్తరాష్ట్రపయిఁ బుట్టినప్రీతిని మాపయిం బగం

బాదుకొనం బెనంగు మదె పార్షతుఁ డొజ్జల మ్రింగినట్టిఁడీ
నీదుమదం బడంచు నను నీవ యెఱుంగుదు సెప్ప నేటికిన్. 292

అనుఁడు ధృతరాష్ట్రుఁ డిట్లను నట్లొకొప్పా, డగ్గురుఁ డుద్భవుఁ బల్కెఁ డిట్లర్జునుండు నేఁటికి ట్లింటకుఁ గతం బేటియదియొ, యెఱుఁగఁ జేయు మసన్ సూతుఁ డిట్టు లనియె.

ఆకర్ణింపు మట్లు బృహత్క్షత్త్రుండును జేదియువరాజును మాలవసుదర్శనుండునుం గూలుటయు ధృష్టద్యుమ్న సాత్యకి భీమసేనులు పరాజితు లగుటయు యుధిష్ఠిరవాక్యంబులు మర్మంబు భేదించుటయుఁ దవాసడినపాట్లు తలంపునకు వచ్చుటయుం గారణంబులు గా నేనాఁడును రానికోపంబు నాఁడు చూపట్టుటం జేసి యు వారిలో నంతర్భేదంబులు పుట్టుటం జేసి యు సర్జనుండు మాన్యుండును బ్రియుండు నై నగురుపుత్త్రు నట్లప్రియవచనంబు లాడె నట్లాడిన నలుక వొడమ నశ్వత్థాము రథంబునన వార్చి శుచియై సురాసురులకు ననివార్యం బగు నాగ్నేయాస్త్రంబు బరిగొని దృశ్యాదృశ్యాదిగణంబుల నెల్లం దునుమ నభిమంత్రించి ప్రయోగించుటయును. 294

జ్వాలమాలాకులం బై లావుగొనిశర,జాల మంబరమున సంభవించె
నుల్కాసహస్రము లొగి నొల్కెఁ జీఁకట్లు, గ్రమ్మె దిక్కులు గాన రాక యుండ
రక్షఃపిశాచముల్ లక్షింప నై యార్చె, విపరీతవాయువుల్ విసరఁ జొచ్చెఁ
దేజోవిహీనుఁడై దినమణి చూపట్టెఁ, గావు కావున నెందుఁ గాకు లఱచె
నెత్రు వర్షించెఁ బశ్వాదు లార్తిఁ బడియె,భూతతతి భ్రాంత మయ్యెఁ ద్రిభువనములును
సంతపించె నవ్వేటలో సమసె శత్త్రు,సేనలు దవాగ్నిఁ బడి కాలు చెట్టులట్లు. 295

అయ్యాగ్నేయాస్త్రప్రతాపంబున నంతలో నేకాక్షౌహిణీబలంబు క్షీణించినం గాంచి నీవారు హర్షోత్కర్షంబునం బొంది సింహనాదంబులును దూర్యారవంబులును గావించినం గని వేగిరించుచు సవ్యసాచి యేచి. 296

సర్వాస్త్రప్రతిఘాతమున్ సలుపఁ గాఁ జర్చించి మున్ బ్రహ్మచే
నిర్దిష్టంబుగ నై మహోన్నతగతిన్ వెల్గొందు బ్రహ్మాస్త్రమున్
సర్వాంగీణము గాఁగఁ జేసి విసరెన్ దత్త్రప్రభావంబునన్
నిర్వీర్యం బయి వహ్ని చల్లఁబడియెన్ వెల్గొందె లోకంబులున్. 297

ఆబ్రహ్మాస్త్రప్రభావంబున నీసైన్యంబు నొక్కయక్షౌహిణికిం జచ్చె నంత నశ్వత్థామ కృష్ణార్జును లేకీడునుం బొరయమికి మిగుల వగలం బొగులుచు నిట్టూర్పు నిగిడించి డిల్లపోయినయుల్లంబుతో విల్లు నెట్టి యివి యన్నియుం గాల్పనే యని యస్త్రశస్త్రంబులు పాఱవైచి రథంబు డిగ్గ నుఱికి పోవం బోవ ముందఱ. 298

వాసవవాంఛితోన్నతినివాసునిఁ గాలవినీలనీరదా

భాసునిఁ గృష్ణసారకృతవాసుని భాసురభారతీశుభా
వాసుని సర్వలోకనుతభారతభాగవతాదిసంహితా
భ్యాసుని వ్యాసునిన్ శ్రుతిరహస్యవిలాసునిఁ గాంచె ముందఱన్. 299

—అశ్వత్థామకు వ్యాసుఁడు దర్శన మిచ్చి కృష్ణార్జునులమహిమ చెప్పుట—

వ. కాంచి పాదాభివందనం బాచరించి తిన్ననిమెలుంగున ని ట్లనియె. 300

శా. ఏమో మాయ యెఱుంగ రాదు వితథం బయ్యె న్మదీయాగ్నేయ మో
స్వామీ! నాయపచార మేమికలదో వమ్మౌటకుం గారణం
బేమో కృష్ణుఁడు నర్జునుండు దెగ రే రియ్యస్త్రరాజంబునన్
భూమిం ద్రెళ్ళనివార లుండెదరు వేల్పు ల్లేరు నిక్కంబుగన్. 301

ఆ. సర్వఘాతి గాఁగ సంధించి యేసితి, నట్లు సేయఁ జాల కందదు కయి
యది రిపుబలంబు నక్షౌహిణీమాత్ర, నేర్చె శాంతిఁ బొందె నేమి చెపుమ. 302

వ. అనిన వేదవ్యాసుం డంతయుం జెప్పెద నవహితుండ వగు మని యి ట్లనియె. 303

తే. పుట్టె విష్ణుఁడు ధర్మునిపుత్త్రుఁ డగుచుఁ, బ్రోల్లి నారాయణుం డనఁ జెల్లి యూర్ధ్వ
బాహుఁడై వాయుభక్షుఁడై పరమతపము, హిమశిఖరి సర్వదార్వేల నొప్ప సలిపె.

వ. ఊర్ధ్వబాహుండును బవనభక్షుండునై ఘోరతపంబు సేయుచు నిజతపస్తేజంబున
రోదోంతరంబు నిండించి బ్రహ్మభూతుండై యున్నసమయంబున నొక్కనాఁడు. 305

సీ. వజ్రగదాపరశ్వధపినాకాదిద, వ్యాయుధధరుఁడు శూలాంచితుండు
వ్యాఘ్రగజాజినపరిధానపరివృతుం, డురగయజ్ఞోపవీతోచితుండు
సూర్యచంద్రాగ్నిసంశోభితనేత్రుండు, రుండ్రమాలాసమారూఢమూర్తి
విమలభస్త్రోద్ధూళితమనోహరాంగుండు, నుతవాహినీతరంగితకపర్దుఁ

తే. డణువు కన్నను నణువు మహాత్తుకన్న, నతిమహత్తగువాఁడు విశ్వాతిశాయి
విశ్వరూపుఁడు విశ్వేశుఁ డీశ్వరుండు, కరుణ దలఁకొత్త నెదుట సాక్షాత్కరించె. 306

వ. అట్లు సాక్షాత్కరించినపరమేశ్వరుం గాంచి సాష్టాంగదండప్రణామం బాచరించి
నారాయణుండు. 307

సీ. అఖిలభూతములకు నాధారభూతుఁడ, వవ్యయుఁడవు జగదాదిమూర్తి
వగుణుండ వజుండ వాదిదేవుండవు, తిగ్మమన్యుండవు దివ్యమహిమ
జ్యోతిర్మయుండవు భూతసృష్టిస్థితిలయకరుండవు దివ్యలక్షణుఁడవు
మహితాష్టమూర్తిసామర్థ్యసంకలితుండ, వాద్యుండ వాఢ్యుండ వచ్యుతుఁడవు

తే. నీకృపం గాదె ధృతతపోనిష్ఠు లైన, సిద్ధమునులకు నమృతసంసిద్ధి యగుట
నిర్గుణుండవు నిన్నెన్న నేర నెవ్వ, రట్టి నిన్నాశ్రయింతు నే నన్యమతిన్. 308

భువనరక్షకు లగుభూతకృత్తులు సురాసురనాగయక్షరక్షోగణములు
వివిధవిధంబులై వెలసినభూతసంఘములు నీదగుసృష్టి నమరి యుండు
నైంద్రాదికర్మము లన్నియును నధీశుఁడగునీయొనర్చినయవియ తలఁపఁ
బంచభూతంబులు పంచతన్మాత్రలు, బ్రహ్మము కాలము బ్రాహ్మణులును
జంగమస్థావరాత్మకసకలలోకసముదయము నీవలనఁ బుట్టి సలిలమునకు
బెందువులు భిన్నములు గానిచందమునను నీదనిను బొందు ననియెన్నుటదియముక్తి.
♦ సప్తగోపకములును వాక్శాఖములును నగుసుపిప్పలముల నాశయంబు గాంచి
పురముధరియింపఁదగిపదిపొదలుచుండ మానసవిహంగములు రెండు మసలుచుండు.
వానిని నెల్ల సృజించితి, వానికి వెలియైతి నీవ పరమాత్ముఁడవై
మానొందు చుంటి నిన్నుఁగ, మానసమున నెఱుఁగువాఁడు మను బ్రహ్మగతిన్.
నీసన్మానము వడయఁగ, నాసించి భజించుచుంటి నవ్యయ నాకున్
భాసిల్లువరము లొసఁగుము, మోసము లేనట్టిచిత్తమునఁ గనుఁగొనుచున్. 312

వ. అని ప్రస్తుతించిన బ్రసన్నుండై పరమేశ్వరుం డన్నారాయణున కిట్లనియె. 313

సీ. మత్ప్రసాదంబున మనుజు లందును దేవగంధర్వముఖులందు ఘనుఁడ వగుచు
నప్రమేయబలుండ వగుచు వెలుఁగుదు నిన్నెవ్వరుం గెల్వ నేర రన్య
లస్త్రశస్త్రంబుల ననలానిలంబుల నార్ద్రశుష్కములఁ జరాచరముల
నీకు నొవ్వింతయుఁ గాకుండు మత్ప్రసాదమునఁ దన్ మించెదు సమర మైన.
తే. నని వరము లిచ్చె శంకరుఁ డతని కాత్తఁ డిట్లు నడయాడు జగముల నెసక మెసఁగ
నతనితపమున నుదయించె నన్నరుండు, వారు తుల్యపరాక్రము లైరి తొల్లి. 314

వ. ఆనరనారాయణు లిద్దఱును లోకయాత్రావిధానార్థము తమతపోమహిమంబునం
జేసి ప్రతియుగంబునం బుట్టుచుందు రిప్పు డిట్లు కృష్ణార్జునులై పుట్టి రీవును నీతపః
ప్రభావంబునం దేజోమన్యువులం దాల్చి రుద్రాంశసంభూతుండ వైతి వాకర్ణింపుము.

ఉ. భవమయ మీజగం బనుచుఁ బార్థివలింగము సంగ్రహించి, నీ
వవిరళభక్తితత్పరత నర్చన చేసితి తొంటిపుట్టువున్
భవుఁడును సంతసించి యిడెఁ బ్రజ్యవరంబులు నీకుఁ దత్ప్రభా
వవశత జన్మకర్మములు వచ్చెఁ బ్రశస్యములై గుహూద్భవా. 316

క. సకలస్వరూపుఁ డభవుం, డకలకుం డనుచు వార లారసి శివునిన్
బ్రకటముగఁ గొలిచి లింగార్చకులై రద్దాన నధికు లైరి మహాత్మా. 317

---

♦ సప్త=మహదహంకారపంచతన్మాత్రలు: పిప్పలము=అశ్వత్థము అనఁగా సంసారవృక్షము: పురము=శరీరము పదిపొదలు=ఇంద్రియములు; మానసవిహంగములు రెండు=జీవేశ్వరులు;

ప్రతతి నేచుచు నుండు నీమొన భారవాహకుఁడై రణ
క్షితిఁ ద్రిశూలిని వాని మార్కొని చేష్ట లీగనిలాతు లే
క్షితిని గల్గరు కంటఁ జూచినఁ జెల్లు నెల్లజగంబులన్. 327

క. ఏవార లయ్యుమాపతి, భావించి భుజించి భక్తి భరితాత్మకులై
సేవింతు రమ్మహీజను, లీవల నావల సుఖింతు రెంతయుఁ బేర్మిన్. 328

వ. మఱియు శాంతుండు రుద్రుండు శితికంఠుండు కనిష్ఠుండు సువర్చసుండు కపర్ది కరాళుండు హార్యక్షువరదుండు హరికేశుండు శంకరుండు హరినేత్రుండు స్థాణుండు పురుషుండు భాస్కరుండు సుతీర్థుండు దేవప్రతుండు రంహుండు బహురూపుండు శర్వుండు ప్రియుండు ప్రియవాసుం డుష్ణీషుండు సువక్త్రుండు మీఢుషుండు గిరిశుండు సుశాంతుండు చీరవాసుండు హిరణ్యబాహుం డుగ్రుండు స్రువహస్తుండు దేవుండు భార్గవుండు ముంజవాసుండు సహస్రశీర్షుండు సహస్రాక్షుండు సహస్రబాహుండు సహస్రచరణుండు ప్రజాపతి భూతపతి వృషపతి మాతృపతి గణపతి గోపతి యజ్ఞపతి యప్పతి దేవపతి వృక్షపతి పర్జన్యపతి దిక్పతి వనస్పతి పతి నరపతి విశ్వభుక్ వృషావర్తుండు వృషభుండు వృషధ్వజుండు వృషకేతుండు ధనుర్ధరుండు ప్రియధన్వుండు ధన్వి ధన్వంతరుండు ధన్వాచార్యుండు బహుధన్వి సుధన్వి శర్వుండు సర్వలోకేశ్వరుండు నగునమ్మహేశ్వరు నాశ్రయించి సమస్కరింపు మమ్మహాదేవుని దివ్యప్రభావంబు చెప్పెద వినుము. 329

—వ్యాసుఁ డర్జునునకు నీశ్వరప్రభావము చెప్పుట—

సీ. ఆదికాలమునందు నవనీతలమునందు, దక్ష ప్రజాపతి దనరుచుండి
తపము చేయఁ దొడంగి తత్ప్రభావంబునఁ, బెక్కండ్రఁ గన్యలఁ బ్రీతిఁ బడసి
యిందఱ నందఱ కం దందు నర్పించి, లీల సతీదేవి శూలి కొసఁగి
కాలాంతరంబునఁ గడఁకె నాశివునితోఁ, గలని వైరంబు నూఱక కొని.

తే. పడసి నొకతఱి నందఱఁ బిలువనంచి, శివునిఁ బిలువక మఖ మొండు చేయ నెంచి
ఋషుల కెల్ల హవిర్భాగముల నొసంగి, ముజ్జగంబుల కాహ్లాదమును ఘటించె. 330

వ. అట్టిసమయంబున ననాహూతుం డయ్యును శంభుం డమ్మహాధ్వరంబునకుఁ బోవ నెంచియుఁ గించిజ్ఞుం డగునతం డేమి చేసి యేమి చేయునో యని ప్రయాణంబు సంతేసించె సతియును స్త్రీచాపలంబునం జేసి ప్రచోదితయై శంకరోపరోధవాక్యంబులు చెడచెవిం బెట్టి తండ్రి సేయునది గావునన్ జూచునిచ్ఛమైఁ దదుత్తమయాగంబునకుం బయనంబై పిలువని పేరంటంబుగఁ బోయి యుండె నక్కాలంబునం దక్కుడ. 331

ఉ. దక్షుఁడు దీక్షమై క్రతువిధానము పూని యథావిధిన్ జగ

తృప్తముగా నొనర్చి సురవర్యుల కాహుతు లిచ్చి వారు ప్ర
త్యక్షము గాఁగ వచ్చి కొన నల్లురతోఁ దనకన్న వారితో
నతిశయకౌతుకంబున నహర్నిశముల్ నడిపించు నత్తఱిన్. 332

వ. సతీదేవి తండ్రి కిట్లనియె. 333

ఉ. అల్లుర నందఱం బిలిచి యందఱ కిందును వందనీయుఁ
డల్లుని నెల్లలోకములు కాకను నాకనుఁగాని నీశుని
న్నొల్లము గాఁగఁ బిల్వకను దివ్యసవంబును జేయఁ జూచితి
వెల్లసుపర్వులుం గనఁగ నియ్యది నీ కిదు నే యుక్తమై. 334

వ. అని యనేకవిధంబులం బలికి పరిదేవనంబు సేయు మంత దక్షుం డక్షీణమహాకో ర్మిరీక్ష్యాంతుఁడై దాక్షాయణిం బ్రతీక్షించి యిట్లనియె. 335

క. నాకడుపు చెడం బుట్టితి, వే కూఁతురు పెరిభూతమే యైతివి ని
న్నేకూళ యేడ్చె రమ్మని, యీకరణిం గాలులాఁచె దేటికిఁ జెపుమా. 336

వ. నీమగఁ డొక్క మహానుభావుఁ డనుచుంటివి వాకర్ణింపుము. 337

ఆ. కట్ట బట్ట లేదు పొట్టకుఁ దిన లేదు, తోలు దాల్చి విసపుఁదోఁప మొసగు
నుండ నిల్లు లేదు పండ మంచము లేదు, కాటఁ దిఱుగు వల్లకాటఁ బండు. 338

ఆ. బిచ్చ మెత్తువాఁడు వచ్చె నాకల్లుఁ డౌటనుచుఁ జెప్పుకొన్న నగును సిగ్గు
వాఁడు నేఁడు గూడ పిలువ రా నేల, పదుగురును నవ్వఁ బాటదేల. 339

క. నాకడుపునఁ బుట్టినని, న్నాకొయ్యకుఁ గట్టిపెట్టు టారయఁగా మం
త్రాకలితపురోడాశము, మాకొనుకుక్కకును వేయుమాదిరి యయ్యెన్. 340

వ. అని పరిపరివిధంబులం బరిభవించి దూఱుటయు నాక్రాలుఁగంటి చేయునదెద్దియును లేక కంటికిఁ గడవెడునీళ్ళుగా వెక్కి వెక్కి సంబుగ నేడ్చుచుఁ గనులు మూసికొని యోగం బనుసంధించె నంత నామె సర్వాంగంబుల నాశుశుక్షణి యావిర్భవించి తత్క్షణంబ భస్మశాత్కృతంబుగా వించెనపు డాహవిర్ధానంబునఁ బుట్టిన హాహాకారంబులో దసీకుహరంబున నెడ లేక నిండుకొనియె నావృత్తాంతం బంతయు నంతకాంతకుం డంతర్దృష్టి నెఱింగి కుటిలభ్రూకుటియై కటంబు లదరఁ బటపటంబండ్లుఁ గొఱుకుచు నత్యంత భయానకంబుగా నొక్క కేక వైచి జటాజూటంబు నెఱికి వైచె నప్పు డప్పరమపురుషుని లలాటస్వేదోదకంబు నేలం బడిన దానినుండి వీరభద్రుం డతిరౌద్రాకారుండై పొడసూపి తండ్రీం గని నా కేమియానతి యనిన నతండు దక్షాధ్వరధ్వంసంబు గావించిర మ్మిదియ మన్నియోగం బని యానతిచ్చుటయు నతం డాక్షణంబ ప్రమథగణపరివృతుండై దక్షమఘవాటికకుం జని. 341

సీ. అగ్నులలోఁ గూడ నాయతనంబుల, నఱకాళ్ళ మట్టి చల్లార్చి వైచి
యాగభాగము లంద నాగతు లగువేల్పు, మూఁకల నెల్లఁ జీకాకుపఱచి
హరునితో విద్వేష మమరఁ జేసినభగు, నుఱిపెట్టి పట్టి గ్రుద్దూడఁ జెఱికి
శివుని దక్షుఁడు శపించిననాఁడు నగినభాస్కరుపండ్లు డుల్లి పోఁ గాలఁ దన్ని
తే. దక్షువక్షంబుపైఁ దాఁచి తలను వెఱికి, దక్షిణాగ్నిఁ బడ న్వైచి తగులఁ బెట్టి
ప్రళయకాలాగ్నిరుద్రునిఁ గిది వెలిఁగి, యజ్ఞవిధ్వంస మొనరించె నాతఁ డలిగి. 342
వ. ఇట్లు దక్షాధ్వరధ్వంసంబు వీరభద్రునిచేఁ జేయించి దేవర్షిప్రార్థనంబునం జేసి హరుండు మరల దక్షు నొకరీతిం బ్రదికించి మించి యజ్ఞభాగంబులం బొందఁ గలిగె మఱియును.
సీ. త్రిపురాసురులు మున్ను దీండ్రించుటల్ విని, యుంటివే వారు మహోగ్రు లగుచు
నాయసరాజతహైమపురంబులు, మూఁ డాకసంబున నాడఁ జేసి
జగములపైఁ బడి సకలసత్వమ్ముల, సమయించుచుండి రాసమయమందుఁ
గనకపురంబునఁ గమలాక్షుఁడును దార, కాక్షాసురుండు రౌప్యపురమునను
తే. నాయసపురి విద్యున్మాలి యతిశయించి, రాముగుర కోప కింద్రాదు లడలుగుడిచి
బ్రదుకుతెఱు వింతయును లేమి బమ్మఁ జిల్లి, యభవు శరణంబు వేఁడి యి ట్లనిరి బెగడి.
తే. బ్రహ్మదత్తవరంబునఁ బ్రబలు లగుచుఁ, ద్రిపురవాసులు రాక్షసుల్ త్రిజగమునకు
నింత యంత యనన్ రాని యెడరుఁ దోఁపఁ, బీడ యొనరించుచుండి రో భీమమూర్తి.
ఉ. ఈ వొకరుండు దక్క మఱి యెవ్వరు నవ్వరదర్పితాసుర
గ్రావములం బగుల్చుటకుఁ గాని శమల్చుట కేనిఁ గాని కా
రో వృషభాంక లోకముల కోగు ఘటిల్లఁగఁ జేయువారలన్
జేవ మెయిన్ వధించుటకుఁ జిత్తము సేయవె తత్పురమ్మునన్. 446
వ. అనిన నుగ్రుం డట్ల యగుం గాత మని. 347
సీ. గంధమాదనవింధ్యగహ్వరీధ్రమ్ముల, వంశధ్వజములు గా వలనుపఱచి
సాబ్ధివనావనిన్ స్యందనంబుగఁ జేసి, శేషు నక్షంబుగా నేకరించి
చంద్రార్కులను రథచక్రంబులుగ సల్పి, మలయాద్రి యూపమై వెలయ నిల్పి
పుష్పదంతుని నేణపుత్రు నాఁగా లొనర్చి, యవనాహముగఁ దక్షకాహి నుంచి
తే. సలిపి తత్త్వముల్ యోక్త్రాంగములుగ సాల్గు, వేదములు తురంగము లుపవేదములును
గళ్లెములు గాఁ గ్రహించి ప్రగ్రహములుగను, పఱపి గాయత్రి సావిత్రి మఱియు నతఁడు.
సీ. ఓంకారము ప్రతోద మొనరించి పరమేష్ఠి, దక్షిణస్థునిఁ గాఁగఁ దగ సమర్చి
మందరాచలమును మహితగాండీవంబు, గాఁ గొని వాసుకి జ్యాగఁ జేసి
దామోదరుని శరోత్తమముగాఁ గైకొని, శల్యంబుగా నగ్ని సంగ్రహించి

వాయుదేవుని నల్పి వాజంబులుగఁ బుంఖములుగ వైవస్వతుఁ బొందుపఱచి
తే. మెఱుము నిస్వానముగ నల్పి మేరుగిరిని ధ్వజము గాఁ జేసి రథి యయి తాను దేవ
మయరథం బెక్కి త్రిపురసంహారమునకుఁ బ్రస్థితుండయ్యె హరుఁ డెల్లఁ బ్రస్తుతింప. 349
క. స్థాణువు మాహేశ్వరమై, జానొందఁ గఁ జేసి యతఁడు స్థాణువు వలె నై
ద్వానపుల్కు దాఁకి వేయేం, బ్లానికఁ బో రాడె మింట నై వాం త్రుఱుమర్. 350
చ. పురములతోడ నయ్యసురపుంగవులుం గడిదేఱి పోరుచో
హరుఁడు త్రిశూలశస్త్రమున నందఱు నై చెడఁ జేసె దైత్యు లా
శరవరముల్ గనుంగొనఁగఁ జాలక దానిమహాగ్ని కీలలన్
గరఁగి దుమారమై త్రిజగంబులకున్ ముద మయ్యె నయ్యెడన్. 351
చ. త్రిపురముల్ హరించె దేవుఁ డటంచు మృడాని ప్రేమ నొ
గృపఁ గన వచ్చె నక్కడకుఁ గక్కస గా నట మున్న బాలుఁడై
యపు డెదుటన్ దలిర్చుపతి నారసినంతన పంచశీర్షుఁ డి
య్యపటువు వేఁడు చెప్పఁ డని యందఱి వేల్పులఁ జూచునంతటన్. 352
వ. శతమన్యుండు మన్యువశంబునం జూపోక కప్పానపై వజ్రప్రయోగంబు చేయన్
జే యెత్తినంత నంతకాంతకుం డయ్యెత్తినచే యెత్తినట్ల సంస్తంభించు నట్లు సేయు
టయు నతండు సేయునది లేక దేవగణపరివృతుండై బ్రహ్మలోకంబునకుం జని తద్వృ
త్తాంతం బంతయు నెఱింగించిన హిరణ్యగర్భుం డంతరంగంబునం జింతించి చింతించి
యింద్రాదిబృందారకబృందంబులం గాంచి యయ్యర్భకుండు భగవానుం డగు
భవుండు భవానీప్రీణనార్థం బట్లు లీలావహనంబు సంగ్రహించె మీ రెఱుంగ రైతి రని
వారిం గూడి యట వచ్చి వామదేవుం గాంచి నమస్కరించి యిట్లని ప్రార్థించె. 353
సీ. భువనంబులును నీవ భువనాధిపతి వీవ, భగవంతుఁడవు నీవ భవుఁడ వీవ
యజ్ఞకర్తవు నీవ యజ్ఞభోక్తవు నీవ, యజ్ఞేశుఁడవు నీవ యజ్ఞ మీవ
పరమపదము నీవ పరమాత్ముఁడవు నీవ, పరమేశుఁడవు నీవ పరమ మీవ
యింద్రుండు నీవ యుపేంద్రుండును నీవ, చంద్రుండు నీవ దినేంద్రుఁ డీవ
తే. వ్యాప్తి మయ్యె నిటెల్ల నీవలన నీవ, సర్వమును నిన్ను గనుంగొంటి సదమలాత్మ
క్రోధ ముపసంహరించి యింద్రునిఁ గటాక్షవీక్షణంబునఁ బ్రోవవే విశ్వనాథ. 354
వ. అని ప్రస్తుతించినం బ్రసాదాభిముఖుండై యట్టహాసంబుఁ గావించె నంత దేవేం
ద్రాదులును బార్వతీపరమేశ్వరులఁ బ్రసన్నులం జేసికొని యింద్రుని బాహుస్తంభ
నంబు దొలంగి యప్పటియట్ల యొప్పె మీ తెఱఁ గమ్మహాపురుషుండె పురుషోత్తముండు

రుద్రుండు మహాదేవుం డహోరాత్రంబులు మాసర్తుపక్షంబులు లోనినానావిధమూర్తు
లంబొంది యయ్యష్టమూర్తి నానావిధనామధేయంబులం గీర్తనీయుం డగు నప్పరమేశ్వ
రునిం బ్రస్తుతింప వర్షశతం బైనం జాల డతండు ప్రీతుం డగునేని సర్వైశ్వర్యంబులును
సమకూరు నని మఱియుం దదీయనామనిర్వచనంబు చేసి యనంతరు ద్రం బైనశతరు
ద్రీయం బుపదేశించి నీ వమ్మహాదేవు నారాధింపుము నీకు నాయురారోగ్యైశ్వర్యం
బులు నిత్యంబు నతండు ప్రసాదించు నని మఱియు. 355

మ. విను మోపార్థ పరాత్పరుం డతఁడె నీకెన్నన్ బ్రసాదించి శ
త్రునికాయంబును గూలఁ జేసిడిని సింధుక్ష్మావిభుం జంపఁ బూ
నినరేయిన్ హరి నీకు స్వప్నమునఁ గాన్పించెన్ మహాదేవుఁ డ
య్యనఘుం డిచ్చినయస్త్రశస్త్రములఁ గాదా గెల్చితే కన్గొనన్. 356

కవిరాజవిరాజితము.

ఇది శతరుద్రము నే నెఱిఁగించితి నిప్పుడు చొప్పడ నీవు శుభా
స్పద మతి పుణ్యము పాపహరంబును బావననామము భవ్యము నీ
యది పఠియించిన నర్థితకార్యము లన్నియుఁ దీరు నహర్నిశమున్
ముద మెద హెచ్చెడు ముచ్చట వచ్చెడు ముర్వ్వ దలిర్చెడు మువ్వురునన్. 357

పంచచామరము:—మనంబునందు దీని నిల్పిమాన కీవు కొల్వు మీ
యనిం జయంబు నొందఁ గాంచి యవ్వలన్ మహోన్నతం
బనంత మైనరుద్రలోక మందఁ గల్గు నీయనిన్
జనార్దనుండు మంత్రి నీ కసాధ్య మొక్కఁ డుండునే. 358

క. అని బోధించి పరాశర,తనయుఁడు తనదారిఁ జనియెఁ దాపత్యుండున్
మునివచనంబున నీశ్వరు, మనమునఁ గొనియాడె భక్తిమహితుం డగుచున్. 359

శా. ఈపర్వంబు పఠించిరేని వినిరే నిష్టార్థసంసిద్ధ మై
పాపంబుల్ నశియించి పుణ్య మొసఁగున్ బ్రహ్మాసము౦ గల్గెడిన్
భూపాలుం డగునే జయం బవనిదేవుం డేని యజ్ఞార్థమున్
బైపాటం గలవారు కోరికల నొందం గాంతు రెల్లప్పుడున్. 360

క. అని సంజయుండు ధృతరాష్ట్ర, నరేంద్రున కొనరిచ్చె సర్వం బనుచున్
జనమేజయునకు మున్నా, మునిముఖ్యుఁడు ద్రోణపర్వమును వచియించెన్. 361

వ. అని చెప్పిన నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు చెప్పు మని సూతునడుగు
టయును. 362

## ఆశ్వాసాంతము.

మ. సభలన్ మెచ్చెడునట్లు వ్రాయఁగ మదిన్ సంకల్పముం జేసి నేఁ
బ్రభవం బేర్పడ కొంత వ్రాసి యవలన్ వ్రాయంగ నున్నప్పు డ
య్యభిమన్యుం డనిఁ జెల్లె నర్జునునకుం బ్రాపించిన ట్లార్తి నా
కు భరింపన్ బరువైన దాన నిటు నీకున్ సేవ గావించితిన్. 363

క. సత్యవ్రతుఁ డగుద్రోణుఁ డ,సత్యపుసుతమరణ మరసి చాలించె నొడల్
సత్యసుతమరణ మారసి, నిత్యుఁడ నై యుంటి నిట్లు నిఖిలాండపతీ. 364

మాలిని. అకలుషలసదర్ఘ్యారాధ్యతా! సర్వాతిదర్శీ!
సకలభువనదర్శీ సక్తసువ్యక్తదీక్షా!
ప్రకటితఖలశిక్షా! భక్తలోకైకపక్షా!
సుకవిగతకటాక్షా! సూర్యసోమాగ్నినేత్రా! 365

## గద్యము.

ఇది శ్రీమదఘునాతనోభయకవిమిత్ర వేంకటయజ్వపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతంబయిన శ్రీకృష్ణభారతంబునందు
ద్రోణపర్వంబున సర్వంబును
షష్ఠాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.



# విన్నపము.

ఈసంపుటము సుమారు రెండుసంవత్సరములక్రిందటనే ముద్రించుటకుఁ బ్రారంభించితిని. అనేకాంతరాయములవలన గ్రంథ మింతకాలమువఱకుఁ బూర్తిగ ముద్రించుట తటస్థించినది కాదు. ఇప్పటి కింతవఱకుఁ ముద్రింపఁ బడిన దని తెలుపుటకు సంతసించుచున్నాను.

ఈముద్రణమం దనేకలోపము లున్నవి. ఇందుఁ గొన్నిఫారములు రాజమహేంద్రవరమునందలి రాజన్ముద్రాక్షరశాలయందును, కొన్నిఫారములు సరస్వతీముద్రాక్షరశాలయందును, కొన్నిఫారములు లలితాముద్రాక్షరశాలయందును, ముద్రితము లైనవి. ఈఫారములు ముద్రించునప్పుడు నేనుసర్వవిధములచేత స్థిమితత లేనివాఁడనై సర్వదా పరదేశసంచారము చేయుచున్నవాఁడ నగుటచేతఁ గొన్నిచోటుల నావ్రాఁతప్రతిలో నున్నట్లు పడక హెచ్చుతగ్గులు పడినవి. వాని కన్నిటికిని శుద్ధపత్రము వ్రాసి ప్రకటింప నెంచితిని గాని తత్కార్యమునకుఁగూడ నాకిప్పుడు వ్యవకాశము చిక్కినది కాదు. ఇది ప్రకటించుట కవసరము వచ్చినది కావున నిట్లు శుద్ధపత్రము వ్రాయకయే ప్రకటించితిని. కొలఁదిదినములలోన శుద్ధపత్రము, టీకాసంగ్రహమును జేర్చి ముద్రించి యిప్పుడు నాగ్రంథము స్వీకరించినవారి కందఱకును బంపుకొనుచున్నాను. ఈభాగము చాల వ్యగ్రతతో రచించితిని గావున నింక నాలోపములును బెక్కు లుండవచ్చును. అట్టిలోపములున్నచో నా కెఱింగించి విద్వాంసులు నావందనములకుఁ బాత్రు లగుదురు గాక యని విన్నవించుచున్నాను.

శ్రీ॥ కృ॥ శాస్త్రి॥